First Edition : 1999

Copies 2000

Price . Rs. 201/-



*Copies available at :*

**Dr.M. Rama Krishna**
R C.M. High School
Pedaboddepali
Narsipatnam
Visakhapatnam Dstrict - 531 116



"This Book is published with the Financial Assistance of Tirumala Tirupati Devasthanams under their Scheme Aid to publish Religious books" (ROC. No. Edit. 5/3798/96. 14-8-97)

And



with the Financk i Assistance of Telugu University

***Printed at :***
**SPAA Offset Colour Prints**
Station Road, Dondaparthy
Visakhapatnam - 530 016
Phone : 547600



# అంకితం



తెలుగు వారి కీర్తిని విశ్వవ్యాప్తంగావించిన మరపురాని

మహోన్నతమహామనీషి

**కీ.శే. డా. నందమూరి తారక రామారావు గార్కి**



# కృతజ్ఞతాభివందనాలు

నాకు జన్మనిచ్చిన తల్లిదండ్రులకు, పెంచిన తల్లిదండ్రులకు, నాకు ఈ పరిశోధనా విషయాన్ని సూచించి, ఆప్యాయతతో ప్రోత్సహించి అది ఒక ఉత్తమ పరిశోధనా నిబంధనముగా రూపు దిద్దుకొనుటకు ఎంతో సహకరించుటయే కాక, అనుంగు శిష్య వాత్సల్యంతో అక్షర కుసుమాలు కూర్చి **''పూలంగరగ''**ను నా ఈ గ్రంథంలో రమ్యంగా చిత్రించిన **ఆచార్య (శ్రీమతి) కె. మలయ వాసిని** M.A. Ph.D., గార్కి, పరిశోధనా విషయమై సంభాషించుటకు అంగీకరించి తమ అమూల్యమయిన సలహాలనిచ్చిన స్వర్గీయ **యస్వీ. జోగారావు గార్కి**, నా పరిశోధనా విషయమై తమ అమూల్యమైన సలహాలనిచ్చిన **శ్రీ ఆంధ్ర శేషగిరి రావుగార్కి**, నా పరిశోధనకు ఉపకరించిన **డా. ద్వా. నా. శాస్త్రిగార్కి**, విషయ సేకరణలో ముఖ్యంగా ఛాయా చిత్రాల సేకరణలో నాకు సహాయ పడిన **డా. కోటి సూర్యనారాయణ మూర్తి గార్కి**, విషయ సేకరణ నిమిత్తం ఆయా ప్రాంతాలకు వెళ్ళినపుడు నన్ను ఆదరించి, భోజన వసతి సదుపాయాలు కల్పించిన బంధు మిత్రులకు, ఛాయాచిత్రాల సేకరణకు తన కెమేరానిచ్చి సహాయపడిన మిత్రుడు **కె. సత్యన్నారాయణ**కు, తన టేపు రికార్డరునిచ్చి నాకు సహాయపడిన మిత్రుడు **కె. సూర్యారావు**కు, విషయసేకరణకు జిల్లాలో పర్యటించినపుడు తమ పూర్తి సహకారాన్నందించిన ఆ యా గ్రామ పెద్దలకు, గ్రామ దేవతల పూజారులకు, గ్రామదేవతల కథల నివేదకులకు-

అడిగిన వెంటనే ఆప్యాయతతో ''అభినందన'' వ్రాసి పంపించిన గురుతుల్యులు, భారతదేశ అత్యున్నత సాహితీ పురస్కారం **''జ్ఞానపీఠ్''** అవార్డు గ్రహీత, రాష్ట్ర సాంస్కృతిక మండలి అధ్యక్షులు, రాజ్య సభ సభ్యులు **ఆచార్య సి. నారాయణ రెడ్డి** M.A., Ph.D., D.Litt., గార్కి, ఉపాధ్యక్షురాలుగా ఊపిరిసలపని కర్తవ్య నిర్వహణలో తలమునకలుగా నుంటూ, అడిగిన వెంటనే ఆప్యాయతతో **'ఆశీర్వాద పూర్వక అభినందనలు'** వ్రాసి పంపిన రచయిత్రి, కవయిత్రి, భాషా సాహిత్య, శిష్ట జానపద సాహిత్య విదుషీమణి **ఆచార్య (శ్రీమతి) నాయని కృష్ణ కుమారి** M.A., Ph.D., గార్కి, నా గ్రంథం చదివి అడగకుండానే ఎంతో అభిమానంతో 'ఆశీర్వాద పూర్వక అభినందనలు' వ్రాసి పంపించిన గురుతుల్యురాలు, విశాఖపట్నం పద్య కవితా సదస్సు సభ్యురాలు, రిటైర్డు గ్రేడు I హిందీ పండిట్ **శ్రీమతి దాగంటి గౌరీదేవిగార్కి**.

పరిశోధనా కాలంలో సహాయ సహకారాలందించిన ఆంధ్రవిశ్వకళా పరిషత్తు గ్రంథాలయాధికారులకు, ఉపకారవేతనాన్నందించిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంఘిక సంక్షేమ శాఖవార్కి, గ్రంథ ప్రచురణకు ఆర్థిక సహాయం అందించిన తిరుమల తిరుపతి దేవస్థానం, తెలుగు విశ్వవిద్యాలయం, చమురు సహజ వాయువుల సంస్థ, కాస్మోపోలిటన్ క్లబ్బు, టౌన్ హాలు, ఆఫీసర్ల క్లబ్బు, రోటరీ క్లబ్బు (రాజమండ్రి), రోటరీ క్లబ్బులు (కాకినాడ) నాసా ప్రేమదాస (తుని) మొ. వారందరికి;

నా యీ గ్రంథాన్ని ఆవిష్కరించటానికి అడిగినవెంటనే సహృదయంతో అంగీకరించిన ఆంధ్రప్రదేశ్

శాసన సభాపతి **గౌరవనీయులు శ్రీ యనమల రామకృష్ణుడు** M.A.B.L., గార్కి, సర్వకాల సర్వావస్థలయందు నాకు అత్యంత శ్రేయోభిలాషులు **గౌరవనీయులు శ్రీ వరుపుల సుబ్బారావు** తూ.గో. డి.సి.సి.బి. ఛైర్మన్ గార్కి, తూ.గో. జగ్గం పేట శాసన సభ్యులు, **గౌరవనీయులు శ్రీ. జ్యోతుల నెహ్రూగార్కి**, నా సిద్ధాంత గ్రంథాన్ని చూసిన వెంటనే ఎంతో ఆప్యాయతతో తమ పూర్తి సహాయ సహకారాలందించుటయే కాక, ఎప్పటికీ తమ ఆశీస్సులు నాపై ప్రసరింపచేసే, మాజీ మంత్రివర్యులు, అనకాపల్లి శాసనసభ్యులు **గౌరవనీయులు శ్రీ దాడి వీరభద్రరావు** యం.కాం, సాహిత్య రత్నగార్కి, నర్సీపట్నం నియోజక వర్గ ప్రజలకు తలలో నాలుక వలె మెలగుచూ వారిని తమ కనుపాపల వలె కాపాడు కొనే మాజీ మంత్రివర్యులు, పార్లమెంటు మాజీ సభ్యులు, శాసనసభ మాజీ సభ్యులు **గౌరవనీయులు శ్రీ చింతకాయల అయ్యన్న పాత్రుడు** గార్కి, సాత్త్విక స్వభావులు, నర్సీపట్నం శాసన సభ్యులు **గౌరవనీయులు శ్రీ వేచలపు శ్రీరామ మూర్తిగార్కి**, అపరిచితునిగా దర్శించిన వెంటనే ఎంతో ఆప్యాయతతో పలుకరించి గతమూడు సంవత్సరాలుగా నా అభివృద్ధికి తమ పూర్తి సహాయ సహకారాలందిస్తున్న సోదరులు, గౌరవనీయులు **శ్రీ దాడి సత్యన్నారాయణ** డిప్యూటీ మేయర్ (విశాఖమున్సిపల్ కార్పరేషన్) గార్కి, పితృతుల్యులు, శ్రేయోభిలాషులు **గౌరవనీయులు శ్రీ మొల్లేటి సూర్యనారాయణ**, R.B.I. ఆఫీసరు, హైదరాబాదు వార్కి,

''అర్ధాంగి'' అనే మాటకు అత్యంత అర్ధవంతంగా ప్రవర్తిల్లే నా అర్ధాంగి **శ్రీమతి విజయ రాణి కి**, నా అత్తమామలు **శ్రీమతి లక్ష్మి, శ్రీ అప్పారావు** లకు, నా చిన్నత్త చిన్నమామలు **శ్రీమతి అమ్మాజీ, శ్రీ సూర్యనారాయణ**లకు, నా యీ గ్రంథాన్ని సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దిన''**స్వా**'' **త్రి మూర్తులు కుమార్, ప్రసాద్, శివరామ ప్రసాదు**లకు,

ఇంకనూ నా యీ పరిశోధనకు, ప్రచురణకు ప్రత్యక్షంగా, పరోక్షంగా తమ సంపూర్ణ సహాయ సహకారాలందించిన ప్రతి ఒక్కరికీ –

నా హృదయ పూర్వక కృజ్ఞతాభివందనాలు.

# ముందు మాట

గ్రామవాసిగా గ్రామాల్లో జరిగే గ్రామదేవతల ఉత్సవాలను ప్రత్యక్షంగా చూసినందున, గ్రామదేవతల గురించి పరిశోధన చేస్తే కొత్త విషయాలు తెలుస్తాయనే ఉద్దేశం నాకు కలగడం, నా పర్యవేక్షకులు ఆచార్య మలయవాసిని గారు కూడ ఈ పరిశోధనావిషయాన్ని సూచించి, ప్రోత్సహించడం నా ఈ పరిశోధనకు ప్రేరణ. నేను తూర్పుగోదావరి జిల్లా నివాసిని కావడంవల్ల, జిల్లాలోని ఆయా తాలూకాలలోను, మండలాలలోను నా బంధుమిత్రులుండడంవల్ల నా పరిశోధనను ఈ జిల్లాకు పరిమితం చేసుకున్నాను. జిల్లాలోని ఆయా గ్రామాలకు విషయసేకరణకు వెళ్లినపుడు కొన్నిచోట్ల ఆయా గ్రామీణులు ఆదరాభిమానాలు చూపించి, సహకరించినప్పటికీ కొన్ని చోట్ల చాలా ఇబ్బందులు ఎదురయ్యాయి. వెళ్లినచోటకే మళ్ళీ మళ్లీ వెళితేతప్ప విషయసేకరణ జరగలేదు. పర్యటించిన గ్రామాలలో విషయం లభించిన గ్రామాలకంటె, లభించని గ్రామాలే ఎక్కువ. నేను తూర్పుగోదావరి జిల్లాలో మెట్టప్రాంతానికి (ప్రత్తిపాడు తాలూకాకు) చెందినవాడి నవ్వటంవల్ల, పిఠాపురం మా అమ్మమ్మగారి ఊరవ్వటం వల్ల ఈ రెండు తాలూకాలు, వీటి సరిహద్దు తాలూకాల గ్రామాలలో ఎక్కువగా పర్యటించాను. డెల్టా ప్రాంతంలో ముఖ్యంగా కోనసీమ ప్రాంతంలో తక్కువగా పర్యటించి విషయసేకరణ కావించాను.

విషయసేకరణ ఎక్కువగా వచనరూపంలో ఆయా నివేదకులు చెప్పుచుండగా వ్రాసుకున్నదే. పంబల వారు, మత్స్యకారులు నుంచి గేయాల సేకరణకు టేపు రికార్డరు ఉపయోగించాను. పంబల వారి వద్ద వచనరూపంలో ఉన్న కథలను కూడ రికార్డు చేశాను. కొన్ని వారు నోటితో చెప్పుచుండగా వ్రాసుకున్నాను. మత్స్యకారుల కథలన్నీ ముక్కలుగా ఉంటాయి. ముక్కడ మంటేనే కథ చెప్పడం. అరకమైన ముక్కలను రికార్డు చేశాను. కాని వాటిని పేపరు మీద వ్రాయటానికి వీలుగా లేకపోవడంతో మళ్లీ వాళ్ల దగ్గర కెళ్లి నోటితో చెప్పించుకొని వ్రాసుకున్నాను. ఈ కథల సేకరణకు పలుమార్లు వెళితేతప్ప రాబట్టడం కష్టమయ్యేది. కథలో కొంతభాగం చెప్పి, మిగతా భాగం కోసం తరువాత రమ్మనేవారు. మరునటిరోజు వెళితే కథకుడు ఉండేవాడు కాదు. మళ్లీ వెళ్లేవాడిని. ఈవిధంగా పలుమార్లు వెళితేతప్ప ఒక కథ పూర్తయ్యేది కాదు. ముఖ్యంగా మత్స్యకారులు, పంబల వారి కథలను సేకరించటానికి వారి వారి గ్రామాలు అనేకమార్లు వెళ్లవలసివచ్చేది. డెల్టా ప్రాంతంలో ఉన్న పంబల వారి దగ్గరకు పదిసార్లు వెళితే పది పేజీల విషయం లభించింది. కాని కొన్నిచోట్ల వ్యయప్రయాసలు పెద్దగా లేకుండనే విషయసేకరణ జరిగింది.

నివేదకులు నివేదించిన సమాచారంతోపాటు, నేను దైనందిన జీవితంలో వార్తాపత్రికలు చదివే అలవాటున్నందున ఆయా సందర్భంలో కన్పించిన గ్రామదేవతా సంబంధి సమాచారాన్ని కూడ పత్రికల నుంచి సేకరించాను. గ్రామదేవతలకు సంబంధించి ఎక్కువగా సిద్ధాంతవ్యాసాలు వెలువడలేదు. వాయని కృష్ణకుమారి గారు, రావి ప్రేమలత గార్ల ముద్రిత గ్రంథాలతోపాటు పశ్చిమగోదావరి. తణుకు తాలూకా, కృష్ణాజిల్లా, నల్గొండ జిల్లాల గ్రామదేవతలపై వెలువడిన లఘుసిద్ధాంత వ్యాసాలు కూడాచూశాను.

తూర్పుగోదావరి జిల్లాలో వివిధ గ్రామాలు పర్యటించి, గ్రామదేవతలకు సంబంధించి నేను సేకరించిన విషయాన్ని మొత్తం పదమూడు భాగాలుగా విభజించి సిద్ధాంతవ్యాస రచనకు

ఉపక్రమించాను. నా పరిశోధనాంశం గ్రామీణులకు సంబంధించిన దగుటచే నా సిద్ధాంతవ్యాసాన్ని వ్యావహారిక భాషలోనే నిర్వహించాను. విషయసేకరణలో ఏబదికి పైగా ఛాయాచిత్రాలు కూడ సేకరించాను. వాటిని నా సిద్ధాంతవ్యాసంలో ఆయా ప్రకరణాలలో, ఆయా సందర్భాలలో పొందుపరచాను. నా సిద్ధాంతవ్యాసాన్ని పదమూడు భాగాలుగా విభజించాను.

ప్రథమ ప్రకరణంలో తూర్పుగోదావరి జిల్లాను సమగ్రంగా పరిచయం చేయుటానికి ప్రయత్నించాను. జిల్లా పటాలు తాలూకాలవారీగా, మండలాలవారీగా ఇచ్చాను. జిల్లా చరిత్ర, భౌగోలిక స్వరూపం, సహజవనరులు, శీతోష్ణస్థితి, వ్యావసాయికంగా, పారిశ్రామికంగా, సాంస్కృతికంగా, రాజకీయంగా, విద్యావిషయికంగా రాష్ట్రంలో జిల్లా యొక్క స్థానం, మొదలైనవన్నీ వివరించాను.

ద్వితీయ ప్రకరణంలో గ్రామదేవతలను పరిచయం చేశాను. గ్రామ దేవతల ఆవిర్భావానికి మూలమైన మాతృస్వామిక వ్యవస్థ, గణ వ్యవస్థ, స్త్రీ వ్యవసాయ ఆరంభకురాలగుట, స్త్రీ సఫలతకు మూలమను భావం ప్రబలి ద్రావిడులలో మాతృదేవతారాధన ప్రారంభమై, గ్రామవ్యవస్థ ఏర్పడ్డాక మాతృదేవత గ్రామదేవత అయినవైనాన్ని వివరించాను. గ్రామదేవత లక్షణాలను, శిష్టదేవతల కంటె వీరి భిన్నత్వాన్ని కూడ వివరించాను.

తృతీయ ప్రకరణంలో తూర్పుగోదావరి జిల్లాలో గ్రామదేవతలను పరిశీలించిన పిమ్మట నాకు గ్రామదేవతలపై కలిగిన అవగాహనను దృష్టియందుంచుకొని, ఈ జిల్లా గ్రామదేవతల స్వరూప స్వభావాలను, రూపవైవిధ్యాన్ని, గుడులను, గ్రామదేవతకు సోదరుడుగా భావింపబడే పోతురాజును గూర్చి వివరించాను.

చతుర్థ ప్రకరణంలో జిల్లాలోని వివిధ గ్రామదేవతల నామ పరిశీలనం కావించి, నామవైవిధ్యాన్ని నిరూపించుటానికి ప్రయత్నం చేశాను. నామవైవిధ్యరీత్యా పదిరకాలుగా గ్రామదేవతల పేర్లను విభజించి సోపపత్తికంగా వివరించాను.

పంచమ ప్రకరణంలో ఈ జిల్లా ప్రజలు గ్రామదేవతలను ఆరాధించే విధానాలను వర్గీకరించి, జాతరలు జరిగే తీరు, జాతరలలో ప్రజల నమ్మకాలు, మొక్కులు, ఆచారాలు, మొదలైనవన్నీ ఛాయాచిత్రాలతో సహా వివరించాను.

షష్ఠమ ప్రకరణంలో జిల్లాలోని ఆయా గ్రామాలలో పూజింపబడుతున్న గ్రామదేవతలకు సంబంధించి నేను సేకరించిన వివిధ కథలను వర్గీకరించి వివరించాను. వాటిలో దేవతల పుట్టుకకు సంబంధించినవి, వలస రావడానికి సంబంధించినవి, మహిమలకు సంబంధించినవి, సాధారణంగా అందరి దేవతలకు వర్తించేవి అని నాల్గువిభాగాలు చేసి, ఆయా కథలను విశ్లేషించాను.

సప్తమ ప్రకరణంలో పేరంటాళ్ల స్వరూపస్వభావాలను, తూర్పుగోదావరి జిల్లాలో లభించిన పేరంటాళ్ల కథలను ఛాయాచిత్రాలతో సహా వివరించాను.

అష్టమ ప్రకరణంలో గ్రామదేవతల కథలు పాడుతూ, సత్తెమ్మ సంబరాలు చేస్తూ తమ జీవనోపాధిని కొనసాగిస్తున్న పంబల వారి గురించి; వారు చేయించే సత్తెమ్మ సంబరాల గురించి; వారు పాడే వివిధ గేయాలు, చెప్పే కథల గురించి, ఛాయాచిత్రాలతో సహా వివరించాను. ఈ

జిల్లాలోని మెట్ట, డెల్టా ప్రాంతాలలో ఉండే వంబలవారు చేయించే సత్తెమ్మ సంబరాలను విడివిడిగా క్షుణ్ణంగా విమర్శనాత్మకంగా వివరించటానికి ప్రయత్నించాను.

నవమ ప్రకరణంలో జిల్లాలోని తీరప్రాంత గ్రామాలలో నివసిస్తున్న మత్స్యకారులు - వారి ఆచారాలు - నమ్మకాలు, దేవతలు - ఆరాధనావిధానం; వారి గ్రామదేవతల కథలు, మొదలైనవన్నీ క్షుణ్ణంగా వివరించుటయేగాక రెండు ఛాయా చిత్రాలు కూడ పొందుపరచాను.

దశమ ప్రకరణంలో నేను సేకరించిన గ్రామదేవతల సంబంధి సాహిత్యంలో కన్పించిన భాషావిశేషాలను వివరించాను. జానపదుల భాష, వారి భాషలో ఉండే నుడులు, మాండలిక పదాలు, అన్యదేశ్యాలు, వార్తానువర్తనాలు, సామెతలు, సహజసౌందర్యాలు, ద్వంద్వపదాలు, అనుప్రాస ప్రయోగాలు, నూతన పదప్రయోగాలు, జానపదుల వాడుకలోనున్న పదజాలం, వాటి ప్రత్యేకార్థాలు, మొదలైనవన్నీ క్షుణ్ణంగా వివరించటానికి ప్రయత్నించాను.

ఏకాదశ ప్రకరణంలో గ్రామదేవతలకు సంబంధించి భిన్న సంస్కృతీ సమ్మేళనాన్ని వివరించాను. గ్రామదేవతల పేర్లు, విగ్రహాలు, ఆరాధనలలో ఇట్టి సంస్కృతిసమ్మేళనపు తీరును వివరించాను. గ్రామదేవతలకు సంబంధించి ఆర్య ద్రావిడ సంస్కృతుల పరస్పర ప్రభావాన్ని కూడ వివరించాను.

ద్వాదశ ప్రకరణంలో గ్రామదేవతలను అధ్యయనం చేయవలసిన ఆవశ్యకతను వివరించాను. ప్రాచీన మతవ్యవస్థను, ప్రాచీన మానవుల ఆలోచనా విధానాన్ని తెలుసుకోవటానికి నృశాస్త్ర, సామాజిక శాస్త్రవిషయాల పరిశీలనకు, వ్యక్తి, గ్రామ, గృహనామ పరిశీలనకు గ్రామదేవతల అధ్యయనం ఉపకరిస్తుందని ఉదహరణపూర్వకంగా వివరించాను.

త్రయోదశ ప్రకరణంలో నేను సేకరించిన గ్రామదేవతల కథల అధ్యయనం వల్ల ఆ గ్రామీణులలో కనిపించే వివిధ నమ్మకాలు, ఆచారాలు, ఆరోపణలు, మొదలైనవన్నీ ఆయా కథాసందార్భాలను పేర్కొంటూ వివరించాను. ఈవిధంగా గ్రామదేవతల అధ్యయనంవల్ల మనకు కలిగే జ్ఞానసంపద అమోఘమైనదని నిరూపించటానికి ప్రయత్నించాను.

పై పదమూడు ప్రకరణాలతోపాటు రెండు అనుబంధాలకు కూడ నా సిద్ధాంత వ్యాసంలో స్థానం కల్పించాను. మొదటి అనుబంధంలో విషయసేకరణలో నాకు లభించిన, వివిధ గేయాలను, పూజా, వర్ణన, కథాగేయాలుగా విభజించి పొందుపరచాను. వీటితోపాటు ఈ జిల్లాలోని గ్రామదేవతలపై రచింపబడ్డ శతకం, దండకాలు, బుర్రకథపాట, సినీగీతాలబాణిలో ఉన్న పాట, మొదలైనవి కూడ పొందుపరచాను.

రెండవ అనుబంధంలో గ్రామ గ్రామానికి ఉండే గ్రామదేవతల పేర్లను, వారు పూజింపబడుతున్న గ్రామాలతో సహా పేర్కొన్నాను. వీటితోపాటు నా సిద్ధాంత వ్యాస రచనకు ఉపకరించిన వివిధ గ్రంథాలు, వ్యక్తుల పేర్లతో ఉపయుక్తగ్రంథ, వ్యక్తి సూచికలను కూడ పొందుపరచాను.

ఈవిధంగా పదమూడు ప్రకరణాలతో, రెండు అనుబంధాలతో, ఉపయుక్త గ్రంథ, వ్యక్తి సూచికలతో నా పరిశోధనావ్యాసాన్ని రచించి ముగించాను.

**ANDHRA SARASWATHA PARISHATH**

TILAK ROAD, HYDERABAD - 500 001

**ఆంధ్ర సారస్వత పరిషత్తు**

తిలక్‌రోడ్, హైదరాబాదు – 500 001

*President :*
Jnanapeeth Awardee, Padma Bhushan
**Prof. C. Narayana Reddy**
M.A. Ph.D. D.Litt.
President, State Cultural Counsil
Member of Parliament (Rajya Sabha)

అధ్యక్షులు :
జ్ఞానపీఠ పురస్కార గ్రహీత, పద్మభూషణ్
**ఆచార్య సి. నారాయణరెడ్డి**
ఎం.ఏ., పిహెచ్.డి., డి.లిట్.
రాష్ట్రసాంస్కృతిక మండలి అధ్యక్షులు,
రాజ్యసభ సభ్యులు

**తేది : 16-9-97**

## అభినందన

ఈ మధ్యకాలంలో జానపద వాఙ్మయానికి సంబంధించిన వివిధ పార్శ్వాలపైన విస్తృత పరిశోధనలు జరుగుతున్నాయి. మన విశ్వవిద్యాలయ తెలుగు శాఖలు చేస్తున్న దోహదం గమనించ దగింది.

"**తూర్పుగోదావరి జిల్లా - గ్రామదేవతలు**" అనే అంశంపై డా. యం. రామకృష్ణ అత్యంత మౌలిక పరిశోధన జరిపాడు. ఆ పరిశోధన ఫలితాంశమే ఈ గ్రంథం.

గ్రామదేవతలకు సంబంధించిన ఎన్నెన్నో వివరాలను సేకరించి, వాటి స్వరూపాన్ని విశ్లేషించి పరమపదనీయశైలిలో ఈ గ్రంథాన్ని రూపొందించాడు డా. రామకృష్ణ. వ్యక్తులద్వారా జానపద గీతాల ద్వారా సేకరించిన సమాచారాన్ని ప్రణాళిక బద్ధంగా ఈ గ్రంథరూపంలో పొందుపరచిన డా. రామకృష్ణ కృషికి నా అభినందనలు.

**(డా. సి. నారాయణరెడ్డి)**

పొట్టి శ్రీరాములు
తెలుగు విశ్వవిద్యాలయం
TELUGU UNIVERSITY

Off. 040-234815
040-236911
Res 040-3747133
Fax 040-236045

Prof : Nayani Krishna Kumari
M.A., Ph D.,
Vice Chancellor



Lalitha Kala Kshetram,
Public Gardens,
Hyderabad - 500 004. (A.P.)

No పొ(శ్రీతెవి/విసి/97. Date : 8-8-1997

## ఆశీస్సులు

ఆధునిక సాంకేతిక విప్లవం వల్లా, ప్రతిదానికీ యంత్ర సహాయాన్ని ఆశ్రయించే అలవాటువల్లా ఈనాడు పల్లెలు పల్లెల్లాలేవు. పట్టణాలు పట్టణాల్లాలేవు. పట్టణ సంస్కృతిని అనుకరించే వెంపర్లాటలో పల్లెలు తమ స్వచ్ఛమైన జీవన విధానాన్ని అనేక తరాలుగా అపురూపంగా కాపాడుతూ వచ్చిన మానవ సంబంధాల సౌరభాన్ని ధ్వంసం చేసుకుంటున్నాయి. ఇక పట్టణాల పరిస్థితిచూస్తే గ్లోబల్ విలేజ్ ధోరణుల వల్ల అవి ఫలానా జాతి సంస్కృతికి ప్రతిబింబంగా వున్నాయని చెప్పే పరిస్థితి లేకుండా పోయింది. ఆ మాటకొస్తే ఈరోజు వరకు కూడా తాతలు, తండ్రులనాటి అవశేషాలు ఇంకా కొంతయినా మిగిలివున్నాయంటే అది పల్లెల్లోనే. అందుకు కొంత పూరట చెందక తప్పదు. ఈ దృష్టితో ఇటువంటి పల్లెసీమల్లో మనం కొల్పోతున్న విలువలను పునరుద్ధరించేందుకు మార్గాలను అన్వేషించవలసిన తరుణం ఆసన్నమైంది.

ఇప్పటికీ పండగ నాడుకూడా పిల్లలు పెద్దలూ టీవీ ముందు కూర్చుని ఆరోజంతా అలా గడిపేసే పరిస్థితి అంతటావుంది. పండగొస్తేచాలు తెలతెలవారినప్పటి నుంచి ఒకటి తర్వాత మరొకటిగా ఎంతో ఉత్సాహంతో చిన్నాపెద్దా పనులు చేస్తూ ఎంతో ఆనందంగా కలిసి మెలిసి గడిపినవాళ్లం. నిన్నమొన్నటిదాకా ఈపరిస్థితి కనిపించింది. ఇప్పుడిప్పుడే కనుమరుగవుతోంది. దీనిని పోనివ్వరాదు. ఇది మన అస్తిత్వం, మన సంస్కృతి.

పుస్తక రూపంలో వెలువడుతున్న 'తూర్పుగోదావరి జిల్లా గ్రామదేవతలు' పరిశోధన గ్రంథం చదువుతుంటే అటువంటి అచ్చమైన గ్రామీణ జీవనశైలి మనసులో మెదిలింది.

ముఖ్యంగా గ్రామదేవతలు, ఆపేర్లు, ఆరాధనా పద్ధతులు, సంబరాలు, జాతర్లు, నమ్మకాలు, పాటలు, నాట్యాలు, ఐతిహ్యాలు, మొక్కుబడులు ఇలా ఎన్నో అంశాలు గుర్తొచ్చాయి. నాగరికత పెంపొందుతున్న కొలదీ మనం విస్మరిస్తున్న గ్రామీణ సంస్కృతిలోని అనేక విలువైన అంశాలను అధ్యయనం చేసిన గ్రంథమిది.

మొల్లేటి రామకృష్ణ ఆంధ్ర విశ్వవిద్యాలయంలో పిహెచ్.డి., పరిశోధన చేసి వెలువరిస్తున్న ఈ గ్రంథంలో గ్రామదేవతల చుట్టూ పెనవేసుకొనివున్న అనేక సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక విశేషాలు చోటు చేసుకున్నాయి. జిల్లాలవారీగా ఇటువంటి పరిశోధనలు జానపద విజ్ఞాన విషయకంగానూ, భాషా విషయకంగానూ కొన్ని ఇదివరకు జరిగాయి మరిన్ని జరుగుతున్నాయి. ఆదిశలో రాష్ట్రంలోని అతిపెద్ద జిల్లాల్లో ఒకటైన తూర్పుగోదావరి జిల్లా గురించి విస్తృతప్రాతిపదికపైన జరిగిన పరిశోధనగా దీన్ని భావించవచ్చు.

ఇందులో ఆ జిల్లాలోని గ్రామదేవతల పేర్లు, దేవతలకు ఆపేర్లు ఎట్లా వచ్చాయనేందుకు ప్రచారంలోవున్న కథలు, గాథలు, ఆయాదేవతల మహిమలపట్ల ప్రజలకువున్న నమ్మకాలపై వివరంగా చర్చ సాగింది.

పరిశోధన ఒకింత కష్టతరమైనదే. ఎందుకంటే బహుగ్రంథపఠన, పరిశీలన, విశ్లేషణ కాకుండా ఎక్కువ కృషి వివిధ ప్రాంత సందర్శనం, మౌఖికంగా, శ్రవ్య సాధనాల్లో రికార్డింగ్ చేసుకోవడంవంటి మార్గాలద్వారా విషయసేకరణ అవసరమైనది. ఇందులో పరిశోధకుడు తగిన కృషి చేసినట్లే భావించాలి.

ఇందులో ప్రత్యేకంగా చెప్పుకోదగిన అంశాలు, తెలుగునాట ప్రతి గ్రామంలో కనిపించే సాధారణాంశాలు కనిపిస్తాయి. తూర్పుగోదావరి జిల్లాకు సంబంధించిన అనేక అంశాలు చెప్పుకోదగిన విధంగా వున్నాయి. గ్రామదేవతల వివరాలుతోపాటు చారిత్రక, సాంస్కృతిక విశేషాలు అనేకంచోటుచేసుకున్నాయి. గ్రామీణులవాడుకలోని పదాలు పెద్ద సంఖ్యలో అకారాదిక్రమంలో పొందుపరచడం అభినందనీయం. ఇవి ఇతరత్రా కూడా ఉపయోగకరంగా వుంటాయి. విలువైన గ్రంథాన్ని అందిస్తున్న రామకృష్ణగారికి అభినందనలు, ఆశీస్సులు అందిస్తున్నాను.

నాయని కృష్ణకుమారి

నాయని కృష్ణకుమారి

**ఆచార్య (శ్రీమతి) కె. మలయవాసిని**
M.A.Ph.D.
తెలుగుశాఖ, ఆంధ్రవిశ్వవిద్యాలయం
విశాఖపట్నం

## పూలగరగ

చిరంజీవి రామకృష్ణ రాజమండ్రి ఆర్ట్సు కాలేజీలో M.A పూర్తి చేసి ఆంధ్రవిశ్వ కళాపరిషత్తులో పరిశోధక విద్యార్థిగా చేరడానికి వచ్చాడు. విశాఖలో చదవని కారణంగా అతడు నాకు అపరిచితుడు. పరిశోధనకు అంశాన్ని నిర్ణయించుకోవడానికి అతని అభిరుచులు నాకు తెలియక పరిశోధన ఏ విషయం మీద చెయ్యాలనుకుంటున్నావని అడిగాను. ప్రాచీన సాహిత్యం అంతగా కొరుకుడు పడదనీ, ఆధునిక సాహిత్యంమీద పెద్దగా అభిరుచి లేదనీ అనడంతో క్షేత్ర పర్యటన శ్రమకోర్చి గ్రామదేవతల విజ్ఞానం మీదపరిశోధనచేస్తే బాగుంటుందని సూచించాను. తాను తూర్పుగోదావరి జిల్లావాడు కావడంతో ఆజిల్లాను పరిమితిగా గ్రామదేవతల అధ్యయనానికి శ్రీకారం చుట్టాడు.

శారీరక శ్రమకు, ఆర్థికపరమైన ఇబ్బందులనూ కూడా లెక్కచేయకుండా ఆజిల్లా అంతా 'పూనకం' వచ్చినవాని వలె తిరిగి ఎంతో విషయాన్ని సేకరించాడు. కథలు, పాటలు, ఆరాధనా విధానాలు ఫోటోలతో సహా సంకలనంచేసాడు. ఆయాదేవతల జాతరల సమయంలో ఆయా గ్రామాలకు వెళ్ళి, చొచ్చుకుపోయి, గ్రామ పెద్దలను కలిసి చొరవగా అనేకానేకాంశాలను క్రోడీకరించాడు.

క్రోడీకరించిన విషయాలను వింగడించి, విశ్లేషించి, సిద్ధాంత వ్యాసాన్ని రూపొందించాడు. ముఖ్యంగా గ్రామదేవతల నామాల గురించిన విశ్లేషణ, ఆరాధనా విధానాలు, గ్రామదేవతల సాహిత్యంలోని భాషా విశేషాలు అతనిలోని పరిశోధనా పాటవాన్ని పట్టి చూపుతున్నాయి.

చి. రామకృష్ణచేసిన అవిరళ కృషిని సిద్ధాంత వ్యాస పరీక్షకులు ఏకగ్రీవంగా కొనియాడారు. ఆరిపోర్టులు ఆధారంగా ఈ సిద్ధాంత వ్యాసానికి Best Thesis Award లభించింది. అతని కృషికి చక్కని ఫలితాన్ని అందుకున్నాడు.

సిద్ధాంత వ్యాసరచన ఒక 'జాతర' అయితే దాన్ని పుస్తక రూపంలో అచ్చొత్తించడం మరో జాతర కార్యక్రమం అంత కష్టమయింది. తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహాయంతో పాటు తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయం కోసం ఎంతగానో శ్రమించవలసి వచ్చింది. మతపరమైన గ్రంథంతో పాటు సిద్ధాంతవ్యాసం కావడం మొదట్లో అడ్డంకి అయినా చివరకు ఆ అడ్డంకి తీరి ఆర్థిక సహాయం లభించింది. పుస్తకంలో కలర్‌ఫోటోలు ఉండడం వల్ల పెట్టుబడి తలకు మించిన పని అయింది.

బడిపంతులుగా బ్రతుకుతూ ఇంతటి కృషి చేసి నిరంతరం శ్రమిస్తూ ఈ పుస్తకాన్ని గ్రామదేవత విజ్ఞానానికి ఒక 'పూలంగరగ' గా అర్పిస్తున్న డా. రామకృష్ణకు నాశుభాశీస్సులు.

మలయవాసిని

దాగంటి గౌరీదేవి
రిటైర్డు గ్రేడు 1 హిందీ పండిట్
పోర్టుక్వార్టర్సు, 14 E కంచరపాలేం,
పద్యకవితా సదస్సు సభ్యురాలు,
విశాఖపట్నం.

## ''ఆశీర్వాదపూర్వక అభిప్రాయము''

''గ్రామదేవతలు'' అనే గ్రంథాన్ని రచించిన చిరంజీవి డా. రామకృష్ణ పరిశోధన, పరిశ్రమ ప్రశంసనీయం. ఇతడు తూర్పు గోదావరి జిల్లా అంతా సంచరించి, ప్రాచీన విషయాల్ని సేకరించి, జానపద సాహిత్యాన్ని శోధించి, అందలి జానపదగేయాల్ని తన గ్రంథంలో జొప్పించేడు. అసలు ఈ ''గ్రామదేవతల'' ఆవిర్భావాన్ని కారణములతో నిరూపించేడు. ప్రాచీన కాలమునుండి నేటివరకు ఆయాదేవతల ఆరాధనలు, అర్చనలు ఎలాజరుగుతూ వచ్చేయో ఆ జానపదగేయాల్లో స్పష్టమవుతుంది. ఈ తూర్పుగోదావరి జిల్లాలోనే గాక ఆంధ్రప్రదేశ మంతటా వ్యాపించి యున్నాయీ గ్రామదేవతా రాధనలు. చెప్పాలంటే భారతదేశమంతటను ఈ దేవతారాధనలు జరుగుతూనే ఉన్నాయి. భాషలు వేరయినా పేర్లు, ఆరాధనలు ఒకే రీతిగా జరుగుతున్నాయి. తమిళనాడులోగల 'సమయపురి'' అనే పురములో ''మారెమ్మ'' అను గ్రామ దేవత ఆలయము కలదు. కోరిన కోర్కెలను దీర్చు దేవతగా అట ప్రసిద్ధి గాంచిన అమ్మవారు మారెమ్మ. అలాగే ఉత్తర ప్రదేశ్ కాశీలో ''గొడీబాయి'' కలకత్తాలో ''కాళి' గ్రామదేవతలు. ఇలా ఎన్నో ప్రాంతాలలో ఎన్నోపేర్లుగల గ్రామదేవతలు భారత దేశమంతటా వ్యాప్తిలో నున్నవి. ప్రాచీన కాలమునుండి ఈ నాటి ఈ 20వ శతాబ్దపు వైజ్ఞానిక యుగములో గూడ ఈ గ్రామ దేవతారాధనలు భారతదేశమంతటా చేయబడుచున్నవి అంటే అవి ఎంతటి ప్రాముఖ్యతతో ప్రబలుచున్నాయో తెలియు చున్నవి.

ప్రపంచములో కెల్లా మన భరతఖండము పవిత్రమైన కర్మభూమిగాను ధర్మభూమి గాను కొనియాడ బడుతోంది. ఆధ్యాత్మిక భావానికిది పుట్టినిల్లు. రాతియుగమందు ఆనాటి ప్రాణికోటి అడవులేగాని ఎరుగని ''అజ్ఞా'' లందు అన్య ప్రాణులకంటే ప్రాధాన్యతగల మానవ ప్రాణి తన ''ఆవగింజంత మేధలో అమితశక్తి'' ని పొంది దినదినాభివృద్ధిని సంతరించుకొని నేటి యీవిజ్ఞానయుగాన్ని సంతరించుకొంది. మానవాతీతమైన ఒక మహాశక్తి ఈ సకల చరాచర జగత్తును నడిపించుచున్నదని గ్రహించిన మానవులా శక్తిని ఆరాధించడం ప్రారంభించేరు. ప్రతి ప్రాణిని ఆదరించి

పాకేది తల్లి అన్నది నగ్నసత్యం. కారణభూతమైన తండ్రి కంటే ఆధార భూతమైన తల్లికి ఈ లోకంలో ప్రాధాన్యత మెండు. అందువల్లనే ప్రాచీన కాలమునుండి మాతృదేవతగా శక్తిని ఆరాధించడం మొదలు పెట్టేరు. నామరూపాలు లేని ఆ దివ్య శక్తికి నామరూపా లేర్పరచుకున్నారు. తమకు తెలిసిన మానవరూపానికంటే ఎక్కువ అధికృతనిచ్చి విగ్రహాలు నిలిపారు. వీటికి తమకనుగుణంగానే పేర్లు పెట్టుకున్నారు. నూకాలమ్మ, మరిడమ్మ, మారెమ్మ, పోలమ్మ, గంగమ్మ మొదలగునవి. అప్పటి మానవులు పచ్చిమాంసాన్ని భుజించేవారు గనుకనే ఆ అమ్మవార్లకు పచ్చిమాంసాలు నివేదన చేసేవారు. తమసంతానానికి గూడ ఆయా దేవతల పేర్లు ఆడమగా భేదం లేకుండా పెట్టుకునేవారు. నూకాలమ్మ – నూకయ్య, మరిడమ్మ – మరిడయ్య, గంగమ్మ – గంగయ్య, మారెమ్మ – మారెయ్య ఇలా రాను రాను సభ్యతా సంస్కారాలు పెరిగి పురుష రూపాలతో గూడ విగ్రహారాధనలు వెలిసాయి. ప్రకృతి సిద్ధమైన నదీతీరాల్లో పురుషరూపారాధనలు నెలకొల్పబడ్డాయి. ఈ పురుష దేవతారాధనలు నాటికి సంస్కృతీ సాహిత్యములు ప్రబలియుండుటచేత ''ద్వాదశలింగాలు'' శివక్షేత్రాలుగా నెలకొన్నాయి. అలాగే విష్ణు సదనాలు. ఐదు ప్రసిద్ధి చెందిన విష్ణు క్షేత్రాలు, అష్టాదశ శక్తి పీఠాలు నెలకొల్పబడ్డాయి. పురుషరూపక్షేత్రాలలో వేదోక్తమైన ఆరాధనలు నియమనిష్ఠలతో జరుగుతూ వచ్చేయి. గ్రామదేవతారాధన లిప్పటికీ నాగరికతాభిన్నమైన పద్ధతులలో జరుగుచున్నాయి. శివుడని, విష్ణువని, కృష్ణుడని వేలకొలది సంవత్సరాల క్రిందటే వెలిసారు. వీటన్నిటికంటే ముందు ''గ్రామదేవతలే'' మానవలోకంలో ప్రాముఖ్యత వహించేయి. అటువంటి ప్రాముఖ్యత సంతరించుకొని సృష్టిలోనే ప్రప్రథమంగా వెలసిన దేవతల గురించి చి.డా. రామకృష్ణ పరిశోధించి రచించిన ఈ ''గ్రామదేవతలు'' అనే గ్రంథము బహుళ ప్రచారమై ప్రాముఖ్యత వహించ గలదని ఆశిస్తూ దీని గురించి శ్రమించి శోధించి ప్రజలకందించిన చి. డా. రామకృష్ణను ఆశీర్వదిస్తూ ఆయా దేవతలీతనికి ఆయురారోగ్యైశ్వర్యములు నొసంగవలయునని కోరుతూ.

చాగంటి గౌరీదేవి.

# విషయసూచిక

కృతజ్ఞతలు

ముందు మాట

1. ప్రథమ ప్రకరణం 1-13
తూర్పుగోదావరి జిల్లా పరిచయం

2. ద్వితీయ ప్రకరణం 14-21
గ్రామదేవతల పరిచయం

3. తృతీయ ప్రకరణం 22-30
తూర్పుగోదావరి జిల్లా గ్రామదేవతల -
స్వరూప స్వభావాలు

4. చతుర్థ ప్రకరణం 31-43
తూర్పుగోదావరి జిల్లా గ్రామదేవతలు - నామవైవిధ్యం

5. పంచమ ప్రకరణం 44-68
గ్రామదేవతల ఆరాధనా విధానం - ఆచారాలు,
నమ్మకాలు, మొక్కులు.

6 షష్ఠమ ప్రకరణం 69-110
తూర్పుగోదావరి జిల్లా గ్రామదేవతల కథలు, గాథలు
మహిమలు

7. సప్తమ ప్రకరణం 111-125
తూర్పుగోదావరి జిల్లా పేరంటాళ్ళు, కథలు

8. అష్టమ ప్రకరణం 126-186
గ్రామదేవతలు - పంబలవారు

9. నవమ ప్రకరణం 187-209
గ్రామదేవతలు - మత్స్యకారులు

10. దశమ ప్రకరణం 210-244
భాషా విశేషాలు

**11. ఏకాదశ ప్రకరణం** 245–246
గ్రామదేవతలు – భిన్న సంస్కృతుల సమ్మేళనం

**12. ద్వాదశ ప్రకరణం** 247–248
గ్రామదేవతలు – అధ్యయనావశ్యకత

**13. త్రయోదశ ప్రకరణం** 249 –252
గ్రామదేవతల కథల ఆధారంగా గ్రామస్థుల
నమ్మకాలు, ఆచారాలు, ఆరోపణలు

**అనుబంధం-1** 253–281
సేకరించిన వివిధ గేయాలు, పద్యాలు,
దండకాలు, పాటలు

**అనుబంధం-2** 282–290
గ్రామదేవతలు – వారు పూజింపబడుతున్న గ్రామాలు

**ఉపయుక్త గ్రంథసూచిక** 290–293

**ఉపయుక్త వ్యక్తి సూచిక** 293 –295

ప్రథమ ప్రకరణం

# తూర్పుగోదావరిజిల్లా పరిచయం

ఒక ప్రాంతపు ప్రజల గురించి తెలుసుకొనే ముందు ఆ ప్రాంతపు భౌగోళిక చారిత్రక, రాజకీయ, సాంఘిక పరిస్థితుల అధ్యయనం చాలా అవసరం. పరిసరాలు, భౌగోళిక పరిస్థితులు మానవజీవితాన్ని ప్రభావితం చేయడమే ఇందుకు కారణం. ఒక జిల్లా గురించి, ఆ జిల్లాలోని ప్రజల జీవితంలో అవిచ్ఛిన్నంగా చోటుచేసుకొని ఆరాధింపబడే గ్రామదేవతల గురించి తెలుసుకోవటానికి ముందు, ఆ జిల్లా యొక్క భౌగోళిక, చారిత్రక, రాజకీయ, సాంఘిక విషయాల అధ్యయనం కూడా ఎంతైనా అవసరం.

## జిల్లాచరిత్ర - ఏర్పాటు

గోదావరి నదికి తూర్పున ఉన్న జిల్లా తూర్పు గోదావరి జిల్లా. కోస్తా ఆంధ్రా తొమ్మిది జిల్లాల్లోనూ ఇది ఒకటి. ''కళింగ రాజ్యపు పరిహద్దు ప్రాంతంగా చెప్పబడుచున్న ఈజిల్లా పూర్వయుగాలనుండి మానవ నివాసయోగ్యంగా ఉన్నట్లు, జిల్లాలోని మన్య ప్రాంతాల్లో లభించిన పూర్వశిలాయుగపు మానవుని శిలాపరికరాలు ఋజువు చేస్తున్నాయి. ఆంధ్రప్రదేశ్ నందలి తక్కిన ప్రాంతాలవలే ఈ ప్రాంతానికి కూడ చారిత్రక యుగం మౌర్యులతో ప్రారంభమయ్యింది. మౌర్యుల పాలనానంతరం కళింగరాజ్యాన్ని పాలించిన 'చేది' వంశీయుల పాలనలో కొంత కాలముండి క్రీ.శ.3వ శతాబ్దంలో శాతవాహనుల రాజ్యభాగమయ్యింది. శాతవాహనుల తర్వాత ఇక్ష్వాకులు కొంత కాలం పరిపాలించారు.'' 1

''క్రీ.శ.4వ శతాబ్దంలో 'పిష్టపురా' (పిఠాపురా) న్ని పరిపాలిస్తుండగా, సముద్ర గుప్తుడు తన తూర్పుతీర దండయాత్రలో ఈ ప్రాంతాన్ని ఆక్రమించుకున్నాడు. ఈతనితర్వాత దేవపుర రాజన్యులు, వీరి తర్వాత వాసిష్ఠి వంశస్థులు పిఠాపురం రాజధానిగా పాలించారు. క్రీ.శ.5వ శతాబ్దం చివరికాలంలో గాంగవంశంవారు కళింగంలో అధికారంలోకి వచ్చారు. విష్ణుకుండినులకు, వీరికి జరిగిన యుద్ధాల్లో ఈ జిల్లాచేతులు మారుతూ వచ్చింది.'' 2 .

క్రీ.శ.7వ శతాబ్దం ప్రారంభంలో పశ్చిమ చాళుక్యరాజగు రెండవ పులకేశి కళింగంపై దండెత్తి, పిఠాపుర దుర్గాన్ని ఆక్రమించుకున్నాడు. కుబ్జవిష్ణువర్ధనుడు, పులకేశి ప్రతినిధిగా పిఠాపురాన్ని రాజధానిగా చేసుకొని ఆంధ్రదేశాన్ని పరిపాలించాడు. ఈతని కాలం నుండి ఆంధ్రదేశాన్ని పాలించినరాజులను తూర్పు చాళుక్యరాజులంటారు. క్రీ.శ.10వ శతాబ్దారంభంలో ఈ ప్రాంతాన్ని పాలించిన మొదటి చాళుక్యభీమరాజు ద్రాక్షారామంలో భీమేశ్వరాలయాన్ని నిర్మించాడు. ఈతని తర్వాత మొదటి అమ్మరాజువిష్ణువర్ధనుడు క్రీ.శ. 918 - 925 లో రాజ్యానికి వచ్చాడు. ఈతనికి రాజమహేంద్రుడని బిరుదు ఉండటం వల్ల ఈతడు నిర్మించిన నగరానికి రాజమహేంద్ర నగరమని పేరువచ్చింది. ఈతని తర్వాత విమలాదిత్యుడు, రాజరాజనరేంద్రుడు, రాజేంద్రచోళుడు - మొదలైన చాళుక్యరాజులు పరిపాలించారు.'' 3

"క్రీ.శ. 12వ శతాబ్దంలో ఆంధ్రదేశాన్ని వెలనాటి చోళులు పరిపాలించారు. వీరి చివరికాలంలో అరాచకం ప్రబలి, వీరి సామంతులు స్వతంత్రులయారు. క్రీ.శ. 1212 ప్రాంతములో కాకతీయ గణపతి దండయాత్రవల్ల ఈ ప్రాంతం కాకతీయుల వశమయ్యింది. తురుష్కులు కాకతీయుల్ని జయించాక 1226లో ఈ ప్రాంతం మహమ్మదుబిన్‌తుగ్లక్ వశమయ్యింది. ఢిల్లీ సుల్తానుల పాలన నుండి ఆంధ్ర దేశాన్ని విడిపించటానికి ముసునూరిప్రోలయ నాయకత్వాన ఉద్యమం ప్రారంభించి, 1327 నాటికి విముక్తి కలిగించారు. ముసునూరి వంశపు ప్రతిభ తగ్గాక కొండవీటి రెడ్డిరాజు అనవేమారెడ్డి (1364 - 1386) ఈ ప్రాంతాన్ని తన రాజ్యంలో కలుపుకున్నాడు. రెడ్డిరాజులలో ఒకడగు కుమారగిరి తన రాజ్యం తూర్పు భాగాన్ని రాజమహేంద్రవర నగరం రాజధానిగా వేరుచేసి, తన బావమరిది కాటయవేముడను ప్రతినిధిగా నియమించాడు. కుమారగిరి మరణానంతరం ఈతడు స్వతంత్రుడయ్యాడు. 1366-70 మధ్య ఈ ప్రాంతం కళింగ గజపతుల వశమయ్యింది."[4]

"16వ శతాబ్దంలో శ్రీకృష్ణదేవరాయలు కోస్తాప్రాంతాన్నంతా జయించాక తూర్పు గోదావరి జిల్లా విజయనగర సామ్రాజ్యంలో ఉంది. 1571 లో ఈ జిల్లాను గోల్కొండ నవాబులు జయించారు. 17వ శతాబ్దంలో గోల్కొండ రాజ్యం మొగలాయీల వశమయ్యాక, నైజాం నవాబులు ఆంధ్రదేశ పాలకులయారు. 1748లో నైజాం వారసులలో వచ్చిన తగాదాలలో ఫ్రెంచివారు, ఇంగ్లీషువారు జోక్యం కలిగించుకున్నారు. 1766లో నైజాం నవాబు ఇంగ్లీషువారికి ఈ ప్రాంతాన్ని కట్టబెట్టాడు. 1769లో ఇంగ్లీషువారు తూర్పుగోదావరిజిల్లాను మచిలీపట్టణం కంపెనీ సలహా సంఘం పాలన కిందకు తెచ్చారు." 5

1794లో కలెక్టరు పాలన వచ్చాక తూర్పుగోదావరి జిల్లా కాకినాడ, రాజమండ్రి అనే రెండు కలెక్టరేటులుగా విభజింపబడి, 1802లో తిరిగి కలిపి వేయబడి రాజమండ్రి జిల్లా ఏర్పాటయ్యింది. 1859లో కాకినాడ కార్యస్థానంగా గోదావరి జిల్లా ఏర్పడింది. 1860లో నైజాము ఇంగ్లీషువారికిచ్చిన భద్రాచలం తాలూకా తిరిగి ఈ జిల్లాలో చేర్చబడింది.

1904 నాటికి గోదావరిజిల్లా పెరిగిపోవటం వల్ల, గోదావరి నదికి తూర్పువైపు పోలవరం డివిజన్ మినహా తూర్పుగోదావరిజిల్లాగా రూపొందింపబడింది. ఆంధ్రప్రదేశ్ నిర్మాణానంతరం 1960లో భద్రాచలం, నూగూరు తాలూకాలు ఖమ్మంజిల్లాలో చేర్చబడ్డాయి.[6]

ప్రభుత్వం ప్రతిప్రాంతాన్ని పరిపాలనా సౌలభ్యానికి కొన్ని విభాగాలు చేస్తుంది. అలాగే తూర్పు గోదావరిజిల్లా కూడ 1968 నాటికి 1. కాకినాడ, 2. రాజమండ్రి, 3. పెద్దాపురం, 4. అమలాపురం. అనే నాల్గు రెవెన్యూ డివిజన్లుగాను, 1. తుని, 2. పిఠాపురం, 3. కాకినాడ, 4. అమలాపురం, 5. రాజోలు, 6. కొత్తపేట, 7. రాజమండ్రి, 8. రంపచోడవరం, 9. ఎల్లవరం, 10. పెద్దాపురం, 11. ప్రత్తిపాడు, 12. రామచంద్రపురం - అనే 12 తాలూకాలుగాను విభజింపబడి ఉండేవి7. 1981 నాటికి వీటిలో కొన్ని తాలూకాలను విడదీసి కొత్తగా రంగంపేట, కోరుకొండ, [illegible]. రాయవరం, ఆలమూరు, ముమ్మిడివరం, పి. గన్నవరం అనే తాలూకాలను కూడ ఏర్పాటు చేశారు. 1985లో ఈ 19 తాలూకాలను 57 రెవెన్యూ మండలాలుగా విభజించారు.

తర్వాతికాలంలో రంప చోడవరం అనే రెవెన్యూ డివిజనుకు కొత్తగా ఏర్పాటుచేసి, ఏజన్సీ మండలాలు ఏడింటిని ఈ డివిజనులో చేర్చారు. ఈ విధంగా ఈ జిల్లా ఇప్పటికీ 57 రెవెన్యూ మండలాలు గానూ, 5 రెవెన్యూ డివిజన్లుగానూ విభజింపబడి ఉంది.

## ఉనికి

తూర్పుతీరాన ఉత్తర అక్షాంశము 16° - 30° నుంచి 18° -30° వరకు, తూర్పు రేఖాంశము 81°-30° నుండి 82°-35° వరకు ఈ జిల్లా విస్తరించి ఉంది[10] దీనికి ఉత్తరాన విశాఖజిల్లా, ఒరిస్సా, మధ్యప్రదేశ్ రాష్ట్రాలు, తూర్పున బంగాళాఖాతం, దక్షిణాన, పడమర పశ్చిమ గోదావరి, ఖమ్మం జిల్లాలు సరిహద్దులు. [11]

## భౌగోళిక స్వరూపం

భౌగోళికంగా ఈ జిల్లాను ఏజెన్సీ, పీఠభూమి, డెల్టా అని మూడు భాగాలుగా విభజింపవచ్చు. జిల్లా వైశాల్యంలో సగభాగం తూర్పుకనుమల కింద ఉంది. సముద్ర తీరం వెంబడి ఉన్న ఈ కొండలు, జిల్లా ఉత్తరభాగం వరకు విస్తరించి, అక్కడ ఉన్న కొండలతో కలిసిపోయి, ఏజన్సీగా మారుతున్నాయి[12]. ఎల్లవరం, రంపచోడవరం అనే రెండు తాలుకాలుగా విభజింపబడి ఉండే ఈ ఏజన్సీ ప్రాంతం 1985లో ఏడు రెవెన్యూ మండలాలుగా విభజింపబడింది. ఈ ఏడు మండలాలతో రంపచోడవరం అనే రెవిన్యూ డివిజనును ఏర్పాటు చేసారు.

ప్రత్తిపాడు, పిఠాపురం, పెద్దాపురం, రంగంపేట, కోరుకొండ, తుని తాలూకాలు పూర్తిగానూ, కాకినాడ రాజమండ్రి, రామచంద్రాపురం తాలూకాలలో కొంతభాగాన్ని పీఠభూమిగా చెప్పవచ్చును. కొత్తపేట, ముమ్మిడివరం, రాజోలు, అమలాపురం, పి. గన్నవరం (ఈ ప్రాంతాన్ని కోనసీమ మరియు సెంట్రల్ డెల్టాని కూడ అంటారు) తాళ్లరేవు, ఆలమూరు, రాయవరం తాలూకాలు పూర్తిగానూ, కాకినాడ, రామచంద్రాపురం, రాజమండ్రి తాలూకాలలోని కొంత భాగాన్ని (తూర్పు డెల్టా) డెల్టాగా పరిగణిస్తారు.

## విస్తీర్ణం - గ్రామాలు - పట్టణాలు

జిల్లా విస్తీర్ణం 10807 చ.కి.మీ. నివాసం యోగ్యమగు గ్రామాలు 1317. నివాసం యోగ్యంకాని గ్రామాలు 72. పట్టణాల సంఖ్య 13. ఈ జిల్లాలో కాకినాడ, రాజమండ్రి, సామర్లకోట, అమలాపురం, పిఠాపురం, పెద్దాపురం, తుని, రామచంద్రాపురం అనే 9 మున్సిపల్ పట్టణాలు కలవు. కాకినాడ, రాజమండ్రి పట్టణాలు రెండూ 3 లక్షల జనాభాను మించి ఉన్నవి. ఇటీవలికాలంలోనే రాజమండ్రి కార్పొరేషను స్థాయి పొందినది. మిగతావి ఒక్కొక్కటి ఏభైవేలకి మించిన జనాభాను కలిగిఉన్నవి. ఇవికాక మున్సిపాలిటీతో సరితూగగల మేజరు పంచాయితీలు చాలా ఉన్నాయి. వాటిలో ధవళేశ్వరం, ఏలేశ్వరం, కపిలేశ్వరపురం, అనపర్తి, ద్వారపూడి, చిక్కవోలు, జగ్గంపేట, అంబాజీపేట, అన్నవరం మొదలైనవి ముఖ్యమైనవి.

## జనాభా

''దేశమంటే మట్టికాదోయ్, దేశమంటేమనుజులోయ్'' అన్నారు మహాకవి గురజాడ జనాభా విషయంలో ఈ జిల్లా రాష్ట్రంలో ప్రథమ స్థానంలో ఉంది. 1991 జనాభా లెక్కల ప్రకారం ఈ జిల్లా జనాభా 45,42, 369. వీరిలో పురుషులు 22,73,587, స్త్రీలు 22,68,782. జనసాంద్రత విషయంలో రాష్ట్రంలో పశ్చిమగోదావరి జిల్లా తర్వాతద్వితీయ స్థానంలో ఉంది. జిల్లా జనాభాలో 2/3వ వంతు వ్యవసాయ రంగం పై ఆధారపడి జీవిస్తున్నారు. మత జనాభానుసరించి విభజిస్తే హిందువులు ఎక్కువ. రెండవ స్థానం క్రైస్తవులది. ఇంకా ముస్లిములు, జైనులు, ఇతరులు కూడా ఉన్నారు.

భాషలవారీ విభజించినచో తెలుగు వారే కాక, ఇంకా కోయ, ఉర్దూ, తమిళం, ఒరియా, హిందీ, హిందూస్థానీ, మలయాళం, కన్నడం, మరాఠీ, మార్వాడీ, సింధీ, గుజరాతీ భాషలు మాట్లాడేవారు కూడా ఉన్నారు.[15]

## అక్షరాస్యత - విద్య

అక్షరాస్యత, విద్యా విషయికంగాకూడ ఈ జిల్లాను అభివృద్ధి చెందినజిల్లాగా చెప్పవచ్చును. రాష్ట్రంలో హైదరాబాదు, కృష్ణ, గుంటూరు, పశ్చిమగోదావరి తర్వాత అక్షరాస్యతలో అయిదవ స్థానంలో ఉంది. జనాభాలో 45 శాతం చదవగలరు, వ్రాయగలరు. 1991 జనాభా లెక్కల ప్రకారం జిల్లాలో అక్షరాస్యులు 18,82,544.[16] వారిలో పురుషులు 10,66,192, స్త్రీలు 8,16,352.[17] డెల్టా, మెట్ట ప్రాంతాల కంటె ఏజన్సీ ప్రాంతంలో అక్షరాస్యత తక్కువ.

ఈ జిల్లాలో ప్రభుత్వ, ప్రయివేటు యాజమాన్యాలలో అనేక విద్యాసంస్థలు నడపబడుతూ, విద్యాభివృద్ధికి పాటుపడుచున్నాయి. ఈ జిల్లాలో 10 ప్రీప్రయిమరీ, 2530 ప్రయిమరీ, 304 మాధ్యమిక, 238 (ప్రస్తుతం సంఖ్య సుమారు 400) సెకండరీ పాఠశాలలు నడపబడుచున్నాయి.[18]

ఇంకా ఉన్నత విద్యాభివృద్ధికోసం ఈ జిల్లాలో 45 జూనియర్ కళాశాలలు 20 డిగ్రీ కళాశాలలు, 3 పి.జి. కేంద్రాలు (రాజమండ్రి, కాకినాడ, రామచంద్రాపురం), 3 బి.ఎడ్. కళాశాలలు (కాకినాడ, రాజమండ్రి 2) నడుపడుచున్నాయి. కాకినాడలో వైద్యకళాశాల, ఇంజనీరింగు కళాశాల, 2. పాలిటెక్నిక్ కళాశాలలు, రాజమండ్రిలో ఉపాధ్యాయ శిక్షణాకేంద్రం, కూడ ఉన్నాయి. జిల్లాలో నాలుగు పారిశ్రామిక శిక్షణాకేంద్రములున్నాయి.

కాకినాడ, రాజమండ్రి, పెదకళ్ళేపల్లి, ముంగండ, పేరూరు, ముక్కామల, అన్నవరం, కపిలేశ్వరపురంలో ప్రాచ్యవిద్యా కేంద్రాలు కూడ ఉన్నాయి. అవేకాక రాష్ట్రప్రభుత్వం వారిచే గురుకుల పాఠశాలలు నడపబడుచున్నాయి. కేంద్ర ప్రభుత్వం వారిచే స్థాపింపబడిన నవోదయవిద్యాలయం పెద్దాపురంలో ఉంది. ఏజన్సీలో ఐ.టి.డి.ఏ.ను స్థాపించి, ప్రభుత్వం విద్యాభివృద్ధికి పాటుపడుచున్నది. ఈ జిల్లా సగటు అక్షరాస్యతనుమించి, విద్యావిషయికంగా అభివృద్ధిపథంలో పయనిస్తున్నది.

## శీతోష్ణస్థితి - వర్షపాతం

ఈ జిల్లా తీరప్రాంతం పొడవు సుమారు 144 కి.మీ. సముద్ర ప్రభావం వల్ల అత్యధిక, అత్యల్ప ఉష్ణోగ్రతల మధ్య తేడా తక్కువగా ఉండి, జిల్లా అంతటా సమశీతోష్ణ వాతావరణముంటుంది. జిల్లాలో వ్యాపించి ఉన్న అడవులు, పండ్లతోటలు, పంటపైరులు, కాలువలు కూడ ఇందుకు తోడ్పడుచున్నాయి. రోజువారీ గరిష్ఠోష్ణోగ్రత 89.కి కనిష్ఠోష్ణోగ్రత 74.9 సాంవత్సరిక గరిష్ఠోష్ణోగ్రత 103 ఫా. కనిష్ఠోష్ణోగ్రత 61 ఫా. కాగా అత్యధిక ఉష్ణోగ్రత ఉండేనెల ''మే'' అత్యల్ప ఉష్ణోగ్రత ఉండే నెల డిశంబరు. 20 వర్షపాతం 45.24 సెం.మీ. వర్షాలు జూన్ నెలలో ప్రారంభమై నవంబరు వరకూ కురుస్తాయి. మొత్తం వర్షపాతంలో సుమారు మూడు వంతులు నైరుతి ఋతుపవనాలవల్ల, ఒక వంతు ఈశాన్య ఋతుపవనాలవల్ల లభిస్తుంది. జిల్లాలో అత్యధిక వర్షపాతం గల నెల ఆగష్టు.

## ప్రకృతి వనరులు

నదులు, అడవులు, ఖనిజములు, నేలలు మొదలైనవి ప్రకృతి వనరులు.

## నదులు

జిల్లాలో ముఖ్యమైన నది గోదావరినది. ఈ నది దక్షిణభారతదేశంలోనే పెద్దది. ఇది రంపచోడవరం తాలూకా పడమటి భాగంలో జిల్లాలో ప్రవేశించి, ఉత్తరాన్నుంచి దక్షిణానికి జిల్లా పడమటి భాగాన్నంతా చుట్టివచ్చి, రాజమండ్రికి దిగువన తూర్పుగా ప్రవహించి గౌతమీ గోదావరి, వసిష్ఠ గోదావరి అని రెండుగా చీలుతుంది. తూర్పుగా ప్రవహించే గౌతమీగోదావరి రామచంద్రపురం, ఆలమూరు, కాకినాడ, తాళ్లరేవు తాలూకాలకు దక్షిణ సరిహద్దుగానూ, అమలాపురం, ముమ్మిడివరం, కొత్తపేట తాలూకాలకు ఉత్తర సరిహద్దుగానూ ప్రవహిస్తూ, యానాం వద్ద బహుముఖాలుగా చీలి సముద్రంలో కలుస్తున్నది.

పశ్చిమంగా ప్రవహించే వశిష్ఠ గోదావరి సముద్రంలో కలిసే ముందు 'వైనతేయ' అనే పాయగా చీలి, రాజోలు తాలూకాకు తూర్పుసరిహద్దుగా ప్రవహించి సముద్రంలో కలుస్తున్నది. వశిష్ఠగోదావరి రాజోలు, కొత్తపేట, పి.గన్నవరం తాలూకాలకు పశ్చిమ సరిహద్దుగానూ, పశ్చిమ గోదావరి జిల్లాకు తూర్పు సరిహద్దు గానూ ప్రవహిస్తూ అంతర్వేది వద్ద సముద్రంలో కలుస్తున్నదే. కాగా గౌతమీ వశిష్ఠ గోదావరుల మధ్యనున్న ప్రాంతాన్ని 'కోనసీమ' అంటారు. ఈ గోదావరి కాల్వలవల్ల జిల్లాలోని డెల్టా ప్రాంతమంతా సస్యశ్యామలమైనది.

జిల్లాలో చెప్పుకోతగ్గ మరొకనది ఏలేరు. ఎల్లవరం తాలూకా ఎల్లవరం గ్రామానికి ఈశాన్యాన మూడు వాగులు కలయుటవల్ల ఏర్పడ్డ ఈ నది దక్షిణంగా ప్రవహించి పెద్దాపురం తాలూకాలోని వీరవరానికి ఎగువన చిన్నచిన్న వాగులుగా చీలుతుంది. వానిలో పడమర చివరనున్న వాగు 'ఏలేరు' అనే పేరుతోనే ముందుకు సాగి, పిఠాపురం తాలూకా పడమటి సరిహద్దుగా ప్రవహించి, కాకినాడ తాలూకాలోనికి పోయి, చిక్కవోలు మురుగుకాల్వతో కలిసి, సముద్రాన్ని కలుస్తుందే. ఈ నది వల్ల పెద్దాపురం, పిఠాపురం మండలాలకు పూర్తిగానూ, పత్తిపాడు మండలంలో కొంతభాగానికి, తుని మండలంలో ఒక గ్రామానికి నీటి వసతి కల్గుచున్నది.

'పంపా' అనేది ఈ జిల్లాలో ప్రవహించే ఇంకొక చిన్ననది. అన్నవరంవద్ద ఈ నదికి నిర్మించిన జలాశయంవల్ల, తుని తాలూకాలోని తొండంగి మండలానికి నీటి వసతి కల్పించున్నది. ఈ నది అద్దారిపేట వద్ద సముద్రాన్ని కలుస్తుంది.

'తాండవ' అనే నది తూర్పు గోదావరి విశాఖపట్టణం జిల్లాలను వేరుచేస్తూ, తూర్పు గోదావరి జిల్లాకు ఉత్తర పరిహద్దుగా ప్రవహిస్తున్నది. కానీ ఈ నదీ పరీవాహక ప్రాంతం ఈ జిల్లాలో చాలా తక్కువ. విశాఖజిల్లాలో ఈ నదికి నిర్మించిన రిజర్వాయరువల్ల తూర్పుగోదావరి జిల్లాలోని కోటనందూరు, తుని మండలాల్లోని కొన్నిగ్రామాలకు నీటి వసతి కల్గుచున్నది.

**ఖనిజాలు**

గోదావరి నదికి ఉభయపార్శ్వములందు నేలబొగ్గు పొరలు కలవని శాస్త్రజ్ఞులు అభిప్రాయం. జిల్లాలో ఇంకా బాక్సైట్, పుల్లమైట్ ఖనిజాలు లభిస్తున్నాయి. పుణ్యక్షేత్రం, పెద్దాపురం, ధవళేశ్వరం, ద్వారపూడి, కోటబొమ్మాళిల్లో ''క్లే'' ఖనిజం, రంపచోడవరం తాలూకాలోని వెలగపల్లి, ఎల్లవరం తాలూకాలోని రాయవరం, పేడిపాలెం, మారేడుమిల్లి మొదలైన ప్రాంతాల్లో బాక్సైట్ ఖనిజం లభిస్తున్నాయి.[25] ఎల్లవరం తాలూకాలోని 'జడేరు' మొదలైన ప్రాంతాలవద్ద గ్రాఫైటు, సీసం కనపడుతున్నాయి.[26] ఇనుము, ఉక్కును కరిగించుటకుపయోగించే 'ఫైర్‌క్లే' ఖనిజం పెద్దాపురం, బొమ్మూరు ప్రాంతాల్లో లభిస్తున్నది.[27] కోనసీమలోని రాజోలు తాటిపాక మొదలైన ప్రాంతాల్లో సహజ వాయువు వెలువడుచున్నది. తీరప్రాంతమునందలి ఇసుకలో అణుశక్తికి పనికి వచ్చే టిటానియం, జిర్కోనియం, జికోరం మొదలైన ఖనిజాలున్నట్లు పరిశీలకులు నిర్ణయించారు.[28]

**చమురు సహజవాయువుల సంస్థ**

నూతన అన్వేషణలకు ప్రేరణ కల్పిస్తూ, వాటిని ప్రోత్సహించుట, పర్యావరణంలోని హైడ్రోకార్బన్‌లను అభివృద్ధి చేస్తూ దేశం యొక్క ఆర్థిక వనరులను అధికం చేయుటానికి తోడ్పడుట, తగినంత వస్తువులను తిరిగి పెట్టుబడి పెట్టగలిగేలా ఉత్పత్తి చేయుట మొదలైన ఉద్దేశ్యములతోను; ప్రత్యేక పరిజ్ఞానంతో హైడ్రోకార్బన్‌ల ఉత్పత్తిని పెంచుట, హైడ్రో కార్బన్‌ల వినియోగము ఉన్నతమైన రీతిలో నిర్వహించుట, పర్యావరణమును పరిరక్షించుట మొదలైన లక్ష్యములతోను ఈ సంస్థ 1956సం. రములో స్థాపించబడింది.

1994 ఫిబ్రవరి 1 న ఈ సంస్థ భారత ప్రభుత్వ రంగ సంస్థగా మార్చబడింది. ఇది 40 సంవత్సరముల గత అనుభవాలద్వారా 1994-95 సంవత్సరంలో అధికమైన ఫలితాలను సాధించింది. గడచిన రెండు సంవత్సరాలలో ఏడు క్రొత్తచమురు సహజ వాయువుల బావులను కనుగొని 150 యం.యం.టి. హైడ్రోకార్బన్ ఉత్పత్తిని సాధించింది. 1995-96 సంవత్సరములో పది ప్రభుత్వరంగ సంస్థలన్నింటిలోనూ ఇది అధిక ఉత్పత్తులను, లాభములను సాధించింది. ఈ సంస్థ ముంబాయి, [illegible], బరోడా, మద్రాసు, కలకత్తా మరియు జమ్మూలలో అనుబంధ సంస్థలను స్థాపించింది అంతేకాక డెహ్రాడూన్‌లో మూడు, ముంబాయిలో మూడు, అహ్మదాబాదు, గోవాలలో ఒక్కొక్కటి చొప్పున పరిశోధనా కేంద్రాలను కూడ స్థాపించింది. వీటితో పాటు మన దేశంలోను, విదేశాలలోను కూడ కొన్ని యూనివర్శిటీలలోను, యాజమాన్య సంస్థలలోను శిక్షణా సంస్థలు

నెలకొల్పింది

## కృష్ణాగోదావరి ప్రాజెక్టు

చమురు సహజవాయువుల సంస్థ కృష్ణా, గోదావరి ప్రాజెక్టు కార్యాలయం రాజమండ్రిలో నెలకొల్పబడింది. కృష్ణాగోదావరి నదీతీర ప్రాంతంలో ఉన్న చమురు సహజవాయువు నిక్షేపాలను వెలికి తీయుటకు 1950 సం.రము నుండి అన్వేషణలు జరుగుచున్నవి పలు ప్రదేశాలలో వేరు వేరు చోట్ల 70 బావులు పడ్డాయి. గురుత్వాకర్షణ అయస్కాంత క్షేత్ర ప్రభావం ఆధారంగా 1960లోను, భూ కంపతరంగాల ఆధారంగా 1967లోను ఈ సంస్థ సర్వేలు చేసింది. తూర్పు, పశ్చిమగోదావరి జిల్లాలు, కృష్ణా, నెల్లూరు జిల్లాలలో 1982-84 సంవత్సరాలలోనే సర్వేలు పూర్తయినవి. భూమిపైనే కాక సముద్రపు ఒడ్డున, సముద్రంలోనూ కూడ బావులు తవ్వడం, ఈ సంస్థ చేస్తున్నది. భౌగోళికంగా కోస్తాతీర ప్రాంతం వేడి ప్రదేశమైనందున ఎక్కువ వతిడితో గ్యాసు వెలువడుచున్నది. 1988 ఫిబ్రవరిలో మొదటి సారిగా ఈ ప్రాజెక్టులో గ్యాసు సరఫరా ప్రారంభమయి, అప్పటి నుంచి దినదిన ప్రవర్ధమాన మగుచున్నది.

ప్రస్తుతం కృష్ణ గోదావరి ప్రాజెక్టు జనరల్ మేనేజరు ఆధ్వర్యంలో డ్రిల్లింగు, ఉత్పత్తి, మొదలైన కొన్ని హెడ్సుతో నిర్వహింపబడుచున్నది. ఇందు అధికారులు, ఇతర సిబ్బంది కలిసి సుమారు 1450 మంది పనిచేయుచున్నారు. చమురు సహజవాయువుల సంస్థ ఆర్థికంగా లాభదాయకమైనదయినందువ కోస్తా ప్రాంతమందు ప్రజల సాంఘిక స్థితిగతులను మెరుగు పరచుటకు కృషి సల్పుచున్నది. వశిష్టనది మీద ఆన కట్టకట్టుటకు, 3.6 కోట్లు, కోనసీమ ప్రాంతంలో రోడ్లు వేయుటకు 4.5 కోట్లు, ఖర్చు పెట్టింది. అంతేకాక విద్య వైద్య సదుపాయములు, మొక్కలునాటుట, క్రీడా నిర్వహణము, త్రాగునీటి సదుపాయములు, అట్టడుగు వర్గాల అభివృద్ధి కోసం ప్రతి సంవత్సరమూ లక్షలాది రూపాయల ఖర్చు పెట్టుచున్నది. మరియు 1995-96 సంవత్సరాలలో సంభవించిన గ్యాసు బ్లో అవుట్ నిర్వాసితులకు ఇళ్ళు కట్టించుటకు ఒక్కొక్కటికి రూ. 23,000 లు చొప్పున 38.64 లక్షలు, కొన్ని ఇళ్లకు పై కప్పులు వేయుటకు 20.46 లక్షల ఖర్చు పెట్టింది. ముఖ్యంగా రాజమండ్రి పరిసర ప్రాంతాలలోని ప్రజల సర్వతోముఖాభివృద్ధికి బాగుగా కృషి సల్పుచున్నది.

వీటన్నింటితో పాటు సారస్వత, సాంస్కృతిక రంగాలలో అభివృద్ధి సాధించుటకు నాలాంటి ఔత్సాహికులకు పుస్తక ముద్రణ నిమిత్తం కూడ సముచిత రీతిలో ఆర్థిక సహాయమొసంగుచున్నది. ఇట్టి ఈ సంస్థ తన కార్య సాధనలో మరిన్ని విజయములు సాధించి గొప్ప ప్రగతితో ప్రజ్వరిల్లాలని నా వంటి గోదావరి ప్రాంత ప్రజల కోరిక.

### అడవులు

జిల్లా విస్తీర్ణంలో మూడ వంతుని మించి అడవులున్నాయి. ఈ జిల్లాలోని అడవులు విస్తీర్ణ 3.23 లక్షల హెక్టార్లు. ఎల్లవరం, రంపచోడవరం తాలూకాలు పూర్తిగా అటవీప్రాంతం. ఈ తాలూకాలలో టెకు మొదలైన ప్రసిద్ధ కలపచెట్లుకలవు. ప్రత్తిపాడు, తుని తాలూకాలలోని అడవుల్లో వెదురుపొదలు కలవు. తీరప్రాంతం నిండిన వెదురు పరుగుడుతోటలు, తాటితోపులు కలవు

కుంకుళ్లు, చింతపండు, వెదురుబియ్యం, తేనె, మైనం మొదలైన ఫలసాయాలు ఈ అడవులవల్ల లభిస్తున్నాయి. కలప, వెదురు బొంగులను తెప్పలుగా కట్టి గోదావరినదిమీద ఎగుమతి చేస్తారు.[29]

## నేలలు

నేల స్వభావాన్నిబట్టి ఈ జిల్లాను నల్లబంగారపు జిల్లా అంటారు. ఈ జిల్లాలో ఒండ్రునేల, ఎర్రనేల, నల్లరేగడి నేల, తువ్వనేలలు కలవు. ఒండ్రునేలలు డెల్టాప్రాంతమంతా వ్యాపించి ఉన్నాయి. రాజమండ్రి పెద్దాపురం, పిఠాపురం తాలూకాలలో ఎర్రనేల మరియు నల్లరేగడి నేలలున్నాయి. రాజోలు, అమలాపురం తాలూకాలలో సముద్రతీరం వెంబడి తువ్వనేలలున్నాయి.[30]

## వ్యవసాయం

ఈ జిల్లా ప్రజల ప్రధాన వృత్తి వ్యవసాయం. జిల్లాలో ప్రవహించే నదులు, చెరువులు, జలాశయాలు, గొట్టపుబావులు, జిల్లాలో ఉన్న సారవంతమైన నేలలు జిల్లాను వ్యావసాయక జిల్లాగా ప్రసిద్ధికెక్కించాయి. డెల్టా ప్రాంతమంతా గోదావరి కాల్వల ద్వారా సాగగుచున్నది. మెట్టప్రాంతంలో చాలాభాగం, చెరువులు, జలాశయాలు, గొట్టపు బావులద్వారా సాగగుచున్నది. ఈ జిల్లాలోని ఎక్కువ భాగం నీటి వసతిని కలిగి యున్నది. నీటి వసతితో 7,80,370 ఎకరాలు, వర్షాధారంతో 5,00,593 ఎకరాలు సాగుచేస్తున్నారు.[31] పల్లపుసాగులో వరి, అరటి, చెరకు ముఖ్య పంటలు కాగా మెట్టసాగులో జొన్న, పొగాకు, నువ్వులు, మిరప, ప్రత్తి, కంది, కర్రపెండలం పలుముఖ్యమైన పంటలు. పల్లపు సాగులో మినుము, పెసర వంటి పప్పు దినుసులను రెండవ, మూడవ పంటలుగా పండిస్తున్నారు.

రాష్ట్రంలో ఆహారధాన్యాలు పండే పంటభూమిలో 5.19 శాతం, వరిపంటలో 9.46 శాతం తూర్పుగోదావరి జిల్లాలోనే ఉంది. 7.65 శాతం చెరకు పండేభూమి ఈజిల్లాలోనే ఉంది. హెక్టారుకు సగటు వరి పంట విషయంలో 2540 కిలోలతో రాష్ట్రంలో పశ్చిమగోదావరి తర్వాత ద్వితీయాస్థానంలో ఉంది. నికర పంట భూమిలో నికరంగా నీరుపారే భూమిశాతం 85.45. మామిడి, కొబ్బరి, జీడిమామిడి తోటలు విస్తారంగా ఉన్నాయి.[32] ఆహారం విషయంలో ఈ జిల్లా మిగులు జిల్లా. ఆంధ్రప్రదేశ్‌కు ధాన్యంగారంగా చెప్పబడే జిల్లాల్లో ఇదికూడా ఒకటి. అరటి, కొబ్బరి, రాష్ట్రమొత్తం ఉత్పత్తిలో వరుసగా 36,57 శాతాలు ఈ జిల్లాలోనే ఉత్పత్తి అగుచున్నాయి.[33] మెట్టప్రాంతంలో పండే మామిడి పండ్లు, డెల్టాప్రాంతంలో పండే తెల్ల చక్కెరకేళీ అరటిపండ్లు ఇతర రాష్ట్రాలకు ఎగుమతిఅగుచున్నాయి. ఈవిధంగా జిల్లా వ్యావసాయికంగా రాష్ట్రంలోనేకాక, దేశంలో కూడ ప్రముఖస్థానాన్ని పొందింది. ఏజన్సీ ప్రాంతంలో కాఫీ, రబ్బరు, తోటలు కలవు.

## పరిశ్రమలు

వ్యావసాయికంగా ఎంతో అభివృద్ధిచెందిన యీజిల్లా పారిశ్రామికంగాకూడ అభివృద్ధిపథాన పయనిస్తున్నది.

## గృహపరిశ్రమలు

చేనేత పరిశ్రమ ముఖ్యమైన గృహపరిశ్రమ. వ్యవసాయరంగం తర్వాత చేనేతరంగం పైనే

ఆధారపడి ఎక్కువ మంది జీవిస్తున్నారు. చేనేత మగ్గాల సంఖ్యలో రాష్ట్రంలో ఈ జిల్లా ప్రధమస్థానంలో ఉంది. రైతులలో కొందరికి తేనె పరిశ్రమ అనుబంధ పరిశ్రమగా ఉంది. గృహపరిశ్రమలను అభివృద్ధి పరచుటకు రాజమండ్రిలో ఇండస్ట్రియల్ మ్యూజియం ఉన్నదే[4] ఇంకా ఈ జిల్లాలో పంచదార పరిశ్రమ, పొగాకు పరిశ్రమ, ప్రత్తి, పట్టువస్త్ర పరిశ్రమ, కాగితపు పరిశ్రమ, పెంకుల తయారీ పరిశ్రమ, ఇంజనీరింగు సామాగ్రీ తయారీ, మూసల తయారీ, ఫౌంటెన్ పెన్ను తయారీ, అల్యూమినియం సామాగ్రీ తయారీ మొదలయిన పరిశ్రమలున్నాయి.[35]

పెద్దాపురంలో సిల్కుమిల్లులు, పందలపాకలో నూలుమిల్లులు, గొల్లప్రోలులో స్పిన్నింగుమిల్లు ఉన్నాయి. రాజమండ్రి, పెద్దాపురంలో పట్టువస్త్రములు కూడ లభిస్తున్నాం. ఈ జిల్లాలో 100కి మించి బియ్యం మిల్లులున్నాయి. ఇక్కడ నుండి బియ్యం ఇతర జిల్లాలకు, రాష్ట్రాలకు కూడ ఎగుమతి అవుతున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లోగల రెండు పేపరు మిల్లుల్లోనూ ఒకటి ఈ జిల్లాలోనే (రాజమండ్రి లో) ఉంది. పెన్నుల తయారీ, అల్యూమినియం సామాగ్రి, మూసల తయారీ పరిశ్రమలు కూడ రాజమండ్రిలోనే ఉన్నాయి. ధవళేశ్వరంలో తూకంతూాయు త్రాసులు, పెద్దకాటాలు, ఇనుపపెట్టెల తయారీ పరిశ్రమలున్నాయి. పిఠాపురం, సామర్లకోట, చెల్లూరులలో పంచదార కర్మాగారాలున్నాయి.

కాకినాడలో ఇటీవలే 'నాగార్జున' 'గోదావరి' అనే రెండు ఎరువుల కర్మాగారాలు ప్రారంభింపబడి ఉత్పత్తిని సాగిస్తున్నాయి. కాకినాడలో స్టీమ్‌లాంచీలు, చిన్నచిన్న పడవలు, బల్లకట్లు కూడా తయారవుతున్నాయి. బిక్కవోలులో సిగరెట్ల తయారీ పరిశ్రమ ఉంది. కోనసీమ ప్రాంతంలో పీచుపరిశ్రమ కేంద్రీకృతమై ఉంది. కాగా పెంకులు ఉత్పత్తిలో ఈ జిల్లా రాష్ట్రంలోనే ప్రధమ స్థానంలో ఉంది. సామర్లకోటలో ఉన్న శాగోఫ్యాక్టరీలు (సగ్గుబియ్యం తయారు చేసే మిల్లులు) కూడ చెప్పుకోతగ్గవి. సామర్లకోటలో నూనె పరిశ్రమకూడ అభివృద్ధి చెందింది. ఇంకా జిల్లాలోని కోనసీమ ప్రాంతంలో లభిస్తున్న సహజవాయువు (గ్యాసు) ఆధారంతో, రాజమండ్రి సమీపంలో ఉన్న జేగురుపాడులో విధ్యుదుత్పాదన కేంద్రాన్ని ప్రభుత్వం స్థాపించింది.

ఈవిధంగా వివిధ రకాల భారీ, మధ్యతరహా, గృహపరిశ్రమలతో ఈ జిల్లా రాష్ట్రపారిశ్రామిక పటంలో సముచితస్థానాన్ని పొందింది.

## చూడదగిన ప్రదేశాలు

అనాది నుంచీ తూర్పుగోదావరి జిల్లా వివిధ సంస్కృతులకు నిలయమైనది. గోదావరి డెల్టా 'సప్తగోదావరి' అను పేరుతో భారతీయ సంస్కృతియందు ప్రసిద్ధి వహించింది. గోదావరి నది జిల్లాలోనికి ప్రవేశించిన వెంటనే తూర్పుకనుమలలో పాపికొండలను చీల్చుకొని ప్రవహించు దృశ్యం అత్యంత రమణీయంగా ఉంటుంది. ఇచ్చట కొండల నడుమ నది కొన్నిచోట్ల రెండువందల గజాలే ఉంటుంది. కాని లోతూ, వేగమూ అత్యధికం.[36]

గోదావరి డెల్టాకే 'కోనసీమ' అని మధ్య యుగాల నుండి వ్యవహారం ఈ కోనసీమ ప్రకృతి రామణీయకతకు పేరెన్నికగన్నది. కాశ్మీరం, కేరళ తర్వాత ఆంధ్రాలో ఈ కోనసీమ అందాలసీమ.

కొబ్బరి, పోక మొదలైన వృక్షాలతోను, గోదావరి పిల్లకాల్వలతోనూ ఎల్లప్పుడూ చల్లగా ఉంటుంది. సినిమాలు తీయుటకు అనువైన మనోహర దృశ్యముల ఇచ్చట ఉండడంచేత, గ్రామీణ ఇతివృత్తంతో కూడిన సినిమాల షూటింగులన్నీ ఇంచుమించు ఈ ప్రాంతములోనే జరుగుచున్నాయి.

బౌద్ధుల పుణ్యక్షేత్రములు, కోనసీమలో ఉండేవనటానికి నిదర్శనంగా, రాజోలు తాలూకాలోని ఆదుర్రునందు బౌద్ధనిర్మాణ అవశేషాలున్నాయి. గోదావరీ తీరంలోనే హిందువుల పుణ్యక్షేత్రాలయిన పంచారామాలుండేవని ప్రతీతి. వాటిలో ద్రాక్షారామం, కుమారారామం, (కోటిపల్లి) భీమారామామం, (సామర్లకోట) ఈ జిల్లాలోనివే.[37]

ద్రాక్షారామాన్ని 'దక్షిణకాశీ' అనికూడ అంటారు. ఇచ్చట దేవాలయం ముందున్న చెరువులలో సప్తగోదావరీ నదుల జలాలుండటంవల్ల భక్తులు ఈ నీటిని పవిత్రంగా భావిస్తారు. కోటిపల్లి ద్రాక్షారామానికి 6 మైళ్ళ దూరంలో ఉంది. ఇది పవిత్ర శైవక్షేత్రం. ఇచట ఒకదానము చేసిన కోటి ఫలితము లిచ్చుటచే దానికి కోటిపల్లి అని పేరు వచ్చింది.

పిఠాపురంలో కుక్కుటేశ్వరస్వామి ఆలయం ఉన్నది. ఇక్కడ ఉన్న శివలింగం వెనుకకు వెళ్ళి చూచిన కోడి ఆకారంలో ఉంటుంది. ఈ ఆలయానికి ముందున్న పుష్కరిణిని 'పాదగయ' అంటారు. బీహారులో గయక్షేత్రంలో గయునితల, ఈ పుష్కరిణిలో గయునిపాదాలు ఉన్నాయని ప్రజలనమ్మకం. ఈ కుక్కుటేశ్వర క్షేత్రమే 'కుమారారామం' అనే అభిప్రాయం కూడ కలదు.[38] ఇంకా పట్టిసం, సామర్లకోట, కపిలేశ్వరపురం, ఏలేశ్వరం మొదలైన శైవక్షేత్రాలు కూడ ఈ జిల్లాలో ఉన్నాయి. ఈ శైవక్షేత్రాలలో శివరాత్రికి గొప్ప ఉత్సవం జరుగుతుంది.

దర్శించవలసిన వైష్ణవక్షేత్రాలుకూడ ఈ జిల్లాలో చాలా ఉన్నాయి. వాటిలో 'ర్యాలీ' ముఖ్యమైనది. ఇది కొత్తపేట తాలూకాలో ఉన్నది. ఇచ్చట కళాసంపదకుప్రసిద్ధికెక్కిన నిగనిగలాడు జగన్మోహిని విగ్రహం కలదు. ఈ విగ్రహం ముందునుండి చూస్తే, విష్ణుమూర్తిగనూ, వెనుక నుండిచూస్తే జగన్మోహినిగను దర్శనమిస్తుంది.

ఇంకా అన్నవరంలోని శ్రీ వీరవెంకట సత్యన్నారాయణ స్వామి ఆలయం, సర్పవరంలోని భావనారాయణస్వామి ఆలయం, పిఠాపురంలోని కుంతి మాధవస్వామి ఆలయం, అప్పన్నపల్లి (కోనసీమ) లోని బాలాజీ ఆలయం, సోమవరం(కిర్లంపూడి మండం)లోని వేంకటేశ్వరస్వామి ఆలయం, అంతర్వేదిలోని లక్ష్మీనృసింహస్వామి ఆలయం మొదలైనవి. ఈ జిల్లాలోని ప్రసిద్ధమైన వైష్ణవ క్షేత్రాలు.

ఇంకా ఈ జిల్లాలో దర్శనీయ స్థలాలు చాలా ఉన్నాయి. రాజమండ్రి వద్ద అతిపొడవైన (ప్రపంచంలో రెండవది, ఆసియాలో పెద్దది) రైలుకంరోడ్డు వంతెన కలదు. కందుకూరివీరేశలింగంగారి గృహం, వారు స్థాపించిన అనేక సంస్థల భవనాలు, గౌతమీ గ్రంథాలయం, ప్రభుత్వరంగంలోని మొదటి కాగితం కర్మాగారం గ్రాఫైటుక్రూసిబుల్ పరిశ్రమ, దేశంలోనే మొదటిగా ఏర్పరచినకాటాల పరిశ్రమకూడ ఇక్కడే ఉన్నాయి. ఈవిధంగా తూర్పుగోదావరి జిల్లా అనేక దర్శనీయస్థలాలతో యాత్రికులను, చూపరులను ఆకర్షించుచున్నది.

## పితూరీలు - తిరుగుబాట్లు - జాతీయోద్యమం

జాతీయోద్యమానికి ముందు తూర్పు గోదావరి జిల్లాలోని రైతులు చారిత్రాత్మక పోరాటాలు జరిపారు. వాటిలో 1879 'రంపపితూరీ' 1916 - 1917 'లాగరాయిపితూరీ'. 1922 'మన్యంతిరుగుబాటు' ముఖ్యమైనవి. సాంఘికంగా, ఆర్థికంగా, వెనుకబడిన జిల్లాలోని ఏజన్సీ ప్రజలు మన్నెం దొరలనే భూస్వాముల దోపిడి కింద నలిగిపోయేవారు. ఈ దోపిడికి వ్యతిరేకంగా మన్యం రైతులు 1858, 61, 62లలో రంపచోడవరం తాలూకాలలో అనేక తిరుగుబాట్లు చేశారు.[39]

1879లో రంపచోడవరం తాలూకాలో రైతులు చేసిన తిరుగుబాటునే 'రంప పితూరీ' అంటారు. 1916-17లో లాగరాయిపితూరీ కూడ జరిగింది. ఈ రెంటిని బ్రిటిషు ప్రభుత్వం అణచివేసి, తిరుగుబాటుదారుల్ని బంధించింది. తర్వాత 1922 జనవరిలో ప్రభుత్వం అణచివేసి, తిరుగుబాటుదారుల్ని బంధించింది. తర్వాత 1922 జనవరిలో ముఠాదార్లు, లంచగొండి అధికార్ల దోపిడికి, దౌర్జన్యానికి వ్యతిరేకంగా సీతారామరాజు నాయకత్వంలో గొప్ప తిరుగుబాటు జరిగింది. ఈ తిరుగు బాటులో గంతందొర, మల్లుదొర అనే గాముసోదరులు, సీతారామరాజుకు రెండు భుజాలుగా పనిచేశారు.[40] బ్రిటిషువారు సీతారామరాజును కాల్చిచంపటంతో తిరుగు బాటు అణిగిపోయింది. అల్లూరి సీతారామరాజువలె, భారతజాతీయోద్యమంలో పాల్గొని అహర్నిశలు దేశస్వాతంత్ర్యంకోసం పోరాడి, స్వాతంత్ర్యాన్ని సంపాదించిన సమరయోధులు ఎందరో ఈ జిల్లాలో ఉన్నారు. ఈవిధంగా ఈ జిల్లా ప్రాంతీయ, జాతీయోద్యమాలద్వారా బ్రిటిషు వారిని గడగడ లాడించి స్వాతంత్ర్యాన్ని సంపాదించటంలో ప్రముఖపాత్ర వహించింది.

## రాజకీయంగా

జాతీయ, రాష్ట్ర రాజకీయాలలో ప్రముఖపాత్ర వహించి, ప్రజాసేవ చేసిన రాజకీయనాయకులెందరో ఈ జిల్లాలో ఉన్నారు. 'ఆంధ్ర చాణక్య' బిరుదాంకితులు, మేధావియైన కళావెంకటారావుగారు ఈ జిల్లావారే. వీరు ఆంధ్రరాష్ట్రకాంగ్రెసుకు ఒక దశాబ్దంపాటు కార్యదర్శిగా పనిచేసారు. ఇంకా బులుసు సాంబమూర్తి, బులుసు పట్టాభిరామారావు, మొసలికంటి తిరుమలరావు, చిట్టూరి ప్రభాకరరావు, బిక్కిన వెంకటరత్నం, న్యాపతి సుబ్బారావు మొదలైన మహామహులు ఈ జిల్లాలో పేర్కొనదగిన గొప్ప రాజకీయనాయకులు.

ప్రస్తుతం జిల్లాలో 21 అసెంబ్లీ, 3 పార్లమెంటు నియోజక వర్గాలున్నాయి. రాష్ట్రంలో ఎక్కువ నియోజకవర్గాలు గల జిల్లాయిదే. సాధారణంగా ఈ జిల్లానుండే ఎక్కువ మంది మంత్రులుకూడ నియమింపబడతారు. ఈవిధంగా ఈ జిల్లాను రాజకీయంగా కూడ అభివృద్ధిచెందినదిగా చెప్పవచ్చు.

## సాహిత్యం

నాగరికత, సంస్కృతి, సాహిత్యం, నదీతీర ప్రాంతంలోనే పుట్టి, పెరుగుతాయి. గోదావరీతీరంలో కవిత్వం ఉందని వాడుక. గౌతమీ ప్రదేశం కవులకు, పండితులకు శాస్త్రవేత్తలకు నిలయం. ఆంధ్ర సరస్వతిపాదపీఠంమీద తొలిపుష్పం ఉంచింది. గోదావరీ తీరమే. ఆదికవి నన్నయ్య ఎక్కడ పుట్టినా, రాజమహేంద్రవరంలో జీవించి, భారతాంధ్రీకరణకు నాంది పలికాడు.

ఆనాటి నుండి ఈనాటి వరకు తూర్పుగోదావరిజిల్లా ఎంతో మంది కవులకు, పండితులకు జన్మస్థానమయ్యింది. రసగంగాధరకర్త జగన్నాథ పండితరాయలు, శివతత్త్వసారకర్త మల్లికార్జునపండితుడు, వేములవాడ భీమకవి మొదలైన ప్రాచీనకవులు ఈ జిల్లావారే.

సంస్థానాలు సాహిత్యానికి కాణాచులు. ఈ జిల్లాలో ప్రసిద్ధ సంస్థానాలైన పెద్దాపురం పిఠాపురం, కపిలేశ్వరపురం - కేశనకుర్రు, కోలంక - వీరవరంలలో ఎంతో సాహితీ కృషి జరిగింది. సాహితీపోషణలో అగ్రతాంబూలం పిఠాపురం సంస్థానానిదే. ఇచ్చట అనేక మంది కవిరాజులు, రాజకవులు జీవించి ఉత్తమ కావ్యాలను వెలయించారు. మిగిలిన సంస్థానాల్లోకూడ చెప్పుకోదగ్గ సాహితీ కృషి జరిగింది. కూచిమంచి కవులు, దేవులపల్లి కవులు, ఏనుగు కవులు, చిలుకూరి చతుష్టయం, బొమ్మకంటి షట్కం మొదలైన కుటుంబకవులు, తిరుపతి వేంకటకవులు, వెంకట రామకృష్ణ కవులు, వెంకట పార్వతీశ్వరకవులు మొదలైన జంటకవులు ఈ జిల్లావారే. ఇంకా ఎంతోమంది ప్రాచీన సంస్కృతాంధ్ర కవులు ఈ జిల్లాలో జీవించి ఆంధ్ర సరస్వతిని తమ కావ్యాలతో పరిపుష్టం గావించారు.

ఆధునిక కవిత్వానికి, సంఘసంస్కరణకు ఆద్యుడైన కందుకూరి వీరేశలింగం పంతులు, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రి, పానుగంటి లక్ష్మీనరసింహం, చిలకమర్తిలక్ష్మీనరసింహం, జయంతి రామయ్యపంతులు, మొక్కపాటి నరసింహ శాస్త్రి మధునాపంతుల సత్యన్నారాయణశాస్త్రి, వెంపరాలసూర్యనారాయణశాస్త్రి, చాగంటి శేషయ్య, అవంత్స సోమసుందరం, యస్.టి. జ్ఞానానందకవి మొదలైన ఆధునిక కవులు, కొటికలపూడి సీతమ్మ, పులగుర్తి నరసమ్మ వంటి ఆధునిక కవయిత్రులు కూడ ఈ జిల్లావారే. పండితులచే నిర్మింపబడిన సూర్యరాయంధ్ర నిఘంటువు జన్మస్థానం ఈ జిల్లాయే (పిఠాపురం)

ఈ విధంగా ఎంతోమంది కవిశ్రేష్ఠులను, ఉత్తమ కావ్యములను అందించి తూర్పు గోదావరి జిల్లా సాహితీ రంగంలోకూడ అనాది నుంచి తనదైన ప్రత్యేక స్థానాన్ని పొంది, కవిపండితులతోనూ, వారి మధురకావ్యాల రసమాధురితోనూ అలరారుచున్నది.

ప్రకృతి సిద్ధమైన ఎన్నో సహజవనరులను కలిగియుండి, ఆర్థికంగా, సాంఘికంగా, సాంస్కృతికంగా ఎంతో అభివృద్ధి చెందిన తూర్పు గోదావరి జిల్లాలోని ప్రజలు ఆరాధించుచున్న గ్రామదేవతలు, వారి ఆరాధాన విధానం, జాతరలు, నమ్మకాలు, గ్రామదేవతల కథలు, గుడులు, అసలు గ్రామదేవతల ఆవిర్భావం మొదలైన విషయాలను ముందు అధ్యాయాల్లో విపులంగా వివరిస్తాను.

## అధస్సూచికలు

1,2,3,4,5,6. ఆంధ్రప్రదేశ్ దర్శిని - పుట 819.

7. మనమూ - మన రాష్ట్రము - 3, తూర్పు గోదావరి జిల్లా - పుట 9.

8. District Census Hand Book of East Godavari, 1981, p. VIII

9. Hand Book of Stastics, East Godavari District, 1985, 86, p.3

10. విజ్ఞాన సర్వస్వం - పుట, 1302.

11. ఆంధ్రప్రదేశ్ దర్శిని - పుట 818.

12. విజ్ఞాన సర్వస్వం పుట 1302.

13. District Census Hand Book of East Godavari.

14. Census of India 1991, Andhra Pradesh Series - 2, Provisional population Tables - 1.

15. మనమూ - మన రాష్ట్రమూ - 3, తూర్పుగోదావరి - పుట 27.

16. District Census Hand Book of East Godavari.

17. Census of India 1991, Andhra Pradesh Series - 2, Provisional population Tables -1.

18. Hand Book of Statastics, East Godavari District, 1985-86.

19. Ibid, p.5.

20,21. విజ్ఞాన సర్వస్వం పుట. 1302.

22. ఆంధ్రప్రదేశ్ దర్శిని పుట 818.

23. విజ్ఞాన సర్వస్వం పుట 1303.

24. Hand Book of Statisstics, East Godavari District, 1985-86, p.5.

25. ఆంధ్రప్రదేశ్ దర్శిని - పుట 818.

26. విజ్ఞాన సర్వస్వం పుట. 1302.

27,28. మనమూ - మన రాష్ట్రం - 3, తూర్పు గోదావరి, పుట 24.

29. విజ్ఞాన సర్వస్వం పుట. 1303.

30. మనమూ - మనరాష్ట్రం - తూర్పుగోదావరి - పుట 24.

31. విజ్ఞాన సర్వస్వం పుట. 1305.

32. ఆంధ్రప్రదేశ్ దర్శిని - పుట 822.

33. Hand Book of Statistics, East Godavari District, 1985-86, p.6.

34,35,36. విజ్ఞాన సర్వస్వం పుట 1306, పుట 1307.

37,38. మనమూ - మన రాష్ట్రము - 3, తూర్పుగోదావరి - పుట 86.

39,40. ఆంధ్రప్రదేశ్ దర్శిని - పుట 820.

ప్రాచీన మయినదని⁷ ఎహిరెన్ ఫిల్సు అభిప్రాయం.

ఈ గణమాతృస్వామికి వ్యవస్థలో ప్రకృతిసిద్ధమైన వస్తువులనే తినేవారు. కావున ప్రకృతిని మాతృమూర్తిగా భావించి పూజించేవారు. వ్యవసాయం తెలియని స్థితిలో పురుషులు వేటాడి ఆహారం సంపాదించేవారు. స్త్రీలు గృహమందే ఉండి సంతానాన్ని చూసుకొంటూ, గృహపరిసరాల్లో ఉండే గింజలను, ఫలాలను పోగుచేసేవారు. ఆ తర్వాతికాలంలో గృహపరిసరాల్లోనే గింజలు చల్లి ఆహారపు మొక్కలుపెంచేవారు. ఈ విధంగా స్త్రీల కృషివల్ల లభించే ఆహారంపై ఆధారపడే సమాజం స్త్రీ ప్రధానమైన మాతృస్వామికంగా ఉండేది.

వేట, పశుపాలక వృత్తి కలిగిన సమాజం పురుష ప్రధానంగా ఉండేది. వ్యవసాయాన్ని అభివృద్ధి చేసే ఉద్దేశంతో నాగలి మొదలైన వ్యవసాయ పనిముట్లు కనిపెట్టబడి ఎద్దులతో పొలం దున్ని వ్యవసాయంచేసే స్థితికి చేరే వరకు స్త్రీ ప్రధానమైన మాతృస్వామికంగా ఉండే సమాజం వ్యవసాయాభివృద్ధి జరిగాక, పురుషప్రాధాన్యంతో పితృస్వామికంగా మారింది.[8]

ఇప్పటికీ కేరళలోని 'నాయర్' జాతి మాతృస్వామిక వ్యవస్థగానే ఉన్నది. ఈ నాయర్ సమాజంలోని సమిష్టి కుటుంబాలు వ్యవసాయంపై ఆధారపడి ఉన్నాయి. తల్లి 'కులమాత'గా ఏకైక హక్కుదారుగా ఉంటుంది. సంతానం తండ్రి ఇంటి పేరుతో కాక తల్లి ఇంటిపేరుతోనే గుర్తింపబడతారు. వివాహమయ్యాకకూడ స్త్రీలు పుట్టింట్లోనే ఉంటారు. భర్త భార్య దగ్గర కొన్ని రోజులు గడిపి వెళుతుంటాడు.[9] ఎహిరెన్ ఫిల్సు నాయర్ల జీవన విధానాన్ని, ఆచార వ్యవహారాల్ని పరిశీలించి, హరప్పా, మొహెంజదారో అవశేషాలు ఆధారంగా ఆనాటి ప్రజలకు, నాయర్ల జీవనవిధానానికి పోలికలున్నాయని నిరూపించాడు.[10]

వ్యవసాయం తెలియక పశుపాలనతో జీవనం సాగించే వారిది పితృస్వామిక వ్యవస్థ. దీనికి ఉదాహరణ నీలగిరి కొండలలోని 'తోడా' జాతివారి జీవనవిధానమే. వీరిది తండ్రిపరంపర సంతానం తండ్రి వంశమునకు చెందుతుంది. తండ్రి సంపదపుత్రునికి సంక్రమిస్తుంది. వీరికి వ్యవసాయ జ్ఞానంలేదు.

ఈవిధంగా 'నాయర్' 'తోడా' అనే ఆటవిక జాతుల జీవనం విధానాలను బట్టి పశుపాలనచేసే వారిది పితృస్వామిక వ్యవస్థ. వ్యవసాయం చేసే వారిది మాతృస్వామిక వ్యవస్థ అని తెలుస్తున్నది.

ఇనుము కనిపెట్టబడడంతో అనాగరిక దశ అంతమై నాగరికదశ ఆరంభమయ్యింది. నాగలి మొదలైన వివిధ రకాల వ్యవసాయ పనిముట్లుతో వ్యవసాయం చేయటం ప్రారంభించాక, పంటలకు అనువైన ప్రాంతాలలో స్థిరనివాసమేర్పరచుకొని, అనేక సమాజాలు మాతృస్వామిక వ్యవస్థనుండి పితృస్వామిక వ్యవస్థకు మారినవి. అయినా మాతృస్వామికి వ్యవస్థ ప్రభావం పూర్తిగా రూపుమాసిపోలేదు.

ఆర్యులు మొదట పశుపాలకులుగా పితృస్వామిక వ్యవస్థను కలిగియున్నా, వ్యవసాయాన్ని వృత్తిగా స్వీకరించాక, వ్యవసాయ దేవతలను స్త్రీ దేవతలుగానే పూజించారు. వేదాలలోను, పురాణాలలోను, ప్రాచీన గ్రంథాల్లోనూ వ్యవసాయ ప్రసక్తి వచ్చినపుడు వ్యవసాయదేవతలు స్త్రీ

దేవతలుగా పేర్కొనబడ్డారు.

వేదాల్లో కనిపించే ఉష ఇళ, సరస్వతి, అదితి, ఆప, పృథ్వి మొదలైన స్త్రీ దేవతలంతా పురుషదేవతల ప్రియురాళ్లగానో, భార్యలుగానో, కుమార్తెలుగానే కన్పిస్తారు. ఋగ్వేదంలో ఉషను అనేక మంత్రాలతో సన్మానిస్తారు. ఉషయే సకల జనన మరణాలకు, నాశనానికి, రక్షణకు మూలం. ఇళా ఆర్యులదేవత. ఇళా అనగా అన్నం. అన్నం మానవునికి అతిముఖ్యమైన ఆహారం కనుక ఇళా దేవతగా రూపొందింది[11] అలాగే ఆప కూడ ఆప అనగా నీరు.

గోభిల సూత్రంలో వ్యవసాయానికి సీత, ఆశ, అరద, అనఘ అను స్త్రీ దేవతలు ఉదహరింపబడ్డారు. 12

సంతానాన్ని సృష్టించే స్త్రీ వ్యవసాయాన్ని సంపదను అధికం చేస్తుందని మాతృస్వామిక వ్యవస్థలో నమ్మకం. వ్యవసాయాన్ని కనిపెట్టింది కూడ స్త్రీలే అవ్వటం వల్ల, దున్నటం, దమ్ము చేయడం మొదలయిన కార్యక్రమాలు పురుషులు చేసినా, విత్తనాలు చల్లటం, వరిని నాటటం మొదలైన కార్యక్రమాలు స్త్రీలే చేస్తారు. వ్యవసాయారంభంలో స్త్రీ శక్తిస్వరూపిణిగా మారింది. స్త్రీ ప్రకృతికి మారు రూపమని, సృష్టికి మూలమనే వాదంతోనే సాంఖ్య, తంత్ర శాస్త్రములు కూడ ప్రకృతిని స్త్రీరూపంగానే ఆరాధిస్తున్నాయి.

పశుపాలకులు, యుద్ధోపజీవులు అయిన ఆర్యులదేవతలుపురుష దేవతలు. అయితే ఆర్యులు భారతదేశంలో స్థిరనివాసమేర్పరచుకొని వ్యవసాయ వృత్తి అవలంబించాక, మాతృస్వామిక ప్రభావంవల్ల వారి వ్యవసాయ సంస్కృతి నుండి, కాళిక, దుర్గ, ఆదిశక్తి మొదలైన స్త్రీమూర్తులు ఉద్భవించారు.

వ్యవసాయ ప్రధాన జీవులకు సఫలత ముఖ్యం మాతృదేవతారాధన, బలుల నొసగుట, ప్రాథమిక వ్యవసాయ జీవనంలోని సఫలతను ఆరాధించు విధానములని తెలుస్తున్నది. వ్యవసాయాభివృద్ధి జరిగాక, ప్రాచీన మానవులు సంచార జీవనం మానుకొని, గ్రామాలు నిర్మించుకొని, స్థిరనివాసమేర్పరచుకున్నాక మాతృదేవతారాధన గ్రామదేవతారాధనగా రూపొందింది.[13]

'మాతృస్వామిక వ్యవస్థాప్రభావం, స్త్రీయే వ్యవసాయ ఆరంభకురాలగుట, సఫలతకు స్త్రీయే ఆధారమను అభిప్రాయమేర్పడుట, ఆమె సృజనాత్మకశక్తి స్వరూపిణి అను భావములు ప్రబలుట, గ్రామదేవతల ఆవిర్భావమునకు, రూపకల్పనకు, ఆరాధనకు ముఖ్యకారకములైనవి'.[14] గ్రామదేవత వ్యవసాయ సఫలతకు కారణమనుభావం ప్రజలలో ప్రబలి ఉందనటానికి కారణం నేడు గ్రామదేవతల ఉత్సవాలలో నిర్వహించే ఆచారాలే నిదర్శనం.

దేవతకు బలియిచ్చిన జీవి ( జంతువు లేక పక్షి) రక్తాన్ని ముండిగలోపట్టి, నవధాన్యాలుపోసి, అయిదవ రోజుతీసి వాటిలో మొలకెత్తిన విత్తనాలనుబట్టి ఆ సంవత్సరం ఆ పంట బాగుగా పండునని భావించడం, పొలంలో విత్తనాలు చల్లటానికి ముందు దేవతకు కొన్ని విత్తనాలు నివేదించి నమస్కరించటం, నాట్లువేసాక, చేను పండటానికి ముందు 'పసరపండుగ' అనే పేరుతో గ్రామదేవత పండుగ చేయటం, పంటపండాక పంట జాతర చేయటం, పండిన ధాన్యాన్ని గుదులుగాకట్టి,

దేవతగుడి ముందు వ్రేలాడకట్టడం, చెరకు గానుగాడి వండిన బెల్లాన్ని ముద్దగా కర్రకు గుచ్చి దేవతకు సమర్పించటం, కొబ్బరి బొండాల్ని (పచ్చివి) దేవతకు సమర్పించటం మొదలైన గ్రామీణుల ఆచారాలన్నీ గ్రామ దేవత వ్యవస్థకు, వ్యవసాయానికి గల సంబంధాన్ని సూచిస్తున్నాయి.

గ్రామదేవతారాధనకు వ్యవసాయానికి గల సంబంధాన్ని ఉగ్గడిస్తూ – వైట్ హెడ్"Probably these villege dieties came into being at the form when the people began to settle down an agricultural families" అని అభిప్రాయపడెను. గ్రామదేవతలు స్త్రీ రూపులవ్వటానికి కారణThe idea of the fertility స్త్రీలకు సంబందించినది'[16] అని కూడ ఆయన తెలిపెను.

మాత్రాధికార స్థాపనమున అంతర్గతముగా స్త్రీకి పిల్లలను కనుటయందు, వారిని పెంచి, వారిపై వ్యామోహమును పెంచుకొనుటయందు ఒక కోరిక ప్రబలమై, ఆ కోరిక శక్తిగామారి అట్టి శక్తి యందలి మమకారము, అభిమానముల వలన ఆదిమ ప్రపంచమున తల్లి దేవత స్థానం స్థిరమై నిలిచి, ఆతల్లిదేవత నుండి గ్రామదేవత రూపముగా ఉద్భవించిందని'17 విలియం వూంటు అభిప్రాయము.

రిచర్డ్ ఎమ్. డార్సన్ జానపద మతమును జానపద సాంఘిక ఆచారమున చేర్చారు. ఈయన అభిప్రాయంతో ఏకీభవిస్తూ, డా. జి. యస్. మోహన్ 'సంఘంలోని వ్యక్తులు తమచుట్టునూ ఏవో కొన్ని అదృశ్య శక్తులు కలవని, విశ్వసించి ఒనర్చెడి విశేషమే జానపద మతము. జానపద మతమున ఒక అంశంగా గల గ్రామ దేవతారాధన ఈ విషయమును స్పష్టపరచుచున్నదో అని అభిప్రాయపడెను.

'గ్రామదేవతలు ముఖ్యంగా జానపదుల ఆరాధనా దేవతలు, మాంత్రిక, తాంత్రిక, అతీంద్రియ శక్తులేవో ఉన్నాయనీ, అవే సుఖదుఃఖాలకు మూలమనీ నమ్ముటయే గ్రామదేవతల పుట్టుకకు కారణం'[19].

వ్యవస్థను, ఆచారాన్ని, మతాన్ని, నమ్మకాన్ని బట్టి సాగిన పై నిర్వచనాలతో పాటు సంఘాన్ని గ్రామాన్ని దృష్టిలో ఉంచుకొని కూడ గ్రామదేవతను నిర్వచించిన వారున్నారు.

దేవత సంఘమునకు సంబంధించినదయితే, ఆ సంఘమునందలి ఐకమత్యమును సాధించుటకు, కనిపించని దేవతను ఆలంబనగా చేసుకొని తమ తమ జాతి యెడల అభివృద్ధిని సాధించే మానవ ప్రయత్నంలో భాగమే గ్రామదేవత ఆవిర్భావం'.[20]

'మనిషి ఒంటరివాడిగా, వేటగాడుగా బ్రతికినరోజుల్లో అతనికి గ్రామదేవత భావన ఉండే అవకాశంలేదు. క్రమంగా మనుషులు ఒక సమాజంగా ఏర్పడుతూ ఉంటే, ఈ సమాజం అనే భావన అమూర్తంకావటంతో అదేమిటో అంతుబట్టక, ఆ గ్రామమే ఒక దేవతగా వాళ్ల పురాగాథామభవంతో రూపుకట్టి ఉండవచ్చు'[21].

'మనుష్యుల్ని గ్రామంగా మార్చిన ఓ అదృశ్యశక్తి గ్రామదేవత' 'గ్రామ రక్షణ ఒక శక్తి లేదా దేవత పై ఆధారపడి వుందనే విశ్వాసం కూడా వుంది'[22]

ఆదిమ మానవుడు తనకు కలిగే ఆహారం లభించుటవంటి సుఖాలకు, రోగాల వంటి

కష్టాలకు కారణం ప్రకృతిలో ఉండే ఏదో ఒక అదృశ్యశక్తి అని భావించి, బాల్యంలో తనకు పాలిచ్చి, లాలించి, అక్కున చేర్చుకున్న తల్లితో పోల్చుకొని, ఇరువురికీ గల సామ్యాన్నిబట్టి పూజించటం మొదలుపెట్టి ఉంటాడు. నాగరికత పరిణామ దశలో స్థిరనివాస మేర్పడి, గ్రామ వ్యవస్థ ఏర్పడడంతో ఆ అదృశ్యశక్తే గ్రామదేవతగా మారింది.

## గ్రామదేవతల లక్షణాలు

గ్రామదేవతల లక్షణాలను స్థూలంగా డా. నాయనికృష్ణకుమారిగారు ఈ క్రిందివిధంగా వివరించారు.

1. ఈమె యతిభయంకర స్వరూపిణి, చతుర్భుజిగా చిత్రింపబడిన యీ యమ శూల, కపాల గదాఖడ్గహస్త లంబ జిహ్వాకయగు ఈమె వికటదంతయు, విస్ఫారితనేత్రయు కరాళ వదనయునై, భయమును కలిగించుచుండును.
2. ఈమెకు బలి జంతు మాంసఖాదనమున, రక్తపానమున ఆసవసేవనమున ప్రీతిమెండు.
3. మానవుడీమెను భక్త్యావేశముకన్న, భయవివశతతోడనే కొలువబూనును.
4. తమ్ము మరచిన జనులను కష్టములపాల్జేయుటయు, రోగముల బారివడవేయుటయు ఈమెకు ప్రీతి.
5. పాలితజనముపై ఈమెకు సంతానబుద్ధి యుండటచే ఈమె జగద్ధాత్రి.
6. భక్తులకోరికపై నీమె గ్రామములను పరిరక్షించును. చెలరేగిన అంటువ్యాధులను అదుపున బెట్టును. పశువులను, జనులను పీడ నుండి గ్రహబాధనుండి, శత్రువులనుండి కాపాడును. ఊరి పొలిమేరలను, పంటపొలములను, చెరువు కట్టలను రక్షించును.
7. ఊరియందు వేపచెట్టు క్రిందను, త్రాచుపుట్టల యందును నెల్కొనియుండును. కేవల నాగరూపమున ఈమె జానపదులచే నర్చింపబడుట కలదు.[24]

ఈ లక్షణములలో మొదటిది అందరి దేవతలకు వర్తించదు. విభిన్నరూపాలలో గ్రామదేవతలు కన్పిస్తారు.

## గ్రామదేవతలు - శిష్టదేవతలు

సృష్టిలోని సమస్తవస్తు సమాదాయం వాటి స్వరూప స్వభావాలను బట్టి వర్గీకరించ బడ్డట్లుగానే దేవతలు కూడ గ్రామదేవతలు, శిష్టదేవతలుగా, క్షుద్రదేవతలు, వైదికదేవతలుగా వర్గీకరింపబడ్డారు. ఈ రెండువర్గాల మధ్య తేడాలను ఈ క్రింది విధంగా క్రోడీకరింపవచ్చు.

| గ్రామదేవతలు | శిష్టసంస్కృతి దేవతలు |
|---|---|
| 1. ద్రావిడ సంస్కృతికి చెందినవారు. | 1. ఆర్యసంస్కృతికి చెందినవారు. |
| 2. గ్రామానికో, ప్రాంతానికో, కులమునకో, కుటుంబమునకో పరిమితమై ఉంటారు. | 2. వీరు విశ్వవ్యాప్తి కలవారు. |

| | |
|---|---|
| 3. వ్యవసాయమునకు, సఫలతకు చెందిన వారుకనుక స్త్రీలధికము | 3. యుద్ధమునకు, వేటకు చెందినవారు. కనుక పురుషులధికం. |
| 4. గ్రామదేవతల గుళ్లలో భర్తవిగ్రహం ఉండదు. పోతురాజు అంగరక్షకునిగా సహాయకునిగా సోదరుడుగా ఉంటాడు. | 4. శిష్టదేవతలలో స్త్రీ పురుష దేవతలు భార్యాభర్తలుగా ఉంటారు. |
| 5. గుడులు ఉండవచ్చు, ఉండకపోవచ్చు చెట్టునో, పుట్టనో, చెట్టు కింద రాయినో దేవతగా పూజిస్తారు. విగ్రహాలుంటే భయంకరంగానూ, సాత్వికంగానూకూడ ఉంటాయి. | 5. ప్రత్యేకమైన ఆలయాలుండి, సుందర శిల్పాలతో విగ్రహాలుంటాయి. |
| 6. పూజారులుగా చాకలి, కుమ్మరి, ఆసాది, పంబల వంటి నిమ్నజాతులవారుంటారు.వైదిక ప్రభావం మిక్కుటంగా ఉన్నచోట్ల బ్రాహ్మణులు కూడ పూజారులుగా ఉండవచ్చు. | 6. బ్రాహ్మణులే పుజారులుగా ఉంటారు. నిమ్నజాతులకు ఆలయ ప్రవేశమే ఉండక పోవచ్చు. |
| 7. వ్యాధులు, అనారోగ్యం, ప్రబలినపుడో 3,5 సంవత్సరములకొకసారో, పంట సమయంలోనో ఆరాధించటం ఎక్కువ. సంవత్సరానికొక్కసారి ఆరాధన జరిగే దేవతలు కూడ ఉన్నారు. | 7. నియమితకాలంలో సంవత్సరాని కొకసారి ఆయా తెలుగు మాసాలలో, తిథులలో ఆరాధిస్తారు. కొందరికి నిత్య ధూపదీప నైవేద్యాలు సమర్పించటం కూడ కలదు. |
| 8. వ్యాధులను తొలగించేవారుగా పంటలను రక్షించి కాపాడేవారుగా పూజింప బడతారు. | 8. బ్రహ్మ, విష్ణు మహేశ్వరులు సృష్టిస్థితి లయకారులుగా పూజింపబడతారు. |
| 9. బలులు, మద్యమాంసాదులుతోపాటు పిండి వంటలు కూడ నైవేద్యమర్పిస్తారు. | 9. ఫలపుష్పములు పిండి వంటలు నైవేద్యమర్పిస్తారు. |
| 10. ఆరాధన సమయంలో మాతృభాష యందలి దండకములు, గేయములు, ద్విపదలు చదువుతారు. | 10. సంస్కృత శ్లోకములు, మంత్రములు, అష్టోత్తర, శతసహస్రనామములు, అష్టకములు చదువుతారు. |
| 11. అనాదరిస్తే రోగములు కలిగిస్తాదనే, భయంతోనూ, పంటలు పండింపచేస్తాదనే కృతజ్ఞతతోనూ కొలుస్తారు. | 11. ఆధ్యాత్మిక భావంతో, భక్తితో ముక్తికోసం కొలుస్తారు. |
| 12. జానపద సంప్రదాయాలతో, మూఢనమ్మకాలతో కొలుస్తారు. | 12. శిష్టసంప్రదాయాలతో మూఢనమ్మకాలు లేకుండా కొలుస్తారు. |
| 13. ఊరి చివర గుడులుంటాయి. ఊరు పెరిగిన తర్వాత ఊరి మధ్యలో | 13. ఊరి మధ్యలో గుడులుంటాయి. |

గుడులున్నట్లు అనిపిస్తుంది.

| | |
|---|---|
| 14. అనాగరికులెక్కువగాను, నాగరికులు తక్కువగాను కొలుస్తారు. | 14. నాగరికులెక్కువగా, అనాగరికులు తక్కువగా కొలుస్తారు. 25 |

## అధస్సూచికలు

1. తెలుగు జానపద గేయగాథలు, నాయని కృష్ణకుమారి, 1977 - పుట 12 నుంచి ఉటంకింపబడింది.

2,3. - పైది -

4. Indus Vally Civilization John Marshall.

5. ఋగ్వేదఆర్యులు, రాహుల్ సాంకృత్యాయన్ - 1979.

6. Mother Right in India; p.7

7. Ibid, p. 101

8. తెలుగు జానపద సాహిత్యం పురాగాథలు, రావి ప్రేమలత - 1983 - పుట 163.

9. ఈనాడు దినపత్రిక (24-1-88)

10. Mother Right in India; p. 179 - 188

11. ఋగ్వేదఆర్యులు, రాహుల్ సాంకృత్యాయన్

12. గోభిల సూత్రం 4 - 28

13. తెలుగు జానపద సాహిత్యం - పురాగాథలు, రావి ప్రేమలత, 1983 - పుట 169.

14. - పైది -

15. Village Gods of South India; 1921.p.16

16. Ibid.

17. Element of Folk psychology

18. జానపద విజ్ఞాన వ్యాసావళి, జి.యస్. మోహన్ - పుట 116

19. వ్యాసద్వాదశి, ద్వా. నా. శాస్త్రి, 1991 - పుట 84

20. 'గ్రామదేవతలు' వ్యాసం, కోటి సూర్యనారాయణమూర్తి.

21. కృష్ణాజిల్లా గ్రామదేవతలు - పురాగాథా పరిశీలన - ఆర్. రవీంద్రబాస్ లఘు సిద్ధాంతవ్యాసం - 1987 - పుట 25.

22. -పైది - పుట 26.

23. వ్యాసద్వాదశి, ద్వా.నా. శాస్త్రి - 1991 - పుట 84.

24. తెలుగు జానపద గేయగాథలు, నాయని కృష్ణకుమారి - 1977 - పుట 189 - 190.

25. తణుకు తాలూకా గ్రామదేవతలు, ముత్యాలసంధ్య, లఘుసిద్ధాంత వ్యాసం.

### తృతీయ ప్రకరణం

# తూర్పుగోదావరిజిల్లా గ్రామదేవతలు

## స్వరూప స్వభావాలు

ఆదిమ మానవుని ఆలోచనాసరళిలో మొదలయిన ఆత్మారాధన, తర్వాతిదశలో మాత్రారాధనగామారి, మాతృస్వామిక వ్యవస్థ ప్రభావంవల్ల, స్త్రీయే వ్యవసాయ ఆరంభకురాలగుట వల్ల, ఆమె సఫలతకు సృజనాత్మకతకు మూలమనుభావం ప్రబలుటవల్ల ప్రాచీన మానవులు సంచార జీవనం మానుకొని, గ్రామాలు నిర్మించుకొని, స్థిరనివాసమేర్పరచుకున్నాక ఈ మాత్రారాధన గ్రామదేవతారాధనగా మారినది.

గ్రామమయ దేశమైన భారతావనిలో లక్షలాది గ్రామాలున్నాయి. ఆంధ్రదేశంలో కూడా వేలాది గ్రామాలున్నాయి. ప్రతీ గ్రామానికి దేవత ఉంటుంది. తూర్పు గోదావరిజిల్లా గ్రామదేవతలను పరిశీలించిన పిమ్మట గ్రామగ్రామానికి ఉండే గ్రామదేవతల స్వరూపస్వభావాలను ఈవిధంగా పేర్కొనవచ్చును.

1. ప్రతీగ్రామానికి గ్రామదేవత ఉంటుంది. కొన్ని గ్రామాల్లో ఉండే గ్రామదేవత పుట్టుక గురించి ఆ గ్రామస్థులకే తెలియదు. గ్రామం పుట్టినప్పటినుంచి, గ్రామస్థులలో వయోవృద్ధులకుకూడ తెలియనంతటి పూర్వకాలం నుంచి దేవత ఉంటున్నదని చెబుతారు. ఈ విధంగా కొందరు మూలం తెలియని దేవతలుంటారు.

2. వివాహితులుగాగాని, అవివాహితులుగాగాని, అకాల మరణం పొందిన స్త్రీలు తమ సన్నిహితులకు ముఖ్యంగా తల్లిదండ్రులకు, కలలో కన్పించి, తాము దైవత్వం పొందామని, గుడికట్టించి, పూజించమని అడుగుతారు. ఆవిధంగా అవతరించి గ్రామస్థులచేత ఆరాధింపబడతారు. ఉదా : సామర్లకోట, పసుపులమ్మ, సీతపల్లి గడిబాపనమ్మ, మారెమ్మ, నేరెళ్లమ్మ - మొదలైనవారు. తర్వాతికాలంలో వీరు ఇతర గ్రామాలకు, ఇతర ప్రాంతాలకు వ్యాపించి, పూజలందుతారు. జానపద మాతృదేవతలను పరిశీలించిన యెడల, ఒక్కొక్క దేవత ఒక్కొక్క ప్రదేశమునకో, కులమునకో, సంబంధించినదై వెలసి, తదుపరి ప్రాచుర్యమునొంది, దేశమునలుమూలల నుండి యేతెంచెడి వ్యక్తులచే పూజింపబడుట కన్పించును.'[1]

3. ప్రజలవలె ఒక గ్రామం నుంచి వలస రావడంగాని, వలసపోవడంగాని గ్రామదేవతల సామాన్య లక్షణం. ఒక గ్రామం నందలి ఒక కుటుంబీకులు వేరొక గ్రామం వలస వెళ్ళినపుడు, వారితోపాటు ఆ గ్రామదేవతకూడ వలస వెళ్లడం కనిపిస్తుంది. అంతేకాక ఒక గ్రామంలో వేడుకసరిగా జరగలేదనో, తన్ను సరిగా ఆరాధించలేదనో కోపగించి, గ్రామదేవతలు ఒక ఊరి నుంచి, వేరొక ఊరికి వలస వెళ్లడం, వలస వెళ్లిన గ్రామదేవతను ఆ గ్రామస్థులు బ్రతిమాలి తీసుకొని రావడం కూడ జరుగుతుంది.

4. చెరువులు, నూతులు తవ్వుతున్నప్పుడు ఏవో కొన్ని ప్రతిమలు, రాళ్లు బయల్పడి, తర్వాత ఆఇంటి వారి మీద దేవతపూని, తాను ఫలనా దేవతనని ( తన పేరు చెపుతుంది) తనకు గుడి కట్టించి, పూజించమని అడుగుతుంది. ఈ జిల్లాలోని ఆయా గ్రామాల్లోని గ్రామదేవతలు ఎక్కువమంది ఈవిధంగా వెలసినవారే.

5. ఒకే దేవత విభిన్నగ్రామాల్లో పూజింపబడుతుంది. ఒక్కొక్క దేవత ఒక ప్రాంతానికో, కులానికో సంబంధించినదై వెలసి, తర్వాత ప్రాచుర్యం పొందడం వల్ల, గ్రామదేవతలు వలస వెళ్లడం వల్ల ఇది సహజమే. ఉదా : నూకాలమ్మ, కాంద్రకోట, పిఠాపురం, లింగంపర్తి, చింతలూరు మొదలైన గ్రామాల్లో దేవతగా పూజింపబడుతుంది. అలాగే చాలామంది దేవతలు ఒకచేకంటే ఎక్కువ గ్రామాల్లో వెలసి, పూజింపబడుతున్నారు.

6. ఒకే గ్రామంలో విభిన్నదేవతలు ఉంటారు. ఉదా : పిఠాపురంలో నూకాలమ్మ, మరిడమ్మ, పైడితల్లమ్మ, ముత్యాలమ్మ, కోటసత్తెమ్మ, మారెమ్మ, మొదలైన దేవతలున్నారు. అలాగే, ఇతర గ్రామాల్లోకూడ ఒకటికి మించి దేవతలుండడం కనిపిస్తుంది.

7. గ్రామదేవతలలో ఎక్కువమంది గ్రామానికంతటకీ ప్రాతినిధ్యం వహిస్తారు. కొంతమంది ఆయా వీధులకే పరిమితమవుతారు. ఒకటికి మించి దేవతలున్న గ్రామాల్లో ఆయా వీధులలో ఆయాదేవతలు వెలసి పూజింపబడతారు. ఒక వీధిలోని దేవత గురించి, ప్రక్కవీధిలో వారికి తెలియకపోవచ్చు. కొంతమంది దేవతలు ఒక గ్రామానికే కాక, ఒక ప్రాంతపు ప్రజలందరిచేత పూజింపబడతారు. ఉదా. ఈ జిల్లాలోని కొత్తపేట మండలం వానపల్లి గ్రామంలో వెలసిన పల్లాలమ్మను కోనసీమ ప్రజలందరూ ఆరాధ్యదైవంగా పూజిస్తారు. కొంతమంది దేవతలు జిల్లా ప్రజలందరిచేత పూజింపబడతారు. ఉదా నూకాలమ్మ, మరిడమ్మ, వీరిరువురు అంటువ్యాధులకు అధిదేవతలవ్వటంవల్ల ఈ జిల్లా వారిచేతనేకాక, పొరుగు జిల్లాల వారిచేతకూడ పూజింపబడతారు. కొందరు దేవతలు కేవలం జిల్లా ప్రజలచేత మాత్రమేకాక, సుదూర ప్రాంత వాసులచేతకూడ పూజింపబడతారు. వీరు వెలసిన ప్రాంతమే దీనికి కారణం. జాతీయ రహదారి, జిల్లా రహదారి ప్రక్కన వెలసిన దేవతలు ఎక్కువ మందిచేత ఆరాధింపబడతారు. ఉదా : లోవలో తలుపులమ్మ, గడిబాపనమ్మ.

8. నామవైవిధ్యం, రూపవైవిధ్యం కూడ గ్రామదేవత ల లక్షణాల్లో కనిపిస్తుంది. నామసామ్యమున్న దేవతలకు రూపసామ్యముండకపోవచ్చు. రూపసామ్యమున్న దేవతలకు నామ సామ్యముండకపోవచ్చు. ఈ నామ, రూప వైవిధ్యాల గురించి ముందు క్షుణ్ణంగా వివరిస్తాను.

9. ఒకే దేవత వేరువేరు గ్రామాల్లో వేరువేరు ప్రయోజనాలకోసం పూజింపబడుతుంది. ఉదా : 'కొత్తమ్మ' ను కోటనందూరు మండలం తిమ్మరాజుపేట గ్రామంలో సాధారణ గ్రామదేవతగా సంవత్సరానికొకసారి పూజిస్తారు. కాని బిక్కవోలు మండలం బలభద్రపురం గ్రామంలో మనుష్యులకు పశువులకు వచ్చేవ్యాధులు పోగొట్టమని, ఆ వ్యాధులు వచ్చిన సందర్భంలోనే కొలుస్తారు.

అదేవిధంగా గంగాలమ్మను, వన్నెపూడి, సిరిపురం, మన్యం ప్రాంతాలలో సాధారణ గ్రామదేవతగా ఏడాదికొకసారి కొలుస్తారు. లింగంపర్తి గ్రామంలో వర్షాల కోసం, వర్షాలు కురవని సంవత్సరమే కొలుస్తారు.

10. గ్రామదేవతలకు ప్రాంతాన్నిబట్టి పూజావిధానం మారుతుంది. ఆచారాలలో, విశ్వాసాలలో ప్రాంతీయతాభేదం కనపడుతుంది. తీరప్రాంతంలో, మెట్టప్రాంతంలో, డెల్టా ప్రాంతంలో, మన్యం ప్రాంతంలో విభిన్నతరహాలో గ్రామాదేవతారాధన కనపడుతుంది.

11. గ్రామదేవతల స్వరూపాలుగా మట్టిఘటాలుగాని, లోహపు ఘటాలుగాని ఉంటాయి. ఈ ఘటాలనే 'గరగలు' అంటారు. ఒక దేవత గరగలను, వేరొక దేవతకు వాడడం కూడ ఉంది.

12. గ్రామదేవత గ్రామస్థులపై పూని, తమ కోర్కెలను తీర్చమని అడగటం జరుగుతుంది. సాధారణంగా ఉత్సవ సమయాలలో ఉత్సవం జరగవలసినంత వైభవంగా జరగనిచో, దేవతలు ఆయా వ్యక్తులపై, ముఖ్యంగా గణాచారులపై పూని, తమ కోర్కెలను, కోపతాపాలను తెలియ చేస్తారు. పూనిన వ్యక్తిని కూడ దేవతగానే భావించి, ప్రజలు భయభక్తుల్ని ప్రదర్శిస్తారు.

13. గ్రామదేవతలకు పూజారులుంటారు. ఎక్కువగా స్త్రీలే పూజారులుగా ఉంటారు. ఈ పూజారులు మరణించిస్తే, వారికి కూడ దైవత్వమారోపించి, దేవత గుడిప్రక్కన గుడికట్టి ఆరాధించిన సందర్భాలుకూడ ఉన్నాయి.

    ఉదా : ఏలేశ్వరం మండలం తిరుమాలి గ్రామంలో నేరేళ్లమ్మ పూజారిణి మరణిస్తే, ఆమెకు కూడ గ్రామదేవత గుడి ప్రక్కన గుడి కట్టి, ఆమెతోపాటు, ఈమెను కూడ పూజిస్తున్నారు. ఈమెను 'పూజారమ్మ' అంటారు.[2] అదేవిధంగా కొత్తపల్లి మండలం ఉప్పాడగ్రామంలో 'పిఠాదచ్చయ్య' అనే గ్రామదేవత పూజారి మరణించినపుడు, అతనికికూడ గుడికట్టి పూజిస్తున్నారు.[3]

14. గ్రామదేవతలందరికీ, అంగరక్షకుడుగా, లేక సోదరుడుగా భావింపబడే పోతరాజు ఉంటాడు.

15. గ్రామదేవతలకు పుట్టింటివారు, అత్తింటివారు కూడ ఉంటారు. అత్తింటి వారు అందరి దేవతలకు ఉన్నా లేకున్నా పుట్టింటివారు తప్పక ఉంటారు. గ్రామదేవతలు ఒక ఇంటి ఆడపడుచులో, లేక ఒక ఇంటివారి వెంట వలసరావడమో, లేక ఒక ఇంటి వారి పోలంలోనో, ఇంటిలోనో చెరువు, బావి మొదలైనవి త్రవ్వుచుండగా బయల్పడిన విగ్రహాలో అవ్వటం వల్ల ఆయాసందర్భాల్లో ఆ ఇంటివారే ఆ గ్రామదేవతకు పుట్టింటి వారవుతారు. గ్రామదేవత ఆరాధనలో ఈ పుట్టింటివారే ప్రధాన పాత్ర వహిస్తారు.

16. గ్రామదేవతలలో పాతదేవతలు (ముందు వెలసిన దేవతలు) మరుగునపడి, తరువాత వెలసిన దేవతలు ప్రసిద్ధికెక్కడం కూడ కనపడుతుంది. ఉదా : ఏలేశ్వరం మండలం లింగపర్తి గ్రామంలో వసంతాలమ్మ, నూకాలమ్మ, గ్రామదేవతలు. వీరిలో వసంతాలమ్మ ప్రాచీనమైనది. నూకాలమ్మ తర్వాతికాలంలో వెలసింది. కాని ఇప్పుడు నూకాలమ్మ సంబరం ఘనంగా,



ఇటీవల కాలములో నిర్మించిన
గ్రామదేవత గుడి



నల్లమారెమ్మ స్వరూపముగా
పూజింపబడుతున్న చిరతలు,
ఎదురుగా కొయ్యరూపంలో
పోతురాజు



దేవతస్వరూపముగా పూజింపబడు
తున్న వేపకఱ్ఱ మంచాలు



మర్లమ్మ దేవతగా పూజింప బడుతున్న మర్రిచెట్టు



సింహారూఢగా చిత్రీకరింపబడిన దేవత విగ్రహం



గ్రామదేవత స్వరూపముగా ఉన్న గాజులు తొడిగిన రాట

ఉత్సాహంగా చేస్తారు. .వసంతాలమ్మ సంబరం చేయించడం ఇంచుమించు మానేశారు.

## గ్రామదేవతలు - గుడులు

ఒక జిల్లా గ్రామదేవతల గురించి తెలుసుకొనేముందు, ఆ జిల్లాలోని వారి గుళ్లను గురించి తెలుసుకోవలసి యున్నది. గ్రామదేవతల గుళ్ళగురించి తెలుసుకొనేముందు, అసలు దేవాలయాలు ఆవిర్భావం గురించి పరిశీలించవలసి యున్నది.

'ఆర్యేతరులయిన మనదేశపు గిరిజనులు కొన్ని ఆత్మలు అడవుల్లో సంచరిస్తూ చెట్లలో నివాసం ఏర్పరచుకుంటాయని నమ్మేవారు. వ్యవసాయానికి గాని, నివాసానికి గాని కొంతమేరకు అడవుల్ని నరకి, ఆ ఆత్మలకు శాంతిజరిపి, వాటికి వేరే నివాసం చూపించే వారు. అందుకుగాను అడవిలో నిత్యం నీటి ప్రవహంగల ప్రాంతం సమీపంలో ఉండే చెట్లను వదిలేసేవారు. ఈవిధంగా మిగిల్చిన చెట్లు దగ్గర వేడుకలు జరిపితే, అడవిలో ఉండే ఆత్మలు ఆకర్షణకు లోనై అక్కడకి వచ్చి, శాశ్వతంగా స్థిరపడతాయని నమ్మేవారు, ఆ ఆత్మలే ఆ ప్రదేశానికి సంరక్షులని, భావించే వారు. వాటి సమ్మతిలేనిదే, వాటిని తృప్తి పరచనిదే ఏ కార్యం సాధించలేమని విశ్వసించేవారు. దీనినిబట్టి ఒక ప్రాంతాన్ని ఎన్నుకొని తాము నమ్మిన అధిమానవశక్తులకు స్థిరనివాసమేర్పరచారనవచ్చు.[4]

ఈవిధంగా ఒక్కో ప్రదేశం, ఒక్కో దేవతకు నివాసమయ్యేది. రానురాను దేవాలయాలకు కొండప్రాంతాలను కూడ ఎన్నుకున్నారు. మొట్టమొదటి దేవాలయాలు పందిళ్లమాదిరిగా ఉండేవి. ఆలయ నిర్మాణంలో శిఖరం, ధ్వజస్తంభం లాంటివి కాలక్రమంలో చేరాయి. పూర్వం కొలిచిన దేవతలకు అరణ్యాలేస్థానం అవ్వటంవల్ల, పూజా విధానాల్లో దైవవిగ్రహాలను పూలమాలలతో అలంకరించటం జరిగింది.'[5]

ఇక గ్రామదేవతలగుడుల విషయానికి వస్తే, చాలామంది దేవతలకు గుడులుండవు. కేవలం చెట్టునో, చెట్టుమొదలురాయినో దేవతగా భావించి పూజిస్తారు. కొంతమంది గ్రామదేవతలకు గుడులున్నా అవి వైదిక దేవతల గుడుల కంటె భిన్నంగా చిన్నవిగా ఉంటాయి. 'గ్రామదేవతల గుళ్ళ దేశవ్యాప్తంగా ఒకేరకంగా ఉన్నాయి.[6]

సాధారణంగా గ్రామదేవతల గుడులు అయిదారు అడుగుల ఎత్తు, అంతే వెడల్పు, పాడవులు కలిగి ఉంటాయి. ఇంతకంటే చిన్నసైజా గుడులు కూడ కనపడతాయి. నాగరికతా సంపర్కం అధికమైన పెద్దగ్రామాల్లోనూ, పట్టణాల్లోనూ వైదిక దేవతల గుడులను పోలిన పెద్దగుడులు కూడ కనపడతాయి. గ్రామ ప్రాంతాలలో వేప, మఱ్ఱి, రావి మొదలైన చెట్లక్రింద, చెరువు కట్టలమీద కూడ ఈ గుడులున్నాయి. గ్రామదేవతలగుడులలో కొన్నింటికి తలుపులుండవు. గుడికెదురుగా రాయి, కొయ్య, లేక చెట్టు రూపంలో పోతురాజు ఉంటాడు. ప్రధాన రహదారి ప్రక్కన, ప్రధానవీధులలో కూడ గ్రామదేవతల గుడులున్నాయి. రాజమండ్రిలో రైల్వేస్టేషన్‌కు ఎదురుగా కన్నమ్మ పేరంటాలు గుడి ఉన్నది.

గుడి ఆకారాన్నిబట్టి అది ఏ దేవత గుడో చెప్పడం కష్టం. చాలా గ్రామాలలో పండుగరోజులలో తప్ప, గుడితలుపులు బిగించి ఉంటాయి. ఈ తాళాలు [illegible]

స్థానిక పరిస్థితులు వల్ల ఒకే దేవతకు ఒకే గ్రామంలో రెండు గుడులుండడంకూడ కలదు. ఉదా : గొల్లప్రోలు గ్రామంలో గ్రామదేవత నూకలమ్మకు రెండుగుడులున్నాయి. గ్రామస్థులలో వచ్చిన తగాదాలవల్ల, వారు రెండు వర్గాలుగా చీలి, ఒక్కొక్క వర్గం ఒక్కో గుడికి వెళతారు.

మారేడుబాక గ్రామంలో మామిళ్లమ్మకు కూడ రెండుగుళ్లు ఉన్నాయి. ముందు వెలసిన దేవతను పాతమామిళ్లమ్మ అని, వెనుక వెలసిన దేవతను కొత్త మామిళ్లమ్మ అని పిలుస్తారు.

అయినవిల్లిమండలం తొత్తరమూడి గ్రామదేవత మురుగులమ్మకు కూడ ఆ గ్రామంలో రెండుగుడులున్నాయి. ఆ దేవత ఆ గ్రామంలో వెలసినప్పుడు, తనకు రెండుగుడులు కట్టమని చెప్పింది. దేవత చెప్పినట్లే రెండు గుడులుకట్టి ఆమెను ఆరాధిస్తున్నారు.

## గ్రామదేవతల రూపవైవిధ్యం

గ్రామదేవతల రూపంలో వైవిధ్యం కన్పిస్తుంది. ఎక్కువ మంది దేవతలకు రూపమే ఉండదు. చెట్టునో, చెట్టుకింద రాయినో దేవతగా భావించి పూజిస్తారు. సాధారణంగా మర్రి, వేప, తాడి, రావి మొదలైన చెట్లను దేవతగా భావించి పూజిస్తారు. చెట్టు మొదట పసుపు వ్రాసి, బొట్లు పెడతారు.

మన్యం ప్రాంతంలో 'కుండ'నే దేవతగా భావించి పూజిస్తారు. అరణ్యంలో కొండవార 'పెద్దకుండ' ను ఉంచి దేవతగా భావిస్తారు. సంవత్సరానికొకసారి జరిగే పండగకు ఈ కుండను తెచ్చి గ్రామంలో నిలుపుతారు. పండగ అయిన తరువాత కుండను కొండవార పెడతారు. ఈవిధంగా దేవతకు ప్రతీకగా కుండను ప్రతిష్టించుటకు 'కారణము సఫలతయే'7 వై. రామవరం మండలం నులకమద్ది గ్రామంలో 'పిరంగి కత్తులను అమ్మవారు స్వరూపంగా భావించి కొలుస్తారట. ఈ స్వరూపం ఫోటో తీద్దామని నేను వెళ్లినపుడు అప్పటి ఈ రూపంలేదు.

పిఠాపురం మండలం కుమారపురం గ్రామంలో చిలుతలను ( వ్యవసాయ పనిముట్లుగా వాడే చిన్నకర్రలు) దేవతగా పూజిస్తారు. ప్రతి సంవత్సరం కొత్త చిలుతలను చేయించి వాటికి కలుపుతారు. ఈ చిలుతలే అమ్మవారి స్వరూపంగా భావిస్తారు. ఇదే గ్రామం లో 'రాట'ను భూమిలో పాతి, దానికి గాజులు తొడిగి, పసుపు కుంకుమ అంటించి దేవతగా పూజిస్తున్నారు.

మంగితుర్తిగ్రామంలో 'మశానమ్మ 'అనేకులదేవతను గోడకు పసుపువ్రాసి, కుంకుమబొట్లు పెట్టి, దేవత స్వరూపంగా భావించి కొలుస్తారు. మన్యప్రాంతమైన 'లోదొడ్డి' గ్రామంలో కూడ గోడకు పసుపు పూసి, కుంకుమ బొట్లు పెట్టి దేవతా స్వరూపంగా పూజిస్తున్నారు.

కోటనందూరు మండలం బాపభూపాలపట్నం గ్రామంలో దేవతకు గుడికాని, విగ్రహంకాని ఉండదు. ఊరిచివర పొదలో చిన్నచిన్నరాళ్లు, చిన్నచిన్న మంచాలు రూపంలో ఉంటుంది. ఏడాదికొకసారి అమ్మవార్ని ఊరిలోనికి తీసుకొచ్చి, సంబరం చేసి పంపుతారు. కుండలలో నైవేద్యం పెట్టి, ఆకుండలను వేపకర్రతో చేసిన మంచాల మధ్య పెట్టి ఆ మంచాలను అమ్మవారి నివాసస్థలమైన పొదలో వదలివస్తారు. కాని అమ్మవారి పేరుతో గ్రామమధ్యలో వేపచెట్టు ఉంది. సంవత్సరం పొడుగునా జున్ను మొదలైన పదార్థాలను ఆ చెట్టుకే నివేదిస్తారు.

దీనినిబట్టి గ్రామీణులు దేవతకు స్పష్టమైన, పరిపూర్ణమైన ఆకారాన్ని ఇవ్వలేదనవచ్చును. నాగరికతావాసన అంతగాలేని మారుమూల గ్రామాల్లో ఇప్పటికింకా విగ్రహాలు లేకుండానే దేవతను కొలుస్తున్నారు. ఆదిమ మానవుడు ప్రకృతిలోని వివిధ చెట్లను, పుట్లను ఆత్మలు ఆశ్రయిస్తాయని భావించి, అట్టి ఆత్మలను ఆరాధించటంవల్ల, ఆఆత్మారాధన తర్వాత దశలో దేవతారాధనగా మారటం వల్ల దేవతకు సంపూర్ణ ఆకారం ఇవ్వటమనేది ఇటీవలకాలం నాటిదే అనవచ్చును.

సాధారణంగా ఎక్కువమంది గ్రామదేవతలు సామాన్య స్త్రీ రూపంలో ఉంటారు. వీరిలో కొందరు సాత్త్విక రూపులు, కొందరు భయంకర రూపులు. 60,70 సంవత్సరాలకు పూర్వం నిర్మింపబడ్డ గుడులలోని దేవతా స్వరూపులు భయంకరులుగానే చిత్రింపబడ్డారు. వీరిలో కొందరికి కోరలు, మెడలో తలకాయలదండకూడ ఉన్నాయి. ఆ తలకాయలు గ్రామమునందలి దుష్టశక్తులవని, వాటిని చంపి, ఆ తలకాయలను దండగా గుచ్చి, మెడలో వేసుకున్నదని గ్రామీణులు భావిస్తారు. దేవతకు నాల్గుచేతులుంటాయి. ఆయా చేతులలో త్రిశూలం, కత్తి, సర్పంచుట్టబడిన ఢమరం, అక్షయపాత్ర ఉంటాయి. దేవతతలపై అయిదు శిరసుల నాగేంద్రుడు పడగ విప్పి ఉంటాడు. ఈ విధమైన దేవతా రూపం ఆదిమ మానవుని మానసిక స్థితికి ప్రతీక కావచ్చు. రక్షించే, శిక్షించే దేవతగా భావించిన ప్రాచీన మానవుడు ఈవిధమైన రూపాన్ని దేవతకు ఇచ్చాడనవచ్చును. సాధారణంగా దేవత ఎడమకాలుమడచి, కుడి, కాలి కింద నక్కనుకాని, మనిషినికాని తొక్కి పెట్టినట్లుగా పీఠంపై కూర్చుని ఉంటుంది.

ఏలేశ్వరం మండలం రాయవరం గ్రామంలో సత్తెమ్మ విగ్రహం ప్రత్యేకతతో ఉన్నది. పదహారు చేతులతో సింహారూఢయై ఆయాచేతులలో వివిధ ఆయుధాలతో పురాణాలలోని దుర్గాదేవిని పోలి ఉన్నది.

సాధారణంగా చెరువులు, బావులు తవ్వుతున్నప్పుడు బయల్పడిన ప్రతిమలను ఆయా చెట్లకింద నిలిపి, దేవతగా పూజిస్తారు. తర్వాత కాలంలో ఆదేవత పుట్టింటివారు లేక గ్రామస్థులు పూనుకొని, గుడికట్టించి, విగ్రహం కూడ వేయిస్తారు. గుడి కట్టడానికి ముందు చెట్టుకింద ఉండే రాతిప్రతిమలను కూడ దేవతా విగ్రహం పక్కనే ఉంచుతారు.

**పోతురాజు**

గ్రామ గ్రామానికి ఉండే దేవత ( గుడి ) కెదురుగా చిన్న కొయ్యోరాయో ఉంటుంది. అది ఏమటని గ్రామస్థుల నడిగితే ఆ కొయ్య లేక రాయి పోతురాజని దేవతకు సోదరు ( తమ్ముడు ) డని చెబుతారు. అసంఖ్యాకమైన దేవతలందరూ తమకు తోడుగా, తమ్ముడుగా పోతురాజుని తెచ్చుకున్నారని, గ్రామస్థుల నమ్మకం. గ్రామదేవతలకు సంబంధించిన కథలలో కూడ ఈతడు దేవతకు తమ్ముడుగానే వివరింపబడ్డాడు. కాని విశాఖ జిల్లా మన్యం ప్రాంతంలో పోతురాజును దేవతకు భర్తగా భావిస్తారు. 'ఈజిల్లాలోని **ముంచంగిపుట్** మండలం సుజనకోట గ్రామంలో జరిగే గంగాదేవి జాతరలో గంగాదేవికి పోతురాజుకు కళ్యాణం చేసి, ఆ దేవతల విగ్రహాలను ఇంటి నుంచి గుడికి తీసుకెళతారు.'[9] ప్రతి సంవత్సరం దేవతకు చేసే జాతరలో గిరిజనులలో దేవత మీద భక్తితోపాటు శృంగారవాసనలు కూడ మిక్కుటంగానే గుబాళిస్తాయి. ఆ సందర్భంలో వీరు

అసభ్యగీతాలు పాడడమే కాక, వావివరసలు మరచి అసభ్యంగా కూడ ప్రవర్తిస్తారు. ఈవిధమైన మనస్తత్వంతోనే దేవతకు పోతురాజుకు పెళ్లిచేశారనవచ్చును.

'విగ్రహం విషయానికి వస్తే, పోతురాజుది కొయ్య విగ్రహం. 3 అడుగుల పొడవు గల ఈ విగ్రహం ఒక చేతి యందు కత్తి, మరొక చేతిలో నిమ్మకాయ, తొమ్మిది గాజులు ఉండును. పాదాల వద్ద కోడిపుంజు బొమ్మలుండును'10 అని వైట్ హెడ్ పేర్కొనెను. కాని ఇలాంటి విగ్రహాలు ఈ జిల్లాలో ఎచ్చటా కన్పించలేదు. సాధారణంగా పోతురాజుకి గుడి కాని, విగ్రహం కాని ఉండదు. పైన చెప్పినట్లు గ్రామదేవత గుడి లేక విగ్రహం ముందుండే రాయి లేక కొయ్యను పోతురాజుగా భావిస్తారు. గ్రామదేవత జాతర సందర్భంలో జరిగే ఊరేగింపులో లావుపాటి వెదురు బొంగుకు చివర తెల్లటి గుడ్డ చుట్టి, దానిని పోతురాజుగా భావించి, ఊరంతా తిప్పుతారు. దీనిని 'ముదరగడ' అంటారు. కొన్ని గ్రామాల్లో ఈ 'ముదరగడ' కు చివర చెంబును బోర్లిస్తారు.

చాలా గ్రామాల్లో పోతురాజుకి విగ్రహం లేనప్పటికీ, ఉన్నచోట్ల వివిధ రూపాల్లో కన్పిస్తాడు. కోటనందూరు మండలం బలరాంపురం గ్రామంలో పోతురాజు నంది రూపంలో ఉన్నాడు. (ఈవిధమైన విగ్రహం వైదికమత ప్రభావం వల్ల కావచ్చు) ద్రాక్షారామ మండలం గొల్లపాలెం గ్రామంలో ధనమహాలక్ష్మి గుడి కెదురుగా ఉన్న తాడిచెట్టునే పోతురాజుగా భావిస్తారు. గొల్లప్రోలు మండలం విజయనగరం గ్రామంలో గ్రామదేవత పాదాలమ్మ గుడి కెదురుగా పోతురాజుకి కూడ చిన్న గుడి ఉన్నది. ఈ గుడిలో పోతురాజు సామాన్య పురుషరూపంలో పీఠమ్మీద కూర్చుని ఉన్నాడు.

గంగవరం మండలం రాజవరం గ్రామంలో కూడ గ్రామదేవత ఆరులమ్మ గుడి కెదురుగా పోతురాజుకి చిన్న గుడి ఉన్నది. ఈ గుడిలో పోతురాజు ఒక చేతిలో డాలు పట్టుకొని, నల్లటి శరీరచ్ఛాయతో నిలబడి ఉన్నాడు. ఈవిధమైన పోతురాజు యొక్క చిత్రీకరణ మాతృస్వామిక వ్యవస్థ యొక్క, స్త్రీ దేవత యొక్క ప్రాధాన్యతను ఉగ్గడిస్తున్నది. గ్రామదేవత గ్రామరక్షణి కాగా, అంగరక్షకుడుగా, ఆమెకు కాపలాదారుగా పోతురాజు చిత్రింపబడ్డాడనవచ్చును.

పోతురాజు గ్రామదేవత గుడి కెదురుగా కాక ప్రత్యేకంగా వేరొకచోట ఉన్న గ్రామాలు కూడ ఉన్నాయి. సామర్లకోట మండలం పెదబ్రహ్మదేవం, ఉండూరు, అడ్డతీగల మండలం ఎల్లవరం, కొత్తపేట మండలం వానపల్లి, మొదలైన గ్రామాల్లో పోతురాజు విగ్రహం దేవత గుడి కెదురుగా గాక, వేరొకచోట ఉన్నది. ఉండూరు గ్రామంలో గ్రామదేవత గుడి కెదురుగానూ, ప్రత్యేకంగానూ కూడ పోతురాజు విగ్రహ మున్నది.

సాధారణంగా పోతురాజుకు ప్రత్యేకమైన సంబరాలు చేయరు. గ్రామదేవతల సంబరంలో దేవతకు చలిమిడి, వడపప్పు, మొదలైనవి నైవేద్యంగా పెల్లిస్తారు. నైవేద్యంగా పోతురాజు విగ్రహమ్మీద పానకం (బెల్లంకలిపిన నీరు) పోస్తారు. కాని ఉండూరు గ్రామంలో చైత్రశుద్ధ పూర్ణిమకు పోతురాజుకు పండుగ చేస్తారు. పోతురాజు భూతాలను, గ్రహాలను ఊరవతలకు తరిమేస్తాడని నమ్ముతారు. మరిడమ్మ, నూకాలమ్మ ఈ ఊరి గ్రామదేవతలు. వీరిద్దరూ ఆడగణాచారుల మీద పూని వారు శివమూగుతుంటే పోతురాజు వేరొక మగవ్యక్తి మీద పూనుతాడు. ఆ పూనిన వ్యక్తి వచ్చి, ఈ ఆడగణాచారుల తలలు ఢీకొట్టి నా అనుమతిలేకుండ మీరు గ్రామంలోనికి ఎందుకొచ్చారు' అని



మెడలో తలకాయల దండతో కాలి క్రింద వ్యక్తితో చిత్రీకరింపబడిన దేవత విగ్రహం



జాతరలో పోతురాజు స్వరూపము గా తిప్పుతున్న ముదరగడ



సామాన్యంగా కన్పించే గ్రామదేవత గుడి, గుడి కెదురుగా నంది రూపంలో వున్నపోతురాజు విగ్రహం



మనుష్య రూపంలో చిత్రీకరింపబడిన
పోతురాజు ప్రక్కన అంతకు ముందు
పోతురాజుగా భావింపబడిన రాయి



పోతురాజు రాయివద్ద బలి ఇచ్చుటకు
బదులు చెవికత్తిరించుచున్న దృశ్యం



పోతురాజుపై పానకం పోయుచ
దృశ్యం

తరిమేస్తాడు.

సాధారణంగా గ్రామదేవతకే మొక్కులు చెల్లిస్తారు. గ్రామదేవతలకు బలి యిచ్చే కోడి, మేక వంటి వాటిని గ్రామదేవత గుడి కెదురుగా ఉన్న రాయి (పోతురాజు) వద్ద బలి యిస్తారు. పోతురాజుకు ప్రత్యేకమైన మొక్కులు చెల్లించరు. కాని పెదబ్రహ్మదేవం గ్రామంలో గ్రామదేవతకు వలె పోతురాజుకు కూడ ప్రత్యేకమైన మొక్కులు చెల్లిస్తారు.

విశాఖపట్నం జిల్లా ఏజన్సీ ప్రాంతంలో కూడ పోతురాజుకు ప్రత్యేకమైన పండుగ చేస్తారు. పశువులకు రోగాలు వచ్చి, చనిపోతుంటే వాటికి రోగాలు రాకుండా నివారించమని పోతురాజుకి పండుగ చేస్తారు.

ఆయా గ్రామదేవతల కథలలో వారికి సోదరునిగా, సహాయకునిగా వర్ణింపబడడమేతప్ప, పోతురాజు గురించి ప్రత్యేకమైన కథలేమీ ఈజిల్లాలో లభిచలేదు కాని డా. రావి ప్రేమలత గారు తమ సిద్ధాంత గ్రంథంలో పోతురాజు గురించి కొన్ని కథలు వివరించారు. పార్వతీదేవికి ఏడుగురూ ఆడుసంతుయే కనుక మగసంతానం కొరకు పరమేశ్వరుని అర్థించగా అతడు పోతురాజుని ప్రసాదించాడు.11 'కామేశ్వరీదేవి కథ యందు గౌరీదేవి గర్భమున సప్తకన్యకలు జన్మించగా, వారి సంరక్షణమునకు పోతురాజును సృష్టించి, ఆదిదంపతులు వెడలిపోయిరి.12

'జానపద భారతమందు పోతురాజు ప్రసక్తి వచ్చును. పాండవులు అరణ్యావాసం చేయటానికి వెళ్లనపుడు తమ కోటలను రక్షించటానికి ఒక మనిషి కావలసి వచ్చెను. అతడు కొండ అంత అన్నపురాశిని, తాటిచెట్టంత పోతును కోరెను. కోట రక్షణాధికారి పోతును, రాశిని కోరినందున పోతురాజుగా మారినాడు'.[13]

పైవిధంగా పోతురాజు పుట్టుకను, మహిమను తెలిపే ప్రత్యేకమైన కథలు లభించనప్పటికీ, ఈ జిల్లాలోని మత్స్యకారుల నుంచి నేను సేకరించిన కథలలో పోతురాజుకి వివాహమైనట్టుగా, అతని భార్య యమురాలుగా వివరింపబడింది. యమురాలు రాక్షసుల చెల్లెలు. ఈశ్వరుని వరంవల్ల బలగర్వితులైన రాక్షసులు అతని మీదికే యుద్ధాని కెళతారు. వారి ధాటికి ఆగలేని ఈశ్వరుడు నల్లరాయి కింద దాక్కుంటాడు. అప్పుడు ఈశ్వరుని కుమార్తె నూకాలమ్మ తండ్రిని కాపాడదలచి, రాక్షసుల మీదికి యుద్ధానికి సిద్ధమై, యమురాలి సహాయ మడుగుతుంది. పోతురాజుపై మనసువడ్డ యమురాలు ఆతనికి పెళ్లిచేస్తే, యుద్ధంలో సహాయం చేస్తానంటుంది. నూకాలమ్మ వారిద్దరికీ పెళ్లిచేసి, యమురాలి సహాయంతో రాక్షసులను జయించి తండ్రిని కాపాడుతుంది.

గ్రామదేవతల గుడి కెదురుగా ఉండే రాయినే పోతురాజుగా భావిస్తారు. దేవతకు బలిగా పోతు (మగజీవి)నే యిస్తారు. ఈ బలి జీవిని అమ్మవారి గుడికెదురుగా ఉండే రాయి (పోతురాజు) వద్దే బలి యిస్తారు. పోతును బలి యిస్తున్నందువల్ల 'పోతురాయి' గా పేరుబడిన రాయి తర్వాతికాలంలో 'పోతురాజు' అయ్యుండ వచ్చును.

తెలంగాణా ప్రాంతంలో ప్రతి గ్రామంలో 'బొడ్రాయి' ఉంటుంది. గ్రామదేవత పండుగ సందర్భంలో వారితోపాటు 'బొడ్రాయి' కూడ పూజింపబేడుతుంది.[14] కొన్నిచోట్ల బొడ్రాయినే

## వ్యుత్పత్తి తెలిసినవి

దేవతను సాధారణ పరిభాషలో అమ్మోరు, అమ్మతల్లి, తల్లమ్మ అని కూడ పిలుస్తారు. చాలా గ్రామాల్లో దేవతను 'సత్తెమ్మ' 'సత్తెమ్మతల్లి' అని పిలుస్తారు. సత్తి + అమ్మ – సత్తెమ్మ. శక్తికి వికృతి సత్తి. 'అమ్మ' దేవతావాచకం. కావున శక్తినే సత్తెమ్మగా పిలుస్తారనవచ్చు. కొన్ని గ్రామదేవతల పేర్లకు వ్యుత్పత్తి తెలియ వస్తున్నది. వాటి వివరాలు.

**ఆరులమ్మ :** ఈమె గంగవరం మండలం రాజవరం గ్రామదేవత. తల్లిదండ్రులకు ఆరవ సంతానంగా పుట్టి, అరులమ్మ అని పేరు పెట్టబడి, అకాలమరణం చెంది దేవతగా వెలసింది.[2]

**ఇటుకలమ్మ లేక ఇటికాలమ్మ :**ఈమె అంబాజీపేట మండలం, మాచవరం గ్రామదేవత. శీలసంరక్షణకోసం దుర్మార్గుల నుంచి తప్పించుకోవటానికి ఇటుక ఆవంలోదూరి, మంటల్లో మాడి మరణించి, దేవతగా వెలసింది.[3]

***గరగలమ్మ :*** ఈమె ముమ్మిడివరం మండలం ముమ్మిడివరప్పాడు గ్రామదేవత తనకు కాబోయే భర్త సౌందర్యవంతుడని భావించిన పెళ్లికుమార్తె, మొదటిసారి పెళ్లిపీటల మీద భర్తనుచూసి, తాను భావించినట్లు జరగనందున నిరాశచెంది, తట్టుకోలేక పెళ్లిదుస్తులతోనే అగ్నికి ఆహుతియైపోయింది. తర్వాత తన తల్లిదండ్రులకు కలలో తలమీద గరగలతో కనిపించింది. ఆమెను గరగలమ్మగా భావించి గుడికట్టి, అప్పటినుంచి గ్రామస్థులందరూ పూజిస్తున్నారు. 4

**వాక్కులమ్మ :** ఈమె ఆత్రేయపురం మండలం ర్యాలీ. రావులపాలెం మండలం రావులపాలెం గ్రామాల్లో వెలసిన దేవత 'చదువులతల్లి సరస్వతీదేవి'నే 'వాక్కులమ్మ' గా పూజిస్తున్నారు. పూర్వం దక్షిణాది నుండి వచ్చిన ద్రావిడ బ్రాహ్మణులు ర్యాలీ గ్రామంలో స్థిరపడ్డారు. వారు వేదవిద్యల్లో గొప్పవారైనందున స్థానిక బ్రాహ్మణులు వారిని అక్కడ నుంచి వెళ్లగొట్టారు. వారు వెళ్లపోయేటపుడు వారి ఆరాధ్య దైవం శారదాపీఠాన్ని వదలి వెళ్లారు. ఆ పీఠాన్ని వాక్కులమ్మగా నిలిపి, జానపదులు గ్రామదేవతగా పూజిస్తూ జంతు, పక్షి బలులు ఇస్తున్నారు.5

**పాదాలమ్మ :** ఈమె గొల్లప్రోలు మండలం, విజయనగరం, ప్రత్తిపాడు మండలం ప్రత్తిపాడు మరియు ఏలూరు గ్రామాలలో గ్రామదేవత. పొలంలో చెరువు తవ్వుచుండగా బయల్పడిన పాదాల ముద్రలు గల రాయిని 'పాదాలమ్మ' గా పూజిస్తున్నారు. తర్వాతి కాలంలో ఈమెకుగుడి కట్టి, విగ్రహం కూడ వేశారు.

**మరిడమ్మ :** 'మరణాన్ని కలిగించే దేవత మారిణమ్మ. ఈ మారిణమ్మ మరిణమ్మ మరిడమ్మగా మారింది'[6] అని స్వర్గీయ యస్వీ జోగారావుగారి అభిప్రాయం. పూర్వంరోజులలో వేసవికాలంపోయి, వర్షాకాలం ప్రారంభమయ్యే రోజులలో వాతావరణమార్పిడికి కలరా వ్యాపించి, మరణాలు ఎక్కువగా సంభవించేవి. వైద్యసదుపాయాలు పెరిగిన ఈనాడు అటువంటి రోగాల బాధ తెలియకపోవచ్చు. కాని ఈనాటికీ ఈ అమ్మవారి పండగ అదే రోజుల్లో చేస్తున్నారు. ఈమె

పండుగను ఈ దేవత వెలసిన గ్రామాల వారేకాక, జిల్లా అంతటా కూడ జ్యేష్ఠబహుళఅమావాస్యకు చేస్తారు. కావున ఈమెను రోగాలకు, పరోక్షంగా మరణాలకు భయపడి కొలిచే వారనవచ్చును. When ependimic of cholera breaks out. . . . . . . . . . . . . . . . Curiously enough install the Goddess Maridamma అని Henry White Head పేర్కొనెను.

**నూకలమ్మ :** 'నూకలు అనగా బియ్యమె. మానవుడికి బియ్యమే ఆహారం. ఆహారాన్ని కలిగించే దేవత నూకలమ్మ'[8] అని స్వర్గీయ యస్వి జోగారావుగారి అభిప్రాయం. కాని ఈ దేవతను పొంగు, తట్టు మొదలైన అంటువ్యాధులకు అధిదేవతగా కొలుస్తారు.

The Village Goddess, who is significantly called Nukalamma from a Colloquial. Tamil Word meaning to beat causes all sorts of and is dreaded as an evil spirit[9] అని Henry White Head పేర్కొనెను. ఈ దేవత అంటే జిల్లాలోని ప్రజలందరికీ చాలా భయం. అంటువ్యాధులు వచ్చి తగ్గేరోజుల్లోనే ఈ అమ్మవారి పండుగ చేస్తారు. జిల్లాలోని కొన్ని గ్రామాలలోనే ఈమె గ్రామదేవత. అయినప్పటికీ జిల్లా అంతటా కూడ ఈమె పండుగను ఫాల్గుణ బహుళ అమావాస్యకు చేస్తాం.

**పల్లాలమ్మ :** కోనసీమలోని కొత్తపేట మండలం వానపల్లి – మొదలైన గ్రామాల్లో ఈమె గ్రామదేవత. ఈమె పేరు గురించి కొన్నికథలు ప్రచారంలో ఉన్నాం.

భక్తులు తమ కష్టాలు తీర్చేదేవత కనుక 'ఫలాలమ్మ' గా వ్యవహరించేవారు. కాలక్రమంలో 'పల్లాలమ్మ' గా వ్యవహరిస్తున్నారు[20] అని ఒక కథనం.

వానపల్లి గ్రామం పూర్వం పిఠాపురం మహారాజా సంస్థానంలో ఉండేది. ఈ అమ్మవారు ఒకరోజు రాత్రి మహారాజుకు కలలో కనిపించి 'నాకు పండ్లు పంపు నీ వంశం భోగభాగ్యాలలో సుఖవంతగా వర్ధిల్లుతుంది' అని చెప్పింది. అమ్మవారి కోరిక తీర్చడమేకాక, పండ్లు ఉండే కొంత భూమిని కూడ రాజుదానం చేసాడు అప్పటి నుంచి ఈమె పల్లాలమ్మ అయ్యింది.[11]

ఈ అమ్మవారు అవతరించటానికి గల కథను త్రేతాయుగం నాటి కొన్ని ఘట్టాలు తెలుపుతున్నాయి. శ్రీరాముడు అరణ్యవాసంలో కొంతకాలం గౌతమీ గోదావరి ప్రక్కన గల ఈ గ్రామంలో గడిపాడు. గోదావరి ఒడ్డున గల ఈ పల్లి వానపల్లి అయ్యింది. ఈ గ్రామానికి సమీపంలో ఉన్న ఒక గ్రామానికి కోతుల తోట' అని సార్థకనామమున్నది. ఈ గ్రామంలో రామదూతలుగా పేరొందిన వానరాలు అధికంగా ఉండేవి. ఒకనాడు వాటికి ఆహారం దొరకక, నలుదిక్కులు చూస్తుంటే, జాలిపడిన సీత రామునితో ''ఎందరో పతివ్రతల పుణ్యఫలితంగా ఎన్నో మంచి పనులు జరిగాయి. ఈనాడు ఏదేని 'మహాశక్తి' ప్రభావంవల్ల ఈ కోతులకు ఆహారం సృష్టించాలి' అని తలచగా, మరుక్షణం అడవిలో చెట్లన్నీ ఫలాలతో నిండిపోయాయి. ఈ అద్భుతానికి కారణమైన ఆ మహాశక్తిని కనుక్కోవాలని, సీతారాములు అన్వేషణ చేయగా, ఒక స్త్రీ తపస్సుచేస్తూ కనిపించింది. ఆమె పేరు 'అంబ' అనీ, పవిత్ర గోదావరి తీరాన్ని తపస్సుకు అనువైన స్థలంగా భావించి, తపస్సు చేస్తున్నదని తెలుసుకొని, ఈ అద్భుతానికి మూలమైన ఆమెను స్తుతించి, రాబోవు యుగంలో ప్రజలంతా నిన్ను 'ఫలదాంబ' అని పిలుస్తూ, దైవంగా కొలుస్తారు.' అని చెప్పి, ఒక మహాశక్తి

మంత్రాన్ని ఒక వృక్షం క్రింద ప్రతిష్టించి,'' తపస్సు పూర్తయిన తర్వాత భక్తులు వెలికి తీయడానికి ప్రయత్నించగా, మంత్రంవద్దకు చేరుకొని శిలారూపం తాల్చుతావు'. నీ తపోబలంచేత, మంత్రశక్తిచేత భక్తులచే పూజింపపడతావు' అని వరమిచ్చారు. ఆనాటి ఫలదాంబే ఈనాటి పల్లాలమ్మ.12 దీనిని బట్టి శ్రీరాముని వరంవల్ల జన్మించిన మహాశక్తే పల్లాలమ్మ దేవత అని విధితమగుచున్నది.

***పంపాదమ్మ*** : ఈమె పంపానదీ పరీవాహక ప్రాంతమైన తొండంగి మండలంలోని వేమవరం, అద్దరిపేట, కృష్ణాపురం, ఒంటి మామిడి గ్రామాల ఉమ్మడి దేవత. పంపానది తీరాన వెలసిన దేవత కాబట్టి ఈమె పంపాదమ్మ. ఈ నదికి పంపానది అని పేరు రావడటానికి ఒక కథ ఈ ప్రాంతంలో ప్రచారంలో ఉన్నది.

సీతను రావణడు ఎత్తుకెళ్లిన సందర్భంలో రత్నగిరి కొండవద్ద ( అన్నవరం సత్యన్నారాయణ స్వామి వెలసిన కొండ యిదే దీనిని తాకుతూ పంపానది ప్రవహిస్తుంది) విచారంతో ఉన్న రాముణ్ణి గంగ (నది) వచ్చి తాకింది. అప్పటికే చికాకుతో ఉన్న రాముడు అంప (బాణం) సంధించి, గంగను కొట్టబోతాడు. గంగస్త్రీ రూపంలో ప్రత్యక్షమై 'రామా ! నీ పాదాలు స్పృశించి పావనమవుదామనే ఉద్దేశమే తప్ప, నిన్ను ఇబ్బంది పెడదామనే ఉద్దేశంతో తాకలేదు' అని ప్రాధేయపడింది. అప్పుడు రాముడు ఇక్కడ నుంచి ఎట్టి ఒడుదుడుకులు లేకుండ నెమ్మదిగా ప్రవహించి, ఈ ప్రాంతాన్ని సస్యశ్యామలం చేయమని ఆదేశిస్తాడు. అప్పటి నుచి ఈనది పంపానది అయ్యింది. ఈవిధంగా రామునిచే పంపబడిన నది పంపానది.[13]

పంప + అది + అమ్మ = పంపాదమ్మ. పంపానదికి ఆదినున్న దేవత అని వ్యుత్పత్తి (Origine) చెప్పుకోవాలి. కాని పంపానది సముద్రంలో కలిసేచోట ఈ అమ్మవారు వెలసారు. అంటే పంపానదికి ఆదిని వెలసి, తర్వాతకాలంలో ఇక్కడకు వలస వచ్చి ఉండాలి. లేక పంపానదీ తీరాన వెలసిన దేవత కాబట్టి 'పంపానదమ్మ' అనే పేరుతో ఉండి, తర్వాత కాలంలో 'పంపాదమ్మ' గా రూపాంతరం చెంది ఉండాలి.

***నేరేళ్లమ్మ***: సంతానహీనురాలైన స్త్రీకి నేరేడు పండ్లు తినుటవల్ల జన్మించి, నేరేళ్లమ్మ అని పేరు పెట్టబడి, అత్తఆరళ్లకు అలసి, అకాల మరణం చెందిన స్త్రీ నేరేళ్లమ్మ దేవతగా వెలసింది. ఈమె ఈ జిల్లాలోని చాలా గ్రామాల్లో దేవత.[14]

***పసుపులమ్మ*** : పసుపులేటివారి యింటిలో జన్మించి, అవివాహితగా అకాలమురణంచెంది, ఆ యింటి పేరుతోనే దేవతగా పూజింపబడుచున్నది. ఈమె ఈ జిల్లాలోని సామర్లకోట గ్రామ (పట్టణ) దేవత[15]

***బంగారు పాపమ్మ*** : మరణించిన భర్తలో ఐక్యంచెందే సమయంలో తనపాతివ్రత్య మహిమ వల్ల బంగారు దేహకాంతితో మెరుస్తూ, స్నేహితురాలితో 'బంగారు పాప' అని పిలువబడినందున, తాను బంగారుపాప దేవతగా నిలుస్తానని చెప్పి, నిలిచిన పతివ్రతే ఈ బంగారు పాప దేవత [16] ఈమె ఈ జిల్లాలోని కొత్తపల్లి మండలం పొన్నాడ గ్రామంలో ఉన్నది.

**పోశమ్మ :** పోషించు అమ్మయే పోశమ్మ'[17] అని డా. యెల్దండ రఘుమారెడ్డిగారి అభిప్రాయం.

**తలుపులమ్మ** : ఈమె తలంపులమ్మ ఎల్లప్పుడూ ప్రజల తలపులలో మసలుతూ, ప్రజల కోర్కెలు, కష్టాలు తీర్చే తల్లితలంపులమ్మ. ఈ పేరు కాలక్రమేణా తలుపులమ్మ అయ్యింది. తుని మండలంలో తునికి ఆరు కిలోమీటర్ల దూరంలో రెండు కొండల నడుమనున్న లోయలో ఈమె ఆలయమున్నది. ఈ ప్రాంతం తలుపులమ్మ లోయగా ప్రసిద్ధికెక్కి కాలక్రమంలో 'తలుపులమ్మ లోవ' గా మారింది.

**గుండాలమ్మ**: గ్రామస్థులందరితోపాటు గుండంలో పడిన దేవత (విగ్రహం) కొన్నాళ్లకు గుండాలమ్మ పేరుతో వేరొక గ్రామస్థుని పైపూని, ఆ గ్రామంలో దేవతగా వెలసింది.[18]

**నక్కుళ్లమ్మ :** ఈమె అసలు పేరు నవగుళ్లమ్మ. తర్వాత కాలంలో ఆ పేరు నక్కుళ్లమ్మగా మారింది. బెజవాడ కనకదుర్గ తొమ్మిది రూపాలలో ఈమెది ఒక రూపం. తొమ్మిదివ రూపం కనుక నవగుళ్లమ్మ అయ్యింది. తర్వాతకాలంలో నవగుళ్లమమ్మ నక్కుళ్లమ్మ అయ్యింది.[19]

**బోడ కొండమ్మ :** 'మోదకల్ (ఆనందమైన కొండ) అనే కొండ ప్రాంతాన్ని వెలసిన దేవత మోదకొండమ్మ. ఈ మోదకొండమ్మ విశాఖజిల్లా మాడుగుల ప్రాంతంలో ఉన్నది.[20]ఈమె తూర్పు గోదావరి జిల్లాలో 'బోడ కొండమ్మ'గా అనేక గ్రామాల్లో పూజింపబడుతున్నది. భాషాశాస్త్ర నియమానుసారం 'మోద బోడ' గా మారే అవకాశం ఉన్నది.

**కోరలమ్మ :** ఈమె ఏలేశ్వరం గ్రామంలో వెలసిన దేవత. ఈమె 'కూరలమ్మ' అని తర్వాతికాలంలో కోరలమ్మ' గా పేరు మారిందని స్థానికులు చెబుతారు.[21]

**పోలేరమ్మ :** పొలిమేర దేవత 'పోలేరమ్మ' అని పలువురి అభిప్రాయం.

**పరదేశమ్మ :** పర (ప్ర) దేశం నుంచి వలస వచ్చిన దేవత పరదేశమ్మ అని చెప్పవచ్చును.

## నైవేద్యం పేరుతో గ్రామదేవతలు

గ్రామదేవతలలో కొందరు ఆదేవతకు సమర్పించే నైవేద్యం పేరుతో పిలువబడడం కనిపిస్తుంది. ఉంద్రాళ్లమ్మ, పాశాలమ్మ, బూర్లమ్మ, ఒరేలమ్మ మొదలైనవారు నైవేద్యం పేరుతో పిలువబడే గ్రామదేవతలు.

ఉంద్రాళ్లమ్మ తూర్పుగోదావరి జిల్లా కొత్తపల్లి మండలం అమరవల్లి గ్రామపొలిమేరలో ఉన్నది. ఈ గ్రామం సముద్ర తీరప్రాంతంలో ఉండడం వల్ల ఇసుకనేల ఎక్కువ. వరి పండదు. వర్షాధారంతో మెట్టపంటలు పండిస్తారు. పూర్వం ఈ ప్రాంతంలో చోడి పంట పండించేవారు. చోళ్ల పండాక గ్రామస్థులు ఎవ్వరూ తినకుండా, చోడిపిండితో ఉంద్రాళ్లు చేసి, పొలిమేరలో నున్న దేవతకు నివేదించేవారు. ఉంద్రాళ్లను నైవేద్యంగా నివేదింపబడే దేవత ఉంద్రాళ్లమ్మ.[22]

పాయసానికి వికృతి పాశం. బూర్లు కూడ అమ్మవారికి నైవేద్యంగా పెడతారు. 'ఒరెం' అంటే పప్పు, బియ్యం కలిపి వండిన అన్నం మన్యం ప్రాంతంలో 'ఒరెం' దేవతకు నైవేద్యంగా పెడతారు. కావున ఉండ్రాళ్లమ్మ, పాశాలమ్మ, బూర్లమ్మ, ఒరేలమ్మ మొదలయిన దేవతలను నైవేద్యం పేరుతో పిలువబడే దేవతలుగా చెప్పవచ్చును.

## గ్రామనామం - గ్రామదేవత నామం

కొంతమంది గ్రామదేవతలు గ్రామనామాలతో కనిపిస్తున్నారు. వీరు రెండు రకాలు ఒక గ్రామంలో వెలసిన గ్రామదేవత ఆ గ్రామం పేరుతోనే గుర్తింపబడుతుంది.

**ఉదా :** నీలపల్లి – నీలపల్లమ్మ; జానుపల్లి – జానుపల్లమ్మ; మసకపల్లి – మసకపల్లమ్మ; సిరిపల్లి – సిరిపల్లమ్మ; లొల్ల – లొల్లాలమ్మ; గంటి – గంటమ్మ; కొమ్మరాజు లంక – లంకతల్లమ్మ; నడవపల్లి – నడవపల్లమ్మ; దొంతికుర్రు – దొంతికుర్రు అమ్మవారు లేక మరిడమ్మ.

సాధారణంగా గ్రామదేవతకు ఒక పేరు ఉంటుంది. ఆమె కొత్తగా ఒక గ్రామంలో వెలసినపుడు, పాత పేరు మరుగున పడి, ప్రస్తుతం వెలసిన గ్రామం పేరుతో పిలువబడడం కనిపిస్తుంది. ఉదాహరణకు 'దొంతికుర్రు గ్రామదేవత మరిడమ్మ. దొంతి కుర్రులో వెలసాక దొంతికుర్రు అమ్మవారుగా కూడ పిలువబడుతుంది.[23]

ఒక గ్రామంలోని గ్రామదేవత వేరొక గ్రామం పేరుతో పిలువబడడం కనిపిస్తుంది. గ్రామదేవతలకు వలసరావడం, పోవడం సామాన్య లక్షణమైనందున, ఏ ఊరి నుంచి వలస వచ్చిందో ఆ ఊరి పేరుతో పిలవబడుతుంది.

"Some were named after the villeges from which they had been imported e.g. Pandilamma, the Goddess from Pandili"[24] W.H.White Head పేర్కొనెను.

| గ్రామనామం | | దేవత నామం | | దేవత వెలసిన గ్రామం |
|---|---|---|---|---|
| మాడుగుల | – | మాడుగులమ్మ | – | బిక్కవోలు |
| నగరం | – | నగరమ్మ | – | పేరవరం |
| తాటిపూడి | – | తాటిపూడమ్మ | – | కట్టుంగ |
| పందిలి | – | పందిళ్లమ్మ | – | మూలపేట |
| చీడిక | – | చీడికమ్మ | – | కొరుప్రోలు మల్లవరం |
| ముక్కొల్లు | – | ముక్కుళ్లమ్మ | – | విలసవిల్లి |
| వసంతవాడ | – | వసంతాలమ్మ | – | లింగంపర్తి |

పైన పేర్కొన్న వివరాలనుబట్టి గ్రామనామాలతో కూడ గ్రామదేవతలు పిలువబడుచున్నారని చెప్పవచ్చును. ఈ జిల్లాలో అసంఖ్యాకంగా గ్రామదేవతలు ఉన్నప్పటికీ వారిలో ప్రసిద్ధికెక్కినవారు కొద్దిమందే. ఏ గ్రామంలో లేక ప్రాంతంలో వెలసి దేవత ప్రసిద్ధికెక్కిందో ఆ దేవత పేరుకి ముందు విశేషణంగా ఆ గ్రామం లేక ప్రాంతం పేరు కూడ చేరుతుంది.

ఉదా : నూకాలమ్మ - కాంగ్రకోట నూకాలమ్మ; మరిడమ్మ - పెద్దాపురం మరిడమ్మ

పల్లాలమ్మ - వానపల్లి పల్లాలమ్మ; రూపులమ్మ - ఏలేశ్వరం రూపులమ్మ;

తలుపులమ్మ - లోవలో తలుపులమ్మ

గ్రామాన్నిబట్టి గ్రామదేవత పేరు ఏర్పడినట్టే దేవతనుబట్టి గ్రామ నామం ఏర్పడడం కూడ కనిపిస్తుంది. మనదేశంలోనేకాక ప్రపంచములోనే పెద్ద నగరాలుగా ప్రసిద్ధికెక్కిన కలకత్తా, ముంబాయిలు దేవతల పేర్లతో వెలసినవే - 'కాళీఘట్' పేరుతో కలకత్తా, 'ముంబాదేవి' పేరుతో (ము)ంబాయి అనే నగరాలు వెలసాయి'[25] ఈ విధంగా దేవత పేరుతో వెలసిన గ్రామాలు ఈ జిల్లాలో కూడ కొన్ని కన్పిస్తున్నాయి.

| దేవత నామం | | గ్రామనామం |
|---|---|---|
| మాచరమ్మ, దుర్గమ్మ | - | మాచర, దుర్గాడ |
| సింగరమ్మ, ముత్యాలమ్మ | - | సింగరమ్మ పాలెం, ముత్యాలమ్మ పాలె (విశాఖజిల్లా) |
| పంపాదమ్మ | - | పంపాదపేట |

''ఈ జిల్లాలోని కపిలేశ్వరపురం మండలం మాచర గ్రామంలో చాన్నాళ్ళక్రితం ఒకరి పొలంలో కందులరాశిలో ఒక చిన్న దేవతా ప్రతిమ దొరికింది. తర్వాత ఆ దేవత ఆ ఇంటివారి పై పూని తాను మాచరమ్మనని, గుడికట్టించి పూజించమని కోరింది. ఈ విధంగా గుడికట్టాక, ఆ ప్రాంతంలో ఊరు ఏర్పడింది. మాచరమ్మ వెలసిన ప్రాంతంలో నెలకొన్న గ్రామం 'మాచర' అయ్యింది.[26]

దుర్గమ్మ వెలసిన ప్రాంతంలో ఏర్పడిన గ్రామం దుర్గాడ. ఈ దుర్గాడ గొల్లప్రోలు మండలంలో ఉన్నది.

సాధారణంగా దేవతలు గ్రామాలలోనే కాక, పొలాల్లోనూ, పొలిమేరల్లోనూ కూడ నిలిచి, పూజింపబడతారు. కాలపరిణామంలో పాత ఊళ్ళు నశించి, కొత్త ఊళ్ళు ఏర్పడడం సహజమే. ఈ కొత్త ఊళ్ళ పాత ఊళ్ళకి కొద్దిదూరంలో ఇంచుమించు సమీపంలోనే ఏర్పడతాయి. ఈ విధంగా ముందు దేవత వెలసి, తర్వాత ఆ ప్రాంతంలో ఊరు ఏర్పడితే, ఆ దేవత పేరుతోనే ఆ గ్రామం పిలువబడడానికి అవకాశం ఉన్నది.

గ్రామదేవతల ప్రాచీనత చెప్పడం చాల కష్టం. గ్రామదేవతల పేర్లు గ్రామస్థులు పెట్టుకుంటారు. వ్యక్తుల పేర్లమీద కూడ గ్రామనామాలు ఏర్పడుతుంటాయి. కాబట్టి దేవత పేరుతో వ్యక్తిపేరు, ఆ

వ్యక్తిపేరుతో గ్రామనామం కూడ ఏర్పడడానికి అవకాశం ఉంది.

'ఏథినా' అనేది ఏథెన్సు నగర దేవత. సుమేరియన్ ప్రాచీనపురాణమైన 'గిలమేష్'లో ఈ దేవత ప్రసక్తి ఉంది.[27] అనే గుంటూరు శేషేంద్రగారి మాటల వల్ల గ్రామనామానికి దేవత నామానికి ఉన్న సంబంధం స్పష్టపడుతుంది.

## గ్రామదేవతలు - కులవాచకాలు

గ్రామదేవతలలో కొందరు కులవాచకాలుగా కనిపిస్తున్నారు.

| కులనామం | - | దేవతనామం |
|---|---|---|
| బ్రాహ్మణ, గొల్ల బోయి | - | బాపనమ్మ, గొల్లాలమ్మ, బోయిాలమ్మ |

(బోయిాలనగాపల్లకి మోసేవారు లేక బెస్తవారు)

గ్రామదేవతలలో ఎక్కువమంది అకాలమరణం చెందిన స్త్రీలే (ఈ విషయం వివిధ గ్రామ దేవతల కథలు వివరించినపుడు స్పష్టపడుతుంది) ఆయా కులాల్లో పుట్టిన స్త్రీలు అకాలమరణం చెంది, దేవతలైనప్పుడు వాళ్ళ ఆ కులం పేరుతోనే పిలువబడడానికి అవకాశం ఉంది.

ఒక దేవత గ్రామస్థులందరిచేత పూజింపబడితే ఆ దేవత పేరుతో పిలువబడుతుంది. లేక ఒక కులం వారిచే మాత్రమే కొలువబడితే ఆ దేవత పేరుకి ముందు కులం పేరు కూడ చేరుతుంది.

**ఉదా :** మారెమ్మ – గొల్లమారెమ్మ; పోలమ్మ – డెక్కలి పోలమ్మ

## గ్రామ దేవతలు - వ్యాధి వాచకాలు

గ్రామదేవతలను తెగుళ్ళ పోగొట్టేందుకు, తెగుళ్ళ కలిగించకుండా ఉండేందుకు కూడ పూజిస్తారు. కాబట్టి తెగుళ్లపేరుతో దేవతల పేర్లు ఏర్పడ్డానికి అవకాశమున్నది.

| వ్యాధి పేరు | - | దేవత పేరు |
|---|---|---|
| మారి (వ్యాధి విశేషం) (మరణాన్ని కలిగించేది) | – | మారెమ్మ |
| కాటుక (వృక్షసంబంధ వ్యాధి విశేషం | – | కాటుకలమ్మ |

## గ్రామ దేవతలు - గృహ వాచకాలు

| గృహ నామము | దేవత నామం | - | గృహ నామము | దేవత నామము |
|---|---|---|---|---|
| వసుపులేటి | వసుపులమ్మ | – | ఒనుము | ఒనుములమ్మ |
| జిట్ల | జిట్లమ్మ | – | గుబ్బల | గుబ్బాలమ్మ |
| పుట్టా | పుట్టాలమ్మ | – | వేల్పుల | వేల్పులమ్మ |
| కడియాల | కడియాలమ్మ | – | దండు | దండమ్మ |
| కిలాడి | కిలాడమ్మ | – | మొగిలి | మొగలారమ్మ |
| గొలుసు | గొలుసులమ్మ | – | గజ్జెల | గజ్జెలమ్మ |

| | | | | |
|---|---|---|---|---|
| నూకల | నూకలమ్మ | – | వెన్న | వెన్నమ్మ |
| కొత్త | కొత్తమ్మ | – | బులుసు | బులుసులమ్మ |
| పెద్దింటి | పెద్దింటమ్మ | – | కోట | కోటమ్మ |
| కోట్ల | కోట్లమ్మ | – | జువ్వల | జువ్వలమ్మ |
| తోట | తోటమ్మ | – | ఏబాల | ఏబాలమ్మ |
| జాజుల | జాజులమ్మ | – | చింతలపాటి | చింతపాటమ్మ |
| వెంపరాల | వెంపరమ్మ | – | గుండాల | గుండాలమ్మ |

మొదట ఒకానొక ఇంటిపేరు వారిచే కొలువబడే దేవత ఆ ఇంటి పేరుతో పేరెల్ల వచ్చును. అదే పేరుతో గ్రామవ్యాప్తి, గ్రామాల వ్యాప్తికూడ చెంది ఉండవచ్చును. దీనికి ఉదాహరణ కొత్తపల్లి మండలం ఇసుకపల్లి గ్రామంలో దొరికింది. 'ఇసుక పల్లి' గ్రామదేవత 'ఏగులమ్మ' ఈమె అసలు పేరు వేములమ్మ. 'వేముల' అనే ఇంటి పేరు గల బ్రాహ్మణ కులస్థుల ఇంటి దేవత ఈమె తర్వాత కాలంలో గ్రామదేవత అయి, గ్రామస్థులందరి చేత పూజింపబడుచున్నది.[8]

భాషశాస్త్ర నియమానుసారం కూడ 'వేములమ్మ' 'ఏగులమ్మ' గా రూపాంతరం చెందటానికి అవకాశం ఉన్నది. 'వేముల'లో 'మ' అస్పృష్ట మ కారంగా మారితే 'వేవులమ్మ' అవుతుంది. ఆనునాసిక్యం తొలగితే 'వేవులమ్మ' అవుతుంది. పదాది 'వ' లోపిస్తే, ఏవులమ్మ, అవుతుంది. 'వ' 'గ' గా మారితే ఏగులమ్మ అవుతుంది. కాబట్టి గ్రామదేవతలలో కొందరు ఆయా గృహనామాలతో కనిపిస్తున్నారనవచ్చు.

## గ్రామ దేవతలు - వృక్ష వాచకాలు

| **వృక్షనామం** | **-** | **దేవతనామం** | **వృక్షనామం** | **-** | **దేవతనామం** |
|---|---|---|---|---|---|
| ఊడుగ | – | ఊడుగులమ్మ | వెదురు | – | వెదుళ్లమ్మ |
| ములగ | – | ములగాలమ్మ | కుంకుడు | – | కుంకుళ్లమ్మ |
| ఉచ్చింత | – | ఉచ్చింతాలమ్మ | బర్రింక | – | బర్రింకలమ్మ |
| పచ్చారి | – | పచ్చాలమ్మ | గంటి | – | గంటమ్మ |
| మొగలి | – | మొగలారమ్మ | ఊడ | – | ఊడాలమ్మ |
| జాజుల | – | జాజులమ్మ | పాల | – | పాలమ్మ |
| మామిడి | – | మామిళ్లమ్మ | | | |

ఆదిమ మానవుడు ఆత్మారాధన దశలో ఆత్మలు వృక్షాలను ఆశ్రయించి ఉంటాయని నమ్మటంవల్ల, ఆ ఆత్మారాధన తర్వాతకాలంలో మాత్రారాధనగా మారడంవల్ల ఈ మాత్రారాధన గ్రామదేవతారాధనకు నాంది కావడంవల్ల వృక్ష నామాలతో గ్రామదేవతల నామాలు ఏర్పడడానికి అవకాశం ఉన్నది. అసలు వేరే విగ్రహం లేకుండ వృక్షాన్నే దేవతగా పూజించడం చాలా గ్రామాల్లో కన్పిస్తుంది. 'మామిడి చెట్టు కింద నిలిచిన దేవత మామిళ్లమ్మ'[29] అనిHenry White Head పేర్కొనెను.

ఒక దేవత ఏ చెట్టు కింద నిలిచిందో ఆ దేవత పేరు ముందు ఆ చెట్టు పేరు కూడ చేరడం

కన్పిస్తుంది.

ఉదా : పోలమాంబ - కరకచెట్టు పోలమాంబ

| గ్రామనామం | - | గృహనామం | - | దేవత నామం |
|---|---|---|---|---|
| మాడుగుల | - | మాడుగుల | - | మాడుగులమ్మ |
| గంటి | - | గంటి | - | గంటమ్మ |
| తలుపుల | - | తలుపుల | - | తలుపులమ్మ |
| గొంప | - | గొంప | - | గొంపమ్మ |
| ఏగుల పాలెం | - | ఏగుల | - | ఏగులమ్మ |

ఇక్కడ గృహనామం వల్లకాని, గ్రామనామంవల్లకాని దేవత పేరు ఏర్పడి ఉండవచ్చును.

| గృహనామ | వృక్షనామం | దేవతనామం |
|---|---|---|
| చింతల | చింత | చింతాలమ్మ |
| బూర్గుల | బూరుగు | బూరుగులమ్మ |
| గంధం | గంధం | గంధాలమ్మ |
| బలుసు | బలుసు | బలుసులమ్మ |
| మామిడి | మామిడి | మామిళ్లమ్మ |
| గోగుల | గోగు | గోగులమ్మ |
| నేరెళ్ల | నేరేడు | నేరేళ్లమ్మ |
| గంటి | గంటి | గంటమ్మ |
| తుమ్మల | తుమ్మ | తుమాలమ్మ |

ఇక్కడ గృహనామం వల్లకాని వృక్షనామం వల్లకాని దేవతనామం ఏర్పడ్డానికి అవకాశం ఉన్నది.

| గ్రామనామం | గృహనామం | దేవతనామం | గ్రామనామం |
|---|---|---|---|
| ముక్త్యాల | ముత్యాల | ముత్యాలమ్మ | ముత్యాలమ్మపాలెం |

| గ్రామనామం | గృహనామం | దేవతానామం | వ్యక్తినామం | దేవతానామం |
|---|---|---|---|---|
| గొంప | గొంప | గొంపమ్మ | గొంపమ్మ | గొంపమ్మ |

ఈవిధంగా గ్రామ, గృహ, దేవత, వ్యక్తి నామాలు పరస్పర ప్రభావాలవల్ల ఏర్పడడానికి అవకాశం ఉన్నది. దేవత పేరుకు ముందు ఇంటి పేరు, స్థలంపేరు చేరడం కూడ కన్పిస్తుంది. గ్రామస్థులందరిచేత పూజింపబడితే, ఆదేవత పేరుతోనే విన్పిస్తుంది. కేవలం ఒక యింటివారిచేత మాత్రమే పూజింపబడితే, ఆ ఇంటి పేరు ముందు చేరుతుంది.

ఉదా : గంగమ్మ - దొడ్డి గంగమ్మ, గాలిగంగమ్మ
సత్తెమ్మ - మెట్లవారి సత్తెమ్మ

అదేవిధంగా స్థలం లేక ప్రాంతం పేరు కూడ దేవత పేరుకు ముందు చేరుతుంది.

ఉదా : గంగమ్మ - దండు గంగమ్మ

గంగమ్మ చాలా గ్రామాల్లో గ్రామదేవత దండు గంగమ్మ సామర్లకోట మండలం పెదబ్రహ్మదేవం గ్రామదేవత. ఈ గ్రామం పూర్వం పెద్దాపురం సంస్థానంలోనిది. ఈ గంగమ్మ గ్రామానికి దూరంగా గ్రామపొలిమేరలో ఉండేది. రాచరిక వ్యవస్థలో దండు (సైన్యం) ఈ గంగమ్మ నిలిచిన పుంతమార్గంగుండా వెళుతూ వస్తూ ఉండేది. కాబట్టి దండునడిచే మార్గంలో నిలిచిన గంగమ్మ దండు గంగమ్మ అయ్యింది'[30].

## ఆభరణ వాచకాలు

| ఆభరణ నామం - | | దేవత నామం | ఆభరణ నామం - | | దేవత నామం |
|---|---|---|---|---|---|
| మురుగులు | - | మురుగులమ్మ | గజ్జెలు | - | గజ్జెలమ్మ |
| గొలుసు | - | గొలుసులమ్మ | దో (తో) రాలు | - | దోరాలమ్మ |
| కడియాలు | - | కడియాలమ్మ | ముత్యాలు | - | ముత్యాలమ్మ |
| కాసులు | - | కాసులమ్మ | పట్టాలు | - | పట్టాలమ్మ |

పై పరిశీలననుబట్టి ఆభరణాల పేర్లతో కూడ గ్రామదేవతలు కన్పిస్తున్నారనవచ్చును. Mutyalamma, the pearl Goddess"[31] అని Henry White Head అభిప్రాయపడెను.

## శిష్ట దేవతల పేర్లతో గ్రామ దేవతలు

గ్రామదేవతలలో కొందరు శిష్టదేవతల పేర్లతో కన్పిస్తున్నారు. మహాలక్ష్మమ్మ, మాణిక్యాలమ్మ, శ్యామలాంబ, నీలవేణమ్మ, ఆదిలక్ష్మమ్మ, కనకమహాలక్ష్మమ్మ, ధనమ్మ మొదలైనవారు శిష్టదేవతల పేర్లతో కన్పించే గ్రామదేవతలు గ్రామదేవతలు ద్రావిడ సంస్కృతికి చెందిన జానపద దేవతలు కాబట్టి శిష్టదేవతల పేర్లు ఉండరాదని కొందరి అభిప్రాయం. అయినప్పటికి ఈవిధమైన పేర్లు రావటానికి అవకాశం ఉన్నది. నేడు గ్రామదేవతలుగా పూజింపబడేవారిలో ఎక్కువ మందిలోకమునందలి సామాన్య స్త్రీలే. ప్రతికూల పరిస్థితులవల్ల అకాలమరణం చెంది, దేవతలై వెలసి, ప్రజలచేత పూజలందుకుంటున్నారు. కావున శిష్టదేవతల పేర్లు కలిగిన స్త్రీలు అకాలమరణం చెంది, వారి పాతివ్రత్య మహిమవల్ల దేవతలుగా వెలసి, వారు బ్రతికుండగా కలిగిన పేరుతోనే పూజలందుకోవటం కన్పిస్తుంది. దీనికుదాహరణ విశాఖజిల్లా యలమంచిలి గ్రామం నందలి రామచంద్రమ్మ దేవత.

300 సంవత్సరాల క్రితం యలమంచిలి గ్రామంలో 'కోణంరాజు' అనే బ్రాహ్మణ గృహస్థుకు కలిగిన కవల పిల్లలకు 'రామమ్మ, చంద్రమ్మ' అని పేర్లు పెట్టాడు. 9 సంవత్సరాల వయస్సు వచ్చాక, ఈ బాలలు ప్రమాదవశాత్తు నూతిలోపడి మరణించారు. తర్వాత తండ్రికి కలలో కన్పించి, తాము దేవతాస్వరూపం పొందామని, తమను గుడి కట్టించి, పూజించమని చెప్పారు. ఈవిషయం అతడు గ్రామస్థులతో చెప్పగా, గ్రామస్థులందరూ నూతి వద్దకువెళ్ళి, నూతిలోనున్న విగ్రహాలను బయటకు తీసి గుడికట్టించి, రామచంద్రమ్మ దేవతగా పూజిస్తున్నారు 32. ఇలాంటి

వెన్నయినా ఉదాహరణలు చెప్పవచ్చును. కాలక్రమంలో చాలా కథలు మరుగున పడిపోయినా, దేవతల పేర్లు మిగులుతున్నాయి. ఈ విధంగా శిష్టదేవతల పేర్లతోను గ్రామదేవతలు ఏర్పడ్డానికి అవకాశం ఉన్నది.

## మూలం తెలియనివి

గ్రామదేవతల పేర్లు కొన్ని ఊహకందనివి కూడ ఉన్నాయి.

**ఉదా** : కప్పడాలమ్మ, ముసలమ్మ, ఇంజవతమ్మ, దేశాలమ్మ, నాంచారమ్మ, చేముళ్లమ్మ, జాగరమ్మ, రూపులమ్మ, మంటలమ్మ మొదలైనవి.

మంటలమ్మ దేవత గురించి 'పెండ్లినాడు వధూవరుల శ్రేయస్సునకై మంట దేవతను, కులదేవతను పూజించుట ప్రత్యేకంగా గావింతురు'33 అని డా. జి. యస్. మోహన్ పేర్కొన్నారు. కానీ యీ జిల్లాలో అటువంటి ఆచారాలేమీ కన్పించలేదు.

''అతి పురాతన దశలో గ్రామదేవతలందరూ అనామధేయులు''[34] అని విలియం క్రుక్ అభిప్రాయపడెను. తర్వాతికాలంలో పూజించేవారి యింటి పేరునుబట్టి, కులాన్ని బట్టి, వెలసిన స్థలాన్నిబట్టి, గ్రామాన్నిబట్టి, చెల్లించే నైవేద్యాన్ని, వెలసిన విధానాన్నిబట్టి వివిధ పేర్లతో వివిధ గ్రామదేవతలు ఏర్పడ్డారన వచ్చును.

### అధస్సూచికలు

1. Village Gods of South India, Henry White Head, 1921, p.23.
2. కురసం జంగందొరం, రాజవరం గ్రామం, గంగవరం మండలం.
3. సుసర్ల గోపాలకృష్ణ, మాచవరం గ్రామం, అంబాజీపేట మండలం.
4. Census of India, Fairs and Festivals of East Godavari, 1961, p.100.
5. Ibid. p.96.
6. ఆచార్య యస్వీ జోగారావుగారితో ముఖాముఖి.
7. Village Gods of South India, Henry White Head, 1921, p.30
8. ఆచార్య యస్వీ జోగారావుగారితో ముఖాముఖి.
9. Village Gods of South India, Henry White Head, 1921, p.30
10. ఆంధ్రజ్యోతి దినపత్రిక, ఏప్రిల్, 1988 - తూర్పు గోదావరి జిల్లా సంచిక.
11. ఆంధ్రభూమి దినపత్రిక, 20-5-1989, తూర్పుగోదావరి జిల్లా సంచిక.
12. ఈనాడు దినపత్రిక - 21-5-1989 - తూర్పు గోదావరి జిల్లా ఎడిషన్.
13. నేమాల నాగరాజు - అద్దారిపేట - తొండంగి మండలం.

14. రేవుయముడమ్మ – కొమరగిరి – కొత్తపల్లి మండలం.

15. తోలేటిబులిరాజు – సామర్లకోట – తూర్పు గోదావరి జిల్లా

16. బంగారుపాప ( బషీర్ బీబీ చారిత్రక నవల – మూలరచయిత రాయవరపు గౌరిరాజు – 1985.

17. పల్లెపదాల్లో ప్రజాజీవనం – డా. యెల్లండ రఘుమారెడ్డి – 1979.

18. మొల్లేటి సత్యన్నారాయణ – మల్లేపల్లి గ్రామం – గండేపల్లి మండలం.

19. చక్రవర్తుల హనుమంతరావు – నవఖండ్రవాడగ్రామం – పిఠాపురం మండలం.

20. దివిలి అచ్యుతరామారావు – ఆంధ్రప్రభ దినపత్రిక–17–6–1987–విశాఖజిల్లా ఎడిషన్.

21. పి. అనంతాచారి – ఏలేశ్వరం – తూర్పుగోదావరి జిల్లా.

22. పులి అప్పారావు – అమరవల్లి గ్రామం – కొత్తపల్లి మండలం.

23. -Marinamma, the village diety is also called Dontikurru Ammavaru". Census of India, Fairs and Festivals of East Godavari; 1961, p.46.

24. Village God of South India, p.23, 1921.

25. ఆళ్ల శేషగిరిరావు గారితో ముఖాముఖి.

26. యాదగిరి జగపతిరామయ్య – మాచర, కపిలేశ్వరపురం మండలం.

27. వ్యాసద్వాదశి – ద్వా. నా. శాస్త్రి – 1991 – పుట 95.

28. సంగన అప్పారావు – ఇసుకపల్లి గ్రామం – సామర్లకోట మండలం.

29. "Mamillamma, the Goddess who sits under a Mango Tree". The Village Gods of South India; 1921, p. 23.

30. తోటకూర సుబ్బారావు – పెదబ్రహ్మదేవం గ్రామం. సామర్లక్కోట మండలం.

31. The Village Gods of South India; 1921, p.23.

32. ఆంధ్రప్రభ దినపత్రిక – మే 1986 – విశాఖజిల్లా ఎడిషన్.

33. స్త్రీల పాటలు – అనంతపురం మండలం – జి.యస్. మోహన్ – 1982 –పుట– 84.

34. The Populare Religion and Folklore of Mother India.

# పంచమ ప్రకరణం

# ఆరాధనా విధానాలు, జాతరలు

'ఆరాధన' 'పూజ' అనే పదాలు 'దైవం - గుడి' అనే పదాలను స్ఫురణకు తెస్తాయి. వైభవంతో వెలుగొందే వైదిక దేవతల గుడుల ముందు గ్రామదేవతల గుడులు వెలవెలబోయినట్టే ఆరాధనలో కూడా ఈ తేడా కన్పిస్తుంది. గ్రామదేవతలు వైదిక దేవతల వలె ప్రతిరోజు, ప్రతివారం కాకపోయినా, సంవత్సరానికి ఒకసారయినా, లేక ఆయా సందర్భాలలో పూజ లందుకుంటారు. గ్రామదేవతల ఆరాధన, జాతర, ఉత్సవాలు, నమ్మకాలు, ఆచారాలు, మొక్కులు అన్ని ఒకదానితో ఒకటి సంబంధం కలిగి ఉంటాయి.

తరతరాలనుంచి ఆయా సందర్భాలలో ఆచరింపబడేది ఆచారం. జననం నుంచి మరణం వరకూ మానవులు అవలంబించే వివిధ పద్ధతులు, ఆచారాలుగా ఏర్పడ్డాయనవచ్చును. గ్రామీణ సమాజంలో ఈ ఆచారాలు మరింత భక్తిశ్రద్ధలతో ఆచరింపబడతాయి. తమ పూర్వీకులు అవలంబించిన పద్ధతులు అవలంబిస్తే మంచి జరుగుతుందని, అవలంబించకుంటే చెడు జరుగుతుందనే భావనే ప్రాచీన కాలపు ఆచారాలు ఇప్పటికీ ఆచరింపబడటానికి ప్రధాన కారణం. ఇట్టి ఆచారాలు అతి ప్రాచీనకాలపు ఆచారాలైన వివాహవ్యవస్థ, మత వ్యవస్థలలో ప్రస్ఫుటంగా కన్పిస్తాయి. ప్రాచీనకాలంలో అవలంబింపబడిన పద్ధతులు అప్పటి ప్రజల మన్ననలు పొంది, తర్వాతి తరాలకు ఆచారాలుగా మిగులుతాయనవచ్చును. ఈ కాలంలో ఇంకనూ మిగిలిన ఆచారాలు ఒకప్పటి సమాజాన్ని, మానవ జీవితాన్ని క్రమ బద్ధం చేసిన విధానాలవ్వటంవల్లనే నేటికీ చట్ట నిర్మాణంలో ప్రమాణాలుగా గ్రహింపబడుతున్నాయి.

ఇట్టి ఆచారాలు మతవ్యవస్థలో క్రమం తప్పకుండా ఆచరింపబడతాయి. ఈ ఆచారాలు మనిషి జీవనవిధానంలో నుంచే పుట్టుకొని రావటంవల్ల, అవి మానవజీవితంతో అవినాభావ సంబంధం కలిగి ఉంటాయి. కావున నేటి ఆచార సంప్రదాయాలను బట్టి ఒకనాటి సమాజవిధానాన్ని అందలి ప్రజల మానసిక దృక్పథాన్ని తెలుసుకోవచ్చును. 'ప్రజల మానసిక దృక్పథము వారి వారి జీవిత పరిధుల ననుసరించి ఆచారములు రూపొందును'[1] అని డా. ప్రేమలత అభిప్రాయం.

'ప్రాణికి ప్రాథమిక అవసరం ఆహారం. అది సమృద్ధిగా లభిస్తేతప్ప ఏ ప్రాణి కూడ సుఖమయంగా, జీవించలేదు. ఆలోచనాశక్తి కల్గిన మానవుడు తనకు ఆహారసమృద్ధి కలిగించి సుఖమయ జీవనానికి హేతువైన మానవాతీతశక్తిని గూర్చి ఊహించి, కృతజ్ఞత చూపించుటయే ప్రాథమిక దశలోని మత స్వరూపం. ఈవిధంగా తన జీవన పరిశ్రమకు కారణమైన ఆహారాన్ని ప్రసాదించిన దైవానికి కానుక సమర్పించుట ఆదిమకాలంలోనే మొదలయిందన వచ్చును. తమకు ఆహారపుష్టిని సమకూర్చిన దైవముపై కృతజ్ఞత చూపుచు, ఆహారమును కానుకగా నర్పించునను భావనతో నొక ప్రత్యామ్నాయము నర్పించు పద్ధతియు - నీరెండును దైవారాధనము నందు కలగలసిపోయి, నైవేద్యమును బల్యర్పనమునై భాసించినవి'[2] అని డా. నాయని కృష్ణకుమారి అభిప్రాయం.

తూర్పుగోదావరి జిల్లాలో గ్రామదేవతల పండుగలను జరిపే కాలాన్ని బట్టి, ప్రాంతాన్ని బట్టి, సందర్భాన్ని బట్టి కొన్నిరకాలుగా విభజింప వచ్చును.

1. సాధరణంగా జరిపే గ్రామదేవత పండుగ లేక జాతర

2. కాలాన్నిబట్టి జరిపేవి.

3. ప్రత్యేక కారణంవల్ల

   అ. అనావృష్టి వచ్చినపుడు,

   ఆ. అనారోగ్య కారణంవల్ల

   క. అనారోగ్యం వచ్చాక

   ఖ. అనారోగ్యం రాకుండ

4. ప్రాంతాన్ని బట్టి జరిపేవి

   అ. మన్యప్రాంతంలో జరిపేవి

   ఆ. తీర ప్రాతంలో మత్స్యకారులు జరిపేవి

5. వృత్తినిబట్టి జరిపేవి (పంబలవారి సత్తెమ్మ సంబరాలు)




వీటిలో మత్స్యకారులు, పంబలవారు జరిపే పండుగల గురించి సంబంధిత ప్రకరణాలలో వివరించాను. మిగిలిన పండుగలను ఇక్కడ వివరిస్తాను.

## 1.సాధారణంగా జరిపే గ్రామదేవత పండుగ లేక జాతర

సాధారణంగా జరిగే గ్రామదేవత పండుగ ఈ జిల్లాలో నిర్ణీత సమయాలలోనే జరుగుతుంది. సామాన్యంగా పంటలు పండాక, వేసవికాలంలో గ్రామీణుల విరామసమయంలోనే గ్రామదేవత జాతర చేస్తారు. తూర్పుగోదావరి జిల్లాలో గ్రామ దేవతల జాతరలన్నీ ఫాల్గుణబహుళ అమావాస్యకు ప్రారంభమై, ఆషాడబహుళ అమావాస్య వరకు జరుగుతాయి. ముఖ్యంగా ఫాల్గుణబహుళ అమావాస్య నాడు నూకాలమ్మ పండుగ ఈ జిల్లా ప్రజలంతా చేస్తారు. ముఖ్యంగా ఈమె వెలసిన గ్రామంలో జాతర చేస్తారు. మిగతా గ్రామాల్లో కూడ ప్రజలు తమ తమ ఇళ్లవద్ద పండుగ చేసుకుంటారు. జిల్లాలోని మిగతా గ్రామస్తులు కూడ తమ తమ గ్రామదేవతలకు ఆతరువాత వచ్చే పౌర్ణమి, అమావాస్యరోజులలోనే జాతర చేస్తారు. ఈవిధంగా ఆషాఢ బహుళ అమావాస్య వరకు ఆయా గ్రామదేవత లందరికీ జాతరలు జరుగుతాయి. వైశాఖబహుళ అమావాస్యకు నేరేళ్లమ్మకు ( రాపర్తి), వైశాఖశుద్ధ పౌర్ణమికి వసంతాలమ్మకు (లింగంపర్తి), జ్యేష్ఠబహుళ అమావాస్యకు మరిడమ్మకు (పెద్దాపురం), ప్రాచీనకాలం నుంచి జాతరలు చేయుటంవల్ల ఆయా తిథులను, ఆయా దేవతల పేర్లతోనే పిలుస్తారు. దీనిని బట్టి అమావాస్య, పౌర్ణమి తిథులు దేవతారాధనకు మంచివని గ్రామీణులు భావించినట్లు చెప్పవచ్చును. సాధారణంగా జరిగే గ్రామదేవత జాతర గ్రామస్తులందరూ క్షేమంగా ఉన్నప్పుడే జరుపుతారు. గ్రామంలో ఎవరైనా ముఖ్యంగా దేవత పుట్టింటికి చెందిన వ్యక్తులు

మరణిస్తే, వారి 'దశాహం' అయ్యేవరకు జాతర చేయరు.

## గరగలు - పూలగరగ - పాన్పులు

సాధారణంగా జరిగే గ్రామదేవత జాతర, దేవత గరగలు తీయటంతో ప్రారంభమవుతుంది. జాతరకు ఒకటి లేక రెండు లేక నాలుగు వారాల ముందు గరగలు తీస్తారు. మామూలు రోజుల్లో ఈ గరగలు గుడి ఉంటే దేవతగుడిలోనూ, లేకుంటే పూజారి ఇంట్లోను ఉంటాయి. గుండ్రంగా ఉన్న ఇత్తడిపాత్ర పైన సర్పపు పడగ ఉంటుంది. దీనిని గరగ అంటారు. గుడిలోనున్న వీటిని తెచ్చి, కడిగి శుభ్రం చేసి, పూజారి వస్త్రాలతో అలంకరిస్తాడు. పసుపు కుంకుమలు గరగకు అద్దుతాడు. కొత్తకుండను తెచ్చి పసుపుకుంకుమ పూసి, మోదుగపూలతో అలంకరిస్తాడు. దీనిని 'పూలగరగ' లేక 'తల్లిగరగ' అంటారు. కొన్ని గ్రామాల్లో దీన్ని 'బుట్టగరగ' 'ఘటం గరగ' అని కూడ అంటారు. కొన్ని గ్రామాల్లో పూలగరగకు పైన అట్టతో తయారు చేసిన మూత అమర్చుతారు. భక్తులు వేసే నైవేద్యం ఈ మూతగుండా వేస్తారు. ఈ మూత మీద దేవతాచిహ్నాలు కూడ ఉంటాయి. ఈ గరగలను దేవతాస్వరూపాలుగా భావిస్తారు. 'కుంభము దేవతా స్వరూపం'[3] అని డి. డి. కోశంబి పేర్కొన్నారు.

పూలగరగను పూజారి, మిగతా గరగలను ఇతరులు తలమీద ఉంచుకొని నృత్యం చేస్తారు. గరగల నెత్తుకున్నవాళ్లు చాకళ్లు లేక ఆసాదులై ఉంటారు. మాదిగలు డప్పులు వాయిస్తుండగా వీరు గరగ నృత్యం చేస్తారు. ఈ జిల్లాలోని అమలాపురం నందలి ఆసాదులు గరగనృత్యంలో రాష్ట్రస్థాయిలోనే పేర్గాంచారు. గరగలు తీసినరోజునుంచి దేవతపండుగ రోజు వరకు, గ్రామం నందు వివిధ వీధులలో తిరుగుతాయి. గ్రామస్తులు పూలగరగలో నైవేద్యం వేయుగా, దానిని దేవతకు సమర్పించి, మిగిలింది గరగ నృత్యం చేసేవారు, డప్పులు వాయించేవారు తీసుకుంటారు. ఈ గరగలు తమ ఇంటికి వచ్చినపుడు ఇంటివారు గరగ నెత్తుకున్న వ్యక్తికాళ్లపై నీళ్లపోసి, పసుపుకుంకుమ, నైవేద్యం, దక్షిణ గరగకు సమర్పిస్తారు. గరగకు అంటిఉన్న పసుపుకుంకుమ తీసుకొని, బొట్టుపెట్టుకుంటారు. ఈ గరగలు స్వగ్రామంలోనే కాక, పొరుగు గ్రామాలకు, శివారు గ్రామాలకు, సుదూర గ్రామాలకు కూడ తిరుగుతాయి. ఉదా : ఏలేశ్వరం రూపులమ్మ గరగలు 30 కిలోమీటర్ల దూరంలో ఉన్న అడ్డతీగల వరకు తిరుగుతాయి. పెద్దాపురం మరిడమ్మ గరగలు వందమైళ్లకుమించిన దూరంలో ఉన్న విజయనగరంలో కూడ తిరుగుతాయి. దేవతయొక్క ప్రతీతినిబట్టి, దేవతకు పోషకులున్నంత దూరం గరగలు తిరుగుతాయి మాదిగలు డప్పులు వాయిస్తుండగా గరగల నెత్తుకున్నవారు చేసే నృత్యాన్ని గరగల సంబరం అంటారు.

గ్రామస్తులు గరగలను పాన్పువేయించుకుంటారు. తమ ఇంటికి వచ్చిన గరగలను తెల్లని వస్త్రం పరచిన మంచం మీద ఉంచుతారు. గరగల కింద చిన్న బియ్యం పోగులు కూడ ఉంచుతారు. దీనిని పాన్పు అంటారు. ఈ పాన్పులు ముఖ్యంగా పుట్టింటివారు, అత్తింటివారు, ఇంకనూ మొక్కుకున్నవారు వేయించుకుంటారు. ఈ విధంగా పాన్పులు వేయించుకోవటం శ్రేయోదాయకమని భావిస్తారు.

## ఊయలతాడి - సిడితాడి

ప్రధాన పండుగ ముందురోజు రాత్రి నుంచి అమ్మవారి జాతర ప్రారంభమవుతుంది. దేవతపండుగ అమావాస్యరోజు జరిగితే, చతుర్ధశిరోజు రాత్రినుంచి జాతర ప్రారంభమవుతుంది. ఈ రాత్రి తొలిగంటలలో గరగల సంబరంతో వెళ్లి, తాళ్లకు ఉపవాసం చెప్పివస్తారు. అంటే తాము నరకదలచుకున్న తాటిచెట్లకు కత్తితో రెండు నాట్లు పెట్టి, పసుపు పూసి వస్తారు. ఆ మరుసటిరోజు ఉదయంకాని లేక ఆ రాత్రేకాని మళ్లీవెళ్లి వాటిని నరికి, గరగల సంబరంతో ఊరంతా తిప్పుతూ అమ్మవారి గుడి వద్దకు తెస్తారు. అదేవిధంగా గరగల సంబరంతో వెళ్లి వడ్రంగి ఇంటినుంచి ఊయలబల్ల, గౌడవాని ఇంటి నుంచి ఊయలతాడు కూడ తెస్తారు. కొన్ని గ్రామాల్లో ఊయలతాడుగా ముందు సంవత్సరం బలి ఇచ్చిన ఎనుపపోతు చర్మాన్ని తాడుగా అల్లి మాదిగ తెస్తాడు. ఈవిధంగా వేసిన ఊయలలో ముందుగా గరగలను ఒడిలో ఉంచుకొని, పూజారి ఊగుతాడు తర్వాత దేవత పుట్టింటివారు, అత్తింటివారు మిగతా గ్రామస్తులు కూడ ఊగుతారు. రెండవతాడిని సిడితిప్పటానికి ఉపయోగిస్తారు. ఈ సిడితిప్పే ఆచారం ఎక్కువ గ్రామాల్లో కన్పించదు.

## బలి

గ్రామదేవతల ఆచారాలలో సాధారణంగా కనిపించే ఆచారం బలి, బలి ఆచారంలో మొదటిదశ నరబలి. దేవత కోరినట్టుగా నరబలి ఇచ్చి, ఆమెను సంతృప్తి పరచి, తమ కార్యములు పూర్తిచేసుకున్న సంఘటనలు గ్రామదేవతల కథలలో కన్పిస్తాయి. పంబలివారి కథలైన గంగబుల్లావు, శివకుమారుడు కథలలో నరబలి ప్రసక్తి వచ్చింది. ఇటీవలకాలంలో ఈ జిల్లాలోని మన్యం ప్రాంతంలో మారేడుమిల్లి మండలం కానివాడ గ్రామంలో ఆటవికులు నరబలి ఇచ్చినట్లు, ప్రభుత్వంవారు వారిని శిక్షించినట్లు తెలియుచున్నది.

ఆత్మనివేదన వల్ల భగవంతుని అనుగ్రహం పొందవచ్చుననే భావం ప్రాచీనులలో కలిగి, సంస్కృతీవికాసం చెందిన తర్వాత దానికి ప్రత్యామ్నాయమైన జంతుబలి ద్వారా దేవతను ప్రసన్నంచేసుకోవచ్చనే ఉద్దేశం ఏర్పడి ఉండవచ్చును. మానవ మానవాతీత శక్తుల మధ్య సంబంధం కల్పించేది 'బలివిధానము' అని పలువురు అభిప్రాయపడ్డారు. ప్రాచీన మానవుడు బలిని ఇవ్వటంలోని ముఖ్యోద్దేశం భగవంతునితో సంబంధం పెట్టుకోవాలనే కాని భగవంతునికి కానుక ఇవ్వటం కాదని, వైట్ హెడ్ అభిప్రాయం భగవంతుని విగ్రహం కడ నివేదించిన మాంసం లేదా ఫలమును ఆరగించుట వలన, భగవంతునితో సంబంధం పెట్టుకొనినానని ఆదిమమానవుడు భావించినాడు[15] అని రాబర్ట్ స్మిత్ అభిప్రాయం.

జంతుబలులను గూర్చి 'బలులు గణవ్యవస్థ కాలంలోనే జనించినవి. జంతువులను గణసంకేతములుగా ఏర్పరచుకొనుట వల్ల వాటి ప్రాధాన్యం పెరిగి గణసంకేతంగా గుర్తింపబడిన జంతువు గణదేవతకు ప్రతీకయైనది. అట్టి గణదేవత ప్రతీకతో సంబంధం కల్పించుకొనుటకు ప్రాచీనులు బలినిచ్చెడివారు'16 అని వైట్‌హెడ్ ప్రతిపాదించెను. కావుననే బలికి ముందు జంతువును పసుపు కుంకుమలతో అలంకరిస్తారు. ఊరేగించునపుడు ప్రతి ఇంటిముందు దానికాళ్లపై నీళ్ల పోస్తారు.

ఇక ఈజిల్లాలో దేవతకు ఎనుము, మేక, గొర్రె, పంది కోడి వంటి మగ జీవులను బలి ఇస్తారు. 50,60 సంవత్సరాల క్రితం ఎనుపోతును బలి ఇచ్చేవారు. ఇటీవల కాలంలో తగ్గినప్పటికి మారుమూల గ్రామాలలో అక్కడక్కడ ఈబలి ఇటీవల కాలంలో తగ్గినప్పటికి మారుమూల గ్రామాలలో అక్కడక్కడ ఈబలి కొనసాగుచున్నది. కొత్తపల్లి మండలం కొండెవరం గ్రామంలో ఎనుపపోతు బలి గురించి ఒక కథ చెబుతారు. పూర్వం ఈ గ్రామంలో ఒక వ్యక్తికి చెందిన ఎనిమిది జతల ఎనుపపోతులు తప్పిపోయాయి. అవి దొరికితే ఎనుపపోతును బలి ఇస్తానని, అతడు ఆగ్రామదేవత పెద్దింటమ్మకు మొక్కగానే ఆమె మహిమ వల్ల ఆ మరుసటిరోజుకే అవి వచ్చి దేవతగుడిముందు నిలుచున్నాయి. అతడు అనుకున్న ప్రకారం పోతును బలి ఇచ్చాడు.

ఈ మండలంలోని కొమరగిరి గ్రామంలో పోతు బలి గురించి ఒక నమ్మకముంది. పూజారి డప్పులతో వెళ్లి తన కెదురైన ఎనుపపోతు (అది ఎవరిదైనాకాని) బొట్లు పెడతాడు. ఆ పోతు అతని వెనుక వచ్చేస్తుంది. దానినే దేవతకు బలి ఇస్తారు.

ఎనుపపోతు తర్వాత మేక, గొర్రెపోతులను బలి ఇవ్వటం ఎక్కువగా కన్పిస్తుంది. నాగరికతా వాసనలున్న పట్టణప్రాంతాలలో కాక, మారుమూల గ్రామాల్లో ఈ బలులు మామూలుగానే కొనసాగుతున్నాయి. పట్టణప్రాంతాలలో బలి నిషేధముండుటవల్ల బలి జంతువును బలి ఇవ్వక, చెవికోసి, గుడి ఆవరణలో విడిచి పెడుతున్నారు. కోడిని ఇంటివద్ద గానీ, గుడివద్ద కాని బలి ఇస్తారు. గుడి వద్ద బలి ఇచ్చినపుడు కోడి తలను దేవతకు సమర్పిస్తారు. (గుడి ఎదురుగా నున్న చెట్టుకు వ్రేలాడదీస్తారు )మెదడు ............మొదలైన వానిలో ఆత్మయియుండునన్న భావనే బలిపశువు చంపబడినప్పుడు ఆయా యంగములే ప్రత్యేకంగా దేవతల కాహారభూత మగుటకు కారణమని డా. నాయని కృష్ణకుమారి పేర్కొన్నారు.

కోడిని ఇంటివద్ద బలి ఇచ్చినపుడు దేవతకు పెట్టిన నైవేద్యాన్ని కోడిచేత తినిపిస్తారు. ద తింటే దేవతకు తమమీద కోపం లేదని, తినకుండా ఉంటే కోపగించిందని భావిస్తారు. ఒక్కొక్కసారి బలి ఇవ్వక. కోడికి గోరు కొట్టి, పోతును చెవికోసి రక్తం చిందించి విడిచిపెడతారు. దీనినిబట్టి రక్తం దేవతకు ప్రీతిపాత్రమని గ్రామీణులు భావించినట్టు చెప్పవచ్చును.

జంతుబలులపై నిషేధ ముండుటవల్ల చాలా గ్రామాలలో బలికి బదులు గుమ్మడికాయలను, కొబ్బరికాయలను పగులగొట్టుచున్నారు. మానవుని నాగరికతా పరిణామం వల్ల మాంసాహార నివేదనం పోయి, శాకాహారం నివేదనం మిగిలిందనవచ్చును. ఇది మానవజాతిలో కలిగిన సాత్త్వికపరిణామానికి నిదర్శనంగా చెప్పవచ్చును.

**గొడు గుడుపుల :** దేవతకు బలి ఇచ్చిన జంతువు రక్తం అన్నంలో కలిపి, బలి జంతువు పేగులు మెడలో వేసుకొని, రక్తపు అన్నాన్ని గంపలో వేసి, ఆ గంపను తలమీద పెట్టుకొని పూజారి బయలుదేరుతాడు. గ్రామస్థులు అతనిని అనుసరిస్తారు. ఈ విధంగా వీరు గ్రామం నాలుగు పొలిమేరలకు వెళ్లి, బలి అన్నాన్ని అక్కడ చల్లి, నాల్గు కోళ్లను కాని, మేకలను కాని, పందులను కాని బలి ఇస్తారు. కొన్ని గ్రామాల్లో ఈ బలి అన్నాన్ని తాటియాకు పాయలో చుట్టి ఊరి పొలిమేరలో నున్న చెట్లకు వేలాడదీస్తారు. ఈ సమయంలో పూజారిని ఆవహించి దుష్టశక్తులుంటాయని, వాటిని తరిమి వేసినట్టుగా గంపపై కర్రలను ఆడిస్తారు. పొలిమేరలో అన్నం చల్లటం, చెట్లకు



బలి ఇచ్చే కోడికి నైవేద్యం తినిపించుట



లి ఇచ్చిన కోడి తలపై నీళ్ళు
ేయుట



రక్తం కలిపిన అన్నాన్ని పొలిమేరలో
చల్లుటకు వెళ్ళుట



గరగల పొమ్ము



గరగలను ఎత్తుకున్న వ్యక్తి కాళ్ళపై నీళ్ళుపోయుట, గరగకు ఉన్న పసుపు తీసుకొనుట



గరగలను ఊయల ఊపు

కట్టటం చెయ్యటంవల్ల దుష్టశక్తులు పొలిమేర దాటిపోతాయని, తిరిగి గ్రామంలోనికి రావని భావిస్తారు. రక్తపు అన్నాన్ని పొలిమేరలో కట్టడం వల్ల, ఈ ఆచారాన్ని ''పొలిమేర కట్టు'' అని అన్నం గంపలో వేసుకొని తిరగటంవల్ల '' పరుగుడు గంప'' అని కూడ అంటారు. రక్తం అన్నంలో కలుపుట, పొలిమేరలో కట్టుట గూర్చి 'రక్తం సఫలతకు చిహ్నమని, రక్తం ప్రవహించుట, దానిని అన్నంతో, మట్టితో కలుపుట సఫలత కొరకు జరుపబడు ప్రార్థనలని, ఈ ఆచారమంతా వ్యవసాయ ప్రధానమైనద' ని నందితా కృష్ణగారు పేర్కొనిరి.

**బద్దిగడుగుట :** 'బద్దింపుట' అనగా అంచనా అని శబ్దరత్నాకరంలో పేర్కొన్నారు. భవిష్యత్తును ముందుగా అంచనావేయుటకు పాటించే ఆచారం కనుక దీనికి ఈపేరు వచ్చిందనవచ్చును. అమ్మవారికి బలి ఇచ్చిన జంతువు రక్తం ఒక మండిగలో పట్టి, అందు నవధాన్యములు వేసి, మట్టి కూడ వేసి దేవత గుడిలో పెడతారు మూడు లేక అయిదురోజులు గడిచాక దేవత గుడితలుపులు తెరచి, నవధాన్యాల్ని పరిశీలిస్తారు. వాటిలో మొలకెత్తిన విత్తనములు ఆ సంవత్సరం బాగుగా పండునని భావిస్తారు. కొన్ని గ్రామాల్లో మండిగను అమ్మవారి గుడిలో కాక, భూమిలో పాతిపెడతారు. ఈ ఆచారం చాలా గ్రామాల్లో కన్పిస్తుంది. కాని పెద్దాపురం, మారేడుబాక గ్రామాల్లో మరింత ప్రత్యేకతతో పాటిస్తారు.

పెద్దాపురంలో దేవత (మరిడమ్మ) గుడిలో వీసెడు పసుపు, కుంకుమ ఉంచుతారు. పెద్దపళ్లెం నిండా వరిపిండి వేసి, చక్కగా సర్ది ఉంచుతారు. వీటితో పాటు నవధాన్యాలు వేసిన మండిగ కూడ ఉంచుతారు. మూడవరోజు తలుపులు తెరచేసరికి పసుపు, కుంకుమ చిందరవందరగా పడుంటాయి. పళ్లెంలో సర్దిన పిండిలో అమ్మవారి పాదముద్రలు ఏర్పడతాయి ఇదంతా అమ్మవారి మహిమగా భావిస్తారు. నవధాన్యాలలో మొలకెత్తినవి ఆసంవత్సరం బాగుగా పండునని, భావిస్తారు. మండిగలో రక్తం కన్పించేతీరును బట్టి జబ్బుల తీవ్రతను అంచనా వేస్తారు. రక్తం తోడుకున్నట్టు ఉంటే జబ్బులు రావని, విరిగినట్టుగా ఉంటే జబ్బులు ఎక్కువగా వస్తాయని నమ్ముతారు.

మండపేట మండలం మారేడుబాక గ్రామంలో ఈ ఆచారం మరింత ప్రత్యేకతతో కన్పిస్తుంది. పెద్దాపురంలో వలె నవధాన్యాలు వేసిన మండిగ, పసుపు, కుంకుమ, పిండి కూడ పళ్లేలలో వేసి, దేవత గుడిలో పెట్టి, మున్సబు, కరణం మొదలైన పెద్దల సమక్షంలో తలుపులు మూసి, అయిదురోజులు గడిచాక తెరుస్తారు. అప్పటి గుడిలో పరిస్థితిని బట్టి ''బద్దిపంచాంగం'' వ్రాస్తారు. పసుపు కుంకుమ ఉంచినచోట తెగిన పుస్తె, పగిలిన గాజులు ఉంటే ఆ సంవత్సరం వితంతువులు ఎక్కువవుతారని, మగచావులు అధికమని భావిస్తారు. ఈవిధంగా రక్తపు మండిగను, వివిధ వస్తువులను గుడిలో ఉంచి, తలుపులు బిగించాక, తిరిగి తలుపులు తెరచేవరకు, ఆ గుడి పరిసరాలకు ఎవ్వరూ వెళ్లరాదని, ఆసమయంలో దేవత తన బంధువులతో విందు జరుపుకుంటుందని, ఆసమయంలో అక్కడకు వెళ్లినవారు మరణిస్తారని భావిస్తారు. ఇందుకు విరుద్ధంగా ప్రవర్తించినవారు అమ్మవారి మహిమ వల్ల మరణించిన సందర్భాలున్నాయని, కొత్తపల్లి మండలం ఇసుకపల్లి గ్రామంలోను కోటనందూరు మండలం బొద్దవరం గ్రామంలోను నాకు వివరించారు. ఈవిధంగా మరణించినవారు దయాలై రాత్రులందు తిరిగే మనుష్యులను పట్టి పీడిస్తారని కూడ నమ్ముతారు. ఈవిధంగా బద్ది కడిగి, భవిష్యత్తును అంచనావేయటంతో సాధారణంగా జరిగే గ్రామదేవత జాతర ముగుస్తుంది.

**సిడి త్రిప్పట :** సిడిబొమ్మను తిప్పుట గ్రామదేవతోత్సవాలలో కన్పించే ఆచారంలో ఒకటి. ఈ ఆచారం ఈజిల్లాలో కోనసీమ ప్రాంతంలోను, పిఠాపురంతాలూకాలోను ఎక్కువగా కన్పిస్తున్నది. చెక్కతో చేయబడిన దేవతబొమ్మ, గుడిలో ఉంటుంది. జాతర రోజు ఈ బొమ్మకు రంగులు వేసి, వస్త్రాలు చుట్టి పూజారి ఎత్తుకొని ఊరంతా తిప్పుతాడు. తరువాత దేవత గుడి ముందు సిడితాడి పాతి, దానికి పైన అమర్చిన మానుకు ఒకవైపు మేకపోతును, ఒకవైపు సిడిబొమ్మను కట్టి తిప్పుతారు. నేను విషయసేకరణకు వెళ్లినపుడు ఈ ఆచారాన్ని గమనించాను. సిడిమానుకు హరిజన వ్యక్తిని ఎక్కించి కూడ తిప్పేవారట. ప్రస్తుతకాలంలో ఇది ఎక్కడా కన్పించలేదు. సిడిబొమ్మను ఈత, నల్లమామిడి పళ్లతో వీథులందలి పిల్లలు కొడతారు. సిడిబొమ్మను తిప్పుతున్నపుడు తిరుగుతున్న బొమ్మకు పండ్లు విసురుతారు. దీనిని వేడుకగా భావిస్తారు. 'సిడికి కట్టు మేకపోతును సిడి పెండ్లికొడుకు అందురు'[9] అని డా. కుందుర్తి సత్యన్నారాయణ మూర్తి పేర్కొన్నారు.

సిడి యాడుటను గూర్చి; ''రెండు కొక్కెములు పెద్ద తాటి చివర కట్టబడి సిడి యాడబడు వ్యక్తి వీపుకు గుచ్చబడును. సిడిమ్రానుకు అమర్చబడిన దూలం ఆధారంగా గిర్రున చుట్టూ తిప్పుదురు'[10] అని సోనరెట్ పేర్కొనిరి. ఆవిధంగా సిడియాడుట ఈజిల్లాలో ఎచ్చటా కానరాదు. 'మనుష్యులకు బదులుగా సిడివీరన్న విగ్రహమును సిడిమ్రానెక్కించి మ్రొక్కు తీర్చుకొనుటయు కలదు'[11] అని థర్స్టన్ పేర్కొనిరి. దీనినిబట్టి పూర్వం ఆపదలు కలిగినపుడు, కష్టములు వాటిల్లినపుడు సిడి యాడుటను భక్తులు మ్రొక్కుకొనేవారని, తర్వాతి కాలంలో మనుష్యులకు బదులు సిడియాడించి మొక్కు తీర్చుకొనుట ఆచరణలోనికొచ్చిందని చెప్పవచ్చును.

'రాతిస్తంభము' నాటకంలో పానుగంటి లక్ష్మీనరసింహం గారు జాతరను గూర్చి, సిడిబొమ్మను గూర్చి పేర్కొనిరి. ఆ నాటకంలో నాయకుడు నారాయణరావు వేశ్యమాతను 'అమ్మవారి జాతరకు సిరిడిబొమ్మను త్రిప్పినట్లు గిరగిర త్రిప్పిన'[12] అనును. ఈ జాతర పిఠాపురంలో మరిడమ్మ గుడి దగ్గర జరుపుతారు. ఇప్పటికీ సిడిబొమ్మను తిప్పుతారు. దీనినిబట్టి 'రాతిస్తంభం' నాటక రచనాకాలం నాటికే మనుష్యులకు బదులు సిడిబొమ్మను సిడి యాడించు పద్ధతి పాటింపబడుచున్న దనవచ్చును.

**నిప్పులగుండం త్రొక్కుట :** గ్రామదేవతల ఉత్సవాలలో కన్పించే ఆచారాలలో ఇది ఒకటి. అంటువ్యాధుల పాల్పడినవారు అవి తొలగితే గుండం తొక్కుదుమని మొక్కుకొని, మొక్కు తీర్చుకుంటారు. ఆత్మహింస వల్ల దేవతను ప్రసన్నం చేసుకోవచ్చనే ఆదిమ మానవుని ఆలోచనకు ఇది నిదర్శనం. గుండం తొక్కే ఆచారం మైదానప్రాంతంలో కన్న తీర ప్రాంత గ్రామాల్లో అధికంగా ఉంది.' అచ్చట మత్స్యకారులు దేవతోత్సవాలలో తప్పక గుండం తొక్కుతారు. మైదానప్రాంతంలో ఈ ఆచారం చాలా తక్కువ. ఇటీవలకాలంలో అసలు మచ్చుకైనా కన్పించడంలేదు. తీరప్రాంతము నందలి మత్స్యకారులలో అక్షరాస్యత తక్కువగా ఉన్నందున, వారు నాగరిక ప్రపంచానికి దూరంగా ఉన్నందున శుచిశుభ్రతలు లోపించి, అంటువ్యాధులు ప్రబలుటకు అవకాశం ఎక్కువ. కావున ఆగ్రామాలలోనే గుండం తొక్కుట ఎక్కువగా కన్పిస్తున్నది.



సిడిబొమ్మ నెత్తుకొని పూజారి తిరుగుట



దేవతగుడి ముందు వెలిగించిన గండదీపం



సిడి త్రిప్పుట



దేవతగుడి ముందు కల్లు సా
పోయుట



ఇంటివద్ద ఉపాహారం చెల్లిస్తూ
దేవతకు బలిఇచ్చే కోడితో
నమస్కరించుకొనుట



దేవత గుడిలో కాగడాలు
వెలిగించుట

మైదాన ప్రాంతంలో వైద్య సదుపాయాల వల్ల ప్రజల అక్షరాస్యతవల్ల అంటువ్యాధుల బాధ తగ్గినందున ఈ ఆచారం అంతగా కన్పించడం లేదనవచ్చును. సాధారణంగా పూజారి గుండం తొక్కుతాడు. అతని ననుసరించి మ్రొక్కులున్నవారు కూడ తొక్కుతారు. గుండం తొక్కేవారు రోజంతా ఉపవాసం ఉంటారు. నిప్పుల గుండం త్రొక్కుటను గూర్చి, భక్తుడు తన పావిత్ర్యమును, వీరదీక్షను, బాధాసహనమును దేవియెదుట ప్రదర్శించవలయుననను గాఢకాంక్షయే యిట్టి కర్మకాండ కాధారమై యుండు'[13] నని ఆచార్య కృష్ణకుమారి గారు పేర్కొనిరి.

**పొలిమేరకట్ట దాటించుట** : ఇది ముఖ్యంగా పశువుల సంక్షేమాన్ని దృష్టియందుంచుకొని కావించే ఆచారం. ఈ ఆచారం ముఖ్యంగా రాజమండ్రి తాలూకాలోని కడియం తదితర గ్రామాల్లో ఎక్కువగా కన్పిస్తుంది. ముందుగా గ్రామము నందలి పశువులన్నింటిని ఊరవతలకు తోల్తారు. తర్వాత బ్రతికి ఉన్న పందిపిల్లను పొలిమేరలో పీకలవరకూ పాతిపెట్టి చుట్టూ కుంభం (రక్తం కలిపిన అన్నం) పోస్తారు. పంది నెత్తిమీద దీపం పెడతారు. దీనిని ''పొలిమేరకట్టు'' లేక ''దాటుడుకట్ట'' అంటారు. ఈ కట్టకు ఆవలనున్న పశువుల నన్నింటినీ ఈ కట్ట దాటేలా ఊరిలోనికి తోల్తారు. అలా పొలిమేరకట్ట దాటిన పశువులకు సంవత్సరం పొడుగునా ఎలాంటి వ్యాధులు రావనే నమ్మకంతో చేసే ఆచార మిది. ఈ ఆచారం పశ్చిమగోదావరి జిల్లాలో కూడ ఉన్నట్లు శ్రీమతి ముత్యాల సంధ్య, శ్రీ వీధి వివేకానందస్వామి తమ తమ లఘుసిద్ధాంతవ్యాస గ్రంధాల్లో పేర్కొన్నారు.

**కల్లుసాకపోయుట** : గ్రామదేవతల ఉత్సవాలలో కల్లును దేవతకు సాకపోయుదురు. ఈ ఆచారం ఈ జిల్లా అంతా బాగా కన్పిస్తుంది. మతసంబంధ, గృహసంబంధ విషయాల్లో, ఆచారాల్లో కల్లును తాగుట, దేవతకు అర్పించుట జానపదులకు సామాన్య విషయం. మానవుడు మద్యం కూడ ప్రాణికి ముఖ్యమైనదని భావించాడు. ఆ తలంపుతోనే తాను త్రాగుటయే కాక, జాతరలలోను, ఉత్సవాలలోను దేవతకు కూడ సమర్పించి, దానిని నొక ఆచారంగా భావించి కొనసాగిస్తున్నాడు. 'భూమిని ఫలవంతంగా నొనర్చుటకు దాని ఫలితాశక్తిని కావించుటకు మద్యం తోడ్పడునను భావం ప్రాచీనుల కుండెడిది'14 అని శ్రీ దేవిప్రసాద్ చటోపాధ్యాయ పేర్కొన్నారు. శారీరకంగా శ్రమించే జానపదునకు మద్యసేవనం వల్ల కొంత ఊరట కలుగవచ్చును. ఈవిధంగా గ్రామీణసమాజంలో దీని ప్రాముఖ్యం పెరిగి, క్రమంగా దేవతకు కూడ ప్రీతిపాత్రమగునని భావించిన జానపదుడు కల్లుసాటువ కథను సృష్టించి, కల్లు పోయునివారికి దేవతను ఆలంబనగా చేసికొని జ్ఞానోదయం కూడ కలిగించాడు. (ఈకథ పంబల వారు ప్రకరణంలో వస్తుంది.)

**గండదీపం** : గ్రామదేవత జాతరరోజు దేవత గుడి ముందు నాల్గుఅడుగుల ఎత్తున్న తాటి మొద్దును పాతి, దానిపై మండిగ (పెద్ద ప్రమిద) ఉంచి, నూనె పోసి, వత్తివేసి వెలిగిస్తారు. దీనిని గండదీపం అంటారు. ఈ గండదీపం కొత్తపల్లి మండలం గోర్స గ్రామంలో కన్పిస్తుంది. పిఠాపురం మండలం రాపర్తి గ్రామంలో వెదురు బొంగును నాల్గుబద్దలుగా చీల్చి, వాటి మధ్య ప్రమిదను ఉంచి వత్తివేసి గండదీపం వెలిగిస్తారు. ఈరకంగా వెలిగించేదీపాన్ని బిక్కవోలు మండలం

(మత్స్యకారుల) మొక్కులను సంబంధిత ప్రకరణంలో వివరించాను. వరి, చెరకు, బాగుగా పండించే మెట్టప్రాంతంలో ధాన్యపు గుదులు, బెల్లంగుత్తులు కూడ అమ్మవారికి సమర్పిస్తారు. కొనసీమ ప్రాంతంలో కొబ్బరిమొక్కలు సమర్పిస్తారు.

పుణ్యస్త్రీలు తమ మాంగల్యాన్ని కాపాడమని మంగళసూత్రాలు అమ్మవారికి సమర్పిస్తారు. పొంగు వంటి అంటువ్యాధులు వచ్చినపుడు, పుండ్లు కళ్లమీద వేస్తే కళ్లుపోతాయనే ఉద్దేశంతో, పుండ్లు తగ్గితే వెండి, బంగారు కళ్లు సమర్పిస్తామని మొక్కుకొని అవి తీరుస్తారు.

అనారోగ్యం కలిగినపుడు దానికి సంబంధించిన చిత్రవిచిత్రమైన మొక్కులు కూడ గ్రామీణులు చెల్లిస్తారు. కాలు, చేయి విరిగి అవి తిరిగి అతికితే కర్ర కాలు, కర్రచేయి అమ్మవారికి మొక్కు చెల్లించిన సందర్భాలు కూడా ఉన్నాయి. ఇవి వానపల్లిపల్లాలమ్మకు చెల్లించినట్లు కనపడుతుంది. తలపోయేటంతటి ఆపద కలిగి, అది తొలగినవారు కర్రతలను కూడ దేవతకు మొక్కు చెల్లిస్తారు.

అమ్మవారి గుడి ఆవరణలో మొక్కులున్నవారు తలనీలాలు గొరికించుకొని, ఆరకమైన మొక్కులు కూడ తీర్చుకుంటారు.

**ఇతర నమ్మకాలు :** దేవతల ఉత్సవాలలో పాటించే ఆచారాలలో ప్రజల నమ్మకాలను ఆయా సందర్భాలలో వివరించాను. మరికొన్ని ఇతర నమ్మకాలను వివరిస్తాను. గ్రామదేవతల పేర్లను గ్రామీణులు తమ పిల్లలకు పెట్టుకుంటారు. ముఖ్యంగా జాతర రోజులలో పుట్టిన పిల్లలకు తప్పక దేవతపేరే పెడతారు. ఈవిధంగా దేవత పేరు పెట్టిన పిల్లలు మరణిస్తే, వారి పేరుమీద చిన్న బొమ్మలు చేసి, దేవత గుడిలో పెడతారు.

సాధారణంగా వైదికదేవుళ్ల పటాలు (కేలండరులు) ప్రజలు తమ ఇళ్లలో పెట్టుకుంటారు. కాని దేవత పటాలు తమ ఇళ్లలో పెట్టుకోవటానికి అంగీకరించరు. దేవత చాలా మహిమాన్వితురాలని, ఆమెను నియమ నిష్ఠలతో కొలవాలని ఆవిధంగా కొలవకపోతే ఆమె వారిని నాశనం చేస్తుందని భావిస్తారు. గ్రామస్థులు తమ గ్రామదేవత రాత్రులందు గ్రామమంతా తిరుగుతుందని ఆసమయంలో రాత్రులందు ఆమెను చూసినవారు, ఆమె ధాటికి తట్టుకోలేక మరణిస్తారని, ఆవిధంగా మరణించినవారు దయ్యాలై ప్రజలను పీడిస్తారని నమ్ముతారు. కావున రాత్రులందు ముఖ్యంగా అర్ధరాత్రి సమయమందు ప్రజలు బయటకు వెళ్లరాదని చెబుతారు. రాత్రులందు బయట తిరుగుతూ, చీకటి తప్పులు చేసేవారు ఆతప్పులు చేయకుండా నిరోధించటానికి జానపదులు దేవతను ఆలంబనగా చేసుకొని కావించిన ఈ నమ్మకం ఎంతైనా సమర్థనీయం ఇలాంటి నమ్మకాలన్నీ గ్రామీణుల మానసిక స్థితిని తెలియచేస్తాయి.

గ్రామస్థులందరికీ వర్తించే నమ్మకాలతోపాటు గ్రామంలో ఏదో ఒక కుటుంబీకులకు చెందిన నమ్మకాలు కూడ కన్పిస్తున్నాయి. ప్రాచీనకాలంలో ప్రసవసమయంలో స్త్రీలు ఎక్కువగా చనిపోయేవారని, ఆవిధంగా చనిపోయినవారు కామినులు అవుతారని, ఆ కామినులను కూడా భయపడి పూజించుట కన్పిస్తుంది. ఈ కామినులకు సంబంధించి ఈ జిల్లాలో పిఠాపురం తాలూకా



దేవతగుడి ఆవరణలో తల నీలాః
సమర్పించుకొనుట



నోటిలో గడ్డిపరకలతో, కావడి
కోళ్ళుతో మ్రొక్కుచెల్లించు కొనుట



దేవతకు మ్రొక్కు చెల్లించిన కఱ్ఱతల,
కాలు, చేయి.



దేవతపేరుపెట్టిన పిల్లలు చనిపోతే వారిపేరుతో దేవతగుడిలో బొమ్మ నుంచుట



ఎల్లేనుగు దృశ్యం



చల్లఘటం, దేవతకలశంతో గ్రామంలో తిరుగుచున్న ఆసాదులు



పూటోలగం దృశ్యం

తాటిపర్తి గ్రామంలో ఒక నమ్మక మున్నది.

ఈ కామినుల నమ్మకాన్ననుసరించి, ఈ గ్రామంలోని 'గారపాటి' అనే యింటి పేరు గల కాపు కులస్థులు పల్లకి ఎక్కుట గాని, తలుపులకు సున్నం వేయుటగాని చేయరు. దీనికొక కారణం చెబుతారు. వీరి కుటుంబంలోని ఒక వ్యక్తి పొలంలో ఉండగా, కామిని మనుష్యరూపంలో వచ్చి, అతనితో గడిపేదట. వారి ఇంటికి కూడ వచ్చి ఉండేదట. ఆవ్యక్తి ఆకామిని జడను కోసి, పెట్టెలో ఉంచాడట. అతడు మరణించాక అందున్న జడను బయట వెయ్యగా, దాన్ని తీసుకొని, కామిని మర్రిచెట్టుమీదికి వెళ్ళి అదృశ్యమైనదట. అంతేకాక ఆ కుటుంబం వారు పల్లకి ఎక్కినను, తలుపు మూలన సున్నం వేసినను మళ్ళీ వస్తానన్నదట. అందుచేత అప్పటినుంచి వారు ఆ పనులు చేయుటం లేదు.

**పూజారి - పూనకం :** ప్రతి గ్రామదేవతకు పూజారి ఉంటాడు. పూజారిగా వితంతు స్త్రీలు కాని, వయసు మీరిన పురుషులు గాని ఉంటారు. కులాన్నిబట్టి, చాకలి, ఆసాది, కుమ్మరి పూజారులుగా ఉంటారు. ఈ జిల్లా మెట్టప్రాంతంలో చాకళ్ళు, డెల్టాప్రాంతంలో ఆసాదులు పూజారులుగా కన్పిస్తారు. కుమ్మరులు పూజారులుగా ఉండడం చాలా తక్కువ. గ్రామదేవత సంబరంలో పూజారిదే ప్రధానపాత్ర. ఈతడు జాతరకు ముందు నుంచి పండ్లు ఫలహారం తీసుకొని నియమనిష్టలతో ఉంటాడు. గ్రామ దేవత పూనకం సాధారణంగా పూజారికే వస్తుంది. ఈతడు శివమూగుతూ అమ్మవారి కోరికలు, భక్తులు అడిగినప్రశ్నలకు జవాబులు చెబుతాడు. ఈతడు చెప్పిన మాటలనుబట్టి జాతరలో ఏవైనా లోటుపాట్లు జరిగితే గ్రామస్థులు సవరించుకుంటారు. దేవత పూనినపుడు శివమూగుతున్న పూజారికి కోడిపిల్లనిస్తే పీక కొరికేస్తాడు. కొందరు పూజారులు మేక మెడను కూడ కొరుకుతారట. అట్టి సందర్భాలు నాకు కన్పించలేదు.

ఈ పూనకం పూజారికే కాక, సామాన్య వ్యక్తులకు కూడ వస్తుంది. ముఖ్యంగా జాతర రోజులలోనే ఈ పూనకాలు కన్పిస్తాయి. నేను విషయ సేకరణకు వెళ్ళినపుడు 'గొల్లప్రోలు' మండలం వన్నెపూడి గ్రామంలో ఒక స్త్రీకి పూనకం వచ్చింది. ఆమె మాటలేక పడిపోయింది. గ్రామస్థులు ఆమెను పాము కరిచిందేమో అనుకున్నారు. తర్వాత ఆమె లేచి శివమూగుతుంటే పూనకం అని గ్రహించారు. ఆమె జాతరలో జరిగే లోటుపాట్లను వివరించింది. తమ తప్పు క్షమించమని మరుసటి సంవత్సరం జాతర ఘనంగా చేస్తామని వేడుకొనగా ఆమెకు పూనకం తగ్గింది.

పూనకంతో ప్రయాణిస్తున్న బస్సునే ఆపిన సంఘటనలు కూడ ఉన్నాయి. రాజమండ్రి నుంచి సిటీబస్సులో కడియం వస్తుండగా వేమగిరి గ్రామంలో వానపల్లి గౌరీమల్లీశ్వరి అనే స్త్రీ బస్సు ఎక్కింది. బస్సు వేమగిరి చివర కొత్తగా నిర్మిస్తున్న ముత్యాలమ్మ గుడి దగ్గరకు రాగానే మల్లీశ్వరి ఆ గుడికి నమస్కరించింది. బస్సు కొంతదూరం వచ్చాక ఆమె కేకవేయడం మొదలెట్టింది. బస్సులో ఇతర ప్రయాణికులు కంగారుపడి ఎందుకు కేకలేస్తున్నావని అడిగారు. దానికి ఆమె తాను ముత్యాలమ్మ తల్లినని, తన గుడి దగ్గర బస్సు ఆగకుండ నిర్మాణానికి కావలసిన డబ్బులు ఇవ్వకుండా వచ్చేసిందని, అందుచేత బస్సు కదలటానికి వీల్లేదని బస్సులో కిందపడి దొర్లుతూ గట్టిగా అనేసరికి బస్సు ఆగిపోయింది. ప్రయాణికులంతా ఆమె దగ్గర కెళ్ళి ముత్యాలమ్మా !

శాంతించమని దణ్ణం పెట్టుకొని అర్థించారు. కొందరు ప్రయాణికులు ఫర్వాలేదు బస్సు స్టార్ట్ చెయ్యండి అనేసరికి, మల్లీశ్వరి ఒక్కసారిగా డ్రైవరు మీదికి ఉరికి, బస్సు నడిపావంటే ప్రమాదానికి గురికావడం తప్పదని అనేసరికి డ్రైవరు కిందకి దిగి ముత్యాలమ్మతో శాంతించమని, నీగుడిదగ్గర ప్రతిరోజు దణ్ణం పెడతానని, గుడికి చందాలిస్తానని చెప్పాడు. దానితో ఆమె ప్రయాణీకుల వంక దీర్ఘంగా చూసి, మీరంతాకూడ డబ్బులు ఇవ్వాలని అడిగింది. అప్పుడు బస్సులో ఉన్న ప్రయాణీకులంతా తలా ఒక రూపాయి కండక్టరు చేతికిచ్చి గుడిలో ఇమ్మని చెప్పారు. దానితో ముత్యాలమ్మ పూనకం ఆమెను వదిలింది[16]. ఈ రెండు సంఘటనలను బట్టి దేవతలు పూనకాల ద్వారా తమ పనులు పూర్తి చేసుకుంటారని తెలుస్తుంది.

జాతరలలో వినిపించే డప్పుల శబ్దాలు మానవుని హృదయాంతరాల్లో నిద్రాణమై ఉన్న అవ్యక్తమైన భావాన్ని తాకగా, మానసిక బలహీనత ఉన్నవారు దానికి తట్టుకోలేక శివమూగుతారని, కొందరి విద్యావేత్తల అభిప్రాయం. కాని గ్రామీణులు దేవతమీద ఉండే భక్తి కొద్దీ దీనిని దేవత మహిమగా భావించి, శివమూగుతున్నవారు చెప్పినట్టుగా చేస్తారు. ఈ సందర్భంలో గ్రామీణుల ప్రవర్తననుబట్టి వారి మానసిక స్థితి, దేవతపట్ల వారికుండే భక్తిప్రవత్తులు స్పష్టపడుతున్నాయి.

**గణాచారి - అంటువ్యాధులు - వైద్యం :** గ్రామదేవతకు పూజారితో పాటు గణాచారి కూడ ఉంటారు. కొన్ని గ్రామాల్లో పూజారి గణాచారి ఒక్కరే కావచ్చు. గణాచారిగా స్త్రీకాని, పురుషుడు కాని ఉండవచ్చు. సాధారణంగా స్త్రీలే ఎక్కువగా ఉంటారు. గణాచారికి కొన్ని నియమాలుంటాయి. వీరు మంగళవారం మాంసాహారం తీసుకోరు. దొంగతనం చేయరు. అబద్ధమాడరు. దేవత గణాచారికి కన్పిస్తుందని చెబుతారు. కొత్తమావాస్య (ఫాల్గుణబహుళ అమావాస్య) కు నెలరోజులు ముందు నుంచి ఒంటిపూట భోజనం చేస్తారు. ఈ నెలలోనే పొంగు అంటువ్యాధులు ఎక్కువగా సోకుతాయి. వీరు అంటువ్యాధులను పాగొట్టడానికి 'జాలకం' చేస్తారు.

పొంగు, తట్టు, వేపపువ్వు, కుండలు, మశూచికం అనేవి అమ్మవార్ల వల్ల వచ్చే అంటువ్యాధులని ప్రజల నమ్మకం. చిన్న చిన్న పొక్కులవలె ఉంటే అది పొంగు. తట్టు దద్దర్లు వలె ఉంటుంది. వేపపువ్వు పేలినట్టు ఉంటుంది. కుండలు కురుపులు వలె చాలా పెద్దవిగా ఉంటాయి. కాలిన బొబ్బలవలె ఉండేది మశూచికం. అమ్మవారు ఈ జబ్బులరూపంలో వచ్చి, పిల్లలతో ఆడుకొనివెళుతుంది. కావున వీటిని ఆటలమ్మ అని కూడ అంటారు. ఈ అంటువ్యాధులు వస్తే నూకాలమ్మ దేవత వచ్చినట్టు భావిస్తారు. దేవతకు గుడిలో పెట్టే ఆహారం చాలకపోతే అంటువ్యాధుల రూపంలో ఊరిమీద పడుతుందని గ్రామీణుల నమ్మకం.

ఇలాంటి వ్యాధులు వచ్చేముందు ఆయా వ్యక్తులకు రెండు మూడురోజులు జ్వరం వస్తుంది. అమ్మవారు ఈవిధంగా రోగాలరూపంలో అవహించగానే, రోగాలు వచ్చిన వ్యక్తులు ఏమికోరితే అవి పెడతారు. వారి కోరికలన్నీ తీరిస్తే అమ్మవారు వేగంగా వెళ్లిపోతారని (జబ్బు తొందరగా తగ్గిపోతుందని) భావిస్తారు. ఒక కుటుంబంలో ఎవరికైనా ఈవ్యాధులు వస్తే, తగ్గేవరకు వారికి స్నానం చేయించరు. అంతేగాక ఆ గృహస్థులెవ్వరూ తల స్నానం చెయ్యడంగాని, బట్టలు చాకలికి వేయడంగాని, ఉతకడంగాని చేయరు. పురుషులు గడ్డం, క్షౌరం చేయించుకోరు.

ఇలాంటి నియమాలతో ఉంటే కనీసం నెలరోజులలో తగ్గుతుందని చెబుతారు. వచ్చినపుండ్లు పూర్తిగా మానిపోయాక, లక్ష్మివారం కాని, ఆదివారం కాని తెల్లవారు జామున వేపాకు నలుగుపెట్టి, తలస్నానం చేయిస్తారు. వేపాకు అమ్మవారికిష్టమని (రోగనివారిణి కనుక) భావిస్తారు. ఈ స్నానం ఇతర రోజులలో చేయించరు. మంగళవారం మరిడి తల్లిదని, శుక్రవారం కనకదుర్గదని అంటారు. అంటువ్యాధి నూకాలమ్మది కనుక ఈ రెండురోజులు స్నానం చేయించరు. చేయిస్తే ఎక్కువవుతుందని నమ్ముతారు. ఈ అమ్మవారు అవహించిన వారిని (రోగాలు వచ్చినవారిని) తాలింపు పెట్టే చోటుకు (వంటగది) రానివ్వరు. తాలింపు వినబడనివ్వరు. అమ్మవారు తీవ్రంగా ఉన్న రెండు, మూడురోజులు ఆ ఇంటివారు కూడ తాలింపు పెట్టుకోరు.

అమ్మవారు ఆవహించిన వ్యక్తికి దిగుదుడిచి (వ్యక్తిచుట్టూ తిప్పి) ఒక కొబ్బరికాయ, శేరుసోలడుబియ్యం, సోలడు పెసరపప్పు, కోడిపిల్ల కూడ గణాచారికి ఇస్తారు. కొబ్బరికాయను అమ్మవారికి (అమ్మవారిని ఆవహించిన వ్యక్తికి) దిగదుడిచి ఎవ్వరూ మసలని (నిర్జన) కూడలిలో కొడతారు. ఈ కొబ్బరికాయ అమ్మవారికి, అమ్మవారిని అవహించిన దూతలకు ఆహారమని భావిస్తారు. గణాచారి వ్యాధి తగ్గటానికి 'జాలకం' కూడా చేస్తుంది. అంటే తొలివార్పు అన్నం, పెరుగు, ఉల్లిపాయ ఆకులో పెట్టి, పొంగు చల్లినవానికి దిగదుడిచి వాని మంచం కింద పెడతారు. పసుపు నీళ్ల చెంబులో వేసి, దిగదుడిచి, మంచం కింద తలవైపు పెడతారు. గణాచారి నూటొక్క దేవతలను పేర్లు పెట్టి పిలుస్తుంది. అలా పిలిస్తే, వారు వచ్చి పొంగు చూపిన అమ్మవారిని (నూకాలమ్మను) తగ్గిస్తారని భావిస్తారు. మంచం కింద ఉంచిన అన్నం, పసుపునీళ్లు తీసుకెళ్లి పారే గంగలో కలుపుతారు. (ఆగంగలో పడి అంటువ్యాధులు కూడ కొట్టుకొనిపోతాయనే ఉద్దేశం కావచ్చు). ఈవిధంగా మూడురోజులు చేస్తే, మూడువరోజుకి అమ్మవారు దిగిపోయి, పిల్లవానికి స్వస్థత చేకూరుతుందంటారు.

అమ్మవారి జబ్బులు తగ్గాక స్నానం చేయించిన రోజున అమ్మవారికి చలి ఉపారం పెడతారు. అంటే ఆ ముందురోజు రాత్రి వండిన అన్నము, పెరుగు, ఉల్లిపాయ, అరటిపండ్లు, బెల్లమ్ముక్క, అరటి ఆకులో పెట్టి, నిండుబిందె మీద ఉంచుతారు. దీనిని చాకలివానికి ఇస్తారు. ఆతర్వాత స్నానం లక్ష్మివారం అయితే ఆదివారం, ఆదివారం అయితే లక్ష్మివారం వేడి ఉపారం పెడతారు. అంటే వేడన్నం, పప్పు, పొంగుబూర్లు (సెనగపప్పు కలపనివి), అప్పాలు, పాలకాయలు, అరిటాకులో ఉంచి, నిండుబిందెమీద పెడతారు. కొబ్బరికాయ, చలిమిడి, వడపప్పు, తమలపాకులు, చెక్కలు, గుగ్గులం, పానకం(పోతురాజుకి) మొదలైనవి తీసుకొని గుడికెళ్లి, అమ్మవారికి సమర్పిస్తారు.

అమ్మవారు రోగాలు రూపంలో వస్తే అందమైన వారికి అందం తీసుకుంటుందని, అందహీనులకు అందమిస్తుందని అంటారు. (ఈ భావన రోగాలబారిన పడిన వారిని ఓదార్చే సమర్థన కావచ్చు.) అమ్మవారి కుండలు (పుళ్లు) ముఖంమీద ముఖ్యంగా కళ్లమీద వేయకుండా, వెండికళ్లు, బంగారు కళ్లు ఇస్తామని మొక్కుకొని, వ్యాధి తగ్గితే వాటిని దేవతకు సమర్పించుకుంటారు. తెలగపిండికూర, తవుడురొట్టె, చోడిపిండి అట్టు, మునగకూర, ఎండిచేప పులుసు, మొదలైనవి అమ్మవారి కిష్టమని భావించి, అంటువ్యాధులు వచ్చినవారికి తప్పక పెడ్తారు. ఇవేకాక రోగులు ఇష్టంతో అడిగినవన్నీ కూడ పెడతారు. అలాపెడితే అమ్మవారి బూతి(కోరిక) తీరి, తొందరగా

రోగులను విడిచిపోతుందని నమ్ముతారు.

**గ్రామదేవతల జాతర - గ్రామస్థులు :** గ్రామదేవతల జాతరలో కులాన్నిబట్టి అన్ని కుళాలవారు పాల్గొంటారు. అగ్రకులాలవారు ప్రముఖపాత్ర వహించకపోయినా, ధనధాన్యసహాయం చేస్తారు. గ్రామదేవతలకు పుట్టింటి, అత్తింటి వారుగా అగ్రకులాలవారే ఎక్కువగా కనపడతారు. చాకలి, ఆసాది, గొల్ల, కుమ్మరి, మాల వంటి నిమ్నకులాలవారు పూజారులుగాను, గణాచారులు గాను ఉంటారు. ముఖ్యంగా కులవృత్తులవారు జాతరలో తమ తమ పాత్రలు నిర్వహిస్తారు. చాకలి ఆసాదులు పూజారులుగా ఉంటూనే గరగల నృత్యం చేస్తారు. మాదిగలు మంగళ్ల నృత్యాన్ని కనువైన వాద్యాలు వాయిస్తారు. వడ్రంగి అమ్మవారి జాతరలో వేసే ఊయలకు తాటిబద్దలు చీల్చుట, చెక్కుట, ఊయలబల్ల తయారుచేయుట, మొదలైన కార్యక్రమాలు నిర్వహిస్తాడు. గొల్లలు అమ్మవారికి బలి ఇచ్చు మేక లేక గొర్రెను ఇస్తారు. కుమ్మరి కుండ (పూలగరగ) (మండిగ) (గండదీపం) వంటి మట్టిపాత్రలను ఇస్తాడు. ఈవిధంగా అన్ని కులాలవారు జాతరలో తమ తమ పాత్ర నిర్వహిస్తారు.

ఈవిధంగా నిర్వహించినందుకు గాను వారికి తగు ప్రతిఫలం కూడ ముడుతుంది. దేవతకు వచ్చిన నైవేద్యాన్ని చాకళ్లు, మాదిగలు పంచుకుంటారు. బలి యిచ్చిన జంతు మాంసాన్ని కూడ చాకళ్ల మాదిగలు పంచుకుంటారు. కొన్ని గ్రామాల్లో ఊయల తాటిబద్దలకు కూడ బలి ఇస్తారు. ఈ బలిజంతువు మాంసాన్ని వడ్రంగి తీసుకొంటాడు. బలి జంతువు చర్మాన్ని మాదిగ తీసుకుంటాడు. బలి జంతువును ఈతడే బలి ఇస్తాడు. కొన్ని గ్రామాల్లో పొలిమేరకట్టు సందర్భంలో కూడ జంతుబలి ఇస్తారు. ఈవిధంగా బలిజంతువులు అధికమై, మాంసం ఎక్కువగా ఉన్నప్పుడు గ్రామ పెత్తందార్లకు, సర్పంచి, మొదలైన జాతర నిర్వాహకులకు కూడ మాంసంలో వాటా లభిస్తుంది.

ఈనాడు గ్రామాల్లో కులరాజకీయాలు, ముఠా (గ్రూపు) రాజకీయులు అధికంగా కన్పిస్తున్నాయి.) ఈ రాజకీయాలు తమవరకే కాకుండా, దేవత వరకు పాకించిన గ్రామాలు కూడ ఈ జిల్లాలో ఉన్నాయి. ఈ సంఘటన నాకు ఈ జిల్లాలోని కొత్తపల్లి మండలం గోర్స గ్రామంలో తటస్థించింది. ఆ గ్రామ దేవత మాదాలమ్మ జాతర జ్యేష్ఠపూర్ణిమకు జరుగుతుంది. జాతరను పరిశీలించి, కావలసిన ఛాయా చిత్రాలు సేకరిద్దామని నేను ఆ గ్రామం వెళ్లాను. ముందుగా అంటే జాతరకు పది, పదిహేనురోజుల ముందు వెళ్లి, జాతర జరిగేరోజు గ్రామ సర్పంచి నడిగి తెలుసుకున్నాను. జాతర ప్రారంభమయ్యేరోజు రాత్రి సమయ మందు మిత్రుని తీసుకొని, కెమేరాతో ఆగ్రామం వెళ్లాను. సర్పంచి గరగల సంబరంతో ఊయలతాడి తెస్తున్న వీధివైపు చూపించి, వెళ్లి కావలసిన ఛాయాచిత్రాలు తీసుకొమ్మని చెప్పాడు. మిత్రునితో వెళ్లి, ఛాయాచిత్రాలు తీయటానికి ఉపక్రమించగా, ఆ వీధివారు నన్ను ఆటకాయించుటయే కాకుండా నా కెమేరాను కూడ లాక్కున్నారు.

దీని కొక కారణం ఉంది. ఆ గ్రామంలో సర్పంచికు వ్యతిరేక వర్గం ఉంది. వారు గొల్లవ్యక్తిని దేవతకు బలి ఇచ్చే మేకను అడిగితే, అతను ఇవ్వనన్నాడట. అయినప్పటికీ అతని మేకను దొంగిలించి తెచ్చి, దేవతకు బలి యిచ్చే ఉద్దేశంతో ఆ వీధివారున్నారు. ఆ గొల్లవాడు, సర్పంచి కలిసి, జాతర జరుగుతున్న తీరును ఫోటోలు తీయించి, మేకను దొంగిలించిన వారిని కటకటాలుపాలు చేయించే ఉద్దేశంతో నన్ను నియమించారేమో నని ఆ వీధివారు భ్రమపడ్డారు. ఆ జాతరలో నా

విషయసేకరణ జరగలేదు సరికదా ! కెమేరా కూడ పోగొట్టుకున్నాను. తర్వాత ఆ గ్రామంలో మా దూరపు బంధువులు, కులస్థులు, నా స్నేహితులకు బంధువులు ఉన్నందున వారందరిచేత చెప్పించి, నా కెమేరాను తెచ్చుకోగలిగాను. కెమేరాకోసం కనీసం ఇరువదిసార్లయినా ఆగ్రామం వెళ్లిఉంటాను. క్షేత్ర పరిశోధనలో ఇన్ని ఇక్కట్లు ఎదురవుతాయి. అవి భరించినవారికే ఎరుక.

మతాన్ని దృష్టియందుంచుకొని గ్రామదేవతపరంగా మాట్లాడితే ముందుగా అరుణ్ శౌరి గారి మాటలను ఉటంకించాలి. 'ఈతడు ఒక పత్రికా సంపాదకుడు. ఈయన వ్యాఖ్యలు రాజకీయనాయకుల్ని కూడ పదవీచ్యుతులను గావించాయి. మతాన్ని మీకనుకూలంగా వ్యాఖ్యానించారని మీమీద నింద ఉన్నది అనే ప్రశ్నకు ఆయన సమాధానం ఈవిధంగా ఉన్నది. నా దృష్టిలో మత మనేది మత గ్రంథాలకు పరిమితం కాలేదు. మతం వాటన్నింటినీ అధిగమించింది. మందిరాలకు, మసీదులకు, చర్చిలకు అందని దూరంలో ఉన్నది. ప్రతి పల్లెలోనూ పల్లీయుల సుఖశాంతులకోసం వెలసిన దేవత లాంటిది మతం. ఐతే ఆ దేవత అన్ని మతాలకు అతీతం. అన్ని మతాలవారు ఆదేవతను ఆరాధిస్తారు.... మతానికి మానవ ప్రత్యామ్నాయాల్ని మనం వెలకొల్పాలి. ఐతే అది కులపరమైంది కాకూడదు. మతం నీ అధికారాన్ని, ఏలుబడి కొనసాగించడానికుపయోగపడే సాధనం కాకూడదు'.[17]

కాని మా జిల్లాలోల గ్రామదేవతను హిందులువు తప్ప ముస్లిములు, క్రైస్తవులు ఆరాధించిన సంఘటనలు కన్పించలేదు. గ్రామదేవత జాతర రోజు గుడివద్ద అనేకరకాల దుకాణాలు వెలుస్తాయి. రకరకాల ఆటలు కూడ ఆడతారు. ఈ ఆటలలో డబ్బులు పందెం వేసుకొని ఆడతారు. కాబట్టి వీటిని జూదాలుగా కూడ చెప్పవచ్చు. అక్కడ ఆ గ్రామస్థులేకాక, ఇరుగుపొరుగు గ్రామస్థులు కూడ చేరతారు. వానపల్లి పల్లాలమ్మ, పెద్దాపురం మరిడమ్మ, తుని వద్ద తలుపులమ్మ, మొదలైన దేవతల జాతర సంధర్భంలో పొరుగు జిల్లాల నుంచి కూడ ప్రజలు వస్తారు. ఈ విధంగా వచ్చే ప్రజలలోనున్న తమబంధుమిత్రులను కలుసుకోవటానికి, జనసందోహాన్ని చూడటానికి, అక్కడ ఉండే జూదపు ఆటలలో పాల్గొనడానికే తప్ప దేవతమీద భక్తితో దేవతను ఆరాధించే ఉద్దేశంతో వచ్చే హిందూమతేతరులను నేను చూసి యుండలేదు.

**గ్రామదేవతల జాతర - ఆర్థికాంశాలు :** ఏ పని చేయుటానికైన డబ్బు కావాలి. జాతరకు కూడ డబ్బు అవసరమే. గ్రామదేవతలలో కొందరికి పుట్టింటివారు లేక సంస్థానపు రాజు ఇచ్చిన మాన్యము ( భూమి) ఉంటుంది. ఆ భూమిమీద వచ్చే పంటతో జాతర ఘనంగా చేస్తారు. ఈ విధమైన మాన్యాలున్న దేవతలు చాలా తక్కువ. ఉదా : వానపల్లి పల్లాలమ్మ, పెద్దాపురం మరిడమ్మ, కాండ్రకోట నూకాలమ్మ మొదలైన ప్రతీతి పొందిన దేవతలకుతప్ప మిగతా దేవతలకు మాన్యములు లేవు. కావున దేవతల జాతరను గ్రామస్థులందరూ చందాలు వేసుకొని నిర్వహిస్తారు. సంస్థానాలుండే పూర్వపు రోజులలో ఆయా గ్రామదేవతల జాతరలకు ఆయా సంస్థానాధీశులు ఆర్థికసహాయం చేసేవారు. గ్రామదేవతకు బలి ఇచ్చే జంతువును కూడ సంస్థానాదీశుడే పంపేవాడు. కావుననే ఇప్పటికీ గ్రామస్థులందరి తరపునా బలిఇచ్చే జంతువును 'పట్టాపోతు' లేక 'దివాణంపోతు' అని అనడం విన్పిస్తుంది. ఈ పోతును బలి ఇచ్చిన తరువాతనే వ్యక్తిగతమైన మొక్కులున్నావారు తమ తమ బలి జంతువులను ఇస్తారు.

ఆర్థికాంశాలలో ఖర్చుకు సంబంధించినవేకాక ఆదాయానికి సంబంధించినవి కూడ పేర్కొనవలసి యున్నది. ఈ జిల్లాలో ఎక్కువ మాన్యములున్న లేక ఆదాయమున్న దేవతల ఆలయాలు రాష్ట్రప్రభుత్వ దేవాదాయ ధర్మాదాయశాఖ వారి ఆధ్వర్యంలో నిర్వహింపబడుతున్నాయి. వీటికి వచ్చే ఆదాయాలు ఒక పరిమితిని మించి ఉండటం వల్ల ఇవి దేవాదాయశాఖ వారి ఆధీనంలో ఉన్నాయి. తలుపులమ్మ ఆలయానికి ప్రతి ఆదివారం, సంవత్సరం పొడుగునా కూడ ఆదాయం వస్తుంది. ఇక నూకాలమ్మ, మరిడమ్మ, పల్లాలమ్మ ఆలయాలకు జాతర సమయంలో అక్కడకు వచ్చే భక్తుల రద్దీని దృష్టియందుంచుకొని, ఆలయ ప్రవేశానికి, దేవత దర్శనానికి, మొక్కు చెల్లింపుకు, తలనీలాల సమర్పణకు రకరకాల రేట్లు నిర్ణయించి, ఆదాయాన్ని రాబట్టుతారు. ఈ ఆదాయంతో ఆలయ పునర్నిర్మాణం, అభివృద్ధి, మొదలైన కార్యక్రమాలు నిర్వహిస్తూనే కొందరు ప్రబుద్ధులు గుటకాయా స్వాహాకూడా చేస్తారు. అట్టివారిని ఆ దేవతే ర(శి)క్షించాలి.

**గ్రామదేవతల - జాతర - కుటుంబ ఆచారాలు :** సాధారణంగా ప్రతి గ్రామదేవతకు పుట్టింటి వారు, అత్తింటి వారు ఉంటారని చెప్పుకున్నాము. అత్తింటి వారులేకున్నా పుట్టింటివారుంటారు. అమ్మవారి జాతర వీరి ఆధ్వర్యంలోనే జరుగుతుంది. అమ్మవారికి కుంభం, చీర, రవిక, మొదలైనవన్నీ వీరే పంపుతారు. కొన్ని గ్రామాల్లో జాతర సమయంలో దేవత అత్తింటి వారి ప్రాధాన్యం ప్రస్ఫుట మవుతుంది.

**ఉదా :** పిఠాపురం తాలూకా కొండెవరం గ్రామదేవత పెద్దింటమ్మకు 'దొడ్డి' వారు పుట్టింటివారు. 'గాది' వారు అత్తింటివారు. జాతరలో 'ఎ(తె)ల్లేనుగు' కూడ గరగలతోపాటు తిరుగుంది. ఎ(తె)ల్లేనుగు అనగా (ఐరావతం) వెదురు బద్దలతో ఏనుగు ఆకారం తయారు చేసి, దానికి చేటలు చెవులుగా అమర్చి, పైన తెల్లటి దుప్పటి కప్పి, అంబారీ వలె తయారు చేస్తారు. దీనిమీదికి దేవత అత్తింటి వ్యక్తి కూర్చుని ఊరేగుతాడు.

ఈ జాతరలో పూటోలగం (పోటువాలకం) కూడ కన్పిస్తుంది. పుట్టింటి ఇంటి పేరుకు చెందిన ఒక వ్యక్తికి కటి ప్రదేశంలో ఒక ఇనుప చుట్టను తగిలించి, దానికి కర్ర అమర్చి, ఒక వ్యక్తి పట్టుకొనును. ఇనుప రింగు నడుముకు తగిలించుకున్న వ్యక్తికి ఒంటినిండా రంగు పూయుదురు. ఆ వ్యక్తిని కర్ర పట్టుకున్న వ్యక్తి తీసుకొచ్చి గుడిలో విడిచిపెడతాడు. దీనిని 'పూటోలగం' అంటారు. ఈ వేషం కూడ ప్రతి సంవత్సరం ఒకే ప్రదేశంలో వేయుదురు. ఈ రెండువేషాలలోను పెద్దగా అంతరార్థం కానరాకున్నప్పటికీ, వేడుకతో చేసే ఆచారాలనవచ్చును. వివాహ వేడుకలలో ఆడ పెళ్లివారి కంటె మగపెళ్లివారి ప్రాముఖ్యం అధికమైనట్లు జాతరలో కూడ దేవత అత్తింటివారి (ఎ(తె)ల్లేనుగు) ఎక్కడంలో) ఆధిక్యత స్పష్టమగుచున్నది.

కొన్ని గ్రామాలలో జాతరలో దేవత పుట్టింటివారు, అత్తింటివారే కాక, ఆయా కుటుంబాలవారు కూడ ప్రధానపాత్ర వహిస్తారు. పిఠాపురం తాలూకా రాపర్తి గ్రామంలో నేరేళ్లమ్మ జాతరలో ఈ రకమైన ఆచారాలు కన్పిస్తాయి. ఈ గ్రామంలో జాతరలో ఎ(తె)ల్లేనుగు మీద 'చింతలవారు' అనే ఇంటిపేరు గల కుటుంబీకుడు అధిరోహించాలి. జాతర సమయంలో వారు గ్రామంలో లేకున్న ఎక్కడున్నప్పటికీ తీసుకొచ్చి ఎల్లేనుగు ఎక్కిస్తారు. గండదీపం వెలిగించినపుడు

దీనిని 'సుందరనెడ్డి' వారి ఇంటి నుంచి వెలిగించి తెచ్చి) గుడిముందు పెడతారు.

ఊయలతాడి, సిడితాడి కూడ ఈ గ్రామంలో తెస్తారు. ఈ తాళ్లను బండిమీద కాక, వ్యక్తులు జడ్డీలు (కావడి) వేసుకొని మోసుకొస్తారు. తెస్తున్న తాటిచెట్టు పెద పెత్తందార్లను కూర్చోబెట్టి తీసుకొస్తారు. తెచ్చిన తాళ్లకు వ్రాసే పసుపు, కోసే కోడిని కూడ, 'చింతపల్లి' అనే ఇంటి వారి వద్ద నుంచి తెస్తారు. సిడిబొమ్మ కూడ చింతపల్లి సుబ్బయ్య గారింటిలోనే ఉంటుంది. ఈవిధంగా కొన్ని గ్రామాల్లో దేవత పుట్టింటి, అత్తింటి వార్లతోపాటు, మిగతా కుటుంబీకులు కూడ ప్రముఖపాత్ర వహిస్తారు. గ్రామంలో వారిలో వారికి ఎన్ని కోపతాపాలు ఉన్నప్పటకీ జాతర సమయంలో ఎంతోకొంత ఐకమత్యంతో మెలగుతారు. ఈవిధంగా గ్రామస్తుల మధ్య ఐకమత్యం సాధించటంలో గ్రామదేవత ప్రాముఖ్యం విదితమగుచున్నది.

## 2. కాలాన్నిబట్టి జరిపేవి :

కాలాన్నిబట్టి జరిపే పండుగలలో పసర పండుగ ముఖ్యమైనది. ఈ పండుగ ఈజిల్లాలోని చాలా గ్రామాల్లో చేస్తారు. 'పసర పండుగ' అంటే పంటచేలు పచ్చగా ఉన్నప్పుడు చేసే పండుగ కనుక దీనికి ఈపేరు వచ్చిందనవచ్చును. వరినాట్లు అయ్యాక శ్రావణ, భాద్రపదమాసాలలో మఖకార్తెలో చేసే పండుగ ఇది. ఈ మాసాలలో ఆదివారం, మంగళవారం, లక్ష్మివారంలలో ఏదో ఒకరోజు ఈ పండుగ చేస్తారు. ఈ పండుగ అన్ని గ్రామాల్లో చెయ్యకపోవచ్చు. కొన్ని గ్రామాల్లోను చేస్తారు. ముఖ్యంగా మెట్టప్రాంతంలో బాగా చేస్తారు. ఆసమయంలో వరిచేను ఈనేదశలో ఉంటుంది. పంట బాగా పండించమని దేవతను కోరుతూ చేసే పండగ ఇది.

పండుగ రోజు అనగా ముందుగా గ్రామ పెద్దలచేత నిర్ణయింపబడిన ఆరోజు అమ్మవారికి పసర పండుగ చెయ్యాలని చాటింపు (దండోరా) వేయిస్తారు. పండుగకు అయిదురోజుల ముందు గరగలు తీసి, సాధారణంగా జరిగే జాతరలో వలె సంబరంచేస్తారు. అయిదవరోజున గ్రామం తరపున మేకపోతును బలిచ్చి, కుంభం, నైవేద్యం దేవతకు చెల్లిస్తారు.

ఇంటివద్ద ఎవరికివారు ఉపా (హా) రములు పెట్టుకొని, కోళ్లను బలి ఇస్తారు. ఈ ఉపారాలను తీసుకెళ్ళి, అమ్మవారి గుడిలో సమర్పిస్తారు.

కొన్ని గ్రామాల్లో పసర పండుగలతోపాటు తొలకరికాలంలో 'తొలకరి జాతర,' పంటకాలంలో 'పంటజాతర' కూడ చేస్తారు. ఈ రెండు జాతరలు కూడ 'పసర పండుగల' వలె చేస్తారు. పసరపండుగను 'ఊడ్పులజాతర' అని కూడ అంటారు. ఈరకంగా ఆయా కాలాల్లో ఈ జాతరలు చేయటంవల్ల ఆయా కాలాలను సవ్యంగా (ఒడిదుడుకులు లేకుండా) కొనసాగించి; తమ పంటలు పండునట్లు చేయుమని గ్రామదేవతను గ్రామస్థులు వేడుకున్నట్లు చెప్పవచ్చు. ఈ జాతరలనుబట్టి గ్రామదేవతకు వ్యవసాయానికి ఉన్న ప్రాముఖ్యం స్పష్టమగు చున్నది.

## 3. ప్రత్యేక సందర్భాలలో చేసే పండుగ :

**అ. అనావృష్టి వచ్చినప్పుడు :** వర్షాలు కురవకపోతే పంటలు పండవు. పంటలు పండకుంటే ఆహారం లేక మానవమనుగడ కుంటుపడుతుంది. కావున వర్షాలు కురిపించమని కూడ దేవతను పూజించటం కన్పిస్తుది.

**సీతలమ్మ పండుగ**: ఈ జిల్లాలో కిర్లంపూడి మండలం గోనేడ గ్రామంలో వర్షాకాలంలో సకాలంలో వర్షాలు కురవకపోతే, గ్రామస్థులు 'సీతాలమ్మ' అనే దేవతను పూజిస్తారు. గ్రామపెద్దలు స్నానం చేసి, భజన చేసుకుంటూ గ్రామమంతా తిరుగుతారు. అమ్మవారి గుడికి చలిమిడి, వడపప్పు, మొదలైనవి తీసుకెళ్లి సమర్పిస్తారు. ఈవిధంగా చేస్తే వర్షం కురుస్తుందని భావించి చేసే పండుగ ఇది. 'సీతాలమ్మ నీటి దేవత'[18] అని వైట్ హెడ్ పేర్కొన్నారు.

**గొంతేలమ్మ పండుగ :** మహాభారత కథానాయకులగు పాండవుల మాతృమూర్తి 'కుంతి'నే గొంతేలమ్మ లేక గొంతెమ్మగా గ్రామస్థులు పూజిస్తారు. ఈమెను ముఖ్యంగా హరిజనులు ఎక్కువగా పూజిస్తారు. సకాలంలో వర్షాలు పడకపోతే వర్షాలు కోసం ఏలేశ్వరం మండలం లింగంపర్తి గ్రామంలో గొంతేలమ్మ పండుగ చేస్తారు.

ఈ పండుగను హరిజన స్త్రీలే చేస్తారు. ఒక హరిజన బాలికకు పసుపు పూసి, గ్రామమంతా తిరుగుతూ, బియ్యం దండుతారు. తిరుగునప్పుడు వీరు గొంతేలమ్మ పాట పాడతారు. ఉదయం నుంచి మధ్యాహ్నం వరకు ఈవిధంగా తిరిగి మధ్యాహ్న సమయంలో నడివీధిలో పిడకలు దాయలు వేసి (నిప్పు వేయకుండా) ఆ పిడకలపై మట్టిపాత్రలో పాలుపోసి పెట్టి గొంతేలమ్మ పాట పాడుతారు. కొంచెం సేపటికి పాలు పొంగడమే కాక, వర్షం కూడ కురుస్తుందని చెబుతారు. ఈవిధంగా నిప్పులేకుండా పాలుపొంగడం, తర్వాత వర్షం కురవడం కూడ గొంతేలమ్మ మహిమగా భావిస్తారు.

**గంగాలమ్మ పండుగ :** గొల్లప్రోలు మండలం తాటిపర్తి, ఏలేశ్వరం మండలం లింగంపర్తి గ్రామాలలో సకాలంలో వర్షాలు కురవని సంవత్సరం వర్షం కోసం 'గంగాలమ్మ పండుగ' చేస్తారు. 'గంగాలమ్మ నీటిదేవత'[19] అని వైట్‌హెడ్ పేర్కొన్నాడు. పండుగ ముందురోజు, ''ఆ మరుసటిరోజు గంగాలమ్మ పండుగ'' అని చాటింపు వేయిస్తారు. చాటింపు ననుసరించి గ్రామస్థులు ఆరోజు తొలివార్పు అన్నం తీసి ఉంచుతారు. ఒక హరిజనుడు 'గంగాలమ్మ గంప' అని ఒక గంపను వీధులందు తిప్పుతాడు. గ్రామస్థులు తాము తీసిన తొలివార్పు అన్నాన్ని ఆ గంపలో వేస్తారు. వాటితోపాటు హరిజనుడు తనకు వీధిలో కనిపించిన కోడి, పంది, మొదలైనవాటిని కొట్టి, గంపలో వేసుకుంటాడు. ఆరోజు అతనిని ఎవ్వరూ ఏమి అనరు. అంటే దేవతకు కోపం వస్తుందని భావిస్తారు.

ఈవిధంగా ఆ జీవులను, అన్నాన్ని తీసుకొని హరిజనులు ఊరి సమీపంనందున్న పెద్ద చెరువు (పంట చెరువు) ఒడ్డుకి వెళ్లి, వాటితో విందు చేసుకొంటారు. వాళ్ల విందు ముగిసేలోపే పెద్ద పెద్ద ఉరుములతోను మెరుపులతోను వర్షం ప్రారంభమయి, అప్పటినుండి విడవకుండా పంటలు

పండే వరకు వర్షాలు కురుస్తాయని చెబుతారు.

ఈవిధంగా అనావృష్టి వచ్చినప్పుడు వర్షాలుకోసం ఈ జిల్లాలో సీతాలమ్మ, గొంతేలమ్మ, గంగాలమ్మ పండుగలు జరుపుతారు.

## ఆ. అనారోగ్య కారణంవల్ల :

**క. అనారోగ్యం వచ్చాక జరిపే పండుగ :** గ్రామంలో ప్రజలకు, పశువులకు అంటురోగాలు సోకి అనారోగ్యంతో బాధపడే రోజులలో చేసే పండుగ ఇది. ఈ పండుగ డెల్టా ప్రాంతంలో ఎక్కువగా చేస్తారు. బిక్కవోలు మండలం బలభద్రపురం గ్రామంలో ఈ సందర్భంలో చేసిన 'కొత్తమ్మ' వారి పండుగను నేను పరిశీలించాను. ఆ గ్రామానికి గ్రామదేవతలు మరిడమ్మ, మహాలక్ష్మమ్మ, వీరికి గుడులున్నాయి. వీరి జాతర వేసవికాలంలో చేస్తారు. కాని పొలిమేరలో 'కొత్తమ్మ' దేవత ఉన్నది. అంటురోగాలు వచ్చినప్పుడు ఈమెను గ్రామంలోనికి తీసుకొచ్చి, రోగాలు తగ్గేవరకు పూజించి, తగ్గాక పొలిమేరకు దిగబెడతారు.

గ్రామంలోని ప్రజలకు, పశువులకు అంటువ్యాధులు తగిలి తీవ్రంగా ఉన్నప్పుడు పొలిమేరలో నున్న కొత్తమ్మను గ్రామంలోనికి తెచ్చి, నడివీధిలో అంగడి గుడి (తాటాకుల గుడిసె) నిర్మించి అందు ఉంచుతారు. ఆసాదివాడు డప్పులతో కొత్తకుండ, హారతికర్పూరం, సాంబ్రాణి, అరటిపళ్ళు, మొదలైన సామాగ్రితో పొలిమేరకు వెళ్లి, అక్కడ కలశపూజ చేసి, కలశంపై బోర్లించిన మూతతో అలంకరిస్తారు. ఈ కలశమే దేవత. వేరొక కుండ కూడ ఉంటుంది. దానిని 'చల్లఘటం' అంటారు. ఉదయాన్నే ఇద్దరు అసాదులు దేవత కలశాన్ని ఒకరు, చల్లఘటాన్ని వేరొకరు ఎత్తుకొని గ్రామమంతా తిరుగుతారు. ఆయా ఇళ్లవారు చల్లఘటంలో కొంత చల్ల (మజ్జిగ) పోస్తారు. చల్లఘటంలోని మజ్జిగను కొంత ఆసాది మళ్ళీ వారి పాత్రలో పోస్తాడు. ఈ చల్లను వారు పశువులు కుడితిగోళెంలో పోస్తారు. ఈవిధంగా పోసిన చల్లకలిపిన కుడితి తాగడంవల్ల వాటి రోగాలు తగ్గుతాయని భావిస్తారు. ఈవిధంగా గ్రామంలో రోగాలు తగ్గి, ప్రజలకు, పశువులకు ఆరోగ్యం చక్కబడి మామూలు పరిస్థితి వచ్చేవరకు చల్లఘటం రోజూ గ్రామంలో తిరుగుతుంది.

గ్రామంలో మామూలు పరిస్థితులు వచ్చాక అమ్మవారిని దిగబెట్టే రోజును నిర్ణయించి, గ్రామపెద్దలు చాటింపు వేయిస్తారు. ఆరోజు గ్రామస్థులంతా తమ తమ ఇళ్ల వద్ద ఉపారాలు పెట్టుకొని, ఆ ఉపారాల పళ్లేలతో అంగడిగుడి వద్దకు వస్తారు. దేవతను దిగబెట్టడానికి ఒక బండి తయారుచేసి, అంగడి గుడి వద్ద ఉంచుతారు. గ్రామస్థులు తెచ్చిన ఉపారాలను ఆ బండిలో వేస్తారు. ఆరోజు సాయంత్రం మూడు గంటలకు గ్రామస్థులంతా అంగడిగుడి వద్దకు వస్తారు. గుడిలో నున్న అమ్మవారి కలశాన్ని బయటకు తెచ్చి, ఆసాది కలశపూజ చేస్తాడు. అమ్మవారి దండకం (అనుబంధంలో ఇవ్వబడింది). దీపం మంగళహారతి పాడతాడు. అమ్మవారికి పుట్టింటి వారిచ్చిన చీర, రవిక, మంగళసూత్రాలు, చుట్లు, పిల్లేళ్లు మొదలైనవన్నీ కలశానికి అలంకరిస్తాడు. వారు ఇచ్చిన గుమ్మడికాయను కలశం ముందు పగుల గొడతాడు. గ్రామసర్పంచి, మొదలైన పెద్దలు కలశాన్ని ఎత్తి ఆసాది తలపై పెడతారు. అతడు శివమూగుతూ ముందు నడుస్తాడు.

ఆసమయంలో ఆయా ఇంటివారు ఈతనికి కోడిపిల్లను ఇస్తే వాటి మెడ కొరికేస్తాడు.

అతని వెనుక గ్రామస్థులంతా అంగడిగుడిని పీకి, ఈడ్చుకుంటూ బయలుదేరతారు. కొంతమంది ఉపారాలు వేసిన బండిని లాగుతారు. వీరంతా కలిపి గ్రామపొలిమేరలోనికి వెళతారు. అంగడిగుడి తగులబెడతారు. అందు రోగాలుంటాయని, దాన్ని తగులబెడితే అవన్నీ నాశనమవుతాయనీ నమ్ముతారు. పొలిమేరలో కలశాన్ని విడిచి, కోడిని బలిఇస్తాడు. ఉపారాలతో ఉన్న బండిని కూడ అక్కడ వదలేస్తారు. అక్కడ నుంచి, ఆసాది, డప్పులు వాయించే మాదిగలు, గ్రామస్థులు అందరూ ఎవరింటికి వాళ్ళు వెళ్లిపోతారు. ఇంతటితో సంబరం ముగుస్తుంది.

**ఖ. అనారోగ్యం రాకుండా జరిపే పండుగ :** ఈ పండుగ కోటనందూరు మండలం నందలి గ్రామాల్లో ఎక్కువగా చేస్తారు. ఈ మండలం నందలి తాటిపాక జగన్నాథపురం గ్రామంలో మరిడమ్మ, నూకాలమ్మ, గొంపమ్మ అని ముగ్గురు దేవతలున్నారు. వీరు ముగ్గురు గ్రామం మధ్యలో దూరం దూరంగా మూడు చెట్లకింద రాళ్లరూపంలో ఉన్నారు. గుడులు, విగ్రహాలు లేవు. వీరికి మఖ కార్తెలో విడివిడిగా పండుగలు చేస్తారు. ఏ అనారోగ్యం రాకుండానే ఈవిధంగా చేస్తామని గ్రామస్థులు చెబుతారు.

మఖ కార్తె వర్షాకాలంలో వస్తుంది. అపుడే కలరా, మొదలైన జాఢ్యాలు వస్తాయి. రోగాలు సాధారణంగా నిద్రలోనే వస్తాయి. ప్రజలు ఉత్సాహంగా, మెలకువగా ఉంటే రోగాలు రావని, ఆరెండుమూడువారాలు అమ్మవార్ల సంబరపు సంరంభంలో గ్రామస్థులంతా ఉత్సాహంగా ఉండటంవల్ల రోగాలు అంటే అవకాశం తక్కువని చెబుతారు. ధ్వనులు, శబ్దాలు అధికంగా ఉండడం వల్ల రోగాలు రావనే ఉద్దేశంతోనే ఈ ముగ్గురు దేవతలకూ ఒక్కసారి కాక, మూడు వారాల్లో మూడుసార్లు చేస్తున్నట్లు చెబుతారు. పూర్వకాలంలో రోగాలు రాకుండా రాత్రులందు బిందెల మీద ఇనుపరాడ్లతో శబ్దాలు చేసేవారట. దుష్టశక్తులు సంక్రమించకుండా ధ్వనులు చేసే ఆచారం అనంతపురం మండలంలో కూడ ఉన్నట్టు, డా. జి.యస్. మోహన్ పేర్కొన్నారు. 'రజస్వల అయిన బాలికలకు 11,21 రోజులలో స్నానమాచరించెదరు. స్నానమాచరించెడి సమయమున గిన్నెలు మ్రోగించుట విశేష ప్రాధాన్యమును కలిగియున్నది. రక్తస్రావ మధికంగా నుండుటచే ఈ సమయమున దుష్టశక్తులు ఆమెను ప్రవేశింప జూచును. కనుకనే స్త్రీలు వాటిని పారద్రోలుటకు ఇట్టి శబ్దములు చేయుదురు'[20].

## ప్రాంతాన్నిబట్టి చేసే పండుగలు :

**అ. మన్యప్రాంతంలో చేసే పండుగలు :** సువిశాలమైన తూర్పుగోదావరి జిల్లాలో మన్యం ప్రాంతం కూడ ఎక్కువగానే ఉన్నది. జిల్లా విస్తీర్ణములో మూడవవంతును మించి అడవులు ఉన్నాయి. అడవుల విస్తీర్ణం 3.23 లక్షల హెక్టార్లు'[21] ఈ ప్రాంతంలో కొండరెడ్డి, కొండ కుమ్మరి, కోయదొర, వాల్మీకి, మొదలైన కులాలకు చెందిన గిరిజనులు నివసిస్తున్నారు. వీరి ప్రధానవృత్తి వ్యవసాయం, మరియు పశుపోషణ కాయ కాసినా, పండు రాలినా, వ్యవసాయానికి సంబంధించి ఏమి జరిగినా వీరికి పండుగే. ముఖ్యంగా గంగాలమ్మ పండుగ, రాజుల పండుగ, వేటపండుగ,

క్రొత్త పంటల పండుగ, పోతు పండుగ, జడ్డి పండుగ, ఉగ్గి ఫండుగ, పప్పు పండుగ మొదలైన పండుగలు వీరు జరుపుకుంటారు.

**గంగాలమ్మ పండుగ :** గంగాలమ్మ పండుగకు ముందు గిరిజనులు పూవులు కోయరు. పూలతో భూదేవి శోభాయమానంగా ఉండాలనేది వీరి కోరిక కావచ్చు. గంగాలమ్మ కుండ (విగ్రహం ఉండదు) ఊరవతల పాకలో కాని, కొడవారన కానీ ఉంటుంది. ఈ పండుగ వైశాఖ శుద్ధ పూర్ణిమకు చేస్తారు. ఆరోజుకు వారం రోజుల ముందు గంగాలమ్మ (కుండ) ను తెచ్చి గ్రామమధ్యలో వేసిన పాకలో ఉంచుతారు. ఒక గిరిజన యువతి నిండుకుండ తలమీద పెట్టుకొని తిరుగు తుంది. ఈ వారంరోజులు గిరిజనులు రాత్రులందు పురుషులు కోలాటం వేస్తూ పాటలు పాడుతుండగా, స్త్రీలు నృత్యం చేస్తారు.

**రావే రావే గంగాలమ్మ - రాగాదే ఓ గంగాలమ్మా**
**ఏడాదికోసారి గంగాలమ్మ - నీ సేవ చేశాము గంగాలమ్మా**
**నెలకు మూడొరసాలు గంగాలమ్మా - మాకు కురిపించవే గంగాలమ్మా**

అని గంగాలమ్మా పాట పాడతారు. ఈ వారంరోజులు ఆముదంతో దేవతకు దీపారాధన చేస్తారు. ఆఖరిరోజు గంగాలమ్మ సోదరుడు పోతురాజుకు, ఆమెకు పూజలు జరిపించి, ఆమెను ఊయలలో ఊరేగిస్తారు. గంగాలమ్మకు మేకపోతును, పోతురాజుకు కోడిని బలి ఇచ్చి, వారిని పొలిమేరకు దిగబెడతారు. మన్యంప్రాంతం రాతినేల అయినందున, మెట్ట పంటలు ఎక్కువగా పండుతాయి. మనకు జూన్ నెలలో వర్షాలు ప్రారంభ మంటతే, మన్యం ప్రాంతంలో మేనెలలోనే ప్రారంభమవుతాయి. అప్పుడే వీరు నాట్లు ప్రారంభిస్తారు. వ్యవసాయానికి ఆధారమైన గంగను (వర్షాన్ని) సకాలంలో సమృద్ధిగా ఇమ్మని దేవతను ప్రార్థిస్తారు. ఈమెను పైరు గంగమ్మ అని కూడ అంటారు. మన్య ప్రాంతంలో ఉండే పూజారిని 'గొరవడు' అంటారు.

**కొత్తపండుగ లేక కొత్తచేయుట :** ప్రతీ సంవత్సరం కొత్తపంట చేతికొచ్చినప్పుడు పండుగ జరుపుకోవడం వీరి ఆచారం. పండుగలు జరుపుకొనేవరకు పంటపై దేనిని వాలనీయరు. గంటెలు, సామలు, మొదలైన పంటలు సాధారణంగా సెప్టెబరు, అక్టోబరు నెలలో వస్తాయి. అవి పండాక మొదట కొన్ని తీసి, వాటి పిండితో వంటచేసి అమ్మవారికి నివేదించి, తర్వాత మిగతావారు తింటారు. దీనిని 'కొత్తచేయుటం' అంటారు. కొత్తచేయని వారిని చేసినవారింటికి రానివ్వరు. వారికి ఎలాంటి సహాయం చేయరు.

**పప్పు పండుగ :** ఈ పండుగ సోమవారం రోజు చేస్తారు. సాధారణంగా ఉలవలు శివరాత్రి నెలలో వస్తాయి. ఉలవలు పండినపుడు ఎవరికి పండితే వారు ముందుగా కొన్ని ఉలవలు గంగాలమ్మ పూజారి కిస్తారు. అతడు వాటిని ఉడకబెట్టి, ఒక బుట్టలో పసుపు, కుంకుమ పూసిన రాయి ఉంచి ఉడకబెట్టిన ఉలవలను కూడ ఉంచి, పదిమంది పిల్లలచేత ఆబుట్ట మోయిస్తూ ఊరంతా తిరుగుతాడు. ఆపిల్లలు 'పప్పు పండుగ' అని కేకలు వేస్తారు. ఈ ఉలవలు గ్రామస్థులందరికీ కొద్ది కొద్దిగా పంచుతాడు. అవి తీసుకున్న గ్రామస్థులు గంపలో దక్షిణ (డబ్బులు) వేస్తారు. ఈవిధంగా పూజారి ఇచ్చిన ఉలవలు దాచుకొని, చిక్కుడులు, గుమ్మళ్ళు కాసినపుడు, ఈ ఉలవలు పాదుమొదట

పోసి, తర్వాత కోసుకుంటారు. ఈవిధంగా ఉలవలు పోసి, ఇతరులు కోసుకున్నా ఆరోజుకు ఎవరినీ ఏమి అనరు తాటి, జీలుగ చెట్లు మొదట పోశాక వాటి కల్లు తాగుతారు.

**ఉగ్గి పండుగ :** పప్పు పండుగ సందర్భంలో ఉడకబెట్టిన ఉలవలు ఉంచిన బుట్టకు పట్టుకోవడానికుండే రంధ్రాలలోనికి కర్రతోసి, ఆ కర్రను పిల్లలు అటువైపు కొందరు, ఇటువైపు కొందరు తమ భూజాలమీద పెట్టుకొని మోస్తారు. ఆవిధంగా మోసే సమయంలో వారు 'ఉగ్గి ఉగ్గి' అంటు తిరుగుతారు. కావున దీనిని ఉగ్గిపండుగ అని కూడ అంటారు.

**జడ్డి పండుగ :** పప్పు పండుగలో బుట్టను జడ్డీవేసి (కావడి వలె) మోస్తారు. కాబట్టి దీనిని జడ్డి పండుగ అని కూడ అంటారు.

**పిండి పండుగ :** 'చోడె' పంట చేతికి వచ్చే సమయంలో గిరిజనులు చేసే పండుగ ఇది. పండిన చోళ్లు పిండిగా విసిరి, ఆ పిండిలో నీళ్లు కలిపి, పిండి ముద్ద బొమ్మ (దేవత బొమ్మ) చేస్తారు. బొమ్మను ఉడికించి, తీసుకెళ్లి అమ్మవారికి పెడతారు. ఆ బొమ్మను ముక్కలుగా చేసి గ్రామస్తులందరికీ ప్రసాదం వలె పంచిపెడతారు. ఈవిధంగా పిండి పండుగచేసిన తరువాతనే చోళ్లు వంటకు ఉపయోగిస్తారు. చోళ్లే కాక, ఆకాలంలో పండే పనస, మామిడి, మొదలైన పళ్ళన్నీ ఈ పిండి పండుగ చేశాకనే తింటారు.

**బడ్డి పండుగ** : జొన్న, వరి, మొదలైన పొలాలు ఈనే సమయంలో పక్షుల నుంచి జంతువుల నుంచి వాటిని కాపాడడానికి పొలంలో బడ్డీవేసి, బడ్డీ మీద నిలబడి వాటిని తరుముతారు. ఈవిధంగా బడ్డీ వేసేటపుడు చేసే పండుగ బడ్డి పండుగ. పప్పు బియ్యం కలిపి వండుతారు. దానిని 'ఒరెం' అంటారు. తమ ఇష్టదైవాలకు చెల్లించి, తరువాతనే గిరిజనులు బడ్డీ ఎక్కుతారు.

**దసరా పండుగ :** మైదాన ప్రాంతంలో చేసే దసరా పండుగకు దీనికి పోలిక ఉండదు. దసరా రోజులలో వచ్చే దినుసులను దృష్టియుందుంచుకొని చేసే పండుగ కాబట్టి దీనికి ఈ పేరు వచ్చిందనవచ్చు. దసరాపండక్కి వచ్చే బుడములు (ధాన్యవిశేషం) ముందుగా పండిన రైతు కుంచెడుకాని మానెడుకాని పూజారికి ఇస్తాడు. అవి దంచి, కొన్ని తీసి పప్పు కలిపి, 'ఒరెం' వండి పూజారి గంగాలమ్మకు నివేదిస్తాడు. మిగతా బియ్యం కొంచెం కొంచెం ఊరంతా పంచిపెడతాడు. ఈ పంచిన బియ్యం తమ బియ్యంలో వేసుకొని తింటారు. అప్పటినుంచి తమకు పండినవి కూడ తింటారు. దీనినే 'కొత్త' అంటారు. ఈరకమైన 'కొత్త' ప్రతి పంటకు చేస్తారు.

**మామిడి పండుగ :** ఈ పండుగ మామిడి కాపుకాసాక చేస్తారు. ఈ పండుగ సందర్భంలో గోవుల మామిడికి, గుబ్బట్టల మామిడికి పెళ్లి చేస్తారు. ఈ పండుగ జరిగితేకాని, వీరు మామిడి ముట్టుకోరు.[22]

**బూదమ్మ పండుగ :** సర్వసంపదలూ ఇచ్చే భూమికి చేసే పండుగే బూదమ్మ పండుగ, వ్యవసాయం బాగా జరగాలని, పంటలు బాగా పండాలని భూదేవికి మొక్కుతూ, జంతుబలి

సమర్పిస్తారు. ఆ రక్తంతో విత్తనాలు కలిపి పూజారి అందరికీ పంచుతాడు. వాటిని అందరూ పొలాల్లో చల్లుతారు.

**రాజుల పండుగ లేక కొండరాజుల పండుగ :** శ్రీరాముని కుమారులైన లవకుశులను కొండరాజులు అనే పేరుతో గిరిజనులు ఆరాధిస్తారు. వీరికి కూడ జంతుబలి సమర్పిస్తారు. ఈ పండగను మైదానప్రాంతంలో ముఖ్యంగా మన్యం ప్రాంతానికి సమీపానున్న గ్రామాలలో జరుపుతారు.

**అడ్డకాయ పండుగ :** అడ్డకాయలు పండేనకాలంలో వాటిని దేవతకు నివేదిస్తూ చేసే పండుగ అడ్డకాయ పండుగ. ఈ పండుగ సందర్భంలో గిరిజనులు తమ పశువులను కాపాడమని దేవతను కోరతారు. ఈవిధంగా గిరిజనులు తమకు పంటలు పండిన సందర్భంలో ఆయా పంటల పేర్లతో ఆయా పండుగలు నిర్వహిస్తారు.

**ఆడపండుగ - పోతు పండుగ :** ఈ పండుగ ఎల్లవరం తాలూకా దేవరమడుగు గ్రామంలో చేస్తారు. గంగాలమ్మ పండుగనే, దేవతకు బలి ఇచ్చే జంతువును బట్టి ఒక సంవత్సరం 'ఆడపండుగ' అని వేరొక సంవత్సరం 'పోతు పండుగ' అని|అంటారు. పందిని బలి ఇచ్చిన సంవత్సరం 'ఆడపండుగ' అని, మేకను బలిచ్చిన సంవత్సరం 'పోతు పండగ' అని అంటారు.

**ఉచ్చల పండుగ :** ఈ పండుగ గంగవరం మండలం రాజవరం గ్రామంలో చేస్తారు. 'పప్పు పండుగ' జరిగాక ఎవరికివారు కల్లు త్రాగటానికి వీలవుతుంది. పప్పు పండుగ మరుసటిరోజు కల్లుతాగే ఉద్దేశం ఉన్నవారు ఆయా గ్రామస్థుల ఇంటి కెళ్లి కల్లు అడుగుతారు. కల్లు పొయ్యకపోతే వారి ఇంటిముందు ఉచ్చపోసేస్తారు. దేవతపేరు లేకున్నా, వినటానికి అసభ్యంగా ఉన్నావారుఉత్సాహంగా చేస్తారు. కాబట్టి దీనిని కూడ పండుగగానే పేర్కొంటారు.

**పేడ పండుగ :** దీనిని గొల్లప్రోలు మండలం కొడవలి గ్రామంలో చేస్తారు. సంక్రాంతి వెళ్లిన మూడవరోజును 'ముక్కనుమ' అంటారు. ఆరోజు కొందరు బాలికలు తమ ఇంటివద్ద నున్న పేడంతా పోగుచేసి (అంతకు ముందు మూడు రోజులక్రితం నుంచి పండుగ కనుక పేడ పిడకలు చేయక పోవచ్చు) పెద్దపోగుగా వేసి, ఆ పేడపోగుకు అగరొత్తులు వెలిగించి, పూజచేస్తారు. సంపదనిచ్చే వ్యవసాయనికి ఎరువుగా ఉపయోగవడే పేడను ఈవిధంగా పూజించటంలో వింతలేదు. సంక్రాంతిరోజుల్లో గొబ్బిళ్ళు పేడతోనే చేస్తారు.

ఈవిధంగా ఈజిల్లాలోని ప్రజలు గ్రామదేవతలకు సంబంధించి, వివిధ కాలాల్లో, వివిధ ప్రాంతాల్లో, వివిధ సందర్భాలలో, వివిధరకాలైన పండుగలు జరుపుకుంటూ నేటికి తరతరాల సంస్కృతిని సంరక్షించుకుంటున్నారనడం సత్యదూరం కాదు.

## అధస్సూచికలు

1. తెలుగు జానపదసాహిత్యము - పురాగాథలు, 1983 పు. 371

2. తెలుగు జానపద గేయగాథలు - నాయని కృష్ణకుమారి, 1977 పు. లు 231.-32

3. "The Kumba itself the Mother Goddess" - Myth & Reality D.D./ Kosambi; 1962.

4. "The Village Gods of South India: W.H. White Head

5. "Encyclopedia of Religon & Ethics Volume 5.

6. "The Village Gods of S. India; p. 147.

7. తెలుగు జానపదగేయగాథలు, నాయని కృష్ణకుమారి,1997 పు. 231

8. Female Worship; Nandita Krishna - Femine. Oct. 9, 1976.

9. ప్రాచీనాంధ్ర సాహిత్యము - దేవీ ప్రతిపత్తి, పు. 237

10. "Voyage to the East Indies & China.

11. "Ethnographic Notes in South India - Thurtson.

12. రాతిస్తంభం - నాటకం - పానుగంటి లక్ష్మీనరసింహం.

13. తెలుగు జానపద గేయగాథల  243

14. "Lokoyata : 1978, p. 308.

15. "The Village Gods of South India, p.51.

16. తెలుగు జానపదగేయగాథలు, పు. 243

17. స్వాతి, వారపత్రిక, 18-4-90

18. "Sitalamma, the Water Goddess! The Village Gods of South India; p.23.

19. "Gangalamma the Water Goddess". Ibid.

20. అనంతపురం మండలం - స్త్రీల పాటలు, పు. 65.

21. ఆంధ్రజ్యోతి దినపత్రిక 31-5-92, తూర్పుగోదావరి జిల్లా ఎడిషన్.

## షష్ఠమ ప్రకరణం

# గ్రామదేవతలు - కథలు - గాథలు - మహిమలు

గ్రామదేవతలకు సంబంధించి రకరకాల కథలు విన్పిస్తాయి. ఒక గ్రామంలో దేవత నిలిచి పూజింపబడుతుందంటే, ఆమె ఆ గ్రామంలో ఏదో ఒక ఇంటిలో పుట్టి, వివాహిత లేక అవివాహితగా మరణించి లేక అదృశ్యమయి దేవతగా వెలయడమో, లేక పొరుగుగ్రామాల నుంచి వలసరావడమో, లేక ఆ గ్రామంలో చెరువు, నుయ్యి మొదలయినవని తవ్వుతున్నప్పుడు బయల్పడిన రాళ్లను, దేవత కోరికపై దేవతగా భావించి పూజించడమో జరుగుతుంది. ఆయా సందర్భాలలో దేవత గురించి ఆయా కథలు విన్పిస్తాయి. అంతేకాక గ్రామదేవతల మహిమల గురించి కూడ గ్రామస్థులు కొన్ని కథలు చెప్పుకుంటుంటారు. ఇవికాక సాధారణంగా దేవతలందరికీవర్తించేటట్లు కూడ కొన్ని కథలు ప్రచారంలో ఉన్నాయి. తూర్పుగోదావరిజిల్లాలోని గ్రామదేవతలను పరిశీలించిన పిమ్మట గ్రామ దేవతలకు సంబంధించిన కథలను ఈవిధంగా వర్గీకరింపవచ్చును.

I. పుట్టుట లేక వెలయుటానికి సంబంధించినవి

అ. వివాహితులుగా మరణించినవారు.

ఆ. అవివాహితులుగా మరణించినవారు, అదృశ్యమైనవారు.

II. వలస వచ్చిన దేవతలకు సంబంధించినవి.

III. త్రవ్వకాల్లో ఇతరత్రా బయల్పడిన దేవతల (రాళ్ల) కు సంబంధించినవి.

IV. మహిమలను తెలిపేవి

V. సాధారణ కథలు

ఒకే దేవతకు సంబంధించి పైన పేర్కొన్న రెండు, మూడు రకాల కథలు విన్పించవచ్చును. కొంతమంది దేవతలకు ఎటువంటి కథలు చరిత్రలు విన్పించవు. బహుశా మరుగునపడి ఉండవచ్చును.

## గ్రామదేవతల కథల - వర్గీకరణ పట్టిక



## 1. గ్రామదేవతల పుట్టుకకు సంబంధించిన కథలు

వివాహిత, అవివాహిత స్త్రీలు మరణించి లేక అదృశ్యమయి తర్వాత తమ తల్లిదండ్రులు లేక సన్నిహితుల కలలో కనిపించి, తాము దేవతలమయ్యామని, గుడి కట్టించి పూజించమని అడుగుతారు. ఏదో ఒక కార్యసాధనకు దైవాంశతోపుట్టి, లేక పుట్టాక దైవాంశను పొంది, కార్యసాధన తర్వాత దేవతలుగా నిలిచినవారు కూడ ఉన్నారు. అట్టి దేవతల కథలను వివరిస్తాను.

### అ. వివాహితులుగా మరణించి దేవతలైనవారు :

**మారెమ్మ :** ఈమె ఈజిల్లాలో పిఠాపురం, జాములపల్లి, అంతర్వేది, ఉచ్చిలి, రాజమండ్రి వాడపాలెం, పెద్దబ్రహ్మదేవం మొదలైన గ్రామాల్లో పూజింపబడుతున్నది. ఈమెను ఎండపల్లి గ్రామంలో గొల్లమారెమ్మ అనీ, కుమారపురం గ్రామంలో నల్ల మారెమ్మ అని కూడ పిలుస్తారు. ఈమె కథ నాకు పిఠాపురం గ్రామంలో లభించింది.

మారెమ్మ ఒక గొల్లస్త్రీ అందగత్తె. భర్త గొర్రెలకాపరి. అత్తగారు రోజూ చల్ల అమ్ముకొనివచ్చేది. వేసవికాలంలో ఒకరోజు చల్లఅమ్మటానికి వెళ్ళి ఎండకు తాళలేక సొమ్మసిల్లిపడిపోయింది. మారెమ్మ ''అత్తతో రేపటినుండి నీవు చల్ల అమ్మటానికి వెళ్లవద్దు. మూడుగాళ్లముగ్గు (పండుముసలి) అయిపోయావు'' అంటుంది. అత్తకోడలుతో నీవు పడుచుదానవు, వెళ్ళటానికి కుదరదు అంటుంది. అయినప్పటికి మారెమ్మ చల్లఅమ్మటానికి వెళ్లనిశ్చయించుకొని, సాలెవాడకు వెళ్లి –

**''బా రెట్టినే యండి బాణాల చీర**<br>**కుచ్చిల చెంగుమీద పిచ్చుకలనేత**<br>**పయిట చెంగుమీద పాయి (వు)రాలనేత**<br>**కట్టు చెంగుమీద కలగ (వ) పువ్వునేత''**

అని చీరను; అద్దాల రవికను నేయమన్నది. చీర, రవిక, నేసి, 12 బళ్లమీద వేసి, తెచ్చి ఇచ్చారు. కంసాలింటి కెళ్లి –

**''నా ఇసిరేటి చేతులకు ఈరగడియాలు**<br>**నడిచేటి కాళ్లకు నావుటందులు**<br>**దండలకు దండవంకీలు**<br>**చెవులకు కుంటేళ్లు''**

తయారుచేయమన్నది. అవన్నీతయారుచేసి, వాళ్లు తెల్లారేసరికి తెచ్చియిచ్చారు. ఎరుకల వాళ్లింటికెళ్లి, బానపెట్టేందుకు గంప, దాని మీదకి సిబ్బిఅల్లమన్నది. ఆ రెండు అల్లి, వాళ్లు తెల్లారేసరికి తెచ్చి ఇచ్చారు. కుమ్మరింటికెళ్లి ముచ్చా(త్యా)ల పిడతలు మూడుపిడతలు, బానమీదకు మూకుడు తెమ్మంది. తెల్లారేసరికి వాళ్లు వాటిని తెచ్చియిచ్చారు.

తెల్లవారు జామునేలేచి, తలారాస్నానంచేసి, ముక్కులో అడ్డబూస, నత్తుపెట్టుకొని, నొసట

సేండు బొట్టు పెట్టుకొని, నగలన్నీ ధరించి చలి (ల్లన) చల్లపులి (సిన) చల్ల బానలో పడబోసుకొని (నిండాపోసుకొని) నెత్తిన పెట్టుకొని చల్ల అమ్మటానికి బయలుదేరింది. గ్రామం నందలి కోమట్లు, బ్రాహ్మణులు, కమ్మవారు, కాపువారుకూడ ఆమె అందచందాలవల్ల ఆమెకు కష్టాలు కలుగుతాయని, ఉన్న భాగ్యం చాలుననీ, చల్ల అమ్మటానికి వెళ్లవద్దనీ చెప్పి వారిస్తారు. ఆ భగవంతుడు తనను ఏవిధంగా పరిపాలించినా ఒక్కటే అని, ఎవరిమాట వినకుండా బయలుదేరి చల్లఅమ్మటానికి వెళుతుంది. ఉదయం ఏడుగంటల సమయానికి నెల్లూరి రాజులు ముఖాలు కడుక్కుంటున్నారు. మారెమ్మ నెల్లూరు వీధుల్లోని కెళ్లి 'చల్లోయ్' అని కేకపెట్టేసరికి నెల్లూరి రాజులంతా మూర్ఛపోయారు. స్త్రీలు చల్ల గంపదింప నివ్వలేదు. ఆమాటకు మారెమ్మ 'వదినల్లారా' నేను అలాంటిదాన్ని కాను, చల్ల అమ్ముకోవటానికొచ్చాను' అని ప్రాధేయపడుతుంది.

నెల్లూరి రాజులు ఈమె అందానికి ముగ్ధులై, ఈమెను మోహించి చెరపట్టబోతారు. అంత మారెమ్మ –

**'నన్ను ముట్టకండిరా' అన్నల్లారా ముట్టుల్లో ఉన్నాను**

**అంటకండిరా అన్నలారా అంటుల్లో ఉన్నాను'**

అని ప్రాధేయపడుతుంది.

నెల్లూరి రాజులు ఇంటికి కడివెడునీళ్లు, పసుపుముద్ద పట్టుకొని రమ్మని ఊళ్లో చాటింపు వేయిస్తారు. ఆవిధంగా తెచ్చిన నీళ్లతో మారెమ్మను స్నానం చెయ్యమంటారు. ఈవిధంగా అయితే నామైలమాయదు. నా మామ తవ్వించిన మాండారం చెరువులో స్నానం చేస్తే కాని నా మైలపోదు అంటుంది. ఈమె రెండు చేతులకు గొలుసులు కట్టించి, రక్షకభటుల కాపలాతో మాండారం చెరువుకి పంపిస్తారు. చీలమండలు వరకు మునిగాక స్నానం చెయ్యమంటారు. చెయ్యనంటుంది. అలాగే మోకాళ్లు వరకు, బొడ్డువరకు, శిరసువరకు మునిగితే కాని చెయ్యనంటుంది. శిరసు మునిగాక స్నానం చేస్తున్నాను చూడండిరా! అని ఒక్క మునుగు మునిగి బ్రహ్మపట్నం వెళ్లిపోయింది!'

ఈమె వెళ్లేసరికి బ్రహ్మవేదపుస్తకాలు తిరగేస్తున్నాడు. మారెమ్మను చూసి, 'అదేమమ్మా ! ఇలా వచ్చావు' అన్నాడు 'అన్నయ్యా ! నాకు సాయంచేసి పెట్టలిరా !' అన్నది. 'ఏమి సాయంకావాలేంటి?' అని బ్రహ్మకోపంతో కసిరేశాడు. నేను నెల్లూరు చల్ల అమ్మటానికెళ్లాను. నెల్లూరు రాజులు నా అందం చూడలేకపోయారు అన్నది. చూడలేకపోతే చూడలేకపోయారు. నీవు అందంగా ఉన్నావు కాబట్టే కన్నువేశారు' అన్నాడు బ్రహ్మ. 'నాకు ఇంత అందం పెట్టావు లంజకొడుకా' అని తిట్టి మారెమ్మ స్మశానంలోనికెళ్లి, పెద్దగొయ్యి తీసుకొని అందులో కూర్చుని, కోరలు పెంచింది. పురుగులు పుట్టించి, ఆ పురుగులతో నలుగు పెట్టుకుంటుంది. ముసలివగ్గు అయిపోయింది. కాలు, చేయి, తల పట్టుకుంటే ఊడిపోయేటంతటి ముసలిదయిపోయింది.

బ్రహ్మలోకంలో బ్రహ్మకు కళ్లుకనిపించవు. మారెమ్మని బాధపెట్టినందుకు కళ్లుపోతాయి. బ్రహ్మ తన వద్దనున్న నౌకర్లను పంపి, మారెమ్మను వెదకి తీసుకొని రమ్మన్నాడు. అన్నిచోట్ల వెదకి, చివరకు స్మశానంలో ఉన్న మారెమ్మ దగ్గరకు వెళ్లి, బ్రహ్మ రమ్మన్నాడంటారు. బ్రహ్మ ఎక్కేబంగారు

పల్లకీ, బ్రహ్మ తొడుక్కునే పాముకోళ్ళు, బ్రహ్మసురటీ మొదలయినవన్నీ పట్టుకొని బ్రహ్మకాలినడకన తనకు వద్దకు వస్తే, వస్తా నంటుంది. ఆమె చెప్పినట్లుగానే బ్రహ్మ వేళ్లేసరికి మరింత చెడువాసన కొట్టించేస్తుంది. తాను తుమ్మినా, దగ్గినా (ఏమన్నా అంటే) తన్ను ఏమిచేస్తుందోనని భయపడి బ్రహ్మ ఏమి చెల్లమ్మా ! రావా ! అని అడిగాడు. దేవి పట్టుకొని కూర్చోబెడితే వస్తానంటుంది. ఆవిధంగానే చేస్తాడు. పాముకోళ్లతొడుక్కొంది, సురటి విసురుతాడు. బంట్రోతులు పల్లకీ మోస్తుంటే బ్రహ్మ పల్లకీలో కూర్చుని బ్రహ్మపట్నం బయలుదేరింది. మారెమ్మకు కనికరం కలిగి, కొంత చెడు వాసన తగ్గించింది. బ్రహ్మపట్నం వెళ్లాక, బ్రహ్మసింహాసనంమీద కూర్చుని, మామూలు రూపుధరించింది. చెడువాసన పూర్తిగా తగ్గించింది. అప్పుడు బ్రహ్మ 'చెల్లెమ్మా ! నీవు ఏమి చెయ్యమంటే అది చేస్తాను. నాకు కళ్ళ రప్పించు' అని ప్రాధేయపడతాడు. తాను వెళ్లేచోటికి తన వెనకాల మంచినిసిందిని (చీకటిరాత్రి) ఆకు, గంటం (హృదయం, ఆయుర్దాయం) పట్టుకొని రమ్మంటుంది. ఈవిధంగానే బ్రహ్మ బయలుదేరి వెళ్తాడు. ఇద్దరూ కలిసి ముందు నెల్లూరు వెళతారు. మారెమ్మ 'చల్లో' యని కేక పెట్టింది. ఆ కేక విన్న నెల్లూరి ప్రజలు మారెమ్మ వచ్చిందని లేచిచూచి, ఎవరి మంచమ్మీద వాళ్ల పడిపోయి చనిపోయారు. ఈవిధంగా నెల్లూరు నేల మట్టం అయిపోయింది. దీపం పెట్టడానికి దిక్కులేకుండా పోయింది. ఇప్పటికీకూడ నెల్లూరులో రాజులులేరు. ఈ అమ్మదగ్గరకు ఇప్పటికీ రాజులు పేరంటకం తీసుకొనిరారు. తెస్తే మారెమ్మ అంగీకరించదు. మరిడమ్మ నూకాలమ్మ గుళ్లకే వెళతారు.

నెల్లూరు అయిపోయాక సాలూరు వెళ్లారు. సాలూరులోకూడ మారెమ్మ 'చల్లో' అని కేక పెట్టింది. మారెమ్మ వచ్చిందని సాలూరు ప్రజలు లేచిచూసి, మంచాలమీదపడి మరణించారు. ఈవిధంగా సాలూరు సదునైపోయింది. (సాలూరులో కూడ నెల్లూరులో వలె అమ్మవారికి అవమానం జరిగి ఉంటుంది.) అక్కడ నుండి దుమాదూరు పట్నం వెళ్లారు. అక్కడ కూడ నెల్లూరు, సాలూరుల్లో జరిగినట్టే జరిగింది. దువమాదూరపట్నం దంతం (ధ్వంసం) అయ్యిపోయింది. అమ్మను బాధపెట్టివారు (నెల్లూరు రాజులు) మాండారం చెరువులోనికి జాలర్లను తీసుకెళ్లి, దేవించేస్తున్నారూ (వెదికించేస్తున్నారు). మారెమ్మ మండారం చెరువుదగ్గర కునుకుపాట్లు పడుతున్న బెస్తవాళ్ల కులపెద్ద వద్దకువెళ్లి 'అన్నయ్యా ! నేను మీ యింటి యిలవేల్పునవుతాను. వాళ్లకు దక్కనీయకుండ నన్ను కాపాడండి. మీయింటికి తీసుకెళ్లి అంగడిగుడికట్టి, అరవేణికుండలో పెట్టి, మూకుడు మూతపెట్టి పూజించండిరా ! 'మీకు సంపద పొంగిస్తాను' అన్నది. అప్పటి నుండి బెస్తవారు ఆమెను పూజిస్తున్నారు.

వాళ్లను బాగుచేద్దామనే ఉద్దేశముతో డబ్బు చద్దన్నం మూటలాకట్టి, వాళ్ల వేటకెళ్లే దారిలో కూర్చుని 'ఈమూట పట్టుకెళ్లండిరా !' అని యిస్తుంది. చద్దన్నం మూట అనుకొనివాళ్లు వద్దంటారు. దానిని ఒక కోమటి తీసుకెళ్లి ధనవంతుడవుతాడు. వెదురువాసం నిండా కాసులు పోసుకొని, బెస్తవారు వెళ్లే దారిలో కూర్చుని, ఆ వెదురు తీసుకొమని యిస్తుంది. జాలర్లెవరూ ఆ వెదురుతీసుకోరు. దానిని మేదరివాడు తీసుకొని ధనవంతుడవుతాడు. తర్వాత గుమ్మడి కాయ తొడిమతీసి, గుమ్మడికాయనిండా ధనంపోసి, తొడిమ మామూలుగా అమర్చి, బెస్తలు వెళ్లేదారిలో ఉంచుతుంది. గుమ్మడి కాయతింటే జబ్బులు వస్తాయనే ఉద్దేశంతో ఎవ్వరూ తీసుకోరు. దానిని ఒక బ్రాహ్మణుడు తీసుకెళ్లి ధనవంతుడవుతాడు. ఇంకా వాళ్లను బాగు చేద్దామనే ఉద్దేశంతో వాళ్ల

వెళ్లేదారిలో వరహాలవాన కురిపిస్తుంది. మా యింటి కప్పునిండా కన్నాలు ఉన్నాయి. మా యింటిలో కూడ ఈ వరహాలవాన కురుస్తుంది అని ఎవరి మటుకువాళ్ళు అనుకొని బెస్తలు అవి తీసుకోరు.

వారిలో ఒకడు ఒక రూపాయి గోచికి కట్టుకొని, ఈంఁద్రదానికిచ్చి కల్లుతాగుతాడు. ఈంఁద్రవనిత ఆరూపాయిని ముంతలో వేసుకున్నది. మారెమ్మ మింగిని పంపి, ఆ రూపాయని మింగి రమ్మంటే మింగి వచ్చిందట అప్పటి నుంచి బెస్తలు ఈ అమ్మవారిని భక్తితో పూజిస్తున్నారు.

ఈ అమ్మవారిని మరిడమ్మ, నూకాలమ్మ 'ఒలే నీవు ఉల్లిపాయ, పుల్లంబలి తాగుతావు' అని దెప్పుతారు. 'వాళ్లకదే ఉంది అదే నాకు పెడతారు' అని ఈమె సమర్థించుకుంటుంది. గండుమిల్లి సత్తెమ్మ (ఈ కథ చెప్పిన ముసలిది) యొక్క నాన్నమ్మ అత్తగార్లతో మారెమ్మ మాట్లాడేదట.

మద్రాసులో ఈ అమ్మవారిని కాసుల కుప్పతో పూజిస్తారు. కనుక అక్కడ 'కాసులమ్మ' అని అంటారు.

దుర్మార్గుల (నెల్లూరి రాజుల) దౌర్జన్యానికి బలియై, తనగోడు, వెళ్లబుచ్చగా, హేళన చేసిన బ్రహ్మను కూడ బాధలు పెట్టి, తన మహిమ తెలుసుకొనేటట్లు చేసి, అతని సహాయంతో తనను బాధపెట్టి, తన మరణానికి కారకులైన దుర్మార్గులను నాశనం చేసిన పుణ్యస్త్రీయే మారెమ్మ. ఈ కథలో మారెమ్మ వైదిక దైవమైన బ్రహ్మను కూడ, తన మహిమ చూపి, తాను చెప్పినట్లు చేసుకొనటంవల్ల బ్రహ్మకంటె కూడ గ్రామదేవత అయిన మారెమ్మ గొప్ప దనే జానపదుని భావం వ్యక్తమగుచున్నది. తనను పూజిస్తున్న పల్లెవారిని ధనవంతులను చేయుటకు ప్రయత్నించటంవల్ల, గ్రామదేవత తనను పూజించిన వారిని బాగుచేస్తుందని, బాధపెట్టినవారిని పాడు చేస్తుందనే జానపదుని విశ్వాసం ఈ కథలో వ్యక్తమగుచున్నది.

ఈ కథలో నెల్లూరు, సాలూరు, దుమాదూరు పట్టణం మొదలైన ఈ జిల్లాలోలేని ఊరిపేర్లు విన్పిస్తున్నాయి. బహుశ ఆ ఊళ్ల పరిసర ప్రాంతాలలో జరిగిన కథ అయి, తర్వాత కాలంలో ఈజిల్లాలోకి కూడ ప్రచారంలోకి వచ్చి ఉండవచ్చును. లేక ఆయాగ్రామాల నుంచి వలసవచ్చి ఉండవచ్చును. ఏమైనప్పటికీ ఈ జిల్లాలో ప్రచారంలో ఉన్నందున, ఈ కథను కూడ ఇవ్వడం జరిగింది.

**నేరేళ్లమ్మ :** ఈమె ఈజిల్లాలో కొమరగిరి, తిరుమాలి, రాపర్తి, అన్నవరం, నాగులాపల్లి, ద్రాక్షారామం మొదలైన గ్రామాల్లో గ్రామ దేవతగా పూజింపబడుతుంది. ఈ కథ నాకు కొమరగిరి గ్రామంలో లభించింది.

గొప్పదైన గండ్రేడు గ్రామంలో చెట్టుగాళ్ళ (చెట్టు బలిజాలు) ఏడుగురు అన్నదమ్ములుండేవారు. వాళ్లకు ఆస్తి ఉన్నది కాని పిల్లలులేరు. ఎన్ని నోములు, వ్రతాలు చేసినా పిల్లలు కలగలేదు. వారిలో అందరికంటె పెద్దవాడు రాయుడు వెంకన్న. అతని భార్య గురమ్మ. ఆమె పిల్లలకోసం కాశీవెళదామని బయలుదేరింది. మధ్యదారిలో చీకటి పడితే, అక్కడ ఉండే అల్లనేరేడుచెట్ల క్రింద మకాం వేశారు. వాళ్ళు తమ కూడ తాగడానికని తీసుకెళుతున్న పాలబిందెల్లో

రెండు అల్లనేరేడు పళ్లుపడ్డాయి. వాటిని చూసిన గుర్రమ్మ, అక్కడే తనకు సంతానం దొరికిందని, కాశీవెళ్లడమెందుకని భావించి, ఆ పళ్లను తిని వెనక్కిమళ్లారు.

ఆమె గర్భవతయి, ఇంటికొచ్చిన తొమ్మిది గడియలకల్లా, చక్కని అందంతోను, వెయ్యి దీపాల కాంతితోను, మూడవ నేత్రంతోను ప్రకాశించే అమ్మాయి పుట్టింది. ఆ అమ్మాయికి స్నానం చేయించి, పరుండబెట్టిన ఏడుగడియలకు, తల్లికి మళ్లీ పురిటి నొప్పులు ప్రారంభమై, ఒక అబ్బాయి పుట్టాడు. ఏడవరోజు స్నానమని, తమ బంధువులున్న ఊరి ఊరికి జాబులేశారు.

'కొంకుదురు' గ్రామంలో ఉంటున్న రాయుడు వెంకన్న చెల్లెలయిన 'రామ్మ'కు కూడ జాబు వేశారు. ఈమె 'బొడ్డు' వారి కోడలు. ఈమె అత్తవారింటికి కాపురాని కెళ్లిన ఆరు నెలలకే భర్త చనిపోయాడు. ఆమెకు ఒక్కడే కుమారుడు. అతని పేరు చిన్నయ్య అతనికి పన్నెండవసంత్సరం బొడ్డు రామ్మకు చాలా ఆస్తి ఉన్నది. ఆమె పిసినారి అన్నలు వేసిన జాబు చూసి, కుంకుడుకాయలుగా కంకరరాళ్లు జీలకర్రగా ఊక, పసుపుగా ఎర్రమట్టి, నూనెగా నీళ్లు పట్టుకొని, ఇవన్నీ ఒక తట్టలో పెట్టుకొని అన్నలింటికి వెళ్లింది.

వచ్చిన చెల్లెల్ని ఆదరించి, భోజనం చేయుమంటారు. తన అన్నకు పుట్టిన ఆడ పిల్లను తనకుమారునికి పెళ్లిచెయ్యటానికి అంగీకరిస్తేనే భోజనం చేస్తానంటుంది. ఆ విధంగా చేస్తామని అన్నలు అంగీకరించాక, భోజనం చేసి స్వగ్రామం వెళ్లిపోయింది.

రామ్మ వెళ్లాక, మేనత్త తెచ్చింది చంటిపిల్లల ఒంటికి వ్రాయాలని, వదినగార్లు రామ్మ తెచ్చిన గంపలోనున్న నూనె తీసి వ్రాయబోతారు. దుర్మార్గురాలైన తన మేనత్త తెచ్చింది తన ఒంటికి వ్రాస్తారేమోనని, మంచంమీద నుంచి ఎగిరి నేరేళ్లమ్మ ఊరవతల ఉన్న అల్ల నేరేడుచెట్టుకి ఉయ్యాలవేయించుకొని ఊగుతుంది. తల్లిదండ్రులు ఆమె ప్రవర్తనకు బాధపడతారు. తల్లిదండ్రులు ఎంత పిలిచినా ఆమె చెట్టు దిగిరాలేదు. చెట్టుమీదనే పెద్దదై పోయింది. తమ్ముడు పోతురాజు వెండి బెత్తం పట్టుకొని, అక్కనేరేళ్లమ్మ వద్దకు వెళ్లి, తాము నరజన్మమెత్తామని, తాము జన్మను ముగించేవరకు, తల్లిదండ్రులను దుఃఖపెట్టరాదని, వాళ్ల చెప్పినట్టు వినాలని అంటాడు. తమ్ముడు మాటకు మారు చెప్పక, నేరేళ్లమ్మ చెట్టుదిగి ఇంటి కొచ్చింది. తల్లిదండ్రులు సంతోషించారు.

నేరేళ్లమ్మకు యుక్తవయస్సొచ్చింది. కూతురికి పెళ్లి చెయాలని, తన కుమారుణ్ణి పంపించమని అన్నలు బొడ్డురామ్మకు జాబువేశారు. ఈజాబు చూసుకొని పెళ్లిచేస్తే, ధనమంతా అయిపోతుందనే ఉద్దేశముతో, కొడుకుని కట్టుబట్టలతోనే మామలు దగ్గరకు పంపించింది. పెళ్లిరోజునాటికింకా పెళ్లికొడుకు రాకపోవటం వల్ల రాయుడు వెంకన్న పెళ్లికుమారునికెదురెళ్లి, కట్టుబట్టలతో, దిగులు ముఖంతో వస్తున్న పెళ్లికుమారుణ్ణి మేళతాళాలతో ఊరేగింపుతో ఇంటికి తీసుకెళ్లి, చక్కగా అలంకరించి, ఆరాత్రికి నేరేళ్లమ్మకు, చిన్నయ్యకు రాయుడు వెంకన్న ఘనంగా వివాహం జరిపించాడు.

ఆ మరుసటి రోజు ముత్యాలపల్లకిలో నూతన దంపతులు ఊరేగుతూ, నడివీధిలో ఉన్న మున్సబుగారింటికి వచ్చారు. పెద్దవారు చెప్పినట్టుగా పల్లకీదిగి బొడ్డు చిన్నయ్య మున్సబుకు నమస్కరించాడు. అందుకు తిరస్కరించిన నేరేళ్లమ్మకు మున్సబు చెప్పు విసిరాడు. కోపం వచ్చిన

నేరేళ్లమ్మ మూడవ కన్నువిప్పి, మున్సబు వంక చూడగానే మున్సబుకు మైకం వచ్చి, కళ్లు చీకట్లుకమ్మాయి. ఊరేగింపు ముగిశాక నేరేళ్లమ్మ బంగారు బొమ్మవలె మున్సబు కలలో కనిపించి, 'ఏవిరా' మునిసీబూ నన్ను సెప్పుతో కొడతావా ఏమై 'పోతావో' అంటుంది. అప్పుడు మున్సబుకి కళ్లు తెరచి 'అమ్మా ! యింతటిదానవన్నమాట నాకు తెలీదు. నీవు రాయడోరింట పుట్టావన్న సంగతే నాకు తెలీదు. అని చెయ్యెత్తి దణ్ణం పెడతాడు. 'నువ్వు అవతారం మారిన్నాడు నీకు గుడి కట్టి, ముందుగా సంబరం చేయింతానవమ్మా!' అంటాడు. నువ్వు అంటే అన్నావుకాని, మొక్కితే మొక్కేవుగాని, యిది లోకానికి తెలియకూడదు. నీలోనే ఉండాలి అని చెప్పి, నేరేళ్లమ్మ మాయమైపోయింది.

పెళ్లయిన మూడవరోజు పుట్టెడు పసుపు, పుట్టెడు కుంకుమ బోషాణా (పెద్ద కర్ర పెట్టెలు) ల్లోపోసి, రకరకాల పిండి, వంటలతో, కావుళ్లతో నేరేళ్లమ్మను అత్తవారింటికి పంపారు. కావుళ్లతో కోడలు వస్తుందని తెలుసుకున్న రామ్మ, వచ్చే వాళ్లకు వంట చేస్తే, డబ్బయిపోతుందనే ఉద్దేశముతో కావుళ్లలోపల పెట్టకుండా గుమ్మాలకు ముళ్లకంపలు కట్టేసుకొని, మంచమేసుకొని పండుకుంది.

ఇంటికి వచ్చిన కావుళ్లు పెట్టడానికి చోటులేనందువల్ల వాటిని వీధుల్లోనే దింపేసారు. వచ్చిన పెద్దలకు రామ్మ సున్నం నీళ్లపాలుగా దాహం ఇచ్చింది. అవి త్రాగి వెనక్కి మళ్లిన పెద్దలు విరేచనాలు, వాంతులతో మధ్యదారిలో అడవిలోపడి పోయారు. ఈ విషయం తెలుసుకున్న నేరేళ్లమ్మ వాళ్లదగ్గర ప్రత్యక్షమై, తన అక్కలైన నూర్గురు దేవతలను పిలుస్తుంది. నూర్గురు అక్కలు అక్కడకువచ్చి, పడిపోయిన పెద్దలను లేవదీసి పరిచర్యలుచేసి, వారికొచ్చిన భయంలేదని, ధైర్యంచెప్పి పంపించేస్తారు. నేరేళ్లమ్మ ఆమె అక్కల వద్దసెలవు తీసుకొని, ఇంటి కొచ్చేసింది.

మరుసటిరోజు ఉదయాన్నే బొడ్డురామ్మ కావుళ్ల దగ్గరకొచ్చి చూసి, సారె తక్కువనే కోపంతో, బిందెల్లోని పిండివంటలు, సలిమిడి, కొబ్బరిబొండాలు, కాయలు మొదలైనవన్నీ చిందరవందర చేసేసింది. నేరేళ్లమ్మ చీరలన్నీ చింపి డొంకలమీదవేసేసింది. రామ్మ ఈ ప్రవర్తనను చూసి, నేరేళ్లమ్మ బోషాణాల దగ్గరకొచ్చి, అందుండే పసుపు, కుంకుమ పయ్యాట చెంగుని మూటకట్టుకొన్నది. అప్పటి వరకు వీథిలోనే ఉన్న చిన్నయ్యను నేరేళ్లమ్మతో మాట్లాడవద్దని, చెట్లు గీసుకోవడానికి వెళ్లమని, రాత్రుళ్లు ఇంటికి రావద్దని, చెప్పి, కొడుకుని పంపించింది.

బొడ్డురామ్మ వంట చేసి, నేరేళ్లమ్మని కొడుక్కి అన్నం పట్టుకెళ్లమన్నది. తన కొడుకుతో మాట్లాడవద్దని, మాట్లాడితే బలం తగ్గిపోయి, కొడుకు చెట్లెక్క లేడని, కొడుకు మిగిల్చిన అన్నం తినవద్దని, కూడ చెప్పింది. 'అనుసూరి' అను ఇంటిపేరు గల ఏడుగురు అన్నదమ్ములు నేరేళ్లమ్మ తల్లికి తమ్ముళ్లు. ఈమెకు మేనమామలు. వాళ్లకు వాళ్లకు మధ్య ఉండే కోపతాపాలుకొద్దీ, నేరేళ్లమ్మ పుట్టుకకు, పెండ్లికి కూడ వాళ్లు వెళ్లలేదు. అట్టి మేనమామలు భర్తకు అన్నం పట్టుకెళుతున్న నేరేళ్లమ్మను చూసి, అప్యాయతతో పిలుస్తారు. వారికి జవాబు చెప్పదు సరికదా ! వారివంక కూడ చూడదు. తిన్నగా భర్త ఉండేచోటికి వెళుతుంది. అన్నం పట్టుకొస్తున్న భార్యనుచూసి, చిన్నయ్య గబగబా చెట్టు దిగుతాడు. నేరేళ్లమ్మ అత్తచెప్పినట్టు, భర్తతో మాట్లాడకుండ, తాను తెచ్చిన అన్నం అక్కడ ఉంచి దూరంగా వెళ్లిపోతుంది. భర్త అన్నం తినడానికి రమ్మని పిలుస్తాడు. ఆమె పలకదు. భార్య కని సగం అన్నం మిగుల్చుతాడు.

భర్తతీసిన కల్లంతా కడవలో పోసుకొని, మిగిల్చిన అన్నంకూడ పట్టుకొని, నేరేళ్లమ్మ ఇంటికొచ్చింది. ఇంటికొచ్చిన కోడలికి రామ్మ అన్నం పెట్టలేదు. నేరేళ్లమ్మ తాను చెంగున కట్టుకున్న పసుపు, కుంకుమ తింటుంది. ఈవిధంగా ఆరు నెలలు జరిగింది. ప్రతీరోజూ భర్త అన్నం పట్టుకెళ్లే నేరేళ్లమ్మను మేన మామలు మామూలుగానే పిలుస్తున్నారు. ఒక రోజు నేరేళ్లమ్మ మామలతో 'రోజూ నన్నెందుకు పిలుస్తారు. నేను తినేది మీరు పెడతారా అంటుంది. పెడతాము రవమ్మని, కుంచెడుకల్లు పట్టేపాయ (తాటియాకుతో తయారుచేయబడిన చేదవంటి కల్లుతాగడానికుపయోగించే పాత్ర) కట్టి, కల్లుపోసి తాగమంటారు. పాయలో కల్లు వద్దని, నేరేళ్లమ్మ తన కొప్పులో ఉన్న వేపకాయంత చెంబుతీసి, ఆ చెంబులో కల్లుపొయ్యమంటుంది. మేనమామలు ఏడుగురూ గీసిన కల్లుతెచ్చి, చెంబులో పోస్తారు. చెంబు నిండదు. ఆడవాళ్ల దొంగతనంగా దాచుకున్న చెట్లు కల్లు తెచ్చి పొయ్యమంటుంది. మేనమామ ఆ చెట్లు పేర్లు చెప్పమంటే.

**'గట్టు సాటునుంది గంగప్ప తాడికల్లు**
**పుట్ట సాటునుంది పుల్లప్ప తాడికల్లు**
**సెట్టు సాటునుంది సెల్లప్ప తాడికల్లు**
**ఎనకాల ఉన్నది ఎల్లప్ప తాడికల్లు**
**మావిడి సెట్టుకాడుంది మాలచ్చమ తాడికల్లు**
**చింత చెట్టుకాడుంది చింతాలమ్మ తాడికల్లు**
**జామి చెట్టుకాడుంది జాలారమ్మ తాడికల్లు**
**కొబ్బరి చెట్టుకాడుంది కొండదేవత కల్లు**
**అంటిచెట్టు కాడుంది అడవి దేవతకల్లు'**

పొయ్యండి మావల్లారా ! అని పేర్లు చెబుతుంది. 'ఏటమ్మా చూసినట్టే చెబుతున్నావు. మా పిల్లలకు లేకుండా నీవే తాగేస్తావా !' అంటారు. 'మీరలా బాధపడితే కల్లు తాగను'. అంటుంది. బాధలేదని దాచుకున్న కల్లంతా తెచ్చి పోసారు. అదంతా గుక్కెడైతే మింగింది. తాము రాత్రింబవళ్లు కష్టపడి తెచ్చిన కల్లుతో నేరేళ్లమ్మకు గొంతైనా తడవలేదని మేనమామలు ఆశ్చర్యపోతారు. నేరేళ్లమ్మ వెళుతున్నానని చెప్పిలేచి, మేనమామలను వెళ్లి కల్లుకుండలు చూసుకోమంటుంది. కల్లుకుండలు చూసుకొని వాటినిండా డబ్బు ఉండడంవల్ల ఆశ్చర్యపడి నేరేళ్లమ్మకు దణ్ణంపెడతారు.

నేరేళ్లమ్మ అక్కడనుంచి అన్నం పట్టుకొని భర్తవద్దకు వచ్చింది. చెట్టుమీద నుంచి అన్నీ చూస్తున్న, చిన్నయ్య తన భార్య తనతో మాట్లాడలేదని, తాను పోసిన కల్లు తాగలేదని, మిగిల్చిన అన్నం తినలేదని, మేనమామలు పోసిన కల్లు తాగిందనే కోపంతో నడుమునున్న తాడు విప్పికొట్టాడు. కొట్టిన ప్రతీ దెబ్బ అతనికే తగుల్తుంది. అన్నం తిని గీసిన కల్లుకుండలో పోసాడు. అవి పట్టుకొని నేరేళ్లమ్మ ఇంటికొచ్చిన ఏడు గడియలకు చిన్నయ్యకూడ ఇంటి కొచ్చాడు. కొడుకు భార్యమీద భ్రాంతికలిగే ఇంటి కొచ్చాడేమోనని భావించిన రామ్మ నేరేళ్లమ్మతో కొడుకు వద్దకు వెళ్లవద్దని, మాట్లాడవద్దని చెబుతుంది.

చిన్నయ్య స్నానం చేసి, భోజనంచేసి పడకగదికెళ్లి పడుకున్నాడు. నేరేళ్లమ్మను రమ్మని పిలుస్తాడు. అనేక విధాలా రమ్మని బ్రతిమాలుతాడు. అత్తచెప్పినట్లుగానే నేరేళ్లమ్మ జవాబివ్వదు.

పిలిచి పిలిచి చిన్నయ్య నిద్రపోతాడు. నేరేళ్లమ్మ గడప దగ్గరే పడిపోయింది. అప్పటికి ఆరు నెలల నుంచి అత్త అన్నం పెట్టనందున నేరేళ్లమ్మ తన చెంగును కట్టుకున్న పసుపు, కుంకుమే తింటున్నది.

నేరేళ్లమ్మ తమ్ముడు పోతురాజు కలలోకెళ్లి, తన్ను అత్తవారింటికి పంపి ఆరు మాసాలయ్యిందని, ఈ ఆరు మాసాల నుంచి తినటానికి అన్నంలేదని, విప్పి కట్టడానికి మారు చీరలేదని, కంటికి నిద్రలేదని, తను వద్దంటుండగా పెళ్లి చేసారని, తన్ను పంపించి మరచిపోయారని, వేగంగా వచ్చి కలుసుకోవాలని అంటుంది. ఈ మాటలు విన్న పోతురాజు తొందరపడిలేచి, తల్లిదండ్రులవద్దకెళ్లి, అక్క తన కలలో కనపడి చెప్పిన మాటలన్నీ చెప్పి, అక్క వద్దకెళ్లి వస్తానని బయలుదేరుతాడు.

ఇంటికి వచ్చిన మేనల్లుడికి మేనత్తకాళ్లు కడుక్కోవడానికి నీళ్లిచ్చి, అన్నం పెట్టింది. ఇద్దరం కలిసి భోజనంచేద్దాం రమ్మని అక్కని పిలుస్తాడు. నేరేళ్లమ్మ తమ్ముడి మాటకు జవాబివ్వలేదు. రామ్మ మేనల్లుడితో తన అక్క ఎంతో గడ్డు(గడుసు)దని, భర్త పిలిస్తే పలికేది కాదని, తానేదయినా పనిచెబితే చేసేదికాదని నేరేళ్లమ్మ గురించి కానివి లేనివి కల్పించి చెప్పింది. ఎన్ని చెప్పినా నేరేళ్లమ్మ జవాబివ్వలేదు.

తన అక్కను తీసుకెళ్లి, తిరిగి పదిరోజులలో పంపిస్తానని చెప్పి, పోతురాజు అక్క ను తీసుకొని బయలుదేరాడు. ఊరి దాటి వచ్చాక, నేరేళ్లమ్మ వెనుకకు తిరిగి మూడోనేత్రం విప్పి, కొంకుదురు ఎత్తుకొని మండిపోవాలని, రాయుడోరి పిల్లని ఎప్పటికీ బొడ్డువారికి చుట్టరికం ఇవ్వకూడదని, ఇచ్చినా కాపురాలు నిలబడవని శాపం పెట్టింది. ఇప్పటకీ రాయుడోరికి, బొడ్డువారికి చుట్టరికాలులేవు. తర్వాత అక్కాతమ్ముళ్లు బయలుదేరి [illegible]న్నారు. అక్క తమ్మునితో తనకు ఇష్టంలేని పెళ్లి చేసారని, అత్త తనను చాలా కష్టాలు పెట్టిందని చెబుటూ, ఇద్దరూ అత్తింటికి. పుట్టింటికి, మధ్యనున్న పుట్టకొండకు వచ్చారు.

నేరేళ్లమ్మ తాను తుప్పచాటుకు (మూత్ర విసర్జనకు) వెళ్లొస్తానని తమ్ముడితో చెప్పి, అతనికి ఏడడుగుల దూరంలో ఏగించి (మాయమై) పోయింది. బంగారు విగ్రహమై నిలిచింది. పోతురాజు పిలుపులకి తానున్నచోటునుంచి, తానక్కడున్నానని కేక వేసింది. పోతురాజు విగ్రహం వద్దకు వెళ్లబోతుండగా రావద్దన్నది. అక్కకు ఏడడుగుల దూరంలో ఏగించుకొనిపోయి, పోతురాజు కూడ బంగారు విగ్రహమై నిలిచాడు. నేరేళ్లమ్మ పెళ్లినాటి ఊరేగింపులో తాను నమస్కరించనందుకు, చెప్పు విసిరిన మున్సబు కలలోనికెళ్లి, తాను విగ్రహమై నిలిచిన ప్రదేశం చెప్పి, ఆనాటి మున్సబు మొక్కుబడులు ఈనాడు తీర్చాలని, తనకు గుడి కట్టించి, సంబరం చేయించాలని అంటుంది. ఆ మరునాటి ఉదయమే ఆ విగ్రహాలున్నచోటికివచ్చి, మున్సబు గుడి కట్టించ నారంభించాడు.

ఆ మరుసటి రోజు రాత్రికి తమ్ముడితో సహా తల్లిదండ్రుల కలలోనికెళ్లి, తాము ఆ తల్లిదండ్రుల కడుపున పుట్టదలచినవాళ్లంకాదని, పుట్టినందుకు తామేమీ సుఖం పొందలేదని, తాము పుట్టకొండ గ్రామం వద్ద విగ్రహాలై నిలిచామని, గ్రామ మున్సబు గుడి కట్టించుచున్నాడని, కన్నందుకు ఏడాదికొక్కసారి చీర, సెతమానం పెట్టి, సారెపెట్టి గుడిలోనికి సాగనంపమని, వారికి ఏలోటూ చెయ్యనని, తమ్ముడు తన దగ్గరే యుంటాడని చెప్పింది. తల్లిదండ్రులు ఏడుస్తూ వచ్చి చూసి, తమ

బిడ్డ అంతటిదని తాము తెలుసుకోలేకపోయామని చెయ్యెత్తి దణ్ణం పెట్టారు.

గ్రామ మున్సబు గుడి కట్టించి, నేరేళ్లమావాస్యనాడు సాగినంత సంబరం, తీర్థం పెట్టించాడు. నేరేళ్లమ్మ ఏగించుకొనిపోయి, అమ్మోరయ్యిందని, దేశాలకడకు తెలుసుకొని, చుట్టుప్రక్కల గ్రామాలవారు చూడ్డానికి వస్తున్నారు. కన్నవారు చీర, రవిక, సారికావుల్లు పట్టుకొని గుడికొచ్చారు. కోడలు ఏగించుకొనిపోయి బంగారు బొమ్మ అయిందని తెలుసుకొని, బొడ్డురామ్మ పళ్లెంలో సలిమిడి, వడపప్పు వేసుకొని గుడికొచ్చి, గుడిలోకెళ్లి, బోల్డంత డబ్బుపోసి, పెళ్లి చేసికున్నందుకు తన్ను తన కుమారుణ్ణి మోసంచేసిందని, విగ్రహాన్ని పొడవబోయింది. నేరేళ్లమ్మ చూసి, మూడో నేత్రంవిప్పి, ఎడుమచేత్తో బొడ్డు రామ్మ కొప్పు పట్టుకొని, ఎడమ కాలికింద తొక్కి పెట్టింది. బొడ్డు రామ్మ నేరేళ్లమ్మ కాలికింద నక్కపోతులాగ పళ్లికిలించింది. అప్పటికి, ఇప్పటికీ దేవతల కాలికింద నక్కపోతు ఉంటుంది.

నేరేళ్లమ్మ భర్త చిన్నయ్య తన భార్య ఏగించుకోనిపోయి అమ్మోరయ్యిందన్న విషయం తెలుసుకొని తాను మావకూతుర్ని పెళ్లాడానని, ఆమె ఒక్కనాడూ తనతో మాట్లాడలేదని, పోసిన కల్లుతాగనందుకు కొట్టిన తానెంతో పాపాత్ముడనని, బాధపడుతూ నేరేళ్లమ్మ గుడికొచ్చి, గుడి గడప పట్టుకొని, ''తానేమి పాపంచేసానని, తన గతులేమి కావాలని,'' దుఃఖిస్తాడు. నేరేళ్లమ్మ చిన్నయ్యతో ఏడ్వవద్దని, ఎల్లప్పుడూ గుడికివచ్చి, పూజ చెయ్యమని ఏమీ లోటూ చెయ్యనని చెప్పింది.'[2]

ఆ తర్వాత ఆమె గ్రామాలకు పేరెల్లింది. ఈమె మొట్టమొదట అవతారం చాలించి, ఏగించిపోవడం పుట్టకొండలో అయినప్పటికీ, చుట్టుప్రక్కల చాలా గ్రామాలలో ఈమె వెలసింది. తూర్పు గోదావరి జిల్లా మెట్టప్రాంతంలో చాలా గ్రామాలో ఈమె గ్రామదేవత. ఈమె వెలసిన అన్ని గ్రామాల్లోనూ వైశాఖబహుళ అమావాస్యకు ఈమె జాతర చేస్తారు. కాబట్టే వైశాఖ బహుళ అమావాస్యను 'నేరేళ్లమావాస్య' అని కూడ అంటారు.

తల్లిదండ్రులకు లేకలేక కలిగిన సంతానంగా పుట్టి, పుట్టినప్పుడే కొన్ని మహిమలుచూపి, అధికార మందంతో విర్రవీగిన వారికి (గ్రామ మున్సబు) తగినబుద్ధి చెప్పి, అత్తఆరళ్లకు అలసిపోయి, అకాలమరణం చెందిన పుణ్యస్త్రీయే నేరేళ్లమ్మ దేవత. ఈ కథలో తనను ప్రేమతో చూసిన మేనమామలను ధనవంతులను చేయడంవల్ల, తనను బాధలు పెట్టిన, అత్తగార్ని కాలికింద తొక్కి చంపడంవల్ల, గ్రామదేవతలు పూజించిన వారిని బాగుచేస్తాయని, బాధపెట్టిన వారిని నాశనం చేస్తాయనే విషయం స్పష్టమవుతుంది.

## బంగారు పాప లేక బషీర్ బీబీ

ఈమె ఈజిల్లాలో పాన్నాడ, అమలాపురం, రావులపాలెం, కొత్తపేట, మొల్లేరు, ఉడుమూడి, వైనతేయ, కొత్తపల్లి మొదలైన గ్రామాల్లో పూజింపబడుతుంది.

తూర్పు గోదావరి జిల్లా కొత్తపల్లి మండలం, పొన్నాడ గ్రామంలో వెలసిన బంగారు పాప లేక బషీర్‌బీబీ దరగా, హిందూ మహమ్మదీయులకు పుణ్య క్షేత్రం ఈమె గాథను 50 సంవత్సరాల

క్రితమే, మూలపేట వాస్తవ్యులైన కీ.శే. రాయువరపు గౌరీరాజుగారు 34 ప్రకరణముల చారిత్రక నవలగా రచించారు. ఈ గాథ క్రీ.శ. 11-12 శతాబ్దాల మధ్యకాలం నాటిది. ఈ గ్రంథమును రచయిత మనుమడు శ్రీ గౌరీనాథశర్మ గారు (ఈయనే నాకు ఒక కాపీ, దరగా ఫోటో కూడ ఇచ్చారు). 336 పేజీల నవలగా రాజోలు వాస్తవ్యులు శ్రీ శ్రీపాటి రామమూర్తిగారిచే సంక్షిప్తీకరించి, అచ్చువేయించారు. అందలి బంగారు పాప వృత్తాంతాన్ని ఈవిధంగా పేర్కొనవచ్చు.

ఢిల్లీ సింహాసనమ్మీద అల్లాయుద్దీన్ పాదుషా కూర్చున్న రోజులవి. ఈతడు కామాంధుడు పరస్త్రీ మాన భక్షకుడు. పొన్నాడ షహర్ వజీర్‌ఖాన్ పాదుషాకు అందమైన పడతులను పడకగదికి పంపించే సామంతుడు. శ్రీకాకుళం కూడ మహమ్మదీయుల పాలనలోనే ఉండేది. ఈ శ్రీకాకుళంలో బషీర్ బీబీ, సుందరీ అనే యువతులు సౌందర్యవంతులు అవ్వటంవల్ల, వారిని వలచి, వలపింపచేసుకోవాలని వజీర్‌ఖాన్ ఉవ్విళ్ళూరుతున్నాడు. వాళ్ళిద్దరీని తనకు అప్పగించాలనీ, పాదుషా వజీర్ ఖాన్‌కు ఆదేశించాడు.

బషీర్ బీబీకి పెళ్లయింది. భర్త పెద్ద దివానుగా పాదుషా కొలువులో ఉంటున్నాడు. సుందరి వలచిన పురుషుడు కూడ కారాగారాధిపతిగా పాదుషా వద్దపని చేస్తున్నాడు.

వజీర్‌ఖాన్ తన తార్పుడు వ్యాపారానికి, తరుణీమణులను తస్కరించి, తీసుకొని రావటానికి, ఒక ప్రత్యేక తరహా నైపుణ్యంగల దుష్టచతుష్టయాన్ని ఏర్పాటుచేసుకున్నాడు. ఈ దుష్టచతుష్టయానికి అధినేత నారాయణరావు. ఈ నారాయణరావు తునికరణం పినతండ్రికొడుకు. కోమటిలచ్చన్న, కంసాలి లింగయ్య, బల్జీ గణపతయ్య, దేవాంగి రుద్రయ్య ఈతని అనుచరులు.

సుందరి బషీర్‌బీబీలను వజీర్‌ఖాన్‌కు వశం చేస్తానని, వాగ్దానంచేసి, అందుకవసరమైన అర్థబలం, అంగబలం సమకూర్చుకున్నాడు నారాయణరావు. శ్రీకాకుళంలో తన దుష్టచతుష్టయం సహాయంతో మాయోపాయంవన్ని, సుందరీబషీర్ బీబీలను సవారీలపై పొన్నాడ షహర్‌కు పయనం చేయించాడు. సుందరీ బషీర్ బీబీల భవనం చుట్టూ వజీర్ ఖాన్ గట్టి బందోబస్తు ఏర్పాటు చేయించాడు.

బషీర్‌బీబీ సుందరులు వజీర్‌ఖాన్ పాదుషాల వశంకాకుండా, వారి మానరక్షణలోను, వారిని తమ భర్తలతో కలుపుటలోను ప్రముఖపాత్ర వహించినవారు ఏడుగురు బ్రాహ్మణులు. వీరిలో ముగ్గరు స్త్రీలు, నలుగురు పురుషులు. వారు వెంకమ్మ అను వితంతు స్త్రీ, ఈమె కుమార్తె లక్ష్మాంబ, ఈమె మనుమరాలు మాణిక్యాంబ, ఈమె తమ్ముడు అప్పన్న దీక్షితులు, కొడుకు సుబ్బన్న దీక్షితులు అల్లుడు వెంకట శాస్త్రి, మనుమడు బుచ్చిరామశాస్త్రి.

ఈ మహమ్మదీయులు పాలనలో పకీరుల ప్రాబల్యం ఎక్కువగా ఉండేది. పాదుషా దర్బారులో, అంతఃపురాలలో ఫకీరులు యథేచ్ఛగా రావచ్చు పోవచ్చు. కావున అప్పన్న దీక్షితులు, వెంకట శాస్త్రి ఫకీరుల వేషం వేసుకొని, సుందరి బషీర్‌బీబీల సమాచారాన్ని ఉన్నది లేనట్టుగా లేనిది ఉన్నట్టుగా కల్పించి, వజీర్‌ఖాన్, పాదుషాలకు తెలియచేస్తూ, తమ వంతుగా బషీర్‌బీబీ, సుందరీల మానసంరక్షణలో ప్రధాన పాత్ర వహించారు.

బషీర్‌బీబీ కోరికగా పొన్నాడ పట్టణంలో తెలగామహమ్మదీయ వీథుల మధ్య 18 అంతస్తుల దరగా కట్టించవలెనని, పాదుషాకు ఉత్తరమిచ్చి, అతడు వజీర్ ఖాన్‌ను ఆదేశించునట్లు చేసి, దరగా నిర్మింపచేశారు ఈ ఫకీరులు, వజీర్ ఖాన్ కోరికననుసరించి, తన కొలువులో ఉద్యోగాలుచేస్తున్న సుందరి బషీర్‌బీబీల భర్తలను పాదుషా బంధించాడు. పాదుషాను నమ్మించి, వారిని సవారీలపై కెక్కించుకొని, పొన్నాడషహరుకు తీసుకొస్తారు. ఈ ఫకీరులు అనారోగ్యులవ్వటం వల్ల, పొన్నాడ షహరుకు తీసుకొచ్చేసరికే బషీర్‌బీబీ భర్త మరణిస్తాడు. సుందరి ప్రియుడు జీవచ్ఛవంలా ఉంటాడు.

బషీర్‌బీబీ తన భర్త మరణించాడని తెలుసుకొని, నిశ్చేష్టురాలై తిరిగి తేరుకొని, తన భర్తను ఖననంకాని, దహనం కాని చేయవద్దని, అప్పటివరకు కట్టిన దరగాలో ( అప్పటికి దరగా నిర్మాణంలో ఉంది) తన భర్త శవాన్ని తన్ను ప్రవేశపెడితే, తన భర్తలో లీనమవుతానంటుంది. ఆవిధంగానే చేస్తారు. ఈ విషయం తెలుసుకున్న, వజీర్‌ఖాన్ దరగా వద్దకు వెళ్లి, చచ్చిన భర్తను వదలి, తన వద్దకు వచ్చి సుఖంగా ఉండమని, బషీర్‌బీబీని పిలుస్తాడు. మనసుమార్చుకోవటానికి ఏడు రోజులు వ్యవధి యిస్తాడు.

నీవు పెట్టిన వ్యవధి నాటికే నాశిలమనే సముద్రం పొంగి, నీపుత్ర, మిత్ర కళాత్రాదులందరినీ ముంచేస్తుంది. అని బషీర్ బీబీ శపిస్తుంది. ఆమె శపించినట్లే, ఆరు రోజులు పూర్తయ్యాక, సముద్రం పొంగి, వజీర్‌ఖాన్ అంతఃపురాన్ని ముంచేస్తుంది. ఖాన్‌తోసహా అందరూ సమాధి అయిపోతారు. పొన్నాడ షవార్ అంతా మునిగిపోతుంది. ఇంతటి జలప్రళయంలో కూడ ఆమె మహిమవల్ల బషీర్‌బీబీ దరగా చెక్కుచెదరదు. సుందరీ, పద్మిని వంటి బషీర్‌బీబీ అప్తులంతా ఆమె పాతివ్రత్యమహిమవల్ల సురక్షితంగా ఉంటారు.

వారు బషీర్‌బీబీదరగా వద్దకువెళ్లి, ఆమెను పిలుస్తారు. ఆమె పలకనందున, సుందరి దరగా శిఖరమెక్కి, శిఖరరంధ్రం గుండా తొంగి చూసింది. పూజాసమయంలో వెలిగించిన, నూనె దీపాలవెలుగులో భర్తశవం ప్రక్కన దేవతామూర్తిగా, దేహం బంగారు కాంతులతో దేదీప్యమానంగా వెలుగొందుతున్న బషీర్‌బీబీని ! ఓ నా బంగారు పాపా ! ఓ ! నా బషీర్ బీబీ ! అని పిలిచింది. అప్పుడు బషీర్ బీబీ అందరినీ పైకిరమ్మని 'నాయందభిమతభక్తి ప్రవత్తులు ప్రేమాదరాభిమానములు కలిగిన ఓ! నా శ్రేయోభిలాషులారా ! కొద్ది క్షణాలలో నాస్థూల శరీరం వదలి, సూక్ష్మ శరీరంలో నా భర్తలో ఐక్యంకాబోతున్నాను. నా ప్రాణస్నేహితురాలు, నావలె పతివ్రతా శిరోమణి అయిన, సుందరి ప్రేమాస్పదంతో, స్నేహవాత్సల్యానురాగంతో 'బంగారు పాప' అని మనోహరంగా పిలిచి, నా చరిత్రకు సార్థకత చేకూర్చింది. నేను బంగారు పాపనై, హిందువుల పూజలుకూడా అందుకొని, వారి కోర్కెలుకూడ తీరుస్తూ ఉంటాను. హిందూ మహమ్మదీయుల దేవతగా ఉత్సవాలు, ఊరేగింపులు జరిపించుకుంటూ ఉంటాను. నాతో మాట్లాడవలెననుకొనునిజమైన భక్తులు నాదరగావద్దకు వచ్చి, మూడుసార్లు ప్రదక్షిణం చేసి, పూజనొనర్చినవారికి బంగారుపాపగా సాకార రూపంలో కనపడతాను. ఇది నా మహచ్ఛక్తి ప్రభావము అని పలికింది.

సుందరితో ప్రత్యేకంగా 'సుందరీ నీవు నిశ్చింతగా నీ మనసులో నున్న ప్రేమమూర్తిని వివాహం చేసుకొని సుఖజీవనం గడుపుకొనుము. నీ సహజ మరణానంతరం నీవు మహచ్ఛక్తి గలదానవై నీ అత్తగారి గ్రామమందు దేవతా రూపమై వెలయగలవు. నీవును నావలె పూజలందుకొనుచు

సుందరీ దేవతగా ప్రఖ్యాతినొంది భక్తుల కోర్కెలు ఈడేర్చుచుండుము' అని ఉద్బోధించింది.

ఈవిధంగానే బషీర్‌బీబీ స్థూల శరీరం విడిచిపెట్టి, సూక్ష్మ శరీరం ధరించి, భర్త సూక్ష్మ శరీరంలో తన సూక్ష్మ శరీరాన్ని ఐక్యమొందించుకొని, మహచ్ఛక్తి ప్రభావంతో మహద్బిందువుగా వ్యక్తావ్యక్తరూపిణియై దరగా నధివసించి, బంగారు పాపగా భక్తుల కోరికలను నాటికి నేటికి ఈడేరుస్తూ మూలపేటస్థల పురాణానికి మకుటాయమానంగా నిలిచింది.

పూర్వకాలం నుండీ ప్రతి సంవత్సరం మాఘశుద్ధ పౌర్ణమికి ముందు మూడురోజులు ఈ బంగారుపాప దరగా వద్దకు దేశం నలుమూలలనుండి, మహమ్మదీయులు, హిందువులు వచ్చి, ఇక్కడ జరుగు ఉత్సవములలో పాల్గొని, తల్లి కరుణకు పాత్రులమయ్యామని సంతోషిస్తారు. సంవత్సరం పొడవునా దేశం నలుమూలల నుంచీ మహమ్మదీయులు ఈమె దర్శనానికి వస్తూంటారు.

**ఇటుకలమ్మ లేక ఇటికాలమ్మ :** ఈమె అంబాజీపేట మండలం మాచవరం గ్రామదేవత. ఈమె 'బెహరా' అనే యింటి పేరుగల బ్రాహ్మణుల అమ్మాయి. ఈమె పల్లకీలో అత్తింటి నుంచి పుట్టింటికి వస్తుండగా ఒక ముస్లిం రాజు వెంటపడ్డాడు. అతని నుండి తప్పించుకోవటానికి ఈమె మాచవరం సమీపానికి వచ్చాక, ఇప్పుడు అమ్మవారి గుడి ఉన్నచోట కాల్చటానికి సిద్ధంగా ఉన్న ఇటుక ఆవంలోకి దూరింది. ఆమె ఆవంలో ఉన్నట్లు తెలియని ఆ ఆవం యజమాని, దానిని కాల్చాడు. ఆమె ఆ మంటలలో కాలిపోయి చిత్రంలా ఇటుకకు అంటుకొనిపోయింది. ఆరాత్రి ఆమె తల్లిదండ్రులకు కలలో కనిపించి, జరిగింది చెప్పి, గుడికట్టించి పూజించమన్నది. ఆ ఇటుకతోనే అమ్మవారికి గుడికట్టి పూజిస్తున్నారు. ఇటుక ఆవంలో పుట్టింది కాన ఈమె ఇటుకాలమ్మ. ఇప్పటికీ బెహరావారే ఈమెకు పుట్టింటివారు.[4] మానసంరక్షణలో ప్రాణం కోల్పోయి దేవతగా వెలసిన వివాహిత స్త్రీయే ఇటుకలమ్మ.

**గొల్లాలమ్మ :** ఈమె ఈజిల్లాలో కూర్మాపురం, అంజూరు, వెంగయ్యమ్మ పేట, ఏలేశ్వరం మొదలైన గ్రామాల్లో పూజింపబడుతుంది. ఈమె కథ ఏలేశ్వరం గ్రామంలో ఉన్నది. ఈమె చరిత్ర విచిత్రంగా ఉంటుంది. పెద్దాపురం తిమ్మజగపతి మహారాజు ఇక్కడ చెరువు తవ్వించాడు. ( దీనిని తిమ్మరాజు చెరువు అంటారు. దీని నీటితో చుట్టుప్రక్కల 10 గ్రామాల భూములు సాగవుతున్నాయి) లింగంపర్తివైపు గట్టు ఎప్పుడూ తెగిపోతూ ఉండేది. బండ్లకొద్దీ మట్టివేసి, ఏనుగుల చేత తొక్కించి, గట్టుబిగించి కొట్టుకొనిపోయాయి. అప్పుడు రాజుకు దేవత కనిపించి, అక్కడికి నిత్యం పాలుతెచ్చే గొల్లాలమ్మ అనే ముసలిదాన్ని అక్కడ నిలిపి, ఆమెపై గట్టువేసేస్తే, ఆ గట్టు నిలుస్తుందని చెప్పింది. గ్రామ రక్షణార్థం ఆ అవ్వ అందుకు సిద్ధపడింది. అలాగే ఆమెను నిలబెట్టి మట్టితో కప్పేసి గట్టువేశారు. గట్టు నిలిచిపోయింది. నాటినుండి ఆమెను దేవతగా కొలుస్తున్నారు. ఆమె పేరుతో 'గొల్లాలమ్మ మదుం' నిర్మించారు.[5] గ్రామ రక్షణార్థం తనను తాను అర్పించుకున్న త్యాగమూర్తికథే ఈ గొల్లాలమ్మ దేవత కథ.

ఈమె కథ రాయలసీమలోని ముసలమ్మ పేరంటాలి కథను పోలి ఉన్నది. ఆమె కూడ గట్టుకు గండిపడగా, గ్రామ రక్షణార్థం గంగకు బలి అయ్యింది. ఆమె కథను డా. ప్రేమలతగారు తమ గ్రంథంలో పేర్కొని ఉన్నారు. ముసలమ్మ కథను ఆధారంగా చేసుకొని డా. రామలింగారెడ్డిగారు

డాక్టరు చిలుకూరి నారాయణరావు గారులు ఖండకావ్యం రచించారు.

పరుల దౌర్జన్యమునకు బలియై, దేవతలుగా వెలసిన పుణ్యస్త్రీలకథలే మారెమ్మ, నేరేళ్లమ్మ, ఇటుకలమ్మ, బంగారుపాపల కథలు. కథాకాలం నాటి సాంఘిక పరిస్థితులను ఆధారంగా చేసుకొని ప్రముఖ నృశాస్త్రజ్ఞుడు లెవి స్ట్రాస్ నిర్మాణ విశ్లేషణాసూత్రాన్ని గ్రామ దేవతల కథలకు అన్వయింపవచ్చును.

**అమాయకత్వం : దుర్జనత్వం :: దైవత్వం : దుర్గతి**

ఈ కథా నిర్మాణసూత్రం మారెమ్మ, నేరేళ్లమ్మ కథల కన్వయిస్తుంది. అమాయకులపై దౌర్జన్యమును జరిపినవారు దుర్గతి పొందగా, దౌర్జన్యాన్ని అనుభవించినవారు మహిమాన్వితులై దైవత్వాన్ని పొందుతారని ఈ దేవతల కథలు నిరూపిస్తున్నాయి.

బంగారు పాప కథలో పతివ్రతయైన బంగారుపాపను అనుభవింపదలచి చెరపట్టిన వజీర్‌ఖాన్ దుర్మరణం పాలయ్యాడు. ఈ కథలో పాతివ్రత్యం, జారత్వం అను రెండు విరుద్ధ శక్తుల మధ్య సంభవించిన సంఘర్షణలో పాతివ్రత్యం దైవత్వాన్నందు ఆరాధింపబడగా, జారత్వం దుర్మరణంతో అపకీర్తి నందింది.

**పాతివ్రత్యం : జారత్వం :: దైవత్వం : దుర్మరణం**

### ఆ (ఎ) అవివాహితులుగా మరణించిన వారు

**పసుపులమ్మ :** ఈమె ఈజిల్లాలో సామర్లకోట, రాపర్తి, వన్నెపూడి మొదలైన గ్రామాల్లో పూజింపబడుతుంది. ఈమె పుట్టుక గురించి సామర్లకోటలో ఒక కథ విస్పిస్తున్నది.

పూర్వం పసుపులేటి రామన్న, రాయమ్మ అనే దంపతలకు లేకలేక ఒక అమ్మాయి పుట్టింది. ఆమె 11,12 సంవత్సరాల వయస్సులో జబ్బుచేసి మరణించింది. తర్వాత వరుసగా మూడురాత్రుళ్ళు తల్లిదండ్రులకు కలలో కన్పించి, గుడి కట్టించి, పూజించమని కోరింది. గుడి కట్టించి, అప్పటి నుంచీ వారు, వారితోపాటు గ్రామస్థులు కూడ దేవతగా ఆరాధిస్తున్నారు. పసుపులేటి వారి అమ్మాయి దేవతగా వెలసింది కాబట్టి ఈమె పసుపులమ్మ. ఈ పసుపులేటివారు ఓలేటి నరసయ్య అనే బాలుణ్ణి పెంచుకున్నందువల్ల, పసుపులమ్మ ఓలేటి వారికి ఆడపడుచు అయ్యింది. ఓలేటివారు ఈమెకు పుట్టింటి వారయ్యారు. ఈమెను ఇప్పటికి మూడు తరాల నుచి ఓలేటివారు పూజిస్తున్నారు.

**ఆరులమ్మ :** ఈమె గంగవరం మండలం రాజవరం గ్రామదేవత. ఈమె గురించి ఒక కథ ఉన్నది. ఈ గ్రామస్థులందరూ కొండదొరలు వీరిది పూర్వంభద్రాచలం ప్రాంతం. ఆ ప్రాంతాన్ని తోకరాజు (ఆరాజుకి తోక ఉండేది) పాలించేవాడు. ఈ దొరలకు, రాజుకి తగాదావచ్చి, రాజు దొరలలో పురుషులనందరినీ చంపేశాడు. స్త్రీలు భయపడి ఆ ప్రాంతం విడిచి, అరణ్య మార్గాన వచ్చి, గోకవరం మీదుగా వెళ్లిపోతున్నారు. గోకవరం రాజు కోట పైనుండి చూసి, వెళ్లేవాళ్లను ఆపించి, వాళ్లకు గోకవరం సమీపంలో గ్రామం నిర్మించాడు. (రాజు నిర్మించాడుకాబట్టి ఈ గ్రామం రాజవరం అయ్యింది). ఈగ్రామంలో 'కురసం' 'చోడె' అనే రెండు ఇంటి పేర్లు వారున్నారు. ఈ రెండు ఇంటి పేర్లవారి మధ్యనే పెళ్లిళ్లు జరుగుతాయి. కురసం వారి ఒక కుటుంబంలో వరుసగా

అయిదుగురు అబ్బాయిలు పుట్టి, ఆరవసారి అమ్మాయి పుట్టింది. ఆరవ సంతతి కాబట్టి ఈమెకు ఆరులమ్మ అని పేరు పెట్టారు. ఈమె కన్నెగా ఉండగానే చనిపోయి, దేవతనవుతున్నాను, గుడి కట్టించి పూజించండి' అని తల్లి దండ్రులకు కలలో కనిపించి చెప్పింది. అప్పటినుంచి ఈమెకు గుడికట్టి పూజిస్తున్నారు. అవివాహితగా అకాల మరణం చెంది, దేవతగా వెలసిన కన్యయే ఆరులమ్మ.

**గరగలమ్మ :** ఈమె ఈ జిల్లాలో ముమ్మిడివరప్పాడు, భూపాలపట్నం గ్రామాల్లో ఈమె పూజింపబడుతుంది. ఈమె కథ ముమ్మిడి వరప్పాడు గ్రామంలో లభించింది. తనకు కాబోయే భర్త సౌందర్యవంతుడని భావించిన పెళ్లికుమార్తె, మొదటిసారి పెళ్లిపీటలమీద భర్తనుచూసి, తాను భావించినట్లు జరగనందున నిరాశచెంది, తట్టుకోలేక పెళ్లిదుస్తులతోనే అగ్నికి ఆహుతిఅయిపోయింది. తర్వాత తన తల్లి దండ్రులకు కలలో తలమీద గరగలతో కనిపించింది. ఆమెను గరగలమ్మగా భావించి, గుడికట్టి, అప్పటినుంచి గ్రామస్థులందరూ పూజిస్తున్నారు.[8]

**దుర్గమ్మ :** ఈమె ఈ జిల్లాలో పెద్దనాపల్లి, రామచంద్రపురం, కొమరిపాలెం, కందలాడ, శృంగరాయని పాలెం, చిత్రాడ, మాధవపురం, ప్రత్తిపాడు, నరసింగపురం, సుబ్బంపేట, చినజగ్గంపేట, దుర్గాడ, గోకవరం, కొత్తపల్లి, గండేపల్లి, రామవరం దిగువాయి పోలవరం, పాతపెరుమాళ్లపురం, రాజోలు, గుడిమెల్లంక, కంద్రిక, చింతలపల్లి, అడ్డూరు, గోగన్నమఠం, సామంతకుర్రు, అంతర్వేది, లక్ష్మీపోలవరం, పాడకట్లపల్లి, దంగేరు, ఉండూరు మొదలైన గ్రామాల్లో పూజింపబడుచున్నది.

'దుర్గముడు' అనే రాక్షసుణ్ణి సంహరించిన ఆదిశక్తే 'దుర్గ' అని పురాణాలలో వివరింపబడింది.

విజయవాడ నగరం ఇంద్రకీలాద్రి పర్వతంపై వెలసిన దుర్గమ్మ (కనకదుర్గ) ఆంధ్ర ప్రజలందరిచేత పూజింపబడుతున్నది. ఈమె పుట్టుక గురించి బెజవాడ కనక దుర్గమ్మ ఏడుగురు అన్నదమ్ములకు ఒకతే చెల్లెలు. వారు ఆమెను అనుమానించగా, నూతిలో పడి మరణించి, 'కనకమ్మ' అను పేరుతో శక్తిగా వెలసింది'[9] అని ఆచార్య నాయని కృష్ణకుమారిగారు పేర్కొన్నారు. ఈమె పుట్టుక గురించి ఈ జిల్లాలో ఇంకొక కథ విన్పిస్తుంది.

దుర్గమ్మ విజయనగరం రాజు పూలతోటలో తోటమాలిగా ఉండేది. ఈమెపై రాజు కన్నుపడింది. ఈమె రాజుకు చిక్కకుండ విజయవాడ వచ్చి కనకదుర్గగా వెలసింది.[10]

ఈ జిల్లాలో 'వెంకన్నబాబు పాట' అనే కథాగేయం ప్రచారంలో ఉన్నది. ఈ కథలో వేంకటేశ్వరస్వామికి దుర్గమ్మ అక్కగా పేర్కొనబడింది. పేదవారి అమ్మాయి అయిన అలవేలు మంగను పెళ్ళిచేసుకోనని కోపగించి, కనిపించకుండా పోయిన, తమ్ముడు వేంకటేశ్వర స్వామిని, అక్క దుర్గమ్మ పిలిచి, అనేక విధాలా బ్రతిమలాడి, చివరకు పెళ్లికి ఒప్పిస్తుంది.

ఈ కథాగేయంలో కనకదుర్గ ఆకారం, అలంకరణ, ఆరాధనా విధానం కూడ చక్కగా వర్ణింపబడ్డాయి.

**గేయకథా సారాంశం :** పేరెల్లిదేవి, తిమ్మరాజు అనే దంపతులకు ఏడుగురు కుమారులు. ఒక కుమార్తె (కనకదుర్గ) చివరివాడు వెంకన్న. (వేంకటేశ్వర స్వామి) మొదటి ఆరుగురు

వివాహితులు. వీరు తమ్ముడికి వధువును చూడ్డానికి 'ఆలా' వారి పట్టణం వెళ్లారు. దూరంగ ఉండగానే వీళ్లను చూసిన ఆలావారి తాతయ్య చావుళ్లలో చాపలువేసి, కూర్చుండబెట్టి, ఏ ఊర్లో ఎవరి పిల్లలో అడుగుతాడు. తమది ఈదపరకాపురము. తల్లి పేరెల్లిదేవి, తండ్రి తిమ్మరాజు అ చెబుతారు. ఆలావారి తాతయ్య వారిని తన కూతురి బిడ్డలుగా గుర్తించి, ముద్దులాడి, వారి తల్లిదండ్రుల క్షేమం గురించి అడిగి తెలుసుకుంటాడు.

తాము ఏడుగురు అన్నదమ్ములమని, ఆరుగురికి పెళ్లిళ్లయ్యాయని, తమ్ముడికి కన్నెకోస వచ్చామని చెబుతారు. తాతయ్య తన మనుమరాలు (కొడుకుబిడ్డ) ఆలివేలు మంగ ఉన్నదని, నచ్చితే తీసుకెళ్లమంటాడు. తన మనుమలను భోజనాలు చెయ్యిమంటాడు. [illegible] భోజనం చెయ్యమంటారు మనుమలు. మంగను ముస్తాబు చేసి చూపుతారు. మంగ తమ తమ్ముడికి తగినట్టే ఉందని ఊసులాడుకొని, మంగ తమకు నచ్చిందని, తమ తమ్ముడికి కట్నమేమిస్తార తాతయ్య నడుగుతారు. తాతయ్య కట్నంగా బంగారపరిటాకు అరణమిస్తాననగానే, ఆరుగురన్నదమ్ములు దారిన పోయే బ్రాహ్మణులను పిలిచారు. బ్రాహ్మణులు జాతకాలు చూసి, మంగకు వెంకన్నకు పేరుబలాలు పడికట్టి, లక్ష్మివారంనాడు లగ్నం పెడతారు. ముహూర్తం నిర్ణయ చేయించుకొని తాతయ్య వద్ద సెలవుతీసుకుంటారు.

ఆరుగురు అన్నదమ్ములు ఇంటికి వచ్చి, ''ఇంతకాలమయ్యింది. ఇంత వారమయ్యా తాతయ్య మావయ్య ఉన్నారని ఎందుకు చెప్పలేదు'' అని తల్లిని నిలదీస్తారు. పెండ్లికుమార్తె పగవారెవ్వరో కాదని, మనకు కావలసినవారేనని మేనమామ కూతురు ఆలివేలు మంగ అని చెబుతారు. తల్లి కుమారులతో ఆలా వారంటే తమకు వైరమని, అన్నానికి వారు పేదవారయినప్పటి నుంచి వెళ్లడం మానివేసామని చెబుతుంది. అలివేలుమంగమ్మని కాయపెట్టాం. లక్ష్మివారం ముహూర్తంఅని అన్నలు చెప్పుచుండగా విన్న 'వెంకన్న' అన్నానికి లేనివారి పిల్లని తనకు పెళ్లిచేస్తారేమోనని, పాలసముద్రమ్మీద ఉన్న శేషపానుపు మీదకెళ్లి పడుకున్నాడు.

తల్లి పేరెల్లిదేవి పెళ్లి పనులు చేసుకొని, పెండ్లికొడుకుని చేద్దామని చూసేసరికి వెంకన్న జాడలేదు. ఎవ్వరినడిగినా, ఎక్కడ వెదకినా వెంకన్న కనిపించలేదు. తల్లి తన కూతురు దుర్గమ్మని, తమ్ముడెక్కడికోపోయాడు రమ్మని పిలుస్తుంది. ఈపిలుపు మల్లిఖార్జునస్వామి పాదాలు పడుతున్న కనకదుర్గకు వినిపించి, తన తల్లి తన్ను పిలిచిందని ప్రాణేశు నుంచి సెలవు తీసుకొని, తన నూటొక్క మెట్టులూ దిగి తల్లివద్దకు వచ్చింది. తన్ను పిలిచిన కారణ ము అడుగుతుంది. పెళ్ళి ముహూర్తం పెట్టారన్న విషయం తెలుసుకొని, తమ్ముడు ఎక్కడో దాక్కున్నాడన్న తల్లిని ఓదార్చి, కనకదుర్గ 'ఎయ్యిమాయలవాడా! రావోయి ఎంకన్నా అని పిలుస్తుంది. ఆ పిలుపు విన్న వెంకన్న శేషపానుపు విడిచి పెట్టివచ్చి, తన్ను పిలిచిన కారణమేమని దుర్గక్క నడుగుతాడు.

దుర్గక్క తమ్ముడితో మేనమామ కూతురు మంగని పెళ్లాడమని, పెళ్లాడక పోతే తాము తప్పుదొరుకుతామని అంటుంది. ఆలావారంటే అన్నానికి లేనివారని, లేనివారి పిల్లను పెళ్లాడితే, తన ముద్దూముచ్చట్లు, తనకు తగ్గ సోకులూ జరగవని అంటాడు. ఆలావారి మంగని పెళ్లాడడం తప్పదని, తమ్ముడి ముద్దూముచ్చట్లూ, సోకులూ సరదాలూ తానూ చూస్తానని దుర్గక్క అంటుంది

మాటలు కాదని రాతలు రాయాలని, రాతిపలక మీద రాసివ్వమని వెంకన్న అంటాడు. తనకు నూటొక్క మెట్లులున్నాయని, వాటిలో యాభైయొక్క మెట్లులు భాగమిస్తానని, తనకిచ్చే ఆడవడుచు కట్నం, బంగారు పళ్లెం చెంబూ కూడ తమ్ముడికే యిస్తానని, తమ్ముడి సరదాలుసోకులూ జరుపుతానని అంటుంది. అక్కవెయ్యికళ్ల తల్లనీ, ఎటువైపు ఉంటుందో వైనంఉండదనీ, ఏదారి నుంటుందో వైనం లేదని, కాబట్టి మాటలుకాక, రాతిపలకమీద రాతలురాసియ్యాలని వెంకన్న అంటాడు.

ఏభైయొక్క మెట్లూ రాతిపలకమీద రాసిచ్చి, తమ్ముడి ముద్దుముచ్చట్లు తాను జరుపుతానని, తమ్ముడికి గుళ్ళూ, గోపురాలు కడితే, అవి కట్టేటపుడు డబ్బుసాయంచేస్తానని, పెళ్లి ఒప్పందం పెట్టి, దుర్గమ్మ తన నూటొక్కమెట్లు మీదకీ వెళ్లిపోయింది. అప్పుడు తమ్ముడు వెంకన్నకు పెళ్లి అయ్యింది.[1]

నేటి పురుషాధిక్య ప్రపంచంలో ఆడపిల్లల పెళ్లి, సమస్యాత్మకమనీ భగవంతునికి కూడ కట్నకానుకలపై, ప్రీతి అధికమనీ ఈ కథ వల్ల స్పష్టమగుచున్నది. పురుషదేవుడైన వేంకటేశ్వర స్వామి కంటె, స్త్రీ దేవతయైన దుర్గ పెద్దదిగా పేర్కొనబడడంవల్ల, ఆమె అతనికి చెప్పి ఒప్పించటంవల్ల స్త్రీ దేవతయొక్క ఆధిక్యత స్పష్టమగుచున్నది.

## ఆ. (బి) అవివాహితులుగా అదృశ్యమైన వారు

**బాపనమ్మ :** ఈమె పెద్దనాపల్లి, ఇప్పనపాడు, గోకవరం, గంటి పెద్దపూడి, పిడతమామిడి, ఎర్రంపాలెం, సోమేశ్వరం మొదలైన గ్రామాల్లో పూజింపబడుతుంది. ఈమెను ల్లొల్ల, భూపాలపట్నం గ్రామాల్లో 'బులిబాపనమ్మ' అని, సీతపల్లి గ్రామంలో 'గడి బాపనమ్మ' అని కూడ పిలుస్తారు.

ఈమె కథ రంపచోడవరం మండలం సీతపల్లి గ్రామంలో లభించింది. ఈ గ్రామంలో ఒక రెడ్డి కులస్థుల కుటుంబంలో 'బాపనమ్మ' అనే అమ్మాయి ఉండేది. ఆమెకు యుక్తవయస్సు వచ్చాక, పెళ్లిచేద్దామని తల్లిదండ్రుల సంబంధాలు చూసారు. పెళ్లివారు వచ్చాక, 'నాకు పెళ్లివద్దు. దేవతనైపోతాను' అని సీతపల్లి పరిసర ప్రాంతంలో ఉన్న అడవిలోకి వచ్చేసింది. తల్లిదండ్రుల అడవంతా వెదికినా కనిపించలేదు. తర్వాత వాళ్లకు కలలో కనిపించి, నేను ఫలానాచోట (ఇపుడు అమ్మవారి గుడి ఉన్నచోట) ప్రతిమనై ఉన్నాను' అని చెప్పింది. తల్లిదండ్రులు అక్కడకు వచ్చి చూస్తే, ఆమె అక్కడ ఉన్నట్టు గుర్తుగా పసుపు, కుంకుమ చల్లి ఉన్నది. వెదురు బిల్లు (పొదలు) లో ఉన్న పతిమను గడిబాపనమ్మగా పూజిస్తున్నారు.[12]

**గొంపమ్మ :** ఈమె కోటనందూరు మండలంలోని బొద్దవరం, తాటిపాకఅగ్రహారం మొదలైన గ్రామాల్లో గ్రామదేవత. ఈమె పుట్టుక గురించి బొద్దవరం గ్రామంలో ఒక కథ ఉన్నది. ఈమె బొద్దవరంలో 'దేవరకొండ' ఇంటి పేరు గల బ్రాహ్మణుల అమ్మాయి. ఈమెకు యుక్తవయస్సు వచ్చాక పెళ్లి చేస్తామని, తల్లిదండ్రులంటే పెళ్లివద్దు అగ్నిగుండాలు తీయించండి అన్నది. తల్లిదండ్రులు అందు కొప్పుకోలేదు. పెద్దవారితో చెప్పకుండ చెంబుతో నీళ్లపట్టుకొని పుంతలోనికి కెళ్లినట్టు (బహిర్భూమి కెళ్లినట్టు) వెళ్లి, ఊరి సమీపంలోని కొండ ఎక్కిపోయింది. తర్వాత తల్లిదండ్రులకు కలలోకనిపించి, తాను పలానా కొండమీద ఉన్నాననీ, సంబరం చేయించమని చెప్పింది. తల్లిదండ్రులు

ఇతర పెద్దలు కలిసి, సంబరం చేయిస్తూ, కొండమీదకెళ్లారు. తిరిగి వచ్చేటపుడు కొండమీద చెంబు మరచిపోయారు. చెంబుతీసుకొని రమ్మని, బారిక (గ్రామసేవకుడైన మాల కులస్థుడు)ను పంపించారు. బారిక వెళ్లేసరికి, గొంపమ్మ గ్రామదేవతలందరికీ, కోలాహలంగా భోజనాలు వడ్డిస్తున్నది. గొంపమ్మను గుర్తు పట్టిన బారిక 'అమ్మగారూ!' అని పిలిచాడు. 'ఎందుకొచ్చావు?' అని కోప్పడింది. అతనికి చెంబు ఇచ్చి, తాను కనపడినట్లు ఎవ్వరికీ చెప్పవద్దనీ, చెబితే, తలపగిలి మరణిస్తావని శాపమిచ్చింది. బారిక చెంబు తెచ్చి, గొంపమ్మ తల్లిదండ్రులకిచ్చి, ఇంటికెళ్లి భార్యాబిడ్డల్ని చూసుకొనివచ్చి, గొంపమ్మ తల్లిదండ్రులతో గొంపమ్మ కనిపించిన విషయం చెప్పి, తలపగిలి చనిపోయాడు. అమ్మవారు ఎవరైనా వ్యక్తుల మీద పూనినపుడు 'నీవు దూరంగా ఉన్నావు. నీకు సంబరం చేయటమెలాగ' అని తల్లిదండ్రులు అడిగితే 'నేను కొండ మీద నుంచి చెంబు విసురుతాను. చెంబు పడిన చోట గుడికట్టండి' అని చెప్పింది. ఆవిధంగానే గుడి కట్టి పూజిస్తున్నారు.[13] ఈవిధంగా కొండమీద నుంచి చెంబు విసిరి, చెంబుపడిన చోట గుడికట్టించి పూజించటమనేది చాలా కథలలో కనపడుతుంది. ఈ జిల్లాలోని ఎల్లవరం తాలూకాలోని పోతురాజు గుడి, అతడు కొండమీద నుంచి, చెంబు విసిరితే అది పడినచోటే నిర్మించారు. అవివాహితగానే అదృశ్యమై, దేవతగా వెలసిన స్త్రీయే గొంపమ్మ.

**ఒనుములమ్మ :** ఈమెను ఒనువులమ్మ, ఒనుగులమ్మ, వననాలమ్మ అని కూడ పిలుస్తారు. ఈమె ఈజిల్లాలో చిరతపూడి, నందరాడ, కొత్తపల్లి, అమరవల్లి, మల్లాం, అమీన్‌బాద్, జాములపల్లి, పెదపట్నం, పెదపట్నంలంక, రాజోలు, మంగితుర్తి, మగతపల్లి, వీరవిల్లి పాలెం, వాకతిప్ప, సత్యవాడ, కడియం, గుమ్మరేగుల, గిరిజనపురం, కేతనగిరి, మిర్తిపాడు, పెనుమళ్ల, బాతనవిల్లి మొదలైన గ్రామాల్లో పూజింపబడుతున్నది.

ఈమె కథ ఈ జిల్లాలోని తుని మండలం దిగువాయి పోలవారం గ్రామంలో ప్రచారంలో ఉన్నది. ఇప్పటికి 100 సంవత్సరాలకు పూర్వం ఈ గ్రామంలో 'గూడపర్తి' అనే యింటి పేరుతో ఏడుగురు అన్నదమ్ములుండేవారు. వారికి సౌందర్యవతియైన చెల్లెలు ఉండేది. ఆమె పేరు ఒనుములమ్మ, ఈమె తన అన్నలకు పొలంలోనికి భోజనం తీసుకెళుతుండేది. యథాప్రకారం ఒకరోజు ఈమె తన అన్నలకు పొలంలోనికి భోజనం తీసుకెళ్లి, వారు తింటుండగా, పక్కనే ఉన్న చెట్టుచాటుకెళ్లి మాయమయ్యింది. అన్నలు భోజనం ముగించుకొని, చెల్లెల్ని పిలిచారు. పలకలేదు. ఆ ప్రాంతమంతా ఎంత వెదకినా కనిపించలేదు.

ఆ రాత్రికి తన అన్నలకు కలలో కనిపించి, వారిని ఓదార్చి, తాను మరణించానని, తాను అదృశ్యమైన చెట్టువెనుక పుట్ట ఏర్పడుతుందని, ఆ పుట్టదగ్గరే గుడి నిర్మించి, పూజించమని, రెండు సంవత్సరాల కొకసారి సంబరం చేయించమని కోరింది. ఆ మరునాడు అన్నలు, గ్రామస్థులు చెట్టువద్దకు వెళ్లి చూడగా కలలో చెప్పినట్టేజరిగింది. అప్పటినుంచి ఆమెను గుడికట్టి పూజిస్తున్నారు.[14]

**పంపాదమ్మ :** ఈమె జిల్లాలోని పైడికొండ, పంపాదిపేట, కోటంగి, దుర్గాడ గ్రామాలలో పూజింపబడుతుంది. తొండంగి మండలంలోని వేమవరం, కృష్ణాపురం, ఒంటి మామిడి, అద్దారిపేట గ్రామాల ఉమ్మడి దేవత ఈమె. ఈమె పుట్టుక గురించి ఈ ప్రాంతంలో ఒక కథ చెబుతారు.

దేవకీవసుదేవులకు అష్టమ గర్భాన జన్మించిన కృష్ణుని, అదే సమయంలో నందయశోదలకు రేపల్లెలో పుట్టిన ఆడబిడ్డ స్థానంలో ఉంచి ఆమెను కృష్ణుని స్థానంలోనికి వసుదేవుడు మారుస్తాడు. ఈమెను వధించదలచి కంసుడు ఆకాశంలోకి ఎగురవేయగా, ఆమె కంసునితో నిన్ను వధించే బాలుడు రేపల్లెలో పుట్టి పెరుగుచున్నాడు అని హెచ్చరించి, అంతర్ధానమవుతుంది. ఈవిధంగా అంతర్ధనమైన బాలికే పంపాదమ్మ'[15] అని ఇచ్చటి యాదవుల కథనం.

**మామిళ్లమ్మ :** ఈమెను మావుళ్లమ్మ, మావిళ్లమ్మ అనికూడ పిలుస్తారు. ఈమె ఈ జిల్లాలోని తాటిపాక, ములికిపల్లి, మల్లవరం, ఇసుకపూడి, మారేడుబాక, కాత్రేనికోన, నులకమద్ది, పెదపర్తి, మునిపల్లి, చినగాడ విల్లి, మొదలైన గ్రామాల్లో పూజింపబడుతున్నది.

ఈమె కథ మండపేట మండలం మారేడుబాక గ్రామంలో లభించింది. ఈమె కంటె ముందు నుంచి వేరొక మామిళ్లమ్మదేవత ఉండటం వల్ల ఈమెను కొత్త మామిళ్లమ్మ అంటారు. ఈ గ్రామంనందలి 'పుట్టా' అని ఇంటి పేరు గల కమ్మవారి ఇంటిలో ఇప్పటికి 6,7 తరాల కిందట పుట్టిన అమ్మాయికి 'మామిళ్లమ్మ' అని పేరు పెట్టారు. ఈమెకు 10 సంవత్సరాల వయసు వచ్చాక విపరీత ధోరణులతో ప్రవర్తించేది. తల్లి ఎక్కువ అన్నం పెట్టలేదని తండ్రికి ఫిర్యాదు చేసేది. గ్రామంలో ఉన్న రెండు నేరేడు చెట్లవద్దకు వెళ్లి తనఈడు పిల్లలతో ఆడుకునేది. ఒకరోజు ఈమె నేరేడు చెట్టు తొర్రలోని కెళ్లి మాయమైపోయింది. తిరిగి కనిపించలేదు. ఎంతమంది పిలిచినా తిరిగి రాలేదు. తల్లిదండ్రులకు కలలోకనిపించి, తాను దేవతనయ్యానని, గుడికట్టించి పూజించమన్నది. ఆమె మాయమైన నేరేడు చెట్లదగ్గర గుడికట్టించి పూజిస్తున్నారు.[16] ఈ అమ్మవారి మీద ముక్కపాటి భాస్కర రామయ్యసిద్ధాంతిగారు దండకంకూడ వ్రాసారు.

**నేరేళ్లమ్మ :** కొంకుదురు గ్రామంలో ఈమె గురించి ఒక కథ చెబుతారు. ఈమె ఈ గ్రామంలో ఒక రైతు ఇంట పుట్టింది. బాలికగా ఉండగా తల్లి ఎంత తిండిపెట్టినా, సాయంత్రం శ్రమపడి యింటి కొచ్చిన తండ్రికి తల్లికూడు పెట్టలేదని ఫిర్యాదుచేసేది. అన్నం కుండెడువార్చి పెట్టినా తినేసి పెట్టలేదని గోలపెట్టేది. ఒక రోజు తండ్రి పరిక్షిద్దామని మిద్దెక్కి దాక్కుని తల్లి కుండెడుకూడు పెట్టడం చూసాడు. సాయంత్రం ఆ పిల్ల మామూలుగానే తల్లి తిండి పెట్టలేదని ఫిర్యాదు చేసింది. వెంటనే తండ్రి అది ఏదో పిశాచి అని పట్టరాని కోపంతో వలుపుతాడు తీసుకొని కొట్టడానికి వస్తుంటే ఆ పిల్ల పారిపోవడం మొదలెట్టింది. వెంటబడి తరుముతుంటే కొంతదూరమెళ్లి మాయమయిపోయింది. తర్వాత గ్రామదేవతగా వెలసింది.'[17]

**పోలేరమ్మ :** ఈమె ఈ జిల్లాలోని గాదరాడ, పల్లెపాలెం, నాయకంపల్లి, మూలపేట, జల్లూరు, గంటి, కట్టమూరు, అమీన్‌బాద్, సీతారాంపురం, వెదురుపాక, రాయవరం, మండపేట, జేగురుపాడు, మాధవరాయడుపాలెం, ఎర్రంపాలెం, తాళ్లూరు, కొత్తూరు, రాజవరం, ఆత్రేయపురం, పాడకట్లపల్లి, ఈతకోట మొదలైన గ్రామాల్లో పూజింపబడుతున్నది.

ఈమె గురించి తూర్పుగోదావరి జిల్లాలో ఎలాంటి కథ లభించలేదు. కాని విజయనగరం జిల్లాలో శంబర గ్రామానికి కూడ ఈమె దేవతే. ఈమెను 'శంబర పోలమాంబ' అంటారు. అక్కడ ఈమె గురించి ఒక కథ చెబుతారు.

300 సంవత్సరాల క్రిందట 'కొండదొర' కులానికి చెందిన పేకాపు అప్పయ్యదొర, పోలమ్మ సంతానమే ఈ పోలమాంబ. ఈమెకు పెళ్లిజరిపించి, ఊరువిడిచి పోయినపుడు పల్లకీ దిగి, రెండు ఫర్లాంగుల దూరంలో నున్న గురివిందల పోతినాయుని చెరువు వద్దకు రాగానే తన మేనత్తతో కలిసి, భూమిలో కలిసిపోయింది. అదేరోజు గ్రామపెద్ద కలలో కన్పించి, 'నాకు వివాహం అంటే యిష్టంలేదు. ప్రజలంతా ప్రతియేడాది నా పేరున పండుగ జరుపుకోవాలి. గ్రామరక్షణకు కృషి చేస్తాను. నా సమాధి వద్ద ఆలయం కట్టించవద్దు. అని తెలిపి మాయమయ్యింది.18

పసుపులమ్మ, ఆరులమ్మ, గరగలమ్మ, దుర్గమ్మ, గడిబాపనమ్మ, గొంపమ్మ, ఒనుపులమ్మ, పంపాదమ్మ, మామిళ్లమ్మ, పోలమ్మ మొదలైన దేవతల కథలనుబట్టి, అవివాహితులుగా మరణించిన లేక అదృశ్యమైన కన్యలు కూడ మహిమాన్వితులని భావించిన గ్రామీణులు వారికి దైవత్వాన్ని ఆరోపించి పూజిస్తున్నారనవచ్చును.

## 3 దైవాంశతో దేవతలైనవారు.

**నూకాలమ్మ** : ఈమె ఈ జిల్లాలో కిర్లంపూడి, ఒమ్మంగి, ఉత్తరకంచి, పెద్దిపాలెం, సంతపైడిపాల, ఉద్దండ జగన్నాథపురం, మండపం, శంఖవరం, ఎండపల్లి, లింగంపర్తి, పిఠాపురం, కోలంక, ఏలూరు, పవర, నవర, చింతలూరు, కాంద్రకోట, గొల్లప్రోలు, ఉప్పాడ, పొన్నాడ, ఇర్రిపాక, రామచంద్రపురం, మాధవపురం, చెందుర్తి, చేబ్రోలు, కుమారపురం, కనుపూరు, సీతారాంపురం, మల్లేపల్లి, రాజవొమ్మంగి, కింద్ర, కొరుప్రోలుమల్లవరం, కొత్తూరు, బిళ్లనందూరు, దిగువాయి పోలవరం, ఎ. కొత్తపల్లి, పసర్లపూడి, చింతలపల్లి, తునికలపూడి, వడిశలేరు, ఉండూరు, బిక్కవోలు, రాజమండ్రి, కాకినాడ, జి. కొత్తపల్లి మొదలైన గ్రామాల్లో పూజింప బడుచున్నది.

ఈమె ఈ జిల్లాలోని చాలా గ్రామాల్లో గ్రామదేవత అయినప్పటకీ కాంద్రకోటలో వెలసి చాలా ప్రసిద్ధి కెక్కింది. ఈమె గురించి ఈ గ్రామంలో ఒక కథ చెబుతారు.

నూకాలమ్మ మాలవారి అమ్మాయి. ఈమె విధవ. ఖానుడు అనే రాజా ఈ ప్రాంతాన్ని పాలించేవాడు. (అందుచేత ఈ గ్రామం ఖాన్‌కోట తర్వాతకాలంలో కాంద్రకోటగా మారింది) ఆయన చనిపోయాడు. ఈ రాజాగారి అబ్బాయిల్ని కప్పం కట్టలేదని హైదరాబాదు నవాబు తీసుకెళ్లిపోయాడు. అప్పుడు రాణి గారు ఏలాముని (ఈ ప్రాంతంలో తపస్సు గావించిన ముని. ఈ ప్రాంతంలో ప్రవహించే ఏలానది లేక ఏలేరును ఈతడు సాధించి తెచ్చినట్టుగా చెబుతారు) వద్దకువెళ్లి, తన కుమారుల్ని తీసుకొచ్చేమార్గం చెప్పమని కోరింది. ఏలాముని విధవ అయిన నూకాలమ్మకు శక్తి స్వరూపం ఇచ్చి, హైదరాబాదు వెళ్లి వాళ్లని తీసుకొని రమ్మన్నాడు. ఆమె ఆవిధంగానే తీసుకొచ్చింది. తీసుకొచ్చిన నూకాలమ్మతో నీవు శక్తి స్వరూపిణిగా ఉండిపోతావా? మామూలు మనిషివవుతావా?' అని అడిగాడు. శక్తిస్వరూపిణిగా ఉండిపోతానన్నది. ఏలాముని రాజా కుమారులతో ఈమెకు గుడి కట్టించమన్నాడు. కోటలో ఈమెకు పాక కట్టించారు. అప్పటినుండి జోకావారు పుట్టింటివారుగా ఉంటూ ఈమె పూజాకార్యకలా పాలు నెరవేరుస్తున్నారు

ఇప్పటికి మూడు తరాల నాటివారైన, జోకా పద్మరాజుగారి కలలో కనిపించి, పిల్లలు

ఉచ్చులు పోస్తున్నారు. గుడికట్టించమని కోరింది. ఆవిధంగానే గుడికట్టించారు.[19]

ఈమె పుట్టుక గురించి మరొక కథకూడ ప్రచారంలో ఉన్నది. ఆంధ్రదేశంలో ఉన్న కిమ్మీరుసీమను కిమ్మీరుడను రాక్షసుడు పాలించేవాడు. అతని రాజ్యాన్ని హరించాలని, చంద్రవంశపు రాజయిన ధర్మకేతున్నపాలుడు ప్రయత్నించి, కిమ్మీరుని చేతిలో ఓడిపోయెను. అందువల్ల మణిద్వీపాధివాసియైన పరాశక్తిని గూర్చి తపస్సుచేసి, ఆమె అనుగ్రహంపొంది, నూకాంబయను ఆమె అంశను, అండగా తెచ్చుకొని, కిమ్మీరు రాక్షసరాజును జయించి, తన సామ్రాజ్యాన్ని స్థాపించెను. నూకాంబ యొక్క కోరికమేరకు, ఏలాముని సాధించి తెచ్చిన ఏలానది (ఏలేరు) పవిత్రతీరమైన కాంద్రకోట యందు స్థాపించబడెను.[20]

**మోదకొండమ్మ లేక బోడకొండమ్మ :** ఈమె ఈ జిల్లాలో దుర్గాడ, రాఘువపట్నం, అమిరేకుల, శరభవరం, పోతులూరు మొదలైన గ్రామాల్లో పూజింపబడుతున్నది. ఈమె విశాఖపట్టణం జిల్లాలో మోదకొండమ్మ అనే పేరుతో పూజింపబడుచున్నది. ఈ దేవత గురించి విశాఖజిల్లా మాడుగల ప్రాంతంలో ఒక కథ చెబుతారు.

కొన్ని వందల సంవత్సరాల క్రితం అడవి రాజ్యాలను పాలించే గిరి చక్రవర్తి ఊర్మిళాదేవి అనే దంపతులు సంతానం లేక బాధపడేవారు. వారికి శివపార్వతుల కటాక్షంవల్ల పార్వతీదేవి అంశలో ఒకరుగా 'మోదకొండమ్మ' ఇలమద్రి చెట్టుకింద ఉగ్గోళ్ళ పుట్టనుండి పుట్టింది. ఈమె పుట్టినవెంటనే రజిత, కాంస్య, నవరత్న, కస్తూరి మొదలైన వర్షాలు కురిశాయి. ఈమె సర్పాలను ఆభరణాలుగా ధరించి పుట్టింది. ఈవిధంగా దేవత సర్పాలను ఆభరణాలుగా ధరించడమనేది గ్రామదేవతల కథలలో కన్పిస్తుంది. ఈమె తర్వాత నూకాలమ్మ, పరదేశమ్మ, పైడితల్లమ్మ, మరిడమ్మ, ముత్యాలమ్మ, భూలోకమ్మ అనే చెల్లెళ్ళు పుట్టారు. ఈ మోదకొండమ్మకు కారడవుల్లో పురుషకంటపడని గుడిని తండ్రి నిర్మించాడు.

రాజ్యాన్ని పోగొట్టుకొని, అసురులు గిరిచక్రవర్తి వద్దకు చేరి, మాయోపాయంతో రాజ్యాన్ని కాజేయగా, గిరిచక్రవర్తి ఊర్మిళాదేవి అరణ్యాలు పట్టారు. అప్పుడు మోదకొండమ్మ అనుగ్రహంవల్ల 'కడియపులోవ' అనేచోట ఆ దంపతుల కన్నీరు పడి, ఒక రాయి బ్రద్దలయి, దాని నుండి పోతురాజు జన్మించి, అసురులను వధించుచుండగా, వారి రక్తం భూమిమీదపడి వేలకొద్దీ అసురులు పుడుతున్నారు. అప్పుడు ఆ అసురుల రక్తం క్రిందపడకుండా, మోదకొండమ్మ నాలికతో పీల్చి వేసి, ఆ దుష్టపాలకుల నుండి ప్రజలను రక్షించింది. ఈవిధంగా అసురుల రక్తం కిందపడకుండా దేవత పీల్చి వేయడం చాలా గ్రామదేవతల కథలలో కన్పిస్తుంది.

తన పూజలు చేస్తున్న ప్రజలపై అకృత్యాలు జరుపుతున్న ఓరుగల్లు చక్రవర్తిని తన తమ్ముని సహాయంతో మోదకొండమ్మ వధించింది. అప్పటి నుండి ఈ అమ్మవారి పూజలు ప్రారంభమయ్యాయి. ఈమెను బ్రాహ్మణులు ముత్యాలమ్మగా, వైశ్యులు కనకమహలక్షమ్మగా, గవర్లు సుభద్రగా ఆరాధిస్తూంటారు.[21]

**పోలమ్మ :** తూర్పు గోదావరిజిల్లాలో పోలేరమ్మ చాలా గ్రామాల్లో గ్రామదేవత. ఈమె

గురించి ఈజిల్లాలో కథలేమీ విన్పించడంలేదు. కాని విజయనగరం జిల్లా శంబర గ్రామంలో ఈమె శంబర పోలమాంబగా పూజింపబడుతోంది. ఈమె గురించి యీ ప్రాంతంలో ఒక కథ ప్రచారంలో ఉంది.

ఇచ్చటి అటవీ ప్రాంతంలో శంబరాసురుడు అనే రాక్షసుడు ఉండేవాడు. అతడు ప్రజలను తీవ్రహింసలకు గురిచేసేవాడు. వాడిని అంతమొందించటానికి, పార్వతీదేవి పోలమాంబై మాఘమాసంలో శంబరాసురుణ్ణి సంహరించింది. ఆనాటి నుండి 'పోలమాంబ' ను ఆరాధ్యదేవతగా ఈ ప్రాంతీయులు కొలుస్తున్నారు.[22]

నూకాలమ్మ, మోదకొండమ్మ, శంబర పోలమ్మ మొదలైన దేవతల కథలను బట్టి దైవాంశతో లేక దైవకటాక్షంతో ప్రత్యేక కార్యార్థియై పుట్టిన స్త్రీలుకూడ మహిమాన్వితులని భావించిన గ్రామీణులు, పూజిస్తున్నారనవచ్చును.

## వలసవచ్చిన దేవతలకు సంబంధించినవి :

కొన్ని గ్రామాల్లోని గ్రామదేవతల గురించి వారు వేరే గ్రామాల నుండి తమ గ్రామానికి వలస వచ్చారని కాని, లేక తమ గ్రామం నుంచి వేరే గ్రామానికి వలస వెళ్లారనికాని ఆయా గ్రామస్థులు చెబుతుంటారు. అదేవిధంగా ఒక గ్రామస్థుడు వేరే గ్రామం వలస వెళ్లినపుడు తమ గ్రామదేవతమీదఉండే భయభక్తులకొద్దీ, ఆమెను కూడ వలసతీసుకెళ్లి కొత్తగ్రామంలో నిలిపి, పూజించటం జరుగుతుంది. ఈవిధమైన గ్రామదేవతల వలసకు సంబంధించిన కథలను వివరిస్తాను.

**మామిళ్లమ్మ :** ఈమె మండపేట మండలం మారేడుబాక గ్రామదేవత. ఈ గ్రామంలో 'పుట్టా' అనే యింటి పేరుగల కమ్మవారున్నారు. వీరి పూర్వీకులు రేబాక గ్రామంలో ఉండేవారు. ఆ గ్రామంలో మామిళ్లమ్మ గ్రామదేవతగా ఉండేది. పుట్టావారు ఒక కుటుంబంవాగు మారేడు బాక వలసరాగా, వారితోపాటు మామిళ్ళమ్మ కూడ వలసవచ్చింది. ఈమెకు వీరే పుట్టింటివారు. ఈమెను పాతమామిళ్లమ్మ అంటారు. (ఈమె తర్వాతికాలంలో వెలిసింది కొత్తమామిళ్లమ్మ.)

**కొత్తమ్మ :** ఈమె కోట నందూరు మండలం తిమ్మరాజుపేటలో గ్రామదేవతగను, చిక్కవోలు మండలం బలభద్రపురంలో మనుష్యులకు, పశువులకు వచ్చే అంటువ్యాధులను పోగొట్టే దేవతగాను పూజింపబడుచున్నది. ఈమె నిలవటం గురించి తిమ్మరాజుపేటలో ఒక కథ ప్రచారంలో ఉన్నది.

ఈ గ్రామంలో యాదవ కులస్థులధికం. వీరు తమ గొర్రెలమందలను మేపుకోటానికి పొలాల్లోకి తోలుకెళ్ళేవారు. అమ్మవారు పెద్దపులివేషంలో గాండ్రుగాండ్రుమంటూ వచ్చేది. గొర్రెలకాపలాదారు ''ఏదోఒక గొర్రెను పట్టుకొని వెళ్లి పోవాలికాని, పదేపదే రావడమెందుకు అన్నాడు. 'నేను పులిని కాను దేవతను' అని చెప్పింది. ఆ తర్వాత ఆ గ్రామంలో ఒక వ్యక్తికి కలలో కనిపించి, తాను బ్రాహ్మణుల అమ్మాయినని, 'ఓలె ! ఓలె ! కొత్తమ్మా' అని పాటపాడుతూ కొలువమని చెప్పింది. అప్పటినుంచి ఈ అమ్మవారిని ఏడాదికొక్కసారి ఆవిధంగానే కొలుస్తున్నారు.

బారికవాడు అమ్మవారి సంబరం గురించి, డప్పువాయిస్తూ, పిలిస్తేపలికేది. ఈ అమ్మవారు ఇక్కడనుంచి ఆలవెల్లి వెంకట నగరం అనే ఊరు వలసవెళ్లారు. అక్కడకూడ ఈ అమ్మవారికి గుడికట్టి పూజిస్తున్నారు.[24]

**మర్లమ్మ :** ఈమె పిఠాపురం మండలం కుమారపురం గ్రామంలో వెలసిన దేవత.. ఈమె వలసరావటం గురించి ఒక కథ చెబుతారు. ఒక ముసలామె పేడఏరుకోవటానికెళ్లి, ఒక మర్రిచెట్టువద్ద పేడబుట్ట పెట్టుకొని కూర్చున్నది. ఆ మర్రి చెట్టునుంచి మాటలు విన్పించాయి. 'నీవు మా ఊరు వచ్చేస్తావా?' అని ముసలామె అడిగింది. 'నీవు వెనక్కి తిరిగిచూడకుండ ఎంతదూరం వెళితే, అంత దూరం నీవెనుక వచ్చేస్తాను' అని మర్రిచెట్టు చెప్పింది. ఆ ముసలావిడ వెనక్కి తిరిగి చూడకుండా తన గ్రామంవరకూ వచ్చి ఏమవుతుందోననే ఆత్రుతతో వెనక్కి తిరిగిచూసింది అంత ఆ చెట్టు అక్కడ ఆగిపోయింది. అప్పటినుంచి ఆ మర్రిచెట్టును మర్లమ్మదేవతగా పూజిస్తున్నారు. సంవత్సరానికొకసారి వరినాట్లు అయిన తర్వాత, బూర్లు వండుకొని, ఇళ్ల దగ్గర ఉపారాలు పెట్టుకొని, వాటిని తెచ్చి, మర్రిచెట్టు మొదట పోస్తారు.[25]

**నూకాలమ్మ :** ఈమె ఈ జిల్లాలోని చాలా గ్రామాల్లో గ్రామదేవత. ఈమె వలస రావడం గురించి రాజవొమ్మంగి గ్రామంలో ఒక కథ చెబుతారు. ఈమె పూర్వం 'కింద్ర' గ్రామంలో ఉండేది. అక్కడ వారు ఈమె సంబరాన్ని సవ్యంగా చేయించనందున వారిమీద కోపించి, ఇక్కడకు వచ్చి నిలిచిందని చెబుతారు.[26]

**నల్లమారెమ్మ :** ఈమె పిఠాపురం మండలం కుమారపురం గ్రామదేవత. ఈమె తూర్పు (విశాఖ, శ్రీకాకుళం జిల్లాలను గోదావరి జిల్లాలవారు 'తూర్పు' అంటారు) నుంచి వచ్చి యిక్కడ స్థిర పడిన వెలమకులస్థులతో వలస వచ్చిందని చెబుతారు. ఆమెను ఎక్కువగా ఈ గ్రామం నందలి వెలమకులస్థులే పూజిస్తారు. విశాఖజిల్లా, ముత్యాలమ్మపాలెం గ్రామంలో నల్లమారెమ్మ గుడి ఉన్నది.[27]

**మరిడమ్మ :** ఈమె ను 'మరిణమ్మ' అని కూడ పిలుస్తారు. ఈమె ఈ జిల్లాలో పెద్దాపురం, ఏలూరు, పిఠాపురం, చిన్నింపేట, జె. తిమ్మాపురం, మాధవపురం, రమణయ్యపేట గండేపల్లి, బిళ్లనందూరు, తానేలంక, సూరసానియానం, దొంతికుర్రు, అన్నవరం, తిరువూల మొదలైన గ్రామాల్లో పూజింపబడుచున్నది.

ఈమె పెద్దాపురం గ్రామదేవతగా ప్రసిద్ధి. ఈమె కొత్తపల్లి మండలం, అమరవిల్లి గ్రామంలో కూడ గ్రామదేవతే. ఈమె ఈ గ్రామంలో పులి (ఇంటిపేరు) వారి ఆడపడుచు. పూర్వకాలంలో పులివారి పూర్వీకులు పెద్దాపురం నుంచి ఇక్కడకు వలసరాగా అమ్మవారు కూడ వారితోపాటు వలసవచ్చిందని చెబుతారు.[28]

**ఏగులమ్మ :** ఈమె ఈ జిల్లాల్లో వెల్దుర్తి, ఇసుకపల్లి, దుర్గాడ, రాయవరం, జి..రాగం పేట, తాళ్లూరు, రాయవరం మన్యంవారిపాలెం, కాత్రావులపల్లి, గోండి, ప్రత్తిపాడు, గోకవరం, తిరుపతిరాజుపాలెం, ఉప్పలపూడి, ఏలూరు, అప్పన్నపాలెం, రమణయ్యపేట మొదలైన గ్రామాల్లో

పూజింపబడుచున్నది.

ఈమె ఈ జిల్లాలోని చాలా గ్రామాలతోపాటు పెద్దాపురం మండలంలోని వెల్దుర్తి, గ్రామంలో కూడ గ్రామదేవత. ఈ గ్రామస్థులు ఈమెను ఇక్కడ సవ్యంగా పూజించనందున ఇక్కడి నుండి రావికమతం (విశాఖజిల్లా) వెళ్లిపోయిందని చెబుతారు. అక్కడ కూడ ఏగులమ్మవారే గ్రామదేవత.

పై కథలనుబట్టి గ్రామదేవతలు ఆయా సందర్భాల్లో వలసరావడం, పోవడం జరుగుతుందని, ముఖ్యంగా దేవతలను భయభక్తులతో పూజించకపోతే, తమ ఊరి విడిచి వెళ్లిపోతాయని గ్రామీణులు భావించినట్లు చెప్పవచ్చును.

## త్రవ్వకాల్లో, ఇతరత్రా బయల్పడిన దేవతల (రాళ్ల) కు సంబంధించినవి:

గ్రామాల్లో చెరువులు, బావులు, తవ్వుతున్నప్పుడు, నదీతీరంలోను, చెట్లువద్ద ఏవైనా రాళ్లు కన్పించి, అవి స్త్రీ ప్రతిమ రూపంలో ఉంటే, వాటిని ఆయా దేవతలుగా భావించి, పూజించటం జరుగుతుంది. ఆయా సందర్భాలలో ఆయా దేవతలు ఆయా వ్యక్తులపై పూని, తమను పూజించమని కూడ చెబుతుంటారు. ఈ రకమైన కథలు కూడ ఈ జిల్లాలో కొన్ని విన్పిస్తున్నాయి. వాటిని వివరిసాను.

**నూకాలమ్మ :** ఈమె ఈ జిల్లాలోని చాలా గ్రామాల్లో గ్రామదేవత. పిఠాపురం పట్టణంలో కూడ ఈమె దేవతే. పిఠాపురంలో ఈమె గురించి ఒక కథ చెబుతారు. ఈమె 'దూడల' అనే యింటి పేరుగల కాపు కులస్థుల ఇంటిలో నుయ్యి తవ్వుతుండగా కొన్ని రాళ్ళ (స్త్రీ ప్రతిమలుగా ఉన్నవి) బయల్పడ్డాయి. తర్వాత నూకాలమ్మ ఆ ఇంటివారి మీద పూని, తాను నూకాలమ్మనని, గుడికట్టించి, పూజించమని కోరింది. అప్పటినుంచి ఈమెకు గుడికట్టించి, పూజిస్తున్నారు. ఇప్పటికీ ఈమెకు పుట్టింటివారు 'దూడల' వారే. ఈమె సంబరంలో వీరే ప్రముఖ పాత్ర వహిస్తారు.[29]

ఆలమూరు మండలం చింతలూరు గ్రామంలోకూడ ఈమె గ్రామదేవత. ఈమె నిలవటం గురించి ఈ గ్రామంలో ఒక కథ ప్రచారంలో ఉన్నది. సుమారు 300 సంవత్సరాల క్రితం గోదావరి నదికి వరదవచ్చి, మూలస్థానం అగ్రహారం అనే గ్రామం వద్ద గండిపడింది. ఆ నీటి ప్రవాహంలో ముంపునకు గురియైన గ్రామాలలో చింతలూరు ఒకటి. నీటి ప్రవాహంలో ఒక పాలచెట్టుకొట్టకొనివచ్చి, ప్రస్తుతం అమ్మవారి దేవాలయంనకు ఉత్తరం వైపున ఉండిపోయింది. ఆ పాలచెట్టు తొర్రలో నూకాలమ్మ వారి విగ్రహం ఉన్నది. ఆ విగ్రహం శ్రీ వైట్ల శేషయ్యగారి కలలో కనిపించి, దేవాలయం నిర్మించమని చెప్పింది. అప్పటినుంచి దేవాలయం నిర్మించి పూజిస్తున్నారు. అమ్మవారి మరో విగ్రహం మూలస్థానం అగ్రహారంలో గల 'తోరాటి' అనే యింటి పేరుగల కాపుకులస్థుల జొన్నలగాదెలో ఉండిపోయింది. అమ్మవారు వారికి ప్రత్యక్షమై, చింతలూరులో వెలసిన తనకు ఎనుబోతును బలివ్వమని చెప్పింది. అప్పటి నుంచి ఎనుబోతును బలిస్తున్నారు. ఈ మధ్యకాలంలో ఎనుబోతును బలివ్వక అమ్మవారి గుడి ఆవరణలోనికి తీసుకొచ్చి, వదలేస్తున్నారు.3

**పాదాలమ్మ :** ఈమె ఈ జిల్లాలో ఆలవెల్లి, విజయనగరం, బలరాంపురం, రమణయ్యపేట నరసింగపురం, వీరరాఘవపురం, మల్లవరం, రాయవరం, సూరంపాలెం, ఆనూరు, చిత్రాడ, ఏలూరు రాపర్తి, గండేపల్లి రామవరం, ప్రత్తిపాడు, గిడజాం మొదలైన గ్రామాల్లో పూజింపబడుచున్నది.

గొల్లప్రోలు మండలం విజయనగరం గ్రామంలో ఒకరి పొలంలో చెరువు తవ్వుచుండగా కొన్ని రాళ్ళు బయల్పడ్డాయి. వాటిలో ఒకటి పాదాల ముద్రతో ఉన్నది. వేరొకటి స్త్రీ ప్రతిమతో ఉన్నది. ఆ రెండింటిని పాదాలమ్మ దేవతగా భావించి పూజించెడివారు. తర్వాతికాలంలో అమ్మవారి విగ్రహం వేయించారు.[31]

**నంగాలమ్మ :** ఈమె జిల్లాలో పి. దొంతమూరు, నంగవరం, చిన్నజగ్గంపేట మొదలైన గ్రామాల్లో పూజింపబడుచున్నది. ఈమె పెద్దాపురం మండలం పి. దొంతమూరు గ్రామంలో ఉన్నది. గ్రామస్థులు చెరువు తవ్వుచుండగా బయల్పడిన రాళ్లను 'నంగాలమ్మ' దేవతగా భావించి పూజిస్తున్నారు. ఈమె ప్రతిమ బయల్పడిన చెరువును నంగాలమ్మ చెరువు అంటారు.

**రూపులమ్మ :** ఈమె ఈ జిల్లాలో ఏలేశ్వరం, సంపర అనూరు గ్రామాలలో గ్రామదేవత ఈమె నిలుచుట గురించి ఏలేశ్వరం గ్రామంలో ఒక కథచెబుతారు. ఏలేశ్వరం తూర్పుగోదావరి జిల్లా ఏజెన్సీ ప్రాంతానికి ముఖద్వారం వంటిది. ఏలేశ్వరానికి తూర్పు, ఉత్తరదిక్కులలో 10 కిలోమీటర్లనుంచి ఏజన్సీ ప్రాంతం ప్రారంభమవుతుంది. ఏజెన్సీ వాసులంతా ప్రతి లక్ష్మివారం ఏలేశ్వరంలో జరుగు సంతకు తమ ఉత్పత్తులను బళ్లమీద తెచ్చి, సంతలో అమ్ముకొని, కావలసిన వస్తువులను కొనుక్కొని వెళ్లి పోతారు. ఈవిధంగా ఒకసారి బండికి సమతూకంకోసం వేసిన రాయిని (అమ్మవారి విగ్రహం) ఏలేశ్వరంలో వదిలేశారు. ఆ రాయిని కొందరు వేపచెట్టు కింద ఉంచారు. అమ్మవారు తాను రూపులమ్మననీ, తనను గుడికట్టించి పూజించవలెనని ఆయా వ్యక్తులమీద పూని చెప్పింది. గ్రామ పెద్దలందరూ ఏలేశ్వరంలో సంతచావిళ్లవద్ద గుడికట్టి, అమ్మవారిని నిలిపారు. చైత్రబహుళ అమావాస్యకు ఈమె జాతర జరుగుతుంది.[32]

**గోగులమ్మ :** ఈమె ఈ జిల్లాలోని బి. కొత్తూరు, గోకివాడ, గోడిలంక, బోళ్లకుర్రు, బొడ్డవరం, దుగ్గుదురు, కాకరాపల్లి, పెదరాయవరం, బొర్రంపాలెం, రాజభూపాల పట్నం, కట్టమూరు, కొమరిపాలెం మొ.న గ్రామాల్లో పూజింపబడుతుంది. ఈమె నిలవటం గురించి గోకివాడ, కొత్తూరు గ్రామాల్లో ఒక కథ ఉన్నది. గోకివాడ, కొత్తూరు గ్రామాలు గోరికండి (ఏలేరు) తీర ప్రాంత గ్రామాలు. ఈ అమ్మవారికి పుట్టింటివారగు ఒంటిపల్లివారి తాలూకు ఒక వ్యక్తి గోకివాడ గ్రామం నుంచి కొత్తూరు గ్రామం వస్తుండగా, 'గోరికండి' ఏటిదగ్గర 'నేనూ వస్తాను. నన్నూ తీసుకెళ్లు అనే మాటలు విన్పించాయి. ఈమె బహుశా గోరికండిలోనున్న గోగులమ్మ అని తలంచి, ఒక రాయిని చేతితో తెచ్చి ఊరి చివరనున్న తుమ్మచెట్టు కింద ఉంచి, గోగులమ్మ దేవతగా పూజిస్తున్నారు.33

**కాకతమ్మ :** ఈమెను కాగితమ్మ, కాయితమ్మ అని కూడ అంటారు. ఈమె తొండంగి మండలం బెండపూడి గ్రామదేవత, కాకతీయులచే ఆరాధింపబడిన కాకతిదేవతయే ఈమె. చరిత్రలో పాత గ్రామాలు నశించి, కొత్త గ్రామాలు నెలకొనడం సహజమే. ఈ బెండపూడి గ్రామానికి సమీపంలో పూర్వం 'ఓరుగంటి పాలెం' అనే గ్రామముండేది. ఈ గ్రామాన్ని రాజధానిగా చేసుకొని, ఓరుగంటి రాజుల సామంత రాజగు రాఘవరాజు ఈ ప్రాంతాన్ని పరిపాలించేవాడు. ఈ కోటలో

కాకతిదేవత గుడిఉండేది.

ఈ కోట విజయనగర ప్రభువువైన గజపతులకు, పెద్దాపురం ప్రభువులైన జగపతులకు మధ్యలో ఉన్నది. ఈ జగపతి, గజపతి రాజుల ఉమ్మడి బంధువైన 'శ్రీదేవి' అనే సుందరాంగిని, రాఘవ రాజు మోహించి, చెరపట్టాడు. అప్పుడు జగపతులు, గజపతులు ఏకమై రాఘవరాజు పైదండెత్తి, కోటను కూల్చివేశారు. కోటలోని కాకతిదేవత గుడి కూడ శిథిలమయ్యింది. కాకతిదేవత విగ్రహం బెండపూడి గ్రామానికి సమీపంలో ఉన్న చెరువుగట్టున పడి ఉన్నది. ఈ గ్రామంలో 150 సంవత్సరాల క్రితం 'గోపుశెట్టి అయ్యప్ప' అనే వ్యక్తి మోతుబరిగా ఉండేవాడు. ఈతడు ప్రతీరోజు ఉదయాన్నే చెరువు గట్టున పడి ఉన్న రాయి (కాకతిదేవత విగ్రహం) మీద కూర్చుని ముఖంకడుక్కునేవాడు. ఒకనాటి రాత్రి అమ్మవారు అయ్యప్ప కలలో కనిపించి, తాను కాకతి రాజులచేత పూజింపబడిన కాకతిదేవతనని చెప్పి, తనపై నిలబడి, అతడు రోజూ స్నానం చేస్తున్న విషయం కూడ చెప్పింది. ఆ మరుసటిరోజు అతడు చెరువు దగ్గరకెళ్లి రాయిని తిరగేసి చూసి, అమ్మవారి విగ్రహమని గ్రహించి, ఆ గ్రామంలో నిలిపి, అప్పటినుంచి కాకతమ్మ దేవతగా పూజిస్తున్నారు.[34]

**మురుగులమ్మ** : ఈమె ఈ జిల్లాలోని తొత్తరమూడి, బండార్లంక గ్రామాల్లో పూజింపబడుచున్నది. ఈమె అయినవిల్లి మండలం తొత్తరమూడి గ్రామంలో నిలవటం గురించి ఒక కథ చెబుతారు. కరణంగారి బట్టలు చాకలిఉతుకుతున్నాడు. ఈమె ఆ బట్టలు రంగు మార్చేస్తున్నది. 'అదేమిటవమ్మా ! అలా చేస్తున్నావు' అని చాకలి అడిగితే, తాను మురుగులమ్మనని, చొప్పబండి రథంగాకట్టి, తీసుకెళ్లమని, తీసుకెళ్లేటపుడు చిటపటలాడినచోట చిన్నగుడి, పెటపెటలాడిన చోట పెద్దగుడి కట్టమని చెప్పింది. ఆ విధంగానే అమ్మవారి విగ్రహాన్ని తీసుకొస్తూ చిటపటలాడినచోట చిన్నగుడిని, పెటపెటలాడిన చోట పెద్దగుడిని కట్టారు. ఈమె తాను చెరువులోనుంచి రావటానికి, కుప్పాల నారాయణరావుగారు, వచ్చి చేయి వేస్తేనే వస్తానన్నది. ఆవిధంగానే కుప్పాలనారాయణరావుగారు చెయ్యివేసి, ఆమెను గ్రామంలోనికి తీసుకొచ్చారు. అప్పటినుంచి కుప్పాల నారాయణరావుగారే పుట్టింటివారుగా ఉంటున్నారు. ఈమె 'కోలేటి' వారు తనకు అత్తింటివారని చెప్పింది. ఇప్పటకీ వారే అత్తింటివారుగా ఉంటున్నారు. యిప్పటికీ 'కుప్పాలవారు' చెయ్యివేస్తే తప్ప అమ్మవారి గరగలు తియ్యరు. అమ్మవారికి చీర, రవిక, మొదలైన వానిని వీరే సమర్పిస్తారు.[35]

**తలుపులమ్మ** : ఈమె ఈజిల్లాలోని లోవకొత్తూరు, కొత్తూరు, రాజుపాలెం, దిగువదారపల్లి, ద్రాక్షారామం మొదలైన గ్రామాల్లో పూజింపబడుచున్నది. కాని తునికి సమీపంలోనున్న లోవ (యు) లో వెలసి, ప్రసిద్ధికెక్కింది. కావున ఈమెను లోవలో తలుపులమ్మ అంటారు.

ఈమె తలంపులమ్మ, ఎల్లప్పుడూ ప్రజల తలంపులలో మసలుతూ, ప్రజలకోర్కెలు, కష్టాలు తీర్చే తల్లి తలంపులమ్మ. ఈ పేరు కాలక్రమేణా తలుపులమ్మ అయ్యింది. తుని మండలంలో తునికి ఆరు కిలోమీటర్ల దూరంలో రెండు కొండల నడుమనున్న లోయలో ఈమె ఆలయం

ఉన్నది. ఈ ప్రాంతం తలుపులమ్మ లోయగా ప్రసిద్ధికెక్కి, కాలక్రమంలో తలుపులమ్మలోవగా మారింది. కొండల్లోంచి సహజంగా స్రవించే పెద్ద జలధార, చుట్టూ ఎత్తైన చెట్లతో ఈ ప్రాంతం అంతా ఒక ప్రశాంతతను సంతరించుకున్నది ఇక్కడి జలధారకు సంబంధించి ఒక గాథ ప్రచారంలో ఉన్నది.

తుని రాజులవద్ద పనిచేసే పశువులకాపరులు తమ పశువులను ఈ కొండప్రాంతానికి తోలుకెళ్లేవారు. ఒక రోజు ఒక తెల్ల ఆవు కొండమీదకి వెళ్లి దిగబడి పోయింది. ఆ ప్రదేశంలో ఆవు రక్తం చిందించింది. అనంతరం ఆవుతనంట తానే లేచి, తలుపులమ్మ వెలసినచోటుకెళ్లి, మాయమయ్యింది. ఆవురక్తంచిందిన చోటునుండి జలధార పుట్టుకొచ్చింది. ఎల్లప్పుడూ ప్రవహించే, ఈ ధారకు ఆద్యంతాలు కానరావు. ఈ ధారకొండపై నుండి క్రిందికి ఉరికే చోట యాత్రికులు ఉత్సాహంగా స్నానాలు చేస్తారు. ఈ నీరు సమస్త చర్మవ్యాధులనునయంచేస్తుందని ప్రతీతి.

చాలా (వందల) సంవత్సరాల క్రితం ఇచ్చట ఒక విగ్రహం దొరికింది. ఆ విగ్రహమే అమ్మవారు. ఈమె ఒక వ్యక్తిమీద పూని, తాను తలంపులమ్మనని, తనను పూజించమని కోరింది. అప్పటినుంచి ఈమెను పూజిస్తున్నారు.

ఈ అమ్మవారికి ఒక ప్రత్యేకత ఉన్నది. సాధారణంగా గ్రామదేవతలందరూ స్థానికులకే పరిమితమై, పరిమిత వ్యాప్తితో పూజింపబడతారు. కాని ఈ దేవత తూర్పుగోదావరి – విశాఖపట్టణం జిల్లాల సరిహద్దులో ఉండడంవల్ల, మద్రాసు, కలకత్తా జాతీయ రహదారికి పడమటి దిశలో మూడు కిలోమీటర్ల దూరంలో ఉండడం వల్ల ఈ రెండు జిల్లాల ప్రజలేకాక రాష్ట్రం నలుమూలలనుండి కూడ భక్తులు వచ్చి, ఈమెకు మొక్కులు చెల్లించుకుంటారు. ముఖ్యంగాకారు, లారీ, స్కూటరు వంటి వాహనాలను కొనుక్కున్నవారు వాహనాలతో ముందుగా ఈ అమ్మవారి సందర్శనానికి వచ్చిన తర్వాత తమ వాహనాన్ని వాడుకుంటారు. ప్రతి ఆదివారం ఈ అమ్మవారి గుడివద్ద జరిగే భక్తుల కోలాహలం చూసితీరవలసిందే కాని చెప్పనలవి కాదు. తమ వాహనాలలో బంధుమిత్రులతో, వంట సామాగ్రి, కోడి,మేక, గొర్రె వంటి జీవులతో అమ్మవారి దర్శనానికి వచ్చి, బలిసమర్పించి, ఆ మాంసంతో పిండివంటలతో సుష్టుగా ఆరగించి, చీకటి పడకుండానే, కొండదిగి వెళ్లిపోతారు. చీకటిపడే వరకూ కొండమీద ఉండరాదనీ, ఉంటే అనర్థాలు జరుగుతాయని భక్తుల నమ్మకం.36

**లోవా కొత్తూరులో కనరాని కొండపై లోయ లోన నిలిశినావు తలుపులమ్మా !**
**నీ మహిమలు కానలేము నిజమేనమ్మా**
**టాటర్లూ మోటర్లు తరుసుగానే నడిపావు యాత్తరలూ ఎన్నెన్నో ఎచ్చుగానే నడిపావు.37**

అనే పాట తలుపులమ్మ దేవతయొక్క విశిష్ఠతను తెలుపుతున్నది.

**గుండాలమ్మ :** ఈమె ఈ జిల్లాలో మల్లేపల్లి, ఉండూరు గ్రామాల్లో పూజింపబడుతున్నది. గండేపల్లి మండలం మల్లేపల్లి గ్రామంలో ఈమె గురించి ఒక కథ చెబుతారు. ఈ ఊరు పుట్టటానికి ముందు దాని సమీపంలో వేరొక గ్రామం ఉండేది. ఆ గ్రామంలోని పురుషులు చెరువులో చేపలు

పట్టడానికి వెళ్లి, చేపల కోసం తగవుపడి, కొట్టుకొని చని పోయారు. పురుషులందరూ చని పోయాక తాము మాత్రంఎందుకని స్త్రీలు గుండం తీసుకొని అందు లోపడి మరణించారు. గ్రామం లేనపుడు గ్రామదేవత మాత్రమెందుకని, ఆ చెరువుకు దగ్గరలోనే ఉన్న గ్రామదేవత విగ్రహాన్ని కూడ విరగ్గొట్టి, ఆ చెరువులో పడవేశారు. కొంతకాలానికి పక్కనే 'మల్లేపల్లి' అనే యీ గ్రామం వెలసాక, గుండంలో పడిన దేవత (విగ్రహం) ఒక కాపుకులస్థునిపై పూని, తాను గుండాలమ్మనని, గుడికట్టించి, పూజించమని చెప్పింది. అప్పటి నుంచి ఆమెను ఆ గ్రామస్థులు గుండాలమ్మగా పూజిస్తున్నారు.[38]

**పల్లాలమ్మ :** ఈమె ఈ జిల్లాలోని వానపల్లి, ఇసుకపల్లి, దివిలి, మొగలికుదురు, చింతలపల్లి, అంతర్వేదిపాలెం, కాపవరం, కడియం మొదలైన గ్రామాల్లో పూజింపబడుచున్నది. ముఖ్యంగా వానపల్లి గ్రామంలో వెలసి, ప్రసిద్ధికెక్కి కోనసీమ ప్రాంతప్రజలందరిచేత పూజింపబడుచున్నది. వానపల్లి గ్రామంలో ఈమె నిలవటం గురించి ఒక కథ చెబుతారు.

వానపల్లి గ్రామంలో వేంచేసి ఉన్న పల్లాలమ్మ ఒకనాడు ఒక చాకలికి కలలో కనపడి ' మీబట్టలు ఉతికే బల్ల కింద నేనే ( రాయి రూపంలో) బరువు మోస్తున్నాను. మీ గ్రామస్థులంతా కలిసి ఏడు మూరలు కల్గిన అరిటాకు తెచ్చి మధ్యనన్ను ఉంచాలి' అని కోరింది. ఆమె చెప్పినట్లే చేసి, తీసుకొస్తుండగా, అరిటాకు చిరిగినందువల్ల, ఆమెను క్రిందకుదింపగా శిలారూపం దాల్చింది. గ్రామస్థులు అక్కడే గుడి నిర్మించి పూజిస్తున్నారు అని చెబుతారు.39

**సింగరమ్మ :** ఈమె ఈ జిల్లాలోని మల్లిసాల, రాఘవపట్నం, అమిరేకుల మొదలైన గ్రామాల్లో పూజింపబడుతున్నప్పటికీ జగ్గంపేట మండలం మల్లిసాల గ్రామసమీపాన, కాకినాడ గోకవరం జిల్లారహదారి పక్కన వెలసి ప్రసిద్ధికెక్కింది. చాలా సంవత్సరాల క్రితం ఈమె రహదారి మీద ఎవ్వరూ నడవని సమయంలో బాలగా తిరిగేది. ఆ గ్రామస్థులకు కలలో కనిపించి, తాను సింగరమ్మనని, తనను పూజించమని అడిగింది. అప్పటినుంచి, ఆ రోడ్డు పక్కన గల చింతచెట్టు మొదట ఉన్నరాళ్లను 'సింగరమ్మ'గా భావించి పూజిస్తున్నారు. రహదారి ప్రక్కనున్నందున పాదచారులు అమ్మవారి డిబ్బీలో వేసేడబ్బులతో చెట్టునరికించి గుడికట్టిస్తామన్నారు. చెట్టు ఉండగానే గుడి కట్టించమన్నది.40

**కోట్లమ్మ :** ఈమె ఈ జిల్లాలోని మామిడాడ, సామర్లకోట, అనంతవరం, దంగేరు మొదలైన గ్రామాల్లో పూజింపబడుతున్నది. మామిడాడ గ్రామంలో ఈ అమ్మవారి గురించి ఒక కథ ప్రచారంలో ఉన్నది. ఈ అమ్మవారి మెడ యందలి నగలను దొంగిలించదలచి, దొంగలు ఈమె మెడను నరికిపట్టుకెళ్లిపోయారు. ఆ మెడను సామర్లకోటలో వదలివేయగా, అక్కడివారు కూడ ఈమెను గుడికట్టి పూజిస్తున్నారు. నేను సామర్లకోటలో కోట్లమ్మ గుడికి వెళ్లాను. గుడిలో అమ్మవారి విగ్రహమున్నది 'నందితల' లేదు.[41]

ఇలాంటికథలెన్నో గ్రామీణులలో ప్రచారంలో ఉన్నాయి. ఇది నిజంకాదని మనమునుకున్నా వాళ్లు నమ్మరు. గ్రామీణుల జీవితమే గ్రామదేవత. గ్రామదేవతే గ్రామిణుల జీవితం అన్నట్లు వారి ప్రవర్తన, మాటలు ఉంటాయి.

**మహిమలను తెలిపేవి :** గ్రామదేవతల గురించి గ్రామీణులు చెప్పుకొనే రకరకాల కథలలో దేవతల మహిమలను తెలిపేవి కూడ ఉన్నాయి. అట్టి కథలను వివరిస్తాను.

**మా రెమ్మ :** ఈమె పుట్టుకను తెలిజేయు కథలో మహిమలను కూడ వివరించియున్నాను. తనను చెరపట్టబోయిన నెల్లూరు, సాలూరు దుమారుపట్నం వాసుల్ని ఆమె తన మహిమవల్ల నాశనం చేసింది. తన మహిమ వల్లే బ్రహ్మకు కళ్లపోగొట్టి తిరిగి రప్పించింది.

**నేరేళ్లమ్మ :** నేరేళ్లమ్మ కథలో ఆమె నమస్కరించనందుకు కాలి చెప్పువిసిరిన మున్సబుకు తన మహిమ చూపి, తనను తెలుసుకొనేటట్లు చేసి, తనకు గుడి కట్టించి, పూజించేటట్లు చేసింది. నానాబాధలు పెట్టిన అత్తను తాను దేవత అయిన తర్వాత తన కాలికింద నొక్కి పెట్టి చంపింది. తనను అభిమానించిన మేనమామమలకు సంపదనిచ్చింది.

**బంగారు పాప :** ఈమె తన మహిమచూపి, గాలివాన వచ్చేటట్లు చేసి, వజీర్‌ఖాన్ మిత్ర, పుత్ర, కళాత్రాదులతో సహా నశించేటట్లు చేసింది. అంతటి ప్రళయంలో కూడ తనను తన భర్తతో కలిపినవార్కి ఎట్టి అపాయము కలుగకుండా చేసింది.

ఈమె మహిమగురించి కూడ హిందువులు ఒక కథ చెబుతారు. హిందువులు తమ వివాహాది వేడుకల సందర్భంలో ఈమె దగ్గరకు వెళ్లి అడిగితే బంగారు నగలు ఇచ్చేది. వాటిని తీసుకెళ్లి, తమ వేడుకలు ముగిశాక, తిరిగి ఇచ్చేసేవారు. ఒకసారి ఒక స్త్రీ ఈవిధంగా తీసుకెళ్లిన నగలు తిరిగి ఇవ్వలేదు. అప్పటి నుంచి ఎవరైనా నగలు అడిగినా అమ్మవారు ఇవ్వటంలేదు.42

**గొంపమ్మ :** గొంపమ్మ కథలో గొంపమ్మ కొండపై, ఇతర దేవతలందరికీ విందు చేస్తున్న సందర్భంలో చెంబుకోసం వెళ్లిన బారికను తన విందు గురించి ఎవరికీ చెప్పవద్దనడం, ఆవిధంగా చెప్పిన ఆతడు తల పగిలి మరణిచడం జరిగింది. ఈవిధంగా జరగడం అమ్మవారి మహిమకు నిదర్శనమని గ్రామీణుల నమ్మకం.

**దుర్గమ్మ :** దుర్గమ్మకథలో దుర్గమ్మ తల్లిదండ్రుల మాటవినని (పెళ్లిని నిరాకరించిన) తమ్ముడు వెంకన్నను తన మహిమద్వారా పెళ్లికి ఒప్పించి, పెళ్లి జరిపిస్తుంది.

**పసుపులమ్మ :** ఈమె మహిమల గురించి రకరకాల కథలు ప్రచారంలో ఉన్నాయి. పసుపులమ్మ అప్పుడప్పుడు తోలేటివారి కుటుంబంలో ముసలమ్మ వలె తిరిగేది. ఈమెను చూసి ఊరుకునేవారు. పలకరించేవారు కాదు. తోలేటి వెంకన్నగారు పొలంలోలేని సమయంలో చెరుకుగానుగు వద్దకు వచ్చి, అచ్చట ఉన్న పాలేరును చెరకు రసం అడిగేది. కొద్దిగా ఇస్తే తీసుకోనేదికాదు. కడివెడు రసం అడిగేది. ఇస్తే తాగేసేది. బెల్లం అడిగేది బెల్లం అచ్చులరూపంలో ఉంది పెనంమీద నుంచి దించలేదు. అంటే తనను పొరుగూరి వరకు దిగబెట్టమని, దిగబెట్టడానికి వెళ్లిన వ్యక్తిని ఖంగు తినిపించి, మధ్య దారిలో మాయమయ్యేది. అంత ఆ వ్యక్తి ఆమె ఎవ్వరో కాదు పసుపులమ్మే కాకుంటే కడివెడురసం ఎలాగ తాగేది? అని గ్రహించి, ఆమెకు నమస్కరించు కొనేవాడు.

ఓలేటివారి కుటుంబంలో మూడవ తరం వ్యక్తి (పేరు – బులిరాజు) కి 85 సంవత్సరముల

వయస్సుంటుంది. ఆయన ఈ మధ్య మేజర్ ఆపరేషన్ చేయించుకున్నారు. ఆ సమయంలో ఆయన మూడురోజులు మత్తులో ఉండిపోయారు. ఆ సమయంలో పసుపులమ్మ అతని తలవద్ద కూర్చుని బాబూ ఏడవకురా ! భయంలేదు. అని సముదాయించేది. ఆ మాటలకు అతనికి ధైర్యం వచ్చి కుటుంబసభ్యులను కూడ దగ్గరుండనిచ్చే వారు కాదు.

వీరు ఉదయం లేచేటపుడు పసుపులమ్మను స్మరించుకుంటూ లేస్తారు. వీరు చెరకుగానుగ ఆడేటపుడు, గానుగ ఆడడం ముగిసాక, సామాను ఎత్తిపెట్టేటపుడు పసుపులమ్మకు కోడినికోసి, నైవేద్యం చెల్లించేవారు. ఒకసారి ఈ విషయం మరచి సామాను సర్దుతుంటే ఎన్నో అవరోధాలు ఎదురయ్యాయి. పసుపులమ్మకు కోడిని కోయనందువల్లే, ఈ అవరోధాలన్నీ ఎదురవుతున్నాయని గ్రహించి, కోడిని కోసాక పనులు ఆటంకం లేకుండ సాగిపోయాయి. దేవతలకు చెల్లించాల్సిన బలులు, మొక్కులు చెల్లించకపోతే, తమను బాధపెడతాయనే జానపదుల విశ్వాసం ఇచ్చట వ్యక్తమగుచున్నది.

ఇప్పటికీ పసుపులమ్మ బులిరాజుగార్కి కలలో కనిపిస్తుంది. పూర్వం వీరి తండ్రిగారి హయాంలో ''పసుపులమ్మా !'' అనిపిలిస్తే ఒక రకమైన శబ్దం వచ్చేది. వారానికొకసారికాని, అప్పుడప్పుడు కాని వారి యింటిలో గుగ్గిలం వాసనవస్తుంది. ఆవిధంగావాసన రావటాన్ని, పసుపులమ్మనైవేద్యం పెట్టమంటున్నదన్నట్లుగా భావించి, అన్నం, పెరుగు, ఉల్లిపాయ, అరటిపండ్లు మొదలైనవాటిని ఇంటిలో చల్లరాట (చల్లచేసేటపుడు కవ్వానికి ఆధారంకోసం పాతినరాట) దగ్గర పెడతారు. గుగ్గిలం పొగవేసి, ఈనైవేద్యం అమ్మవారి గుడికి పంపిస్తారు. ఈవిధంగా జరిగాక రేపు పసుపులమ్మకు నైవేద్యాలు తీయాలి అని గ్రామమంతా దండోరావేయిస్తారు. గ్రామస్థులంతా చల్లన్నం, మజ్జిగగుడికి పట్టుకెళతారు. కోమట్లు, బ్రాహ్మణులు సలిమిడి, వడపప్పు తీసుకెళతారు.

ఒక ముత్తైదువ అమ్మవారి గుడి ముందు నుంచి వెళుతూ, అమ్మవారిని స్మరించుకుంటూ, డబ్బులుంటే గాజులైనా వేయించుకొందును అంటూ వెళ్లి పోయింది. కొంత దూరం వెళ్లాక ఆమెకు 5 రూపాయలు దొరికాయి. ఇది అమ్మవారి మహిమగా చెబుతారు.

ఒక రోజు సి.హెచ్. సత్యన్నారాయణ అనే వ్యక్తికి పసుపులమ్మ, పోతురాజు కలలో కనిపించారు. కలలో సత్యన్నారాయణ అమ్మవారి గుడివద్దకు వెళ్లాడు. గుడి బయట ఉన్న పోతురాజు సత్యన్నారాయణతో 'అమ్మవారు లోపల ఉన్నారు వెళ్లు' అన్నాడు. సత్యన్నారాయణ లోపలికెళ్లాక, తెల్లచీర కట్టుకుని, చాల ఎత్తు గానూ, అందంగానూ ఉన్న అమ్మవారు 'నీకేమి మంత్రాలు వచ్చు' అని అడిగింది. ఆంజనేయ మంత్రం వచ్చునని, ఈతడు చదువుతున్నాడు. అంత అమ్మవారు అదృశ్యమైపోయారు.

సాధారణంగా గుడిలోని దేవత ఒక కాలుమడచి, ఒక కాలు కిందకి వాల్చి పీటమ్మీద కూర్చున్నట్లుంటుంది. వాల్చిన కాలి కింద ఒక వ్యక్తి ఉంటాడు. ఆ విధంగా పసుపులమ్మ కాలికింద ఉన్న వ్యక్తి గురించి ఒక కథ ఉన్నది. ఈ అమ్మవారి గుడి స్మశానానికి దగ్గరలో ఉన్నది ఈ స్మశానంలో పాతిపెట్టిన శవాల్ని ఒక రాక్షసుడు తినేవాడు. అమ్మవారు ఆ రాక్షసునితో 'నీవు ఇక్కడ ఉండ కూడదు. నేనే దేవతను, నీవు రాక్షసుడవు' అన్నది. అంత రాక్షసుడు నీలాంటి

వారిని ఎంతోమందిని నేను తిన్నాను. కావాలంటే నా మెడలోనున్న తలకాయలు చూడు అని తలకాయలు చూపించి, అమ్మవారిని చంపటానికి, ఆమె దగ్గర కత్తితీసుకోవటానికి ప్రయత్నిస్తుండగా, అమ్మవారు విజృంభించి, అతనిని తనకాలికింద తొక్కి పెట్టింది.[43] ఈ కథను గ్రామస్థులను గ్రామదేవత దుష్టశక్తుల నుండి కాపాడుతుందనే జానపదుని విశ్వాసానికి ప్రతీకగా చెప్పవచ్చును.

**ఆరులమ్మ :** గంగవరం మండలం రాజవరం గ్రామంలో ఉన్న గ్రామదేవత ఆరులమ్మ కాలికింద ఒక వ్యక్తి తొక్కబడి ఉన్నాడు. ఈ వ్యక్తి గురించి కూడ ఒక కథ చెబుతారు. 'ఒక దొంగ దొంగతనానికి రాగా, అమ్మవారు వాణ్ణి తనకాలికింద తొక్కి చంపేసింది'[44]. అమ్మవారి గుడిలో కాని, వేరొక చోటకాని దొంగతనం మొదలైన అఘాయిత్యాలు చేసేవారిని, అమ్మవారు చంపేస్తారని భయపెట్టి, అలాంటి వ్యక్తులు, అలాంటి పనులు చేయకుండా నిరోధించటానికే, అమ్మవారి కాలి కింద దొంగను తొక్కి చంపినట్లుగా రూపకల్పన చేశారనవచ్చును.

**గడి బాపనమ్మ :** ఈమె మహిమలు గురించి కూడ కొన్ని కథలు వినిపిస్తున్నాయి. ఈమె దగ్గరకు ఎవరైనా కాలిచెప్పులు తియ్యకుండా వెలితే, ముఖం తిరిగినట్లు అయ్యేది. మొక్కులు మొక్కిన వాళ్ళ తీర్చకపోతే, వాళ్లకు మైకం వలె కనిపించేది.

రాజమండ్రి నుంచి గోకవరం మీదుగా రంపచోడవరం, భద్రాచలం వెళ్లే మార్గంలో ఈమె గుడి ఉంది. లారీ, బస్సుల డ్రయివర్లు వచ్చేటప్పుడు, వెళ్లేటపుడు అమ్మవారికి కొబ్బరికాయలు కొడతారు. ఒక డ్రయివరు అమ్మవారికి కొబ్బరికాయ కొడతానని కొట్టలేదు. కొంతదూరం వెళ్లాక లారీకి మరమ్మతువచ్చి, అయిదు రోజులపాటు ఆగిపోయింది. అమ్మవారికి మేకపోతును వేస్తామని మొక్కుకుంటే బాగయ్యింది.

ఇది మన్యం ప్రాంతం కావటం వల్ల, రోడ్లు ఎత్తుపల్లాలతో ఉంటాయి. ఒకసారి పల్లంలో ప్రయాణిస్తున్న లారీకి బ్రేకులు పనిచేయలేదు. డ్రయివరు అమ్మవార్ని స్మరించుకుంటే, ఆమె మహిమవల్ల ప్రమాదం జరగలేదు. డ్రయివరు భక్తితో అయిదు కొబ్బరికాయలు కొట్టాడు.[45]

**నూకాలమ్మ :** ఈమె మహిమలు గురించి కూడ కాండ్రకోట గ్రామంలో కొన్ని కథలు వినిపిస్తున్నాయి. పూర్వం రోజుల్లో ఈ అమ్మవారు మనుష్యరూపంలో వచ్చి, పిల్లలతో ఆడుకునేది. తిరిగి వెళ్లిపోయేటపుడు ఒక పిల్లవాణ్ణి కొట్టి వెళ్లిపోయేది. ఈవిధంగా కొట్టబడిన పిల్లవానికి జ్వరం వచ్చేది. మరుసటిరోజు అమ్మవారు పిల్లలతో ఆడుకోవటానికి వచ్చి, ముందురోజు కొట్టిన పిల్లవాని గురించి అడిగి తెలిసికొని, జ్వరంతో ఉన్న పిల్లవాని వద్దకు వెళ్లి కూర్చుని మాట్లాడేది. అంత ఆ పిల్లవానికి జ్వరం తగ్గి, లేచి కూర్చుని మాట్లాడేవాడు. ఈ కథను అమ్మవారు జబ్బులు కలిగించడం, తగ్గించడం కూడ చేయగలదనే జానపదుల నమ్మకాలకు నిదర్శనంగా చెప్పవచ్చును.

ఒక వ్యక్తి అమ్మవారి గుడికి దొంగతనానికి వచ్చి, సామానులు దొంగిలించటానికి ఉపక్రమించే సమయంలో విరేచనాలు, వాంతులు అయి, అయిదురోజులు తర్వాత మరణించాడు. దొంగతనం చేసేవారిని అమ్మవారు చంపేస్తారని, అలాంటి పనులు చేసేవారిని నిరోధించడానికి జానపదుని కల్పనగా ఈ కథను చెప్పవచ్చును.

ఒకరోజు రాత్రి అమ్మవారు గుడికెదురుగా ఉన్న అరుగుమీద కూర్చొని ఉన్నది. కాగడా పట్టుకొని వస్తున్న చాకలి అమ్మవార్ని చూసి, 15 రోజులపాటు జ్వరం పెట్టుకున్నాడు. గ్రామదేవత రాత్రులందు గ్రామాల్లో సంచరిస్తుందనే జానపదుల నమ్మకానికి ఈ కథను నిదర్శనంగా చెప్పవచ్చును.

గ్రామదేవత మహిమవల్ల కోర్టుతీర్పులు కూడ తారుమారు అవుతాయనే జానపదుల నమ్మకానికి నిదర్శనంగా ఒక కథ ప్రచారంలో ఉన్నది.

కాంద్రకోట గ్రామానికి 'మర్లావ' పొరుగు ఊరు అమ్మవారు జాతరకు అక్కడ నుంచి గరగలు కూడ వస్తాయి. ఒకసారి అమ్మవారి జాతరలో తగాదా వచ్చింది. ఆ తగాదాలో 'మర్లావకు చెందిన వ్యక్తి మరణించాడు. ఆ గ్రామస్థులు కోర్టులో కేసుపెట్టారు. కాంద్రకోట గ్రామస్థుల తరపున జోకా పద్మరాజుగారు మద్రాసులో ప్లీడరును పెట్టి వాదిస్తున్నారు. కోర్టు తీర్పు సమయంలో ఈ గ్రామానికి చెందిన చాలామంది వ్యక్తులు కోర్టులో ప్రవేశించి ప్లీడరుగారి సలహా ననుసరించి, తప్పట్లు కొట్టారు. ఈవిధంగా తప్పట్లు కొట్టినందుకు ప్రజల్ని జడ్జిగారు కోప్పడ్డారు. అప్పుడు ప్లీడరుగారు తప్పట్లు కొట్టినవారెవరో చెప్పమని జడ్జిగార్ని అడిగారు. జడ్జిగారు చెప్పలేకపోయారు. ఇక్కడ ఉన్నవారికి అనేకరెట్లు ప్రజలు జాతరకు వస్తారు. వారిలో ఎవరివల్ల అతడు మరణించినదీ ఎవరు నిర్ణయింపగలరు?' అని వాదించేసరికి జడ్జిగారు కేసుకొట్టేశారు. అమ్మవారు మహిమవల్ల ప్లీడరుకు ఆవిధంగా తోచి, తప్పట్లు కొట్టించి, కేసుగెలిచాడు.[46]

**నేరేళ్లమ్మ :** ఈమె ఈ జిల్లాలోని చాలా గ్రామాలతోపాటు కొత్తపల్లి మండలం కొమరగిరిగ్రామంలో కూడ గ్రామదేవతే. ఈమె మహిమవల్ల కూడ కోర్టుకేసు గెలిచినట్టుగా ఒక కథ చెబుతారు. కొమరగిరి గ్రామదేవత నేరేళ్లమ్మకు ప్రతీసంవత్సరమూ జాతరలో దున్నపోతును బలివేసేడివారు. ఈ బలి నిమిత్తం ఒక సంప్రదాయముంది. దేవత పూజారి పసుపు, కుంకుమ డప్పులతోవెళ్లి, ఎదురు పడిన పోతుకు (అది ఎవరిదైనాసరే) పసుపు కుంకుమ బొట్టు పెడతాడు. అంత ఆపోతువారివెనుకే గుడికి వచ్చేస్తుంది. దానిని అమ్మవారికి బలియిస్తారు. ఒక సంవత్సరం ఈవిధంగా జరగ్గా పోతు యజమాని, సంబరం చేయించిన వ్యక్తులపై కేసుపెట్టాడు. ఆ కేసులో కూడ అమ్మవారి మహిమవల్ల సంబరం చేయించిన వాళ్లే నెగ్గారని చెబుతారు.[47]

**మరిడమ్మ :** తూర్పుగోదావరి జిల్లాలో ప్రఖ్యాతి చెందిన గ్రామదేవతలలో ఈమె ఒకరు. పెద్దాపురంలోనే కాక ఇంకా చాలా గ్రామాలలో ఈమె గ్రామదేవత. ఈమె పుట్టుకకు సంబంధించిన కథలేమీ లభించకపోయినా, ఈమె మహిమలను తెలియచేయుకథలు కొన్ని ప్రచారంలో ఉన్నాయి.

సుమారు 300 సంవత్సరాల క్రితం మన్యంరాజు అయిన శ్రీ భూసుర మహారాజుగార్కి, మరిడమ్మ ప్రత్యక్షమై తనకు నరబలి యిచ్చినచో కోరిన కోర్కెలు సిద్ధింపచేస్తానన్నది. ఆ మన్యంరాజు నరబలి యిస్తూండేవాడు. కోరికలన్నీ సిద్ధించి సుఖంగా ఉండేవాడు. నరబలి ఇవ్వటం నేరమవ్వటంవల్ల, బ్రిటిషువారు ఆ రాజును బంధించేవారు. అమ్మవారు తన మహిమతో రాజును విడిపించేది. అందుకు బ్రిటిషువారు రాజును మరింత బాధ పెట్టేవారు. ఆ రాజు అమ్మవారి పూజాపునస్కారములు మాని, అమ్మవార్ని ఏదోవిధంగా తన నుండి వదిలించుకొనే ఏర్పాట్లుచేసుకొని, ఈ విషయం అమ్మవారికి నివేదించగా, కరుణతో అమ్మవారు ఆ రాజును వదలేసి, సామర్లకోటలో

ఉన్న 'చింతపల్లి' వారి యింట ప్రవేశించి అప్పటి నుంచి, క్రూరత్వం మానేసింది.

ఎవ్వరూ పరిసర ప్రాంతాలలో లేనపుడు వారి చంటి పిల్లలను ఉయ్యాల ఊపటం, వాకిలి తుడిచి శుభ్రం చెయ్యటం మొదలైన పనులు చేసేది. ఒక రోజు చింతపల్లి వారి ఇంటి నౌకరు అయిన గొల్లవ్యక్తిమీద పూనింది. ఈ పరిస్థితులన్నీ చూస్తున్న ఆ యింటివారు, ఇదంతా భూతబాధ అని ఎంచి, ఆ గొల్లవానిని హింసించగా తన నిదర్శనం చూపుటకుగాను, ఆ యింటివారబ్బాయి పొలంలో బెల్లంపెనంలో పడి ఉన్నాడు. వెళ్లిచూడమని గొల్లవాని చేత ఆ యింటివారికి తెలియచేసింది. వాళ్ళు పొలంలోని కెళ్లి చూడగా, ఆ పిల్లవాడు ఆవిధంగా పడియున్నాడు.

చింతపల్లివారు తమ కుమారుడు ఇక బ్రతకడని తలచి, అమ్మవారినే శరణు వేడిరి. పెద్దాపురంలో కోటవద్ద ఉన్న వేపచెట్టు మొదట ఉన్నపుట్టలోని పసుపును తీసుకొచ్చి, బాలుని శరీరంపై వ్రాస్తే, బ్రతుకుతాడని చెప్పింది. వారు అట్లే చేసారు. ఆ బాలుడు బ్రతికాడు. అప్పటి నుంచి ఆ యింటివారు అమ్మవారిని భక్తితో పూజిస్తున్నారు. పెద్దాపురం లో ఇప్పుడున్న ప్రదేశంలోనే గుడికట్టమని చెప్పగా, గుడికట్టి, అప్పటినుంచి అర్చనాది కార్యక్రమాలు నిర్వర్తిస్తున్నారు. ఆనాటి నుంచి ఈ అమ్మవారు చింతపల్లివారి ఆడపడుచుగా భావింపబడుచున్నది. ఆషాడమాసంలో జరుగు ఆ అమ్మవారి తీర్థానికి, ఈ జిల్లానుంచి, పొరుగు జిల్లాలనుంచి కూడ వేలాది మంది భక్తులువచ్చి, అమ్మవారి దర్శనంచేసుకుంటారు.[42]

**మరిడమ్మ మహిమను తెలిపే పల్లెవానికథ :** ఈకథ పిఠాపురం పట్టణంలో లభించింది. పిఠాపురంలో మార్కెట్టువద్దనే మరిడమ్మగుడి ఉన్నది. మరిడమ్మ పండుగరోజు ఒక పల్లెవాడు (చేపలు పట్టుకొని, అమ్ముకొనేవాడు) గుడిలో ఉన్నపూజారిణి వద్దకు వెళ్లి, అమాయకంగా ''మరిడమ్మతల్లి ఎక్కడుంటాది''? అని అడిగాడు. వాడి అమాయకత్వాన్ని ఆసరాగా తీసుకొని 'మరిడమ్మతల్లి ఉప్పాడ సముద్రంలో ఉంటాదివెళ్లరా!'' అని ఇసురుగా ఆ పూజారిణి అంటుంది. అంత ఆపల్లెవాడు బేడబియ్యం, పెసరపప్పు, మొదలైనివి భార్యకిచ్చి, 'అన్నం వండితే, మరిడమ్మ తల్లి మన యింటికి వచ్చి తింటుంది. నేను అమ్మోరుని తీసుకొస్తాను' అని బయలుదేరి వెళ్లాడు. కాలినడకన ఉప్పాడ వెళ్లి, సముద్రం లోనికి వెళ్లి పోతున్నాడు. క్రమంగా ఈతని కాళ్లు, చేతులు, తల మునిగిపోతున్నా, సరే అమ్మవారి మీద ఉండే భక్తికొద్దీ 'అమ్మోరు ! అమ్మోరు, అని పిలుచుకొంటూ వెళ్లిపోతున్నాడు. తాను కనిపించకపోతే చచ్చిపోతాడని, మరిడమ్మ సముద్రంలో ప్రత్యక్షమై 'ఏమిరా! బాబూ! ఎక్కడికిరా!' అంటుంది. 'నీకోసమే, ఈవేళ పండుగకదా! మా యింటికి భోజనానికి వస్తావని' అంటాడు. తనకూడా రమ్మంటాడు. 'వస్తానుపద' అని వాడికంటె ముందే వాడింటికొచ్చి, వడ్డించింది తింటుంది. 'అమ్మా! మేము లేనివాళ్లం. ఏదో పెట్టాం తిను' ఫలానా ఇంటివారయితే (డబ్బున్నవారి యిల్లు చూపించి) ఎక్కువగా బూర్లు, కోడి మాంసం, అన్నం పెడతారు. వెళ్లి తిను' అంటాడు. అలాగే వెళ్తానని అమ్మవారు వెళ్లిపోతుంది. అమ్మవారు తాను వెళ్లమన్న యింటికి వెళ్లిందోలేదో నని, పల్లెవాడు వాళ్లయింటి తలుపు సందునుంచి చూస్తుంటాడు. వాళ్లు సకల పిండివంటలతో కోడి, మేక వంటి బలులతో అమ్మవారికి ఉపా(హా)రం పెడతారు. తలుపు సందునుంచి చూస్తున్న పల్లెవాణ్ణి బిచ్చగాడనుకొని వెళ్లమంటారు. అతడు తను బిచ్చగాణ్ణికానని, తన యింటికి వచ్చిన మరిడమ్మను, వారింటికి పంపానని, అందుచేత

చూస్తున్నానంటాడు. అంతవారు 'అమ్మవారు మీ యింటికొచ్చిందా? నీవెంత అదృష్టవంతుడవు ! మేమెంత దురదృష్టవంతులం ! అని వారు పల్లెవాణ్ణి మెచ్చుకుంటారు'.[49]

అమాయకులు, మూఢభక్తులు అంటే దేవతకు అభిమానం, దయ ఉంటాయనటానికి జానపదుని కల్పనగా ఈ కథను చెప్పవచ్చును.

**నక్కుళ్లమ్మ :** ఈమె పిఠాపురం మండలం నవఖండ్రవాడ గ్రామదేవత. ఇప్పటికి చాన్నాళ్లక్రితం ఒక సన్యాసి వచ్చాడు. ఆతడు ఈ అమ్మవారిని గూర్చి హేళనగా మాట్లాడాడు. అంత ఆతని కుమార్తె విరేచనాలతో, వాంతులతో నీరసపడిపోయింది. ఆ సాధువు అమ్మవారి గుడి వద్దకు వచ్చి, తన తప్పుక్షమించమని వేడుకున్నాడు. ఆతని కుమార్తె ఆరోగ్యం బాగుపడింది.50

**సింగరమ్మ :** ఈ అమ్మవారి చెట్టునరకదలచి, గొడ్డలితో వేటువేస్తే, ఆ వేటునుంచి పెద్ద వర్షపు చినుకువలె పడేది. దగ్గరకెళ్లిచూస్తే ఏమీ కనపడేది కాదు. ఒక వ్యక్తి అమ్మవారికి మొక్కుకొని, మొక్కు తీర్చకపోతే అనారోగ్యం కలుగచేసింది.'[51]

**రూపులమ్మ :** ఈమెను గురించి న్యూనంగా మాట్లేడేవారికి అనారోగ్యం కల్పించేది. ఈమె ఈజిల్లాలోని సంపర గ్రామానికి కూడ దేవత. అక్కడ జాతర జరుగదు. ఏలేశ్వరంలో జరిగే జాతరకు సంపర గ్రామస్థులు వస్తారు. ఒకసారి సంపర గ్రామస్థులంతా ఏలేశ్వరం జాతరకువచ్చి నపుడు సంపరలో ఒకరింటిలో దొంగలు ప్రవేశించి, డబ్బుపెట్టె తెరచుటకు ప్రయత్నించుచుండగా, అమ్మవారి మహిమవల్ల వారక్కడే స్తంభించి పోయారు. జాతర ముగిసాక, ఇంటికెళ్లిన సంపర గ్రామస్థులు అమ్మవారిని ప్రార్థించగా దొంగలు యథాచలనాన్ని పొందారు.[52]

**పంపాదమ్మ :** ఈమె మహిమ గురించ ఒక కథ ఈ ప్రాంతంలో ప్రచారంలో ఉన్నది. ఈమె ఈ ప్రాంతాన్ని పాలించిన పెద్దిరాజు, కాటమరాజు, పోలిరాజు, అనే యాదవరాజుల ఇంటి ఆడపడుచు. వీరు ఆలమేకలమందలను మేపుకుంటూ దేవతలకు పాలుపోసే వారు. వీరు ముగ్గూరూ తమ మందలను పంచుకో దలచినపుడు, పెద్దవాడైన పెద్దిరాజు వాటాలు వేస్తుండగా, తనకు వాటా వేయలేదని పంపాదమ్మ వాటాలను తెగనిచ్చేదికాదు. నక్కరూపంలోవచ్చి, ఏదో మేకను ఎత్తుకొనిపోయేది. (ఇప్పటికీ మేకను నక్క ఎత్తుకొనిపోతే ఊరుకుంటారే తప్ప, నక్క తమ ఇంటి ఆడపడచు అని భావించినగొల్లలు తిట్టనైన తిట్టరు.) ఈవిధంగా చాన్నాళ్లపాటు వాటాలు తెగక వాళ్లుచాలా బాధపడ్డారు. ఒ.కనాటి రాత్రి పంపాదమ్మ పెద్దిరాజు కలలోని కెళ్లి, ఇంటికి ఆడబిడ్డనైన తనకు వాటావేయడం లేదని, అందుకే వాటాలు తెగకుండా చేస్తున్నానని చెప్పింది. అప్పుడు పెద్దిరాజు పంపాదమ్మతో సహా నాల్గువాటాలు వేయగా, సమస్య తీరిపోయింది.[53]

**ఒనుములమ్మ :** ఈమె చాలా మహిమాన్వితురాలనీ, ప్రజారక్షణి అని గ్రామస్థుల నమ్మకం. ఒకసారి ఈ గ్రామ (దిగువాయి పోలవరం) సమీప గ్గ్రామమయిన, సుభద్రయ్యమ్మ పేటలో, ఒక భూస్వామి యింట దొంగలువడి దోచుకున్నారు. ఒనుములమ్మ ఆ భూస్వామి కలలో కనిపించి, దొంగతనంచేసిన దొంగల ఆచూకి తెలిపింది. వెంటనే భూస్వామి దొంగలను పట్టుకొని, పోయిన

వస్తువులను రాబట్టుకున్నాడు. ఒనుములమ్మ మహిమ వల్లే భూస్వామి తమను పట్టుకోగలిగాడన్న విషయం తెలుసుకున్న దొంగలు ఒనుములమ్మ తలను నరకదలచి, ఆమె గుడిలో ప్రవేశించి, ఆమె మహిమవల్ల రక్తం కక్కుకుంటూ మరణించారు. అమ్మవారి మహిమను గమనించిన గ్రామస్థులు, అప్పటి నుంచి ప్రతి ఏటా అమ్మవారి సంబరం చేస్తున్నారు. 54 ఈ కథలో అమ్మవారి మహిమవల్ల దొంగలు పట్టుబడడంవల్ల, మరణించడంవల్ల, సంఘవిద్రోహులను గ్రామదేవత శిక్షిస్తుంది అనే విషయం స్పష్టమగుచున్నది.

**పల్లాలమ్మ** : సర్ ఆర్థర్ కాటన్ ధవళేశ్వరం నుండి కుండలేశ్వరం వరకు వానపల్లి మీదుగా ఒక పంటకాలువను తవ్వడానికి ప్లానువేసి, తవ్విస్తుండగా, ఈ పల్లాలమ్మ గుడి అడ్డు రావడంతో గుడినితీసివేసి, కాలువ పని కొనసాగించమని ఆదేశించాడు. అందుకు ఆయన ఆ సాయంత్రానికి అనుకోని ప్రమాదాలకు గురి అయ్యాడు. పల్లాలమ్మ కాటన్ కలలో కనపడి, వాస్తవాలను చెప్పగానే కాటన్ వానపల్లికి వచ్చి, అమ్మవారి పూజలుచేసి, కాలువను గుడి ప్రక్కకు తిప్పి త్రవ్వమని ఆదేశించాడు. దీనికి నిదర్శనంగా, నేటికీ ఈగుడి ప్రక్క నుంచి కాలువ ప్రవహిస్తోంది.[55]

ఈ అమ్మవారి గుడి దేవాదాయధర్మాదాయశాఖవారి ఆధీనంలో ఉండడంవల్ల, ఇక్కడ ఉండే కార్యనిర్వహణాధికారి (ప్రభుత్యోగి) అమ్మవారి నగలు తస్కరింపదలచి, వేరొక వ్యక్తిచేత గుడిలో నగలు తీయించి, తాను పుచ్చుకొనుచుండగా, అక్కడికక్కడే రక్తంకక్కుకొని పడిపోయాడు. తర్వాత తన తప్పు ఒప్పుకొన్నాడు.

అమ్మవారు అందమైన స్త్రీ రూపంలో రిక్షాలో సినిమాకు వెళ్లేవారు. మళ్లీ అదే రిక్షాలో వచ్చి, ఎవ్వరూ లేనిచోట దిగి అదృశ్యమయ్యేవారు. ప్రతిరోజు ఆమె రిక్షాలో వెళ్లడం చూసిన కొందరు దుండగులు ఆమెమీద కన్నువేసి, రిక్షావెనుక వెళ్లి, ఆమెను స్పృశించబోయి, రక్తం కక్కుకొని మరణించారు. దర్యాప్తులో మరణించిన వ్యక్తులు ఏరిక్షావెనక వెళ్లారో, ఆ రిక్షా వ్యక్తిని కోర్టుకు హాజరు పరచి, ఉరిశిక్ష ఖాయంచేసే సమయంలో అమ్మవారు జడ్జిగారి కలలో కనిపించి, జరిగిన విషయం చెప్పి రిక్షావానికి శిక్షతప్పించింది.

సాధారణంగా గ్రామదేవత విగ్రహం కాలికింద నక్కనుకాని, వ్యక్తినికాని తొక్కి పెట్టినట్లు చిత్రింపబడి యుంటుంది. ఈ పల్లాలమ్మ కాలికింద నక్కనుతొక్కి పెట్టినట్లు చిత్రింపబడి యున్నది. ఈవిధంగా నక్కను తొక్కి పెట్టినట్లు చిత్రింపబడడానికి ఒక కథ ఉన్నది. దేవతవద్ద ఉండే పసుపు కుంకుమలను ప్రతిరోజు ఒక నక్క వచ్చి నాకేది. ఇందుకు కోపించిన అమ్మవారు తన విగ్రహంచుట్టూ ఉసిరికాయలు చల్లింది. యథాప్రకారం వచ్చిన నక్క క్రిందపడిన ఉసిరికాయలమీద నుంచి నడిచింది. వెంటనే అమ్మవారు నక్కను తనకాలికిందతొక్కి పెట్టింది.[56] ఈ కథను'Sensus of India, Fairs and Festivals, East Godawari" 1961లో పేర్కొన్నారు. కాని నేను విషయ సేకరణకు వెళ్లినపుడు ఈ రకమగు విగ్రహం నాకు కనిపించలేదు.

1986లో గోదావరికి వరద వచ్చినపుడు ఏటిగట్టుకు గండి పడడం ఖాయమని ప్రజలు భయభ్రాంతులయారు. 'పల్లాలమ్మా ! రక్షించు తల్లీ !' అని స్మరించుకుంటూ ఏటి గట్టుకు మట్టివేసి (అమ్మవారి మహిమవల్ల) గ్రామాన్ని రక్షించుకున్నారు.[57]

**దేవరమ్మ** : ఈమె పిఠాపురం మండలం జల్లూరి గ్రామంలోని బత్తిన వారి యింటి దేవత. కొత్తపల్లి మండలం, ఇసుకపల్లి గ్రామంలో కూడ ఒక ఇంటివారికి ఈమె ఇంటిదేవత. ఈమె పుట్టుక గురించి ఎట్టి కథలు లభించకపోయినా, ఈమె మహిమ గురించి, జల్లూరు గ్రామంలో ఒక కథ చెపుతారు.

ఈ బత్తినవారి నుంచి వరిగడ్డి కొనుక్కున్న పొరుగూరివారు 15 బండ్ల గడ్డికొని, 16 బళ్ల గడ్డి తీసుకెళ్లటానికి ప్రయత్నించగా, అమ్మవారి మహిమవల్ల బళ్లు ముందుకు కదలలేదు.[58]

**గంగాలమ్మ :** ఈమె గోకవరం మండలం గోకవరం గ్రామంలోని చాకలివారి ఇంటిదేవత. నేను ఫలానా చోట (ఇప్పుడు గంగాలమ్మ ఉన్నచోట) వెలసానని చెప్పింది. అక్కడే వాళ్లు పూజిస్తున్నారు. ఈమె చాకళ్లచేలో ఉన్న వరికుప్పలు కాపలాకాసేది. ఎవ్వరైనా ఇతరులు వరికుప్పలమీద చెయ్యివేసినా, ధాన్యపు రాశి ముట్టుకున్నా, వాళ్లకు మతిపోయి, ఆకుప్పచుట్టూ తిరిగేలాగచేసేది. ఆ మరుసటిరోజు ఆ పొలంగల వ్యక్తి 'పోనియ్యమ్మా! వాడికర్మని వాడేపోతాడు' అంటే వదిలేసేది.[59]

**పెద్దింటమ్మ :** ఈమె కొత్తపల్లి, కొండెవరం, భోగాపురం, లక్ష్మీపురం, చంద్రంపాలెం, కోరుపల్లిపాడు మొదలైన గ్రామాల్లో గ్రామదేవత. ఈమె మహిమ గురించి ఒక కథ చెబుతారు. ఒక వ్యక్తియొక్క ఎనుపోతులు తప్పిపోయాయి. అవి ఎంతకూ దొరకలేదు. పెద్దింటమ్మకు నమస్కరించి, తన పోతులు దొరికితే పోతును బలి ఇస్తానని మొక్కుకున్నాడు. ఆనాటి రాత్రికి పోయినవన్నీ, తిరిగి వచ్చి అమ్మవారి గుడి ముందు పడుకొని ఉన్నాయి. అనుకున్న ప్రకారం పోతును బలి యిచ్చాడు.[60]

**పోశమ్మ :** ఈమె దేవీపట్నం మండలం గొందూరు సమీపాన గోదావరి తీరాన నిలిచింది. ఈమె ప్రతిమ గోదావరి మాందావ (తీరం)లో దొరికింది. ఆ ప్రతిమనుతీసి, చింతచెట్టుకిందపెట్టి, గుడికట్టి పూజిస్తున్నారు. గోదావరిలో ప్రయాణించే లాంచీలు ఈమె గుడివద్దకు వచ్చాక ఆగిపోతాయి. లాంచీల వాళ్లు అమ్మవారికి కొబ్బరికాయలు కొట్టి, మొక్కులు చెల్లించాకే అవి కదులుతాయి. లాంచీలలో ప్రయాణంచేసేవారు. పొరపాటున నోరుజారితే, ఆవిధంగా వాళ్లుచెయ్యాలి. చేయకుంటే లాంచీ మునిగి పోతుంది. ఒకప్పుడు ఒక స్త్రీ తాను ఇంటివద్ద బయల్దేరేటప్పుడు ఏడుస్తున్న పిల్లవాణ్ణి, ఏడ్పు మానకుంటే గోదావరిలో పడవేస్తానని తిట్టింది. ఆస్త్రీ లాంచీ ఎక్కి ప్రయాణిస్తుంది. ఆ లాంచి పోశమ్మగుడి వద్దకు వచ్చాక కదలడంలేదు. లాంచీ డ్రయివరుకు అనుమానం వచ్చి, లాంచీలోనున్న ప్రయాణీకులనుద్దేశించి, మీలో ఎవరైనా నోరు జారారా?' అని ప్రశ్నించాడు. ఇంటివద్దకుమారుణ్ణి తిట్టిన తల్లి తాను తన కుమారుణ్ణి గోదావరిలో పడవేస్తానని తిట్టినట్టు చెప్పింది. వెంటనే డ్రయివరు ఆ అబ్బాయిని తీసుకొని, నీటిలో ముంచి, బయటకు తీసి, అమ్మవారి గుడివద్దకు తీసుకెళ్లి, అమ్మవారి ముందుంచాడు. (అమ్మవారి కర్పించినట్టు) తర్వాత తల్లి అమ్మవారి దగ్గరనుంచి రూపాయికి తన కుమారుణ్ణి కొనుకున్నది. ఈఅమ్మవారు గోదావరిలో పడవలు, లాంచీలు మునగకుండా కాపాడుతుందని ఇచ్చటి ప్రజల నమ్మకం[61] అనవసరంగానోరు జారకూడదు. అలా జారితే అమ్మవారి మహిమవల్ల

అనర్థాలు సంభవిస్తాయని, దేవతను ఆలంభనగా చేసుకొని, ప్రజలలో సత్సంభాషణా స్వభావాన్ని పెంపొందించటానికి జానపదుని కల్పనగా ఈ కథను చెప్పవచ్చును.

**సాధారణ కథలు :** సాధారణ కథలు సందర్భాన్నిబట్టి ఏ దేవతకైనా అన్వయించి చెప్పవచ్చును. సమాజంలో ఉండే చిత్రవిచిత్ర మనస్తత్వంగల వ్యక్తులను దృష్టిలో పెట్టుకొని, దేవతను ఆలంబనగా చేసుకొని అల్లిన కథలుగా వీటిని పేర్కొనవచ్చును. దేవతను సాధారణ పరిభాషలో అమ్మోరు (అమ్మవారు) అని వ్యవహరిస్తారు. కాబట్టి ఈ కథలలో దేవత పేరుకాక, 'అమ్మోరు' అనే పేరే వినిపిస్తుంది.

**అమ్మోరునే ఆశ్చర్యపరచే గడుసరి స్త్రీ కథ :** ఈ కథ నాకు ఏలేశ్వరం మండలం లింగపర్తి గ్రామంలో లభించింది. చెప్పినవారు మొల్లేటి బుల్లెమ్మ. అమ్మవారు చాలా మహిమ కలదనీ, అమ్మవారి ధాటికి ఎవ్వరూ తట్టుకోలేరనీ గ్రామీణుల నమ్మకం, అటువంటి అమ్మవారిని కూడ ఆశ్చర్యపరచే, ఖంగుతినిపించే స్త్రీలుంటారనే చమత్కారంతో ఒక గడుసరి స్త్రీకథ ఈ జిల్లాలో ప్రచారంలో ఉన్నది. ఒక గ్రామంలోఉన్న గడుసరిస్త్రీ భర్తకు తెలియకుండా పరపురుషులతో, చాటుమాటు వ్యవహారాలు సాగిస్తుంటుంది. భర్తను గుడ్డి వాడిగా మారిస్తే, అమ్మోరుకి ఆరుగాళ్ల జీవాన్ని బలియిస్తానని మొక్కుకుంటుంది. ఇది గమనించిన ఆమె భర్త తనకు కళ్లు కనిపించటంలేదని, భార్యతో అంటాడు. గుడ్డి వానిగా నటిస్తాడు. అమ్మోరు కరుణించిందని ఆమె సంతోషిస్తుంది. కుక్కలులోనికి రాకుండా చూడమని ఒక కర్ర చేతికిచ్చి, భర్తను గుమ్మందగ్గర కూర్చుండబెడుతుంది.

భర్తకు కళ్లుపోయాయనుకుని, విటులను రమ్మని ఆహ్వానించి, వారికోసం పాయసం వండుతుంది. భర్త భార్య చూడకుండ కొంత, విషాన్ని పాయసంలో కలుపుతాడు. రాత్రికి ఇంటికొచ్చిన విటులు ఆ విషపాయసంతిని మరణిస్తారు. వారి పీడ వదిలించుకోవటానికి తెల్లవారుజామున డబ్బులు దండుకోవటానికి వచ్చే బుడబుక్కలవాణ్ణి ఉపయోగించుకుంటుంది. 'ఒక శవం ఉంది మూటకట్టి ఇస్తాను. తెల్లవారకుండ స్మశానంలో వదిలివస్తే, కొంత డబ్బు ఇస్తా నంటుంది. దానికి బుడబుక్కలవాడు అంగీకరిస్తాడు. ఒక శవాన్ని చాపను చుట్టి ఇస్తుంది. తీసుకెళ్లి స్మశానంలో వదలి వస్తాడు. ఇంకో శవాన్ని చాపనుచుట్టి, పారవేసిన శవం మళ్లీ ఇంటికొచ్చింది, దూరంగా పారవెయ్యి అని చెప్పి మళ్లీ ఇస్తుంది. ఈవిధంగా తెల్లవారేలోపల అందరి శవాల్ని పారవేయిస్తుంది. బడబుక్కలవానికి ఇస్తానన్న డబ్బులు ఇచ్చిపంపిస్తుంది.

ఈగను (ఆరుకాళ్ల జీవం) తీసుకెళ్లి, అమ్మోరు ముందు అరచేతిలో నలిపేస్తుంది. ఆమె చమత్కార తనానికి, గడుసరితనానికి ఆశ్చర్యం చెంది అమ్మోరు ముక్కుమీద వేలేసుకుంటుంది. ఇది గమనించిన గ్రామ పెద్దలు అమ్మోరుముక్కుమీద వేలేసు కోవటం గురించి తర్జనభర్జనలు చేసి, అమ్మోరు ముక్కుమీద వేలుతీయించిన స్త్రీని పవిత్రంగా భావిస్తామంటారు. అమ్మోరుముక్కుమీద వేలుతీయించటం ఎవరివల్లకాదు. గడుసరి స్త్రీ చీపురకట్టతో (కొట్టే ఉద్దేశముతో) అమ్మోరు దగ్గరకెళ్లి, 'నేను వ్యభిచరిస్తే, నాభర్తకు అత్తమామలకు బంధువులకు లేని తప్పు నీకొచ్చిందా! ముక్కుమీద వేలు తీస్తావా? తియ్యవా? అని గదమాయిస్తుంది. వేలు తియ్యకపోతే చీపురకట్టతో

కొడుతుందేమోనని భయపడి, అమ్మోరు ముక్కుమీద వేలు తీసేస్తుంది. ఈవిధంగా అమ్మోరిచేత ముక్కుమీదవేలు తీయించినందువల్ల ఆమే పతివ్రతగా కూడ పరిగణింపబడుతుంది62. సమాజంలో నోరుగలవాళ్లకి అందరూ భయపడతారు. అందర్నీ భయపెట్టే అమ్మోరే భయపడతుందని చెప్పటానికి చమత్కారంతో, అతిశయోక్తితో గావించిన జానపదుని కల్పనగా ఈ కథను భావింపవచ్చును.

**దొంగతన చమత్కారంతో అమ్మోరుని ఆశ్చర్యపరచే కథ :** ఈ కథను నాకు గండేపల్లి విజయరాణి తెలియచేసింది. ఆమెది కూడ లింగంపర్తే. ఒకరోజు ఒక దొంగ దొంగతనానికి వెళ్లేముందు అమ్మోరు గుడికెళ్లి, తాను దొంగతనంలో ఎవరికీ దొరక్కుండా విజయుడై తిరిగొస్తే, ఏడుకొమ్ములపోతుని, వంద కాళ్ల జీవిని బలి యిస్తానంటాడు. ఎప్పుడూ కనీవినీ ఎరుగని జీవులను బలి యిస్తానంటున్నాడు. కదా ! అని అమ్మోరు సంతోషించి, అతడు దొంగతనంలో పట్టుబడకుండా చూసి, విజయుణ్ణి చేస్తుంది. దొంగోడు ఏడుకొమ్ముల జీవిగా కోడిపుంజును (కోడిపుంజు జుత్తుకు ఏడు కొమ్ములువలె ఉంటాయి) వంద కాళ్ల జీవిగా ఒక రోకలిబండను అమ్మోరుకి బలియిస్తాడు.[63] దొంగోడి చమత్కారానికి అమ్మోరు ఆశ్చర్యపడుతుంది.

**త్రాగుబోతు కథ :** పూర్వం ఒక త్రాగుబోతు చెరువుగట్టుమీద పోతూ, 'ఓ దేవతా చెరువులోని నీరంతా కల్లుగామారి, ఇక్కడున్న రాళ్లన్నీ గుండెకాయలుగా మారితే, ఇవన్నీ నేను భుజించాక, నాశిరస్సు ఖండించి, నీకు అర్పిస్తాను' అని దేవతకు మొక్కుతాడు. ఆ దేవత మహిమ వల్ల అతడు కోరినట్టే జరుగుతుంది. అవన్నీ అరగించి వెళ్లిపోతున్న ఆతనిని ఆ దేవత ఆపి, తన మొక్కు చెల్లించమని అడుగుతుంది. 'త్రాగుబోతువాని మాటలను నమ్మే ఓ వెర్రిదేవతా ! నీవు మానవుల్ని ఏమి కాపాడగలవని హేళన చేసి ఆ త్రాగుబోతు వెళ్లిపోతాడు.[64] త్రాగుబోతు మాటలు నమ్మకూడదనీ, అతని మాటలు నమ్మి అమ్మోరే మోసపోయిందని చెప్పటానికి జానపదుని కల్పనగా ఈ కథను చెప్పవచ్చును.

పై కథలనుబట్టి దేవతకు మొక్కులంటే యిష్టమని బలి అంటే ప్రీతి అనీ, బలిని ఆశించి ప్రజల ఎలాంటి కోర్కెలయినా తీరుస్తుందనే విషయం అర్థమవుతుంది.

**అమ్మోరు దృష్టి నుంచి ఎవరూ తప్పించుకోలేరని చెప్పే కథ :** ఈకథ నాకు కిర్లంపూడి మండలం వీరవరం గ్రామంలో లభించింది. మనుష్యులకు వచ్చే అంటువ్యాధులన్నింటికీ అమ్మోరేకారణమని గ్రామీణుల విశ్వాసం. అమ్మోరు మహిమ వల్ల వచ్చే అంటువ్యాధులనుంచి ఎవ్వరూ తప్పించుకోలేరని, తప్పించుకోవటానికి ప్రయత్నిస్తే, అమ్మోరుకి మరింతకోపం వస్తుందని తెలియచేసే కథ ఒకటి ఈజిల్లాలో ప్రచారంలో ఉన్నది. ఒక గ్రామంలో తల్లీకొడుకు లుండేవారు. ఆ గ్రామంలో అంటువ్యాధులు ప్రబలి ప్రజలుచనిపోతున్నారు. తన ఒక్కగానొక్క కుమారుడు చనిపోతాడేమోనని, భయపడి, ఊరుమారితే వ్యాధులు రావనే భావంతో, తల్లికొడుకుని పినతల్లి యింటికి పంపుతుంది. ఈవిషయం గమనించిన అమ్మోరు ఒక ముసలి అవ్వవేషంలో బాలుడు వెళ్లేమార్గంలో చెట్టుక్రింద కూర్చుని, వెళ్లే బాలుణ్ణి ఆపి, తన తలలో పేలు ఎక్కువగా ఉండి బాధపెడుతున్నాయి. పేలుచూడమంటుంది. బాలుడు పేలుచూడటానికి తలలో చేయిపెట్టి చూస్తుంటే, పేలు లేవు సరికదా ! పాయుపాయుకు కళ్లు కనపడుతున్నాయి. 'నీతలలో పేలులేవు,

కళ్లు ఉన్నాయి' అని ఆశ్చర్యపోతాడు. అప్పుడు అమ్మోరు అది తన మహిమేనని, తన దృష్టి నుంచి ఎవ్వరూ తప్పించుకోలేరని చెప్పి, సముదాయించి ఇంటికి పంపిస్తుంది.[65] అమ్మోరుకి తెలియనిది లేదని, ఆమెబారి నుంచి ఎవ్వరూ తప్పించుకోలేరని ఈ కథవల్ల తెలుస్తుంది. ఈ కథను పోలిన కథలను డా. రావి ప్రేమలతగారు, శ్రీమతి అండమ్మగారు కూడ తమ సిద్ధాంత వ్యాస గ్రంథాల్లో పేర్కొని యున్నారు.

**అమ్మోరు గాజులు వేయించుకొనే కథ :** ఈకథను అనపర్తి మండలం కొప్పవరం గ్రామదేవత ముత్యాలమ్మ మీద చెబుతారు. అమ్మవారు ఒకరోజు మిట్టమధ్యాహ్నం వేళ చక్కని పడుచుగా, తయారయి, వీథిలో పోతున్న గాజుల వానిని పిలిచి, గాజులువేయించుకొని, డబ్బులు తెస్తానని, ఒకరి ఇంటిలోకిపోయింది. ఆమె ఎప్పటికీ రాకపోయేసరికి అతను ఆఇంటివారిని పిలిచి అడిగాడు. వాళ్లు ఆమె ముత్యాలమ్మ అని గ్రహించి ఆ డబ్బులిచ్చి పంపించేసారు.[66]

ఇలాగే పెద్దాపురం మరిడమ్మ మీద ఒక గాజులు కథ ఉన్నది. ఆమె గాజులు వేయించుకొని వెళ్లిపోతే, గాజుల మల్లయ్య 'నాడబ్బులో నాడబ్బులో' అని కేకలుపెడుతుంటే అతన్ని అక్కడ రాయిని చేసేసింది. దానిని 'గాజులమల్లారంరాయి' అంటారు[67].

**సిడిబొమ్మ కథ :** సిడిబొమ్మను త్రిప్పటం అనేది అమ్మవారి జాతరలో ఆచరించే ఆచారాలలో ఒకటి. ఈ ఆచారం ఎక్కువగా పిఠాపురం తాలూకాలోని గ్రామాల్లో కనిపిస్తుంది. అమ్మవారి సంబరం సమయంలో గ్రామమంతా తిప్పే ఈ సిడిబొమ్మను అమ్మవారి ప్రతిరూపంగా భావిస్తారు. ఈ బొమ్మను తిప్పుతున్నప్పుడు గ్రామస్థులు అరటిపండ్లతోనూ, ఈతకాయలతోనూ కొడతారు. ఈవిధంగా కొట్టడం గురించి కూడ ఒక కథచెబుతారు.

అమ్మవారు బ్రాహ్మణ స్త్రీ. ఆమెను మోహించిన కంసాలి వ్యక్తిని తిరస్కరించినందున ఆమె బొమ్మను జాతరలో అందరిచేత కొట్టిస్తానన్నాడు. అందుచేతనే జాతరలో అమ్మవారి సిడి బొమ్మను కొట్టడం[68].

గ్రామదేవతల గురించి ఈవిధంగా రకరకాలైన కథలు విన్పిస్తాయి. వీటిలో కొన్ని సత్యదూరాలుగా అన్పిస్తాయి. అట్టి కథలు నిజం కాదని విద్యాధికులు వాదించినా, జానపదులు నమ్మరు సరికదా ! వాదించిన వారిని దేహశుద్ధి కూడా చేస్తారు. గ్రామదేవతలంటే గ్రామీణులకుండే నమ్మకం అలాంటిది. కొన్నివేల సంవత్సరాలుగా గ్రామీణులు గ్రామదేవతలను నమ్ముకొనే తమ జీవనం సాగిస్తున్నారు. వైద్యసదుపాయాలు ఎంత పెరిగినా, ఇప్పటికింకా, దేవతలను నమ్ముకొనే తమ రోగాలను పోగొట్టుకుంటున్నారు. వారికి కలిగే కష్టసుఖాలన్నిటికీ గ్రామదేవతే కారణమని నమ్మే గ్రామీణులు దేవతను ఆలంబనగా చేసుకొని ఆత్మవిశ్వాసంతో బ్రతుకుచున్నారు. ఈవిధంగా గ్రామదేవతల మీద వీరికుండే నమ్మకం కొద్దీ రకరకాలు కథలు పుడుతుంటాయి. ఇలాంటి కథలవల్ల జానపదుల మానసిక స్థితి తెలుస్తుంది.

## అథస్సూచికలు

1. గండుమిల్లి సత్తెమ్మ – పిఠాపురం, తూర్పు గోదావరి జిల్లా.

2. రేవు యముడమ్మ, కొమరగిరి గ్రామం, కొత్తపల్లి మండలం.
3. బంగారు పాప (బషీర్‌బీబీ) చారిత్రక నవల, మూలరచయిత, రాయవరపు గౌరిరాజు, 1985.
4. సుసర్ల గోపాలకృష్ణ, మాచవరం గ్రామం, అంబాజీపేట మండలం.
5. గోదావరి సీమ - జానపద కళలు గ్రీడలు వేడుకలు - పి. రామకృష్ణారెడ్డి, 1991 - పుట 57.
6. తోలేటి బులిరాజు - సామర్లకోట - తూర్పు గోధావరి జిల్లా.
7. కురసం జంగం దొర - రాజవరం గ్రామం, గంగవరం మండలం.
8. Census of India Fairs and Festivals, East Godavari.
9. 'పరిశీలన' వ్యాస సంకలనం - ఆచార్య. నాయనికృష్ణకుమారి. 1977 - పుట 81.
10. పిలకా కన్నమ్మ, కన్నమ్మ పేరంటాలు గుడివద్ద - రాజమండ్రి.
11. దంగేటి అప్పయ్యమ్మ, సామర్లకోట - తూర్పు గోదావరి జిల్లా.
12. బత్తిన ఎర్రయ్య - సీతపల్లి గ్రామం - రంపచోడవరం మండలం.
13. కోమాళ్లపల్లి దీక్షితులు - బొడ్డవరం గ్రామం, తొండంగి మండలం.
14. Census of India Fairs and Festivals, East Godavari. P.P. 258-259.
15. నేమాల నాగరాజు, అద్దారిపేట గ్రామం, తొండంగి మండలం.
16. ముక్కపాటి భాస్కర రామయ్య సిద్ధాంతి - మారేడుబాక గ్రామం - మండపేట మండలం.
17. గోదావరి సీమ - జానపద కళలు క్రీడలు వేడుకలు - పి. రామకృష్ణారెడ్డి - 1991 - పుట 60.
18. ఆంధ్రభూమి దినపత్రిక - ఆదివారం అనుబంధం -23-1-90- విశాఖజిల్లా ఎడిషన్.
19. జోకా రామకృష్ణమూర్తి- కాండ్రకోట గ్రామం - పెద్దాపురం మండలం.
20. నూకాలమ్మ జాతర మహోత్సవకరపత్రం - 1988 - కాండ్రకోట.
21. దివిలి అమృత రామారావు - ఆంధ్రప్రభ దినపత్రిక - విశాఖజిల్లా ఎడిషన్ -17-6-86.
22. ఆంధ్రభూమి దినపత్రిక - ఆదివారం అనుబంధం - 23-1-90 - విశాఖజిల్లా ఎడిషన్.
23. ముక్కపాటి భాస్కర రామయ్య సిద్ధాంతి - మారేడుబాక గ్రామం - మండపేట మండలం.
24. మేకల పెద్దకొండ - తిమ్మరాజుపేట గ్రామం - కోటనందూరు మండలం.

25. యాతం చంద్రన్న – కుమారపురం గ్రామం – పిఠాపురం మండలం.

26. చీడిపల్లి తూతయ్య – రాజవొమ్మంగి – తూర్పుగోదావరి జిల్లా.

27. వర్రి రమణ – కుమారపురం గ్రామం – పిఠాపురం మండలం.

28. పులి అప్పారావు అమరపల్లి గ్రామం – కొత్తపల్లి మండలం.

29. దూడల కాశీగారు – పిఠాపురం – తూర్పు గోదావరి జిల్లా.

30. నూకాంబిక అమ్మవారి జాతర మహోత్సవకరపత్రిక – 1988 – చింతలూరు.

31. యమ్. తిరుపతిరాజుగారు – ఎ. విజయనగరం – గొల్లప్రోలు మండలం.

32. సంతక కోరలయ్య – ఏలేశ్వరం – తూర్పు గోదావరిజిల్లా.

33. వెలిచేటి కృష్ణారావు – కొత్తూరు – పిఠాపురం మండలం.

34. గోపుశెట్టి బాపిరాజు – బెండపూడి గ్రామం – తొండంగి మండలం.

35. కుప్పాల చంద్రరావు – తొత్తరమూడి – అయిన విల్లిమండలం.

36. ఆంధ్రభూమి దినపత్రిక – తూర్పుగోదావరి జిల్లా ఎడిషన్ –22–4–89.

37. రేవు గంగరాజు – పిఠాపురం – తూర్పు గోదావరిజిల్లా.

38. మొల్లేటి సత్యన్నారాయణ – మల్లేపల్లి గ్రామం – గండేపల్లి మండలం.

39. ఈనాడు దినపత్రిక –21–5–89 – తూర్పుగోదావరిజిల్లా ఎడిషన్.

40. మానేపల్లి జగ్గమ్మ – మల్లిసాల గ్రామం – జగ్గంపేట మండలం.

41. గండేపల్లి నూకరాజు – మామిడాడ – జగ్గంపేట మండలం.

42. రాయవరపు గౌరీనాథశర్మ – మూలపేట గ్రామం – కొత్తపల్లి మండలం.

43. తోలేటి బులిరాజు – సామర్లకోట – తూర్పుగోదావరి జిల్లా.

44. కురసం జంగందొర – రాజవరం గ్రామం – గంగవరం మండలం.

45. బత్తిన ఎర్రయ్య – సీతపల్లి గ్రామం రంపచోడవరం మండలం.

46. జోకా రామకృష్ణమూర్తి కాండ్రకోట గ్రామం – పెద్దాపురం మండలం.

47. జొన్నాడ నాగేశ్వరరావు – కొమరగిరి గ్రామం – కొత్తపల్లి మండలం.

48. కాలనాథభట్ల విశ్వేశ్వరరావు – కార్యనిర్వహణాధికారి – మరిడమ్మ దేవస్థానం. పెద్దాపురం – తూర్పు గోదావరి జిల్లా.

49. పల్లారాములు – పిఠాపురం – తూర్పు గోదావరి జిల్లా.

50. చక్రవర్తుల హనుమంతురావు - నవఖండ్రవాడ గ్రామం - పిఠాపురం మండలం.

51. మానేపల్లి జగ్గమ్మ - మల్లిసాల గ్రామం - జగ్గంపేట మండలం.

52. సంతక కోరలయ్య - ఏలేశ్వరం గ్రామం - ఏలేశ్వరం మండలం.

53. ఉప్పురపల్లి అమ్మోరియ్య - ఉప్పాడ గ్రామం - తూర్పు గోదావరి జిల్లా.

54. Census of India; Fairs & Festivals, East Godavari, 1961, p. 258-259.

55. వాడ్రేవు రత్నం వానపల్లి గ్రామం, కొత్తపల్లి మండలం.

56. Census of India; Fairs & Festivals, East Godavari, 1961, p 107.

57. ఆంధ్రభూమి దినపత్రిక - 20-5-1989 - తూర్పు గోదావరి సంచిక.

58. మామిడాడ నూకరాజు - జల్లూరు గ్రామం - పిఠాపురం మండలం.

59 తోలేటి జగ్గమ్మ - గోకవరం - తూర్పు గోదావరి జిల్లా.

60 దొడ్డిరాజు - కొండెవరం గ్రామం - కొత్తపల్లి గ్రామం.

61. బత్తిన ఎర్రయ్య - సీతపల్లి గ్రామం రంపచోడవరం మండలం.

62. మొల్లేటి బుల్లెమ్మ - లింగంపర్తి - ఏలేశ్వరం మండలం.

63. గండేపల్లి విజయరాణి - లింగంపర్తి గ్రామం - ఏలేశ్వరం మండలం.

64. ఆంధ్రప్రభ దినపత్రిక -9-8-89.

65. గండేపల్లి అప్పలరాజు - వీరవరం గ్రామం - కిర్లంపూడి మండలం.

66. గోదావరి సీమ - జానపద కళలు క్రీడలు వేడుకలు - పి. రామకృష్ణారెడ్డి - 1991 - పుట59.

67. -పైది-

68. బంటుపల్లి సుబ్బయ్యమ్మ - పిఠాపురం - తూర్పు గోదావరిజిల్లా.

## సప్తమ ప్రకరణం

# తూర్పు గోదావరి జిల్లా - పేరంటాళ్ళు

గ్రామదేవతలతోపాటు గ్రామీణులచే పూజలందుకొనేవారు పేరంటాళ్ళు. సంఘంలో మామూలు వ్యక్తుల వలె జీవించి, మరణానంతరం తాము చూపే విశిష్టమహిమలవల్ల ప్రజలచే దేవతలుగా గుర్తింపబడి, పూజింపబడేవారే యీ పేరంటాళ్ళు. పురాణాలలోని పతివ్రతలతో సమాన ప్రతిపత్తిగలవారు వీరు. అత్తల, ఆడబిడ్డల ఆరళ్లను భరించలేనివారు (లక్ష్మమ్మ) అకాలమరణం పొందిన భర్తలతో సహగమనం చేసినవారు (కావమ్మ --- మొదలైనవారు), కాముకుల చేత బలాత్కరింపబడినవారు (కిష్టమ్మ) పరుల దౌర్జన్యమునకు బలియైనవారు (చెల్లమ్మ), దేవతలచేత ఆవహింపబడినవారు (కన్నమ్మ) -- ఇంకా యితర కారణాలవల్ల అకాలమరణం చెందిన స్త్రీలు మరణానంతరం పేరంటాళ్లుగా ప్రజలచేత పూజింపబడుచున్నారు. మరణానంతరంవారు విగ్రహాలుగాను, శిలలుగాను, వృక్షములుగాను, పుష్పములుగాను, సర్పములుగాను, భూమిపై నిలిచినట్లు వీరి కథలలో వర్ణింపబడింది. వీరి శరీరం నశించి నప్పటికీ, ఆత్మ ఏదో రూపంలో భూమిపై శాశ్వతంగా నిలిచిపోతుందని జానపదులు భావించి నట్లు చెప్పవచ్చును.

జానపదులకు గల మాతృదేవతారాధన భావన స్థానికంగా మహత్తుగల స్త్రీల శక్తి యుక్తులతో కలిసి, పేరంటాళ్ల ఆవిర్భావానికి కారణమయ్యిందనవచ్చును. ఆరాధనా విషయంలో ఉన్న కొద్దిపాటి తేడా తప్ప, గ్రామదేవతలకు, పేరంటాళ్లకు తేడా కూడ పెద్దగాకనపడదు. వర్షాలకోసం గ్రామదేవతలను పూజించినట్లే, పేరంటాళ్లను కూడ పూజిస్తారు. ఉదాహరణకు తొండంగి మండలం కొత్తపల్లి గ్రామంలో ఉన్న కిష్టమ్మ పేరంటాలును, సకాలంలో వర్షాలు కురవకపోతే, పూజిస్తారు. కొందరు స్త్రీలు కొత్తకుండలలో చలిమిడి, వడపప్పు వేసుకొని, వాటిని తలపై నుంచుకొని, ఊరికి దూరంగా చేలల్లో ఉన్న పేరంటాల గుడివద్దకు వెళ్లి, అవి సమర్పించగానే, ఉరుములతో, మెరుపులతో వర్షాలు కురుస్తాయని చెబుతారు.

మరణం మానవులకు సహజమే అయినా, ప్రత్యేక కారణాలవల్ల, ప్రత్యేక పరిస్థితులలో మరణించిన స్త్రీలే పేరంటాళ్లుగా పూజింపబడుచున్నారు. వారు మరణించాక, సంఘంలో ధననష్టం, జననష్టం లేక ఇతరత్రా ఏవైనా అద్భుత కార్యాలు సంభవించినట్లయితే, మరణించినవారికి కల్గిన ఆగ్రహం లేక అనుగ్రహం వల్లనే, ఈ రకమైన పరిణామాలు జరిగాయని భావించిన జానపదులు వారిని ప్రసన్నం చేసుకోవటానికి, వారి నుంచి రక్షణ పొందటానికి వారిని పూజించడం మొదలు పెట్టారనవచ్చును.

పేరంటాళ్లయిన స్త్రీలు తాము మరణించాక, తమ సన్నిహితులకు కలలో కనిపించి, తాము ఫలానాచోట, ఫలానా రూపంలో ఉన్నామని, గుడికట్టించి, పూజించమని అడుగుతారు. అవిధంగానే గుడి కట్టించి, అప్పటి నుంచి పూజించడం మొదలు పెడతారు. పేరంటాళ్లయినవారికి, సాధారణంగా పేరంటాల విగ్రహంతోపాటు, భర్త విగ్రహంకూడ గుడిలో పెట్టి, పూజించడం

కనిపిస్తుంది. దీనికుదాహరణ ఈ జిల్లాలోని సామర్లకోటలోని కావమ్మ పేరంటాలు, పాపమ్మ, బుచ్చమ్మ, లింగాలమ్మ మొదలైనవారు పుట్టరూపంలో ఉన్నారు. రాజమండ్రిలో కన్నమ్మ పేరంటాలు నూకలమ్మ అవహించి పేరంటాలయినందు వల్ల ఈమె గుడిలో నూకాలమ్మ విగ్రహంతోపాటు, ఈమె విగ్రహంకూడ ఉన్నది. కె.ఇ. చిన్నాయిపాలెంలో ఉన్న గుండాల పేరంటాలమ్మ (పచ్చారి) చెట్టురూపంలో ఉన్నది. కొందరు పేరంటాళ్ల విగ్రహాలు రూపంలో ఉన్నారు.

సాధారణంగా పేరంటాళ్లు తాము బ్రతికుండగా పిలువబడే పేరుతోనే, మరణించాక కూడ పిలువబడతారు. కొంతమందికి పేరు ఉండదు. 'పేరంటాలమ్మ' అనే పేరుతోనే పిలువబడతారు. భర్తతో సహగమనంచేసి, గుండంలో పడిన పేరంటాళ్లను, 'గుండాలమ్మ' లేక 'గుండాలపేరంటాలమ్మ' అని కూడ పిలుస్తారు. ఈ జిల్లాలో కొందరి పేరంటాళ్ల కథలు ప్రచారంలో ఉన్నాయి.

**లక్ష్మమ్మ :** ఈమె కమ్మ స్త్రీ అవ్వటంవల్ల, ఈమెను కమ్మవారి లక్ష్మమ్మ అనికూడ అంటారు. ఈమె కథను ఈవిధంగా వివరించవచ్చును.

ఒక బ్రాహ్మణ దంపతులు కాలినడకన ప్రయాణం చేస్తూ, మార్గమధ్యంలో గొడవపడ్డారు. తనను ఎదిరించినందుకు పురుషాహంకారంతో, భర్తభార్యను కత్తితో పొడిచాడు. అదే సమయంలో దేవలోకం నుండి దేవేంద్రుని కుమార్తెలు ఏడుగురు ఆ ప్రాంతాన్ని చూడాలని వచ్చారు. వారిలో ఆరుగురు తమ లోకానికి వెళ్లిపోయారు. ఒకామె ఈ గొడవ చూడాలని దగ్గరకొచ్చి, కత్తిపోటుతో బాధపడుతున్న బ్రాహ్మణిని చూసి నవ్వింది. బ్రాహ్మణి కోపంతో నేను ఒక బిడ్డతల్లినై భర్తతో హత్యగావింపబడినట్లే, నీవుకూడ నరలోకంలో పుట్టి, బిడ్డతల్లివై భర్తతో హత్యగావింపబడతావు అని శపించింది.

ధర్మవరం గ్రామంలో దిగుమర్తిముసలయ్య, సీతమ్మ అనే దంపతులున్నారు. వారికి రామయ్యఅనే కుమారుడు పుట్టాక, పిల్లల కలగలేదు. కుమార్తెకోసం నోయరాని నోములు, వ్రతాలు నోస్తున్నారు. దేవేంద్రుడు తన కుమార్తెకు బ్రాహ్మణి యిచ్చిన శాపం గుర్తుకొచ్చి, తన కుమార్తెను పిలిచి, ముసలయ్య, సీతమ్మ దంపతులకు కుమార్తెగా పుట్టమని అదేశిస్తాడు. ఆ ఆదేశానుసారం ముసలయ్య సీతమ్మ దంపతులకు అమ్మాయి పుట్టింది. లక్ష్మివారం పుట్టడంతో ఆమెకు లక్ష్మమ్మ అని పేరు పెట్టారు.

లక్ష్మమ్మ పుట్టాక, వాళ్లకు ఆర్థికంగా కలిసొచ్చి, బాగా ధనవంతులయ్యారు. లక్ష్మమ్మకు యుక్తవయస్సు వచ్చాక, లింగాలపురం కాపురస్థులైన సిరిమళ్ల వెంకన్న కుమారుడు వెంకటేశ్‌కిచ్చి, ఆమెకు వివాహం జరిపించారు. లక్ష్మమ్మ అత్తపేరు కనకమ్మ, ఆడబిడ్డ పద్దమ్మ, బావగారు సుబ్బారాయుడు, తోడికోడలు సుందరగన్ని. లక్ష్మమ్మ అత్తింటికి వెళ్లాక, వారి ఆస్తికూడ బాగా పెరిగింది. సాంఘిక హోదాకూడ బాగా పెరిగింది. లక్ష్మమ్మ భర్త వెంకటేశ్ ఆగ్రామ సర్పంచ్, లక్ష్మమ్మ ఆడబిడ్డకు పెళ్లయి, ఒక కుమారుడు పుట్టాక, భర్త మరణించినందు వల్ల ఆమెకూడ పుట్టింటిలోనే ఉంటున్నది. లక్ష్మమ్మ వెంట అరణంగా వచ్చిన 'గంగులు' అనే గొల్లకుర్రవాడు పొలం పనులు చూసుకుంటూ వీరి యింటిలోనే ఉంటున్నాడు. లక్ష్మమ్మకు కూడ ఒక కుమార్తె

పుట్టింది.

ఆస్తిమీద ఆశకొద్దీ, పద్దమ్మ తన కుమారునికి, లక్ష్మమ్మ కుమార్తెనిచ్చి పెళ్లి చెయ్యమంటుంది. లక్ష్మమ్మ తన కుమార్తెను అన్నకుమారునికిచ్చి పెళ్లి చేద్దామనే ఉద్దేశంతో పద్దమ్మ మాట కాదంటుంది. అందుకు కోపించి పద్దమ్మ కొడుతుంది. పెళ్లి చెయ్యకపోతే చంపేస్తానంటుంది. అప్పటినుంచి అన్న వెంకటేశ్‌కి వదిన మీద కానివి లేనివి చెప్పి, ఆమెను చంపించటానికి ప్రయత్నాలు ప్రారంభించింది. తన వదినకు ఇతరులకు ముఖ్యంగా గంగులుకు అక్రమ సంబంధమున్నట్లు అన్నతో చెప్పింది. అతడు నమ్మకుంటే సమయం వచ్చినపుడు ప్రత్యక్షంగా చూపిస్తానన్నది.

లక్ష్మమ్మ బాండువాతప్పి, స్నానానికి నీళ్లకోసం కుమార్తెను పద్దమ్మ యింటికి పంపితే, పద్దమ్మ నీళ్లివ్వదు. తల్లీకూతుళ్లిద్దరూ నూతికెళ్లి స్నానాలు చేసి వచ్చేసరికి, తగులబెట్టే ఉద్దేశంతో లక్ష్మమ్మ ఉండే యింటిచుట్టూ పిడకలు, పుల్లలు పేర్పిస్తుంది. ఈ విషయం లక్ష్మమ్మ తన బావగారితో చెప్పగా, అతడు తన చెల్లెలు పద్దమ్మను మందలించి, ఆ పిడకలు, పుల్లలు తీయించి, శుభ్రంచేయించాడు. లక్ష్మమ్మ, తన కుమార్తెతో మామూలుగా తన ఇంటిలో ఉంటుంది.

కొద్దిరోజులు గడిచాక, లక్ష్మమ్మ అత్తకనకమ్మ, ఆడబిడ్డ పద్దమ్మ కూడ మంచి మాటలతో లక్ష్మమ్మ యింటిలో ప్రవేశించారు. లక్ష్మమ్మ తన మంచితనం వల్ల వారితో ఇష్టంగానే ఉంటుంది. గొల్ల గంగులుతో లక్ష్మమ్మకు లేని అక్రమ సంబంధాన్ని ఋజువు చేయటానికి కనకమ్మ పద్దమ్మలు పథకం పన్నారు. దీపావళి పండుగనాడు తమ కుటుంబసభ్యుడుగా ఉంటున్న గొల్లగంగులుకు తలస్నానం చేయించటానికి కనకమ్మ పద్దమ్మలు సమాయత్తమై అతని శరీరానికి నలుగుపెడుతుంటారు. వచ్చి నలుగు పెట్టవలసిందిగా లక్ష్మమ్మను పిలుస్తారు. అత్తగారి మాటకు విలువిచ్చి, లక్ష్మమ్మ కూడ నలుగుపెడుతుంది. నెమ్మదిగా కనకమ్మ, పద్దమ్మలు తప్పుకొని, లక్ష్మమ్మ గంగులుకు నలుగుపెట్టే సన్నివేశాన్ని భర్త వేంకటేశ్‌కి చూపిస్తారు. ఇన్నాళ్లూ తన చెల్లెలు చెప్పేది ఈనాడు నిజమయ్యిందనుకొని, వెంకటేశ్ భార్యను గునపంతో పొడిచి చంపేశాడు. గంగులు పారిపోయాడు. భార్య శీలాన్ని శంకించినందుకు భర్తకు కళ్లుపోయాయి. ఈమె విశాఖజిల్లా పాయకరావుపేట మండలం నామవరం గ్రామంలో దేవతయై వెలసి పూజలందుకుంటున్నది. ఈమెను చూడ్డానికి వెళ్లిన పద్దమ్మను, లక్ష్మమ్మ వీపుపై చరిచింది. ఆమె గుడి ముందు రాయియై నిలిచింది.'[1]

అత్త ఆడబిడ్డల ఆరళ్లకు ఆహుతియైన అబలకథే ఈ లక్ష్మమ్మ కథ. ఈ కథలో భర్త చేత పొడవబడి, చావుబ్రతుకుల్లో ఉన్న బ్రాహ్మణిని చూసి నవ్విన దేవకన్య, మరుజన్మలో నరజన్మ ఎత్తి తాను నవ్వినందుకు తగిన శిక్ష పొందిందని వర్ణించడంవల్ల, కష్టాల్లో ఉన్నవారికి సహాయంచెయ్యాలేతప్ప, బాధ పెట్టకూడదు. అలాగ బాధ పెడితే దేవతలకు కూడ తగిన శిక్షపడుతుందని చెప్పి, నరులు ఆవిధంగా ప్రవర్తించకుండా ఉండడానికి, ఈవిధమైన కల్పనచేశారనవచ్చును.

ఈ కథను ఆద్యంతాలలో మార్పులతో మరింత సంక్షిప్తంగా డా. ప్రేమలతగారు కూడ తమ గ్రంథములో పేర్కొన్నారు.[2]

**కావమ్మ :** సామర్లకోట పట్టణంలో వెలసిన పేరంటాలు ఈమె. దాదాపు 160 సంవత్సరాల క్రితం బెస్తకుటుంబములో కావమ్మ జన్మించింది. చిన్నప్పుడే ఈమె తల్లిదండ్రులు చనిపోయారు. పిఠాపురం సంస్థానంలో పనిచేసే పినతండ్రి లక్ష్మయ్య ఈమెను పెంచాడు. పదో ఏటనే కావమ్మను తన చెల్లెలు కొడుకు మారయ్య కిచ్చి పెళ్లిచేసాడు. మారయ్య కొన్నాళ్ళు కాకినాడ కలెక్టర్ కార్యాలయంలో పనిచేసి, తర్వాత చెన్నాపట్నం దొరల దగ్గర ఆరేళ్ళు కొలువుచేసాడు. భార్యపై మనసుపడి, అక్కడినుంచి, కాలి నడకన సామర్లకోటకు కాలినడకన చేరుకున్నాడు. ఈ బహుదూర ప్రయాణంలో మారయ్య ఎన్నో కష్టాలనెదుర్కొన్నాడు. సామర్లకోటలో తన తల్లి వద్దకు చేరేసరికి అతని ఆరోగ్యం పూర్తిగా క్షీణించింది. ఈ పరిస్థితికి ఆందోళన చెందిన మారయ్య తల్లి, పిఠాపురంలోనున్న కావమ్మను రప్పించింది.

పిఠాపురంలో బయలుదేరేటప్పుడు కావమ్మకు ఎన్నో అపశకునాలు ఎదురయ్యాయి. అత్తవారింటికి చేరుకున్న కావమ్మ అట్లతద్ది నోము నోటయానికి పూనుకొంది. ఆరోజు సాయంత్రం కాలువలో దీపాలు విడిచిపెట్టటానికి వెళ్లేరికి ఇంటివద్ద మారయ్య మరణించాడు. కావమ్మ భర్తతో సహగమనంచేయడానికి నిశ్చయించింది. దీనికి ఉన్నతాధికారుల అనుమతి అవసరమని తెలియడంతో, భర్త మృతదేహాన్ని భద్రపరచమని చెప్పి, ఆమె అధికారుల అనుమతి కోసం ప్రయత్నించింది. కావమ్మ పాతివ్రత్యాన్ని పరీక్షించడానికి, జిల్లా కలెక్టరు ఆమెను 'ఏటిమొగ' (కాకినాడ) లో ఒక స్తంభానికి కట్టించి, కాపలా పెట్టించాడు. మృతదేహానికి దహన సంస్కారాలు జరగనంతవరకు ఆమెలో ఒక కాంతి కనిపించింది. సామర్లకోటలో మారెయ్య మృతదేహానికి దహన సంస్కారాలు ప్రారంభమయ్యాక, ఏటిమొగ వద్ద కావమ్మ ప్రాణం విడిచింది. అప్పుడు అధికారులు కావమ్మ మృతదేహాన్ని బంధువుల కప్పగించారు. కావమ్మ మృతదేహాన్ని తీసుకొస్తుండగా మళ్లీ బతికింది. సర్పవరంలో పెదిరెడ్లపాపన్న యింటికెళ్లి, తను అగ్నిగుండంలో ప్రవేశించటానికి గొయ్యితవ్వమని అతనిని కోరింది.

కావమ్మ భర్తతో సహగమనం చేయటానికి, పూర్వం తన సత్యమును ప్రదర్శించింది. దేశీయుల్ని, విదేశీయుల్ని ఆశ్చర్యపరచింది. సహగమనం వద్దని వారించిన కప్తాను (బ్రిటిష్ దొర) భార్య నాగమ్మకు కడుపునొప్పి కలిగించింది. ప్రవహించే గంగను ఆపించి, కాలువను దాటింది. మామ, పెదతండ్రి, మరిది మొదలైన వారు కాలువ దాటడానికి మాయతెప్పను కల్పించింది. భర్త చితియందు దిగి, రావికొమ్మ నగ్నిలోవేసి, మళ్లీ తడిపి భూమిలోనాటగా, కావమ్మ సత్యముచే కొమ్మనాటుకొని, చిగిర్చి పూతపూసింది. మాంత్రికుడైన మాదిగ వెంకన్న, ఎర్ర మారెమ్మ ప్రయోగంచేయగా, కావమ్మ మహిమచే దానిని తెలిసికొని అతని పళ్లూడగొట్టించింది.

కావమ్మ కోరిక ప్రకారం దొరలు మద్రాసు నుంచి కాకినాడ రేవుకు ఓడ ద్వారా కలప పంపగా, సర్పవరంలోని పెదిరెడ్ల పాపన్న, ఆకలపను సామర్లకోటకు చేర్చి, అక్కడ కావమ్మ అభిమతం ప్రకారం తనే అగ్నిగుండం స్వయంగా తవ్వాడు. అగ్నిగుండంలో కావమ్మ ప్రవేశం చూడ్డానికి మద్రాసునుంచి తెల్లదొరలు కూడ స్మామర్లకోటకు వచ్చారు. చివరిసారిగా కావమ్మ సామర్లకోట వాస్తవ్యురాలయిన మంచాల వెంకమ్మకు, ఆడ, మగ బిడ్డలు పుడతారని, చెప్పి, వారికి తన పేరు,

తన భర్తపేరు పెట్టమని కోరింది. అందరూ చూస్తుండగా, భర్త అస్థికల్ని చితినిప్పుల్ని తీసుకొని, కావమ్మ అగ్నిగుండంలో ప్రవేశించింది.

కావమ్మ గుండంలో ప్రవేశించిన మూడవ రోజున మారయ్యరుమాలు, ఆమె మూరెడు మైజారు చెరగు, మంగళసూత్రపు బొందు, ఒకచేతి గాజులు, కాలిమట్టెలు, ఎర్రకలువ పుష్పం కన్పించాయి. ఆంగ్ల దొరలు ఆమె మహిమకు ప్రభావితులై, పూజలు చేసి, వెళ్లిపోయారు. మంచాల వెంకమ్మకు పుట్టిన సంతానానికి, కావమ్మ దంపతుల పేర్లు పెట్టెను. జానపద పురాణకథలను పోలిన ఈ కథయందు ఫలశ్రుతి కలదు.

**'కామమ్మ కథ విన్న వారికి నీ భాగ్యములు**

**దీయుంగయుండు దీర్ఘాయస్సు కలుగునెప్పటికి'[5]**

ఆంగ్ల ప్రభుత్వం సతీసహగమనాన్ని నిషేధిస్తూ, ఉత్తర్వులు జారీచేసిన పిమ్మట జరిగిన కథకామమ్మది. 'దక్షయజ్ఞపు సతీదేవి, కన్యకామ్మవారి తర్వాత, పేర్కొనదగిన పేరంటాలు కామమ్మ'[6] అని శ్రీపాద కృష్ణమూర్తిగారి అభిప్రాయం.

కావమ్మ ప్రవేశించిన గుండం గోతివలె వర్షపు నీటితో నిండి ఉండడం వల్ల పశువులు మొదలయినవి పడి మరణిస్తాయని నూతివలె గోడకట్టారు. ఇప్పుడు చూచేవాళ్లకు కామమ్మగుండం నూతివలె కన్పిస్తుంది. ఆగుండానికెదురుగా ఆమెకు గుడి నిర్మించారు. ఈ గుడి దగ్గర ఏటా సంక్రాంతికి మూడురోజులు తిరునాళ్ల జరుగుతాయి. సంతానంలేనిస్త్రీలు ఈకావమ్మ గుండంలో అరటిపండు, నారింజపండు మొదలగునవి వేస్తారు. ఆ పండు మునిగితే, మగబిడ్డ, తేలితే ఆడబిడ్డ అని నమ్ముతారు. ఈమె చరిత్రను ఈమె వంశీయులు బుర్రకథగా చెబుతారు. సామర్లకోటలో ఉన్న ఈమె వంశీయుల ఇంటిలో ప్రతీ తరంలోనూ ఒక అమ్మాయికి కావమ్మ పేరు పెట్టుకుంటారు.

సామర్లకోట తూర్పుదిక్కున ఏలేరు కాలువ అవతల ఉన్న కావమ్మగుడికి, ఈమె వంశీయులకుటుంబంలోని వారు ఎవరో ఒకరు ఉదయాన్నే వెళ్లి, కడిగి, దీపారాధన చేసి, నైవేద్యం చెల్లిస్తారు. సంక్రాంతికి కనుమ, ముక్కనుమ రోజులలో కావమ్మ దంపతులకంచువిగ్రహాలను పల్లకీలో ఊరేగిస్తారు. ఒకప్పుడు ఈ విగ్రహాలు గుడిలో ఉండేవి. వాటిని ఎవరో దొంగిలించి, పెద్దాపురంలో అమ్మి తర్వాత, రక్తం కక్కుకొని మరణించారు. అప్పటి నుంచి వీటిని వీరియింటిలోనే ఉంచుతున్నారు. వర్షాకాలంలో ఏలేరు ఉధ్ధృతివల్ల, గుడికి వెళ్లటానికి కుదరకు యింటిలోని విగ్రహాలకే నైవేద్యం చెల్లిస్తారు.

ఈ అమ్మవారికి మొక్కులుగా చీర, రవిక చెల్లిస్తారు. చలిమిడి, వడపప్పు, మొదలయినవి నైవేద్యంగా చెల్లిస్తారు. చిన్నకుండకు సున్నం, పసుపుబొట్టు పెట్టి, అందులో బియ్యం పోసి, 'అరివేణిబుడ్డి' అని ఈమెకు చెల్లిస్తారు.[7]

**పాపమ్మ :** ఈమె ఈ జిల్లాలోని మండపేట గ్రామంలో వెలయటం వల్ల ఈమెను మండపేట పాపమ్మ అని కూడ అంటారు. ఈమె ఒక కాపుస్త్రీ. అకాల మరణం చెందిన భర్తతో సహగమనం

చేయుటానికి సిద్ధమై, సంతులేని సీతమ్మకు సంతానం, కలుగుతుందని వారికి తను భార్యాభ...
పేర్లు పెట్టవలెనని ఆదేశించింది. సహగమనానంతరం, చితిచల్లారాక, పాపమ్మ పట్టుచీ..
మంగళసూత్రం, కాలిమట్టెలు, మైజారుచెరగు, దగ్ధంకాక నిలిచి పోయాయి. గుండంలోనిట్టి..
కుందనపు బొమ్మను ప్రతిష్టించి, ప్రతి సంవత్సరం తిరునాళ్ళ జరిపించమని, పాపమ్మ..
మామనుస్వప్నంలో కోరింది. ఈమె తిరునాళ్ళ ప్రతి సంవత్సరం సంక్రాంతి రోజుల్లో
జరుగుతాయి[8].

**లింగాల పేరంటాలమ్మ :** ఈమె కోటనందూరు మండలం తాటిపాక జగన్నాథపుర
గ్రామంలో ఉన్నది. ఈ గ్రామంలో కాపు, వెలమ కులస్థులెక్కువ. కాపు యువకుడు త..
పొలంలో నీరు కట్టటానికెళతాడు. పొలంలో వెలమ కులస్థులకి అతనికి తగాదావచ్చి, వార..
అతనిని చంపేస్తారు. భర్త మరణానికి తట్టుకోలేక ఆతని భార్య గుండ ప్రవేశం చేసింది. కొడు..
కోడలు మరణించడంతో, తట్టుకోలేక ఆ యువకుని తల్లి కూడ గుండంలోపడి మరణించి..
వీరు మరణించిన చోట మూడు పుట్టలు లేచాయి. ఈ పుట్టలను 'లింగాల పేరంటాలమ్మ' అ..
పూజిస్తున్నారు. వీరిలో యువకుని భార్య పేరంటాలమ్మ అని, తల్లి లింగాలమ్మ అని చెబుతారు.

ఈ పేరంటాలమ్మ చాలా మహిమకలదనీ, సంబరం సవ్యంగా చేయించకపోతే తమను
ఇబ్బందుల పాల్జేస్తుందని గ్రామస్థుల నమ్మకం. ఈ గ్రామస్థుడు విశాఖజిల్లాలో ఉన్న నక్కపల్లి
గ్రామం, తన బంధువులింటి కెళ్లాడు. అక్కడ అతని నగలు అపహరింపబడ్డాయి. అతడు ఈ
పేరంటాలమ్మకు మొక్కుకొని, నగలు దొరికితే మొక్కు తీరుస్తానంటాడు. అపహరించినవారు
నగలను ఎవ్వరూ చూడకుండా అపహరింపబడ్డ వ్యక్తి యింటిలో పడవేసారు. ఈ పేరంటాలమ్మ
సంబరానికి బంధువులందరూ ఎక్కడెక్కడ వాళ్ళు కూడ వస్తారు[9].

**పేరంటాలమ్మ (కొరుప్రోలు మల్లవరం) :** ఈమె తుని మండలం (తాలూకా)
కొరుప్రోలు మల్లవరం గ్రామంలో ఉన్నది. ఈ తుని తాలూకాలో 'కమత మల్లవరం' అనే వేరొక
గ్రామం కూడ ఉన్నది. స్పష్టత కోసం కోరుప్రోలు మల్లవరాన్ని 'పేరంటాలు మల్లవరం' అని కూడ
అంటారు. ఈ గ్రామంలో ఒక హరిజనుడు తన భార్య, కుమారునితోసహా ఒక భూస్వామి వద్ద
పాలేరుగా ఉండేవాడు. ఒకరోజు అతడు వేపకొమ్మ నరకటానికి చెట్టెక్కి అక్కడనుంచి పడి
మరణించాడు. అతని భార్య సహగమనంచేసి, పేరంటాలై, పాము రూపంలో ఒక పుట్టలో
ఉంటున్నది. ఒకసారి ఆమె కుమారుడు పుట్టదగ్గరకెళ్లినపుడు సర్పం రూపంలో ఉన్న ఈమె కాటు
వేయగా, కుమారుడు కూడ పాముగా మారి, తల్లితోపాటు అదే పుట్టలో ఉంటున్నాడు. ఈ
పుట్టను 'పేరంటాలమ్మ గుడి' గా భావించి పూజిస్తున్నారు. ఈమె సంబరం ప్రతి సంవత్సరం
మార్చి నెలలో జరుగుతుంది[10].

**గుండాల పేరంటాలమ్మ :** ఈమె కోటనందూరు మండలం చిన్నాయిపాలెం గ్రామానికి
చెందింది. ఈ గ్రామానికి సమీపంలో ఉన్న కొండపోడు కొట్టుకొని, హరిజన వృద్ధదంపతులు
వ్యవసాయం చేసుకుంటున్నారు. పొలంలోనే బడ్డీవేసుకొని, ఆ బడ్డీమీద ఉంటూ, భర్త రాత్రింబవళ్లు

వ్యవసాయం చూసుకొనేవాడు. భార్య యింటివద్ద వంటచేసి, భర్తకు సమయానుకూలంగా భోజనం తెచ్చేది. భర్తబడ్డీ మీద కూర్చొని వినోదానికి పిల్లినగ్ర (వేణువు) ఊదుకొనేవాడు. ఆ గానమాధుర్యానికి ఒక పాముపచ్చి, బడ్డీకింద నాట్యంచేసేది. ఒకసారి భర్తకు అన్నం తెచ్చిన భార్య ఈ సన్నివేశంచూసి, ఇంకపై ఆవిధంగా వేణువు ఊదవద్దని, పాము బారిన పడే ప్రమాదముందని భర్తను వారించింది. భర్త అప్పటికి అలాగే చేస్తానన్నాడు. ఇంకోసారి యథాలాపంగా ఊదుతూ, వేళ్లతో రంధ్రాలమీద ఆడించడం మానేసాడు. పాటలో మాధుర్యం తప్పినందువల్ల కోపంవచ్చి, పాము వెంటనే బడ్డీఎక్కి, ఆ వృద్ధుణ్ణి కాటేసింది. భార్య కూడ భర్తతోపాటు గుండంలోపడి మరణించింది. ఆ గుండంలో నుంచి పచ్చారిచెట్టు మొలిచింది. ఆ చెట్టునే గుండాల పేరంటాలుగా పూజిస్తున్నారు. సకాలంలో వర్షాలు కురవకపోతే, ఈ గ్రామస్థులు ఈ పచ్చారిచెట్టుకు పూజలు చేస్తారు. ఉపారాలు పెడతారు. వెంటనే పెద్దపెద్ద వర్షాలు కురిసి, చెరువులు నిండి వ్యవసాయయోగ్యంగా ఉంటుంది.[11]

**వీరమ్మ పేరంటాలు ( మల్లేపల్లి) :** ఈమె గండేపల్లి మండలం మల్లేపల్లి గ్రామంలో వెలసింది. ఈ వీరమ్మ పేరంటాలు పుట్టింటికి అత్తింటికి మధ్యలో ఈ గ్రామం ఉన్నది. పూర్వం ఈ ప్రాంతమంతా అడవి ప్రాంతంగా ఉండేది. ఈ అడవి ప్రాంతంలో కాలినడకల ప్రయాణాలు సాగించేవారు. వీరమ్మ పుట్టింట ఉండగా, భర్తకు జబ్బుచేసిందని, అత్తింటి నుంచి కబురు వచ్చింది. అత్తింటికి బయలుదేరి వెళ్తుండగా, మల్లేపల్లి గ్రామం వచ్చేసరికి భర్త మరణించాడన్న వార్త తెలిసింది. వెంటనే ఆమె ఆ గ్రామంలో ఉన్న కుమ్మరింటికెళ్లి గుండ ప్రవేశానికి ఏర్పాట్లు చేయించుకొని, గుండంలోపడి మరణించింది. ఆ కుమ్మరతనికి కలలో కనిపించి, తనకు గుడి కట్టించి పూజించమని చెప్పింది. ఆవిధంగానే చేశారు. ఇప్పటికీ ఈవీరమ్మ పేరంటాలు గుడిపెత్తనం ఈ కుమ్మరి వారిదే.

**వీరమ్మ పేరంటాలు (రాజోలు) :** ఈమె రాజోలు గ్రామంలో నున్నది. ఈమె గొల్లయువతి భర్తతో సహగమనం చేసి, పేరంటాలుగా వెలసింది[13]

**బుచ్చమ్మ పేరంటాలు :** ఈమె తొండంగి మండలం, కొత్తపల్లి గ్రామంలో వెలసింది. ఈమె హరిజన కులస్థురాలు. నక్కావారి అమ్మాయి. ఈమెకు చిన్నతనంలోనే పెళ్లిచేయటం వల్ల పుట్టింటిలోనే ఉండేది. భర్తకాపులింటిలో పాలేరుగా పనిచేసేవాడు. అతడు పాముకరచి మరణించాడు. ఈ వార్త చెప్పటానికి ఒక వ్యక్తి బుచ్చమ్మ పుట్టింటికి వెళ్లాడు. వెళ్లేసరికి ఈమె తాటిటెంకలతో ( చిన్న పిల్లకనుక) ఆడుకుంటుంది. ఈ వార్త విని, పెద్దవారి కంటెముందే తన భర్త ఉన్న గ్రామానికివచ్చి మున్సబు ఇంటికెళ్ళి సహగమనం చేయటానికి గుండానికి ఏర్పాట్లుచేయమన్నది. మున్సబునిరాకరిస్తాడు. ఈమె మహిమవల్ల మున్సబు కళ్ళుతిరిగి పడిపోవటం అతని దొడ్డెడు పశువులు చనిపోవడం జరుగుతుంది. ఇదంతా బుచ్చమ్మ మహిమ అని తలంచి, మున్సబు గుండానికి ఏర్పాట్లు చేయిస్తాడు. గుండంలోపడి భర్తతో సహగమనం చేసింది. కొంతకాలానికి గుండం నుంచి, పుట్టవలె పైకి లేచింది. ఆ పుట్టనే బుచ్చమ్మ పేరంటాలుగా పూజిస్తున్నారు. ప్రస్తుతం ఈమె యిక్కడ లేదని బెండపూడి దగ్గరున్న మర్రి ఊడలలో ఉంటుందని చెబుతారు.

ఈమె హరిజనుల అమ్మాయి కావటంవల్ల ఎప్పుడైనా గ్రామం అంతా కలరా... అంటువ్యాధులు వ్యాపించినా, ఈమె మహిమవల్ల హరిజన వాడలోనికి రావని హరిజనులంతా నమ్ముతారు. పూర్వం ఈ ఊరి మున్సబు ఒక స్త్రీపై అఘాయిత్యం చేశాడన్న కేసు వచ్చింది, ఈమె మహిమ వల్ల కేసుకొట్టి వేయబడిందని చెబుతారు. మున్సబు జడ్జితో మాట్లాడుతున్నప్పుడు బుచ్చమ్మ పేరంటాలు జడ్జిపై అవహించగా, అతని ఒళ్లు బరువుగా, ఉండేదట, అలాంటి సందర్భంలో కేసు కొట్టేసాడట.

ఈ అమ్మవారికి సంవత్సరానికొకసారి కాపుల్లతో వెళ్లి, నమస్కరించుకొని వస్తారు. రెండు ముంత (చిన్నకుండ)లు ఒక కావడిలో పెట్టుకొని, ఆకుండలలో చలిమిడి, వడపప్పు మొదలైనవి వేసుకొని అమ్మవారికి సమర్పిస్తారు. ఒక గ్రామంలో పేరంటాలు పండుగ జరుగుతున్నపుడు, ఆ గ్రామానికి సంబంధించిన, పొరుగూరులో చదువుకుంటున్న విద్యార్థులు, అత్తవారిళ్ల వద్ద ఉన్న ఆడపడుచులు తప్పకుండ వస్తారు[14].

**పేరంటాలమ్మ :** ఈమె కొత్తపేట మండలం వాడపాలెం గ్రామంలో ఉన్నది. ఈమె గురించి రెండు రకాలయిన కథలు విన్పిస్తున్నాయి.

వివాహం చేసుకొని వస్తుంటే, పల్లకీలో పెళ్లికూతురుకెదురుగా కూర్చున్న పేరంటాలు (పుణ్యస్త్రీ) ఇప్పుడు పేరంటాలు గుడి ఉన్నచోటకి వచ్చాక, మూత్రవిసర్జనకని, పల్లకిదిగి, దూరంగా ఉన్న చెట్టుచాటుకెళ్లి, అక్కడ అదృశ్యమయ్యిందని ఆమె పేరంటాలయ్యిందని ఒక కథనం.

పల్లాలమ్మవారు వేంచేసిన వానపల్లి గ్రామం ఇక్కడకు చాలా దగ్గర. పూర్వం సుదూర ప్రాంతాల నుంచి కూడ జనులు పల్లాలమ్మ జాతరకు వచ్చేవారు. ప్రస్తుతం పేరంటాలమ్మ గుడి ఉన్నచోట పూర్వం రకరకాల చెట్లు ఉండేవి. పల్లాలమ్మ తీర్థానికి వచ్చే జనులు ఈ చెట్లు క్రింద మకాం వేసి, వంటచేసుకొని, తిని నిద్రించేవారు. ఒకసారి ఈవిధంగానే పల్లాలమ్మ జాతరకు వచ్చిన చెంచుజాతులలో ఒక స్త్రీమీద వాళ్ల భర్త మొదలైన సమీపబంధువులకు అనుమానం వచ్చి, శీలపరీక్షార్థం ఆమెను అగ్ని ప్రవేశంచేయమన్నారు. ఆమె అగ్ని ప్రవేశంచేసి మరణించింది. ఈవిధంగా ఈమె పేరంటాలయ్యిందని మరొక కథనం[15]

**బాపనమ్మ పేరంటాలు :** ఈమె సామర్లకోట మండలం పనసపాడు గ్రామంలో ఉన్నది. ఈమె 'పలపకూరి' అనే యింటి పేరు గల వైశ్యుల అమ్మాయి. ఈమె గుండప్రవేశానికి కారణం స్పష్టంగా తెలియరాలేదు. భర్త అనారోగ్యకారణమని కొందరు, రాజు మోహించటంవల్ల అని కొందరు చెబుతారు. ఈమె గుండ ప్రవేశం చేయ ప్రయత్నించగా, పిఠాపురం మహారాజా అభ్యంతరం తెలిపాడు. అందుకు కోపించిన ఈమె ఈ గ్రామ సమీపంలో ఉన్న మామిడితోటను పచ్చగా ఉన్న దాని కంటే ఎక్కువగా కాయించేసింది. ఈవిషయం తోటమాలి వెళ్లి, రాజుతో చెప్పగా, గుండప్రవేశానికి అనుమతి లభించింది. ఈవిధంగా ఈమె గుండంలో ప్రవేశించి పేరంటాలయ్యింది. ఈమెకు గుడి కట్టించడానికి ఆయింటివారికి స్థోమతలేకుంటే, అమ్మవారే సున్నం, రాళ్లు కాయించి (సృష్టించు) కున్నది. కూలీలను పెట్టి ఆ యింటి వారు గుడికట్టించారు.

ఈ గ్రామమునందలి వైశ్యకుటుంబీకులు సంక్రాంతి రోజున సలిమిడి, వడపప్పు, ధూపదీప నైవేద్యాలతో గుడి దగ్గరకు వెళ్లి, వాటిని సమర్పిస్తారు. మిగతా రోజుల్లో మొక్కులున్నవాళ్ల మాత్రమే వెళతారు[16].

**మాలగంగ :** ఈమె గొల్లప్రోలు మండలం చేబ్రోలు గ్రామంలో నున్నది. ఈమె కాముకుని చేత చెర పట్టబడి, భర్తచేత హత్య కావింపబడి పేరంటాలైనది. కంచుగిరి పట్టణాన్ని 'చెల్లమా దేవి' అనే స్త్రీ పాలించేది. ఆమెకు కుమార్తెపుట్టి, కుమారుడు గర్భంలో ఉండగా భర్త మరణించాడు. కుమారుడు పుట్టాక, అతనికి గన్నిరాజు అని పేరు పెట్టింది. కాగా కుమార్తె పేరు అరిదేవి. కుమారిడికి రోజూ నలుగుపెట్టి, స్నానంచేయించేది. కుమారుడికి పెట్టిన నలుగును ఒక గట్టుమీద వేసేది. ఆ నలుగువేసిన చోట ఒక తుమ్మమొక్క మొలిచింది. చెల్లమాదేవి రోజూకుమారునికి పాలు, తుమ్మమొక్కకు నీరుపోసేది, పిల్లలతోపాటు తుమ్మమొక్క కూడ ఎదిగింది.

పిల్లలకు యుక్తవయస్సు వచ్చేసరికి, తుమ్మచెట్టు పెద్దవృక్షమై, అరిదేశులకు, పరిదేశులకు నీడనిచ్చేది. చెల్లమాదేవి తన పిల్లల్ని మత్స్యరాజు, సిరిదేవి అనే అన్నచెల్లెళ్లకిచ్చి వివాహం చేసింది. పెళ్లి సందడిలో తుమ్మచెట్టును మరచిపోయారు. చేబ్రోలు వాస్తవ్యులైన రైతులు ఆదారిని వెళుతూ, తుమ్మచెట్టునుచూసి అది తమకు వ్యవసాయ పనిముట్లుకు పనికొస్తుందనే ఉద్దేశంతో, నరకి పట్టుకెళ్లి పోయారు.

వివాహమయ్యాక, భార్యతో నిద్రిస్తున్న గన్నిరాజు కలలోనికెళ్లి, తుమ్మచెట్టు 'అన్నయ్యా! నన్ను మరచిపోయి, ఊరుకున్నావు. చేబ్రోలు రైతులు నిన్ను కొట్టలేక నన్ను కొట్టారు. చేబ్రోలు చెరువు గట్టుమీద పడవేశారు' అని చెప్పింది.

ఈ మాటలకు కంగారుపడిలేచి, గన్నిరాజు తల్లితోతాను చేబ్రోలు వెళ్తానని, చేబ్రోలు ఎక్కడున్నదో చెప్పమంటాడు. చెప్పడం ఇష్టంలేక తల్లి చేబ్రోలు రైతులు తనకు తమ్ములు, తన కుమారుని మామలు అవుతారని మర్మమెడుతుంది. ఏది ఏమైనా వెళ్లనిశ్చియించుకున్న గన్నిరాజు కొంతమంది యువకులైన తన స్నేహితులతో చేబ్రోలు వెళ్లి, అక్కడ చెరువు గట్టుమీద డేరాలు (గుడారాలు) వేసి, డేరాలలో మకాం వేశాడు.

రాజుదండు వచ్చిందని, గ్రామంలో ప్రజలందరూ అడవుల్లోకి, కొండల్లోకి పారిపోయారు. 'గంగ' అనే వివాహిత మాలయువతి అత్తవద్దని వారిస్తున్నా వినకుండ, భోజనానికి యింటికొచ్చే భర్తకు మంచినీళ్ళు తేవాలని, రాజు తననేమి చేస్తాడనే నిర్లక్ష్యంతో బిందెతో చెరువు గట్టుకు బయలుదేరింది. 'ఈడిగుఱ్ఱాలు గుట్టడ, ఈడి ఏనుగులు ఏటిగల' అని రాజును తిట్టుకుంటూ, చెరువులోనికి దిగింది. ఈ మాటలు విన్న గన్నిరాజు డేరాలలో నుంచి బయటకొచ్చి, గంగరూపలావణ్యాలను చూసి, మోహించి, ఆమె వెంటబడ్డాడు.

గంగ, గన్నిరాజుకి చిక్కకుండ, తన యింటిలోనికి ప్రవేశించి, తలుపులు మూసుకుంది. రాజు ఎంత వెదకినా గంగ దొరకలేదు. రాజు విసిగి, డేరాలకు మళ్లేసరికి, అప్పుడే ఇంటి తలుపులు తెరచిన గంగ కనపడింది. 'గంగా నువ్వు మాలపల్లిలో ఉండవలసిన దానవు కావు'

రాచవీధిలో ఉండవలసిన దానవు నా కూడవచ్చి, నాతో సుఖపడు అంటాడు. ఆమె ఎంత ప్రాధేయపడినా వదలడు చివరకి తలుపులు బ్రద్దలుకొట్టి, ఆమెను బలవంతంగా పల్లకి ఎక్కించి, తన కోటకు తీసుకొచ్చి, ఆమెతో చాలారోజులు గడుపుతాడు.

గంగభర్త మాలపరుడు ఇంటికి వచ్చి, తన భార్యను రాజు తీసుకెళ్లిపోయాడని దుఃఖిస్తాడు. తల్లి చెప్పగావిని, కంచుగిరి 'పట్టణం వచ్చి, సింహద్వారం కడ నిలబడి, 'గంగా ! గంగా !' అని పిలుస్తూ, రాత్రింబవళ్లు అక్కడే ఉండి దుఃఖిస్తాడు. గన్నిరాజు రాత్రింబవళ్లు గంగతో గదిలోనే ఉంటాడు. తలుపులు తియ్యడు.

ఇదంతా గమనించిన గన్నిరాజు అక్క అరిదేవి తన తమ్ముడు మరదలిని ఏలుకోకపోతే తన భర్త తన్నుఏలుకోడనే ఉద్దేశంతో, మామిడిపళ్లలో మరలు మందు ( మనసు విరిచేమందు) బెట్టి, కిటికీగుండా గన్నిరాజుకి తగిలేటట్లు గదిలోనికి విసిరింది. ఈ పళ్లు గన్నిరాజు చాతిమీదపడి, మందు శరీరంలోనికెక్కి, మనసుమారి, అప్పటి వరకు గంగ మీదున్న ప్రేమ (మోజు) పోయి, ఆమెను బయటకు తోసేసాడు. గంగభర్త గంగను తీసుకొని యింటికి బయలుదేరాడు. దారిలో అనరాని మాటలు అని, గంగ మనస్సు నొప్పించాడు. కొంతదూరం వచ్చాక తన దగ్గరున్న కత్తితో గంగను చంపేసాడు. ఆరాత్రి గన్నిరాజు కలలో కెళ్లి, గంగ తనకు జరిగిన అన్యాయం గురించి, తన భర్త తన్ను చంపినందుకు నిందిస్తుంది. గన్నిరాజు కంగారుపడి లేచి, తన పరివారంతో గంగ శవం ఉన్నచోటకి వచ్చి, శవాన్ని ఒడిలో వేసుకొని దుఃఖిస్తాడు. పల్లకీలో ఆమె శవాన్ని వేసి, చేబ్రోలు తీసుకెళ్లి, చెరువు గట్టున ఉన్న తుమ్మచెట్టు కలపతో గుండం ఏర్పాటు చేయించి, శవానికి కొత్తబట్టలు కట్టించి, తన చేతులతో గుండంలో వేస్తాడు. గంగ కాలిపోయి, బూడిదలో నుంచి, బంగారు బొమ్మై పైకొచ్చి, తన అందాన్ని లోకానికంతటకీ పంచింది. ఆ చెరువు గట్టుమీద పేరంటాలై నిలిచింది.

ఈమెకు గుడిలేదు. ఈమె విగ్రహానికి ఆగ్రామస్థులు, పాదచారులు పసుపు, కుంకుమ, పళ్లు సమర్పిస్తారు. సంబరాలు, జాతరలు ఎక్కువగా చేయరు[17].

రాజులు, దొరలు మొదలైన అగ్రవర్ణాలవారు, మాలమాదిగవంటి నిమ్నవర్ణాలవారిపై, ముఖ్యంగా స్త్రీలపై అఘాయిత్యాలు, దౌర్జన్యాలుచేసే కాలంనాటిది యీ కథ అనవచ్చును. కాముకుని దౌర్జన్యానికి బలియైన వివాహిత స్త్రీకథే ఈ మాలగంగ కథ.

ఈ కథలో చేబ్రోలు వాస్తవ్యులచే నరకబడిన తుమ్మచెట్టు, గన్నిరాజు కలలో కొచ్చి, తాను నరకబడినట్లు చెప్పడంవల్ల, అకాల మరణం చెందిన వృక్షాల ఆత్మలుకూడ తమ సన్నిహితుల కలలో కనిపించి, తమ గోడు వెళ్లబుచ్చుకుంటాయని జానపదులు భావించినట్లు చెప్పవుచ్చును.

**సత్తెమ్మ :** ఈమె గొల్లప్రోలు మండలం చేబ్రోలు గ్రామ సరిహద్దులో ఉన్నది. ఈమె ఒక కాపుస్త్రీ. ఎక్కువనియమనిష్టలతో పూజాపునస్కారాలు చేస్తూండేది. ఈమెను కొందరు దుర్మార్గులు బలాత్కరించబోగా, వారికి చిక్కకుండ ఆకాశంలోకి మాయమై పోయింది. సత్తెమ్మ తల్లిగా ఈమెను ఈ గ్రామంలో నిలిపి పూజిస్తున్నారు. ఈమె కాకినాడ – కత్తిపూడి జిల్లా రహదారి ప్రక్కన



దేవతకు చీర, రవిక, సమర్పిస్తూ అంగడి గుడిచుట్టూ తిరుగుచున్న పుట్టింటివారు



దేవతను దిగేబెట్టేరోజున గుడి ముందు ఉంచిన కలశం, చుట్టూ మూగిన గ్రామస్థులు, ఆసాదివాని నోటికందించుటకు కోడిపిల్లతో సిద్ధంగా ఉన్న గ్రామస్థుడు



లింగాల పేరంటాలమ్మ పుట్టలు

ఉండడం వల్ల, ఆ రహదారిలో వెళ్లే వాహనచోదకులందరూ ఈమె గుడివద్ద తప్పక తమ వాహనములను నిలిపి, ఈమెకు నమస్కరించుకుంటారు[18].

**కిష్టమ్మ పేరంటాలు** : ఈమె తొండంగి మండలం కొత్తపల్లి గ్రామంలో పొలాల్లో వెలసింది. ఈమె బ్రాహ్మణస్త్రీ. ఈమె నూతికి మంచినీళ్లకు వెళ్లి వస్తూంటే, ఒక మాదిగవాడు బలాత్కరించబోయాడు. శీలసంరక్షణ కోసం ఈమె ఆత్మహత్య చేసుకొని, ఆ ప్రదేశంలోనే పేరంటాలుగా వెలసింది. వర్షాలు కురిపించటంలో ఈమె మహిమ కనపడుతుందని గ్రామస్థుల నమ్మకం. వర్షాకాలంలో సకాలంలో వర్షాలు కురవక, బాధపడుతున్నప్పుడు స్త్రీలు బోనాలు (చలిమిడి, వడపప్పు వేసిన చిన్న కుండలు)తలలపై పెట్టుకొని, ఈ అమ్మవారి దగ్గరకెళతారు. ఈవిధంగా ఎండలో వెళ్లినవారు వర్షంలో తడిసి (అమ్మవారి మహిమవల్ల) వస్తారని చెబుతారు[19]

**చెల్లమ్మ పేరంటాలు** : ఈమె తొండంగి మండలం బెండపూడి గ్రామంలో ఉన్నది. బెండపూడి పరిసరప్రాంతాన్ని పాలించిన ఓరుగంటిరాజు రాఘవరాజు పైకి దండెత్తివచ్చిన జగపతి, గజపతి, రాజులకు కోట ప్రవేశమార్గం తెలియక చాలాబాధ పడ్డారు. బెండపూడి గ్రామంలో ఉండే చెల్లమ్మ అనే గొల్లస్త్రీ రాఘవరాజుకు పాలు పోసేది. ఈమెకు డబ్బులు సరిగా ఇవ్వకుండా రాఘవరాజు బాధపెట్టేవాడు. ఆ కోపంకొద్దీ చెల్లమ్మ శత్రురాజులైన, జగపతులకు గజపతులకు కోటలో ఉన్న కాకతమ్మగుడి ప్రక్కనున్న రహస్య మార్గం గురించి చెప్పింది. ఈవిధంగా కోటకు గల రహస్య ప్రవేశమార్గం గురించి చెప్పి, తన ముప్పుకు కారణమైన చెల్లమ్మను రాఘవరాజు కత్తితో నరికాడు. ఈమె పేరంటాలు అయ్యిందని ఈ గ్రామస్థులు పూజిస్తున్నారు. ఈమెకు ప్రత్యేకంగా సంబరం చేయరు. కాకతమ్మ సంబరం రోజున కాకతమ్మ గరగలు ఈమె విగ్రహం చుట్టూ తిరుగుతాయి[20].

**కన్నమ్మ** : ఈమె రాజమండ్రిలో వెలసింది. ఈమె గుడిరాజమండ్రి రైల్వేస్టేషను కెదురుగా ఉన్నది. ఈమె తూర్పు (గోదావరి జిల్లావాళ్ళ విశాఖ, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలను తూర్పు అంటారు) నుంచి అయిదు రాత్రుళ్ళు, అయిదు పగళ్ళు నడిచి వచ్చింది. అప్పటికింకా రైలు మార్గం వేయలేదు. ఈమె భర్త రాజమండ్రిలో అయిదుబళ్ల జంక్షన్ వద్ద మూటలుమోసేవాడు. ఆ విధంగా వచ్చిన డబ్బులతో గడవక, భార్యాభర్తలిద్దరూ, సూదికొండ (రాజమండ్రికి సమీపంలో ఉన్నది)కు వెళ్లి, భర్త కావడితోనూ, భార్య మోపుతోనూ, గడ్డితెచ్చి, అమ్మి, ఆ డబ్బులతో జీవించేవారు. వాళ్లకు కుమారుడు కూడ కలిగాడు. ఒకరోజు కన్నమ్మ రైల్వేస్టేషనుకు సమీపంలో లేడీస్ హస్పటల్ దగ్గరున్న బజారుకు సరుకులు కోసం వెళ్లింది. లేడీస్ హాస్పటల్ దగ్గరకు వెళ్లేసరికి, నూకాలమ్మవారి గరగలు ఎదురుగా వస్తున్నాయి. అంత నూకాలమ్మ కన్నమ్మమీద పూని, నేను నీ జీవనం తీసుకుంటాను. తర్వాత నాలో కలుపుకుంటాను అని చెప్పింది. ఇంటికెళ్లి పడుకోమన్నది. నూకాలమ్మ చెప్పినట్టే కన్నమ్మ యింటికొచ్చి పడుకున్నది. ఆమె కుమారుడు తల్లిమీద పడి పాలకోసం ఏడుస్తున్నాడు. ఇరుగు పొరుగువారు వచ్చి, పిల్లవాడు ఏడుస్తున్నాడని భర్తతో చెబుతారు. భర్త కన్నమ్మను లేపుతాడు. ఆమె ఎంతకీ కదలకపోయేసరికి మరణించిందని భావిస్తారు.

స్మశానానికి తీసుకెళ్లటానికి, కట్టెకట్టబోతే, (ఆమె మహిమవల్ల) కట్లు విడిపోయాయి. ఎంత ప్రయత్నించినా కట్టడానికి వీలుపడదు. చివరకు శవాన్ని చేతులతో మోసుకెళ్లి, లోతుగా గొయ్యితీసి, పాతిపెట్టారు. నూకాలమ్మ చెప్పినట్టుగానే, మూడు రోజులు గడిచాక, కన్నమ్మ జీవనంవచ్చి శవంలో ప్రవేశించింది. మట్టితో కప్పబడ్డ శవం కదిలింది. బయటకు వద్దామని ప్రయత్నించింది. ఆదారినపోయే గొల్లవానిని పిలిచి, పాతిపెట్టిన మట్టితీయమని అడిగింది. నువ్వు దయ్యానివయ్యావు. మట్టితీస్తే, నన్ను చంపేస్తావు అని అతడు భయపడి పారిపోయాడు. అంత అతనిని, అతని గొర్రెల్నికూడ రాళ్లుగా మార్చేసింది.

ఈమె తన బంధువులకు కలలో కనిపించి, తన గురించి చెప్పింది. వాళ్లు రైల్వే స్టేషను వద్ద గుడి కట్టించి పూజిస్తున్నారు. ఈమె కథ రైలుమార్గం వేయటానికి ముందు జరిగింది. రైలు మార్గం వేసాక, రైల్వేస్టేషను కట్టే సమయంలో, అడ్డు వచ్చినందువల్ల, అమ్మవారి గుడిని తీయించటానికి ప్రయత్నిస్తే, ఒక బ్రిటిషుదొర మరణించాడు. మరికొందరు దొరలు గుడి పడగొట్టడానికి ప్రయత్నించగా, వాళ్లకు కలలో కనిపించి, చావు తప్పదని హెచ్చరించింది. ఇప్పటికీ అమ్మవారి పాతగుడి, రైల్వేస్టేషన్ ఆవరణలోనే ఉన్నది. ఒకప్పుడు అమ్మవారి పాతగుడి దగ్గరే ఇళ్లు ఉండేవి. రైల్వేషను కట్టాక, ఇళ్లు రైల్వేస్టేషన్ నుండి, ధవళేశ్వరం వెళ్లేమార్గంలో వెలసాయి. ఇప్పుడు రైల్వేస్టేషను ఎదురుగానే కన్నమ్మ పేరంటాలు గుడి ఉన్నది. అమ్మవారి గుడిలో పెద్దవిగ్రహం నూకాలమ్మది. చిన్న విగ్రహం కన్నమ్మది. ఇంకా చిన్నవిగ్రహాలు ఆమె పిల్లలవి. కన్నమ్మ మరణించాక ఆమె భర్త పిల్లల్ని ఎవరికో అమ్మబోతుంటే, భర్తను భూమిలోకి తొక్కేసి, పిల్లల్ని తనలో కలుపుకుంది. అమ్మవారి గుడికెదురుగా పోతురాజు విగ్రహమున్నది. పోతురాజు విగ్రహానికి పక్కగా విఘ్నేశ్వరుని విగ్రహంకూడ ఉన్నది. ఈమె చాలా మహిమగల తల్లిగా బావిస్తారు. ఈమె ప్రధాన రహదారి (మెయిన్ రోడ్) పక్కనున్నందున, పాదచారు లెవ్వరూ ఈమెకు నమస్కరించకుండా వెళ్లరు[21]

గ్రామదేవతచే ఆవహింపబడి, అకాల మరణం చెందిన పుణ్యస్త్రీ కథే కన్నమ్మ పేరంటాలు కథ.

**జగ్గమ్మ :** ఈమె రాజోలు గ్రామంలో ఉన్నది. ఈమె వెలమ కులస్థురాలు. అకాల మరణంచెంది, పేరంటాలుగా వెలసింది. ఈమె గుడిలో ఈమెకు విగ్రహానికి బదులు గంటలతోకూడిన పాలవెల్లి ఉండేది. నూతన వధూవరులు ఈమెను పూజించినపుడు పాలవెల్లి గంటలు వాటికవే మ్రోగేవి. ఈవిధంగా మ్రోగడం అమ్మవారు దీవించినట్లుగా భావించేవారు. అమ్మవారి గుడికెదురుగా ఉండే తాటి చెట్టును ఎవరైనా తాకితే, అమ్మవారి మహిమవల్ల దానినుండి రక్తం చిందేది. గాలివానకు ఆతాడి చెట్టుపడిపోవడంతో, అమ్మవారి మహిమ తగ్గి, పాలవెల్లి గంటలు మ్రోగడం మానేశాయని ప్రజల నమ్మకం[22]

నేను విషయ సేకరణనిమిత్తం వెళ్లినపుడు గుడిలో పాలవెల్లి మాత్రం ఉన్నది. దానికి గంటలు లేవు.

**మాలకొండమ్మ :** ఈమె రాజవొమ్మంగి మండలం, రాజవొమ్మంగి గ్రామంలో వెలసింది. ఈమె పుట్టుక గురించి తెలియరావడంలేదు. ఈమె మహిమల గురించి కొన్ని కథలు చెబుతారు.

ఈమెకు గుడిలేదు. ఈమె విగ్రహం కొండవారనున్నది. ఈమె సంబరం సమయంలో ఈమె ఉండేచోటున కొంతభూమి గరగల ఆకారంలో పైకి లేచేదట. ఈవిధంగా లేవడం అమ్మవారి మహిమగా భావిస్తారు. ఈ అమ్మవారి సంబరానికి సంబంధించి, ఒక నమ్మకం ఉన్నది. ఒక హరిజన బాలికను ఉపవాసం ఉంచి, సంబరం రోజున ఆమెచేత మాలకొండమ్మ ఉండేచోట పాలుపొంగిస్తారు. ఆ పాలు ఎటువైపుకి పొంగితే, అటువైపు వర్షాలు బాగా కురుస్తాయని నమ్ముతారు. సంబరం రోజు ఈమెకు గ్రామ సర్పంచ్ ఇంటినుంచి చీర, రవిక, మంగళసూత్రం మొదలయినవి పంపిస్తారు. వైశాఖమాసంలో ఈమె సంబరం చేస్తారు[23]

**గుండాల పేరంటాలమ్మ :** ఈమె కొత్తపల్లి మండలం కొండవరం గ్రామ్ పొలాల్లో ఉన్నది. ఒకస్త్రీ ఈ పొలాల్లోకి పుల్లలు ఏరుకోవటానికి వచ్చి, మామిడి చెట్టెక్కి అక్కడనుంచి పడి మరణించింది. ఈమె పేరంటాలయ్యిందని, ఆ చెట్టు మొదట ఒక రాయిని నిలిపి, పూజిస్తున్నారు.

**పేరంటాలమ్మ :** ఈమె పిఠాపురం మండలం కుమారపురం గ్రామంలో ఉన్నది. ఈమె ఒక హరిజన స్త్రీ. ప్రమాదవశాత్తు ఎడ్లబండికింద పడి మరణించింది. ఈమె ఎడ్లబండికింద పడినచోటు నుంచి, కొంతదూరం వరకూ ఆ బండి చేత ఈడ్చుకరాబడి, రోడ్డు మీద ఆమె శవం వదలి వేయబడింది. ఆ శవం వదలి వేయబడిన చోట, ఆమెతండ్రి స్త్రీ రూపం చెక్కబడినట్లున్న రాయిని నిలిపి, తన కుమార్తె పేరంటాలయ్యిందని, పూజించడం మొదలు పెట్టాడు. అతనితోపాటు గ్రామస్థులు కూడ పూజిస్తున్నారు[25]

వివిధ పేరంటాళ్ల కథలను పరిశీలిస్తే, కారణమేదయినా, అకాలమరణం పొందిన స్త్రీల ఆత్మలు ఏదోఒక రూపంలో ఈభూమిపై శాశ్వతంగా ఉంటాయని భావించిన గ్రామీణులు వాటికి దైవత్వాన్ని ఆరోపించి, పూజిస్తున్నారని విశదమగుచున్నది.

పేరంటాళ్ల కథలను పరిశీలిస్తే, కొన్ని కథాంశములు కన్పిస్తాయి. ఈ కథలలో పేరంటాలు (లక్ష్మమ్మ) పుట్టుకతోనే పుట్టింటివారికి సిరిసంపదలు అధికమగును. పెళ్లయ్యాక పేరంటాలు రాకతో మెట్టినింటివారికి కూడ సంపద పెరుగును. పేరంటాలు (కావమ్మ) చిన్నవయస్సులోనే తల్లిదండ్రులను కోల్పోవును పేరంటాలి మరణానికి ప్రత్యక్ష పరోక్షాలుగా కారణభూతలైనవారు కష్టాలు పాలవుదురు.

పేరంటాళ్లలో కొందరు (కావమ్మ, పాపమ్మ) ఉత్సవములు జరిపించుకొనుచుండగా, కొందరు (మాలగంగ) కథాగత పాత్రలే కాని వారికి గుడులుకాని, పూజలుకాని లేవు. పేరంటాళ్ల కథలన్నీ, సత్యకథనాలనీ, వారు దైవాంశ సంభూతులని జానపదుల నమ్మకం.

**గ్రామదేవతలు - పేరంటాళ్లు :** వివిధ గ్రామదేవతల, పేరంటాళ్ల కథలను పరిశీలించిన పిమ్మట గ్రామదేవతలకు, పేరంటాళ్లకు ప్రజల గుర్తింపులో తప్ప పెద్దగా తేడా లేదనవచ్చును. మారెమ్మ, నేరేళ్లమ్మ, అరులమ్మ, ఇటికాలమ్మ, ఒనుములమ్మ, గొంపమ్మ, గడిబాపనమ్మ మొదలైన గ్రామదేవతలు కామమ్మ, పాపమ్మ, వీరమ్మ, జగ్గమ్మ, బుచ్చమ్మ, లింగాలమ్మ మొదలైన పేరంటాళ్లు కూడ అకాల మరణం చెందినవారే. అకాలమరణం పొందిన స్త్రీ గ్రామదేవత లేక పేరంటాలుగా

గుర్తింపబడడానికి పరిస్థితులేకారణం. ఒక ప్రాంతంలో ఒక దేవత ప్రముఖంగా ప్రజలచేత పూజింపబడుతున్నప్పుడు, తర్వాత కాలంలో అకాలమరణం పొందిన స్త్రీ ఆ ప్రాంతంలో పేరంటాలుగా గుర్తింపబడి, పూజింపబడుతుందవచ్చును.

ఒక ప్రాంతంలో ప్రముఖంగా ఏ దేవతా పూజింపబడనప్పుడు ఎవరైన స్త్రీ అకాల మరణం పొందితే ఆమె గ్రామదేవతగా గుర్తింపబడి పూజింపబడుతున్నదనవచ్చును. ఉదాహరణకు గంగవరం మండలం రాజవరం గ్రామంలో ఆరులమ్మ దేవత తప్ప ఏ యితర పేరంటాలులేదు. ఆ గ్రామం కొత్తగా ఏర్పడిన కొద్ది కాలానికి, పుట్టి అకాలమరణం పొందిన ఆరులమ్మ తన తల్లిదండ్రులకు కలలో కన్పించి తాను దైవత్వం పొందానని చెప్పడం వల్ల, ఆమె గ్రామదేవతయై పూజింపబడుచున్నది. ఆమె పుట్టేటప్పటికే ఆ గ్రామంలో ఎవరైనా దేవత పూజింపబడుచున్నట్లయితే, ఆమె పేరంటాలుగా గుర్తింపబడి ఉండేది. ఈ విధంగా ప్రజల గుర్తింపులోనూ, పూజావిధానంలోనూ కొద్దిపాటి తేడా తప్ప కొద్దిపాటి తేడా తప్ప పుట్టుకలో గ్రామదేవతలకు, పేరంటాళ్లకు తేడా లేదనవచ్చు. 'గ్రామదేవతలలో అసంఖ్యాకములైన దేవతలు మొదట పేరంటాండ్రే'[26].

సుబ్రహ్మణ్యస్వామి : సాధారణంగా అకాలమరణం చెందిన స్త్రీలే పేరంటాళ్లుగా గుర్తింపబడి, ప్రజల చేత దైవత్వాన్ని ఆరోపింపబడి పూజింపబడడం జరుగుతుంది. కాని యీ జిల్లాలో అకాల మరణం చెందినపురుషుణ్ణికూడ దైవంగా భావించి పూజించడం కనిపించింది. దీనికి ఉదాహరణ సామర్లకోట మండలం పనసపాడు గ్రామంలో ఉన్నది. ఈ గ్రామం నందలి వైశ్యయువకుడు తాటిచెట్టెక్కి, అక్కడినుంచి పడి మరణించాడు. తన సన్నిహితులకు కలలో కన్పించి, తాను సుబ్రహ్మణ్యస్వామినయ్యానని, గుడి కట్టించి పూజించమని చెప్పాడు. ఆ విధంగానే గుడికట్టించి పూజిస్తున్నారు. ప్రతి సంవత్సరం సుబ్రహ్మణ్య షష్ఠికి ఈయనకు ప్రబల సంబరం చేయిస్తారు[27].

లింగాల పేరంటాలమ్మ, కొరుప్రోలు మల్లవరం పేరంటాలమ్మ, సుబ్రహ్మణ్యస్వామి మొదలైనవారి కథలవల్ల అకాలమరణం పొందిన స్త్రీ పురుషుల ఆత్మలు సర్పరూపంలో పుట్టలలో ఈభూమిపై శాశ్వతంగా ఉంటాయని జానపదులు భావించినట్లు చెప్పవచ్చును.

---"men and women, boys and girls who have died violent or untimely deaths or who have been notorious for their power or even their crimes, are freequently worshipped after death"[28].

## అథస్సూచికలు

1. రేవు పకీరు – పిఠాపురం – తూర్పు గోదావరి జిల్లా.
2. తెలుగు జానపద సాహిత్యము – పురాగాథలు, రావిప్రేమలత, 1983 – పుట 240.
3. సుకపట్లనల్లారావు – సామర్లకోట – తూర్పు గోదావరి జిల్లా.
4. కామమ్మ కథ – సి.వి. కృష్ణా బుక్ డిపో – మద్రాసు – 1974.
5. -పైది-



కావమ్మ గుడిలో ఉన్న కావమ్మ, మారయ్యల విగ్రహాలు



మ్మ పేరంటాలి పాలవెల్లి



కన్నమ్మ పేరంటాలు

కుమారపురం గ్రామంలో ఉన్న పేరంటాలమ్మ విగ్రహం



కొప్పవరం గ్రామంలో సత్తె
గదిలో ఉన్న సత్తెమ్మ విగ్రహం



సత్తెవ్మ సంబరంలో కథలు
పాడుతున్న పంబలవారు మరియు
స్త్రీ వేషం వేసిన పంబలవాడు



సత్తెవ్మ సంబరంలో వేసే పద్మ
(ద్మ)ం. ప్రక్కన కల్లుకుండలు,
గుగ్గీలు మొదలైనవి.

6. కిన్నెర - మాసపత్రిక - డిసెంబరు - 1953.

7. సుకపల్ల నల్లారావు - సామర్లకోట - తూర్పు గోదావరి జిల్లా.

8. తెలుగు జానపద గేయ సాహిత్యము - 1958 - పుట 614-616.

9. నూకాలమ్మ - తాటిపాక జగన్నాధపురం గ్రామం - కోటనందూరు మండలం.

10. Census of India; Fairs & Festivals, East Godavari, 1961. p. 256.

11. బళ్లనూకరాజు - కె.ఇ. చిన్నాయి పాలె గ్రామం - కోటనందూరు మండలం.

12. మొల్లేటి సత్యన్నారాయణ మల్లేపల్లి గ్రామం - గండేపల్లి మండలం.

13. Census of India; Fairs & Festivals, East Godavari, 1961, p.61

14. చిట్టిమూరి ఆదమ్మ - కొత్తపల్లి గ్రామం - తొండంగి మండలం.

15. బండారు గంగయ్య - వాడపాలెం గ్రామం - కొత్తపేట మండలం.

16. పలపకూరి అచ్చిరాజు - పనసపాడు గ్రామం - సామర్లకోట మండలం.

17. రేవు యముడమ్మ - చేబ్రోలు గ్రామం - గొల్లప్రోలు మండలం.

18. -పైది-

19. బండి తుక్కయ్య - కొత్తపల్లిగ్రామం - తొండంగి మండలం.

20. గొవుశెట్టి బాపిరాజు - బెండపూడి - తొండంగి మండలం.

21. పిలకా కన్నమ్మ - రైల్వేస్టేషన్ దగ్గర - రాజమండ్రి.

22. Census of India, Fairs & Festivals, East Godavari. 1961, p.61

23. చీడిపల్లి తూతయ్య - రాజవొమ్మంగి - తూర్పుగోదావరి జిల్లా.

24. దొడ్డి కృష్ణమూర్తి - కుమారపురం గ్రామం - పిఠాపురం మండలం.

25. వర్రి రమణ - కుమారపురం గ్రామం - పిఠాపురం మండలం.

26. తెలుగు జానపద సాహిత్యము - పురాగాథలు - రావిప్రేమలత - 1983 - పుట 249.

27. పలపకూరి అచ్చిరాజు - పనసపాడుగ్రామం - సామర్లకోట మండలం.

28. Village Gods of South India. W.H. White Head, 1921. p.20.

## అష్టమ ప్రకరణం

# పంబలవారు - సత్తెమ్మ సంబరం

''పంబలవాడు వస్తేకాని అంబపలకదు'' అనే సామెత పంబలవానికి గ్రామదేవతకు ఉన్న సంబంధాన్ని తెలియచేస్తున్నది. గ్రామదేవతల కథలు పాడుతూ సత్తెమ్మ (ఇంటి దేవత) సంబరాలు చేయించే హరిజన కులస్థులే ప్బలవారు. కథలు పాడేటప్పుడు వీరు ఉపయోగించే వాద్య విశేషాన్నిబట్టి వీరికి ఆ పేరు వచ్చింది. 'పంబజోడు' లేక 'పంబ (మ్మ) నాదం' అనే వాద్యాన్ని వాయిస్తారు. కాబట్టి వీరు పంబల వారయ్యారు. వీరు వాయించే వాద్య విశేషాన్ని బట్టి ఇతర ప్రాంతాలలో వీరిని 'బవనీలు' 'బైండ్లవారు' అని కూడ పిలుస్తారు.

తూర్పు గోదావరి జిల్లాలో మెట్ట ప్రాంతంలోనూ, డెల్టా ప్రాంతంలోనూ కూడ పంబలవారున్నారు. మెట్ట ప్రాంతంలో పిఠాపురం, రాపర్తి, కట్టమూరు, బలబధ్రపురం మొదలైన గ్రామాల్లోనూ, డెల్టే ప్రాంతంలో అమలాపురానికి సమీపానున్న మాగాం, క్రాప, మొదలైన గ్రామాల్లోనూ వీరు నివసిస్తున్నారు. ఈ రెండు ప్రాంతాల పంబలవారు పాడేకథలలోనూ, చేయించే సంబరాలలోనూ తేడాలు ఉన్నాయి.

గ్రామదేవతలవలె ఇంటి దేవతలు కూడ ఉన్నారు. ఇంటి దేవతగా ఎక్కువగా సత్తెమ్మ లేక సత్తెమ్మ తల్లి కనిపిస్తుంది. కొందరికి ప్రత్యేకమైన పేర్లతో కూడ ఇంటి దేవతలున్నారు. ఉదా : కడియం గ్రామంలో 'జగతా' వారి యింటి దేవత పద్దాలమ్మ. ఈమె సంబరం కూడ సత్తెమ్మ సంబరంవలె చేస్తారు. 'శక్తి' కి వికృతి సత్తి. సత్తి + అమ్మ = సత్తెమ్మ. ఆదిశక్తినే తమ ఇంటి ఇలవేల్పుగా కొలుస్తున్నారనవచ్చును.

సత్తెమ్మ కొలుపులున్నవారిని 'సత్తెమ్మ ఎలా వెలసింది?' అని అడిగితే, తరతరాల నుంచి తమ పూర్వీకులు పూజిస్తున్నారని, వారి ననుసరించి తామూ పూజిస్తున్నామని చెబుతారు. కపిలేశ్వరపురం మండలం టేకి గ్రామంలో 'గన్ని' వారి యింటి దేవత 'మజ్జానపమోరు' ఈమె గురించి వీరు ఒక కథ చెబుతారు. గన్నివారు గోదావరి పుష్కరాల స్నానానికెళ్లి స్నానం చేస్తుండగా నీటిలో ఒక కుండ స్నానంచేసేవారి దగ్గరే తిరుగుతుంది. అందులో చిన్నచిన్న బొమ్మలున్నాయి. ఆ బొమ్మలున్న కుండను ఇంటికి తెచ్చారు. తర్వాత కపిలేశ్వరపురంలోనున్న గన్నివారి వ్యక్తిమీద పూని, తాను 'మజ్జానపమ్మోరు' నని తనను పూజించమని చెప్పింది. అప్పటినుంచి పూజిస్తున్నారు. 'మజ్జాన్నం' అంటే స్నానం. స్నానంచేసేటప్పుడు దొరికిన దేవత కాబట్టి ఈవిడకు 'మజ్జానపమ్మోరు' అని పేరు వచ్చి ఉండవచ్చు. కపిలేశ్వరపురంలో నున్న 'గన్ని' వారు పేదవారయినందున, టేకి గ్రామంలోనున్న 'గన్ని' వార్లు ఈ అమ్మవారి సంబరంచేయిస్తున్నారు. ఈ అమ్మవారి సంబరానికి 70వేల రూపాయల వరకు ఖర్చు చేస్తారని చెబుతారు.

కపిలేశ్వరపురం మండలం మాచర గ్రామదేవత మాచరమ్మ. ఈమె ఇంటి దేవత మరియు గ్రామదేవతకూడా. ఈమెకు ఏటా పంబలవారి చేత సంబరం చేయిస్తారు.

చాలా గ్రామాల్లో సత్తెమ్మకు గుళ్ళు ఉన్నాయి. అయిన విల్లి మండలం 'మాగాం' గ్రామంలో పంబలవారి ఇంటి ఆవరణలోనే గుడి ఉన్నది. కొన్ని గ్రామాల్లో సత్తెమ్మకు ప్రత్యేకమైన గుడులుండవు. కొలుపులున్నవారు తమ ఇంటిలో ఒక గదిని సత్తెమ్మగదిగా వదిలేస్తారు. ఆ గదిలోనికెవ్వరూ వెళ్లరు. సత్తెమ్మకు నైవేద్యం చెల్లించటానికి ఇంటి పెద్ద ఎవరొకరు ఉదయాన్నే వెళ్లి, నైవేద్యం చెల్లిస్తారు. 'అత్తెసరుఅన్నం' కాని, పప్పుఅన్నంకాని ప్రతిరోజు ఉదయం వండి, ముందుగా సత్తెమ్మకు నైవేద్యం చెల్లిస్తారు.

సత్తెమ్మకు కొన్ని చోట్ల విగ్రహాలున్నాయి. ఉదా : అనపర్తి మండలం కొప్పవరం గ్రామంలో సత్తెమ్మకు విగ్రహం ఉన్నది. కొన్నిచోట్ల కుండనే సత్తెమ్మగా భావిస్తారు. ఈ కుండను 'శూలపుకడవ' అని కూడ అంటారు. కొన్నిచోట్ల కొబ్బరి, వేప, తాడి మొదలైన చెట్లను 'సత్తెమ్మ' గా భావిస్తారు. 'కరప' గ్రామంలో ఇంటిలో ఒక మూల పాతిన రాటనే సత్తెమ్మగా భావిస్తున్నారు. పిఠాపురం మండలం జల్లూరు గ్రామంలో గదిలో గోడకు పసుపు పూసి, కుంకుమబొట్లు పెట్టి, ఇంటిదేవత దేవరమ్మగా పూజిస్తున్నారు. 'సత్తెమ్మలంక' అనే గ్రామం కూడ కొత్తపేట మండలంలో ఉన్నది.

కొత్తధాన్యంవచ్చిన సందర్భంలో పంబలవారు మామూళ్ళ వసూలు చేసుకోవటానికి వెళతారు. సత్తెమ్మ కొలుపులున్న వ్యక్తులు, పంబలవారు పంబనాథం వాయిస్తుండగా, పసుపు, కుంకుమలను పంబనాదంపై ఉంచి, ధాన్యం పంబలవారికిస్తారు. వరికుప్ప నూర్చినపుడు 'సత్తెమ్మధాన్యం' అని కొంత ధాన్యంతీసి, జాగ్రత్తచేసి, పంబలవారు వచ్చినపుడు ఇస్తారు. ఈవిధమైన సంప్రదాయం ఎక్కువగా డెల్టా ప్రాంతంలో ఉన్నది.

ఉగాది రోజున సత్తెమ్మ కొలుపులున్నవారు పంబలవారిని తీసుకెళ్లి, సత్తెమ్మ మేలుకొలుపు పాడించుకుంటారు. పాడినందుకు పంబలవానికి ధాన్యం ఇస్తారు.

**'ఆనందమే ఆనందమే - ఆనందమమ్మా వైబాగ్గెమా**

**నిను గొలిశానా ! నిను గొలిశానా ! నిను గొలిశానమ్మా ! నీకు మొక్కెవా**

**రాజు గొలిశనూ రంగమాడెను - రాజు గొలిశనూ రంగమాడెను'**

ఈవిధంగా సాగే సత్తెమ్మ మేలుకొలుపు పాటలో ఆమె స్వభావం, ధూపదీపనైవేద్యాలు మొదలైనవన్నీ వివరింపబడతాయి. కొత్తగా బండి, నాగలి మొదలైన వ్యవసాయ పనిముట్లు చేయించుకున్నవారు కూడ పంబలవాళ్లచేత సత్తెమ్మ మేలుకొలుపు పాడించుకుంటారు. ఇంటికి వచ్చిన పంబలవాని కాళ్లపై నీళ్ళపోస్తారు. కాళ్లకు నమస్కారం కూడ చేస్తారు. పంబనాదంపై పసుపు ముద్ద, కుంకుమ ఉంచుతారు. గంధంకూడ చల్లుతారు. ఈ పసుపుకుంకుమలు తీసుకెళ్లి, వ్యవసాయ పనిముట్లుకి బొట్టు పెడతారు. పాలు ఇవ్వని పాడి పశువులకు కూడ ఈ పసుపు కుంకుమలు బొట్టు పెడతారు. ఈరెండు సంప్రదాయాలు మెట్ట ప్రాంతంలో ఉన్నాయి. ఈవిధమైన ఆచారాలు గ్రామదేవతలు వ్యావసాయక దేవతలు అనే విషయాన్ని స్పష్టపరుస్తున్నాయి

**పంబలవారు - సంతానానికి మందు :** పిల్లలులేనివారు సత్తెమ్మ సంబరం జరిగేచోటుకెళ్లి, సైతమ్మకు నమస్కరించుకుంటారు. పిల్లల్ని కలిగించమని వేడుకుంటారు. పిల్లలు కలగడానికి పంబలవారు మందు కూడ ఇస్తారు.

పిల్లలులేనివారు సత్తెమ్మ సంబరం కాడకు అరటిపళ్ళు, కొబ్బరికాయు, బియ్యం, మొదలైనవి పట్టుకెళతారు. పాప (సంబరం ముగింపు రోజున వర పిండితో చేసేబొమ్మ) కు ఒడిలో పోసిన బియ్యంనుంచి కొన్ని బియ్యం, అరటిపళ్ళు, కొబ్బరికాయు మొదలైనవానిని సత్తెమ్మ పాటపాడి, సత్తెమ్మను ప్రార్థించి, పిల్లలు లేనివారికిస్తారు. అరటిపళ్ళు, కొబ్బరికాయ ప్రసాదంగా తినమంటారు. ఆ బియ్యంతో అత్తెసరుకాని, పరమాన్నం కాని వండుకొని తినమంటారు. అలాతింటే పిల్లలు కలుగుతారని వారి విశ్వాసం. ఈవిధంగా పిల్లలు కలిగినవారు ఘనంగా సత్తెమ్మ సంబరం చేయించుకుంటారు. ఈ సంప్రదాయం ఈ జిల్లాలోని మెట్ట ప్రాంతంలో ఉన్నది.

డెల్టా ప్రాంతంలోని పంబలవారు తమ ఇళ్ళ దగ్గరే పాతబెల్లం, వెల్లుల్లి, వామ్ము, నువ్వులనూనె కలిపి ఉండలుగా చేస్తారు. వీటిని 'కాయపు ఉండలు' అంటారు. వీటిని సంబరాలకి పట్టుకెళతారు. ఇవి తింటే పిల్లలు లేనివాళ్ళకు పిల్లలు పుడతారని నమ్ముతారు. ఈ ఉండలు కావలసినవారు ఉపవాసాలతో సంబరాలకడకు వచ్చి, డబ్బులిచ్చి కొనుక్కుంటారు.

సత్తెమ్మ సంబరం : సత్తెమ్మ కొలుపులున్నవారు సత్తెమ్మ సంబరాలు చేయించుకుంటారు. ఈ సంబరాలను రెండు, మూడు, అయిదు సంవత్సరాలకొక్కసారి చేయించుకుంటారు. వివాహాలు జరిగినపుడు తప్పనిసరిగా ముందు సత్తెమ్మ సంబరం చేయించుకొని తర్వాత వివాహకార్యక్రమాలు ప్రారంభిస్తారు.

సత్తెమ్మ సంబరం రోజుమధ్యాహ్నం (రోజున్నర), మూడు, అయిదు, పన్నెండు రోజులుకూడ జరుగుతుంది. సాధారణంగా మూడు రోజులే జరుగుతుంది. శుక్రవారం ప్రారంభమై ఆదివారం ముగుస్తుంది. ఎన్ని రోజులు జరిగినా, చివరి రోజే ప్రధానమైనది. మగిలా రోజుల్లో పంబలవారిచేత అమ్మవారి కథలు పాడించుకుంటారు. సత్తెమ్మ సంబరం మెట్ట, డెల్టా ప్రాంతాలలో జరిగే విధానాలకు చాలా తేడా ఉన్నది.

**మెట్టప్రాంతంలో సత్తెమ్మ సంబరం :** సత్తెమ్మ సంబరం జరిగే రోజులు ముందుగానే నిర్ణయింపబడతాయి. అందుకు తగినబజానాకూడ నగదురూపంలో పంబలవారికిస్తారు. సంబరం ప్రారంభపు రోజు (శుక్రవారం) ఉదయం పంబలవారు (కనీసం ముగ్గురు) బయలుదేరి, మధ్యాహ్నానికి, సంబరం జరిగే వారింటికెళతారు. సత్తెమ్మ గుడి ముందుకాని, సంబరం చేయించుకొనేవారి యింటివాకిలిలోకాని అలికి, ముగ్గుపెట్టి శుభ్రంచేస్తారు. పంబలవారి కాళ్ళపై, నీళ్ళుపోసి, నమస్కారం కూడ చేస్తారు. వాకిలిలో పంబలనాదం పెడతారు. పసుపుముద్ద, కుంకమ పంబనాదమ్మీద పెడతారు. కోడిని కోస్తారు. ఆ యింటివారిని పంబల వ్యక్తి దీవిస్తాడు.

**దీవించవే దీవించవే - వారికి సంపదలు దీవించవే**

**దీవించు వారింట మరియేమి గలవు - సాగినా సాగినా సల్లకావుళ్ళు**

పైవిధంగా సాగే 'దీవెన పాట' లో ఇంటివారికి సంపదల నిమ్మనడమేకాక, పాడినవారికి, విన్నవారికి కూడ

**'పాడినవారికి సత్తెమ్మ - పలమూసేకూర్చవే సత్తెమ్మా !**

**ఇన్నవారికల్ల సత్తెమ్మా ఇజ్జానమియ్యమ్మా సత్తెమ్మా'**[2]

అని ఫలశ్రుతి చెప్పబడింది.

కోసిన కోడిని కమ్మగా వండి, పంబలవారికి వడ్డిస్తారు. సంబరం జరిగినన్ని రోజులు మద్యానికి కావలసిన డబ్బును పుష్కలంగా పంబలవారికిస్తారు. దీవెన అయిన తర్వాత పంబలవారు అమ్మవారి కథలు పాడుతూ సంబరం ప్రారంభిస్తారు. వారి దగ్గరున్న కథలలో వారికి నచ్చినవికాని, ఇంటివారు అడిగినవికాని పాడతారు. ఈవిధంగా సంబరం చివరిరోజు వరకు పాడతారు. సంబరం జరిగినన్నాళ్లు ఇరుగు పొరుగువారు, మ్రొక్కులున్నవారు అరటిపళ్లు, కొబ్బరికాయ, బియ్యం, కోడి మొదలైనవి తెచ్చి అమ్మవారికి సమర్పిస్తారు. మొక్కులున్నవారు బంగారం కూడ సమర్పిస్తారు. ఇవన్నీ పంబలవారు తీసుకుంటారు.

**పద్మ (ద్మ)ం :** చివరిరోజు ప్రధాన సంబరం జరుగుతుంది. సంబరం జరిగినన్నాళ్లు, ఆయా భక్తులు సమర్పించిన అరటిపళ్లు, బియ్యం మొదలైనవి పోగుగాపడినచోట లేక వాకిలిలో పద్మ (ద్మ)ం వేస్తారు. దీనిని 'పంచవన్నెల భూపద్మం' అని కూడ అంటారు. పంచవన్నెలుగా పసుపు, కుంకుమ, ముగ్గు, బొగ్గు పొడి మొదలైనవి వాడతారు. పద్మం వేయటానికి నమూనా చెక్కలను వాడతారు. సాధారణంగా పద్మాన్ని గుండ్రంగా వేస్తారు. ఈ గుండ్రం పద్మాన్ని 'గొడుగు పద్మం' అని కూడ అంటారు. కడియం గ్రామంలో జగతావారి కులదేవత పద్మాలమ్మకు మాత్రం పద్మం శక్తి ఆకారంలో వచ్చేటట్లు వేస్తారు. పద్మంలో ధాన్యంకాని బియ్యంకాని పోస్తారు.

**కుంభం - కుండ :** పద్మంలో పోసిన బియ్యం లేక ధాన్యపురాశిమీద కొత్తకుండను ఉంచుతారు. ఈ కుండకు మూడువైపుల మూడు గుడ్లుకళ్లుగా అమరుస్తారు. రెండు కల్లుకుండలు కూడ అక్కడ ఉంచుతారు. 'కుంభము' అను పేర రెండున్నర కేజీల బియ్యపు అన్నం, కుడుములు, గుగ్గిలు, తెలగపిండికూర, మునగకూర, అప్పాలు, పాలకాయలు మొదలైనవి వండుతారు. ఇంటివారు ప్రతి ఒక్కరూ వండిన వంటకాలను గుప్పెడు చొప్పున తీసి, కుండలోవేస్తారు. ఈవిధంగా వేసే కుండ కనక దీనిని 'కుంభం కుండ' అంటారు.

**పోతును నిద్రించడం :** సత్తెమ్మకు సంబరం సమయంలో పంది, మేక, లేక గొర్రెపోతులను బలియిస్తారు. పంబల వ్యక్తి సత్తెమ్మను స్మరించుకొని, మాట చెల్లించమని కోరుకొని పద్మంలో ముగ్గుతీసి, పోతుమీద చల్లి,

**'జో జో జో జో గొర్రెమ్మ ! నిన్ను జోలల్లా పాడారు గొర్రెమ్మా !**

**మానికంటేవారు గొర్రెమ్మ ! నిన్ను మూడాలకడిగారు గొర్రెమ్మా !**

**జువ్విచెట్టెక్కావు గొర్రెమ్మ ! నువ్వు జూదాలాడావు గొర్రెమ్మా !**

**రాయి సెట్టెక్కావు గొర్రెమ్మా ! నువ్వు రాగాలు పాడావు గొర్రెమ్మా !**

ఈపాటికి గొర్రెనిద్రపోతుంది. వచ్చిందోయి గొర్రె నచ్చింది

**సచ్చినా గొర్రినా తెచ్చినారా తెచ్చి మాబత్తులకీ యిచ్చినారా**

**సచ్చిందోయి గొర్రి సచ్చిందీ''.**[3]

అని గొర్రెను లేపుకోమంటారు.

సంబరం చేయించుకొనే యింటివాళ్లందరూ కలిసి లేపుతారు. ఎంత లేపినా గొర్రె లేవదు. లేపే అవకాశం పంబల వ్యక్తికి ఇస్తారు. అతడు దేవతను ప్రార్థిస్తే, పోతు లేస్తుంది. ఇంటివారు లేపినపుడు పోతు లేవకపోవడం అమ్మవారి మహిమ అని, ఆ సమయంలో అమ్మవారు అక్కడకు వస్తారని, ఆమె మహిమవల్లనే నిద్రించిన పోతు, ఎంత లేపినా లేవలేదని భావిస్తారు. ఆ క్షణంలో అప్రమత్తంగా ఉండాలనీ, అక్కడ జరిగే కష్టనష్టాలను తట్టుకోవటానికి పంబలవారు మద్యంబాగా సేవిస్తారు.

సంబరంలో ప్రముఖ పాత్ర వహించే పంబల వ్యక్తి స్త్రీ వేషం ధరిస్తాడు. ఈతడే 'కుంభం కుండ' ను ఎత్తుకుంటాడు. కన్నడ దేశమండలికరగ ఉత్సవములో కరగమునెత్తుకొనిన వ్యక్తి, మహారాష్ట్రములోని తుకాయ్ దేవతను అర్చించువారు కూడ స్త్రీ వేషమునే ధరిస్తారు. పూజారులు, మాంత్రికులు స్త్రీ వేషములను ధరించు ఆచారము ప్రపంచ పర్యాప్తముగా కన్పట్టుచున్నది. ఈ ఆచారములు, అంతరించిక పోయిన మాతృస్వామిక వ్యవస్థ యొక్క అవశేషములు కావచ్చును'[5].

పోతును పద్దం దగ్గరవేసి, తలతియ్యకుండ, కుడి ఎడమలుగా చీల్చి, స్త్రీ వేషం వేసిన పంబలవానికి జందెం వేస్తారు. ఈ రకమైన జందెం పద్దాలమ్మ సంబరానికి వేస్తారు. మాచరమ్మ కయితే పేగులు తీసేసి, వాటిలోకి గాలి ఊది వాటిని మెడలో వేసుకొని, కుండనెత్తిన పెట్టుకొని వీధి వెంబడి వెళతారు. వీధిలో ప్రతి యింటి వారు కోడినిస్తే, కోడి మెడను కొరికేస్తాడు.

వైశ్యుల సంబరానికి పోతుని వేయడం ఉండదు. పల్లెవారి (చేపల పట్టేవారి) సంబరానికి పందిని వేస్తారు. ఈ పందిని యింటిలో పద్దం దగ్గరకాక, సముద్రపొడ్డున వేస్తారు. కుండను పంబలవారు కాక యింటి యజమాని ఎత్తుకుంటాడు.

**పాప చేట :** పిండి, బెల్లం కలిపి (సలిమిడితో) ఒక బొమ్మను తయారు చేస్తారు. ఆ బొమ్మను 'పాప' అంటారు. ఆ బొమ్మను ఉంచిన చేటను 'పాపచేట' అంటారు. ఈ పాపకు స్త్రీ వలె వస్త్ర ధారణ చేయించి, కొత్తపెళ్లికి తురుకు వలె మంగళసూత్రం, కాళ్లకుచుట్లు, పిల్లేళ్ల కూడ అమర్చుతారు. పాపచేటలో మానెడు సోలడు బియ్యం, కొబ్బరిబొండాం మొదలైనవి కూడ ఉంచుతారు. చీరలు, రవికల గుడ్డలు కూడ ఇస్తారు. ఈ పాపచేటను వేరొక వ్యక్తి పట్టుకుంటాడు. కుండ నెత్తుకున్న వ్యక్తి ముందు నడుస్తాడు. పాపచేట పట్టుకున్న వ్యక్తి వెనుక నడుస్తాడు.

**'పాపాడినా పాపాడినా పాపాడినమ్మా ! పాపాడినా**

**జో జో జో జో పాపన్నా జోలల్లా పాడారు పాపన్నా**

**నిద్దరో నిద్దరో పాపన్నా నిద్దరకు నూరేళ్లు నీకు నూరేళ్లు**

**నిను గన్న తల్లికి నిండు నూరేళ్లు'**[6]

అని పాపచేట పట్టుకున్న వ్యక్తి పాడుకుంటూ వెళతాడు. పాట ఎక్కడా ఆపకూడదు.

**పొలిమేరకట్టు :** ఈవిధంగా కుండను, చేటను పట్టుకొని ఎవ్వరూ చూడని ప్రదేశానికి, సాధారణంగా ఏరు ఉన్న గ్రామమైతే, ఏటిఒడ్డుకి, సముద్రతీర గ్రామమయితే సముద్రపు ఒడ్డుకి, మిగతా గ్రామాలలో అయితే శ్మశానంలోనికి తీసుకెళతారు. వీరి కూడ ఆ కుటుంబీకులలోని పురుషులు కూడ వస్తారు. కుటుంబీకులు గొయ్యి తీస్తారు. కుండలో ఉన్న కుంభాన్ని గొయ్యితీసిన వాళ్లందరూ కొద్దికొద్దిగా గోతిలో వేస్తారు. పోతుతలను కూడ గోతిలో వేస్తారు. తర్వాత మట్టితో కప్పుతారు. అన్నం, 'పాప' ను చేసిన సలిమిడి మొదలైనవన్నీ కలిపి, కుంభంచేసి, పొలిమేర కడతారు. అనగా పాతినకుండకు నాల్గువైపులా కుంభం చల్లుతారు. ఇలా చల్లడం వల్ల దేవత అక్కడ నుంచి కదలదనీ, అన్నివైపుల వ్యాపించి, ప్రజలను బాధ పెట్టదని వీరి నమ్మకం. ఇది గ్రామీణులు దేవతను భయం కొద్దీ కొలుస్తారనటానికి నిదర్శనంగా ఉన్నది.

పొలిమేర కట్టిన తర్వాత కుటుంబీకులను పంపిస్తారు. పాతినకుండకు కొద్ది దూరంలో మూడు గీతలు గీస్తారు. ఈ గీతలు దాటి కుటుంబీకులు వెళ్లాలి. ఆ గీతలు దాటి అమ్మవారురాదని వీరినమ్మకం. అంతటితో సంబరం ముగుస్తుంది. సత్తెమ్మ సంబరం ఈవిధంగానే చాలా గ్రామాలలో జరుగుతుంది.

గొల్లల మామిడాడ సమీపానున్న నెల్లూరు, ఆలమూరు, సంధిపూడి, జొన్నాడ మొదలైన గ్రామాల్లో జరిగే సత్తెమ్మ సంబరంలో కొంతమార్పు కన్పిస్తుంది. అన్నం, పిండివంటలు, మొదలైన వంటకాలను కుండలో కాక, గంపలో వేసి, ఆ గంపలోనే పోతుకాళ్ళు, తల చర్మం మొదలైనవి కూడ వేసి, వాటిపై పాప చేటను ఉంచుతారు. ఈ గంపను పంబలవారుకాక, ఆ యింటివారే తాడి (చెట్టు) వద్ద గొయ్యితీసి, గోతిలో ఉంచుతారు. ఈ సత్తెమ్మ తాడికి ఆకుకొట్టరు.

పాపచేటలో ఉండే వస్త్రాలు, బియ్యం, బొండాం, ఇతర ఆభరణాలు, పోతుమాంసం మొదలైనవన్నీ పంబలవారు తీసుకుంటారు. వీరు సంబరం ముగిసాక స్మశానం నుండి తమతమ ఇళ్లకువెళతారు. సంబరంచేయించుకున్న వారి యింటికి వెళ్లరు.

కుండను, పాపచేటను పట్టుకొని, స్మశానికెళ్లడాన్ని సత్తెమ్మను దిగబెట్టడం లేక పంపడంగా భావిస్తారు. ఈ సందర్భంలో పంబలవారు బూతు పాటలు పాడతారు. ఈ పాటలు అమ్మవారికిష్టమని వీరి అభిప్రాయం. ఈ విధమైన పాటలు, మాటలు వినబడడానికి కారణం ప్రాచీన కాలంలో బూతు అంతా దేవాలయాలలోనే జరిగేది[7] అని తాపీ ధర్మారావుగారు పేర్కొన్నారు. పుట్టింటి అమ్మాయిని, పెళ్లి సమయంలో అత్తవారింటికి పంపినట్టే, సత్తెమ్మను సంబరం చివరి రోజున సాగనంపుతారు. ఇంతటితో సంబరం ముగుస్తుంది.

**డెల్టా ప్రాంతంలో సత్తెమ్మ సంబరం :** డెల్టా ప్రాంతంలో సత్తెమ్మ సంబరాలు రెండు రకాలు. మొదటిది చిన్న సంబరం. ఇది యించుమించు మెట్ట ప్రాంతపు సత్తెమ్మ సంబరాన్ని పోలిఉంటుంంది. రెండవది పెద్ద సంబరం. ఇది మెట్ట ప్రాంతపు సత్తెమ సంబరానికి పూర్తిభిన్నంగా ఉంటుంది.

**చిన్న సంబరం :** మొదటి రోజు మెట్ట ప్రాంతపు సంబరంలో చేసినట్టే చేస్తారు. సత్తెమ్మ

గుడికెదురుగా పందిరేసి, పందిరిలో అలికి, ముగ్గుపెట్టి అక్కడ పంబనాదం ఉంచి, సంబరం ఆరంభిస్తారు. అగ్గి, గుగ్గిలం, పువ్వులు, అగరవత్తులు, పసుపు, కుంకుమ, గంధం, అక్షింతలు పంబనాదం దగ్గర పెడతారు. దణ్ణం పెడతారు. కోడిని కోయటంకాని, కొబ్బరికాయ కొట్టడంగాని చేస్తారు. ఈవిధంగా ప్రారంభించి, చివరిరోజు వరకు సత్తెమ్మ కథలు పాడతారు.

చివరి రోజు సంబరం అమ్మోరు విగ్రహాన్ని గోదావరికి స్నానానికి తీసుకెళ్లడంతో ప్రారంభమవుతుంది. రాగి, వేపకొయ్య లేక సిమ్మెంటుతో తయారు చేసిన సత్తెమ్మ విగ్రహాన్ని స్నానానికి తీసుకెళ్లి, తెచ్చిగుడిలో పెడతారు.

మెట్ట ప్రాంతంలోవలె కుండను పద్దంలో ఉంచుతారు. ఆ కుండకు మూడు ముఖాలు పెడతారు. ఒక ముకానికి పసుపు, ఒక ముఖానికి నల్లమసి, ఒక ముఖానికి దిరిసెనాకుపెడతారు. ముఖానికి మూడు చొప్పున తొమ్మిది గుడ్లు కూడ అమర్చుతారు. ఈ కుండను 'శగాలపు కడప' అంటారు. మానెడు, సోలడు, బియ్యం, రూపాయి పావలా డబ్బులు, బెల్లమ్ముక్క, తమలపాకులు, వక్క, పద్దంలో పెడతారు. సంబరం చేయించుకునే యింటిపేర్ల వారందరూ మడిబట్ట కట్టుకొని, కొంచెం కొంచెం చొప్పున కుంభం కుండలో వేస్తారు. పోతును నిద్రపుచ్చుతూ

**సిక్కెడ చెట్టెక్కె, మేకన్నా సిమాలు తొక్కేవే మేకన్నా**
**ఏతాము కొమ్మెక్కె మేకన్నా మేతాలు మేసేవేమేకన్నా కుమ్మారింటి**
**కుండ మేకన్నా**
**అందారు కోమావేఠ మేకన్నా కమ్మరింటే కత్తిమేకన్నా**
**అందాదు కోమావే మేకన్నా ఉప్పగల్లు మిరపకాయ మేకన్నా దిట్టంగా**
**నూరేరు మేకన్నా'9**
**అని జోల పాట పాడతారు.**

ఈ మేకపోతు మాంసాన్ని పంబలవారే తీసుకుంటారు. కాబట్టి పోతు పరిమాణం, అది వారికి, సంతృప్తికరంగా లేదని ఈ పాటలో వ్యక్తమవుతుంది. పోతు పరిమాణం ఎలాగున్నా వీరు పాడే జోలపాట యిదే. ఈవిధంగా నిద్రించిన పోతును లేపాక, పద్దంలో జపాచేస్తారు (బోరమాత్రం కోస్తారు) ముఖానికి అల్యూమినియం చిప్ప పెట్టుకొని, పోతుపొట్టుచీరి ఒంటిపై వ్రేయాడదీసుకొని కాని, పోతుపేగులలోనికి గాలి ఊది మెడలో వేసుకొనికాని, ఒకడు బయలుదేరుతాడు. వేరొకడు పాపచేట పట్టుకొని

**'జో జో జో జో నందా జో పరమనందా - ఉయ్యాల సరిగట్టి ఊపరానయితే**
**పగడాలు సరిగట్టి పంపరానయితే నీళ్లుగారిన కళ్లు పాలు గారేనూ**
**ఉగ్గెత్తే మీయమ్మ ఊరికెళ్లింది పాలిచ్చే మీయమ్మ పట్నమెళ్లింది**
**ఏడాకు ఓబాల ఎర్రన్నా బాల జో జో జో జమ్మ బూజీ జోజమ్మ జోజీ'10**

అని జోలపాట పాడుకుంటూ బయలుదేరుతాడు. వేరొక పంబల వ్యక్తి స్త్రీ వేశం ధరించి, కుండ నెత్తుకుంటాడు. అప్పుడు ఇంటివారు హారతి యిస్తారు. ఆ సందర్భంలో పంబల వ్యక్తి -



సత్తెమ్మ సంబరంలో వేసే బళ్ళ వేషాలలో ఒక దృశ్యం



పాపచేట ముందు కూర్చున్న పంబలవాడు. ప్రక్కన నిల్చున్న సంబరం చేయించుకుంటున్న ఇంటివారు



సత్తెమ్మ సంబరం సమయం సముద్రపొడ్డున పందిని బలి ఇచ్చి సన్నివేశం



మత్స్యకారుల దేవతల జాతర సందర్భంలో గుడిముందు వేసిన పందిరివద్ద శివమూగుతున్న గణాచారులు. దేవతకు మ్రొక్కు చెల్లించాల్సిన జెండాకర్రను పందిరికి ఆన్చిఉంచారు.



దేవత స్వరూపాలుగా వేయబడిన చదునులు

'కీలు కడియంబులే కీలు కడియంబులే మేలుంగరాలుగా బాగైన ముత్యాలు బాసికాలు

కురములే జాతులే కొడగుజ్జింబులే మేలైన ముత్యాలు బాసికాలు అమ్మవారికి జైమంగళా!

కురమలే జాతులే కొండగుజ్జింబులే మేలైన ముత్యాలు బాసికాలు జైమంగాళా'[11]

అని నివాళి పాడతాడు. వేరొక ఇద్దరు పంబబలవారు పంబనాదం వాయిస్తూ బయలు దేరుతారు. వీరంతా స్మశానికెళ్ళి, వారు తీసుకెళ్లినవి అక్కడ వదిలేస్తారు.

(గోతిలో పూడ్చరు) కుండను చాకలి, పోతును పంబలవారు తీసుకుంటారు. ఈవిధంగా చిన్న సంబరం ముగుస్తుంది.

**పెద్ద సంబరం :** దీనిని 'బండి సంబరం' అని కూడ అంటారు. సత్తెమ్మ బొమ్మను బండి మీద ఊరేగించటంవల్ల ఈ పేరు వచ్చింది. సత్తెమ్మ విగ్రహాలను గోదావరిలో స్నానం చేయించిన రోజున మధ్యాహ్నం మాదిగవాడు ఊరిచివర జమ్మిచెట్టుకడ అమ్మవారికి పాలు పొంగిస్తున్నారని చాటింపు వేస్తాడు.

**మారుద్రుడు - పూలకప్పిరి :** మారుద్రుడు (జమ్మిచెట్టు) కి పూలకప్పిరి చెబుతారు. పూలకప్పిరి అనగా కుండను నాల్గు వెదురు బద్దల మధ్య ఉంచి, గాంధార దుంపలు దండలుగా కట్టి కుండకు వేస్తారు. గుగ్గిలం, పొగవేసుకొంటూ ఊరంతా తిరిగి జమ్మిచెట్టు దగ్గరకు తీసుకెళతారు. ముందుగానే చాటింపు వేయించటం వల్ల ఊరంతా అక్కడకు పాలు తెస్తారు. ఆ పాలతో పరమాన్నం వండి, నూటొక్క విస్తళ్లలోవేసి, చెట్టు మొదట పెడతారు. సంబరం చేయించుకొనే ఇంటిపేరు వాళ్లంతా చెట్టుకి గుగ్గిలంపొగవేసి, ఆ విస్తళ్లలోని పరమాన్నం తింటారు. రివాజు ప్రకారం మంగళ్ళు, చాకళ్ళ కమ్మర్ళు, డప్పుల వాళ్లకి కూడ విస్తళ్లిస్తారు. వారు తీసుకెళ్లిన కుండను చెట్టుమీద ఉంచి, యింటికెళ్తారు. ఈ పండుగ ముఖ్యంగా టేకి, పందలపాక, మురముండ, అరటకట్ల మొదలైన గ్రామాలలో చేస్తారు.

**బండి సంబరం :** ఈవిధంగా జరిగిన మరుసటిరోజు పద్దంవేసి, పద్దంలో గొర్రెపోతును వేస్తారు. అమ్మవారిని జమ్మికర్రతో చేయించిన బండి మీదకు ఎక్కిస్తారు. ఈ బండి సంబరం నిమిత్తం రెండు అమ్మవారి బొమ్మలు చేయిస్తారు. ఒకటి మట్టిబొమ్మ దానిని స్మశానంలో వేయిస్తారు. రెండవది గడ్డిబొమ్మ దానిని యింటి వద్ద వేయిస్తారు. ఈ గడ్డిబొమ్మకు నల్లరంగులో ముంచిన జనపనారను కురులుగా అమరుస్తారు. తలగా రాగిబిందె పెడతారు. వక్షోజాలుగా ముంత (చిన్నకుండ) లు పెడ్తారు. 70 మూళ్ల (సుమారు 35 మీటర్ల) తెల్లవస్త్రం పసుపునీళ్లలోముంచి, శక్తికి కడతారు. ఒడికట్టుకు, పయ్యెద చెంగుకు రెండు ఎర్రటి చీరలు ఉపయోగిస్తారు. శక్తి శిరస్సు పైన శూలం ఉంటుంది. ఆ శూలానికి పంది పిల్లను గుచ్చుతారు. ఊరేగింపులో వినోదార్థం ఆపంది పిల్లను చిన్నరాళ్లతో కొడతారు. ఒక పంబలవాడు స్త్రీ వేషం వేసుకొని, బండిమీద అమ్మవారి దగ్గర కూర్చుని ఏకుల రాట్నం వడకుతాడు. ఈవిధంగా వడకడం అమ్మవారు వడుకుతున్నట్లుగా భావించాలి. ఈవిధమైన ఆచారం జాతీయోద్యమ ప్రభావం వల్ల వచ్చి ఉండవచ్చు. బండిమీద అమ్మోరు కెదురుగా 5,6 కుంచాల బియ్యం అన్నంవండి, తెలగపిండి, మునగాకుల

కూరతో కుంభం పోస్తారు. బండి కదపటానికి ముందు ఒకపోతును కూడ వేస్తారు. ఆ తర్వాత గ్రామస్థులు ముఖ్యంగా సంబరం చేయించుకొనే యింటిపెద్ద వారందరూ బండిని లాక్కు వెళతారు. అప్పటికే తయారుచేయబడి ఉన్న మట్టి బొమ్మ (ఆడబొమ్మ) మీద గడ్డి (పోతు) బొమ్మను పరుండబెడతారు. గడ్డిబొమ్మకు కట్టిన వస్త్రాలను పంబలవారు, బండిలో కుంభాన్ని బండి లాగినవారు, పోతును సంబరం చేయించుకున్నవారు తీసుకుంటారు. ఇంతటితో పెద్ద సంబరం ముగుస్తుంది. ఈ సంబరంలో సంప్రదాయం ఆచారాలతోపాటు వినోదంకూడ మిక్కుటంగా కన్పిస్తుంది.

పంబలవారు పాడే సాధారణ కథలు : సత్తెమ్మ సంబరాలు చేయించే పంబలవారు సంబరం సమయంలో అమ్మవారి మహిమల్ని తెలిపే కథలు పాడతారు. ఈ కథలని, ఆదిశక్తి లేక సత్తెమ్మ పేరుతో పాడతారు. ఇతర గ్రామదేవతల పండుగలకు కూడ వీరు కథలు పాడటానికి వెళతారు. ఆ సందర్భంలో పాడే కథలలో, పాటలలో దేవత పేరు మారుస్తారు. వీరి వద్దనున్న కథలు, పాటలు పరిమితంగా ఉన్నాయి. వీటినే అన్ని దేవతల సంబరాలలో పాడుతారు.

పంబలవారు పాడే కథలలో ఆదిశక్తి మారువేషమ్మీద ఆయా వృత్తుల వారి వద్దకెళ్ళి సహాయమడుగుతుంది. సహాయం చేయక, బాధపెట్టినవారికి, తన మహిమచూపి, తనను తెలిసికొని పూజించేటట్లు చేస్తుంది. వారి వారి గుణగుణాలనుబట్టి, వరాలిచ్చి, లోకంలో వారి వృత్తి గురించి, వారి పాత్ర గురించి తెలియచెప్పి మాయమవుతుంది.

కొన్ని కథలలో శక్తి తనను పూజించక, నిర్లక్ష్యం చేసిన రాజులను హింసించి, రాజ్యభ్రష్టులుగావించి, భార్యా పిల్లలకు దూరంచేసి, వారు శక్తి మహిమ తెలిసికొని, పశ్చాత్తాపం చెంది, పూజించడం మొదలుపెట్టాక, వారిని యథాస్థితికి తెస్తుంది. కొన్ని కథలలో విష్ణువు, ఆదిశక్తిల మధ్య, మరికొన్ని కథలలో ఈశ్వరుడు – ఆదిశక్తిల మధ్య ఘర్షణ వర్ణించబడింది.

**ఆదిశక్తి నివాసం :** ఆది భూలోక రంభ, ఈమె పెదరాజుల దేవత రాజులకోట రత్నాల కోట కంచుకో కలయింటికోట. ఉచ్చులేనికోట సత్తెమ్మ నివాసం. కోటకేసిన మరుగులు మరుగులుబట్టి సాదలు చూడ్డానికి సుగంతాలు (సుగంధాలు) చేరడానికి చేరగంతలు.

ఈనాడు నాల్గుకోళ్లపట్టి మంచమ్మీద పడుకొనే సత్తెమ్మ ఆనాడు పదహారు కోళ్ల ఉక్కు పట్టి మంచమ్మీద పడుకొనేది. సత్తెమ్మకు ఒళ్లులు ఒత్తకుండ మల్లెలపాన్పు. మల్లెలు ఒత్తకుండ ఒళ్లుల పాన్పు. మల్లెమల్లెల నందుని సన్నగుజ్జింకలు (సన్నజాజి మొగ్గలు) సన్నగుజ్జింకల తర్వాత సన్నజాజి పరుపులు. అలాంటి పాన్పుమీద ఆరు నెల్లునిద్దర మూడు నెల్లు తెలివి[12].

**ఆదిశక్తి ఆకారం:** ఆదిశక్తి ఆయాచేతులలో ఢక్కు, ఢమరం, గజాశూలం, గండ్రగొడ్డలి, గుగ్గిలం పడగ, శంఖం, చక్రం, అయిదు జోళ్ల పమ్మనాదం మొదలైన వాటిని తన పన్నెండు చేతులలోను కలిగి యుంటుంది. ఇది ఆదిశక్తి యొక్క సహజ స్వరూపం[13].

శైవవైష్ణవ మతములు ఆవిర్భావమునకు అమ్మవారే ఆధారమని వెల్లడించుటకే వేషధారణ యొక్క వర్ణ కావింపబడినది. విశ్వరూప ప్రదర్శనమును పోలిన, సర్వమత సమ్మేళనమే అమ్మవారని

సూచించుటకే వేషధారణ వర్ణింపబడి యుండవచ్చును[14]. అని డా. ప్రేమలతగారి అభిప్రాయం.

**మారువేషం :** ఆదిశక్తి లోక సంచారానికి సహజ స్వరూపంతో వెళితే జనులు భయపడతారనీ, వేషం మార్చుకుంటుంది. ముందు రెప్పలు, వెనుక రెప్పలు మెరిసి, మూడుకాళ్ళ (చేతిలో కర్ర)తో నూరేళ్ళు నిండిన ముసలిదానిలా మారుతుంది. ముందు మూడు బళ్ల గుడ్డలు, వెనుక ఎన్మూరు గుడ్డలు పక్కన పది భళ్ల గుడ్డలు కడుతుంది. బండెడు కుంకుమ నుదిటిన పెట్టుకొని, ఒక కోటి కాటుక, ఒకచేతి గాజు, ముక్కు ముంగర, మోచేయి, మోకాలి కురుపులతో, తలల్లా మల్లి (పురుగు)లతో, తలవిరగబోసుకొని, వంగపండులాగ వంగొంగి లాడుతూ, తాటాకులాగ దడదడలాడుతూ, పడుతూ లేస్తున్నట్టు అవతారం మార్చుకుంటుంది. వేపరొట్టను జడకింద పెట్టు కుంటుంది[15]. కొన్ని సందర్భాల్లో కనకవురిచీర, దొంతాపురవిక కూడ ధరిస్తుందో.

**ఆదిశక్తి ఆభరణాలు :** ఆదిశక్తికి పాములే నగలు నాగుపామును నడికట్లుగానూ, త్రాచుపామును తలకట్టుగాను, కూనపామును కుంటేవేళ్ళగాను, జెర్రిపోతును జెమ్మకాన (మెడలోహారం) గాను, తుట్టపురుగును కాలికి మట్టెలుగాను, కాయించు కుంటుంది. ఆదిశేషుణ్ణి చేతిలో ఊతాముగా కలిగి యుంచుంది. ఈవిధంగా అమ్మవారికి పాములే నగలు[17].

**ఆదిశక్తి స్వభావం :** సత్తెమ్మ ఇంటికి తల్లి మంటికి తల్లి, కొడుక్కి తల్లి కోడలుకి తల్లి. ఇంద్రమాతల్లి. మూల పేరంటాలు. మూలకూర్చుంటుంది. ముగ్గురు బిడ్డ (త్రిమూర్తులకు) తల్లి. పిలిచినా పేరంటాలే. పిలవకపోయినా పేరంటాలే. ఊళ్లో జగడం లేకపోతే, పొరుగూరు వెళ్లి ఒంటిపాయంత (కొంచెం) జగడంతెచ్చి, ఒకింటి జగడం నాలుగిళ్లకు కాయింతుంది. నాలుగిళ్ల జగడం వెయ్యిళ్లకు కాయింతుంది. (అందుకే ఈమంటే జనులకు భయం) లోకానికి లోకకర్త జగానికి జగకర్త. అత్తింటికి ఆయుసుమంతురాలు. పుట్టింటికి పున్నెశాలి[18].

## శక్తికి సంబంధించిన కథలు :

**శక్తి పుట్టుదల :** భూమ్యాకాశాలు, సూర్యచంద్రులు, నక్షత్రాలు, మొదలైనవేమీ పుట్టకముందే ఆదిశక్తి పుట్టింది. త్రిమూర్తులు, వారి భార్యలు గంగ (జలం) మొదలైన వానిని కూడ పుట్టించింది. బ్రహ్మకు గుడి లేకపోవటానికి, విష్ణువు వేంకటేశ్వర స్వామి, సత్యన్నారాయణస్వామి మొదలైన పేర్లతో వెలసి పూజింపబడటానికి, ఈశ్వరుడు మనుష్యాకారంలోకాక, శివలింగం రూపంలోఉండటానికి శక్తి యిచ్చిన శాపవరాలే కారణం అని ఈ కథా సారాంశం.

సర్వసృష్టికి ముందు ఓంకారమనే శబ్దం పుట్టింది. ఆశబ్దం నుండి అహంకార రూపిణియై, పన్నెండు చేతులతో, ఆయా చేతులలో వివిధాయుధాలతో ఆదిశక్తి పుట్టింది. ఆమె తన ఎదరొమ్మునుండి వచ్చిన మట్టితో గోవుపాదమంత భూమి సృష్టించుకుంది. ఆ భూమిమ్మీద ఒంటిపాదమ్మీద నిలబడినందువల్ల శక్తికి చెమట పట్టింది. ఆ చెమటను గోటితో పట్టి దులపగా, అందుండి నీలవేనుగంగ పాలవేనుగంగ, అమ్మవారి చెల్లెలు జాలారి గంగ మొదలైన ఇన్నూరు

మూన్నూరు గంగలు పుట్టాయి.

ఈ గంగలని చూడగానే ఆదిశక్తికి మగవాని మీద మోహం కలిగింది. త్రిమూర్తుల్ని కనాలనుకుంది. తనలో ఏమైనా దోషాలుంటే వాటిని గంగలో విడిస్తే, పుత్రభాగ్యం కలుగుతుందని తలచి, గంగలో మునిగి, మూడుగుప్పుళ్ల గంగను పట్టుకొని, మూడు గ్రుడ్లు సృష్టించింది. గ్రుడ్లు పెట్టు కోవటానికి చోటు లేక తన నాలుక అమరడదూరంసాపి, నాలుకమీద గుడ్లు ఉంచి, కోడిపెట్టఅయి, గుడ్లమీద పవ్వళించింది. భర్తపొందినది పిల్లలుపుడతారో పుట్టరో అని ఒక గుడ్డు పొడిచింది. అది నీరయిపోయింది. రెండవగుడ్డు పొడిస్తే, ఒక చిప్ప భూమి, రెండవ చిప్ప ఆకాశం, గుడ్డులో సారం సూర్యచంద్ర నక్షత్రాలుగా మారాయి. ఈవిధంగా కలియుగం (సృష్టి) జరిగింది.

'గుడ్డు నుండి ప్రాణి వెలువడుట చూచిన జానపదుడు సృష్టి కూడ అండోద్భవమే అను అంశమును కథలో వ్యంజింపచేసెను'[19] మిగిలిన గుడ్డు నుంచే ముగ్గురూ పుట్టాలని, ఆగుడ్డుకు మూడు రేవులు కట్టి, పొడవగా వరుసగా బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు పుట్టారు. బ్రహ్మ, విష్ణువు సకలావయవాలతో జన్మించారు. ఈశ్వరుడు అవయువరహితుడుగా ముద్దలాగ జన్మించాడు.

కన్న ముగ్గుర్ని చూసేసరికి ఆదిశక్తికి మోహం కలిగింది. బ్రహ్మదగ్గరకెళ్లి 'గుడ్డునాబిడ్డ, గుడ్డునుంచిపుట్టిన మీరుమనమలు మనుమడికి మామకు వరుస ఉంది. కాబట్టి కోరిక తీర్చు అంటుంది. 'ఇప్పుడ తల్లీ బిడ్డలు హద్దులు తప్పితే, ముందు కాలంలో పుట్టనున్న నరలోకంలో కూడ తల్లీబిడ్డలు హద్దులు తప్పుతారు' కావున పొందనంటాడు బ్రహ్మ. అతనిని రాయిగా మార్చింది. విష్ణువు నడిగితే, విష్ణువు కూడ బ్రహ్మ చెప్పినట్టే సమాధానం చెప్పాడు. అతనిని కూడ రాయిగా మార్చేసింది.

ఈశ్వరుని అడిగింది. ఈశ్వరుడు తనకు సర్వావయవాలు, తల్లిదగ్గరున్న వివిధాయుధాలు, శక్తియుక్తులు, మూడవ నేత్రం మొదలైనవన్నీ యిస్తే, పొందుతానని, అన్నీ తీసుకొని పొందనన్నాడు. తల్లి నుంచి తీసుకున్న గవిలిబెత్తంతో 'శిరసుమీద గొట్టి, బాండువా తప్పినందుకు వెళ్లిమైలమాపుకొని రమ్మన్నాడు. ఆదిశక్తి గంగలో మునిగి వచ్చేలోపల, ఈశ్వరుడు అన్నలిద్దర్నీ బ్రతికించుకున్నాడు. తల్లి వచ్చి మళ్ళీ పొందమంటుందని తల్లిని చూసి ముగ్గురూ పారిపోతున్నారు. ఆదిశక్తి ఈశ్వరుడికి అన్ని శక్తియుక్తులు చెప్పింది కాని, సుడిగాలి గురించి చెప్పలేదు. ఆమె సుడిగాలియై బాలలకంటె ముందెళ్లి, వారి ముంది నిలబడి, పొందమన్నది. ఈ బాధ పడలేక తల్లని చంపేసారు.

చనిపోయిన తల్లిని చూర్ణంచేయాలని, అలాచేస్తేనే ముందుకాలంలో నరలోకంలో కూడ అలా జరుగుతుంది. అని పెద్దకుమారుడు బ్రహ్మచేత తలకొరివి పెట్టించి తల్లిని చూర్ణం చేసారు. చూర్ణాన్ని ఏమి చేయాలని ఆలోచించి, అయిదు భాగాలు (ముగ్గురికీ మూడు వీరి కంటే ముందు పుట్టిన భూమ్యాకాశాలకు చెరొకటి) చేసి, తమ మూడు భాగాలు గంగలో కలిపారు. అవి వరుసగా సరస్వతి, లక్ష్మి, పార్వతిగా మారాయి. మిగిలిన రెండు భాగాలు కూడ తెచ్చి గంగలో కలువగా, ఆ బూడిద డెబ్బైఏడు సివపీటకాలై గంగలో సివలాడుతున్నాయి. ఆదిశక్తి మళ్లీ ఆదిపీటకమై గంగలో ఆడుతుంది. తల్లిని చూసిన బాలురు పట్టుకొని భూమ్మీదకి తెచ్చారు. తల్లిబిడ్డలకు వరాలిచ్చింది.

తాను ఎంత పొందమన్న పొందనందుకు కోపంతో, ముందుకాలంలో పుట్టే నరలోకంలో ఎందరికి గుడి ఉన్నా బ్రహ్మకు గుడి ఉండదనీ, తమకు కలిగే కష్టనష్టాలకు బ్రహ్మేకారణమని భావించిన నరులు బ్రహ్మను నిందిస్తారని అతనిని శపించింది.

పొందకపోవడంలో విష్ణువు తప్పులేదని, అతని కంటె పెద్దవాడైన బ్రహ్మ పొందితే, అతడు కూడ పొంది ఉండేవాడని భావించి, అన్నవరంలో సత్యన్నారాయణ స్వామిగా, ఏడుకొండలపై వెంకటేశ్వరస్వామిగా వెలసి ప్రజలచేత పూజలందమని అతనికి వరమిచ్చింది.

తన వద్దనున్న శక్తియుక్తులన్నీ తీసుకొని కూడ తనకోరిక తీర్చని ఈశ్వరుడు పాపగొట్టువారున్నచోట శివలింగమై (తాను పుట్టినప్పుడు ఉన్నట్టే) నిలబడమనీ, నరులను పాలించడం, లాలించడం లాంటి దేశ పెత్తనమంతా అతనిదేనని వరమిచ్చింది. తన దగ్గరున్న శక్తియుక్తులన్నీ తీసుకోవటంవల్ల, వారి మధ్య ఉండే సంబంధంకొద్దీ, తాను ఈశ్వరుని ఎడమకాలికడ ఆఖండజ్యోతిపై నిలబడతానన్నది.

తాను పచ్చచేలమీదకి పచ్చపులి (దేవత)ని, పాటి (గ్రామం) మీదకి పాటి ఏనుగు (గ్రామదేవత)ను, మొలతాడు కట్టిన మగస్వామికి ఆడకూతురు శక్తి (దేవత) నవుతానన్నది. తానొక అవతారమ్మీద ఉంటే తనక్కావలసినంత ఆహారం పెట్టేవారు లేరని పది రూపాలమీద ఉంటే పదిమంది పెట్టేది సరిపోతుందని చెప్పి గంగలో పడి, సివపీటకాలతో కలిసిపోయింది[20].

ఈ కథలో అమ్మవారు త్రిమూర్తుల జననమునకు కారణమని వివరించుటవల్ల ఆర్యమతమును సృష్టించిన త్రిమూర్తుల కంటె, అనార్యమైన గ్రామదేవతారాధన ప్రాచీనమైనదని తెలియచేయుటయే ఈ కథా ధ్యేయంగా తెలుస్తుంది.

ఈ కథలో అమ్మవారు తాను ఒక అవతారమ్మీదకాక, పది అవతారాల మీద ఉంటానని చెప్పటంవల్ల, ఆదిశక్తే ఆయా గ్రామాలలో ఆయా పేర్లతో పూజింపబడుతున్నదని చెప్పవచ్చును.

ఈ కథను పోలిన కథలు ఆచార్య కృష్ణకుమారిగారు, వైట్‌హెడ్‌గారు తమ గ్రంథాల్లో పేర్కొన్నారు. వర్ణనలలోనూ, కల్పనలలోనూ వ్యత్యాసమున్నప్పటికీ కథా సారాంశమొక్కటే. నేను సేకరించిన కథ ఆదిశక్తి త్రిమూర్తులకు వరాలివ్వటంతో ముగుస్తుంది. వైట్‌హెడ్‌గారు సేకరించిన కథలో అమ్మవారు త్రిమూర్తులుకి మూడు పట్టణాలను నిర్మించి యివ్వడం, వారు వాటిని ఏలుతూ, తల్లిని నిర్లక్ష్యం చేయడం, ఆమె వారిని శిక్షించి, తనను తెలుసుకోనేటట్లు చేయడం కూడ ఉన్నది. శక్తి త్రిమూర్తులను సృష్టించే వేరొక కథ నేను పల్లెవారి వద్ద సేకరించాను. వారి కథలకు సంబంధించిన ప్రత్యేక ప్రకరణంలో ఆ కథను వివరిస్తాను.

**కల్లు సాట (చాటు) వ :** కొన్ని కథలలో ఆదిశక్తి మారువేషమ్మీద దేశాటనంచేస్తూ, ఆయా వృత్తుల వారిని పరీక్షిస్తూ తనకు కావలసినవి అడుగుతూ, దురుసు స్వభావుల్ని శిక్షిస్తూ, సాధు స్వభావులికీ వరాలిస్తుంది. ఇలాంటి కథలలో 'కల్లుసాటవ' ఒకటి. కల్లు గీసేవారి వద్దకువెళ్లి కల్లడిగి, కల్లుపొయ్యక, తిరిగి హింసించినవారిని శిక్షించి, తన మహిమచూపి, తనను తెలుసుకోనేటట్లు చేయటమే ఈ కథా సారాంశం.

సత్తెమ్మ మారువేషమ్మీద అరణ్యమడ్డఢి, వివిధ గ్రామాలు దాటుతూ, వెళ్తాంటే దారిలో ఆమెకు చక్కనితాటి వనం ఎదురయ్యింది. ఆ తాటివనమంతా కమ్మటి కల్లుతో సువాసనలు వెదజల్లుతున్నది. 'కల్లుపోస్తే కలిగ్గం (భాగ్యం) అంతా యిస్తాను. పొయ్యకుంటే అరికాలితో మట్టేస్తాను. అనుకొని, తాటివనం చివర కల్లు గీస్తున్న 'తమ్మన్న' అనే వ్యక్తి దగ్గరకెళ్ళి, 'ముసలిదాన్ని' నీ తల్లి లాంటిదాన్ని, నీ పెద్దమ్మ లాంటిదాన్ని కొంత కల్లుపొయ్యి అంటుంది. పొద్దున్నే కల్లేమిటని అతడు చిరాకు పడ్డాడు. పరిపరి విధాల బతిమలాడుతుంది. ఎంతకీ పోకపోయేసరికి, ముసలదాన్ని కర్రతో దూరంగా గెంటేశాడు. మళ్లీ వచ్చి చెట్టెక్క బోవుచుండగా, అతని కంటె ముందొచ్చి, మళ్లీ కల్లు అడిగింది. ఇందాకటి ముసలిదానవా ! ఇంకొక ముసలి దానవా ! అన్నాడు. 'నేను ఇంకో ముసలిదాన్ని, ఎండలో వస్తున్నాను. కొంతకల్లు పోస్తే, దాహం తీర్చుకుంటాను' అన్నది. ఎన్నిమార్లు అడిగినా కల్లుపొయ్యక, తమ్మన్న తన పని తను చూసుకొనేవాడు. అతని కూడ కల్లు పొయ్యమని వెళ్లేది. చిరాకెత్తిన తమ్మన్న ముసలమ్మ మెడకు తాడు తగిలించి, అక్కడే ఉన్న పాడుపడ్డ నూతిలో పడవేసాడు.

నూతిలో అమ్మవారు తన అవతారం మార్చుకొని నాలుగు కాళ్ల నాగుబామును పట్టుకొని, నాలుగు సేకులతో బంగారు టుయ్యాల కాయించుకొని –

**'ఉయ్యాలుయ్యాలుయ్యాల ఎండియేసేకులే ఉయ్యాల**
**ఎండియే సేకులే ఉయ్యాల పైడియా బల్లలే ఉయ్యాల**
**అటునుంచి ఊపితే ఉయ్యాల యింజరా (ను)ల మోతయ్య ఉయ్యాల**
**చందర్మండలములోను ఉయ్యాల సేకులెల్ల బోసి ఉయ్యాల**
**సుక్ల మండలములోను ఉయ్యాల సుక్కలల్లాడంగ ఉయ్యాల**
**సత్తెమ్మ ఊగినా ఉయ్యాల ఊపువాడు పోతురాజు ఉయ్యాల'**

అని ఊయలలడుగుతుంది. అమ్మవారు ఉయ్యాల ఊగితే వచ్చే ధ్వని మోటారు వాహనముల ఇంజను మోతవలె ఉన్నదని జానపదుని పోలిక. ఆదిశక్తి కాబట్టి ఆమె ఉయ్యాల తాళ్ళు చంద్రమండలంలోనికి చొచ్చుకొనిపోయాయి. ఈమె ఉయ్యాల ఊగుకి చుక్కలు కూడ అల్లాడిపోయాయి. తమ్ముడు, సహాయకుడు కాబట్టి ఓపతురాజే ఈమెను ఊపుతున్నాడు.

ఈవిధంగా ఏలపాటపాడుకుంటూ, ఉయ్యాల ఊగుతూ, కిసాల్ని నవ్వుకున్నది. తనకు కల్లుపోయనందుకు తాటివనమంతా నేల కొరిగిపోయేలా, కల్లుకుండలలో కల్లుకు బదులు చీము, నెత్తురు, ఉండేలా, చెట్టుగాళ్లు, వాళ్ల భార్యలు, పిల్లలు, కోళ్లు, గోళ్ల మొదలయిన వన్నీ వివిధ రోగాలతో పడిపోయేలాచేసింది.

చెట్టుగాళ్లందరిలోకి పెద్దవాడైన రామన్న, అందరూ గీసిన కల్లు ఓరుగల్లు పట్టణం పట్టుకెళ్లి, అమ్మి ధనంతో వచ్చాడు. గ్రామదేవతల కథలలో ఓరుగల్లు ప్రసక్తి కన్పిస్తుంది. మన రాష్ట్రాన్ని వైభవంగా పాలించిన వారిలో కాకతీయులు కూడ ఉన్నారు. వీరి రాజధానే ఓరుగల్లు. బహుశ కాకతీయుల పరిపాలనా కాలంలో ఈ కథలు పుట్టి ఉండవచ్చును. లేక ఓరుగల్లు పరిసర ప్రాంతాలలో పుట్టి, రాష్ట్రం అంతా వ్యాపించి ఉండవచ్చును. శనగలు కథలోకూడ ఓరుగల్లు ప్రసక్తి వచ్చింది.

'గ్రామదేవతల కథలలో ఓరుగంటి ఎల్లమ్మ, ప్రతాపరుద్రుని ప్రసక్తి తరచుగా కానవచ్చును. ఓరుగంటి నగరంలో ఎల్లమ్మ బజారు కలదు కాని, ఆమె విగ్రహం నాకచ్చట కన్పించలేదు'21 అని ప్రేమలతగారు పేర్కొన్నారు.

తాను వెళ్లేటప్పటికి సువాసనతో ఉండే తాటివనం వచ్చేటప్పటికి దుర్వాసనతో ఉండటం, మనుష్యులు, కోళ్ళ గొడ్లు మొదలైనవన్నీ జబ్బులుతో ఉండడంచూసి, ఆశ్చర్యపోయాడు. రామన్న జబ్బులతో పడిపోయిన వాళ్లందరినీ, ఆస్థితికి కారణమడిగాడు. ఎవరికి వారు తమకు తెలియదన్నారు. చివరికి తమ్మన్న ముసలిది వచ్చి కల్లు అడగడం మొదలుగా జరిగినదంతా చెప్పాడు. అందుకు కారణమైన తమ్మన్నపై కోప్పడతాడు రామన్న. వనానికి కలిగిన చేటు పోవటానికి ఏమి చెయ్యాలని ఆలోచిస్తుండగా, ఇది గమనించిన సత్తెమ్మ ఎరుకత వేషం వేసుకొని వారి వద్దకు వచ్చింది.

చెట్టుగాళ్ళు తమ వనానికి కలిగిన చేట గురించి అడుగుతారు. తన ఒంటి నున్న వస్త్రం చిరిగినందున, కొత్త వస్త్రం ఇస్తే, అది కట్టుకొని చెబుతానంటుంది. పదునాల్గువందల రూపాయల వెలగల, ఏడు సంవత్సరాల నడమెత్తకుండ నేసిన, చీరను ఏడు బళ్లమీద తెచ్చి, కట్టుకోమన్నారు. ఆచీర ఎరుకలమ్మ పైట చెంగుకు చాలలేదు. (అమ్మవారు గనుక) తొమ్మిది మూరలు వస్త్రం రైకుగా ఇచ్చారు. చాలీచాలని ఆ వస్త్రాలు సరిపెట్టుకుంది.

ఇంకా ఆమె ధాన్యం తెమ్మన్నది. వారు ఎక్కడెక్కడ దాచుకున్న ధాన్యం అంతా తెచ్చిపోసినా, ఆమె బుట్ట అడుక్కిరావు. ఇంకా ఆమె అడిగిన డబ్బు, రాగికాసులు, పసుపు కొమ్ములు ఇచ్చారు. జీవనానికి జీవనం బలిజీవనంగా నల్లకోడి పెట్టనడిగింది ఇచ్చారు. అమ్మవారు 'ఏలేశ్వరం రూపులమ్మా, తామురాడ తాళ్లమ్మా! అని తన చెల్లెళ్లందరినీ పిలిచి, 'యబోఎరుక! యబోఎరుక ! అని ఎరుక మొదలెట్టింది. 'తమ్మన్నను కల్లు అడిగిన ముసలామె ఎవరోకాదు ఆదిశక్తే ఆ వేషంలో వచ్చింది. ఆమెను తీసుకొని వచ్చి అడిగినంత కల్లు పొయ్యండి అని చెప్పింది. ఆమెను తీసుకొని రావటానికి వెళ్లిన తమ్మన్న నూతిలో నిగనిగలాడుతున్న జుట్టు పట్టుకున్నాడు. తల ఊడి చేతిలోకి రాగా, భయపడి ఇంచి కొచ్చేశాడు. రామన్న వెళ్లి రమ్మని కాళ్ళు పట్టుకుంటే. కాళ్ళ చేతులు పట్టుకుంటే చేతులు విడిగా వచ్చేశాయి. (అమ్మవారు అంత ముసలిదైపోయింది) అన్ని బాగాలు దుప్పటిలో వేసి, మూటగట్టి, మగవాళ్ళు ఎత్తుకుంటే మోయలేనంత బరువయ్యింది. ఆడవాళ్ళ మగవాళ్ళ కలిసి పట్టుకుంటే, ఆడవారి వైపులేచి, మగవారి వైపు లేవలేదు. ఆడ, మగ రెండు వైపులా సర్దిపట్టుకుంటే లేచింది. ఈ సన్నివేశంలో అమ్మవారికి ఆడవారి పైగల అభిమానం తెలుస్తున్నది. ఆవిధంగా తీసుకొస్తున్న అమ్మవారు దుప్పటిలో బంగారు బొమ్మై మెరిసింది. 'మొదటనే ఈరూపమ్మీద వస్తే కావలసినంత కల్లు పోసేవాణ్ణి కదా!' అన్న తమ్మన్నను, ఈ రూపమ్మీద వస్తే, నాపై అఘాయిత్యం చేసేవాడమేవో అని ఈవిధంగా అమ్మవారు వచ్చి బండారు (బసుపునీరు) కలిపి, పడిపోయిన జీవులమీద చల్లగా అవి యథాస్థితికి వచ్చాయి. వెళ్లొస్తానన్న సత్తెమ్మను కల్లు తాగమన్నారు. తన తలలోనున్న 'బుడ్డిముంత (చిన్నకుండ)లో పొయ్యమన్నది. వాళ్ల దగ్గరున్న కల్లంతా పోసినా, ఆ ముంత నిండలేదు. అమ్మవారు ఒంటి కాలికి మువ్వలు కట్టుకొని –

**రాకటికి పోకటికి వచ్చినారా రావులమ్మ తాటి కల్లు తెచ్చినారా**
**జెరిపోతు తాటికల్లు తెచ్చినారా ఒంక తాటికల్లు తెచ్చినారా**
**గట్టుమీద పొట్టి తాటి తెచ్చినారా ఎర్నొక్కతాటి కల్లు తెచ్చినారా**
**ఏగులమ్మ తాటికల్లు తెచ్చినారా గుత్తులాడతాటికల్లు తెచ్చినారా**
**గుర్రప్ప తాటికల్లు తెచ్చినారా**

అని పాడుతూ, ఇంకా వివిధ రకాల కల్లు తెమ్మంటుంది. ఆ కల్లంతా తెచ్చిపోసినా, చెట్టుగాళ్ల కత్తులు, లొట్లు (కల్లుకుండ) కడిగిపోసినా అమ్మవారి ముంత నిండ లేదు. ఆ ముంతను తన నోటికందియ్యమన్నది. వాళ్లంతా కలిసినా అందివ్వ లేక పోయారు. ఆమె చిటికెన వ్రేలుతోలేపి, నోటికందించు కొని తాగింది. అమ్మవార్కి మత్తెక్కి

**'వచ్చినారా ! మీరు తెచ్చినారా !**
**రొకటకి పోకటికి వచ్చినారా !**
**మందేలపెట్టారు మాకేల !**

అని ఏడు గడియల సేపు ఆడి, పుట్టినకల్లు 'పుట్టినట్టే తాగితే, తనకే మత్తెక్కింది నరులేమవుతారోనని, పుట్టినకల్లుకి మరిన్ని నీళ్లు కలుపుకొని, పెళ్లాంతోడు, పిల్లలతోడు, అమ్మతోడ అన్నప్పటికీ భయముండదని చెట్టుగాళ్లకు వరమిచ్చింది.

కల్లుకోసం తాటిచెట్టెక్కినవాళ్ళు, అక్కడ నుంచి పడినా చావకుండా వరమిచ్చింది. ఆ వరాన్ని పట్టుకెళ్లి, తమ్మన్న తాటిచెట్టు మొవ్వులో పెట్టగా దానిని ఉడతమింగింది. అందుకే ఉడత చెట్టునుంచి దూకినా చావదు. ఈ వరాన్ని దాచుకోలేకపోయినందున కల్లు కెళ్లిన చెట్టుగాళ్ల ఇంటికి వచ్చేవరకు వాళ్ల భార్యలు విధవరాళ్లే. ఆకలితో ఉండే పాదచారులు కల్లు అడిగితే, పోసి, డబ్బులుంటే తీసుకోవాలి, లేకుంటే లేదు. వేరొకసారి మళ్లీ అడిగి కల్లుతాగి డబ్బులివ్వకపోతే ఒంటిమీదున్న వస్త్రం లాక్కోవాలి. ఈవిధంగా నోటితో లేదనేది చేత్తో లేదంటే పాదచారులు వాళ్ల పేరు చెప్పుకుంటారు. అని వరమిచ్చి, అమ్మవారు దేశాలమీదికెళ్లిపోయింది.

'ఒకని వలన ఒ(వ)నమంతా చెడింది' అనే సామెతనుబట్టి దురుసుస్వభావునివల్ల, కుటుంబీకులకు, కులస్థులకూ కూడ కష్టనష్టములు కలుగుతాయని దురుసు స్వభావం విడనాడాలనీ దేవతను ఆలంబనగా చేసుకొని గావించిన జానపదుని కల్పన. ముసలివార్పై దయాదాక్షిణ్యాలు సన్నగిల్లే ఈరోజుల్లో ముసలివారు దైవస్వరూపులనీ, వారిని నిర్లక్ష్యంచేయరాదని, నిర్లక్షిస్తే చేటు జరుగుతుందనేది సందేశం. ప్రజలలో దయాస్వభావాన్ని, దానగుణాన్ని కల్గించటానికి జానపదుని కల్పనగా ఈ కథను చెప్పవచ్చును. ఏరూపంలో వచ్చినా దేవతను గుర్తించి, ఆదరించాలని లేకుంటే కష్టాలు కలిగిస్తుందని కథకుని ప్రధానోద్దేశం.

**ఓ సెదాటించే కథ:** ఒకనాటి మధ్యాహ్న సమయాన సత్తెమ్మ కనకపురిచీర, దొంతాపురవిక ధరించి, మారువేషమ్మీద బయలుదేరింది. ఈమె బయలుదేరగానే వర్షం ప్రారంభమై గోదావరి పొంగి ప్రవహించింది. పంటలకు ఆధారం వర్షం. అలాంటి వర్షం కురిపించి, పంటలు పండింపచేయటంలో గ్రామదేవత సహకరిస్తుందని ఈ సన్నివేశం తెలియచేస్తున్నది. గోదావరి

ఒడ్డున నిలబడి, దోనె దాటించమని జాలరివాణ్ణి అడిగింది. దోనెకట్నం ఇస్తే దాటిస్తానన్నాడు. దోనెదాటిస్తే, తిరిగొచ్చి, దోనె కట్నం ఇస్తానని బ్రతిమాలింది. ఎంత బ్రతిమాలినా దోనెకట్నం ఇస్తేకాని దోనె దాటించనన్నాడు. కోరుపుట్టలోనున్న నాగుబాముని కుత్తుగంటుకాయించుకొని, తన్నవారు పెళ్లి సమయంలో పెట్టిందనీ, అది తీసుకొని దోనె దాటించమని అన్నది. జాలరి సత్తెమ్మ మెడలో నగతీసుకోవటానికి ప్రయత్నించేసరికి, సత్తెమ్మ నాగుపామై, వాడి కంఠం పట్టుకుంది. జాలరి గోదావరి ఒడ్డున మాటలేకుండా పడిపోయాడు. వచ్చేపోయేజనం దోనె దాటించేవారు లేక బాధపడుతుంటే సత్తెమ్మ తానే జనాన్ని దోనెదాటించింది.

జాలరి తల్లి కొడుక్కి చద్దన్నం పట్టుకొచ్చి, కొడుకుని పిలిచింది. అతడు పలకలేదు. ఈ మాటలు విన్న సత్తెమ్మ జాలరితల్లి దగ్గరకొచ్చి, తాను ఆమె కోడలునని, కొడుకు తెచ్చాడని చెప్పింది. జాలరితల్లి సత్తెమ్మను కిందనుంచి మీద వరకూ బాగా పరిశీలించి, సత్తెమ్మఅని గ్రహించి, తనకుమారుడు చేసిన తప్పు క్షమించమని వేడుకుంది. తప్పుక్షమిస్తే, వివిధ రకాల మొక్కులు చెల్లిస్తానన్నది. ఆడవారి మీదుండే జాలి కొద్ది తప్పు క్షమించి, బంగారు బొట్టుపెట్టగా, జాలరిలేచి నిలబడ్డాడు. జాలరితల్లి అతనితో 'సత్తెమ్మ తల్లిని నీవు దోనెదాటిస్తే దేశాలమీదికెళ్లిపోతుంది' అని బుద్ధి చెప్పింది. నేను దాటించేలా దాటిస్తాను. వెళ్లమని, తల్లిని పంపించి జాలరి సత్తెమ్మను దోనె ఎక్కించికోని, గోదావరి మధ్యకు తీసుకెళ్లి 'నీమీద నాకు మనసయింది నిన్ను వదలమన్నా వదలను' పెళ్లిచేసుకో అన్నాడు. 'నేను అత్తమామలమీద కోపంతో వచ్చాను. నాలాంటి అక్కచెల్లెళ్లు నీకు లేరా!' అని అనేక విధాలా బ్రతిమాలాడింది. ఎన్నిచెప్పినా వినడు. దోనె దాటిస్తే, తన నూటనొక్క చెల్లెళ్లను పెళ్లిచేస్తానన్నది. చూపిస్తే, వాళ్లను పెళ్లాడి సత్తెమ్మను దోనె దాటిస్తానన్నాడు. నూటనొక్క చెల్లెళ్లనూ (జిల్లాలోని వివిధ గ్రామాల్లో ప్రసిద్ధి చెందిన దేవతల పేర్లతో) పిలిస్తే, వాళ్లు వచ్చారు. తెల్లటి చీరలు కట్టుకొని అందరూ ఒక విధంగా ఉన్నారు. అందచందాలలో మార్పులేదు. నూటనొక్క చెల్లెళ్లతోపాటు సత్తెమ్మను కూడ పెళ్లాడుతానన్నాడు. ఎన్ని విధాల తెలియ చేసినా జాలరి తనను తెలుసుకోలేకపోయినందున కోపమొచ్చి కృరమృగమై, అతని మెడపట్టుకొని గోదావరిలోకి విసిరేసింది. 'నేను ఇల్లు బయలుదేరి ఇట్టి సంఘటన చూసాను. ఇంకా యిటువంటివి ఎన్ని ఉన్నాయెూ చూస్తాను. మీరు ఎక్కడివాళ్లక్కడకు వెళ్లి పొండి అని చెల్లెళ్లను పంపించి, సత్తెమ్మ దేశాల మీదికి బయలుదేరింది'[23].

సత్తెమ్మ ఏ రూపంలోనైనావచ్చి, నీచ స్వభావుల్ని బాధపెడుతుందని, తనను తెలుసుకోలేనివారిని శిక్షిస్తుందని తెలియచేయడమే ఈ కథాధ్యేయమున వచ్చును. ఒంటరి స్త్రీలపై అఘాయిత్యాలు చేసే పురుషుల్ని భయపెట్టి, అలాంటి పనులు చేసే వారిని నిరోధించటానికి దేవతను ఆలంబనగా చేసుకొని, గావించిన జానపదుని కల్పనగా ఈ కథను చెప్పవచ్చును.

**సెనగల కథ :** సత్తెమ్మ మారు (ముసలి) వేషంలో ఓరుగంటి రాజులపట్నం బయలుదేరింది. ఓరుగంటి పట్టణం వచ్చేసరికి ఆ ఊరిలో రామలక్షమణులు అనే యిద్దరు అన్నదమ్ములున్నారు. వారు వ్యవసాయదారులు. రామయ్య సాధుస్వభావుడు, లక్ష్మయ్య కఠిన స్వభావుడు. వారు వేసిన సెనగలచేను పండింది. కళ్లంలోవేసి, సెనగలు దులుపుతున్నారు. సత్తెమ్మ కళ్లంలో ఉన్న లక్ష్మయ్య

దగ్గరకెళ్లి, కొన్ని సెనగలు పెట్టమన్నది. పెట్టనన్నాడు. అన్న రామయ్య విని, పండకపోతే ఏమిచేసేవాళ్లం, కొన్ని గింజలు పెట్టమని తమ్మునితో అన్నాడు. 'చేలో పెత్తనం తమ్ముడిది ఇంటికడ పెత్తనం అన్నది. ముసలమ్మకు పెట్టేలా పెట్టి పంపిస్తాను. ఇంటికెళ్లి చద్దన్నం సెనగలు కొనే షావుకారుల్ని తీసుకొనిరా ! అని చెప్పి అన్నను పంపించాడు.

సెనగలు అడుగుతున్న ముసలమ్మని కఱ్ఱతో దూరంగా గెంటేశాడు. సత్తెమ్మకు కోపంవచ్చి, కళ్లానికి కొంచెం దూరంలో ఉండి, ఆ ప్రాంతాన్నంతటనీ దుర్వాసన కల్గించింది. సెనగలను పెంకులుగా మార్చేసింది. ఈ దుర్వాసన సహించలేక ముసలమ్మను తిట్టుకుంటూ, తన దగ్గర పనిచేసే పాలికాపులకి బడితలిచ్చి, ముసలమ్మ తలబద్దలుగొట్టమని పంపించాడు. పాలికాపులు కఱ్ఱలతో వెళ్లి, ముసలమ్మను కొట్టటానికి బదులు సత్తెమ్మ మహిమవల్ల ఒకరి తలను ఒకరు బాదుకొని చనిపోయారు. ముసమ్మను ఇచ్చు బిగించి చంపమని, వారి పొలంలో పనిచేసే కూలీలను కూడ పంపాడు. సత్తెమ్మ మహిమ వల్ల ఒకరి తలకు వేరొకరు ఉచ్చులు బిగించుకొని మరణించారు. లక్ష్మయ్య మీద కోపంతో అతనికి జబ్బుకల్పించి, మృత్యువాతపడేటట్టు చేసింది.

కొంత సేపటికి అన్న రామయ్యవచ్చి, అక్కడి పరిస్థితి చూసి, కళ్లానికి వచ్చిన చేటు గురించి తెలిసికున్నాడు. సెనగలు తమ్ముడు అమ్మేసుకొని, చిల్లపెంకులుగా మారాయని చెప్తున్నాడేమోనని అనుమానపడ్డాడు. తాను అమ్ముకోలేదని, ముసలమ్మకు సెనగలు పెట్టకపోవడమేగాక, ఆమెను కఱ్ఱతో గెంటేసానని, పాలికాపుల్ని కూలీల్ని పంపి, ముసలమ్మను చంపమన్నానని, చంపటానికెళ్లినవారే తమనుతాను చంపుకొని చనిపోయారని, అప్పటినుంచి కళ్లానికి చేటువచ్చిందని చెప్పాడు. రామయ్య ముసలమ్మను వెదకటానికి బయలుదేరాడు. వెదకి, వెదకి, చివరకు ముసలమ్మను చూసి 'అమ్మా ! నా తమ్ముడు చావు బ్రతుకుల్లో ఉన్నాడు. వచ్చి రక్షించు' అని వేడుకున్నాడు. 'నీతమ్ముడు నన్ను చాల బాధలు పెట్టాడు. రాను' అన్నది. చాలావిధాలా బ్రతిమాలాడేడు. కొన్ని షరతులకు అంగీకరిస్తే వస్తానంటుంది. లక్ష్మయ్య మీద మూడ ఉమ్ములు ఇమియటానికి, చెప్పుదెబ్బలు కొట్టడానికి, అతనిని పరుండబెట్టి అతనిమీద దేకటానికి అంగీకరిస్తే, వస్తానన్నది.

వాటి గురించి తమ్ముడికి చెప్పి, అంగీకారం పొంది, ఆ విషయం చెప్పి సత్తెమ్మను రమ్మన్నాడు. నడిచిరానని, వాళ్లెక్కే పల్లకీలో తీసుకెళితే వస్తానన్నది. చాకళ్లు, బెస్తలు చేత పల్లకీ మోయించుకెళ్లి, అందులో కూర్చుని రమ్మంటాడు. తనకు బెస్తలు బావలు, చాకళ్ల అన్నలు అవుతారని, కాబట్టి వారుకాక, కోమటిబ్రాహ్మలు పల్లకి మోస్తేనే వస్తానన్నది. ఒకరిచేత పల్లకి మోయించుకొనే కోమటి బ్రాహ్మణులు ఒకర్ని మోయటానికి రారని రామయ్య విచారంలో పడ్డాడు. తన బంట్రోతునుపంపి, సెనగలు దానంచేస్తున్నారనే నెపంతో పదిమంది బ్రాహ్మణుల్ని, సెనగలు అమ్ముతున్నారనే నెపంతో పదిమంది కోమట్లను రప్పించాడు. సత్తెమ్మ తన మహిమవల్ల వచ్చే కోమటి బ్రాహ్మణులకు తగవు పెట్టేసింది. వాళ్లలో వాళ్లు తగువులాడుకుంటున్నారు. వాళ్లలో వచ్చినవారు విషయం తెలుసుకొని వెనక్కి మళ్లారు. రామయ్య బ్రతిమాలగా పల్లకి నెత్తుకున్నారు. పల్లకీలో కూర్చున్న సత్తెమ్మ మోయలేనంత బరువై వాళ్లను చంపేసింది.

చివరకు లక్ష్మయ్య వద్దకు చూడచక్కని స్త్రీవలె రూపం మార్చుకొనివచ్చింది. తాను షరతు పెట్టినట్లే ఉమ్ములు, చెప్పుదెబ్బలు, దేకులుకానిచ్చింది. అంతటితో లక్ష్మయ్య ఒంటి జబ్బంతా తొలిగిపోయింది. చిల్లంపెంకుల్ని సెనగలుగా మార్చింది. కళ్లాన్ని యథాస్థితికి తెచ్చింది. 'ముందు కాలంలో నీవు రాజువైపుట్టి రాజ్యపరిపాలనం చేయుము' అని రామయ్యకు, 'నీవు రైతువైపుట్టి, పంటపండించి, ఎవరైనా పేదవారు చేయిసాచి అడిగితే కొద్దో గొప్పో పెట్టు లేదంటే వాళ్ల ఉసురు నీభార్యాపిల్లలకి తగుల్తుంది' అని లక్ష్మయ్యకు వరమిచ్చి, సత్తెమ్మ కోమటి బ్రాహ్మణులకు వద్దకువచ్చి, బండారు బొటచ్చు పెట్టగానే వాళ్ళులేచి నిలబడ్డారు. జుగుప్సాకరంగా ఉన్న తన్ను మోసినందుకు సంతోషించి, ముందుకాలంలో కలియుగంలో బ్రాహ్మణులైపుట్టి, ప్రజలకు మంచిచెడులు చెపుతూ, వాళ్లచేత గౌరవం పొందమని బ్రాహ్మణులకు, సరకులు చౌకగా కొనుక్కొని, ధరలు పెరిగాక ఎక్కువ ధరకు అమ్ముకొని ధనవంతులుకమ్మని, కోమట్లకు వరమిచ్చి, సత్తెమ్మ దేశాలమీదికి వెళ్లిపోయింది[24].

తనను తెలుసుకోక, నిర్లక్ష్యం చేసి, బాధపెట్టేవారిని సత్తెమ్మ అష్టకష్టాలు పాలుచేస్తుందనేది ఈ కథాధ్యేయమనవచ్చు. ప్రజలలో దానగుణం కలిగించడానికి జానపదుని కల్పనగా ఈ కథను చెప్పవచ్చును.

తమ పూర్వీకులు, ముందు తరాలవారు కొలిచినప్పటికీ, తనను నిర్లక్ష్యం చేసిన ప్రస్తుతతరం రాజులను సత్తెమ్మ నానాబాధలు పెడుతుందని చెప్పటానికి కొన్ని కథలు పంబలవారు చెబుతారు.

**మాంధాత రాజు :** మతినితనందనుని కుమారుడు ఇబులేశు. ఇబులేశు కుమారుడు మాంధాత, ఈతనిని 'కురుల మాంధాత' , 'కిరీట మాంధాత' అని కూడ అంటారు. ఈ రాజు పుట్టాక తల్లిదండ్రులు చనిపోయారు. మంత్రి పెంచి పెద్దచేసి, విద్యాబుద్ధులు చెప్పించాడు. పెద్దయ్యాక రాజ్యం అప్పగించాడు. రాజు ఆడిన మాట తప్పనివాడు, పలికిబొంకనివాడు. ఇచ్చిన ధర్మములు పుచ్చుకోనంటివాడు. సూర్యచంద్రులకు మొక్కనివాడు చుక్కబొట్టు పెట్టనివాడు. పారేగంగలో ముఖం కడగనివాడు, తమ్ముళ్ల ఎంగిళ్ళ భోంచేయనివాడు. ఆడగుర్రాన్ని ఎక్కనంటివాడు. ఆరెత్తి మొక్కనివాడు. అలాంటి రాజు తన సైనికులను పిలిచి, ఈ భూమ్మీద తనకంటె గొప్పవాళ్లెవరైనా ఉంటే చంపెయ్యమన్నాడు. రాజుకంటే గొప్పవారు సూర్యచంద్రులే ఉన్నందున, వారిమీదికి బాణాలు, బల్లేలు విసరగా, వారు మేఘాలు చాటుకి వెళ్లిపోయారు. ఇలా జరిగాక రాజువైభవమంతాపోయి, బిచ్చగాడయ్యాడు.

బిచ్చాటనకు వెళ్లినరాజు, ఒక ఇంటివారు సత్తెమ్మను కొలవటం చూసి, సత్తెమ్మను కొలిచినందువల్లేవారు భాగ్యవంతులయ్యారన్న విషయం తెలుసుకొని, తాను కూడ సత్తెమ్మను కొలవాలనుకున్నాడు. ఆరాత్రికి రాజు కలలోనికెళ్లి, సత్తెమ్మ రాజుతోతనను కొలుస్తానన్న విషయం జ్ఞాపకంచేసింది. ఆ మరుసటిరోజు ఉదయాన్నే లేచి రాజు బిచ్చాటనకెళ్లి, బియ్యంతెచ్చి, ఆయా వృత్తులవారి వద్దకెళ్లి, కుండ, వస్త్రం, పసుపుకుంకుమలు, నూలుపోగులు తెచ్చి, అత్తెసరు వండి, నైవేద్యం చెల్లించటానికి విస్తళ్ళు కోసం చూసాడు. రాజును పరీక్షిద్దామని సత్తెమ్మ విస్తళ్ళ లేకుండా

చేసింది. విస్తళ్లు కోసం తిరిగి తిరిగి, అవి దొరక నందున బాధపడుతున్న రాజును చూచి, విస్తళ్ళు దొరికేలా చేసింది. దొరికిన విస్తళ్ళలో సత్తెమ్మకు నైవేద్యం చెల్లించాడు. రాజుభక్తికి మెచ్చి సత్తెమ్మ ప్రత్యక్షమై రాజ్యం సర్వ సంపదలూ, భార్య పిల్లలను కూడా ప్రసాదించింది. రాజు సత్తెమ్మను ఘనంగా కొలుస్తూ, రాజ్య పాలనకూడా ఘనంగాచేస్తున్నాడు. సత్తెమ్మను తొడమీద కూర్చుండబెట్టుకొనినాడు.

ఆరాజ్యంలో ఉండే ఇద్దరు రైతు సోదరులు రాజు దర్శనానికి వెళ్ళి, అతనికి నమస్కరించి, చిన్నవాడు 'రాజా ! నా నమస్కారం నీకు దక్కుతుందా ! నీ తొడమీద సత్తెమ్మకు దక్కుతుందా!' అన్నాడు. ఆ మాటకు రాజుకి కోపం వచ్చి' సత్తెమ్మ అడ్డుకోక కట్టే ఆడకూతురు' నేను మొలతాడు కట్టే మగకుమారుణ్ణి' నమస్కరిస్తే ఇన్ని భాగ్యాలు ఉన్నట్లూ, నమస్కరించకుంటే లేనట్లా ! ఇవ్వడం అంటే ఇంచ్చింది తీసుకోగలదా ! అనే గర్వంతో, తొడమీదున్న సత్తెమ్మను కిందకు తోసేసాడు. 'అడుక్కునేవాణ్ణి, రాజ్యానికి అధిపతిని చేసాను. నాకు నమస్కరిస్తే, సర్వసంపదలూ ఉంచుతాను. లేకుంటే అష్టకష్టాలు పెడతాను అని భావించి సత్తెమ్మ మరుసటి రోజు బ్రాహ్మణవేషంతో బంగారు పల్లకీఎక్కి, రాజు దగ్గరికెళ్లింది. జూదమాడడానికి ఒప్పించింది. బ్రాహ్మణుడు ఓడితే బంగారు పల్లకీ రాజుకివ్వటానికి, రాజు ఓడితే, రాజ్యం సర్వసంపదలు బ్రాహ్మడికిచ్చేసి, భార్యాపిల్లలతో రాజ్యం వదలిపోవటానికి ఒప్పందం కుదిరింది. జూదంలో ఓడిన రాజు రాజ్యంవదలి భార్యాపిల్లలతో అరణ్యానికి బయలుదేరాడు.

వెళ్లేవాళ్లను భాదపెట్టడానికి ఎండలు తీవ్రంగా కాయించింది. నడిచే దారిలో పల్లేరుకాయలు కాయించింది. అవి కాళ్లకు గుచ్చుకొని రక్తం కారుతుంటే, ఆ బాధభరించలేక, 'నాధా ! ఇదంతా సత్తెమ్మ మహిమే, సత్తెమ్మకు నమస్కరించమని' భార్య వేడుకుంది. అడ్డగుడ్డకట్టిన ఆడదానికి మొక్కనన్నాడు. దారిలో అల్లనేరేడు చెట్టు కాయించింది. భార్యాపిల్లలకి పెడదామని, రాజు చెట్టెక్కి పళ్లు కోసి, చెట్టుదిగేసరికి అవి చిల్లపెంకులుగా మారాయి. ఇంకొంచెం దూరం వెళ్లాక సత్తెమ్మ మాయవల్ల, బియ్యం, వంట పాత్రలు నీరు కనిపిచాయి. రాజు వంటచేయటానికి పూనుకున్నాడు. అలసి ఉన్న భార్యాపిల్లలు నిద్రించారు. వంట పూర్తి చేసిన రాజు కాళ్లుచేతులు కడుక్కోవటానికి నూతికి వెళ్లాడు. ఈలోగ సత్తెమ్మ నక్కరూపంలోవచ్చి, అన్నం పాత్ర ఎత్తుకొనిపోయింది. భార్యాపిల్లలులేచి వండిన అన్నమంతా రాజే తినేసాడని భావించి, అతనిని నిందించారు. కొంతదూరం వెళ్లాక సత్తెమ్మ మాయవల్ల అన్నసత్రం కనిపించింది. భోంచేద్దామని భార్యాపిల్లలతో సత్రంలో ప్రవేశించిన రాజు, వారు వడ్డించినవి తినబోవుచుండగా వర్షంవచ్చి, వంటకాలన్నీ కొట్టుకొనిపోయాయి. భార్య రాజుతో ఇదంతా సత్తెమ్మ మహిమే, అ(హ)స్తమెత్తి మొక్కమన్నది. అడ్డగుడ్డకట్టిన ఆడదానికి మొక్కనన్నాడు.

మరికొంతదూరం వెళ్లాక, ఒక రైతు చేనుకోయించడం చూసిన రాజు, కొడవలి ఉంటే తాను కూడ చేనుకోతకువెళ్లి, వచ్చిన ధాన్యంతో భార్యాపిల్లలకు అన్నం పెట్టుకుందును కదా ! అనుకున్నాడు. ఇంతలో సత్తెమ్మ ముసలివేషంలో ప్రత్యక్షమై, అనేక షరతులు విధించి, రాజుకి కొడవలి ఇచ్చింది. కొడవలితో కోతకు ఉపక్రమించి, కోయటంరాక చేతివేళ్లుకోసుకున్నాడు. రైతుకి జాలికలిగి రాజుకి కొంత ధాన్యం ఇచ్చాడు. ఆ ధాన్యాన్ని కూడ సత్తెమ్మ మాయంచేసింది. రాజు

భార్య ధనవంతుని యింటికి ధాన్యం దంపుకి వెళ్ళింది. ఈమె ధాన్యంలో పోటువేయుగానే, దంపించుకొనేవారి భాగ్యం అధికమయ్యింది. ఇది గ్రహించి ఆ ధనవంతుడు ఆమెను సోదరిగా భావించి, తమ వద్దనే ఉంచి, వెళ్లనివ్వడు. రాజు గోదావరి దాటే ప్రయత్నంలో ముందుగా ఒక బిడ్డను ఎత్తుకొని ఆవలిఒడ్డున దింపి, రెండవ బిడ్డను తీసుకెళ్లటానికి వస్తుండగా గోదావరి మధ్యలోకి వచ్చాక, సత్తెమ్మ మహిమవల్ల గోదావరి పొంగి, ఆవరదలో రాజు కొట్టుకొనిపోయాడు. రాజు బిడ్డలు చెరొక ఒడ్డున ఉండిపోయారు. ఈవిధంగా తన్ను నిరాదరించి నందున సత్తెమ్మ రాజుని భార్యాబిడ్డలతో వేరు చేసింది.

మాంధాతరాజు రాజ్యంవదలి పోయినందువల్ల, రాజ్యంలో అరాచకం ప్రబలింది. రాజుని ఎంపిక చేసేటందుకు మంత్రి ఏనుగుకి ఒక పూలదండ ఇచ్చాడు. (ఆపూలమాలను ఎవరి మెడలో వేస్తే, వాళ్లను రాజును చేద్దామనే ఉద్దేశంతో) ఏనుగు వరదలో కొట్టుకొని పోతున్న మాంధాత రాజును తొండంతో లేవదీసి, ఆ పూలదండ అతని మెడలో వేసింది. ఇదంతా సత్తెమ్మ మహిమ అని తెలుసుకొని, ఆమెకు నమస్కరించాడు.

గోదావరి ఒడ్డున చిక్కుకొన్న రాజు పిల్లల్ని, ఒక వ్యాపారి తీసుకెళ్లి పెంచుకున్నాడు. ఒకసారి రాజుభార్య, రాజుపిల్లలు చెరొక పడవలో గోదావరిలో వెళుచుండగా, రాజు పిల్లలు, రాజు భార్యను చూసి (ఎవరెవరో తెలియక) ఏలపాటపాడారు. ఈ పాట విన్న ఆమె యజమాని పిల్లలు యాజమానితో తగవుకు దిగాడు. ఈ తగవు రాజు వద్దకు వచ్చింది. రాజు తన భార్యాపిల్లలను పోల్చుకొని ఆదరించాడు అప్పటినుంచి సత్తెమ్మను భక్తి శ్రద్ధలతో పూజిస్తున్నాడు[25]

ఈ కథను పోలిన కథలు ఆచార్య నాయనికృష్ణకుమారిగారు, డా. ప్రేమలత గారు కూడ తమ తమ గ్రంథాలలో పేర్కొన్నారు. వారి గ్రంథాలలో ఈ కథ 'ఈదెమ్మకథ' అనే పేరుతో ఉన్నది. ఆద్యంతాలలోను, వర్ణనలలోనూ, సన్నివేశకల్పనలోను, ఉన్నతేడా తప్పు కథా సారాంశమొక్కటే. వారి కథలలో మాంధాత పురుష గర్భాన పుట్టినట్టు పేర్కొన్నారు. నేను సేకరించిన కథలో తల్లి దండ్రుల పేర్లు తప్ప, అతడు ఎలా పుట్టాడన్న వివరణలేదు. వారి కథలలో మాంధాత శైవభక్తుడు. ఈశ్వరునికే తప్ప ఆడదేవతకు మొక్కనివాడు. నా కథలో ఈశ్వర ప్రసక్తిలేదు. మొత్తమ్మీద ఈ మూడు కథలలోనూ, తనను కొలవక నిరాదరించిన వారిని దేవత కష్టాలు పాలుచేస్తుందనేది ప్రధానోద్దేశం.

'సూర్యునికి మొక్కడు చుక్కబొట్టు పెట్టడు' అన్న రాజు వర్ణనవల్ల సూర్యారాధనకు మాతృదేవతారాధనకు మధ్యగల వైరుధ్యం తెలుస్తున్నది. సూర్యారాధన ప్రాముఖ్యం నేడు తగ్గుచున్ననూ, భారత, రామయణ కావ్యాలలో ప్రాచుర్యంలో ఉండెను. మనదేశమందేకాక, ఈజిప్టు, ఇరాన్ మొదలైన యితర దేశాల్లో కూడ సూర్యారాధనకలదు. సఫలతకు, పంటల సృష్టికి, సూర్యునికి సంబంధముండుటచే, ప్రపంచ వ్యాప్తంగా సూర్యారాధన ప్రబలినది. ఈతనికి జంతువులను, నరులను బలిగా ఒసగెడివారు[26].

'సూర్యమతము ఉచ్చదశలోనున్నప్పుడు, మాతృదేవతారాధనమునకు ప్రత్యామ్నాయమైన గ్రామదేవతారాధనతో వైరుధ్యమేర్పడి యుండవచ్చును. సూర్యారాధననుమించినది గ్రామదేవతారాధన

అను అంశమును 'సూర్యుని మొక్క సుక్క బొట్టుపెట్ట' అను వాక్యము వెలార్చుచున్నది.[27]

**కాశీరాజు కథ :** కాశీపురాన్ని ఏలేరాజు కాశీరాజు. రాజు తన కోటలో శివాలయం కట్టించి, శివారాధనచేస్తున్నాడు. సకల దానధర్మాలు చేస్తున్నాడు. తనను పూజించటంలేదని, ఆదిశక్తి బ్రహ్మణరూపంలో వెళ్ళి, రాజుని దానం అడిగింది. ఆవేళకి దానం చేసే సమయం దాటినందువల్ల రాజు మరుసటిరోజు రమ్మన్నాడు. మరుసటిరోజు వెళ్ళింది. ఏమి కావాలన్నాడు రాజు. అతను పూజించే శివాలయాన్ని పడగొట్టెయ్యాలన్నది దేవత. రాజు దాని కంగీకరించలేదు. అందుకు కోపించిన దేవత రాజు వైభవం అంతా మాయంచేసి, అతను అరణ్యాలు పట్టి పోయేలాచేసింది.

'ఈశ్వరా ! నీవేదిక్కు' అని రాజు అరణ్యమార్గంలో బయులుదేరి వెళుతున్నాడు. ఆదిశక్తి పెద్దపులి అవతారంలోవచ్చి రాజుని వెంబడించింది. రాజు ఈశ్వరుణ్ణి స్మరించాడు. ఈశ్వరుడు కూడ పులిరూపంలో వచ్చాడు. రెండు పులులూ పోట్లాడుకొనే సమయంలో రాజు తప్పించుకున్నాడు. రాజు వెళ్ళేదారిలో గాలిమేడ కాయించింది. విశ్రాంతి తీసుకుందామని, రాజు ఆమేడలోకి వెళ్ళాడు. శక్తి అతని రెండుకాళ్ళు పట్టుకొని గిరిగిరా తిప్పి, కిందకి విసిరేసింది. ఆ బాధకు రాజు ఈశ్వరుణ్ణి స్మరించుకున్నాడు. ఈశ్వరుడు రక్షించాడు కనికరంతో అన్నం సృష్టించాడు. అన్నం తినటానికి ఉపక్రమించేసరికి, శక్తిపిల్లి రూపంలోవచ్చి, రాజువద్ద నిలబడింది. రాజు తొలిముద్ద పిల్లికివేసాడు. అదితినిపిల్లి చచ్చినట్టునటించింది. తింటే తాను కూడ చనిపోతాననే భయంతో రాజు అన్నం వదలిపారిపోయాడు. అవతారం మార్చి శక్తి కూడ రాజు వెనుక బయులుదేరింది.

ఇలా వెళుతుండగా ఒక రాజు రాజ్యం వచ్చింది. ఆ రాజు తన కుమార్తెకు స్వయంవరం చాటించాడు. ఆ స్వయవరానికి వెళ్ళి రాజుకుమార్తెను కాశీరాజు పెళ్లాడతాడేమోనని, శక్తి, వ్యా సింహద్వారం కడబంటువలె నిలబడి కోటలోనికి ప్రవేశించబోయిన కాశీరాజుని వెళ్లనివ్వకుండ అడ్డగించింది. కాశీరాజు వెనుకకు మళ్ళి, అరణ్య మార్గాన వెళుతున్నాడు. అక్కడున్న జలాశయంలోకి నీరు త్రాగటానికి దిగాడు. రాజుని నీరు త్రాగనివ్వకూడదని. శక్తి మొసలి రూపంలో ప్రత్యక్షమయ్యింది. రాజు భయపడి, నీరు త్రాగకుండానే ఈశ్వరుని స్మరించుకుంటూ అక్కడ నుంచి బయులుదేరాడు. దారిలో ఒక గ్రామంలో పెళ్లి జరుగుతుంది. భోంచేద్దామని, పెళ్లిపందిరిలోకెళ్లి కూర్చున్నాడు. వారు వడ్డించినవి తిందామని, ఉపక్రమించబోయేసరికి, ఆదిశక్తి పందిరికినిప్పుపెట్టి పారిపోయింది. భయంతో రాజు భోజనం మానుకొని లేచి పారిపోయాడు. ఇక కష్టాలు భరించలేక రాజు కొడమీదనుంచి దూకి చనిపోదామని కొండెక్కాడు. రాజుని చావనివ్వకూడదని ఆదిశక్తి ఏనుగురూపంలో రాజుదూకే కొడకింద నిలబడింది. రాజు ఏనుగు పైకి దూకి బ్రతికాడు. రాజును విడిచిపెట్టి ఆదిశక్తి మాయమయ్యింది. ఈశ్వరుడే తనను కాపాడాడని తలంచిన రాజు ఈశ్వరుణ్ణి స్మరించుకున్నాడు. ఈ మాటలు విన్న ఆదిశక్తి మరింత కోపించింది.

ఆదిశక్తి పామురూపంలో రాజుమీది కొచ్చింది. రాజు ప్రార్థించగా, ఈశ్వరుడు ముంగిస రూపంలోవచ్చి, రాజుని కాపాడాడు. రాజు ఆకలి తీర్చటానికి ఈశ్వరుడు బాలమామిడి వృక్షం సృష్టించాడు. ఆ బాలమామిడి ఫలములు తిందామని రాజు వాటిని కోసి తినబోయేసరికి, వాటిలో పురుగులను సృష్టించింది ఆదిశక్తి. వాటిని విడిచి రాజు తనదారిన వెళ్లిపోయాడు. అడవిలో

కోయవాళ్ల ఆదిశక్తికి సంబరం చేసుకొంటున్నారు. ఆదిశక్తి వాళ్లకు సర్వసంపదలూ ఇచ్చి చల్లగా కాపాడుతుంది. ఈవిషయం తెలుసుకున్న రాజు ఆమెకు సాష్టాంగ పడినమస్కరించాడు. ఆదిశక్తి అతనిని లేవదీసి, ఓదార్చి, జరిగినదంతా చెప్పింది. శక్తిమహిమ తెలుసుకున్న రాజు ఈశ్వరుని గుడి పడగొట్టించి, శక్తి గుడి కట్టించి పూజించటం ప్రారంభించాడు[28]

ఈ కథలో ఆదిశక్తి తనను పూజించని రాజును బాధపెట్టడం, తన భక్తుడైన రాజును ఈశ్వరుడు కాపాడడం కన్పిస్తుంది. ఈశ్వరునికంటె శక్తే గొప్పది. ఈశ్వరుడు ఆయా సందర్భాల్లో పులి, ముంగిస మొదలైన రూపాల్లో వచ్చి శక్తిబారినుంచి రాజుని కాపాడినా, చివరకి రాజు శక్తిభక్తుడై, ఈశ్వరుని గుడి పడగొట్టించి, ఆదిశక్తి గుడికట్టించాడు. కాబట్టి శక్తే గొప్పదని కథకుని భావన. శైవమత ప్రభావంవల్ల మాతృదేవతారాధన మరుగున పడుతున్న కాలంలో మాతృదేవత గొప్పతనాన్ని చెప్పి, అంతరించుచున్న స్త్రీ ప్రాధాన్యాన్ని నిరూపించటానికి ఈ కథ కల్పింపబడి యుండవచ్చును. విపులంగా పరిశీలిస్తే ఈ వైరుధ్యానికి కారణం స్పష్టమవుతుంది.

హిందూమతంలోని శైవశాఖాదైవములన్నీ అవైదికములు. ద్రావిడ దైవములు[29]. వైదిక రుద్రునకు, హిందూమత శివునకు ( రుద్రుడను పర్యాయనామం తప్ప) సామ్యం లేదు. లింగపూజ సింధుజనుల మతంలో ఒక ముఖ్యాంశం[30]. పూజార్హమైన రాతిలింగాలు మొహెంజదారోహరప్పా తవ్వకాల్లో లభించాయి[31]. సింధునాగరికతావశేషాలను, ఇతర శాసనాలను పరిశీలించిన అనేక చారిత్రకులు సింధుప్రజానీకం మతంలోని ముఖ్యాంశము శివశక్త్యారాధన అనీ శివశక్తులే వారి దైవాలని నిర్ధారించిరి[32]. 'శైవమతము ఆర్యుల వైదిక మతముకన్న చాల ప్రాచీన మైనదిగను, శివుడు, శక్తి, నానారూపములతో దక్షిణా పథమందే.కాక హిందూస్థానమునకు పశ్చిమ మందుగల అనార్యదేశములందును పూజింపబడుచున్నట్లు కానవచ్చుచున్నది' అని సురవరం ప్రతాపరెడ్డిగారు పేర్కొనిరి[33]. ఈ వివరణవల్ల వైదికయుగానికి పూర్వం నుంచీ శివపూజ శక్తిపూజ ఉండేవని స్పష్టమగుచున్నది.

శివుడు ఆటవిక దశయందే ఆవిర్భవించినను, ఒకదశలో అతనికి తన పూర్వులైన మాతృదేవతలలో స్పర్థ కలిగి ఉండవచ్చునని శ్రీకోసంబిగారు వివరించిరి[34]. కాళీఘాట్‌లోని చిత్రములందు ఇతర పురాణచిత్రములందుగల కాళికాదేవి, శివుని మృతశరీరమును తొక్కుచున్నట్లు కలదు. తర్వాత ఆమె కృపవలన అతడు పునర్జీవితుడైనట్లుగా కథ, వారిద్దరిమధ్య వైరుధ్యములేదని వివరించుటకు కల్పింపబడినదో[35]. ఈ వివరణవల్ల శివునకు, మాతృదేవతలకు మధ్య స్పర్థలు ఒకొనొక దశలో ఏర్పడినవని తెలియుచున్నది. విజయం ఎవరికి లభించినా శైవ మాతృదేవతారాధనల మధ్య స్పర్థయే కథలోని ప్రధానాంశం.

**స్వామివారి విజ్జుల మేడల (సత్తెమ్మ నివాసం) లోని కెళ్లడం :** ఇంద్రపురిని పాలించే రాజు ఇంద్రశ్చేనుడు. అతని కుమారులు అయిదుగురు నంబులు. వారు శక్తిదేవతను భక్తితో కొలిచేవారు. వారికి ఆ దేవత సకల సంపదలూ ఇచ్చింది. ఆ భాగ్యం చూసుకొని, 'ఆడదేవతకు దండం పెట్టకూడదని' తలచి శక్తి గద్దెలు (దేవతా స్వరూపాలుగా ఉండే ఎత్తైన న పీటలు) తవ్వేశారు. దేవతకు కోపమొచ్చి, అయిదుగురినీ ఐదు తాళ్లకు కొరత లేసింది. ఏనాటికైనా

వారి వంశంలో వంశపాలకుడు పుట్టి, శక్తిని పూజించి, శక్తి అడిగిన బూతెట్టి, (కోరిన కోరిక తీర్చి) తండ్రులకొరతలు దగ్గరకు రప్పించాలి. అప్పుడు వాళ్లను కొరతల నుంచి తీస్తుంది. అని శపించి, శక్తి తన విజ్జుల మేడలలోని కెళ్లి నిద్దరపోయింది.

ఈ రాజుల భార్యలు భర్తలు లేనందువల్ల, పిల్లలు కలిగినా, వారితోనైనా రాజ్యపాలనంచేయించ వచ్చునని, నోయరాని నోములునోచారు. పిల్లలు కలగలేదు. వారిలో శివనందుల బాగీర్థమ్మ సంతానం దొరికితే ఇంటికొస్తాను. లేకుంటే రానని, ఇల్లు విడిచి వెళ్లింది. అరణ్యంలో ఒక బాలమామిడితోటలో ఎండిమోడువలె ఉన్న చెట్టుకింద పడుకున్నది. (చెట్టువిరిగిమీద పడితే చనిపోదామని).

ఇదంతా పైనుంచి చూస్తున్న త్రిమూర్తులు తమ తల్లి ఆదిశక్తివాళ్లను చాలా బాధలు పెడుతుంది. శక్తి గర్వమణచాలని విష్ణువుని పంపారు. విష్ణువు తన చేతిలో శూలాన్ని ఎండిన చెట్టుకి విసిరాడు. అది తగిలిచెట్టు చిగిరించి, పుష్పించి, కాయలు కాసింది. ఒక కాయ బాగీర్థమ్మ చాతిమీద పడింది. అది చూసిన బాగీర్థమ్మ, ఎండిన చెట్టు ఫలించిన పండుతింటే తన గర్భంకూడ ఫలిస్తుందని తలచి, ఆ పండు తిన్నది. గర్భం దాల్చిన ఆమె తొమ్మిదిగడియల కల్లా బాధలు ప్రారంభమయ్యాయి. కడుపులోని పిండం 'అమ్మా! నేను పుట్టి, శక్తి కోరికతీర్చి, శక్తిని తోలుకొచ్చి, మాతండ్రులను విడిపిస్తాను' అన్నాడు. ఈ మాటలు విన్న తల్లికి తన గర్భాన దెయ్యమో పిశాచమో పుట్టేలా ఉందని తలచి మరింత బాధపడింది. తల్లిబాధలు చూడలేక బాలుడు వెన్నునపద్దమేసుకొని (వెన్నుబద్దలు చేసుకొని) పుట్టాడు. పుట్టిన కొడుకుని పట్టుకోబోతుంటే 'నన్ను అంటవద్దు, ముట్టవద్దు'. మూడు రోజులు నేను నీటిలో ఉంటాను. తర్వాత విజ్జులకు దారి చూపితే, శక్తిని తోలుకొచ్చి, తండ్రులను విడిపించుకుంటాను' అన్నాడు. 'శక్తిదేనాడు, నీదేనాడు గొప్ప గొప్ప రాజులు. మునులుకూడ శక్తి చేతిలో అంతమైపోయారు. శక్తి అన్న మాట మానరా, అన్నాది. శక్తికి కావలసిన అప్పాలు, పాలకాయులు, తెలగపిండికూర, గొర్రె, మేక మాంసాలన్నీ తీసుకెళ్లి శక్తికి బూతెట్టి / కోరికతీర్చి / తండ్రుల్ని విడిపించుతానన్నాడు. శక్తిచేతిలో నీవు మరణమై పోతావు వద్దన్నది. వినడు. పెళ్లి చేసుకుంటే, నీవు లేకున్నా నీ భార్యను నీవలె చూసుకొని ముచ్చటపడతానన్నది. నేను శక్తిచేతిలో చస్తే, ఎన్నాళ్లకోడలి చేత ముండకాపురం చేయిస్తావన్నాడు. బొంగరం ఆటఆడితే, చూసి ఆనందిస్తానన్నది. బొంగరంతో ఆడినపుడు, అది ఎవరికైనా తగిలితేవచ్చే అనర్థాలు గురించి చెప్పి, గతంలో బొంగరం ఆట ఆడుతున్న బాలుని బొంగరం తగిలిన ఆమె కాపురానికి చెడ్డదని, కావున బొంగరాలాట ఆడనన్నాడు. ఎంత వారించినా వినక, ఒక తులసిమొక్కపాతి, అది బ్రతికున్నట్లయితే, తాను బ్రతికినట్లు, అది చనిపోతే, తాను చనిపోయినట్లు భావించమని, తల్లితోచెప్పి, బాలుడు శక్తిని పట్టుకోవటానికి బయలుదేరాడు.

ఈ బాలుని పేరు రవద్దేవి రాముడు. స్వామివారు అనికూడ అంటారు. విష్ణువే రవద్దేవి రాముడుగా పుట్టాడు. శక్తికి కావలసిన బూతులు అప్పాలు, పాలకాయులు, తెలగపిండికూర, మేక, గొర్రె మాంసం, కల్లు / ఇవన్నీ ప్రస్తుతం పంబలవారు చేసే సత్తెమ్మ సంబరాలలో వాడతారు / మొదలైనవన్నీ పట్టుకొని శక్తిని వెదకుతూ బయలుదేరాడు.

రవద్దేవి రాముడు బయలుదేరి అరణ్యాలు అడ్డడి, వెళుతుంటే, తన నివాసంలో ఉన్న సత్తెమ్మకు ఒంట్లో నలతగా అన్పించి, తనకు కలుగబోయే కీడును శంకించి భయపడుతూ, అన్నకూర్మరాజును తనకు కలుగబోయే కీడు గురించి అడిగింది. అతడు పంచాంగాలు పరిశీలించి, నంబుల వంశాన్ని బుట్టిన రవద్దేవి రాముడివల్ల శక్తికి కీడు కలుగుతుందని తెలుసుకొని, ఆ విషయంచెబితే, శక్తి మరింత భయపడిపోతుందనే ఉద్దేశంతో, 'సమస్త సృష్టికి ముందు పుట్టావు. నీకంటె గొప్పవారెవరు?' అని ఓదార్చాడు. శక్తి ఆందోళన తీరక, తమ్ముడు పోతురాజును ద్వారం వద్ద కాపలా ఉంచి, నూటనొక్క చెల్లెళ్లనూ తన పాన్పు చుట్టూ కాపలా పెట్టుకుంది. ఇంకా ఆందోళన తీరక, పిడకలు ఏరుకొనే నెపంతో గంపచేత బట్టుకొని, ముసలివేషంతో రాముణ్ణి చూడ్డానికి బయలు దేరింది. పిడకల గంప అరణ్యంలో ఒక చోట ఉంచి అక్కడ కూర్చుంది.

ఆ దారినే వస్తున్న రాముడు ఈ ముసలామెను శక్తి గురించి, విజ్ఞాలు గురించి అడిగాడు. ఈతడే రవద్దేవి రాముడని గ్రహించిన శక్తి, గంపనెత్తమని బాలుణ్ణి సహాయమడిగి, ఎత్తుతున్న బాలుడిమీదికి గంపవదిలేసి, పారిపోయింది. బాలుడు లేచి, ఈమె శక్తే అవుతుందని తెలుసుకొని, ఆమె పరుగెత్తిన మార్గం గుండా అడుగుజాడలనుబట్టి బయలుదేరాడు. తన అడుగుజాడలు పట్టుకొని రవద్దేవి రాముడు వస్తాడేమోనని, తను రోజూ స్నానంచేసే, బావి వరకు నడిచి వెళ్లి, తన అడుగుజాడలు కన్పించకుండుటకు, ఒక నక్కను పుట్టించి, నక్కకు నరలోకంలో నరమాంసం పెడతానని ఆశగొల్పి, నక్క నెక్కి తనమేడలకు వెళ్లిపోయింది. నక్కను తన దగ్గరే కట్టేసుకుంది. ఆనాడు శక్తికట్టుకోబట్టే, ఈనాడు శక్తి గుడిలో ఆమె ఎడమ కాలివద్ద నక్కను వేస్తారు.

రవద్దేవి రాముడు శక్తి అడుగుజాడలనుబట్టి బావివరకు వచ్చాడు. అక్కడనుంచి అడుగుజాడలు కన్పించకపోవటంలో, ఆమె మళ్లీ అక్కడకు వస్తుందని గ్రహించి అక్కడే ఉన్నాడు. శక్తి ఎంతకీ రాకపోయేసరికి, తననుచూసి, భయపడి రాలేదనుకుని, పసిబాలుడై బావిలోపడి ఏడుస్తున్నాడు. ఈ ఏడ్పు సత్తెమ్మకు విన్పించి, 'నీకు నరమాంసం పెడతానన్నాను కదా !' నూతిలో బాలుడున్నాడు వెళ్లితిన' మని నక్కను పంపింది. సత్తెమ్మ వస్తుందనుకుంటే నక్క వచ్చిందేమిటని నక్కముందుకు వచ్చాడు బాలుడు. నక్కబాలుణ్ణి మింగింది. బాలుడు నక్కకడుపులో చేపగామారి, నక్కను బాధపెట్టాడు. బాధనుభరించలేక నక్కవేడుకుంది. నక్క నోటినుంచి బయుటకు వచ్చి, 'నన్ను మింగినట్లే, పుట్టబోయే నరలోకంలో నరులను కూడ మింగితే, నరలోకం ఉండదు. ఊళ్లోకి రాకుండ స్మశానంలో పాతిపెట్టిన శవాలనే తిను. అలా చేయకపోతే, తలపగిలి మరణిస్తావు' అని హెచ్చరించి, తన గురించి శక్తికి చెప్పమని నక్కను విడిచాడు. నక్క శక్తివద్దకు వెళ్లి జరిగింది చెప్పింది. శక్తి మరింత భయపడి, బాలుణ్ణి నూనెలో వేసి తన నోటి కందించమని తన నూటనొక్క చెల్లెళ్లను పంపింది. బావివద్దకు వచ్చిన చెల్లెళ్లు బాలుణ్ణిచూసి, ముచ్చటపడి, పెంచుకోవటానికి వాళ్లలో వాళ్లు వంతులాడుకున్నారు. బాలుడు నూతిలోకి దిగిన నూటనొక్క దేవతలను కంపతో బాదుతున్నాడు. ఆ బాధకువాళ్ళు పెద్దగా అరుస్తున్నారు. ఆ అరుపులు విని, సత్తెమ్మ తన చెల్లెళ్ళనే కొడుతున్నాడు. దొరికితే తనను చంపేస్తాడేమోనని భయపడి, తనమేడలు మొదలైనవన్నీ తమ్ముడు పోతురాజుకి అప్పగించి నల్లచీమ అవతారమెత్తి నాగలోకం పారిపోయింది.

నూటనొక్క చెల్లెళ్లను బాగా బాది వాళ్ల అప్పను తనకప్పగించమని వదలిపెట్టాడు. వాళ్లు తమ దారిని తాము వెళ్లిపోయారు. నక్క అడుగులు పట్టుకొని శక్తి మేడలకు వచ్చి, ఈగ అవతారమెత్తి ఇల్లంతా దోమ అవతారమెత్తి దొడ్డంతా వెదికాడు. ఎంతకీ కనిపించక పోయేసరికి, ఆ మేడలో ఉండే వివిధ వాద్యాలు వాయించాడు. చివరగా పంబనాదం వాయించాడు. పంబనాదం విన్న సత్తెమ్మ నాగలోకం నుంచి వచ్చి, ఒంటికాలికి మువ్వలు కట్టుకొని, పంబనాదం వాయింపు కనుగుణంగా ఆడింది. ఆడి ఆడి ఆడలేక కిందపడిపోయింది. పడిపోయిన శక్తిని పట్టుకొని రాముడు చంపబోయాడు. చంపకుంటే తన తండ్రులని బ్రతికిస్తానన్నది. అతడడిగిన కోరికలు తీర్చమన్నది. తన తండ్రుల్ని విడిపించటానికి రమ్మన్నాడు. అడిగినవన్నీ ఇస్తే, వస్తానన్నది. ఇస్తానన్నాడు. ఎంగిలిలేని దాహాలు కావాలన్నది. ఏ నీరు తెచ్చినా ఎంగిలే అన్నది. చివరకు రవద్దేవి రాముడి ఒంటి రక్తం కావలసినంతా పీల్చుకొని దాహాలు తీర్చుకుంది. రవద్దేవి రాముడి, గుండె మూలుగ మొదలైనవన్నీ అడిగింది ఇచ్చాడు. చివరకి కళ్లు కూడ అడిగింది.

శక్తి పైటచెంగు అందుకొని, కళ్ళుకూడ ఇచ్చాడు. బాలుణ్ణి ఎలాగైన చంపదలచుకున్న శక్తి, బాలుణ్ణి సముద్రంలోనికి తీసుకెళ్లి, ఇద్దరూ సరిగంగ స్నానాలాడాలంది. ఇద్దరికీ పెళ్లి కావాలంది. అంగీకరించాడు. పెళ్లికి కావలసిన సామాగ్రిగా, నూరని పసుపుముద్ద, వడకనినూలు, నేయని వస్త్రం, కుంపటిలో కాల్చని, సుత్తితో కొట్టని మంగళసూత్రం, చేయని అక్షింతలు కావాలంది. శక్తిని ఆవహించిన ఒక దూతను చంపి, పళ్లను అక్షింతలుగాను, చర్మం నేయని వస్త్రంగాను, మెదడు నూరని పసుపు ముద్దగాను, నాలుక సుత్తితోకొట్టని మంగళసూత్రంగాను ఇచ్చాడు.

ఇద్దరికీ పెళ్లి జరిగింది. సరిగంగ స్నానాలు చేసే సమయంలో శక్తి పైటచెంగు ముడివిప్పుకొని, మత్స్య అవతారమెత్తి మాయమయ్యింది. అంత కంటె పెద్ద మత్స్యావతారమెత్తి పట్టుకున్నాడు. కప్పయితే పామయ్యాడు. పులి అయితే రేచుకుక్క అయ్యాడు. ఎలుగుబంటి అయితే అగ్నిహోత్రుడయ్యాడు. పెట్ట అయితే, పుంజు అయ్యాడు. ఈవిధంగా ఆదిశక్తి అవతారానికి తగిన అవతారమెత్తి, చివరకు ఆమెను పట్టుకున్నాడు. తన తండ్రుల్ని విడిపించమన్నాడు. కొరతలకు ప్రతికొరతలు కావాలన్నది. వేరొక రాజు భార్యకు గర్భిణి కలిగించి, ఆమె ప్రసవించిన అయిదుగుర్ని, తాను మంత్రసాని వేషంలోవెళ్లి చంపుతానని, వాళ్లను ప్రతికొరతలు వేసి, తన తండ్రుల్ని విడిపించుకోమన్నది. రవద్దేవి రాముడు ఆవిధంగా చేసాడు.

ఈవిధంగా తండ్రులను విడిపించి, రాజ్యానికి తీసుకెళ్లి, వారు శక్తిని పూజించక నిర్లక్ష్యం చేసినందువల్లే, ఆమె నానాబాధలు పెట్టిందని చెప్పి, వరాన్ని పుట్టిన రవద్దేవి రాముడు అంతర్ధానమయాడు. ఆ రాజులు శక్తి మహిమ తెలుసుకొని, ఆమె గద్దెలు ఏర్పరచి, తమ పూర్వీకులవలె పూజించడం మొదలు పెట్టారు[36].

ఈ కథలోని కొన్ని పాత్రలను, సన్నివేశములను పోలినకథను, 'అంకమ్మ కథ' అను పేర, 'తెలుగు జానపదసాహిత్యము – పురాగాథలు' అనే గ్రంథంలో డా. ప్రేమలతగారు పేర్కొనియున్నారు. ఈ రెండు కథలలోనూ నాయకుని పేరు రవద్దేవి రాముడే, నాయకుని తల్లి శివనందుల బాగీరథమ్మే నాయకుని తండ్రిని దేవత కొరత వేయటం, నూతిలోనున్న బాలుణ్ణి మింగమని దేవత నక్కను

పంపటం, దేవత నాగలోకం వెళ్లడం, దేవతను మెప్పించి, రాముడు తండ్రిని విడిపించడం మొదలయినవన్నీ సమానమే. కాని కథ ప్రారంభంలోనూ, ముగింపులోనూ, ఇతర సన్నివేశాల కల్పనలోనూ, కథాకథనంలోనూ పొంతనలేదు. సామాన్యంగా గ్రామదేవతల కథలలో ఇలాంటి వ్యత్యాసాలు కన్పిస్తాయి.

ఈకథలో శక్తి దేవతకు, విష్ణువరపుత్రునికి వైరం వర్ణింపబడింది. శక్తికంటె స్వామి గొప్పవాడని, శక్తిది దశావతారయితే (ఆయా సందర్భాల్లో నల్లచీమ, చేప, పులి మొదలైన అవతారాలెత్తిందని వర్ణించబడింది కాబట్టి) స్వామివారిది దశా పన్నెండు (ఆమె అవతారానికి తగ్గ అవతారం ఎత్తి సాదించాడు. కాబట్టి) అవతారలని కథకుని భావన. వీరిలో గెలుపెవ్వరిదైనా, శక్తిని కొల్వక నిర్లక్ష్యం చేసిన వారిని బాధలు పెట్టి తనను తెలుసుకొనేటట్లు చేస్తుందనేది కథాధ్యేయమనవచ్చును. ఈ కథలో నాయకుని తండ్రులు 'నంబులు' అని పేర్కొనబడ్డారు. 'నంబి' అనగా విష్ణు భక్తుడని అర్థం. వైదిక మతము ఉచ్ఛస్థితిలో ఉండి, మాతృదేవతనిన చులకన భావమేర్పడినకాలంలో, తమను కొలవక నిర్లక్ష్యం చేసినవారిని మాతృదేవత కష్టాలు పాలు చేస్తుందని తెలియచేయటానికి జానపదుని కల్పనగా ఈ కథను చెప్పవచ్చును.

**సత్యాల చంద్రుడు :** పాంచాల పురాన్ని జగపతిరాజు పరిపాలిస్తున్నాడు. ఆతని భార్యకుందవమాదేవి. వారికి సంతులేదు. సంతులేని తమ లాంటివారు బ్రహ్మనడిగి సంతుపొందుతున్నారు. నేను కూడ బ్రహ్మనడిగి సంతానాన్ని తెచ్చుకుంటానని భార్య భర్తతో అన్నది. నీవు ఎన్నడూ ఇల్లువిడిచి బయటకెళ్లనిదానవు. నేనే వెళ్లతానని, జగపతిరాజు బ్రహ్మపురమెళ్లి, బ్రహ్మను ప్రత్యక్ష్యంకావించుకొని సంతు పొందివస్తున్నాడు. వస్తున్న రాజుని ఆదిశక్తిచూసి, అతడు బ్రహ్మ దగ్గర కెళ్లడం కంటె తనను కొలిస్తే, తానే ఇచ్చేదానను కదా! అన్నది. ఆ రాజు మళ్లీ బ్రహ్మదగ్గరకెళ్లి, ఆదిశక్తి తనతో అన్నమాటలు చెప్పాడు. ఆదిశక్తి చెప్పినట్టే జరుగుతుంది. కాబట్టి మగపిల్లలు పుడితే పెంచమని, ఆడపిల్లలు పుడితే చంపమని బ్రహ్మ చెప్పాడు. బ్రహ్మవరాన్ని కుమారుడు పుట్టిన ఏడు గడియలకు భూమి పెళ్లగించుకొని రెండు దేవతాకుక్కలు కూడ పుడతాయని, అవి, ఆ కుమారుడికి మేలుచేస్తాయని కూడ బ్రహ్మ చెప్పాడు.

జగపతిరాజు బ్రహ్మపురం నుంచి ఇంటికొచ్చి, రెండుబాలనేరేడు ఫలములు భార్యకిచ్చాడు. అవితిన్న తొమ్మిది గడియలకు మగబిడ్డ జన్మించాడు. బ్రహ్మ చెప్పినట్టు భూమినుంచి రెండు కుక్కలు కూడ పుట్టుకొచ్చాయి. వీరి పుట్టుక గురించి, బ్రాహ్మణులనడుగగా, వారు పుట్టడం మంచిదేనని బ్రాహ్మణులు అన్నారు. కుందమాదేవి కుడిచన్నుపాలు కుక్కలకు, ఎడమ చన్నుపాలు బాలుడికి ఇచ్చి, ముగ్గురునీ సమంగా పెంచుతుంది.

ఆ బాలుడికి సత్యాల చంద్రుడు అని పేరు పెట్టారు. అతనికి అయిదేళ్ల ప్రాయమొచ్చాక బడిలోకెళ్లి చదువుకుంటున్నాడు. బడికెళ్లుతున్న చంద్రుణ్ణి చూడగానే, ఆదిశక్తికి తన ప్రతిజ్ఞ జ్ఞాపకమొచ్చి, ఆడపిల్లై, కుందమాదేవి గర్భాన ప్రవేశించి, తొమ్మిది గడియలకల్లా భూమిమీద పడి, కేరకేరమని ఏడుస్తున్నది. ఈ ఏడ్పు విన్న రాజు బాలికను స్మశానంలోనికి తీసుకెళ్లి చంపమని కటికవాళ్లను పంపాడు. కటిక వాళ్లు కుందమాదేవి వద్దకువచ్చి, రాజాజ్ఞగురించి చెప్పి, ఆ పిల్ల

నిమ్మంటారు. కుందమాదేవి ఏడుస్తున్నది. ఇంతలో చంద్రుడు వచ్చి, విషయం తెలుసుకొని, ఈ రాజ్యంలో ఉంచకుండా, చెల్లెలను వేరొక రాజ్యానికి తీసుకెళ్ళి పెంచుకుంటానని, ఆ పసిబిడ్డను తీసుకొని, చంద్రుడు అరణ్యమార్గాన బయలుదేరాడు.

నా రాజ్యంలో ఉంటే నీకు ముప్పు తెస్తానని నన్ను ఇంకో రాజ్యం తీసుకెళుతున్నావా! నిన్ను ఎలాగైనా చంపుతానని మనసులో అనుగొని పసిబిడ్డ (ఆదిశక్తి) కేరకేరమని ఏడుస్తున్నది. చంద్రుడు ఆ సమీపంలో ఉన్న గ్రామానికెళ్ళి'చెల్లిని ప్రసవించి తల్లి చనిపోయింది. చెల్లిని పెంచుకోవటానికి పాలు పొయ్యమని' యాచించి తెచ్చినపాలు చెల్లెలుకు పట్టాడు. ఈవిధంగానే పాలు యాచిస్తూ, ఆరేళ్ళప్రాయం వచ్చేవరకు చెల్లెలును పెంచాడు. తన రాజ్యానికి వెళ్ళకూడదని ఆ అరణ్యంలో చెట్టు క్రింద 'ఆరాకుల పందిరి మూడాకుల గుడిసె' వేసి, ఆగుడిసెలో అన్నాచెల్లెళ్ళిద్దరూ ఉంటున్నారు. చంద్రుడు మృగాలను వేటాడి, వాటిని సమీపంలో ఉన్న పులిరాజు పట్టణంలో అమ్మి, ఆడబ్బులతో జీవిస్తున్నారు. ఆవిధంగా సంపాదించిన డబ్బుతో ఒక చంద్రహారంకొని, చెల్లెలు మెడలో వేసి, ఆమెకు చంద్రకాంత పేరు పెట్టాడు

కొన్ని రోజులు గడిచింది. చంద్రకాంతకు పెళ్ళియీడు వచ్చింది. పెళ్ళి ఈడు వచ్చినా, తనకు పెళ్ళిచేయలేదని అన్నను తిడుతూ, బావికి నీళ్ళకెళ్లింది. అక్కడున్న పల్లెవారికి అన్నతనకు పెళ్లిచేయటంలేదని గోడువెళ్ళబోసుకుంది. అదివిన్న పల్లెరాముడు సమీపంలో ఉన్న పులిరాజు పట్టణంలో ఉన్న గంగమారాజుకిచ్చి పెళిచేస్తాను రమ్మన్నాడు. తన అన్న బ్రతికుండగా, తనకుపెళ్లి జరగదని, తన అన్నను చంపే మార్గం చెప్పమన్నది. నీ మెడలోనున్న హారంనాకిచ్చి, ఇంటికెళ్ళి దుఃఖించు. దుఃఖానికి కారణమడిగిన అన్నతో చంద్రహారం నూతిలో పడిందను. ఇంకొకటి కొంటానంటే, అదే కావాలను. చెల్లెలిమీద ప్రేమకొద్దీ, నూతిలోనికి దిగుతూ, తన నడుముకు కట్టుకున్న తాడు నీచేతికిస్తాడు. ఆ తాడు వదిలేస్తే నూతిలోపడి మరణిస్తాడు' అని పల్లెరాముడు సలహాయిచ్చాడు.

పల్లెరాముని సలహానుసరించి, అన్నను నూతిలో పడవేసి, చంద్రకాంత పల్లెరాముడితో పులిరాజుపట్నం వచ్చింది. పులిరాజు పట్నంలో ఊరి చివర ఒక గుడిసెలో చంద్రకాంతతో కాపురము మొదలెట్టాడు పల్లెరాముడు. తనను మోసంచేసాడన్న విషయం గ్రహించి, ఏమీచేయలేక చంద్రకాంత అతనితోటే ఉంటున్నది. నూతిలోపడిన చంద్రుణ్ణి కప్పలన్నీ తెప్పకట్టి, పాములన్నీ పాన్పువేసి కాపాడాయి. చంద్రుని కుక్కలు నూతిలో తమ అన్న పడ్డాడన్న విషయం గ్రహించి, నూతిచుట్టూ తిరుగుతూ అరుస్తున్నాయి. ఆదారిన బోయే ఇద్దరు బ్రాహ్మణులు కుక్కలు అరుస్తున్న నూతివద్దకు వెళ్లి నూతిలో ఉన్న చంద్రుణ్ణి చూసి, అతనిని బయటకు తీసారు. పైకి వచ్చిన చంద్రుడు తనచెల్లెలు కనిపించనందుకు ఏడుస్తున్నాడు. చెల్లెలును వెదకుతూ, కుక్కలను తీసుకొని, సమీపంలో ఉన్న పులిరాజు పట్నం వచ్చాడు.

ఆ పట్నంలో ఊరి చివరనున్న మంచినీళ్ల చెరువులో ఉన్న జాడీమెకం (ఒకక్రూరమృగం) నీళ్లకు దిగిన మనుషుల్ని తినేస్తుంది. ఆ మృగాన్ని చంపిన వాళ్లకు తన కుమార్తెనిచ్చి పెళ్లిచేస్తానని రాజు ప్రకటించాడు. కుమార్తెతోపాటు అర్థ రాజ్యంకూడ ఇస్తానన్నాడు. ఈ విషయం తెలియని

చంద్రుడు నీరు త్రాగటానికి చెరువులోకి దిగి, తనను చంపటానికి వచ్చిన మృగాన్ని కుక్కల సహాయంతో చంపాడు. ఆ మృగం యొక్క తోక, కాళ్లు కోసుకొని తన దారినవెళ్లిపోతున్నాడు. ఇదంతా కోటపై భాగాన్నుండి చూస్తున్న రాజకుమార్తె పుష్పాలగంధి, ఈ విషయం తండ్రికి చెప్పింది. రాజు తన భటులను పంపి, చంద్రుణ్ణి తన కోటకు రప్పించాడు.

తన కుమార్తెనిచ్చి, అర్ధరాజ్యాన్నికూడ ఇస్తానన్నాడు. ఆవిధంగా పెళ్లిచేసుకొని రాజ్యంలో ఉంటే తన చెల్లెలు కన్పిస్తుందనే ఉద్దేశంతో చంద్రుడు పెళ్లి కంగీకరించాడు. పులిని చంపిన చంద్రుడికి తన కుమార్తెనిచ్చి పెళ్లిచేస్తున్నట్లు, పట్టణంలోని స్త్రీలంతావచ్చి, వరునికి నలుగుపెట్టి, స్నానం చేయించాలని రాజు చాటింపు వేయించాడు. ఈ చాటింపు విన్న చంద్రకాంత (ఆదిశక్తి) తన అన్ననూతినుంచి బయటపడ్డాడని తెలుసుకొని, అతనిని ఎలాగైనా చంపాలనే ఉద్దేశంతో రాముడితో విషం తెప్పించి, ఆ విషం పట్టుకొని కోటకుబయలుదేరింది. మిగతా స్త్రీలంతా నలుగుపెట్టే సమయంతో చంద్రకాంత విషాన్ని చంద్రుడి ఒంటిపై పోసింది. ఆ విషం శరీరానికెక్కి అతడు మరణించాడు. అతనిని స్మశానానికి తీసుకెళ్లి, దహనం చేసే సమయంలో అతని పై ప్రేమతో కుక్కలు అతనిని నాకగా, అతని ఒంటినున్న విషమెక్కి కుక్కలు మరణించాయి. చంద్రుడు బ్రతికాడు. మరణించిన కుక్కలను చూసి చంద్రుడు దుఃఖించాడు. ఈ దుఃఖం బ్రహ్మకు వినపడింది. తన వరాన్ని పుట్టిన చంద్రుడు, కుక్కలు కష్టాల్లో ఉన్నాయని గ్రహించి, బ్రహ్మ దోమలను పంపించాడు. దోమలు కుక్కలను కరవగా, దోమలు మరణించి, కుక్కలు బ్రతికాయి. బ్రహ్మ సంజీవగాలి పంపాడు. ఆ గాలి తగిలి దోమలుకూడ బ్రతికాయి.

ఇదంతా విచిత్రంగా చూసిన మంత్రి, జరిగినదంతా రాజుతో చెప్పాడు. రాజు చంద్రుణ్ణి కోటకు రప్పించి, రహస్యంగా పెళ్లి జరిపించాడు. చంద్రుడు భార్య పుష్పాలగంధితో తన చెల్లెలిని వెదకేవరకూ పుట్టింటిలోనే ఉండమని, చెల్లెలుకోసం బయలుదేరాడు. పుష్పాలగంధి తానెక్కే తెల్లగుర్రాన్ని భర్తకిస్తూ, నా భర్తకు ఎలాంటి ఆపద కలిగినా తనతో కలపమని గుర్రంతో చెప్పింది. చంద్రుడు తెల్లగుర్రమ్మీద బయలుదేరాడు. ఊరిచివర చెరువు ఒడ్డుకు వచ్చేసరికి, అక్కడ గుడిసెలోనున్న చెల్లెలును చూసి పలకరించాడు. ఆమె అన్నతో చేయి జారినందున ఆరోజు నూతిలో పడవేసానని ఎంతో దుఃఖ పోయింది. అన్నిరోజులూ తన చెల్లెలును ఆదరించి, తన కప్పగించినందుకు పల్లెరాముడికి కృతజ్ఞతలుచెప్పి, చంద్రుడు చెల్లెలును తీసుకొని బయలుదేరాడు.

అన్నతో బయలుదేరిన చంద్రకాంత అతనిని చంపలేకపోయినందుకు బాధపడుతూ, ఎలాగైనా చంపాలని అతనిని నక్క మూతి (రాక్షసులు) పట్నం తీసుకెళ్లింది. నక్కమూతి వారి మేడలు చూపించి, ఆ మేడలలో ఉన్న వారిని చంపితే, ఈ పట్నం మనమే పాలించుకుందామన్నది. నక్కమూతివారు కోటబయట చావుపుట్టుకలు లేని దేవతాకోడిని కాపలాపెట్టి, కోటలోపల తాతలనాటి ముచ్చట్లు చెప్పుకుంటున్నారు. కోటలోకి ప్రవేశించబోతున్న రాముణ్ణి, కోడి అడ్డుకుంది. చంద్రుడు కత్తితో కాలునరికాడు. కుంటుకుంటూ కోటలోనికెళ్లి, కోడి నక్కమూతివారి మధ్య పడింది. తమ కోడిని చంపితే, తమను చంపినట్టేనని భావించిన నక్కమూతి వారు చంద్రుడి మీదికి యుద్ధానికొచ్చారు. చంద్రుడి దెబ్బలకి వాళ్లు చస్తున్నారు. వారి రక్తంకింద పడి, అనేకరెట్లు రాక్షసులు పుడుతున్నారు. తన తమ్ములైన కుక్కల నాలుకలపై రక్తం పడేటట్లు రాక్షసులనందరినీ సంహరించాడు.

వారిలో ఒక్కడు తప్పించుకొనిపోయాడు.

అన్నా చెల్లెళ్లిద్దరూ కోటలో ఉంటున్నారు. ఒకరోజు చంద్రకాంత పక్కనే ఉన్న నూతివద్దకు నీళ్లకెళ్లింది. తప్పించుకున్న నక్కమూతివాడు ఆ నూతి దగ్గర కనిపించి, తన గురించి చెప్పుకున్నాడు. అతనిచేత అన్నను చంపించాలనుకున్న చంద్రకాంత అతనితో సాన్నిహిత్యం పెంచుకుంది. గర్భవతి కూడ అయ్యింది. గర్భం గురించి అన్న అడిగితే ఏమి సమాధానం చెప్పాలని ఆలోచిస్తున్నది. అన్నను చంపటానికి నక్కమూతివాడిచ్చిన సలహా ప్రకారం 'అన్నయ్యా ! పల్లెరాముడి దగ్గర ఉండేదాన్ని తీసుకొచ్చి, ఈ అడవిలో పెట్టావు. తాగింది ఊటనీరు, తగిలింది కొండగాలి, తిరిగింది రాతినేల, ఇవన్నీ సరిపడక కడుపులో బల్ల పెరిగింది. ఆ బల్లకరగాలంటే పులిపాలు కావాలి' (పులి పాలు తేవటానికెళ్లి, పులినోటిలోపడి అన్న మరణిస్తాడనే ఉద్దేశంతో) అన్నది.

చెల్లెలు చెప్పినమాట నిజమనుకున్న చంద్రుడు, తన కుక్కలతో పులిపాలుకోసం బయలుదేరాడు. అడవంతా తిరిగినా పులి కన్పించలేదు. ఆ అడవి ప్రాంతంలో ఉన్న భద్రమాంకాళి, తనకు నరబలి యిస్తే, పన్నెండు గాబు (పెద్ద ఇత్తడి పాత్ర) ల ధన మిస్తానన్నందున ఒక బ్రాహ్మణుడు నరుడు కోసం చూస్తున్నాడు. అతనికి చంద్రుడు కనిపించి పులిపాలు గురించి అడగ్గా, పులిపాలు ఇస్తానని, ఆ బ్రాహ్మణుడు చంద్రుణ్ణి చంపే ఉద్దేశంతో కాళికాదేవి గుడిలోకి తీసుకెళ్లాడు. చంద్రునితో కాళికాదేవికి సాష్టాంగ నమస్కారం చేయుమని చెప్పి తలుపు మూలనున్న కత్తి వంక చూస్తున్నాడు. చంద్రునికి అనుమానం వచ్చి, సాష్టాంగ నమస్కారం పెట్టి చూపించమన్నాడు. బ్రాహ్మణుడు నమస్కారం చేయటానికి నేలపై పరుండగా, చంద్రుడు అతనిని బలి యిచ్చాడు. అందుకు కాళికాదేవి మెచ్చుకొని, ఏమి వరం కావాలని అడిగింది. పులిపాలు కావాలన్నాడు. కాళిక పులి అవతారమెత్తి, చంద్రునికి కావలసిన పులిపాలిచ్చింది. ఆ పాలు తెచ్చి చెల్లెలుకిచ్చాడు.

పాలు తీసుకున్న చెల్లెలు, అప్పటికీ తన అన్న చావనందుకు బాధపడుతూ, చంపే ఉపాయం చెప్పమని నక్కమూతి వానిని అడిగింది. పులిపాలుతోపాటు సంజీవివేళ్లకూడ కావాలంటే, వాటికోసం వెళ్లిన మీ అన్న ఎక్కడో ఒక్కచోట చస్తాడని, నక్కమూతివాడు సలహాయిచ్చాడు. చంద్రకాంత (ఆదిశక్తి) అన్నతో సంజీవివేళ్లు కావాలన్నది. సంజీవి వేళ్లకోసం వెళ్లి, గండబేరుండ పక్షుల సహాయంతో వాటిని సంపాదించాడు. ఆపదలో ఉన్న భర్తను తన వద్దకు తీసుకొనిరమ్మని పుష్పాలగంధి చెప్పింది. కాబట్టి తిరుగు ప్రయాణంలో తెల్ల గుర్రం చంద్రుణ్ణి పుష్పపాల గంధి వద్దకు తీసుకెళ్లింది. ఆ సందర్భంలో పుష్పాల గంధి భర్తవద్దనున్న కొన్ని సంజీవివేళ్లను తీసుకొని తనవద్ద దాచింది. జబ్బుతో ఉన్న తన చెల్లెలు ఏమవుతుందోనని, చంద్రుడు చెల్లెలు వద్ద కెళ్లి సంజీవివేళ్లు ఇచ్చాడు.

అవితీసుకొని, తను అనుకున్నదానికి వ్యతిరేకంగా జరుగుతున్నందుకు బాధపడి, చంద్రకాంత అన్నను చంపే ఉపాయం చెప్పమని నక్కమూతి వాణ్ణి మళ్లీ అడిగింది. అతను పడుకున్నపుడు పిలిస్తే, వచ్చి తలనరుకుతానని నక్కమూతివాడు చెప్పాడు. అన్న నిద్రిస్తున్న సమయం గమనించి నక్కమూతి వానిచేత చంపించి, ఒకసారి చచ్చిబతికినవాడు, మళ్లీ చచ్చిబతుకుతాడేమోనని, శవాన్ని మాంసం ముద్దలాచేసి గడ్డిలోపెట్టి, తెల్లగుర్రంనోటి కందించారు. ఆ గుర్రం మాంసం ముద్దను నోట కరచుకొని పుష్పాలగంధి కోటకువచ్చి, కోట వెలుపల మాంసముద్దను కక్కి, తానూకూడ

మరణించింది. ఈ విషయం తెలుసుకున్న పుష్పాలగంధి, జరిగింది చూసి, తనవద్దనున్న సంజీవి వేళ్లతో ఆ ఇద్దరినీ పునర్జీవితులను గావించింది. పునర్జీవితుడైన సత్యాలచంద్రుడు తన చెల్లెలివద్దనున్న వాణ్ణి ఇక్కడకు ఎలా వచ్చావని ఆశ్చర్యపోయాడు.

పుష్పాలగంధి భర్తతో, ఆమెచెల్లెలు కాదని, తాత ముత్తాతలు కొలిచే ఆదిశక్తి అనీ, నీతండ్రితో పంతగించి, 'నిన్ను చంపటానికి పుట్టిందని, జరిగినదంతా చెప్పింది చంద్రుడు నమ్మడు. తిన్నగా చెల్లెలు వద్దకువెళ్లి, ఆమె నక్కమూతి వానితో ఉండడం చూసి, తన భార్య చెప్పింది నిజమని నమ్మి, కోపంతో నక్కమూతివాణ్ణి చంద్రకాంతను వధించాడు. చంద్రకాంత (ఆదిశక్తి) ఆకాశంలో అంతర్ధానమవుతూ 'నిన్నువదలను మళ్లీ నీ తల్లి గర్భాన ఆడపిల్లనై పుట్టి, నీకోటకు ముప్పు తెస్తానని' అంతర్ధానమయ్యింది. మళ్లీ కుందనాదేవి గర్భాన ఆడపిల్లయి జన్మించింది. చంద్రుడు కుక్కలతో భార్యవద్దకు వచ్చి, మామ పెట్టే సంపదలతో భార్యను తీసుకొని తన కోటకు బయలుదేరాడు. కోటకువచ్చి, తనతో వాదమాడిన ఆదిశక్తి మాటలు గుర్తుకొచ్చి, చంద్రుడు ఆ పిల్లను కూడ వధిస్తాడు. ఆదిశక్తి ఆకాశమార్గంలో ఎగురుతూ, 'నీపంతం నువ్వు నెరవేర్చుకుంటే, నా పంతం నేను నెరవేర్చుకున్నానని' పలికి, అంతర్ధానమయ్యింది[37]

ఈ కథాప్రారంభంలో సంతానంలేనివారు బ్రహ్మవరం వల్ల సంతానం పొందారని చెప్పడంవల్ల, వైదిక దేవతారాధన ఉచ్ఛస్థితిలో ఉండి మాతృదేవతారాధన మరుగున పడుతున్న కాలంలో తమను నిర్లక్ష్యం చేసిన వారినిశక్తి దేవత కష్టాలు పాలుచేస్తుందని చెప్పి, మాతృదేవతా ప్రాధాన్యాన్ని ఉగ్గడించటానికి కల్పించిన కథగా ఈ కథను చెప్పవచ్చును. బ్రహ్మవరపుత్రుడు ఆదిశక్తిని చంపినట్టు వివరింపబడినా, కథంతా చంద్రుని కష్టాలుతోనే కూడి ఉన్నది. వైదిక మాతృదేవతారాధనల మధ్య స్పర్థ ఈ కథలో కన్పట్టుచున్నది.

**నల్లగులాబి :** నాగపురి పట్నపు రాజు నాగశ్వేనుడు. అతని భార్య సర్పావతి. వారు సంతులేక చింతిస్తున్నారు. వారు ఎన్నినోములు నోచినా సంతు కలుగనందున, సర్పావతి భర్తతో సెలవిస్తే, బ్రహ్మలోకమెళ్లి, బ్రహ్మనడిగి సంతుపొందుతానన్నది. భర్త భార్యతో మంత్రి భార్య లక్ష్మిని కూడ తోడు తీసుకెళ్లమన్నాడు. సర్పావతి లక్ష్మిని తీసుకొని, బ్రహ్మ దగ్గరకెళ్లి, లక్ష్మిని బయట ఉండమని, లోపలికెళ్లి బ్రహ్మ కాళ్లపట్టుకొని, సంతు నడిగింది. అంత కోపించిన బ్రహ్మ 'నీమురాలా ! ఆడవాళ్లు మైలమహిమలను కలిగి ఉంటారు. నీవు నాకాళ్లు పట్టుకున్నావు నీవెంత కోరినా సంతానం ఉండదు' అని శాపమిచ్చి బయటికొచ్చాడు.

బయట ఉన్న లక్ష్మినిచూసి, ఆమె కోరిక మన్నించి, ఆమెకు ఇద్దరు బిడ్డలను వరమిచ్చాడు. లక్ష్మి మామిడి ఫలములు పుచ్చుకొని, సర్పావతితో కలిసి, నాగపురి పట్నం వచ్చింది. సర్పావతి జరిగినదంతా భర్తతో చెప్పగా, భర్త ఓదార్చాడు. లక్ష్మి తాను తెచ్చుకున్న మామిడి ఫలములు తిని తిన్నతొమ్మిది గడియలకెల్లా ఒక ఆడ, ఒక మగ బిడ్డలను కన్నది. వారిని ఆ భార్యాభర్తలు అల్లారుముద్దుగా పెంచుకుంటున్నారు.

సర్పావతి భర్తతో 'పిల్లలు లేనివారి జననమెందుకు?' అని పిల్లలకోసం వాపోతుంది. రాజు భార్యను ఓదార్చి, మంత్రివద్దకు వచ్చి, సంతుకోసం తన భార్య చింతిస్తున్నదని, తన పిల్లలను ఇస్తే,

అల్లారుముద్దుగా పెంచి, రాజ్యాన్ని అప్పగిస్తానని ప్రాధేయపడతాడు. రాజుమాట కాదనలేక మంత్రి తన పిల్లలను రాజుకిస్తాడు. రాజువారినింటికితెచ్చి అల్లారుముద్దుగా పెంచుతాడు. వారికి వీరశ్చేనుడు, విమలావతి అని నామకరణం చేసారు. ఆ బిడ్డలను అల్లారుముద్దుగా పెంచుతున్న సర్వావతి ఒకరోజు అర్ధరాత్రిదాటేవరకు ఆ పిల్లలతో మేడమీద ఆడుకుంటున్నది. ఆ సమయంలో ఆకాశమార్గంలో వెళుతున్న పార్వతీపరమేశ్వరులు ఈ దృశ్యం చూసారు. ఈశ్వరుడు భార్యతో 'దేవీ! ఆ పిల్లలు ఆమెకు పుట్టినవారు కాదు. పెంపుడు పిల్లలలు అంటాడు. 'ఆమెకొక కొడుకు పుడితే, ఇంత ప్రేమతో పెంచే ఆ పిల్లల్ని ఏమిచేస్తుందో చూద్దాం ఒక బిడ్డను కలిగించు నాథా' అంటుంది. పార్వతి. అప్పుడు ఈశ్వరుని మహిమవల్ల సర్వావతి గర్భం ధరించి, తొమ్మిది గడియలకల్లా, ఒక మగబిడ్డను ప్రసవిస్తుంది. ఆ బిడ్డకు చిరంజీవుడు అని నామకరణం చేశారు. ఈ ముగ్గురి బిడ్డలనీ ఎంతో ప్రేమతో పెంచుకుంటుంది సర్వావతి.

ఒక నాడు వీరశ్చేనుడు, విమలావతి చిరంజీవుడు కలిసి బడికి వెళుతున్నారు. వెళుతున్న ముగ్గురినీచూసి, కోట శక్తి, పకపక నవ్వి, 'ఔరా ! నాగశ్చేనుడా ! నీ తాతతండ్రులు నన్ను పూజించారు. నీవే నన్ను మర్చిపోయావు. నీ బిడ్డలను నీకు దక్కనివ్వను. ముగ్గురినీ మూడు దార్లు చేస్తాను. నన్ను జ్ఞాపకం తెచ్చుకొని, పూజలు చేయిస్తే, తప్ప కలవనివ్వను' అని అవతారం మార్చుకొని 'లేడి' గా మారి పిల్లల ఎదుట ఎగురుతుంది.

ఆ లేడినిచూసి, ముచ్చటపడి చిరంజీవుడు ఆ లేడి కావాలంటాడు. వీరశ్చేనుడు, విమలావతి వారించినప్పటికీ వినక, ఆ లేడి కావాలని, మీరు రాకపోతే నేనే వెళతానని చిరంజీవుడు ఆ లేడి వెనుక బయలుదేరుతాడు. ఆ లేడి కొండలు, కోనలుదాటి పరుగెత్తుకొని పోతుంటే, చిరంజీవుడుకూడ ఆ లేడి వెనుక పరుగెత్తుతున్నాడు. ఆ లేడి ఒక పుట్టమీదుగా దూకింది. చిరంజీవుడు కూడ పుట్టమీదుగా, దూకబోయి, దూకలేక పుట్టమీదపడి, పుట్టలోకి దిగిపోయాడు. అతనికాళ్ళు ఆ పుట్టలో తపస్సు చేసుకుంటున్న మునిరాజుపై పడ్డాయి. మునికితపోభంగమై, కోపించి, తపస్సు పాడుచేసినందుకుగాను, నాగుపామై, నల్లకొండలమధ్య తిరగమని శపిస్తాడు. తనకేమీ తెలియదని, లేడి వెనుక పరుగెత్తుతూ, దూకబోయి పుట్టలో పడ్డానని, క్షమించి, శాపవిమోచన కలిగించమని చిరంజీవుడు ప్రాధేయపడతాడు. 'నీవు పాముగా తిరుగుతూ, రాచకన్యను ప్రేమిస్తావు. ఆమెకు ఒక కొడుకుపుడతాడు. నీ కొడుకు నిన్ను కౌజారుతో నరుకుతాడు. నీ రక్తం వెళ్లి నీ కొడుకు నొట్టన (నొసట) పడితే, నీ శాపవిమోచనమవుతుంది అని ముని చెప్పుతాడు. చిరంజీవుడు పాముగా మారి, నల్లకొండల్లో తిరుగుతుంటాడు.

వీరశ్చేనుడు, విమలావతి తమ్ముడి కోసం చూసి, ఎంతకి రాకపోయేసరికి వెదకటానికి బయలుదేరుతాడు. కొంతదూరమెళ్లేసరికి తమ్ముడి బట్టలు కనిపిస్తాయి. తమ్ముడుకనిపించనందుకు దుఃఖించి ఆబట్టలను తీసుకొని, నాగపురిపట్నం వస్తారు. జరిగినదంతా తల్లిదండ్రులకు చెబుతారు. తమ కొడుకును చంపితే, రాజ్యంవాళ్లకే మిగులుతుందనే ఉద్దేశంతో వీరశ్చేనుడు, విమలావతి తమ బిడ్డను చంపేసి ఉంటారని భావించిన తల్లిదండ్రులు తమ బిడ్డగురించి చెప్పేవరకు చిత్రహింసలు పెట్టిస్తారు. ఎంతకీ చెప్పకపోయేసరికి, నాగశ్చేనుడు భటులను పిలిచి, వారిద్దరినీ కాళికకు బలి నరకమంటాడు.

బాలల్ని బలి నరుకుదామని తీసుకెళ్లి రాజభటులు, ఆ బాలల దుఃఖం చూసి, జాలిపడి, వాళ్లను అరణ్యాలలోనికి పారిపొమ్మని విడిచిపెట్టేస్తారు. అవిధంగా వారు పారిపోయి, మధురానగరంపోయి, పేదరాశిపెద్దమ్మ ఇంటికి చేరుతారు. వారి కథంతా విన్న ఆమె వారిని ఆదరించి, తన యింటి వద్దనే ఉండమంటుంది. వీరశ్రేనుడు తమ తమ్ముడు దొరికితే, తమ కష్టాలు తీరు తాయని చెల్లెలిని పేదరాశి పెద్దమ్మకు అప్పగించి, తమ్ముణ్ణి వెదకటానికి బయలుదేరుతాడు.

ఆ మధురానగరపు రాజు మరణించగా, ఆ రాజ్యాన్ని రాజు కుమార్తె దివ్యసుందరి పరిపాలిస్తుంది. ఆ నగర వీథులలో తిరుగుతున్న వీరశ్రేనుణ్ణి దివ్యసుందరి కోటమీదనుండి చూసి, మోహించి, అతనిని తీసుకొని రమ్మని దాసీలను పంపుతుంది. దాసీలు వెళ్లి, ఎంత వెదకినా వీరశ్రేనుడు కనపడకపోయేసరికి, రాజకుమార్తెవద్దకు వచ్చి, రాజకుమారుడు కనిపించలేదంటారు. రాజకుమారుడు వేటకు వెళ్లిఉంటాడని భావించిన, రాజకుమార్తె, తాను కూడ పరివారంతో వేటకువెళ్లి, అరణ్యంలో డేరాలు వేసుకొని ఉంటూ, పగలంతా రాజకుమారుణ్ణి వెదకటం చీకటిపడేసరికి డేరాలోనికి వచ్చి, నిద్రపోవటం చేస్తున్నారు.

అడవిలో రాజు దొకదారి. రాణిదొక దారి అయ్యింది. వీరశ్రేనుడు తమ్ముని వెదకుతూ ఉంటాడు. దాహంవేసిన వీరశ్రేనుడు దాహం తీర్చుకోవటానికి అక్కడ దేవతలు స్నానంచేసే సరస్సులోకి దిగుతాడు. నరుడు దిగేసరికి సరస్సులో నీరు మాయమవుతుంది. ఇంతలో స్నానం చేయటానికి దేవకాంతలు వచ్చి, నరుణ్ణి చూసి, గంగను మాయం చేసినందుకు కుష్టురోగిగా మారిపోవాలని శపిస్తారు. తన తప్పులేదని, దాహంతీర్చుకోవటానిక దిగానని ప్రాధేయపడగా, నీతమ్ముడి కొడుకు నీకెదురుగా వచ్చి నిలబడితే, అతని నీడ నీమీద పడినపుడు శాపవిమోచన కలుగుతుంది అని దేవకాంతలంటారు.

కుష్టురోగిగా మారిన వీరశ్రేనుడు దాహంతో అలమటిస్తూ, చెల్లిలివద్దకు వచ్చి తలుపు తడతాడు. విమలావతి తలుపుతీసి, తన అన్నను గుర్తించక, కుష్టురోగిగా భావించి, బయటకి పొమ్మంటుంది. తమ గత చరిత్రంతా వీరశ్రేనుడు చెప్పినా నమ్మదు. చేసేది లేక వీరశ్రేనుడు ఊరి చివరనున్న బండ రాయిమీద 'దాహమో! దాహమో!' అంటూ కూర్చున్నాడు. ఒకనాడు పేదరాశి పెద్దమ్మ తన అన్నగురించి విమలావతిని అడుగుతుంది. తన అన్న, తమ్ముడిని వెదకటానికి వెళ్లాడంటుంది విమలావతి.

'నన్ను చాన్నాళ్లనుంచి పోషిస్తున్నావు. ఎవరితోనైనా పనిలోకి పంపమని' విమలావతి పేదరాశి పెద్దమ్మతో అంటుంది. అందుకుఆమె ఒప్పుకోదు. ఒకరోజు కొంతమంది ఆడవారు కట్టెలకోసం అరణ్యానికి వెళుతుండగా, తానూ వెళతానని, పేదరాశిపెద్దమ్మ వద్దంటున్నా వినకుండా విమలావతి కూడ బయలుదేరి వెళుతుంది. అరణ్యంలో చెట్లకింద ఉన్న కట్టెలు ఏరుతున్న ఆమెనుచూసి, లంబాడీవాడు ఆమెను రామచిలుకగామార్చి తనకూడ తీసుకెళ్లిపోతాడు. కాళికాదేవిగుడి వద్దకు తీసుకెళ్లి, మనిషిగా మార్చి, తన్ను పెళ్లాడమంటాడు. 'అన్నయ్యా!' అని బ్రతిమాలి, విడిచి పెట్టమని ప్రాధేయపడుతుంది. మనసు మార్చుకొని, తనను పెళ్లాడాలని, లేకుంటే కాళికకు బలి యిస్తానని చెప్పి, విమలావతిని కాళికాలయంలో ఉంచి, లంబాడీవాడు తన గూడేనికి పోతాడు.

కోటశక్తి తాను అనుకున్నట్లు ముగ్గురినీ మూడు దార్లు చేసినందుకు ఆనందిస్తుంది.

నల్లగొండమీద నాగుపాము రూపంలో ఉన్న చిరంజీవుడు దాహంతో నీళ్లకోసం కొండంతా తిరిగి, దొరకకపోయేసరికి, అక్కడే ఉన్న దివ్యసుందరి డేరాలోనికి దూరుతాడు. నిద్రపోతున్న దివ్యసుందరిని చూసి, మోహించి 'నేను మనుష్యరూపంలో ఉంటే ఈ బాలతో భోగమొందుదునో' అన్నాడు. ఈ మాటలు విన్న ఈశ్వరుడు తమచేత సృష్టింపబడ్డ బాలుడేకదా అని సగం మనిషి రూపమిచ్చాడు. చిరంజీవుడు దివ్యసుందరితో భోగమొంది, నల్లకొండమీదకి వెళ్లిపోయాడు. తెల్లవారేసరికి ఆమెకు బాలుడు పుట్టాడు. జరిగిన దానికి దివ్యసుందరితో సహా పరివార జనమంతా ఆశ్చర్యపడతారు. ఆ బిడ్డతో రాజ్యానికెళితే, బిడ్డకు తండ్రి ఎవరో చెప్పవలసి ఉంటుందని, బిడ్డకు తండ్రి ఎవరో తెలిసేవరకు అరణ్యంలోనే ఉంటారు. పిల్లవాడు అడవిలో పుట్టినందున 'అడవిశ్శేనుడు' అని పేరు పెట్టారు.

అడవిశ్శేనుడు ఏడేళ్లప్రాయం వచ్చాక తండ్రిగురించి తల్లినడుగుతాడు. 'నీవు పసివాడుగా ఉన్నప్పుడు వేటకు వెళ్లిన తండ్రి తిరిగిరాలేదంటుంది. తండ్రిని వెదకి వస్తానని, అడవిశ్శేనుడు వేటకు వెళతాడు. అడవిశ్శేనుడు ధాటికి ఆగలేక అడవిమృగాలన్నీ పారిపోతున్నాయి. పగలైతే మృగాలు లభించనందున, రాత్రుళ్లు వేటాడాలని, ఆడవిశ్శేనుడు రాత్రంతా వేటాడి, అలసి, ఒక రాతిమీద పడుకున్నాడు. తెల్లవారి సూర్యోదయమై రాతిపై పడుకున్న అడవిశ్శేనుడుకి ఎండ తగులుతుంది.

నల్లగొండ మీదున్న నాగరాజు (చిరంజీవుడు) రాతిపై పడుకున్న కుమారుణ్ణి చూసి, ఎండ తగులుతుందని, పడగ విప్పినీడపట్టింది. కొంతసేపటికి మెలకువ పడిన అడవిశ్శేనుడు అసలు విషయం తెలియక కౌజారుతో పాము తలనరుకుతాడు. రక్తపుధారలు ఆతని నొసటనపడి, నాగుపాము చిరంజీవిగా మారుతాడు. ఇదంతా మాయగా భావించిన అడవిశ్శేనుడు నీవెవరివో చెప్పమని చిరంజీవుణ్ణి నిలదీస్తాడు. చిరంజీవుడు తన వృత్తాంతమంతా చెపుతాడు. చిరంజీవుడు తండ్రిని కౌగిలించుకొని, తల్లి ఉన్నడేరావద్దకు తీసుకెళ్తాడు. చిరంజీవుడు తాను పాముగా ఉండగా మోహించానని చెప్పగా, తనకు కూడ పాముతో కలిసినట్టు కల వచ్చిందని దివ్యసుందరి అంటుంది.

దివ్యసుందరి భర్తను, కుమారుణ్ణి పరివారాన్ని తీసుకొని, తన రాజ్యానికి బయలుదేరి వస్తుంది. దారిలో ఊరి చివర నల్లరాతిమీద కూర్చొని 'దాహమో ! దాహమో !' అంటున్న వీరశ్శేనుణ్ణి చూసి, అడవిశ్శేనుడు చెంబుతోనీళ్లు పట్టుకెళ్లి పోస్తాడు. అతడి నీడ పడగానే శాపవిమోచనమై, కుష్టురోగి, వీరశ్శేనుడిగా మారుతాడు. వీరశ్శేనుడు తన వృత్తాంతమంతా చెప్పగా, అడవిశ్శేనుడు పెదతండ్రిని తల్లిదండ్రుల వద్ద కు తీసుకొస్తాడు. వీరశ్శేనుడు, చిరంజీవుడు, ఒకరి వృత్తాంతమొకరికి చెప్పుకొని, తమ సోదరి విమలావతిని కలుసుకోవటానికి అడవిశ్శేనుణ్ణి తీసుకొని పేదరాశి పెద్దమ్మ ఇంటికి వెళతారు. పేదరాశిపెద్దమ్మ జరిగినదంతా వాళ్లకు చెబుతుంది. తమ సోదరి కనిపించనందుకు వీరశ్శేనుడు, చిరంజీవుడు దుఃఖిస్తారు. అడవిశ్శేనుడు వారిని ఓదార్చి, వారిని రాజ్యంలో ఉంచి, తాను విమలావతిని వెదకితెస్తానని, అడవికి బయలుతేరుతాడు.

అడవంతా తిరిగి, కాళికాదేవి గుడికి వస్తాడు. గుడిలో లంబాడివాడు 'నన్ను ప్రేమించు

పెళ్ళాడు' అని విమలావతిని బాధపెట్టడం, 'అన్నయ్యా! నన్ను రక్షించు అని విమలావతి వేడుకోవడం,' వింటాడు. రేపు ఉదయం వచ్చేసరికి మనసు మార్చుకొని ఉండకపోతే, కాళికాదేవికి బలియిస్తానని, చెప్పి లంబాడివాడు వెళ్లిపోతాడు. అప్పుడు అడవిశ్వేనుడు గుడిలోపలికెళ్లి, విమలావతిని వివరాలడిగి తెలుసుకొంటాడు. తన మేనత్తగా గ్రహిస్తాడు. తన వృత్తాంతంకూడా చెప్పగా, అడవిశ్వేనుణ్ణి తన మేనల్లుడుగా విమలావతి గ్రహిస్తుంది. లంబాడీవాడి చెరనుంచి బయపడడానికి అడవిశ్వేనుడు ఉపాయం చెబుతాడు. ఆ మరుసటి రోజు వచ్చే లంబాడి వానితో అతడు తనమంత్రాలకర్రను పారవైచి, రాకుమారుడిలా ముస్తాబై వస్తే ప్రేమిస్తానంటాడు. పారవైచిన మంత్రాలకర్ర అతని తలపై పెడితే మరణిస్తాడంటాడు. ఆ మరుసటిరోజు వచ్చిన లంబాడి వానితో విమలావతి, అడవిశ్వేనుడు చెప్పినట్లుగా ప్రవర్తిస్తుంది. లాంబాడివాడు మరణిస్తాడు.

అడవిశ్వేనుడు విమలావతిని తీసుకొని, మధురానగరికి వస్తాడు. అక్కడ నుంచి వీరశ్వేనుడు, చిరంజీవుడు, దివ్యసుందరీ, అడవిశ్వేనుడు, విమలావతి అందరూ కలిసి తమ రాజ్యం నాగపురి పట్టణం బయలుదేరుతారు. వెళ్లేవాళ్లను కోటశక్తి చూసి, ముగ్గురుని మూడుదార్లు చేస్తే, తిరిగి కలుసుకున్నారు. తన పని ఇంకా తీరలేదనుకొని నాగశ్వేనుడికి కళ్ళు పోగొట్టింది. అదే సమయానికి వీరశ్వేనుడితోసహా అయిదుగురూ వెళతారు. సర్పావతి 'మీరు ఎవరు?' అని ప్రశ్నిస్తుంది. వీరశ్వేనుడు జరిగినదంతా చెబుతాడు. సర్పావతి అందరినీ చూసి సంతోషిస్తుంది. నాగశ్వేనుడు అందరినీ చూడడానికి కళ్ళు లేనందుకు బాధపడతాడు.

అడవిశ్వేనుడు తాతగార్కి కళ్ళు వచ్చే మార్గం చెప్పమంటాడు. బ్రాహ్మణులు పంచాంగాలు పరిశీలించి, నల్లగులాబితెచ్చి, కళ్లకంటిస్తే, కళ్ళు కనిపిస్తాయంటారు. అడవిశ్వేనుడు నల్లగులాబిని తెస్తానని బయలుదేరి వెళతాడు. అడవిలో నల్లగులాబి కోసం వెదుకుతుంటాడు. ఇంతలో దేవకాంతలు అడవిలో పుష్పాలుకోయటానికి వచ్చి, ఒక దేవకాంత వృక్షం, ఒక దేవకాంత కొమ్మలు, ఒక దేవకాంత ఆకులు వేరొక దేవకాంత పండు అయి నిలబడ్డారు. అందుమేలికాంత నల్లగులాబియై నిలబడ్డది. ఆ చెట్టునాల్గుకొమ్మలూ నాల్గులోకాలకు ఒక కొమ్మ దేవలోకానికి, ఒక కొమ్మ నాగలోకానికి, ఒక కొమ్మ భూలోకానికి, చొప్పున దారితీసి ఉన్నాయి. అడవిశ్వేనుడు ఒక కొమ్మగుండా భూలోకానికి వెళతాడు. అక్కడున్న మునిరాజు మేలికాంతను నల్లగులాబినిచేసి, తను స్నానం చేసి వచ్చేవరకు ఆరూపంలో ఉండమంటాడు. ఆ నల్ల గులాబిని పట్టుకొచ్చి, అడవిశ్వేనుడు తన తాత కళ్ళు రప్పిస్తాడు.

నాగశ్వేనుడు తిరిగొచ్చిన కళ్లతో కుమారుణ్ణి, మనుమడిని చూసి ఆనందిస్తాడు. తన మనుమడు అడవిశ్వేనుడికి మేలికాంత (నల్లగులాబి) నిచ్చి పెళ్లిచేస్తాడు. పెళ్లి జరిగే సమయంలో కోటశక్తి పెళ్లిపందిరిలో వీరశ్వేనుడికెదురుగా నిలబడుతుంది. రాజా ఆశక్తి దేవతను చూసి, ఆమెను కొలవక తప్పినందుకే తమ బిడ్డలని బాధపెట్టిందని తెలుసుకొని, ఆ రోజునుంచి భక్తితో పూజిస్తున్నాడు.

నాగశ్వేనుడు తన మనుమడికి తన రాజ్యామిచ్చి ఏలుకోమంటాడు. తాను అడవిలో పుట్టానని, అడవిలో పెరిగానని, చెప్పి, తన భార్యమేలికాంతను తీసుకొని అతడు అడవిలోకెళ్లి

పోతాడు. కాగా వీరశ్చేనుడు నాగపురిపట్టణానికి, చిరంజీవుడు మధురానగరికి రాజులవుతారు.

ఈ కథలో రాజకుమారులు, రాజకుమార్తెలు, అర్ధనరనాగులు, నల్లగులాబీలు, మేలికాంతలు మొదలయినవారు ఎంతమంది ఉన్నప్పటికీ కథాసారాంశమొక్కటే. తనను కొల్వక నిర్లక్ష్యం చేసినవారిని శక్తిదేవత కష్టాలు పాల్జేస్తుందనేది ఇందలి సారాంశము. మాతృదేవతారాధన మరుగున పడిన కాలంలో మాతృదేవతల ప్రాముఖ్యాన్ని ఉగ్గడించడానికి పుట్టిన కథగా ఈ కథను పేర్కొనవచ్చును.

**శివకుమారుడు :** శ్రీకృష్ణపురాన్ని భరతరాజు పరిపాలిస్తున్నాడు. అతని భార్య భాగిరితిదేవి వారి కుమారుడు లవత కుమారుడు. కోడలు గిరిజావతి భరతరాజు. శక్తిదేవతను కొలిచేవాడు. ఆమె మహిమవల్ల సర్వసంపదలు కలిగాయి. దానధర్మాలు చేస్తూ రాజు శక్తిదేవతను మరిచాడు. అందుకు కోపించిన దేవత రాజును కష్టాలు పాలు చెయాలనే ఉద్దేశంతో పదిమంది బ్రాహ్మణులుగా అవతారం మార్చుకొని రాజువద్దకు వచ్చి దానమడిగింది. స్నానంచేయడానికి సరస్సు కావాలని అడిగారు బ్రాహ్మణులు. రాజు బ్రాహ్మణులకోసం సరస్సు తవ్విస్తూన్నాడు. ఎంత తవ్వినా శక్తిదేవత మహిమ వల్ల నీళ్లు పడడంలేదు. ఆమె సరస్సులోని జలనిధులను తొక్కిపెట్టింది.

రాజు బ్రాహ్మణులను పిలిపించి నీరు పడకపోవటానికి కారణమడుగుతాడు. పంచాంగాలు పరిశీలించి, బ్రాహ్మణులు సత్తెమ్మ మహిమవల్ల నీళ్లు పడలేదని, రాజు కుటుంబం నుంచి నరబలి యిస్తే తప్ప నీళ్లు పడవని చెబుతారు. జీవితం మీద వ్యామోహం పోనిరాజు, తన కుమారుడు లవతుణ్ణి బలి నరకమని, భటుల్ని పంపుతాడు. ఈ విషయం దాసి ద్వారా తెలుసుకున్న రాణి తనకుమారుణ్ణి అడవులకు పంపిస్తుంది. రాజు కోడలిని బలి నరకమని భటులను పంపుతాడు. రాణి కోడలిని కూడ తన భర్తతో కలవమని అడవులకు పంపిస్తుంది. అడవిలో భార్యాభర్తలిద్దరూ కలుసుకొని వేరే రాజ్యానికి పోవాలని బయలుదేరి వెళుతున్నారు.

వాళ్లను కష్టాలపాలుచేయాలని తలిచిన శక్తిదేవత గిరిజావతికి దాహం కలిగించింది. భార్య దాహం తీర్చటానికి నీళ్లు తేవటానికి వెళ్లిన లవతకుమారుడుకి ఒక నుయ్యి కన్పించింది. నీళ్లకోసం నూతిలోకి దిగిన అతనిని శక్తిదేవత మింగేసింది. శక్తికోరిక తీరినందున రాజ్యంలో రాజు తవ్వించే సరస్సులో నీళ్లు పడ్డాయి. రాజు సంతోషించాడు. అడవిలో భర్తకోసం విలపిస్తున్న గిరిజావతిని చెంచుకాంతలు ఆదరించి, పోషిస్తారు. అప్పటికే గర్భంతో ఉన్న గిరిజావతి కొంతకాలానికి ఒక మగబిడ్డను ప్రసవించింది. ఆ బాలుడే శివకుమారుడు. ఈవిధంగా తల్లీకొడుకులిద్దరూ అడవిలో చెంచుకాంతలవద్ద ఉంటున్నారు.

శివకుమారుడికి కొంత ప్రాయమొచ్చాక, చెంచుకాంతలతో అరణ్యానికి వేటకెళతాడు. వాళ్లు పెద్దపెద్ద క్రూరమృగాలను వేటాడుతుండగా, ఈతడు చెట్టు క్రింద కూర్చుని, చెట్టుపై ఉన్న గండభేరుండ పక్షుల్లో మగపక్షిని కూల్చాడు. ఆడపక్షి దుఃఖిస్తూ, కోపంతో 'తాతలేనివాడా! తండ్రిలేనివాడా!' అని శివకుమారుణ్ణి తిడుతుంది. శివకుమారుడు ఇంటికెళ్లి తన తండ్రి గురించి, తల్లినడుగుతాడు. బాలుడు నిలదీసేసరికి గత్యంతరం లేక తల్లి తమ వృత్తాంతమంతా బాలునికి

చెబుతుంది.

తన తండ్రి మంచి నీరు కోసం వెళ్లిన మార్గాన్ని చూపితే, అక్కడకు వెళ్లి తండ్రిని తీసుకొస్తానని, తల్లి ఒంటరిగా ఉండి దుఃఖించిన ప్రదేశానికి తీసుకెళ్లమని శివకుమారుడు పట్టుబట్టగా, ఆమె అతనిని తీసుకొని ఆ ప్రదేశానికి వస్తుంది. ఇదంతా గమనించిన శక్తి దేవత శివకుమారుడికి భయపడి, అతనిని తల్లిచేత చంపించదలచి, తండ్రివేషంలో తల్లివద్దకు వచ్చి తన తనయుడు తండ్రి గండానపుట్టాడని, అతను మరణిస్తే తప్ప తాము సుఖంగా ఉండలేమని అంటుంది. నిజమనుకున్న గిరిజావతి కుమారుణ్ణి చంపటానికి మాయభర్త ఇచ్చిన సలహాలు పాటిస్తుంది.

శక్తిదేవత మాయవల్ల కల్పించిన మేడలో ఇద్దరూ ఉంటారు. మాయభర్త, గిరిజావతితో తనకు శిరసుబాధలు వచ్చాయని, ఆ బాధలు తొలగడానికి సప్తసముద్రాల అవతల జంగాలదేవుళ్ల మఠమున్నదనీ, అచట దానిమ్మ వృక్షమున్నదనీ, ఆ వృక్షానికి మూడు కాయలున్నాయనీ, అవి తీసుకొచ్చి, వాటిలేపనం పూస్తే, శిరస్సు బాధలు తగ్గుతాయని చెప్పమంటాడు. ఈవిధంగా అవి తేవటానికి వెళ్లిన శివకుమారుడు మరణిస్తాడంటాడు. గిరిజావతి ఆవిధంగానే తనకు లేని శిరసు బాధలు తొలగడానికి కావలసిన మందు గురించి కుమారునితో చెబుతుంది. ఇది నిజమనుకొని శివకుమారుడు ఆ మందుకోసం బయలుదేరి వెళతాడు.

సప్తసముద్రాలు దాటాక పన్నెండు ఆమడవటవృక్షమున్నది. ఆ వృక్షం కింద ఉన్న పుట్టలో ఒక పన్నెండు శిరసుల నాగన్న, చెట్టుమీద గండభేరుండ పక్షులు ఉన్నాయి. ఆ పక్షిపిల్లల్ని తినటానికి తరుముతున్న నాగన్న పన్నెండు శిరసులను శివకుమారుడు తన కత్తితో నరుకుతాడు. వాటిలో ఒక శిరసువచ్చి అతని గొంతును కరవగా, అతడు మరణించాడు. ఇదంతా గమనిస్తున్న పక్షిపిల్లలు తమ తల్లిదండ్రులువచ్చాక, జరిగిందంతా చెప్పి, తమను రక్షించిన రాజకుమారుణ్ణి బ్రతికిస్తే తప్ప మేతలు మేయమంటాయి. వాటిలో ఆడపక్షి వెళ్లి సంజీవిపుల్ల తెచ్చి శివకుమారుణ్ణి బ్రతికిస్తుంది. బాలుడు అక్కడకు వచ్చిన కారణమడుగుతాయి. అతను కారణం చెప్పాక, జంగాలదేవుడి మఠందగ్గర ధానిమ్మపళ్ళు తేవటానికి సహకరించేందుకు ఒక వాయుపుల్లను ఇస్తాయి. ఆ వాయుపుల్లను పేల్చితే, అక్కడ ఉండే రాక్షసులు ఇతనిని చుటుముట్టరని చెబుతాయి. ఆవిధంగా గండభేరుండ పక్షులుచెప్పినట్టు శివకుమారుడు వాయుపుల్లనుపయోగించి, ధానిమ్మపళ్లు పట్టుకొస్తాడు. తల్లిబాధలు తీర్చి, ఇంకా ఏమైనా కష్టాలు కలిగితే, తమను తలచుకోమని ఆ పక్షులు అతనిని పంపిస్తాయి.

ఆ ధానిమ్మపళ్లు తీసుకొస్తున్న శివకుమారుణ్ణిచూసి, మాయ లవతకుమారుడు (శక్తిదేవత) గిరిజావతివద్దకువచ్చి, కుమారుడు చావటానికి వేరొక ఉపాయం చెబుతాడు. 'శిరసు బాధలు తగ్గాయి. ఒంటి బాధలు వచ్చాయి. అవి తగ్గటానికి పకపక నవ్వేటి పాకులు, కరగని సున్నము, మాట్లాడే ఆకులు, వేద పురాణం సంగీతం వినిపించే బంగారుకాసుకావాలి. అని చెప్పితే, అవి ఎక్కడా దొరకక, తేవటానికెళ్లి మరణిస్తాడు' అంటాడు

ఇంటికొచ్చిన శివకుమారుడితో గిరిజావతి ఆవిధంగానే చెబుతుంది. అవిలేకుంటే తాను మరణిస్తానంటుంది. అవి తెస్తానని బయలుదేరి శివకుమారుడు అరణ్యమంతా తిరుగుతాడు. ఎక్కడా దొరకవు. అక్కడ తపస్సు చేసుకుంటున్న 'మింగి' అనే ముని వద్దకువెళ్లి, తనకు కావలసిన

వస్తువుల్ని అడుగుతాడు. వాటిని తానెప్పుడూ వినలేదు. కనలేదు, అన్నమునితో అవిలేకుంటే తాను మరణిస్తానంటాడు. అక్కడకు సమీపంలో ఉన్న పసుపుకోనేరుకడకు దేవకాంతలు వచ్చి స్నానం చేస్తారని వారిలో మేలికాంత వస్త్రాలు పట్టుకొనివస్తే, ఆమె కూడ తన వెంట వస్తుందని, ఆవిధంగా వచ్చిన ఆమెకు తప్ప ఇంకెవ్వరికీ ఆ వస్తువులు గురించి తెలియదని ఆముని శివకుమారుడికి సలహాయిస్తాడు.

శివకుమారుడు ముని చెప్పినట్టుగా మేలికాంత వస్త్రాలు పట్టుకొని ముని వద్దకు పరుగెత్తుకొని వచ్చేస్తాడు. ఆమెకూడ ఇతని వెంట వస్తుంది. ముని శివకుమారుణ్ణి తన జడలలో దాచి, చీరకోసం వచ్చిన మేలికాంతతో శివకుమారుణ్ణి పెళ్లి చేసుకుంటేనే, తన చీర దొరకుతుందని చెప్పి, ఆమెను పెళ్లికి ఒప్పించి, ఇద్దరికీ పెళ్లి జరిపిస్తాడు. పెళ్లయ్యాక, చీర శివకుమారుడికిచ్చి, అతని పని పూర్తయితే తప్ప, చీర మేలికాంతకు ఇవ్వవద్దంటాడు. శివకుమారుడు మునిచెప్పినట్టుగానే తనకు కావలసిన నాల్గువస్తువులు ఇస్తే తప్ప, చీర ఇవ్వనంటాడు. ఆ నాల్గు వస్తువులు తాను వినలేదు, కనలేదు అని అవి దొరికే వ్యక్తి ఆచూకిని మేలికాంత తెలియచేస్తుంది.

అక్కడకు కొంతదూరంలో 'సరస్వతి' అనే పేరుగల శక్తి ఉంది. ఆమె కూతురు పద్మావతి, ఆమెనడిగితే కావలసిన నాల్గు వస్తువులు ఇస్తుంది అని చెబుతుంది. ఆమెను కలుసుకొని ఆ వస్తువులను తేవడంలో ఎదురయ్యే ఇబ్బందులను తొలగించుకోవటానికి సహకరించేందుకు నాల్గు నాగమల్లి పుష్పాలను కూడ శివకుమారుడికిచ్చింది. మేలిదేవకాంత చెప్పినట్టుగానే ఆతడు పద్మావతి వద్దకు వెళతాడు. పద్మావతి అతడినిచూసి మోహించి, అతని బాగోగులు అడుగుతుంది. తనను పెండ్లి ఆడమంటుంది. తనకు కావలసిన నాల్గు వస్తువులు ఇస్తే, పెండ్లాడుతానంటాడు. వాటి గురించి తాను అప్పటివరకు వినలేదంటుంది. ఈలోగా పద్మావతి తల్లి సరస్వతి అనే రాక్షసి వస్తుంది. నరవాసన గురించి అడుగుతుంది. పద్మావతి శివకుమారుణ్ణి బల్లినిచేసి, గోడకంటించి, తల్లి బారి నుంచి అతనిని కాపాడుతుంది.

తల్లి తలలో పేలుచూడ్డానికి పాయపెట్టి, ఆమెతో మంచిగా మాటలు కలిపి ఆమె ఆయువు గురించి అడుగుతుంది పద్మావతి. సరస్వతి తన ఆయువు శివకుమారుడి చేతిలో ఉందని, తాము ఉండే భవనంలో ఉక్కు, రాగి, వెండి, బంగారు స్తంభాలు (ఒక దానిని విరగ్గొడితే వేరొకటి కన్పిస్తాయి) ఉన్నాయనీ, బంగారు స్తంభంలో బంగారు భరణి ఉందని, అందులో ఉన్న మూడు తుమ్మెదలు తన ఆయువని చెబుతుంది. ఈ విషయం పద్మావతి శివకుమారుడికి చెప్పగా, ఆతడు ఆ స్తంభాలను విరగ్గొట్టి, ఆ తుమ్మెదలను పట్టుకొని, సరస్వతిని హతమారుస్తాడు. ఆతుమ్మెదలతోపాటు లభించిన నాల్గువస్తువులు (తల్లి తనతో తెమ్మని చెప్పినవి) పట్టుకొని, పద్మావతిని తీసుకొని, దేవకాంత వద్దకు వస్తాడు.

దేవకాంత తన చీర తన కివ్వమంటుంది. తన తల్లి బాధలు తీరితే తప్ప ఇవ్వనంటాడు. ముగ్గురూ కలిసి గిరిజావతి వద్దకు వస్తూంటారు. నాగకన్య కీలుగుర్రమ్మీద ఆకాశమార్గంలో వెళ్లడంచూసి, ఆమె గురించి దేవకాంత నడుగుతాడు శివకుమారుడు. దేవకాంత నాగకన్యను కిందికి దింపి, ఆమెనుకూడ అతనికి పెండ్లిచేస్తుంది. నలుగురూ కలిసి గిరిజావతి వద్దకువచ్చి,

శివకుమారుడు తాను తెచ్చిన నాల్గువస్తువులు తల్లికిస్తాడు. తల్లిబాధలు తగ్గాక, తన వస్త్రం తనకివ్వమని దేవకాంత అడుగుతుంది. తన తండ్రిని తీసుకొచ్చి, తమలో కలిపితే ఇస్తానంటాడు. తన తండ్రిని శక్తిదేవత మింగిందనీ, ఆమె నూతిలో ఉందని, ఆమె కడుపులో చిన్న ఉండవలె తన తండ్రి ఉన్నాడని, చెప్పి, దేవకాంత తన మహిమతో శక్తిదేవతను నూతి నుండి బయటికి రప్పిస్తుంది. వచ్చిన దేవత తలనరికి, శివకుమారుడు ఆమె గర్భంలో ఉండవలె ఉన్న తన తండ్రిని బయటకు తీస్తాడు. ఆ ఉండను దేవకాంత మామూలు మనిషిని చేసింది. గిరిజావతి జరిగినదంతా తెలుసుకొని, తన కుమారుణ్ణి ఇబ్బందులు పెట్టినందుకు బాధపడుతుంది.

అందరూ కలిసి రాజ్యానికెళతారు. శివకుమారుడు తన తాతతో జరిగినదంతా చెబుతాడు. కొడుకుని కోడలిని అరణ్యాలపాలు చేసినందుకు భరతరాజు పశ్చాత్తాపపడతాడు. లవతకుమారుడు పట్టాభిషక్తుడు కాగా, శివకుమారుడు ముగ్గురు కన్యలనూ తీసుకొని, తాను పుట్టి పెరిగిన చెంచులపట్నం వెళ్లిపోతాడు[38]

ఈ కథలో ఎవరు ఎవరిని బాధలు పెట్టినా, ఎవరు ఎవరిని చంపినా, శక్తి దేవతను కొల్వక నిర్లక్ష్యం చేసినవారిని, ఆమె కష్టాలు పాల్జేస్తుందనేది కథాసారాంశం. శక్తిదేవత శివకుమారుడి చేత చంపబడ్డట్టు పేర్కొనబడినా, కథంతా శివకుమారుడి, అతని తాత తండ్రుల కష్టాలతోనే నడుస్తుంది. కావున కొల్వక నిర్లక్ష్యం చేసిన వారిని శక్తిదేవత కష్టాలపాల్జేస్తుందనేది కథాసారాంశం.

ఈకథను పోలిన కథను 'శివకుమారుడి కథ' అనే పేరుతో నాయని కృష్ణకుమారిగారు తమ గ్రంథంలో పేర్కొన్నారు[39]. ఈ రెండు కథలలోనూ నాయకుడు అతని తల్లి, తండ్రి, తాత పేర్లు సమానమే. ఇతివృత్తంకూడా ఒకటే. కాని నేను సేకరించిన కథలో లవత కుమారుణ్ణి మింగింది. శక్తిదేవత కాగా కృష్ణకుమారిగారు సేకరించిన కథలో అతనిని మింగింది. జలరాక్షసుడు నా కథలో శివకుమారుడికి నాల్గువస్తువులు సంపాదించటంలో సహకరించిన ముని పేరు మింగి. కాని కృష్ణకుమారిగారి కథలో చిటిముటి యోగి. మేలికాంత వస్త్రం శివకుమారుడు తెచ్చేటప్పుడు వెనుకకు తిరిగి చూడకుండ తిన్నగా మునివద్దకు వచ్చేసినట్లు నేను సేకరించిన కథలో పేర్కొనబడింది. కృష్ణకుమారిగారి కథలో అతడు వెనుకకు తిరిగిచూసి, మేలికాంత మహిమవల్ల శిల్పంగా మారి, ముని మహిమవల్ల పునర్జీవితుడవుతాడు. ఈవిధమైన కొద్దిపాటి మార్పులు తప్ప, ప్రధాన ఇతివృత్తం రెండు కథల్లోను ఒకటే.

**గంగబుల్లావు కథ :** చంద్రశ్చేన మహారాజు బార్య బూ(భువ)న సుందరీదేవి. రాజ్యంలో ప్రజలు వర్షాలు కురవక, పంటలు లేక బాధపడుతున్నారు. దయామయుడైన రాజు ధనధాన్యాలను ప్రజలకు దానం చేస్తున్నాడు. ఆ రాజుకి పిల్లలులేనందున రాణి కైలాసమెళ్లి, ఈశ్వరుని వరం వల్ల పుత్రుణ్ణి కన్నది. పిల్లవాడు పుట్టగానే రాజ్యంలో వర్షాలు కురిసి (వరపుత్రుడు కాబట్టి) పంటలు పండాయి.

రాజు మంత్రితో కూలీలను తీసుకెళ్లి, పంటకోయించమన్నాడు. పంటకోయించే మంత్రివద్దకు పంట శక్తి ప్రత్యక్షమై, తన అనుమతి లేకుండ పంట కోస్తున్నందుకు ఆగ్రహించి,

తనకు తొలిపండుగ చెయ్యాలని, కోరిక తీర్చాలని, లేకుంటే పంటలు పాడుచేస్తానని రాజుతో చెప్పమంటుంది. మంత్రి రాజుతో ఈ విషయం చెబుతాడు. రాజు భయంతో పొలంలోనికెళ్లి, వటవృక్షమ్మీద కొలువు కూర్చున్న పంటశక్తికి నమస్కరించి వేడుకుంటాడు. తొలి పండుగ చేస్తానంటాడు. బలిగా కోడి, మేక, దున్నపోతు చివరకు తన కుమారుణ్ణి కూడ బలి ఇస్తానంటాడు. వాళ్లెవరుకాక, రాజు భార్య బూనసుందరిని బలికావాలంటుంది. బలి యివ్వకపోతే సర్వనాశనం చేస్తానంటుంది.

రాజు భయంతో ఇంటికొచ్చి, జరిగినదంతా భార్యతో చెబుతాడు. రాజ్యశ్రేయస్సు, ప్రజాశ్రేయస్సు కోరిన బూనసుందరి తనను బలిగా అర్పించుకోవటానికి సిద్ధపడింది. తన తల్లిని పుట్టింటికి తీసుకెళ్తున్నానని, కుమారుడి దగ్గర మర్మమెట్టి, రాజు తన భార్యను పంట శక్తికి బలి ఇచ్చాడు. బలి ఇవ్వటానికి ముందు తాను రెండవ పెళ్లి చేసుకోనని భార్యకు మాట ఇచ్చాడు. తాను మరణించాక తమ ఇంట గంగబుల్లావునై పుడతానని, దోసపాదునై పుడతానని చెప్పి, ఈ విషయం ఎవ్వరికీ చెప్పవద్దని రాణి, రాజు వద్ద మాటతీసుకుంది.

భార్య మరణించిన దుఃఖంతో రాజు విచారగ్రస్తుడై, రాజ్యపరిపాలనా విషయాలలో నిరాసక్తుడై ఉన్నాడు. అట్టి రాజును ఒకరోజు ఉద్యానవనానికి తీసుకెళ్లి, మంత్రి రాజ్యపరిపాలన సక్రమంగా సాగడానికి, తన కుమారుణ్ణి అల్లారుముద్దుగా పెంచటానికి రెండవ పెళ్లి చేసుకోవాలని, లేకుంటే రాజ్యం సర్వనాశనం అవుతుందని రాజుకు బోధించి, రెండవ పెళ్లికి ఒప్పిస్తాడు. తమ రాజుకు తల్లిదండ్రులులేరని, ఎంతో భాగ్యమున్నదనీ, అబద్ధమాడి, మగధ రాజ్యపురాజు రత్నాంగుని కుమార్తె కనకావళిని ఒప్పించి, మంత్రి ఆమెతో రాజుకి పెళ్లి జరిపిస్తాడు.

చంద్రశ్చేనుడు కనకావళితో, తనకు ఇంతకుముందే వివాహమయ్యిందని, భార్య చనిపోయిందని, చెప్పి అల్లారుముద్దుగా పెంచాలని కుమారుణ్ణి ఆమెకు అప్పగించి, తాను రాజ్యకార్యకలాపాలలో చురుకుగా పాల్గొంటున్నాడు. కనకావళి ఆ బాలుణ్ణి అల్లారుముద్దుగా పెంచుతుంది. రాజు సుఖోజ్జయంగా పరిపాలన సాగిస్తూ, తాను సుఖంగా ఉన్నట్టు జయభేరి మోగించాడు. ఈ జయభేరిమోత పంటశక్తి ఆలకించి, రాజుమాట తప్పి రెండవ పెళ్లిచేసుకున్నందున, వెళ్లి గంగబుల్లావుగాపుట్టి, కుమారుణ్ణి కాపాడుకోమని బూనసుందరిదేవిని పంపిస్తుంది.

బూనసుందరీదేవి రాజుదొడ్డిలో పెద్దావు కడుపున గంగబుల్లావుగా పుట్టింది. పెరటిలో దోసపాదై నిలిచింది. ఈ విషయం మంత్రి రాజుతో చెప్పగా, విషయం గ్రహించిన రాజు గంగబూల్లావును ఏమి అనవద్దని మంత్రితో చెబుతాడు. గంగబుల్లావు కొడుకుని చూద్దామని కోటచుట్టూ తిరుగుతుంది. బాలుడికి ఏడేళ్లప్రాయమొచ్చాక, కనకావళి గర్భవతియై, ఒక బాలుణ్ణి ప్రసవించింది. రాజు బ్రహ్మణులను పిలిపించి ఇద్దరి కుమారులకు జ్యోతిష్యం చూపించి, పెద్దవాడికి వీరశ్చేనుడనీ, చిన్నవాడికి వీరకర్ణుడని పేర్లు పెట్టాడు. కనకావళి ఇద్దరు బాలల్ని ప్రేమతో అల్లారుముద్దుగా పెంచుతుంది.

ఇద్దరి బాలల్ని బడికి పంపగా, వారిద్దరూ బడికి వెళ్లి చదువుకుంటున్నారు. ఒక రోజు మాష్టారు వీరశ్చేనుణ్ణి దగ్గరకు పిలిచి, చెవిలో రహస్యం చెప్పేవానివలె ప్రవర్తించి, తమ్ముడున్నందున

రేపు చెబుతానంటాడు. వరుసగా మూడురోజులు ఆవిధంగా చేస్తాడు. తమ్ముడు వీరకర్ణునికి అనుమానమొచ్చి, ఇంటికెళ్లి తల్లితో చెబుతాడు. అప్పటినుంచి వీరశ్చేనుడి కష్టాలు ప్రారంభ మయ్యాయి.

ఒకరోజు వీరశ్చేనుడు ఇంటి కొచ్చేసరికి కనకావళి, వీరకర్ణుడు భోజనం చేసి విచారంగా పడుకున్నారు. ఇంటికొచ్చిన వీరశ్చేనుడితో ఇద్దరూ మాట్లాడరు. కనకావళి తన అనారోగ్యం కారణంగా వంట చేయలేదని, తండ్రి తన గురిచి పట్టించుకోవడం లేదని, వంట చేయటానికి నీళ్లు లేవని, చెరువుకెళ్లి, కావడితో నీళ్లు తెస్తే అన్నం వండుతా నంటుంది. లేకపోతే అన్నం వండదేమోననే భయంతో వీరశ్చేనుడు కావడితో చెరువుకి నీళ్లకెళ్లి, చెరువు గట్టు ఎక్కబోతూ కాలుజారి పడిపోతాడు. కుమారుడి వెంట వెంబడిచి తిరుగుతున్న గంగబుల్లావు తోక అందించి, అతనికి సహాయపడుతుంది. నెమ్మదిగా లేచి ఇంటి కొస్తాడు. చొట్టబడిన బిందెలు చూసి, చీపురుకట్టతో కొడుతుంది. ఇంటివద్ద ఉండవద్దనీ, పొలమెళ్లి అక్కడ అటక వేసుకొని ఉండమని తరిమేస్తుంది. మారేటి తల్లి బాధలు పడలేక వీరశ్చేనుడు పొలంలో అటక వేసుకొని, దానిమీద పరుండి, జీవిస్తున్నాడు. పొలంలో ఉంటున్న వీరశ్చేనుడు రెండురోజులు గడిచినా ఆహారం పంపించకపోయేసరికి, అటక దిగి దాహం తీర్చుకోవటానికి ప్రయత్నిస్తూ, ఊబిలోనికి దిగిపోతూ, తల్లిని స్మరించుకుంటాడు. గంగబుల్లావుకి ఆ పిలుపు వినిపించి వచ్చి తోక అందించి కొడుకుని కాపాడుతుంది. చెరువులో పడినప్పుడు, ఊబిలో దిగినప్పుడు, కాపాడిన నీవెవరివని అడిగిన కొడుకుతో తాను తల్లినని చెబుతుంది. అప్పటినుంచి తన తల్లిని తెలుసుకున్న వీరశ్చేనుడు ఆమె సహకారంతో మనుగడ సాగిస్తున్నాడు. ఆకలివేస్తే పెరటిలోనున్న దోసకాయలు తినమంటుంది. వాటి గురించి ఎవరికి చెప్పవద్దంటుంది. వీరశ్చేనుడు ఆవిధంగానే చేస్తున్నాడు.

కోటలో నున్న కనకావళి పొలంలో నున్న వీరశ్చేనుడు ఏమి తిని బ్రతుకుతున్నాడో చూసి రమ్మని వీరకర్ణుణ్ణి పంపుతుంది. అతడు వచ్చి, అన్నమీద సానుభూతితో మాట్లాడుతూ తల్లిని తిడతాడు. ఆకలి వేస్తుందన్న తమ్ముడికి, వీరశ్చేనుడు దోసకాయలు కోసి పెడతాడు. అమృతం వంటి పళ్లు తిన్న వీరకర్ణుడు వాటి గురించి అడుగుతాడు. మర్మమెరుగని వీరశ్చేనుడు రహస్యం చెప్పేస్తాడు. వీరకర్ణుడు ఇంటికొచ్చి, ఈ రహస్యం తల్లికి చెప్పగా, ఆమె ఆ దోసపాదును కోయించి, తగులబెట్టిస్తుంది. ఆకలి వేసిన వీరశ్చేనుడు పెరటిలోని కెళ్లి దోసపాదు లేకపోవటంతో, చింతించి, పొలం వచ్చి మళ్లీ తల్లిని ప్రార్థించుకుంటాడు. తల్లి (గంగబుల్లావు) వచ్చి, కొడుకును ఓదార్చి, ఒక్కొక్కటి చొప్పున తన నాల్గు రొమ్ములు పట్టుకుంటే వరుసగా ఆకు, అన్నం, పప్పుతో పదహారు కూరలు, పాలు, మజ్జిగలు వస్తాయంటుంది. వీరశ్చేనుడు ఆవిధంగానే చేసి, ఆకలి తీర్చుకుంటాడు. ఈవిధంగా ఆకలి వేసినప్పుడల్లా తల్లిని ప్రార్థించి, తన ఆకలి తీర్చుకుంటున్నాడు. ఈ రహస్యం ఎవ్వరితో చెప్పవద్దని, చెబితే ఇద్దరి ప్రాణాలు ఉండవంటుంది గంగబుల్లావు.

కోటలో దోసపాదు కోసేసాక ఏమి తిని బతుకుతున్నాడో చూసి రమ్మని కనకావళి వీరశ్చేనుడు వద్దకు పంపుతుంది. మర్మమెరుగని వీరశ్చేనుడు తమ్ముణ్ణి ఆదరించి, తల్లి వల్ల తాను తింటున్న ఆహారాన్ని తమ్ముడికి కూడ పెడతాడు. ఈ రహస్యం తెలుసుకున్న వీరకర్ణుడు తల్లితో

చెప్పగా, ఆమె గంగబుల్లావుని చంపించే ప్రయత్నం చేస్తుంది. ఈ విషయం గమనించిన గంగబుల్లావు మిగతా ఆవుల్ని తీసుకొని, తాము అక్కడే ఉంటే వచ్చే ప్రమాదం గురించి కొడుక్కి చెప్పి, అతనిని కూడ తీసుకొని వేరే రాజ్యానికి చేరే ఉద్దేశంతో బయలుదేరుతుంది. ఈవిధంగా ఆవులన్నీ సూర్యానగరం వచ్చి, అక్కడ ఒక వటవృక్షం వద్ద మకాం వేసాయి. అవి మేతకు వెళ్లినప్పుడు బాలుణ్ణి చెట్టుమీద కూర్చుండబెట్టేవి.

అక్కడుంటున్న పేదరాశి పెద్దమ్మ చెట్టుకింద పడిఉన్న ఆవుపేడతో వట్లు చేసుకొంటుంది.

ఒకరోజు అమావాస్య చీకటిలో పార్వతిపరమేశ్వరులు ఆకాశమార్గంలో వెళుతూ, వటవృక్షం కింద నున్న ఆవుల్ని చూసారు. వాటిని గురించి పార్వతి ఈశ్వరుని అడుగుతుంది. తన వరం వల్ల పుట్టిన కుమారుణ్ణి రక్షించుకోవటానికి భువనసుందరి గంగబుల్లావు అయి పుట్టి రక్షించుకుంటుందని, ఆ చెట్టుమీద ఆమె కుమారుడున్నాడని చెబుతాడు. అతనికి నవరూప మిస్తే, ఆమెకు కొడుకుని రక్షించుకొనే శ్రమ తగ్గుతుంది కదా ! అన్న పార్వతి మాట విని ఈశ్వరుడు సర్పరూపంలో వచ్చి వీరశ్రేనుడున్న చెట్టెక్కి కూర్చుంటాడు. భయపడిన వీరశ్రేనుడు తల్లిని ప్రార్థించగా, తల్లి నాగేంద్రుణ్ణి ప్రార్థిస్తుంది. ఈశ్వరుడు ప్రత్యక్షమయి, తన కుమారుడికి నవరూప మిస్తానని చెప్పి, నవరూప మిచ్చి, అదృశ్యమవుతాడు. నవరూపం పొందిన వీరశ్రేనుడి మేనికాంతితో ఆప్రాంత మంతా కొత్త వెలుగుతో కలకలలాడుతుంది.

ఒక రోజు ఆవులన్నీ అడవికి వెళ్లగానే వీరశ్రేనుడు చెట్టు దిగి పక్కనే ఉన్న కోనేరులో స్నానం చేస్తాడు. ఆ సందర్భంలో అతని ఒక వెంట్రుక రాలిపోగా, దానిని ఒక చేప మింగుతుంది. తళతళ మెరుస్తున్న ఆచేపను పట్టుకొని జాలర్లు ఆ దేశపు రాజు శూరశ్రేనుడికి బహుకరిస్తారు. శూరశ్రేనుడు దానిని తన కుమార్తె సూర్యగనిక వద్దకు వస్తాడు. ఆ చేపను కోసి కడుపులో తళతళ మెరుస్తున్న వెంట్రుకను చూసి, ఆ వెంట్రుకే అంత మెరుస్తున్నప్పుడు వెంట్రుక కల్గిఉన్న రాజకుమారుడు ఎంత కళాకాంతులతో ఉంటాడో అని భావించిన రాజకుమార్తె ఆ రాజకుమారుణ్ణి తప్ప, అన్యులను పెళ్లాడనని, అతనినిచ్చి పెళ్లిచేయకపోతే మరణిస్తానని తండ్రితో అంటుంది. కళాకాంతులతో వెలుగుతున్న తలవెంట్రుక కల్గిన రాజకుమారుణ్ణి వెదకి తెచ్చిన వారికి తగిన బహుమాన మిస్తానని రాజు చాటింపు వేయిస్తాడు.

ఈ చాటింపు విని, వటవృక్షం కడ ఉంటూ ఆవులపేడ చేసుకుంటున్న పేదరాశి పెద్దమ్మ రాజు వద్దకు వెళ్లి మీట నొక్కగానే ఆకాశంలో పయనించగల రథం చేయించి యిస్తే, ఆ రాజకుమారుణ్ణి తీసుకు వస్తానంటుంది. రాజు ఆవిధంగానే యిస్తాడు. రథాన్ని తీసుకొని వటవృక్షం కడకు వచ్చి, తనకు తగిన రాజకుమార్తెను పెళ్లి చేస్తానని చెప్పి, వీరశ్రేనుణ్ణి రథం ఎక్కించుకొని, పేదరాశి పెద్దమ్మ రాజు వద్దకు తీసుకొస్తుంది. వీరశ్రేనుణ్ణి చూసి, ఆశ్చర్యపడ్డ శూరశ్రేనుడు, తన కుమార్తె నిచ్చి పెళ్లి చేస్తానని చెప్పి, అందుకు అతని తండ్రిని తీసుకొని రమ్మంటాడు. వీరశ్రేనుడు వటవృక్షం కడకు వచ్చి, తన తల్లితో సహా మిగతా ఆవులన్నింటినీ శూరశ్రేనుడి దగ్గరకు తీసుకెళతాడు. గంగబుల్లావుని తన తల్లిగా పరిచయం చేస్తాడు. గంగబుల్లావు ఈశ్వరుని వరంవల్ల వీరశ్రేనుడు పుట్టాడని శూరశ్రేనుడితో చెబుతుంది.

గంగబుల్లావు అంగీకరించిన పిమ్మట శూరశ్చేనుడు తన కుమార్తెను వీరశ్చేనుడి కిచ్చి వైభవంగా వివాహం జరిపిస్తాడు. పెళ్లి జరిగిన పిమ్మట గంగబుల్లావు వీరశ్చేనుల చరిత్ర తెలుసుకున్న శూరశ్చేనుడు కుమార్తెను, అల్లుణ్ణి, ఆవుల్ని తీసుకొని చంద్రశ్చేనుని రాజ్యానికి బయలుదేరి వెళతాడు. చంద్రశ్చేనుడువారినాదరించి, వారు వచ్చిన కారణ మడుగుతాడు. గంగబుల్లావు అతని ముందు భార్య అని, వీరశ్చేనుడు ఆమె కొడుకని, సూర్యగనిక వారి కోడలని, వారికి పట్టాభిషేకం చేయాలని శూరశ్చేనుడు కోరగా, అందు కంగీకరించిన చంద్రశ్చేనుడు పశ్చాత్తాపపడి ఆవిధంగానే చేస్తాడు.

గంగబుల్లావు తన బాధ్యతలు తీరినందున వారందరి వద్ద సెలవు తీసుకొని, వారి ఎదుటే కిందపడి మరణిస్తుంది. వీరశ్చేనుడు ఆమె విగ్రహం చేయించి, పూజిస్తాడు. తన తండ్రి పంట శక్తిని కొల్వక తప్పినందునే, తన తల్లీ, తనూ కూడ కష్టాలు పడవలసి వచ్చిందని తెలుసుకొన్న వీరశ్చేనుడు పంట శక్తికి సంబరం చేయిస్తాడు. అప్పటినుంచి ప్రతి ఏటా తప్పక పంటశక్తి సంబరం చేయిస్తున్నారట.

ఈ కథలో మిగతా కల్పనలు ఎన్నిఉన్నా, తనను కొల్వక తప్పినవారిని శక్తి దేవత కష్టాలు పాల్జేస్తుందనేది కథాసారాంశం. చంద్రశ్చేనుడు పంటశక్తికి తొలి పండుగ చేయనందునే భార్యను బలిని తీసుకొని, కొడుకుని కూడ కష్టాలు పాల్జేసింది. మాతృదేవతారాధన మరుగున పడుతున్న కాలంలో మాతృదేవతల ప్రాధాన్యాన్ని ఉగ్గడించడానికి ప్రచారంలోని కొచ్చిన కథగా ఈ కథను పేర్కొనవచ్చును.

**ఎల్లమ్మ :** ఈమెను ఎల్లారమ్మ, ఎల్లమాదేవి, రేణుకాదేవి అని కూడ పిలుస్తారు. ఈమె ఈ జిల్లాలోని మండపేట, వెంగయ్యమ్మ పేట, గొల్లవిల్లి, మొదలైన గ్రామాల్లో పూజింపబడుతున్నది. ఈమె పుట్టుకను గురించి తెలియచేసే కథ లభించకపోయినా, ఈమె వివాహాన్ని తెలియచేసే కథ లభించింది. ఈమె సంతతియైన జంపన, పరశరాముడు బాలగౌరి కథలలో కూడ ఈమె ప్రసక్తి వస్తుంది. ఎల్లమ్మ పుట్టుకకు సంబంధించిన కథలను రావి ప్రేమలత గారు తమ గ్రంథంలో పేర్కొన్నారు.

ఎల్లమ్మ త్రిమూర్తుల మాయవల్ల కోరుపుట్టులో పుట్టింది. ఈమెను గిరిరాజు పెంచుకున్నాడు. గిరిరాజు చెల్లెలు జలగన్న పార్వతి. ఆమె భర్త గౌతుముడు. ఆమె పెద్దకుమారుడు జవితికరాజు. చిన్నకుమారుడు ధనశుకమహారాజు. జవితికరాజుకు పెండ్లీయీడు వచ్చాక, పెండ్లి చేయటానికి ప్రయత్నిస్తున్న తల్లితో జవితికరాజు తన మేనమామ కూతురు ఎల్లమ్మను తప్ప ఇతరులను పెళ్లాడనంటాడు. వద్దన్న తల్లితో పంతగించి, ఎల్లమ్మను పెళ్లాడి వస్తానని జవితికరాజు ఇంటినుంచి బయలుదేరాడు. ఎంతోమంది గొప్ప గొప్ప రాజుల్ని కూడ పెళ్లాడ నిరాకరించిన ఎల్లమ్మను పెళ్లాడతానని బయలుదేరిన జవితికరాజు మారువేషంతో ఎల్లమ్మ మేడకు వచ్చాడు. బిచ్చాటన చేస్తున్నాడు. ఎల్లమ్మ దాసీలను పంపి బిచ్చమెయ్యమన్నది. బిచ్చ మెయ్యటానికి వచ్చిన దాసీలతో ఈ మేడ అధిపతులు తప్ప వేరొకరు ఇచ్చిన బిచ్చాన్ని తీసుకోనన్నాడు. ఈ మాట దాసీలు చెప్పగా విని, తానే బిచ్చమేస్తానని ఎల్లమ్మ మేడ దిగివచ్చి బిచ్చమేస్తుంది. బిచ్చమేస్తున్న ఎల్లమ్మపై మంత్రించిన విబూది చల్లి, బిచ్చగాడు ఊరవతల ఉన్న తన డేరాలోని కెళ్లిపోతాడు.

చల్లిన విబూది మహిమవల్ల ఎల్లమ్మకు మతి భ్రమించి, కట్టుకున్న వస్త్రాలు చింపటం, మొదలైన పిచ్చిపనులు చేస్తుంది. ఈవిషయం తెలిసిన దాసీలు వేటకెళ్ళిన ఎల్లమ్మ తండ్రికి, సోదరులకు కబురు పంపి, వారిని రప్పిస్తారు. వచ్చిన రాజు తన కుమార్తె పిచ్చి బాగుచేసిన వానికి, తన కుమార్తెతోపాటు, అర్ధరాజ్యం కూడ ఇస్తానని చాటింపు వేయిస్తాడు. ఇది విన్న జవితికరాజు మారువేషంలో వచ్చి మంత్రించిన విబూది చల్లగా ఆమె పిచ్చి కుదిరింది. తర్వాత తన వేషం మార్చి, తాను జతికరాజునని చెప్పి, ఎల్లమ్మను పెళ్లాడి, ఆమె తండ్రి ఇస్తానన్న రాజ్యభాగాన్ని కూడ తీసుకున్నాడు. ఈవిధంగా ఎల్లమ్మ వివాహం జరిగింది[40].

**జంపన కథ :** జవితికరాజు నీలగిరి పట్టణాన్ని పరిపాలిస్తున్నాడు. జవితికా ఎల్లమ్మలకు ఎంతకాలానికి సంతానం కలగలేదు. చివరికి ఎల్లమ్మ జమ్మినోములు నోచి జంపన్నను, గౌరి నోములు నోచి గౌరమ్మను, రాతి నోములు నోచి రాముడి (పరశరాముడి)ని కన్నది. కాగా గౌరమ్మ నివాసం పులిగొండ పట్టణం. పరశురాముడి నివాసం గాజుగొండ పట్టణం. జంపనను తల్లి సిద్ధభుక్తిగా సిద్ధుల వద్దకు పంపిస్తుంది. పూర్వకాలంలో సిద్ధులకు, ఎల్లమ్మ తండ్రి గిరిరాజుకి వచ్చిన యుద్ధంలో సిద్ధులు గిరిరాజు కళ్ళు పీకేస్తారు. ఎల్లమ్మ సిద్ధులను తన సోదరులుగా భావించి, తన తండ్రికి కళ్లు రప్పిస్తే, తన గర్భాన పుట్టిన తొలి సంతానాన్ని వారికి భుక్తిగా ఇస్తానంటుంది. గిరిరాజుకి కళ్లు వస్తాయి. ఆ ఏగ్గుం(మొక్కు) ననుసరించి జంపనను సిద్ధులకు భుక్తిగా పంపిస్తుంది.

సిద్ధులకు భుక్తిగా వెళుతున్న జంపనకు ఆహారంగా మార్గమధ్యంలో తినటానికి ఎండిపొల్లువలె ఉన్న మొక్కజొన్నగింజలు, చిల్లంపెంకులు, ఇసుక(ఉప్పుగా) మూడు మూటలుగా కడుతుంది. జంపన వీపుమీద సిద్ధులకు మాత్రమే అర్థమయ్యేటట్లుగా తన కుమారుణ్ణి చంపి, మాంసం వండుకొని తినమని, అతని గుండెను మాత్రం తనకు పంపమని వ్రాస్తుంది. ఈవిధంగా తల్లి పంపగా బయలుదేరిన జంపన కొంతదూర మెళ్లాక, ఒక చెరువు వద్ద ఆగి, తిందామని తల్లి కట్టిన మూటలు విప్పుతాడు. అందున్నవి చూసి, తల్లి తనపట్ల చూపించిన నిరాదరణకు చింతిస్తాడు. ప్రయాణం ముందుకు సాగిస్తాడు. కొంతదూరం వెళ్లాక, తన చెల్లెలు గైరమ్మ ఉంటున్న పులిగొండ పట్టణం వెళ్లే రహదారి, తన ప్రియురాలు జట్ల మాణిక్యం ఉంటున్నచోటుకు వెళ్లే రహదారి, తాను వెళ్లవలసిన సిద్ధుల కోటకు వెళ్లే రహదారి కలిసే కూడలికి చేరతాడు. సిద్ధుల వద్దకు వెళ్లటానికి ముందు చెల్లెలిని, ప్రియురాలిని చూడాలనుకొని ముందుగా చెల్లెలు వద్దకు వెళతాడు. యోగక్షేమలడిగిన చెల్లెలుతో, తల్లి తన్ను సిద్ధుల వద్దకు పంపుతున్నందున చివరిసారిగా చూడాలని వచ్చినట్లు చెబుతాడు. తల్లి తమపట్ల ప్రవర్తిస్తున్నతీరుకు ఇద్దరూ చింతిస్తారు. చెల్లెలు వద్ద సెలవు తీసుకొని తన ప్రియురాలు జట్లమాణిక్యం వద్దకు వస్తాడు. ఆమె ప్రియునికి పరిచర్యలు చేస్తూ వీపుమీద ఉన్న వ్రాతలు చూసి, విషయం తెలుసుకొని దుఃఖిస్తుంది. జంపన ఓదార్చుతాడు. ఆ రాత్రికి భర్తను తన వద్దనే ఉండనిచ్చి, జట్ల మాణిక్యం కొండ కెళ్లి, సంజీవివేళ్లు తెచ్చి, ఏడు వర్ణాల వస్త్రం జోలె కుట్టి, విబూది, సంజీవి వేళ్ళ జోలెలో పెట్టింది. 'మీకు కష్టకాలం వచ్చినపుడు నన్ను తలచుకోండి నేను మీ సంచిలోనే ఉన్నాను' అని చెప్పింది. జంపన భార్య వద్దనుండి బయలుదేరాడు.

జంపన వెలుగొండ పట్టణంలో ఉన్న సిద్ధుల వద్దకు తిన్నగా వెళ్లక ప్రియురాలి మేడ

కెళ్లాడని గ్రహించిన ఎల్లమ్మ, కోపంతో జంపనను మధ్య దారిలోనే చంపించాలని తలంచి, కోరుపుట్టలో నున్న నాగేంద్రుడి వద్దకు వెళ్లి, వెళుతున్న జంపన్నను చూపి, అతనిని చంపితే, కోరిక తీరుస్తానని మభ్యపెట్టి, చంపమని పంపుతుంది. నాగేంద్రుడు జంపన కెదురుగా వెళ్లి నిలబడతాడు. భయపడ్డ జంపన భార్యను తలచగా ఆమె అతని జోలెలో ఉన్నానని, జోలెలో ఉన్న విబూది నాగేంద్రుడిపై జల్లితే భస్మమవుతాడని చెబుతుంది. అలాగే జల్లాడు. నాగేంద్రుడు మంటల్లోమాడి, చావుబతుకుల్లో ఉండి, జంపన కాళ్లకు చుట్టుకుంటాడు. అంతదయతలచిన జంపన మరికొంత విబూది మళ్ళీ చల్లగా నాగేంద్రుడు సజీవుడవుతాడు. కొత్తకాంతితో వెలుగుతాడు. జంపన్నను చంపకుంటే, ఎల్లమ్మ తీరుస్తానన్న కోర్కె తీర్చదేమోనని మళ్లీ జంపన్నను చంపే ఉద్దేశంతో అతని కెదురుగా వెళ్లి నిలబడుతాడు. నాగేంద్రుడు. అంత కోపించిన జంపన నాగేంద్రుణ్ణి మూడుముక్కలు చేసి, మధ్య ముక్క మింగి కచ్చి, నాగేంద్రుని నడుము మీద కాలితో తొక్కి, వెన్నుపూస విరగ్గొడతాడు. వంగిన వెన్నుతో వంకర టింకరగా తిరుగుతూ, తిన్నగ్గా ఎల్లమ్మ ఉంటున్న నీలగిరి పట్నం వెళతాడు. నాగేంద్రుణ్ణి చూసి ఎల్లమ్మ తన కుమారుణ్ణి చంపనందుకు కోపించి, కొట్టదలచి వెంటతరిమింది. తాను చెప్పినట్లు వెలిగొండ పట్టణం వెళుతున్నాడో లేదో వెళ్లకపోతే దారిలోనే చంపాలని తలంచి, ఎల్లమ్మ రాక్షసి వేషం ధరించి, జంపన ముందు నిలబడింది. భయపడ్డ జంపన తన ఆప్తులైన తమ్ముడు, చెల్లెలు, భార్య, మొదలైనవారిని స్మరించుకుంటాడు. భార్య తాను సంచిలో ఉన్నానని, ఆ సంచిలో ఉన్న సంజీవి వేళ్లతో కూడి విబూది చల్లితే రక్కసి వేషంలో వచ్చిన తల్లిపీడ వదులుతుందని సలహా ఇస్తుంది. ఆవిధంగా చేయగానే రాక్షసి రూపులన్నీ పోయి, ఎల్లమ్మాదేవి రూపంలో నిలబడి, కోపించిన కుమారుణ్ణి క్షమించమంటుంది. అక్కడ బయలుదేరి కొంతదూరమెళ్ళాక , మళ్లీ పులిరూపంలో వచ్చి, కుమారుని చంపబోతుంది. భార్య సలహాతో పులిని లొంగదీసుకొని, ఆరాత్రంతా పులిమీద స్వారీ చేసి, దానిని చిత్రహింసలు పెట్టి, వదలి పెడతాడు. కుమారుడు నిజం తెలుసుకొని తనను చంపుతాడేమోనని భయపడ్డ ఎల్లమ్మ, అక్కడనుంచి పారిపోయింది.

పారిపోయి అక్కడ అరణ్యంలో ఉంటున్న కొండకోయజాతుల వారైన మనుష్యుల వద్దకు భూమిశిస్తు వసూలు చేసే దొర వలె వెళ్లి, వాళ్లను మభ్యపెట్టి, వాళ్లందరిని జంపన మీదికి యుద్ధానికి పంపుతుంది. యుద్ధానికి వెళ్లిన వాళ్లందరూ జంపన మీద బాణాలు వేయగా, ఆ బాణాలు తిరిగి వాళ్లకే తగిలేవి. భార్య సలహా ననుసరించి, వాళ్లమీద వీబూది చల్లగా వాళ్లంతా కూలిపోయారు. వాళ్లలో ముగ్గురు తప్పించుకొని రాతికింద దాక్కున్నారు. వాళ్ళ ముగ్గురినీ పట్టుకొని, మూడుతలలకు ఒకే ముడివేసి, ముడి విప్పటానికి ప్రయత్నిస్తే, రెట్టింపు ముడులవ్వాలని శపించి విడిచిపెడతాడు. వాళ్ల ఎల్లమ్మ వద్దకి వచ్చి, విషయం చెప్పి, ఆమె చేత తలొగొరిగించుకొని జంపన శాపం నుండి బయటపడతారు.

అక్కడనుంచి ఎల్లమ్మ తన చెల్లెలు చెల్లమ్మాదేవి వద్దకు వెళుతుంది. ఆమె భర్త చెంచునాయుడు. వెళ్లేటప్పుడు బురదగోతిలో బురద ఒంటికి పూసుకొనివెళ్లి, తనను కొమ్ములుదుప్పి బురదగుంటలో దొర్లించి పాడిచిందని, దానిని ఎలాగైనా చంపాలని, సమీపంలో నున్న చెరువులోనికి నీళ్లు తాగటానికి

వస్తుంది. వెళ్ళి చంపమని, చెల్లెలిని మరిదిని పంపిస్తుంది. ప్రయాణించి అలసి ఉన్న జంపన తన భుజాన్నున్న సంచి, చెరువు గట్టునున్న జమ్మివృక్షానికి తగిలించుకొని, చెరువులోనికి దిగి నీళ్ళు తాగుతున్నాడు. అప్పటికే కొమ్ములు దుప్పికోసం అసమీపంలో పొంచి చూస్తున్న చెల్లమ్మాదేవి, చెంచునాయుడు జోడుగుళ్ల తుపాకి పేల్చగా, ఆ గుళ్ళు జంపనకు తగులుగా అతడు చెరువు ఒడ్డున పడిపోయాడు. భార్యను తలచుకోగా ఆమె మహిమవల్ల జమ్మివృక్షం కొమ్మ జంపన వైపుకి ఒంగి, సంచి నుంచి సంజీవి వేళ్ల రసం తేనె చుక్కల వలె పడుచుండగా అతను ఊపిరితో ఉన్నాడు.

జంపన పడిపోయినప్పటి నుంచి, చెల్లమ్మాదేవికి ఒంటిలో నలతగా ఉండడంవల్ల, తాము చంపినది మనిషో. జంతువో చూడాలని చెరువు దగ్గరకెళ్ళి చూసి సంజీవి వేళ్ళు తెచ్చి అతనిని బతికించారు. అతని వివరాలు తెలుసుకొని, చెల్లమాదేవి అతనిని తన అక్క కుమారునిగా గ్రహించి, ఆశీర్వదిస్తుంది. తన అక్కకుమారునికి సంచిలో ఏమిపెట్టిందోనని చేయి పెట్టి చూసేసరికి, సంచిలో నున్న సంజీవి వేళ్ళు, వీబూది మైలపడి తేనెటీగయ్యి ఎగరిపోయాయి. ఈవిధంగా జంపన తన పిన్ని చెల్లమాదేవి వద్ద సెలవు తీసుకొని బయలుదేరి వెళుతుంటాడు. వెళుతున్న జంపనకు అగ్నిగుండాలు ఎదురయ్యాయి. వాటిని దాటలేక, వాటిని పోగొట్టటానికి సంచిలో వీబూది పనిచెయ్యక, అక్కడ తపస్సు ప్రారంభించాడు. అతని చుట్టూ ఒక పుట్ట ఏర్పడింది. పుట్టమీద రకరకాల పూలచెట్లు పెరిగి, పూలు పూస్తాయి. జంపన భార్యకలలోని కెళ్లి విషయం చెబుతాడు. భర్త పరిస్థితి తెలుసుకొని భార్య అతని వద్దకు వస్తుంది. పుట్టలో ఉన్న అతడు కన్పించనందున అచ్చట పూలచెట్ల పూలు కోస్తుంది. పూలుకోస్తున్న చప్పుడు విన్న జంపన 'నా చెల్లెలివా పూలు కోస్తున్నావు' అంటాడు. ఆమాటకు చేయి అందిచ్చి, అతనిని పుట్టలో నుంచి బయటకు తీసి, భార్యను చెల్లెలా ! అన్న పాపానికి తాను అగ్నిలో ప్రవేశించి, కాలి పోయి, చిన్న పుత్తడిబొమ్మగా మిగులుతానని, వెలుగొండ పట్టణం వెళ్లొచ్చాక నీకు భార్యనుకాని, అంతవరకు చెల్లెలినే అన్న భార్య మాట విని, జంపన వెలుగొండ పట్టణం బయలుదేరాడు.

వెలుగొండపట్టణం వెళ్లిన జంపనను సిద్ధులు చూసి, అతని వీపు మీద వ్రాతలు చదువుకొని, అతనిని చంపటానికి మనస్కరించక, ఒక పక్షి నిచ్చి, ఆపక్షిని చంపి వండి పెడితే చాలంటారు. వండడానికి ఒక కుండ కూడ ఇస్తారు. పక్షిని చంపి, మాంసం కూర వండుతాడు. పక్షి, ప్రాణాలు విడుస్తూ నా ప్రాణాల వలే నీ ప్రాణాలు పోతాయని శపించి, మరణిస్తుంది. జంపన మాంసంకూర వండుతూ, ఒక పుల్ల (సంజీవి పుల్ల) తో కూర కలుపుతాడు. ఆపుల్ల తగలగానే పక్షికి ప్రాణమొచ్చి ఎగిరిపోయింది. ఎగిరినపక్షి కూడా బయలుదేరిన జంపన ఆ పక్షి ఒక చెట్టు తొర్రలోకి దూరగా ఈతడు కూడా దూరి, తొర్ర నుండి బయటకు రాలేక అందుండిపోతాడు.

జంపన వండిన కూర తిందామని వచ్చిన సిద్ధులు అతడు అక్కడ కన్పించక పోయేసరికి, అతనిని వెదకుతూ తిన్నగా ఆ వృక్షం దగ్గరకు వస్తారు. ఆ వృక్షాన్ని పరిశీలించగా ఆతొర్రలో మనిషి ఉన్నట్లు గ్రహించి, బయటకు లాగుతారు. అతనిని పట్టి వధించి, కూర వండి తినుటకు సిద్ధపడుచుండగా జంపన భార్య, మరియు చెల్లెలు గౌరీదేవి కూడ తేనెటీగల రూపంలో వచ్చి, వారు తినే భోజనాన్ని పేడగామార్చి వేసి, జంపనకు ప్రాణమిచ్చారు. జంపన లేచి నిలబడి సిద్ధుల్ని ఆటపట్టిస్తూ పాటపాడుతాడు.

మొక్కు తమకు తాముగా తీర్చుకోలేకపోయాము. ఎల్లమ్మ వద్దకు వెళితే తీరుస్తుంది కదా! అని సిద్ధులు జంపనను తీసుకొని ఎల్లమ్మ వద్దకు వచ్చారు. తన కుమారుణ్ణి చంపి తమకు మొక్కు చెల్లించమంటారు. ఎల్లమ్మ అలాగేనని జంపననుచంపి, వండి వడ్డిస్తుంది. వారు తినబోయేసరికి జంపన భార్య, గౌరిదేవి మహిమవల్ల వర్షం కురిసి, విస్తళ్ళలోని మాంసమంతా వర్షపు నీటితో కొట్టుకొనిపోతుంది. జంపన మళ్ళీ బతుకుతాడు. అతనినిచూసి సిద్ధులు, ఎల్లమ్మ తన కుమారుడుని కాక, ఏ జంతువునో చంపి, తమకు వడ్డనచేసిందని భావించి, తన ఎదురుగానే జంపనను చంపి వడ్డించాలంటారు. ఎల్లమ్మ ఆవిధంగానే చేస్తుంది. ఆ విడ్డించిన మాంసాన్ని తినబోవుచుండగా, జంపన భార్య, జంపన తమ్ముడు పరశురాముడు, చెల్లెలు గౌరీదేవిల మహిమవల్ల మళ్ళీ వర్షం కురిసి, మాంసమంతా కొట్టుకొనిపోతుంది. పరశరాముడు, సిద్ధుల్ని, తల్లిని చంపటానికి ప్రయత్నిస్తుండగా, సిద్ధులు భయపడి పారిపోయారు. తల్లిని చంపవద్దని జంపన పరశరాముణ్ణి ఓదార్చాడు. అప్పుడు జంపనకు జట్ల మాణిక్యానికి వివాహం జరిగింది[11]

**పరశురాముని కథ :** పరశరాముని కథలో పరశరాముడు తన మేనమామలయిన కార్తీకరాజుల్ని చంపటం ప్రధాన ఘట్టం. కార్తీకరాజులు (21 మంది) ఎల్లమ్మ తమ్ములు, వారు కలిమిలో ఉండి, జవితికరాజు లేమిలో ఉన్న రోజుల్లో అతడు వారిని పంటపండించుకోవడానికి కొర్రలు అడుగుతాడు. మంచివి యిస్తే, అవి బాగా ఫలిస్తేయేమో నన్న భావంతో వేపినవి కొన్ని, వేపనివి కొన్ని కలిపి యిస్తారు. అవి పంట పెట్టగా పంట బాగా పండుతుంది. ఇది చూసి ఓర్వలేక చేను పాడుచెయ్యమని కార్తీకరాజులు ఒక గోవును పంపుతారు. చేను పాడుచేస్తున్న గోవును జవితికరాజు చంపుతాడు. తమ గోవును చంపినందుకు కార్తీకరాజులు అతనిని కొరత వేస్తారు. పరశురాముడు పుట్టి మేనమామల్ని చంపి తండ్రిని బ్రతికిస్తాడు.

ఎల్లమ్మ రాతికొండ పర్వాతానికి వెళ్ళి, రాతి నోములు నోస్తుంది. శ్రీరామచంద్రుని వరంచేత పరశురాముడు ఎల్లమాదేవి గర్భంలో ప్రవేశించాడు. కొంచెంసేపటికి పుడతాడనగా, కడుపులోనున్న రాముడు తల్లితో 'అమ్మా! నేను పుడుతున్నాను. నీ తమ్ములు, నా మేనమామలైన కార్తీకరాజుల్ని సంహరిస్తాను అంటాడు. ఈ మాటలకు కంగారు పడిన ఎల్లమ్మ తన కడుపులో ఏదెయ్యమో, పిశాచమో పుట్టనున్నదని కలవర పడుతుంది. ఎల్లమ్మ తమ్ముల మీద ప్రేమకొద్దీ, తన గర్భంలో పెరుగుతున్న బాలుడివల్ల వారికి చావు సంభవించనున్నదని, కాబట్టి ముందుగానే వచ్చి వాడిని చంపాలని దాసితో కార్తీకరాజులుకి కబురు పంపుతుంది. ఈ వార్త విన్న కార్తీకరాజులు పుట్టిన వెంటనే బాలుణ్ణి చంపి తినమని వేటకుక్కలను ఎల్లమ్మ ఇంటికి పంపుతారు. వస్తున్న కుక్కల జాడ గ్రహించిన పరశురాముడు తల్లితో వచ్చే కుక్కలకి మేత వేసి, వాటిని ఆదరించమన్నాడు. ఆవిధంగా చేయగా, మేత మేస్తూ కుక్కలు తాము వచ్చిన కారణాన్ని మరిచాయి. కార్తీకరాజులు ఏనుగును పంపారు. పరశు రాముడి సలహాతో తల్లి ఏనుగుకి మేత వేయగా, మేస్తూ ఏనుగు కూడా తాను వచ్చిన పని మరచింది. తాము పంపిన కుక్కలు, ఏనుగు కూడ తిరిగిరానందుకు, చింతించిన కార్తీకరాజులు బాలుణ్ణి చంపటానికి దాసిని పంపుతారు. ఆమె వచ్చి ఎల్లమ్మతో కార్తీకరాజులు పంపగా వచ్చానని చెప్పి, కడుపులోనున్న బాలుణ్ణి చంపటానికి విషాన్ని ఆమె నోటిలో వేసింది. తల్లి కడుపులోనున్న పరశరాముడు కడుపులో నుండి ఆవిషాన్ని తన గొంతులో పట్టి, కొంచెంసేపు

మాట్లాడక ఊరుకున్నాడు. బాలు మరణించాడని ఎల్లమ్మ, దాసి భావించి సంతోషిస్తుండగా, కొంచెంసేపటికి తల్లి వెన్నుబద్దలు చేసుకొని (అవతారపురుషుడు కనుక) జన్మించాడు (అవతారపురుషురాలు కనుక తల్లి కూడ మరణించలేదు).

బాలుణ్ణి చంపుదామని కత్తితో బొడ్డు కోసే నెపంతో దాసి అతని దగ్గరకు వెళ్లింది. ఇది గ్రహించిన బాలుడు ముందు నుంచి వెళితే ముతిమీద, వెనక నుంచి వెళితే వెన్నుమీద దాసిని తన్నాడు. బాలుణ్ణి ఎలాగయినా చంపాలని దాసి అతనిని పట్టుకొని కొత్త కుండలో పెట్టి, పాతిపెట్టే ఉద్దేశంతో స్మశాన భూములకు తీసుకెళ్లి గొయ్యి తవ్వుతుంది. ఇది చూసిన బాలుడు తవ్వే గొయ్యిలోతుగా తవ్వితే ఇద్దరమూ గొతిలో ఈడుజోడుగా ఉందా మంటాడు. తనను పాతిపెడతాడేమోనని భయపడి దాసి, బాలుడిని విడిచి పారిపోతుంది. కార్తీకరాజుల పట్టణం నుంచి విస్తళ్ల కోసం వచ్చిన ఇద్దరు బ్రాహ్మణులు ఈ బాలుడిని చూసి, పెంచుకుందామనే ఉద్దేశంతో బాలుడిని తీసుకొని ఒడ్డాబాయ (చెరువు) కడకు వస్తారు. వారు ఎత్తుకున్న బాలుడు మోయలేనంత బరువు కాగా, వారు బాలుణ్ణి అక్కడ వదిలేసి, తమ రాజ్యానికి పారిపోతున్నారు. పారిపోతున్న వాళ్లను పిలిచి, తాను ఒడ్డాబాయి కడపెరుగుతున్నట్టు కార్తీకరాజులతో చెప్పవద్దని అంటాడు. వాళ్లకు భవిష్యత్తులో సుఖజీవనం కలుగుతుందని వరమిస్తాడు.

పురిటిస్నానం చేయటానికి నీళ్ల తెమ్మని ఎల్లమ్మ పంపగా, ఒడ్డాబాయి కడకు వచ్చిన దాసిని చూసి పరశరాముడు తాడిచెట్టు పెరికి ఆమెమీదికి విసిరి దానికింద ఆమె గిలగిల లాడుతుండగా వెళ్లి, ఆమె కొప్పుపట్టుకొని, ముక్కు, చెవులు, కొప్పు కోసేస్తాడు. ఈవిధంగా పరాభవింపబడ్డ దాసి, తిన్నగా కార్తీకరాజుల వద్దకు తమ అక్క కుమారుడైన పరశురాముడు తనను ఆవిధంగా పరాభవించాడని ఒడ్డాబాయిలో పెరుగుతున్నాడని, త్వరలో వాళ్లను కూడ సంహరిస్తాడని చెబుతుంది. ఈమాట విన్న కార్తీకరాజులు రాబందుల వద్దకు వెళ్లి, ఒడ్డాబాయిలో నున్న పరశరాముడిని చంపి తినమని పంపుతారు. ఒడ్డాబాయి కడకు వెళ్లి చంపబోతున్న రాబందులతో రాముడు నాపేరు మీపేరు ఒక్కటే కనుక నన్ను చంపకండి అని ప్రేధేయపడతాడు. అతనిమీద సానుభూతి చూపిన రాబందులు అతనిని విడిచిపెడతాయి. రాబందులు నుంచి కూడ తప్పించుకున్నాడన్న విషయం గ్రహించిన కార్తీకరాజులు వాటి కాళ్లకింద పడి మరణిస్తాడనే ఉద్దేశంతో ఏనుగుల, గుర్రాల, సమూహాన్ని ఒడ్డాబాయిలోనికి పంపుతారు. పరశరాముడు గద్దను సహాయ మడుగగా, గ్రద్ద అతనిని తన కాళ్ల మధ్య ఉంచి వాటి నుంచి రక్షిస్తుంది. ఒడ్డాబాయి లోకి దిగి, బాయంతా కలిపేసిన ఆ జంతుసమూహాల కాళ్లకింద పడి రాముడు మరణించి ఉంటాడని భావించిన కార్తీకరాజులు ఆ జంతువులను తోలుకొని వెళ్లిపోతారు. తర్వాత గద్ద రాముడిని ఒడ్డాబాయిలో వదిలేస్తుంది.

ఆ ఒడ్డాబాయికి నీళ్లకోసం వచ్చిన గౌరమ్మ (పరశురాముని అక్క) ఈ బాలుడిని తీసుకొని తన నివాసానికి తీసుకెళ్లింది. తనను పెంచిన పులిపాలు రామునికి పట్టగా, పులి ఎముకలు, దుమ్ములు గలగల మని మరణించింది. పులి మరణించినందుకు రాముణ్ణి నిందించి నందున గౌరమ్మను వివరాలడుగుతాడు. ఈవిధంగా ఒకరి వివరాలు వేరొకరు తెలుసుకోగా . స్వరూ అక్కాతమ్ములని తెలుసుకొంటారు. తల్లి తమ ముగ్గురిని కని మూడు తోవలు చేసినందుకు

విచారించి, తల్లి ఉండే చోటుకి వెళ్లటానికి నిశ్చయించుకొని, అరూపంలో వెళితే తల్లి తమను గుర్తిస్తుందనే ఉద్దేశంతో ఎరుకల వేషంలో బయలుదేరుతారు. గౌరమ్మ ఎరుకత వేషం వేసుకొని, రాముడుని ఒడిగట్టుకొని, తల్లి ఎల్లమ్మ ఉండే నీలాపురి పట్టణం ఎరుక చెప్పటానికి వెళుతుంది. తన తమ్ముళ్లు తన కుమారిడి చేతిలో మరణ మవుతారని, ఎరుక చెబుతుంది. ఆ మాటకు కోపించిన ఎల్లమ్మ ఎరుకతను బయటకు గెంటిస్తుంది. ఎరుకత ఒడిలో నున్న బాలుణ్ణి పెంచుకోవటానికి తీసుకుంటుంది. ఎల్లమ్మ బాలుణ్ణి తన ఒడిలోనికి తీసుకోగానే ఆమెకు పాలు చేపు వచ్చి, పిల్లవానికి పాలిస్తుంది.

కుమారుడిని చూడగానే తల్లికి పాలు చేపొస్తాయన్న సత్యాన్ని గ్రహించి ఆతడు తన కుమారుడేనని తెలుసుకుంటుంది.

పరశురాముడు తల్లిని గురించి అడుగుతాడు. గోవును చంపినందుకు మేనమామలు తండ్రిని కొరత వేసారని తెలుసుకొని, కొరత దగ్గరకు వెళ్లి తండ్రిని విడిపిస్తాడు. మళ్లీ తన అక్క దగ్గరకు వచ్చి, జరిగినది చెప్పి ఇద్దరూ కలిసి, మేనమామ లయిన కార్తీకరాజుల పట్టణం వెళతారు. మేనమామలు వేటకెళ్లగా, వారి భార్యలకు ఎరుక చెబుతారు. కార్తీకరాజులు రాముడి చేతిలో మరణమవుతారని చెప్పగానే కోపించిన వారు ఎరుకల వారిని గెంటేస్తారు. గౌరమ్మ తమ్ముణ్ణి తీసుకొని వచ్చేసి, దారిలో ఒక చెట్టుకి, ఊయల కట్టి పసి బాలుడుగా ఉన్న రాముణ్ణి ఊయలలో పడుకోబెట్టి, తాను చెట్టుకింద నిద్రిస్తుంది. రాముడు ఊయలలో ఒక ఈత మొద్దును పరుండ బెట్టి తాను కార్తీకరాజుల పట్టణం ఎరుకల బాలుని వేషంలో వెళతాడు. ఆ బాలుణ్ణి పలకరించి, కార్తీకరాజులు తమ పట్టణం అతనెందుకొచ్చాడో అడుగుతారు. రాజులతో సరదాగా పందాలాడడానికి వచ్చానంటాడు. పందాల కొప్పుకున్న రాజులతో మొదటగా పన్నెండుపుట్లు ఉక్కుగోతాన్ని పైకి లేపాలంటాడు. ఆ గోతాన్ని లేపలేక రాజులు ఆతనిముందు అవమానపడతారు. బాలుడు సునాయాసంగా గోతాన్ని లేపుతాడు. బాలుని గొప్పతనానికి మెచ్చుకున్న కార్తీకరాజు ఇతనెవరో తెలియక, ఈ బాలుడిని తమవాణ్ణి చేసుకుంటే భవిష్యత్తులో తమ మేనల్లుడు పరశురాముడి నుంచి వచ్చే అపాయం నుంచి బయట బడవచ్చని భావిస్తారు. తమ ఉద్దేశం బాలునికి చెబుతారు. రాజకుమారుడైన పరశురామునికి, తమకు తగాదా కుదరదని బాలుడు తప్పుకుంటాడు.

కార్తీకరాజులు బాలునితో కోడిపందాలు ఆడడానికి సిద్ధపడతారు. తమ కోడి పుంజుల్ని తెస్తారు. బాలుడు తాను ఒక కోడిగుడ్డును సంపాదించి, దానిలో సారమంతా నాగేంద్రుడు (త్రాచుపాము) తోతాగించి, దానినిండా నాగేంద్రుడి విషం నింపి, తీసుకొచ్చి కార్తీకరాజుల కోడిపుంజుల ముందు పెడతాడు. పుంజులు గుడ్డును పొడవగా, అందున్న విషమంతా వాటి నోటికి తగిలి అవి మరణిస్తాయి:

ఈవిధంగా ఈ పందెంలో కూడ బాలుడే గెలిచాడు. గొర్రెపోతు పందెంవేసుకుంటారు. బాలుడు ఒక కుంటి గొర్రెపోతును సంపాదించి, రాజుల పోతులమీదికి వదులుతాడు ఈ కుంటిపోతు రాజుల పోతుల్ని తరిమి తరిమి పొడుస్తుంది అవి మరణించి గుట్టలుగా పడిపోతాయి. ఈవిధంగా అన్ని పందేలలోనూ, కార్తీకరాజులే ఓడిపోతారు. తమను మించేవాడు మేనల్లుడు పరశరాముడుతప్ప

వేరొకరు లేరన్న సత్యాన్ని గ్రహించిన కార్తీకరాజులు ఈ బాలుణ్ణి పరశురాముడుగా తెలుసుకుంటారు.

పరశురాముడు అక్క వద్దకు వచ్చి, తాను మేనమామల్ని మూడు పందేల్లోనూ నెగ్గానని తనను వారు గుర్తుపట్టారని చెబుతాడు. అక్కను తీసుకొని తల్లిదండ్రుల వద్దకు వచ్చి, వారితో చెప్పి, మేనమామలను యుద్ధానికి పిలుస్తాడు. అంతకు ముందు మూడు పందేలలో బాలునితో ఓడిపోయినందున కార్తీకరాజులు పరశురామునిపైకి యుద్ధానికి వస్తారు. గౌరమ్మ, పరశురాములు ఒకవైపు, కార్తీకరాజులు ఒకవైపు ఉండి యుద్ధం చేస్తున్నారు. చివరకు కార్తీకరాజులు యుద్ధంలో మరణిస్తారు. మళ్లా రాజరికాలు చేయలేక వారి భార్యలు అగ్నిగుండంలో ప్రవేశిస్తారు. తాము మేనమామల్ని సంహరించినట్లు తల్లిదండ్రులతో చెప్పి, గౌరమ్మ పులిగొండ పట్టణం, పరశురాముడు గాజుగొండ పట్టణం వెళ్లిపోయారు[42].

**బాలగౌరి కథ :** ఈమెను సుద్దాల గైరమ్మ అని కూడ అంటారు. ఈమె ఎల్లమ్మ కుమార్తె. జంపన కంటె చిన్నది. పరశురాముని కంటె పెద్దది. ఈమె కథలో ఈమె వివాహఘట్టం వివరింపబడింది. జవితికరాజు చెల్లెలు తరిదేవి. ఆమె భర్త సిద్ధమాసెట్టి. వీరికి ఏడుగురు కుమారులు. వారు గౌరమ్మకు మేనత్తకుమారులు, బావలయినందువల్ల తన కుమారులలో ఎవరొకరికి గౌరమ్మ నిచ్చి పెళ్లి చేయమని తరిదేవి అడుగుతుంద. వార పూర్వీకులలో ఉన్న తగాదాలవల్ల పరశురాముడు ఆవిధంగా పెళ్లి చెయటానికి అంగీకరించడు. ఈవిషయం తెలుసుకున్న తరిదేవి కుమారులలో చివరివాడైన కార్తీక మల్లన్న తన తల్లిదండ్రులు ఎంత వద్దని వారించినా, వారి మాట వినక, ఎలాగైనా గౌరిని పెళ్లిచేసుకొని వస్తానని మారువేషంతో బయలుదేరుతాడు. కార్తీకమల్లన్న గాజులమ్మే బలిజీడు వేషం కట్టుకొని, గాజుల మల్లారం భుజాన్ని వేసుకొని, రకరకాల గాజులతో బయలుదేరాడు. గౌరమ్మ నివాస ముండే పులిగొండపట్టణం పురవీథులలో గాజులమ్ముతూ, గౌరమ్మ మేడ వద్దకు వచ్చి 'గాజులోయ్' అని కేక వేసాడు. బంగారుటుయ్యాల ఊగుతున్న గౌరమ్మ ఈ కేక విని, దాసీలను పంపి, బలిజీణ్ణి పైకి తోడ్కొనిరమ్మంటుంది. దాసీలు బలిజీడు వద్దకు వచ్చి గాజులు బేరమడుగుతారు. గాజులు వేయించుకొనే గౌరమ్మకు తప్ప దాసీలకు గాజుల బేరం చెప్పనంటాడు. దాసీలు వెళ్లి ఈ మాట గౌరమ్మతో చెపుతారు. పుట్టి పెరిగాక, మగవారి ముఖం చూడని తను మగవారి ఎదురుగా వెళ్లడం కుదరదని, ఆవిధంగా వెళితే తన తమ్ముడు పరశురాముడు దండిస్తాడని భయపడి, బలిజీడిని కోటలోపలికి తీసుకొస్తే, వారిద్దరి మధ్యతెరగట్టి, తాను నిలువుటద్దం ముందు నిలబడితే, ఆ నిలువుటద్దంలో తనను చూసి, గాజులు బేరమాడి, గాజులు వేస్తాడని చెప్పి, తీసుకొని రమ్మని దాసీలను బలిజీడు దగ్గరకు పంపుతుంది. దాసీలు చెప్పినమాట విన్న బలిజీడు ఎలాగైనా గౌరమ్మను చూడాలనుకొని బయలుదేరి కోటకు వస్తాడు. తెరచాటు నుండి నిలువుటద్దంలోనుంచి గౌరమ్మ బలిజీడు, ఒకరి నొకరు చూసుకున్నారు. బలిజీడు ఎవరో తెలియని గౌరమ్మ గాజుల బేరం అడుగుతుంది. గౌరమ్మ తనమేనమామ కూతురని తెలిసిన బలిజీడు ఆమెను 'మరదలా !' అని పిలిచి తాను ఆమెకు బావ నవుతానని, త్వరలో వారిద్దరికీ పెళ్లి గానున్నదని, మొదలుగా రకరకాల మాటలాడతాడు. బలిజీడు ఆవిధంగా తనను అనడం సహించలేని గౌరమ్మ అతనిని తిడుతుంది. దాసీల చేత బయటకు గెంటించి వేస్తుంది. ఆవిధంగా అవమానపడిన బలిజీడు అప్పటికి వెనుతిరిగి ఊరు చివరనున్న తన డేరాలోనికి వచ్చేస్తాడు.

బలిజీడు వెళ్లిన కొంచెం సేపటికి గౌరమ్మ మనసు మనసులో లేదు. ఆమె మనసు గాజులమీదకి పోయింది. కలలో కూడ గాజుల్ని, బలిజీణ్ణి కలవరిస్తుంది. నిద్రాహారాలు మానేసింది. ఇది చూసిన దాసీలు నీలాపురి పట్టణం వెళ్లి గౌరమ్మ పరిస్థితిని ఎల్లమ్మకు తెలియచేశారు. ఆమె వెంటనే రాకపోతే గౌరమ్మ చనిపోయేలా ఉందంటారు. ఈమాట విన్న ఎల్లమ్మ కూతురు వద్దకు వచ్చి ఆమె విచారానికి కారణ మడుగుతుంది. గాజులుతో వచ్చిన బలిజీడు గురించి చెప్పి, ఆతనిచేత గాజులు వేయించుకోవాలి, లేకుంటే మనసు మనసులోఉండదంటుంది. కూతురు కోర్కె తీర్చటం తన బాధ్యతగా భావించిన ఎల్లమ్మ బలిజీడు డేరా వద్దకు వచ్చి, అతనిని చూసి, అతని అందానికి ఆశ్చర్యపడి, తన కుమార్తెకు గాజులు వేయటానికి రమ్మంటుంది. ఎల్లమ్మను చూసిన బలిజీడు ఆమెను 'అత్తా' అని వరుస కలిపి పిలిచి, తన కూతురికి గాజులు వేసి, తనకూడా తన రాజ్యానికి తీసుకెళతానంటాడు. ఈ మాటలకు కోపించిన ఎల్లమ్మ బలిజీడిని నానావిధాలా తిట్టి, కూతురు వద్దకు వచ్చి, బలిజీడు మంచివాడు కాడని, గాజులు వేసి, మరల మందుబెట్టి తన కూడా తీసుకెళ్లిపోతాడని కూతురుకు నచ్చచెప్పి, పొరుగు రాజ్యాలకు వెళ్లి వేరే బలిజీణ్ణి తీసుకొచ్చి గాజులు వేయిస్తానని చెప్పి, పొరుగు రాజ్యాలకు వెళ్లింది. ఎల్లమ్మ పొరుగు రాజ్యాలకు వెళ్లటం గమనించిన బలిజీడు ఒంటరిగా ఉన్న గౌరమ్మకుపూయమని, మరలమందు కాళ్లకు గట్టి రామచిలుకను గౌరమ్మ మేడకు పంపుతాడు. తన మేడకు వచ్చిన చిలుకకు మేత వేసి, గౌరమ్మ ఆప్యాయతతో సాకుతుంది. చిలుకతో ఆడుకుంటుంది. మరల మందు గాలి తగిలి గౌరమ్మ నిద్రపోతుంది. నిద్రిస్తున్న గౌరమ్మ చాతిమీద మరల మందు పూసి, చిలక ఎగిరిపోయింది. బలిజీడి వద్దకు వచ్చి జరిగింది చెప్పింది. బలిజీడు సంతోషించాడు.

గౌరమ్మ నిద్రలేచి చిలకను వెదకింది, కన్పించలేదు. చిలక పూసిన మందు ప్రభావంవల్ల ఆమె మనసంతా గాజులమీదకి బలిజీడుమీదకి పోయింది. గాజులు గురించి కలవరిస్తుంది. బలిజీడుని పిలిచికొచ్చి గాజులు వేయించమని దాసీలను పంపింది. ఇంతకముందు నానా దుర్భాషలాడినందున కోపించిన బలిజీడు కాలి నడకన రానని, పరశురాముడు ఎక్కే పల్లకీ పంపితే వస్తానంటాడు. గౌరమ్మ పల్లకీ పంపి, బలిజీడిని రప్పించింది. బలిజీడి కంటికి కనిపించడం ఇష్టంలేక, అతని కళ్లకు గంతలు కట్టి గాజులు వేయాలంటుంది. అతడు అందుకంగీకరించడు.

చివరకి ఒకరి ముఖ మింకొకరికి కన్పించకుండగా తెర కట్టారు. తెర కింద గౌరమ్మ చేయి తీసుకొని, అతని వద్దనున్న రకరకాల గాజులన్నీ ఆమెకు తొడిగాడు. చేయి విడిచిపెట్టాడు. సంచిలో ఉన్న మరల గాజులు (ఈ గాజులు తొడిగితే, తొడిగిన వారి మీదికి, తొడిగించుకున్నవారి మనసు మరలుతుంది) తమను కూడ గౌరమ్మకు తొడగమని అడుగుతాయి, మరల గాజులు తప్పక వేయించుకోవాలని, అవి వేయించుకోవడం తల్లిదండ్రులకు, సోదరీసోదరులకు మంచిదని చెప్పి బలిజీడు ఆ గాజులు కూడ గౌరమ్మకు తొడుగుతాడు.

గాజులు తొడగడం అయ్యాక గౌరమ్మ బలిజీడిని ఆయా రకరకాల గాజులధరలు అడుగుతుంది. బేరమాడకుండ గాజులువేయించుకున్నందున బలిజీడు చెల్లించలేని అధిక మొత్తంలో డబ్బులు చెల్లించాలని గౌరమ్మతో అంటాడు. డబ్బు చెల్లింపు విషయంలో వారిద్దరికి మాట మాట పెరిగి, అడిగినంత డబ్బు ఇవ్వలేక ఆతనితోపాటు వెళ్లటానికి సిద్ధపడింది. తనతో రావటానికి

సిద్ధపడిన గౌరమ్మను గుమ్మడికాయ మూటలాగ కట్టుకొని భుజమ్మీద పెట్టుకొని, బలిజీడు బయలుదేరాడు. చాన్నాళ్ల క్రితమే యింటినుంచి బయలుదేరిన తమ్ముడు తిరిగి ఇంకా ఇంటికి రానందున అతని ఆచూకి తెలుసుకోవటానికి వెదకుతూ, కార్తీకమల్లన్న అన్నలు తిరుగుతూ వస్తున్నారు. గౌరమ్మతో వెళుతున్న కార్తీక మల్లన్న అన్నలను చూసి, వారు కూడ గౌరమ్మను పెళ్లాడతా నంటేరేమోనని, ఆమెను ఒక చెట్టు చాటున దాచి, అన్నల కెదురుగా వెళతాడు. అన్నలు తమ్ముడిని చూసి, గౌరమ్మ గురించి అడుగుతారు. గౌరమ్మను తీసుకొని రావటంలేదంటాడు. ఈ మాట విన్న గౌరమ్మ బావల కెదురుగా వస్తుంది. గౌరమ్మను చూసి బావలు కూడ ఆమెను పెండ్లాడుతానంటారు. గౌరమ్మ కార్తీకమల్లన్న చేయి పట్టుకొని, అతనే తన భర్త అని, వారు ఆమె బావలని అంటుంది.

మల్లన్న అన్నలు ఆకలిగా ఉది, భోజనం కావాలంటారు. గౌరమ్మ తన ముస్తాబు తీసేసి, బావలకు భర్తకు అన్నం వడ్డించటానికి వంటలు చేయటానికి అక్కడే డేరా లెత్తించి, వంటలు ప్రారంభించింది. ఈలోగా ఆమార్గంలో పరశురాముడు గుర్రంమీద వస్తున్నాడు. పరశరాముడిని చూసిన గౌరమ్మ భయపడి, అతని గురించి బావలకు, భర్తకు చెబుతుంది. వాళ్లు కూడ భయపడి అతని నుంచి తప్పించుకొనే మార్గం చెప్పమంటారు. గౌరమ్మ వారిలో కొంత మందిని విషం తెమ్మని పంపుతుంది. మరి కొంతమందిని మారు వేషంలో రాముడికెదురుగా వెళ్లి, తాము వివాహం చేసుకొంటున్నాము. భోజనం చేసి వెళ్లదురుగాని రమ్మని తీసుకొస్తే, విషప్రయోగంతో చంపవచ్చునని సలహాయిచ్చి పంపుతుంది. ఈవిధంగా పరశురాముణ్ణి రప్పించి ఎనమండుగురికి నేతి చుక్కలు వేస్తుంది. నేతిచుక్కలలో గౌరిదేవి రూపం చూసిన పరశురామునికి ఆమె తన అక్క అని అనుమానం వచ్చి, లేచి, తన అక్క మేడలకు బయలుదేరాడు. పులిగొండ పట్టణంలో తాను లేకుండడం గమనించిన పరశురాముడు తనను తన భర్తను బావలను చంపుతాడని గ్రహించిన గౌరిదేవి, వారి వద్ద అనుమతి తీసుకొని, అడ్డుదారిలో బయలుదేరి రాముడి కంటె ముందు పులిగొండ పట్టణం చేరింది. రాముడు పులిగొండ పట్టణం వెళ్లి, అక్కడ తన అక్క గౌరిదేవి ఉండడం చూసి, డేరాలతో తనకు అన్నం వడ్డించినది తన అక్క కాదని సమాధాన పరచుకొని స్థిమితపడ్డాడు. వెంటనే తననివాసమైన గాజుగొండ పట్టణం బయలుదేరాడు. తమ్ముడు వెళ్లగానే గౌరమ్మ తన బావలు, భర్త దగ్గరకు వచ్చేసింది.

బలిజీడిని తీసుకొచ్చి గాజులు వేయిస్తానని పర రాజ్యాలకు వెళ్లిన ఎల్లమ్మ వాళ్లను తీసుకొని వచ్చి గౌరమ్మ గురించి దాసీలను అడిగింది. దాసీలు బలిజీడుతో గౌరమ్మ వెళ్లిపోయినట్టు చెప్పారు. తన కుమార్తె తనను అన్యాయం చేసి వెళ్లిపోయినందుకు ఎల్లమ్మ దుఃఖిస్తుంది. తల్లి దుఃఖించటం చూసిన జంపన దుఃఖానికి కారణ మడుగుతాడు. చెల్లెలు బలిజీడుతో వెళ్లిపోయినందునే ఏడుస్తున్నానంటుంది. తల్లిని పరిపరివిధాల ఓదార్చినా, ఆమె ఏడ్పు మానదు. చెల్లెలిని తీసుకొస్తానని జంపన బయలుదేరుతాడు. డేరాల వద్దకు వస్తున్న జంపనను చూసి, గౌరమ్మ తన బావలతో, భర్తతో అతని గురించి చెపుతుంది. జంపన తమను చంపుతాడేమోనని భయపడ్డ కార్తీకరాజులు అతనిని చంపే ఉపాయం చెప్పమంటారు. ఆమె ఉపాయాన్ననుసరించి, కార్తీకరాజులు బైరాగుల వేషాలతో జంపన కెదురుగా వెళ్లి, తాము బైరాగుల మని, జంపన గొప్ప ధర్మాత్ముడని అతని

దగ్గరకు దానం చేయుమని వెళుతున్నామని అంటారు. ఆ మాటలకు సంతోషించిన జంపన దానధర్మాలతో వాళ్లను అక్కడే తృప్తి పరుస్తాడు. తమకు దానధర్మాలు చేసిన వ్యక్తికి సేవచేయాలని, జంపనను ఒక రాతిపై పరుండబెట్టి వారు కాళ్లుచేతులు నొక్కుతూ సేవచేస్తారు. జంపన ఆదమరచి నిద్రపోతాడు. నిద్రించుచున్న జంపనమీద బండరాయి ఎత్తేసి, తాము బైరాగులం కాదని, గౌరమ్మను తోడ్కొల్లిన కార్తీకరాజులమని, పలికి వారు వెళ్లిపోతారు. విషయం గ్రహించిన జంపన దుఃఖిస్తూ ఉంటాడు. చావుబ్రతుకుల్లో ఉన్న ఇతనిచూట్టూ రకరకాల పక్షులు ఎగురుతున్నాయి. ఈ పక్షులు ఎగరటం దూరం నుంచి చూసిన పరశురాముడి వద్దనున్న డేగ రాముడితో చెబుతుంది. రాముడు వెళ్లి ఆ సంఘటన చూసిరమ్మంటాడు. డేగ తిన్నగా పక్షులు చుట్టిన ప్రదేశానికి వచ్చింది. డేగను చూసి పక్షులన్నీ ఎగిరిపోయాయి. జంపనను చూసి, జంపనమీదున్న రాయిని తొలగించింది. జంపన డేగతో గౌరమ్మ పరరాజులతో కూడి తనను చంప ప్రయత్నించిదంటాడు. ఈ విషయం తెలుసుకున్న డేగ తిన్నగా పరశురాముని వద్దకు వచ్చి, జరిగినదంతా చెబుతుంది. జంపన తిన్నగా తన తల్లి వద్దకు వెళతాడు.

ఈ విషయం తెలుసుకున్న పరశురాముడు కోపంతో కార్తీకరాజుల మీదికి బయలుదేరుతాడు. రాముడిని చూసిన కార్తీకరాజులు భయపడి అతనిని చంపే ఉపాయం చెప్పమని గౌరమ్మని అడుగుతారు. గౌరమ్మ సలహా ననుసరించి, భట్రాజుల వేషాలు వేసుకొని, డేగలను పట్టుకొని, డేగల పందేలు ఆడే నెపంతో పరశురాముడిని పందేలకు రమ్మంటారు. సరేనని పందేనికి అంగీకరించిన పరశురాముడు ముందుగా తన డేగకాళ్లకు ఉక్కు కత్తులు కట్టి ఆకాశంలోకి వదులుతాడు. ఆ డేగ ఎగిరేతీరు చూడటానికి కార్తీకరాజులు (భట్రాజులు) మెడలు పైకెత్తి చూస్తున్నారు. ఇది గమనించిన డేగ తన కాళ్లకున్న ఉక్కు కత్తులతో వారి మెడలు నరుకుతుంది.

ఆవిధంగా వారు మరణిస్తారు. గౌరమ్మను కూడ చంపబోతాడు. గౌరమ్మ పరశురామునితో ఆనాడు ఒడ్డాబాయిలో బాలుడుగా పడిఉన్న నిన్ను ఒడిగట్టి పెంచాను. ఆ విశ్వాసానికి నన్ను, నాభర్తను, బావలను బ్రతికించమని ప్రేధేయపడుతుంది. అక్క మీద అభిమానంతో రాముడు అందర్నీ బ్రతికిస్తాడు. ఎల్లమ్మ, జవితికరాజు, జంపన, జట్లమాణిక్యం, మొదలైనవారి సమక్షంలో కార్తీకమల్లన్నకు గౌరమ్మకు వివాహం జరిగింది. తమ్ముడు తమను బ్రతికించినందుకు కృతజ్ఞతగా గౌరిదేవి తమ ఆడపడుచులు, కార్తీకరాజు చెల్లెళ్లయిన ఇంద్రక్క, చంద్రక్కలను పరశురామునికి వివాహం చేసింది. ఈవిధంగా పెళ్లిళ్లు చేసుకొని ఎవరి రాజ్యాలకు వెళ్లు వెళ్లి నివసిస్తున్నారు[43]

గౌతు పురాణం అనేపేరుతో లభ్యమగుచున్న జానపద పురాణంలో కూడ బాలగౌరి వివాహం, సిద్ధభుక్తి (జంపన కథ) మొదలైన కథలు ఉన్నట్లు నాయని కృష్ణకుమారి గారు తమ గ్రంథంలో పేర్కొన్నారు. కాని ఆమె తన గ్రంథంలో ఈ కథలను సంపూర్తిగా ఇవ్వలేదు. కావున నాకథలను ఆమె కథలతో పోల్చుటకు వీలుకాదు. ఇచ్చినంత వరకు కొన్ని భేదాలు, పోలికలు కన్పిస్తున్నాయి.

జంపన కథలో (సిద్ధభుక్తి) జంపన తల్లి ఆజ్ఞ మేరకు సిద్ధుల వద్దకు వెళ్లడం, సిద్ధులు పక్షినిచ్చి వండిపెట్ట మనడం, వండుతున్న సందర్భంలో సంజీవిగర్ర తగిలి పక్షి ఎగిరిపోవడం, అందుకు కోపించిన సిద్ధులు జంపనను చంపి, వండడం, మొదలైనవి రెండు కథలలోనూ సమానమే

కాని నాయుని కృష్ణకుమారి కథలో, చంపబడ్డ జంపన సంజీవిగ్రతో వంటకం కలుపుచుండగా బ్రతికినట్టు వివరింపబడింది. నాకథలో తన భార్య, మరియు చెల్లెలు మహిమ వల్ల అతడు బ్రతికింపబడినట్టు వివరింపబడింది. తల్లి నుంచి సిద్ధుల వద్దకు వెళ్తున్నపుడు జంపన దారిలో ప్రియురాలు, మరియు చెల్లెలు వద్దకు వెళ్ళుటయేకాక, మార్గమధ్యంలో తన తల్లి ఎల్లమ్మచే అనేకవిధాల బాధింపబడినట్లు వివరింపబడినది. కృష్ణకుమారి గారి కథలో సిద్ధుల వద్దకు వెళ్లడమే తప్ప ఏవిధంగా వెళ్లాడన్నది వివరింపబడలేదు. తాము చంపగా తిరిగి బతికిన జంపనను తీసుకొచ్చి ఎల్లమ్మ కిచ్చి వండిపెట్టమని, ఆవిధంగా వండినప్పటికీ, తిరిగి ప్రియురాలు, చెల్లెలు సహాయంతో జంపన బ్రతికినట్టు నా కథలో వివరింప బడింది. ఒకసారి తాము చంపగా తిరిగి బ్రతికిన జంపనను బుజ్జగించి, ఎల్లమ్మ వల్లనే సిద్ధభుక్తి పొందినట్టు కృష్ణకుమారి గారి కథలో వివరింపబడింది. జంపనకు ప్రియురాలు జెట్ల మాణిక్యం ఆమె మహిమాన్వితురాలని, ఆమె మహిమవల్లే జంపన ఆయా సందర్భాలలో కష్టాలనుంచీ బయటపడి బ్రతికింపబడ్డాడని, నేను సేకరించిన కథలో వివరింప బడింది. కృష్ణకుమారి గారి కథలో జంపలేశ్వరుని భార్య కనుమాలచంద్రమ్మ అని వివరింపబడింది.

బాలగౌరి కథకూడ చాలా సంక్షిప్తంగా నాయుని కృష్ణకుమారి గారి గ్రంథంలో వివరింపబడింది. తరిదేవి తన కుమారులలో ఒకనికి బాలగౌరిని భార్యగా చేయమని అడగడం, పరశురాముడందు కంగీకరించకపోవడం రెండు కథలలోనూ సమానమే. తరిదేవి కుమారులలో చివరివాడు బాలగౌరిని పెండ్లాడడానికి బలిజవేషంలో వెళ్లి ఆమెను సాధించుట నేను సేకరించిన కథలో వివరింపబడింది. నాయుని కృష్ణకుమారి గారి కథలో ఆమె కొడుకు లందరూ బలిజ వేషములతో వెళ్లి, గౌరిదేవిని సాధించినట్టు వివరింపబడి ఉంది. నాకథలో తరిదేవి భర్త సిద్ధమాసెట్టి కాగా కృష్ణకుమారి గారి కథలో సిద్ధమారాజు పరశురామునిచేత కార్తీకరాజులు చంపబడి తిరిగి బ్రతికింపబడడం నేను సేకరించిన కథలో వివరింపబడింది. కృష్ణకుమారి గారి కథలో వివరింపబడలేదు. చంద్రక్క, ఇంద్రక్కలను గౌరిదేవి ఆడబిడ్డలను పరశురామునికి వివాహంచేసినట్టు నేను సేకరించిన కథలో ఉన్నది. కనుమాల చంద్రమ్మను జంపనకు పెళ్లి చేసినట్టు కృష్ణకుమారి గారి కథలో వివరింపబడింది.

కాని నేను సేకరించిన పరశురాముని కథ వంటి కథ కృష్ణకుమారి గారు కాని, రావి ప్రేమలత గారు కాని పేర్కొనియుండ లేదు.

ఎల్లమ్మ తన బిడ్డలైన జంపనను సిద్ధభుక్తిగా పంపడం, గౌరమ్మనుకని పులిగొండపట్టణం పంపడం, పరశురాముని కని గాజుగొండ పట్టణం పంపడం చేసి వారిని కష్టాలుపాలుచేసిందని వివరించడం వల్ల, కన్నబిడ్డలనే కష్టాలుపాలుచేసిన దేవత తమను కూడ కష్టాలుపాలు చేస్తుందనే భయంతో ప్రజలు ఆమెను పూజిస్తారనే ఉద్దేశంతో పంబలవారు ఈవిధమైన కల్పన చేశారనవచ్చును.

**జలగన్న పార్వతి :** గౌతముడు జలగన్నపార్వతి భార్యాభర్తలు. గౌతముని తల్లి నీవకమ్మ. ఈతనికి చిన్నతనంలోనే వివాహం జరిగింది. భార్యను తల్లి వద్ద విడిచిపెట్టి గౌతముడు హిమాలయ పర్వతాలకు తపస్సు చేయటానికెళ్లాడు. సప్తఋషులు అక్కడ తపస్సు చేస్తున్నారు. యౌవనస్థురాలయిన జలగన్నపార్వతి భర్తను తలచుకొని వండుకున్నది. హిమాలయ పర్వతం మీద

తపస్సు చేస్తున్న గౌతుమునికి కలలో ఈమె కన్పించింది. భార్యను చూసి వస్తానని మిగతా మునుల వద్ద సెలవు తీసుకొని బయలుదేరాడు. తెల్లారేసరికి రావాలని మిగతామునులు షరతు పెట్టి పంపించారు. గౌతముడు భార్య వద్దకు వచ్చి నిద్రిస్తున్న ఆమెకు తాను తెచ్చిన పూలహారం మెడలో వేసి, తెచ్చిన వీబూది పండ్లు పక్కలో పెట్టి, తెల్లారవస్తుందని బయలుదేరి హిమాలయపర్వతాలకు వెళ్లిపోయాడు. సమయం చాలక తల్లితో మాట్లాడలేదు.

తెల్లారాక జలగన్నపార్వతి లేచి, తన మెడలో పూలహారం చూసి, పక్కలో విబూది ఫలములు చూసి, ఇవి తన భర్తే తెచ్చి యిచ్చాడన్న సత్యాన్ని గ్రహించి ఆ విబూది ఫలములు తిన్నది. తిన్న తొమ్మిది గడియల్లో ఇద్దరు మగబిడ్డలు జన్మించారు. వారి ఏడ్పు విన్న అత్త నీవకమ్మ వచ్చి, తన కుమారుడు ఇంటివద్ద లేకుండ కోడలు కన్న సంతానం అక్రమసంతానంగా భావించి, ఆమెను చిత్రహింసలు పెడుతుంది. భర్త రాత్రి సమయంలో వచ్చి విబూది ఫలములిచ్చాడని, అవితింటే ఆ బాలలు జన్మించారని ఎంత చెప్పినా వినదు. వంశానికి అపవాదు తెచ్చినందుకు రకరకాలుగా నిందించి చిత్రహింసలు పెడుతుంది. కోడలు చెప్పిన మాట వినటానికి రకరకాలపరీక్షలు పెడుతుంది. వాటిలో నెగ్గితే ఆ బాలలు తన కుమారునికే పుట్టినవారని నమ్ముతానంటుంది.

ముందుగా మరుగుచున్న నూనెలో ఇద్దరుపిల్లల్ని వదలి వారు మరణించకుంటే తన కుమారునిపుత్రులే నని అంగీకరిస్తానంటుంది. పెద్ద పెనంలో సలసల మరుగుచున్న నూనెలో అందరూ చూస్తుండగా జలగన్న పార్వతికి తన పిల్లల్ని వదలి పెట్టింది. వదలిపెట్టగానే నూనె చల్లారి, పిల్లలు పెనంలో ఆడుకుంటున్నారు. ఈవిధంగా ఆ పరీక్షలో నెగ్గినందున తన కుమారులను మనుమలుగా స్వీకరించమంటుంది. పెనంలో నూనె మరగకుండ ఇంకొకరి సాయం పొందావు అని వేరొక వంక పెట్టి, ఆ పిల్లలను తన మనుమలుగా అంగీకరించదు. వేరొక పరీక్ష పెడుతుంది. ఊరవతల చెరువుకి వెళ్లి, పిల్లలిద్దరినీ చాకలివాళ్లు బట్టలు ఉతికినట్టు రాయిమీద వేసి ఉతకాలి. తన కుమారునికి పుట్టినవారయితే బ్రతుకుతారు లేకపోతే చనిపోతారు అంటుంది. అత్త చెప్పినట్టే జలగన్నపార్వతి చెరువుకు తీసుకెళ్లి, పిల్లల్ని రాయిమీద వేసి ఉతికింది. పిల్లలు చావలేదు సరికదా ! రాయి మీద నుంచి బంతుల వలె తూలుతున్నారు. జలగన్నపార్వతి అత్తవద్దకు వచ్చి జరిగింది చెబుతుంది. తన మనుమలుగా అంగీకరించమంటుంది. ఆమాట నమ్మదు సరికదా ! చాకలివానికి జలగన్నెపార్వతికి అక్రమసంబంధం అంటగడుతుంది. జలగన్నెపార్వతి పరివరివిధాలా దుఃఖిస్తుంది. మరొక పరీక్ష పెట్టి, ఆ పరీక్షలో నెగ్గమంటుంది. పెద్ద పెద్ద రంధ్రాలున్న జల్లెడతో నీళ్ల తెచ్చి ఉద్యానవనంలోని మొక్కలకు నీళ్లపోయాలంటుంది. ఆ పరీక్షలో నెగ్గితే, ఆ బాలల్ని తన మనుమలుగా అంగీకరిస్తానంటుంది. అత్త చెప్పినట్టుగానే జల్లెడతో నీళ్ల తెచ్చి ఉద్యానవనంలోని మొక్కలకు నీళ్ల పోస్తుంది. ఆమె పాతివ్రత్య మహిమవల్ల జల్లెడలో నీళ్ల కారిపోవు. ఆవిధంగా నీళ్లపోయగా ఉద్యానవనాలు, కోటలు, పేటలు కూడ కొట్టుకొనిపోతున్నాయి. కోడలు రక్షిస్తుంది. ఆవిధంగా ఆ పరీక్షలో కూడ నెగ్గినప్పటికి కోడలిమీద అనుమానపు బుద్ధి పోక, ఆ బాలల్ని తన మనుమలుగా స్వీకరించదు.

వేరొక పరీక్షపెట్టి, ఆ పరీక్షలో కూడ నెగ్గాలంటుంది. అన్నం పట్టుకెళ్లి, ఆ అన్నంతో నారుపోసి, ఆ నారుతో పంట పండించి, ఆ ధాన్యంతో కోటలన్నీ నిండబెట్టాలంటుంది. ఆవిధంగా

చేసి పతివ్రతాధర్మం కాపాడుకోమంటుంది. ఆవిధంగా అన్నం పట్టుకెళ్లి తన పాతివ్రత్యమహిమతో, తన కుమారుల సహాయంతో నారు పోసి పంట పండించి, కోటలన్నీ నింపుతుంది. ఈవిధంగా నింపినప్పటికీ ఆమె పాతివ్రాత్యాన్ని నమ్మడు. కాపు యువకునితో అక్రమ సంబంధం పెట్టుకున్నావు కాబట్టే అతడు ధాన్యం పండించి పోసాడు అని ఆమెను అనుమానించి బాధపెడుతుంది. ఈ పరీక్షలో నెగ్గినా ఆమె కనికరించక, తన కుమారుడిని తీసుకొస్తే నమ్ముతాననంటుంది. జలగన్నె పార్వతి తన కుమారులిద్దరినీ ఎత్తుకొని, భర్తవద్దకెళుతుంది. తపస్సు చేస్తున్న భర్త వద్ద నిలబడి ఏడుస్తుంది. ఆ ఏడుపు అతనికి ఎన్నును శూలాలు దాపినట్లు, పక్కన బల్లేలు దాపినట్లు అయ్యింది. ఈమె తన భార్య అన్నమాట మరచిన గౌతముడు నీవెవరు? అని ప్రశ్నించాడు. నీ భార్యనంటుంది. అయినా నమ్మడు. పిల్లల గురించి అడుగుతాడు, మన పిల్లలే అంటుంది. అయినా నమ్మడు. తల్లి నీవకమ్మవలె గౌతముడు కూడ భార్యను పిల్లల్ని తన వారిగా అంగీకరించడు. అనేకవిధాల ప్రశ్నిస్తాడు. కొన్ని పరీక్షలు కూడ పెడతాడు.

ఇద్దరు కుమారులను మాయం చేసి, అనేక వేలమంది పిల్లల్ని సృష్టించమంటాడు. భర్తను స్మరించుకొని, తన పాతివ్రత్య మహిమ వల్ల ఇద్దరు పిల్లల్ని భూమిలోనికి దింపేసి, ఒక తంగేడు వెంట్రుక భర్తను స్మరించుకొని మింగగా అనేక వేల మంది పిల్లలు జన్మమవుతారు. పుట్టిన పిల్లలు గౌతముడిని పట్టుకొని 'నాన్నా! అన్నం పెట్టు' అని అడుగుతారు. వాళ్ల బాధపడలేక గౌతముడు భార్యతో వాళ్లను మాయం చేసి, ముందు పుట్టిన ఇద్దరిని తెమ్మంటాడు. ఆమె పాతివ్రత్యమహిమ వల్ల వేలమంది పిల్లల్ని మాయం చేసి, ముందు పుట్టిన పిల్లల్ని తెస్తుంది. అప్పటికి కూడ భార్యను నమ్మడు. గౌతముడు ఇంటికి బయులుదేరుతూ, భార్య మెడలోనున్న పూసలదండ తీసుకొని, తాను ఆకాశమార్గంలో మేఘ రథమ్మీద వెళుతూ, ఒక్కొక్క పూస నేలపై విడుస్తూ, ఆ పూసలు ఏరుకుంటూ దండ గుచ్చుకొని రావాలని భార్యను ఆదేశించి వెళతాడు. జలగన్నెపార్వతి ఆవిధంగానే దండ గుచ్చుకొని వెళుతుంది.

ఇంటికి చేరాక గౌతముడు తల్లిని తన భార్యగురించి, పిల్లల గురించి అడుగుతాడు. భార్యకు పుట్టిన పిల్లలు అక్రమసంతానమా! సక్రమ సంతానమా! అంటాడు. సక్రమసంతాన మని తనకు నమ్మకం లేదని, తాను పెట్టిన అన్ని పరీక్షలలో ఆమె గెలిచిందని, అయినప్పటికీ నమ్మకం కుదరకే అతని దగ్గరకు పంపానని నీవకమ్మ అంటుంది. అప్పటికీ భార్యను నమ్మని గౌతముడు నీవు పతివ్రతవైతే మునులందరూ ఇక్కడికి రావాలి అంటాడు. జలగన్నె పార్వతి దుఃఖిస్తూ మునులను ప్రార్థిసుంది. ఈమె పాతివ్రత్యమహిమ వల్ల అక్కడ మునుల జడల నుండి నీళ్ల కారుతున్నాయి. గౌతముడు ఇంటి కెళ్లాడు. అతని కేమైన జరుగుతుందేమోనని మునులందరూ బయులుదేరి గౌతముని ఇంటికి వస్తారు. మమ్మల్ని ఎందుకు రప్పించావు అని గౌతముణ్ణి అడుగుతారు. చిన్నతనంలో పెళ్లి చేసుకొని భార్యను తల్లి కప్పగించి వచ్చాను. నా భార్యకు ఇద్దరు కుమారులు కలిగారు. వాళ్ల నాపిల్లలో కాదో ఋజువు చేద్దామనంటాడు. వచ్చిన మునులు జలగన్నె పార్వతితో పిల్లల్ని తీసుకొని అగ్నిగుండంలో దూకమంటారు. దూకుతుంది. అగ్ని చల్లారి కుమారులతో జలగన్నెపార్వతి మిగులుతుంది. అప్పుడు మునులు గౌతమునితో ఒకనాటి రాత్రి భార్య కలలోనికి వచ్చిందని పూలహారం విబూదిపండ్లు తీసుకెళ్లి, తెల్లారకుండ తిరిగి వచ్చిన విషయం జ్ఞాపకం చేసి,

ఆ వీబూదిపళ్ళు తిన్నందువల్లనే ఆకుమారులు పుట్టారని వారు అతని కుమారులే నని చెప్పగానే, భార్యా పిల్లల్ని తనవారిగా స్వీకరిస్తాడు.44

జలగన్న, గౌతముడు భార్యాభర్తలన్న విషయం నాయని కృష్ణకుమారి గారు తమ గ్రంథంలో పేర్కొనియున్నారు. అంతకు మించి వారి గ్రంథంలో వీరికి సంబంధించిన ఎట్టి కథ వివరింపబడలేదు. నేను సేకరించిన కథలో జలగన్న జలగన్నపార్వతిగా పేర్కొన్న బడింది. ఈమెను అనకాపల్లి ప్రాంతంలో గవర్లు పూజిస్తారని అంటారు.

**అమ్మవారు చల్లమ్మ కథ :** ఇప్పటివరకు పేర్కొన్న కథలన్నీ మెట్టప్రాంతం నందలి పంబల వారి వద్దలభించినవి. ఈ కథ డెల్టాప్రాంతం నందలి పంబలవానివద్ద లభించింది. పంబల వారు సత్తెమ్మ సంబరాలు చేయించటానికెళ్లినప్పుడు సంబరం సమయంలో ఈ కథను పాడతారు. ఈ కథలో అమ్మవారి పేరు తరిదేవి. ఈ కథను ఈవిధంగా పేర్కొనవచ్చును.

దేవుడి కుమారుడు జల్‌జల్ చక్రవర్తి, అతని భార్య సుప్తానిగంధిదేవి. ఆమె డబ్బు బియ్యం పట్టుకొని పెళ్లిళ్లు లేనివాళ్లకు పెళ్లిళ్లు చేస్తాను, ఒడుగులు లేనివాళ్లకు ఒడుగులు చేస్తానంటూ పుత్రికా సంతానం కావాలని పర్వతాల మల్లిఖార్జుని పట్టణానికెళుతుంది. పర్వతాల మల్లిఖార్జునుడు ఈమెను వచ్చిన కారణమడుగుతాడు. పుత్రికా సంతానం కావాలని, ఆ సంతానాన్ని ఇవ్వనిచో అతని కాళ్లవద్దనే ప్రాణాలు విడుస్తానంటుంది. పంచాంగాలు విడదీసి, సంతానం కలిగే మార్గం చెబుతాడు. చినగంగ స్నానం చేసి చిన ఉదకం, పెదగంగ స్నానం చేసి పెద ఉదకం గౌరినోము నోచి ఆ ఉదకం తీసుకెళ్లి, దక్షిణాన దరిగొండు సింగమ్మతోటలో ఎండిమోడై ఉన్న గజనిమ్మచెట్టు మొదటపోస్తే, ఆ చెట్టు చిగురించి, కాయలు కాస్తుంది. ఆ చెట్టును పూజించి, దాని కాయను కోయటానికి దొంకి తగిలిస్తే, ఆ కాయపైకి పోయి, రెండవకాయ వచ్చి ఒడిలో పడుతుంది. ఆ కాయ తింటే సంతానం కలుగుతుంది అంటాడు. ఆమె ఆవిధంగా చేసి, నిమ్మకాయని తిని గర్భవతయి, తొమ్మిది గడియలకల్లా ఆడబిడ్డను ప్రసవిస్తుంది.

బాల పుట్టిన గడియలు మంచివో కావో అని పంచాంగం చూపించగా, బాల ఇంటిలో ఉంటే తల్లిదండ్రులకి, అన్నలకేకాక ఊరివారందరికి కీడు కలుగుతుంది అంటారు. వెంటనే బాలపొడుగునా బంగారు పెట్టె చేయించి, పెట్టెలో పెట్టించి దాసీలచేత సముద్రంలో పారవేయిస్తుంది. సముద్రములోని ఆటు పోటులకు తిరుగుతున్నయీపెట్టె, సముద్రంలో స్నాన మాడుతున్న మునీశ్వరులలో ఒక మునీశ్వరుని జడకు తగిలింది. జడలు దగ్గరకు లాక్కోగా జడలకు చిక్కుకున్న పెట్టె దగ్గరకు వచ్చింది. ఆ పెట్టెను బయటకు తీసి, గొడ్డళ్లతో బద్దలు కొట్టి అందున్న బాలను తీసుకొని, ఆమెకు తరిదేవితమ్మ పేరుపెట్టి, తోబుట్టువుగా భావించి పెంచుకొంటున్నారు.

యుక్తవయస్సు వచ్చాక, ఈ బాలకు పెళ్లి చేద్దామని ప్రయత్నం చేయగా ఎవరితోనూ పెళ్లి కుదరటం లేదు. చివరకు సపత్తానరాజు అనే పేదవానితో ఈమెకు పెళ్లి జరిగింది. ఈమెకు పెళ్లి అయిన విషయం తెలుసుకొని, తల్లి భర్తకు, కుమారులకు తెలియకుండ సారె పెట్టింది. కుంటి ఆవుని కూడ అరణంగా ఇచ్చింది. వీటన్నింటిని తీసుకొని తరిదేవితమ్మ అత్తవారింటికెళ్లింది. ఆ కుంటి ఆవును మేపగా, ఈ ఆవు కడుపున చాలా ఆవులు పుట్టాయి. ఈ ఆవులన్నీ ఇచ్చిన పాలతో

మజ్జిగ చేసి, ఆ మజ్జిగను తరిదేవి అత్త అమ్ముకొని వచ్చేది. కొంతకాలానికి పండుముసలిదైనందున, ఆమె వెళ్లలేక చల్లమ్మటానికి కోడల్ని పంపించింది. తరిదేవితమ్మ చక్కగా ముస్తాబై, చల్లకుండ నెత్తుకొని వెళ్లి, చల్లమ్ముతుంది 'నాచల్ల తాగితే ముసలివాళ్లు పడుచువాళ్లవుతారు. పెళ్లి కాని వాళ్లకి పెళ్లిళ్లవుతాయి. ఒడుగులు కానివాళ్లకు ఒడుగులవుతాయి అంటూ అమ్ముతుంది.

ఈమెను ఒక దేవతగా భావించిన గ్రామస్థులు ఆమెను చూసి భయపడి తలుపులు వేసేసుకున్నారు. ఎవ్వరూ తలుపులు తియ్యటంలేదు. ఒకచోట చావుబతుకుల్లో ఉన్న ముసలామెను వీధిలో పడేసి, ఏడుస్తున్నారు. తరిదేవితమ్మ మాట విని, ఆమెను పిలిచి, చల్ల తీసుకొని నోటిలోపోయగా, ఆ ముసలామె బ్రతికింది. అది చూసిన అక్కడ ఉన్న వాళ్లందరూ, ఆ చల్లతాగితే, తాము కూడ గొప్పవాళ్లు మవుతామనే ఉద్దేశంతో, ఎక్కువ డబ్బు, బంగారు కాసులు పోసి చల్ల కొనుక్కొని తాగారు. కుండెడు చల్ల అమ్మడంయి, కుండెడు కాసులు వచ్చాయి. ఇవి తీసుకొని వచ్చిన తరిదేవితమ్మను చూసి అత్తగారు అంతకుముందు తాను చల్లమ్మటానికెళ్లి తక్కువ డబ్బులు తెస్తే, కోడలు చల్లమ్మటానికెళ్లి, కుండెడు కాసులు తెచ్చినందుకు ఆమెను అనుమానించింది (వ్యభిచరించిందేమోనని భావించింది) తరిదేవితమ్మ ఆడబిడ్డ 'కడుపుబ్బు గాంధారి' తన అన్నను పిలిచి, అతని భార్య కానిపని చేసి కాసులు తెచ్చిందని, అందుకుగాను తాము పెట్టిన పరీక్షలలో నెగ్గాలని అంటుంది. అలా నెగ్గితే ఆమె సంసారి. లేకుంటే వ్యభిచారి అంటుంది. పరీక్షలు పెట్టమంటాడు.

ముందుగా పెద్ద రంధ్రాలున్న జల్లెడతో సముద్రం నుండి నీరు తేవాలని, జల్లెడ నుంచి నీరు కారకూడదని, కారితే వ్యభిచారి అని, కారకుంటే సంసారి అని అంటుంది. ఆ పరీక్షలో తరిదేవితమ్మ నెగ్గుతుంది. ఆమె జల్లెడతో కారకుండ నీరు తెస్తుంది.

రెండవ పరీక్షగాపైటచెంగులో అగ్నిమూట కట్టాలని చెంగు కాలకూడదని అంటుంది. ఆవిధంగానే చేస్తుంది. చెంగు కాలదు. మూడవ పరీక్షగా సలసల కాగుచున్న నూనెలోకి దిగాలంటుంది. పెద్దపెనంలో కాగుచున్న నూనెలోకి తరిదేవితమ్మ దిగింది. ఈమె దిగగానే నూనె చల్లారిపోయింది. నా భార్య దిగి తన స్వచ్ఛత నిలుపుకుంది కాబట్టి నీవు కూడ దిగి నీ స్వచ్ఛత నిలుపుకోమని చెల్లెల్ని అన్న అడుగుతాడు. ఆ మాటకు నూనెలోకి దిగిన 'కడుపుబ్బు గాంధారి' అందు మాడిమసైపోయింది. కనికరించిన తరిదేవితమ్మ సంజీవిపుల్ల తెచ్చి ఆడపడుచును బ్రతికించింది. ఆవిధంగా బ్రతికిన 'కడుపుబ్బు గాంధారి' మళ్లీ తన వదినను కష్టాలుపాలు చేయదలచి, తన అన్నతో ఎన్ని పరీక్షల్లో నెగ్గినా తన వదిన మంచిదికాదని, ఆమెను అడవులకు పంపించి, కటికవాళ్లచేత నరికించి, ఆమె కళ్లు తీసుకొచ్చి తనకు చూపితే ఆమెకంటె అందమైన చిన్నదాన్ని తీసుకొచ్చి తనకు పెళ్లిచేస్తానంటుంది.

ఆవిధంగానే ఏడుగురు కటికవాళ్లు తరిదేవితమ్మను అడవులకు తీసుకెళ్లి, నరికే ఉద్దేశంతో కత్తి ఆమె మెడమీద పెట్టగా అది కంఠాభరణ మయ్యింది. నడుము మీద పెడితే వడ్డాణం అయింది. కాళ్లమీద పెడితే అందెలు అయ్యాయి. ఇదంతా చూసినవారు ఆమెను దేవతగా భావించి, అడవిలో వదలేసి, వేరొక జంతువును చంపి దాని కళ్లు తీసుకెళ్లి, ఆమె కళ్లుగా అన్న చెల్లెళ్ల కిద్దరికీ చూపిస్తారు.

నువ్వు చెప్పినట్టు చేసినందుకు తనకు చేస్తానన్న రెండవ పెళ్లి చెయ్యమని అడిగిన అన్నతో చెల్లెలు అది తనవల్ల కాదని చెప్పి అత్తింటి కెళ్లిపోయింది. తరిదేవితమ్మ అడవిలో భర్త-జ్ఞాపకాలతో కుమిలిపోతుంది. తరిదేవితమ్మను అడవిలో మృగాలన్నీ ఓదార్చుతున్నాయి. కష్టాల్లో ఉన్నందున ఆమె పుట్టింట వేసిన తలముడి, అడవిలో కూడ విప్పలేదు. ఒక అర్థరాత్రి సమయంలో కృష్ణ, గోదావరి నదులు ఉప్పొంగి ప్రవహించగా ఈమె కురులు ఆ జలప్రవాహంలో తేలియాడుతూ ప్రకాశిస్తున్నాయి. స్నానమాడడానికి నదిలోకి దిగిన తరిదేవితమ్మ భర్త మెరుస్తున్న ఆ వెంట్రుకను చూసి, ఆ వెంట్రుకున్న స్త్రీ మరెంత అందంగా ఉంటుందో అని భావించి, వెంట్రుకను చేతికి చుట్టుకుంటూ, వెళతాడు. బార్యాభర్తలిద్దరూ కలుసుకుంటారు. తన భర్తకు తనమీద ఎంతో ప్రేమ ఉండే వచ్చాడని భావించిన తరిదేవితమ్మ పల్లకి ఎక్కి అతనితో ఇంటికి వస్తుంది. వారిద్దరూ సుఖంగా జీవిస్తారు[45]

నేను మెట్టప్రాంతంలో ఉన్న పంబలవారి వద్ద సేకరించిన కథలలోనూ, నాయని కృష్ణకుమారి గారు సేకరించిన కథలలో తరిదేవి ప్రసక్తి వచ్చింది. కాని ఈ కథలోని తరిదేవితమ్మకి, ఆ కథలలో వచ్చిన తరిదేవికి నామ సామ్యమేతప్ప కథాసామ్యం కానరాదు.

లేకలేక కల్గిన ఆడపిల్ల పుట్టిన గడియలు చూపించి, అవి మంచివి కాదని తెలిసి, ఆ పిల్లను బంగారు పెట్టెలో పెట్టి, సముద్రంలో పారవేయించటం, ఆ పెట్టె మునుల జడలకు తగలడం ఆ పిల్లను వారు పెంచి పెద్దచేసి, పెళ్లి చేయుగా, ఆమె దేవత కావడం, మొదలైన సంఘటనలు నేను పల్లెవారి వద్ద సేకరించిన మశానదేవత కథలోనూ వస్తాయి.

ఆదేవిధంగా ఇంటి కోడలిని అత్త లేక ఆడబిడ్డ శీలం శంకించి బాధ పెట్టడం అనేది ఈ కథలోను, జలగన్నెపార్వతి కథలోనూ కన్పిస్తుంది. గ్రామదేవతలకథలలో ఈవిధంగా చాలా పాఠాంతరాలు కన్పిస్తాయి. ముఖ్యంగా నామసామ్యమున్నచోట కథాసామ్యముండదు. కథా సామ్యమున్నచోట నామసామ్యముండదు. ఒకే జిల్లాలో వేరు వేరు ప్రాంతాలలో లభించిన కథలవ్వటంవల్ల ఆపాటి సామ్యవైషమ్యాలు కానరావడం సహజమే.

జలగన్నె పార్వతి, తరిదేవితమ్మల కథలను బట్టి, అత్త, ఆడబిడ్డల వల్ల అవస్థలపాలయి, తమ పాతివ్రత్యమహిమవల్ల జీవించిన పుణ్యస్త్రీలు మహిమాన్వితులని భావించిన జానపదులు వారిని దేవతలుగా పూజించుచున్నా రనవచ్చును.

పంబలవారి దగ్గర నేను సేకరించిన కథలలో 'అమ్మవారు చల్ల అమ్మేకథ' తప్ప మిగతా కథలన్నీ మెట్ట ప్రాంతంలో ముఖ్యంగా పిఠాపురం పట్టణంలోని పంబలవారి వద్ద నేను సేకరించాను. వీటిలో శక్తి పుట్టుదల కల్లుసాటన, సెనగల కథ, దోనె దాటించే కథ, కాశీరాజు కథ, గంగబుల్లావు కథ, నల్ల గులాబి కథ, సత్యాల చంద్రుడు కథ, శివకుమారుడు కథ, స్వామి వారు విజ్ఞాలలో కెళ్లే కథ - నేను ఆయా పంబలవాళ్లు పాడుచుండగా టేపు రికార్డరుపై రికార్డు చేసుకున్నాను. ఇవి వచన కథలు. వీరు కొద్దిపాటి రాగంతో పాడుచుండగా నేను రికార్డుచేసాను. మాంధాతరాజు కథ, జలగన్నెపార్వతి కథ, ఎల్లమ్మ కథ, జంపన కథ, పరశరాముని కథ, గౌరమ్మ కథ, అమ్మవారుచల్ల అమ్మే కథ (తరిదేవితమ్మ కథ) ఆయా పంబలవారు నోటితో చెప్పుచుండగా వ్రాసుకొన్నాను.

'అమ్మవారి చల్ల అమ్మే కథను' నేను డెల్టా ప్రాంతం నందలి 'మాగం' గ్రామంలో వాకపల్లి పోలీసురావు అనే పంబలవాడు చెప్పగా వ్రాసుకొన్నాను.

పంబలవారు పాడే సత్తెమ్మ కథలలో అనేక అతిశయోక్తులు, కల్పనలు కన్పిస్తాయి. ఈవిధంగా కథలు పాడుతూ, సంబరాలు చేస్తూ, సంబరం చేయించుకున్నవారు ఇచ్చే ధనంతో ఈ పంబలవారు జీవనం సాగిస్తారు. పంబలవారు పాడే కథలు విన్న జానపదులు, ముఖ్యంగా సత్తెమ్మ భక్తులు సత్తెమ్మ మహిమాన్వితురాలని, పూజించకపోతే కష్టాలు పాల్జేస్తుందని భావించి, భయభక్తులతో కొలుస్తూ, తరచు సంబరాలు చేయించుకుంటూ, ఆయా సందర్భాలలో పంబలవారికి తగు మొత్తంలో ధనమిస్తారు. ఈ సత్తెమ్మ సంబరాలు సత్తెమ్మ కథలలో కన్పించే వర్ణనలు, అతిశయోక్తులు విద్యాధికులమైన మనకు కొంత వింతగా అన్పించవచ్చును. కాని దేవతనే తమజీవనసర్వస్వాలుగా భావించే పంబలవారికి గాని, ఆ కథలు వినే భక్తులకు గాని, ఈ కథలలోనివన్నీ సత్యాలుగానే కన్పిస్తాయి. వారికి ఈ విషయాలపట్ల నమ్మకమే గాని, అపనమ్మకం కలగనే కలగదు. ఈ కథల వల్ల భక్తులు జరిపించే సత్తెమ్మ సంబరాలవల్ల పంబలవారి జీవనవిధానం, గ్రామీణుల (సత్తెమ్మ సంబరాలు జరిపించే భక్తుల) మానసికస్థితి మనకు స్పష్టపడుతున్నది.

మౌఖిక ప్రచారములో ఉన్న ఇట్టి కథల కాలమును నిర్ణయింపలేము. కాని ప్రాచీనకాలమునకు చెందిన మతపరమైన సామాజిక స్పృహ ఇట్టి దేవతల కథలలో గోచరించుట కనుగొనవచ్చును. అవైదిక మతమును అణచి వైదిక మతము ప్రచారములోనికి వచ్చిన కాలమందలివి ఈ దేవతల కథలనవచ్చును. కథాకాలపు నాటి మత సాంఘిక పరిస్థితుల నాధారముగా చేసుకొని ప్రముఖ శాస్త్రవేత్త లెవిస్ట్రాస్ నిర్మాణ విశ్లేషణాసూత్రాన్ని ఈ దేవతల కథలకు కూడ అన్వయింప వచ్చును.

పంబలవారు పాడే ఈ దేవతల కథలలో ఎక్కువగా తమను కొల్వక నిర్లక్ష్యం చేసిన వారిని శక్తి దేవత కష్టాలపాలు చేయటం, చివరకు వారు దేవత మహిమ తెలుసుకొని, ఆమెను తిరిగి పూజించడం ప్రారంభించటం జరుగుతుంది. ముఖ్యంగా కల్లుసాటువ, సెనగలకథ, దోనెదాటించే కథ, మాంధాతరాజు కథ, స్వామివారి విజ్జులలోని కెల్లడం, శివకుమారుడు, నల్లగులాబి, గంగబుల్లావు మొదలైన కథలలో తనను నిర్లక్ష్యం చేసినవార్ని కష్టాలుపాలు చేసి, తనను తెలిసికొని పూజించేటట్లుగా శక్తిదేవత చేసింది. కాబట్టి పై కథలకు.

**స్త్రీశక్తి : పురుషశక్తి :: గెలుపు : ఓటమి**

అనే నిర్మాణసూత్రం వర్తిస్తుంది. 'శక్తి పుట్టుదల' కథలో వైదికమతాన్ని సృష్టించిన త్రిమూర్తులను శక్తిదేవత సృష్టించి, వారికి స్థితిగతులను ఏర్పరచింది. సత్యాలచంద్రుడి కథలో తనను అడుగక, బ్రహ్మనడిగి సంతానం పొందినందున, ఆ సంతానాన్ని కష్టాలు పాల్జేసి, తన మహిమ చూపింది. కాబట్టి పైరెండు కథలకు.

**స్త్రీశక్తి : పురుషశక్తి :: అవైదికారాధన : వైదికారాధన అనే నిర్మాణ సూత్రం వర్తిస్తుంది.**

కాశీరాజు కథలో శైవభక్తుడైన కాశీరాజుని శివుని గుడి పడగొట్టించి, తన గుడిని

కట్టించనందుకు శక్తిదేవత నానాకష్టాలు పెట్టడం, ఆయా సందర్భాలలో ఈశ్వరునికి, దేవతకు వైరం జరగడం, చివరకు కాశీరాజు శక్తిదేవత భక్తునిగా మారడం జరిగింది. కాబట్టి ఈ కథకు

**మాతృదేవతాశక్తి : శివశక్తి :: గెలుపు : ఓటమి**

అనే నిర్మాణసూత్రం వర్తిస్తుంది.

పరశురాముని కథలో కార్తీకరాజు అతని తండ్రిని చంపినందున పరశురాముడు తండ్రిని బ్రతికించుకొని, కార్తీకరాజుల్ని చంపాడు. కావున ఈ కథకు

**దుర్జనత్వ : సుజనత్వం :: మరణం : పునర్జీవనం అనే కథా నిర్మాణ సూత్రం వర్తిస్తుంది.**

ముఖ్యంగా మాతృదేవతల కథలలో దేవత తనను కొల్వక నిర్లక్ష్యం చేసిన వార్ని బాధ పెట్టడం, వైదిక దైవాలను పూజించేవారిని బాధపెట్టడం లేక తన భక్తులుగా మార్చుకోవడం కన్పిస్తుంది. కావున వైదిక, అవైదిక మతాల మధ్య సంభవించిన సంఘర్షణ ఫలితమే మాతృదేవతల కథలకు మూలకారణ మనవచ్చును. ఈవిధంగా ప్రాచీనకాలం నాటి మత, సామాజిక పరిణామాలను కథలలో పదిలపరచిన గ్రామీణులు (పంబలవారు) ఎంతైనా అభినందనీయులు.

## అథస్సూచికలు

1. రేవుగంగరాజు -- పిఠాపురం – తూర్పుగోదావరి జిల్లా
2.3 ముత్యాల నూకరాజు – రాపర్తిగ్రామం – పిఠాపురం మండలం.
4. Myth & Reality; D.D. Kosambri; 1962; p. 115-116
5. తెలుగు జానపదసాహిత్యము – పురాణగాథలు – రావి ప్రేమలత – 1983. పు. 179.
6. ముత్యాల నూకరాజు – రాపర్తి గ్రామం – పిఠాపురం మండలం.
7. దేవాలయాలమీద బూతుబొమ్మ లెందుకు – తాపీ ధర్మారావు - 1971, పు. 56
8. అందదు లేక చాలదు

9.10,11 వాకపల్లి పోలీసురావు – మాగాం గ్రామం – అయినవిల్లి మండలం

12. శివకంచి మాధవ – పిఠాపురం – తూర్పు గోదావరి జిల్లా
13. శివకంచి నాగరాజు – బలభద్రపురం గ్రామం – బిక్కవోలు మండలం
14. తెలుగు జానపదసాహిత్యము – పురాగాథలు, 1983, పు. 210
15. శివకంచి మాధవ – పిఠాపురం, తూర్పు గోదావరి జిల్లా

16.17,18 రేవు గంగరాజు – పిఠాపురం, తూర్పు గోదావరి జిల్లా

19. తెలుగు జానపదసాహిత్యము – పురాగాథలు, 1983, పు. 31

20. శివకంచి నాగరాజు – బలభద్రపురం గ్రామం బిక్కవోలు మండలం

21. తెలుగు జానపద సాహిత్యము – పురాగాథలు, 1983, పు. 190

22. శివకంచి మాధవ – పిఠాపురం, తూర్పు గోదావరి జిల్లా

23.24,25 రేవు గంగరాజు – పిఠాపురం, తూర్పు గోదావరి జిల్లా

26.27 తెలుగు జానపదసాహిత్యము – పురాగాథలు, 1983, పు. 187

28. రేవు ఫకీరు, పిఠాపురం, తూర్పు గోదావరి జిల్లా

29. ప్రాక్పశిచమ తత్త్వశాస్త్ర చరిత్ర, సంపుటి 4, 1961 పు. 23

30. పు. 28

31. ఋగ్వేద ఆర్యులు, 1974, పు. 100

32. ప్రాక్పశ్చిమ తత్త్వశాస్త్ర చరిత్ర, 1961, పు. 417

33. రామాయణ విశేషములు, 1957, పు. 309

34. "Siva grew out of rather primitive and anicomic culstones along several parallel tracks into a sublimated highest god, for some people. At one stage his equivalent came into more less voilent conflict with the various mother goodessess who had previously been the of senior dities" - Myth and Reality - 1962; p.2.

35. పైది, పు.3

36.37,38 శివకంచి నాగరాజు, బలభద్రపురం, బిక్కవోలు మండలం

39. తెలుగు జానపద గేయగాథలు, 1977, పు.లు 98, 102

40. రేవు పకీరు, పిఠాపురం, తూర్పు గోదావరి జిల్లా

41.42,43 రేవు గంగరాజు, పిఠాపురం, తూర్పు గోదావరి జిల్లా

44. ముత్యాల నూకరాజు, రావర్తి, పిఠాపురం మండలం

45. వాకపల్లి పోలీసురావు, మాగాం, అయినవల్లి మండలం.

నవమ ప్రకరణం

# గ్రామదేవతలు మత్స్యకారులు

## మత్స్యకారులు గ్రామదేవతలు :

సువిశాలమైన తూర్పు గోదావరి జిల్లాకు సుధీర్ఘమైన తీరప్రాంతమున్నది. ఈ జిల్లా తీర రేఖ పొడవు సుమారు 144 కిలో మీటర్లు ఈ తీరప్రాంతంలో ఉప్పాడ, మూలపేట, వాకపూడి, ఏటిమొగ (కాకినాడ), పెరుమాళ్లపురం, దానవాయపేట, అద్దరిపేట, వేమవరం, మొదలైన పెక్కు గ్రామాలున్నాయి. ఈ తీరప్రాంత గ్రామాల్లో మత్స్యకార్లు ఎక్కువగా నివసిస్తున్నారు. వీరిలో వాడబలిజ, పల్లీలు, జాలరి, మొదలైన తెగలవారున్నారు. వీరి ప్రధాన వృత్తి చేపలవేట. సముద్రంలో కెళ్లి, చేపలు వేటాడి తేవడం మగవారి పనైతే, వాటిని ఇతర గ్రామాలకు పట్టుకెళ్లి అమ్మి, డబ్బు తేవడం స్త్రీలపని. వీరు చేపలవేటకు తెప్పలు, పడవలు ఉపయోగిస్తారు. మరపడవలన్నా, బోట్లన్నా వీరికి పడదు. వీటిని ఉపయోగిస్తే చేపలు పడవని వీరి నమ్మకం కొయ్యపడవలపైనే వేట సాగించడం గ్రామానికి క్షేమకరమని వీరి విశ్వాసం.

**గ్రామ దేవతలు - ఆచారాలు - నమ్మకాలు :** తరతరాలుగా మన సంస్కృతి, ఆచారాలు, నమ్మకాలు నిత్యనూతనమై నిలిచిపోతున్నాయి. నాగరికత ఎంత పెరిగినా, శాస్త్రీయవిజ్ఞానం, అభివృద్ధిచెంది ప్రపంచపు రోగమనం గ్రహాంతరాలు దాటినా, ఇంకా సనాతన ఆచారాలను తూ.చ తప్పకుండ పాటించేవారు కనిపిస్తూనే ఉన్నారు. వారిలో గిరిజనుల తర్వాత చెప్పుకోవలసినవారు ఈ తీరప్రాంత మత్స్యకారులు. వీరి సంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు ఎంతో విచిత్రంగా ఉంటాయి. మిగతా ప్రాంతాలతో పోలిస్తే తీరప్రాంత ప్రజల దేవతలు, వారి ఆరాధనా విదానం, మొక్కులు, ఆచారాలు, నమ్మకాలు, మొదలైనవన్నీ ప్రత్యేకతతో కన్పిస్తాయి.

**ఒకే గ్రామంలో పెక్కు గ్రామదేవతలు :** ఒక గ్రామంలో ఎక్కువ దేవతలుండడం సాధారణంగా కన్పించేదే అయినా, తీరప్రాంత గ్రామాలలో చాలా ఎక్కువమంది దేవతలు ప్రతి గ్రామంలోనూ ఉంటారు. దీనికి కారణం ఇతర గ్రామాల నుంచి, జిల్లాల నుంచి, రాష్ట్రాల నుంచి, రాష్ట్రాలనుంచి, దేశాల నుంచి కూడా వలస రావడమే. మత్స్యకారులలో కొందరు సంవత్సరంలోని కొన్నినెలలు ఇతర జిల్లాలకు (కృష్ణా, గుంటూరు), ఇతర రాష్ట్రలకు (ఒరిస్సా), ఇతర దేశాలకు (బర్మా) కూడ చేపలవేట నిమిత్తం వలస వెళతారు. వీరు ఆయా ప్రాంతాలలో ఉన్న రోజులలో అక్కడ పూజించిన దేవతలు వీరితోపాటు వీరిగ్రామానికి వలస వస్తాయి. గ్రామంలో పాత దేవతలతో పాటు, వలస వచ్చిన దేవతలను గ్రామస్థులు గుర్తించి పూజిస్తారు.

ఉదా : ఈ జిల్లాలోని కొత్తపల్లి మండలం ఉప్పాడ గ్రామానికి శివారు గ్రామమైన మాయాపట్నంలో పైడమోరు, కొయ్యోమ్మోరు, భూలోకమ్మోరు, బండమ్మోరు, నూకాలమ్మోరు, ఒడిచిట్టమ్మ, రెక్కలమ్మ, జట్లమ్మ మొదలైన పెక్కుమంది దేవతలున్నారు. వీరిలో నుకాలమ్మోరు రాంబిల్లి (విశాఖజిల్లా) నుంచి, ఒడిచిట్టమ్మ, రెక్కలమ్మ, జట్లమ్మ, ఒరిస్సా రాష్ట్రం నుంచి,

భూలోకమ్మోరు రంగూను (బర్మా) నుంచి వలస వచ్చారు. మీరాసాయిబు అనే పురుషదేవత (పూజారి) కూడ బెల్గాం (ఒరిస్సా) నుంచి వలస వచ్చాడు. ఈ దేవతల గుడులన్నీ వరుసగా సముద్ర పొడ్డున కాని, గ్రామ మధ్యలో కాని ఉంటాయి.

ఈ మత్స్యకారులు ద్రావిడ సంస్కృతికి చెందిన స్త్రీ దేవతలనే కాక, ఆర్య సంస్కృతికి చెందిన పురుషదేవతలను కూడ పూజించటం కన్పిస్తుంది. ఉదా : ఈ జిల్లాలోని పెక్కు తీరప్రాంత గ్రామాల్లో జగన్నాథస్వామి విగ్రహాలు, ఆలయాలు కన్పిస్తాయి. ముఖ్యంగా కొత్తపల్లి మండలం మూలపేట గ్రామంలో జగన్నాథస్వామి 'మొండి జగ్గప్ప' అనే పేరుతో పూజింపబడుచున్నాడు. ఒరిస్సా రాష్ట్రంలోని పూరీపట్టణం నుంచి వచ్చిన పురుషదేవతే ఈ జగన్నాథస్వామి.

**పూజారు (రిణు)లు - గణాచారు (రిణు) లు - భక్తురాళ్లు** : గ్రామంలో దేవతల ప్రతినిధులుగా కొందరు భక్తురాళ్లు ఉంటారు. వీరే పూజారిణులు మరియు గణాచారిణులు. ఆయా దేవతలు ఆయా సందర్భాలలో పూనుతారు. ప్రతి దేవతకూ భక్తురాలు ఉంటుంది. కొత్తగా వలస వచ్చిన దేవతకు కూడ భక్తురాలినియామకం జరుగుతుంది.

కొత్తగా దేవత వలస వచ్చి గ్రామంలో నిలిచినపుడు ఆమెను గుర్తించే సమయంలో పూజారిణులు ప్రధాన పాత్ర వహిస్తారు. కొత్తగా వచ్చిన దేవత ఆ గ్రామ ప్రధాన దేవత (గ్రామ మేర్పడినప్పటి నుంచి ఉంటున్న దేవత. ఈమెను యతి(జ) మాని దేవత అని కూడ అంటారు.) తో తగవాడి, ఆ గ్రామంలో స్థానాన్ని సంపాదించుకొంటుంది. నీ బిడ్డలు (గ్రామస్థులు) నన్ను పూజించి బ్రతికారు. వాళ్ల కూడ నేను వచ్చాను. నా గత్యంతర మేమిటి? అని అడుగుతుంది. అంతేకాక తన ఉనికిని తెలపటానికి గ్రామస్తులకు విరేచనాలు, వాంతులు మొదలైనవి కలిగించి, అనారోగ్యాన్ని కలుగచేస్తుంది. వీటికి భయపడ్డ గ్రామస్తులు గ్రామ పెద్ద సమక్షంలో వెళ్లి, గ్రామ ప్రధాన దేవతను తమ అనారోగ్యం గురించి అడుగుతారు. మన గ్రామస్తులు ఇతర ప్రాంతాలకు వెళ్లి, అక్కడ దేవతను పూజించి బ్రతికారు. ఆ దేవత వారి కూడ వచ్చి, తన మహిమ చూపుతుందియ ఆమెను శాంతిపరచాలి అని ప్రధాన దేవత అంటుంది. వలస వచ్చిన దేవతను 'ఉంటావా? ''నీదేశం వెళ్లిపోతావా?'' అని అడుగుతుంది. వెళ్లిపోతానంటే తన బిడ్డలు (గ్రామస్తులు) చేసిన తప్పును క్షమించ మంటుంది. గ్రామంలో ఉండిపోతానంటే, ఉండమని చెప్పి ఆమె అడిగిన మొక్కు తీర్చమని గ్రామ పెద్దతో చెబుతుంది. అప్పటినుంచి వలస వచ్చిన దేవతను కూడ ఆగ్రామదేవతగా భావించి, ఆమె అడిగిన మొక్కును ప్రతిఏటా చెల్లిస్తారు. ఈవిధమైన దేవతల సంభాషణ అంతా పూజారిణుల ద్వారా జరుగుతుంది. కొత్తగా నిలిచిన దేవతకు కూడ పూజారిణిని నియమించుకుంటారు.

**ప్రత్యేకమైన మొక్కులు చెల్లించడం**: మత్స్యకారులు దేవతలకు చెల్లించే సామాన్యమైన మొక్కులు (జంతు, పక్షిబలులు) తో పాటు ప్రత్యేకమైన మొక్కులు కూడ చెల్లిస్తారు. వీరు చెల్లించే ప్రత్యేకమైన మొక్కులలో రెండు ప్రధానమైనవి - 1. సముద్రంలో తెప్ప వదలడం, 2. జెండాను సముద్రపొడ్డున పాతడం. ఉదా : మాయాపట్నం గ్రామంలో అడవమ్మోరుకు మొక్కుగా తెప్పను సముద్రంలో వదులుతారు. భూలోకమ్మోరుకి జెండాను సముద్ర పొడ్డున పాతుతారు.

**చూపుగాడు - మొక్కడం** : మత్స్యకారులకు జబ్బులు, పొంగుచూపడం, మొదలైనవి వస్తే వైద్యుని వద్దకు వెళ్లరు. చూపుగాడితో చూపించుకుంటారు. అమ్మవారికి మొక్కే వ్యక్తి ఉంటాడు. ఇలాంటి వ్యక్తులు గ్రామానికి ఒకరు గాని, రెండుమూడు గ్రామాలకు ఒకరు గాని ఉంటారు. జబ్బుచేసిన వ్యక్తులు ఈ చూపుగాడి వద్దకు వెళతారు. అతడు చిన్నరాయికి దారం కట్టి, వ్రేలాడుతున్న ఆ రాయిని కదపకుండా పట్టుకొని, వేరొక చేత్తో గంట వాయిస్తూ అమ్మవారికి మొక్కుతాడు (స్మరిస్తూ సివమూగుతూ రాగాలాపన చేస్తాడు). ఆసమయంలో ఆరాయి దానికదిగా కదలాలి. ఆవిధంగా కదిలితే అమ్మవారి మహిమవల్ల కీడు కలిగిందని భావిస్తారు. జబ్బు తగ్గించమని అమ్మవారికి మొక్కుతారు. అంతే తప్ప వైద్యుల వద్దకు వెళ్లరు. రోగం నయం కాక ఎవరైనా చస్తే దేవుడు తీసుకెళ్లాడని చెబుతారు.

**దేవతకు క్షమాపణ చెప్పడం** : ఒక్కొక్కసారి చేపలవేటలో చేపలు పడకపోతే, విసిగిపోయిన కొందరు మత్స్యకారులు దేవతను నోటికొచ్చినట్లు తిడతారు. ఆతర్వాత పశ్చాత్తాప పడి క్షమాపణ చెప్పుకొంటారు. ఈ క్షమాపణకు విచిత్రమైన విధానం ఉన్నది. గ్రామపెద్దను 'పిల్లగాడు' అంటారు. అతని కొడుకును 'చిన్నపిల్లగాడు' అంటారు. దేవతను దూషించిన విషయాన్ని ముందుగా పిల్లగాడికి చెబుతారు. 'గుమ్మడి' అనేవాడు. పిల్లగాడికి సహాయకుడిగా వ్యవహరిస్తాడు. గ్రామంలో ఏ శుభ అశుభ కార్యం జరిగినా పిల్లగాడికి చెప్పాలి. దేవతను దూషించిన దంపతులిద్దరూ ఒకరి బట్టలను మరొకరు ధరించాలి. భర్త చీర, గాజులు ధరిస్తే, భార్య అతని దుస్తులు ధరిస్తుంది. వీరి చేతులకు తాళ్లు, మెడలో కల్లుకుండ కట్టి, గ్రామమంతా తిప్పి, అమ్మవారి గుడికి తీసికెళతారు. అక్కడ గ్రామస్తులంతా సిద్ధంగా ఉంటారు. చేసిన తప్పును క్షమించమని, వారికి చేపలు దొరకేలా చేయమని అందరూ ప్రార్థిస్తారు.

**దేవతకు మొక్కించుకోవడం** : మత్స్యకారులు చేపల వేటకు వెళ్లినపుడు వలలో చేపలు పడకపోతే, దేవతను స్మరించుకొని ఆమెకు మొక్కించుకుంటా మని మొక్కుకుంటారు. వాళ్లకు చేపలు పడి వారమంతా బాగుంటే, మొక్కేవాళ్లను తీసుకొచ్చి, వాళ్లచేత మొక్కించుకుంటారు. మొక్కేవాళ్లను ఇద్దరిని తీసుకొస్తారు. అందు ఒకరికి ఆడవేషం వేస్తారు. ఇద్దరూ చెరొక కొంతసేపు మొక్కుతారు. వీరిద్దరి మొక్కులు సంభాషణ వలె ఉంటాయి. వారి చుట్టూ ఉన్నవారు 'సివా సివా' అంటారు. అందుకే వీళ్లను 'సివ గాళ్లు' అంటారు. ఈవిధంగా మొక్కించుకున్నవాళ్లు, మొక్కిన వారికి చీర, పంచె మొదలైన వస్త్రాలు, తగు మొత్తంలో డబ్బు కూడ ఇస్తారు.

**దేవత చదున్లు ఇంట్లో వేయించుకోవడం** : మత్స్యకార గృహస్థులు తమ క్షేమాన్ని కోరి దేవత చదున్లు తమ ఇంటిలో వేయించుకుంటారు. ఈ చదున్లు వేయడంలో చూపుగాడు ప్రముఖపాత్ర వహిస్తాడు. ఈతడు చేతిలో గంట వాయిస్తూ, అమ్మోరికి మొక్కుతూ, చదున్లు వేయించుకొనే ఇంటివారిని తీసుకొని పుట్ట ఉన్నచోటుకి వెళతాడు. మూడు దోసిళ్లతో చదున్లు వేయించుకొనే వ్యక్తిచేత పుట్టమట్టి తీయించి, తాము పట్టుకెళ్లిన పళ్లెంలో వేయిస్తాడు. మొక్కుకొంటూ ఇంటికి తీసుకొస్తాడు. ఆ మూడు గుప్పెళ్ల మట్టికి మరికొంత మట్టి కలిపి, ఆ ఇంటివారి గదిలో గోడవార దిమ్మవలె వేయిస్తాడు. ఈ దిమ్మను చదును అంటారు. ఈవిధంగా చదును

వేయించుకోవటాన్ని అమ్మవారిని తమ ఇంట్లో నిలుపుకోవడంగా భావిస్తారు.

**మరణించినవారి బొమ్మలు ఇంట్లో నిలుపుకోటం :** మత్స్యకార్ల తమ ఇంటిలో పెద్దవయస్కులు మరణించినపుడు వారి పేరకఱ్ఱబొమ్మలను చేయించి తమ ఇంటిలో నిలుపుకుంటారు. కంసాలి వారితో ఒక కఱ్ఱబొమ్మచేయించి దానిని పల్లకిలో ఊరేగిస్తూ, భజన చేస్తూ, తీసుకొచ్చి ఆ బొమ్మను ఇంట్లో పెట్టుకుంటారు. ఆ బొమ్మ తమకు ఆపదల నుంచి కాపాడుతుందని, కష్టాలు కలుగచేయదని వారి నమ్మకం.

**పెళ్లిళ్ల :** మత్స్యకారులు తమ పిల్లలకు చిన్నతనంలోనే పెళ్లిళ్ల చేస్తారు. పెద్దయ్యాక ఆ వివాహాలు రద్దుచేసుకొని, తమకు నచ్చినవారిని చేసుకుంటారు. గ్రామ పిల్లగాడే పెళ్లికూతురు మెడలో తాళి కట్టి, పెళ్లికొడుక్కి అప్పగిస్తాడు. పెళ్లిళ్ల విషయంలో వీరికి ఇప్పుడిప్పుడే నాగరిక పోకడలు అబ్బుతున్నాయి.

**గ్రామదేవతలు - ఆరాధనావిధానం :** మత్స్యకార్ల గ్రామదేవతల ఆరాధన విధానంలో కూడ కొన్ని ప్రత్యేకతలు కన్పిస్తాయి. సాధారణంగా వీరి దేవతల పండుగలు లేక సంబరాలు చైత్రశుద్ధ అమావాస్యకు చేస్తారు. దేవతలందరికి ఒకేసారి చేస్తారు. కొన్నిగ్రామాల్లో ఎక్కువమంది దేవతలకు ఒకేసారి చేసినా, వారిలో కొంతమందికి ప్రత్యేకంగా వేరొకసారి చేయడం కూడ కన్పిస్తుంది. ఉదా : తూర్పుగోదావరి జిల్లాలోని కొత్తపల్లి మండలం ఉప్పాడ గ్రామంలో మిగతా గ్రామదేవ తల సంబరంలో కాకనూకాలమ్మ, కొయ్యమ్మోరు, బండమ్మోరులకు విడివిడిగా పండుగలు చేస్తారు.

## సాధారణంగా చేసే పండుగ లేక సంబరం

**గలగలు తీయడం :** సాధారణంగా చేసే గ్రామదేవత పండుగ ఆమె గరగలను తీసి ఊరేగించడంతో ప్రారంభమవుతుంది. ఇత్తడితో తయారుచేయబడిన లోహపు ఘటమే గరగ. వీనికి పైభాగాన నాగసర్పంతో మూతవలె అమర్చబడుతుంది. ఈ ఇత్తడి గరగలను సంబరం ప్రారంభం రోజున తీసి, కడిగి, శుభ్రంచేసి, చీరలతో అలంకరించెదరు. వీటిని సాధారణంగా చాకలివారు ఎత్తుకొంటారు. మాదిగలు డప్పులు వాయిస్తుండగా ఆ శబ్దాని కనుగుణంగా గలగల నెత్తుకున్నవారు నృత్యం చేస్తారు. ఈ గరగలను ప్రధాన సంబరం జరిగేరోజుకు ఒకటి లేక రెండు లేక నాల్గువారాల ముందు తీస్తారు. తీసిన రోజు నుంచి ప్రధాన సంబరం రోజు వరకు ప్రతిరోజూ రాత్రులందు కొంత సమయం దేవత గుడి ముందు నృత్యం చేసి, మరికొంత సమయం గ్రామమంతా త్రిప్పుతారు. గరగలు సంబరం జరగనిరోజులలో గుడి ఉంటే దేవత గుడిలోనూ, గుడి లేకుంటే పూజారి ఇంటిలోనూ ఉంటాయి. గరగలు తీసిన రోజున దేవత భక్తురాళ్లను పూనడం, తనకు కావలసిన మొక్కులు అడగడం, సంబరం ఘనంగా చేయమని చెప్పడం జరుగుతుంది.

**గుండం తొక్కడం :** ప్రధాన సంబరంరోజు వరకు గరగలు ఆడతాయి. ప్రధాన సంబరం రోజున గ్రామం మధ్యలో పందిరి వేసి, గరగలను పందిట్లో పెడతారు. ఆయా అమ్మవార్లకు మొక్కులను బట్టి పాతవలసిన జెండాలు కూడ పందిరి వద్ద పెడతారు. ఆ పందిరి దగ్గర మూడు

అడుగుల పొడవు, రెండడుగల వెడల్పు, ఒక అడుగులోతు గల గొయ్యి తవ్వి అందు కట్టెలు కాల్చి, నిప్పులు తయారుచేస్తారు. ఆ గుండంలో పూజారి లేక పూజార్లు నడుస్తారు. వీరు తప్పకుండా నడుస్తారు. మ్రొక్కుకుంటే ఇతరులు కూడ నడుస్తారు. ఈ గుండంలో నడిచే పూజారులు కాని, ఇతరులు కాని ఆరోజంతా ఉపవాసం ఉంటారు. కేవలం పసుపునీరు మాత్రం తాగుతారు. ఈ ఆచారాన్ని మెట్టప్రాంతంలో కూడ పూర్వకాలంలో ఆచరించేవారు. ప్రస్తుతకాలంలో అంతగా కానరావడంలేదు.

**కత్తిమీద నిలబడడం :** పూజారి లేక పూజార్లు ప్రధాన సంబరం రోజున కత్తిమీద నిలబడతారు. రెండువైపులా పదునుగా ఉండి, రెండు చివర్ల పిడులున్న కత్తిని చెరొక వ్యక్తి పట్టుకుంటారు. ఆ కత్తిమీద పూజారి నిలబడతాడు. ఈవిధంగా కత్తిమీద నిలబడడం, గుండంలో నడవగలగడం, మొదలైనవి దేవత మహిమవల్లనే వారు చేయగలుగుతున్నారని గ్రామస్తుల నమ్మకం.

**జంతు బలి :** గ్రామదేవత (ల) సంబరం నిమిత్తం గ్రామస్తులంతా చందాలు వేసుకొని ఆ డబ్బుతో కొన్నజంతువు (మేక లేక గొర్రెపోతు) ను గుడి ముందు వేసిన పందిరి వద్దకు సంబరం రోజున తీసుకొస్తారు. ఈ జంతువుకు మెడలో వేపరొట్ట కట్టి, ముఖానికి పసుపు పూసి, కుంకుమబొట్టు పెడతారు. దేవతల గుడిముందు వేసిన పందిరిలోనికి వచ్చిన పూజారులు సివమూగుతుంటారు. వారిమీద జనులు బిందెలతో పసుపునీళ్లు పోస్తుంటారు. డప్పుల వాయింపుతో పూజారులను, బలి జంతువును, జెండాలను తీసుకొని, సముద్రపొడ్డుకు వెళతారు, సముద్రపొడ్డుఉంచిన అప్పటికే తయారు చేసి తెప్పను, సంబంధిత దేవతకు చెల్లించవలసిన మొక్కుగా సముద్రంలో వదులుతారు. తీసుకెళ్లిన జెండాలను ఆయా దేవతలకు చెల్లించవలసిన మ్రొక్కులుగా సముద్రపొడ్డున పాతుతారు.

తీసుకెళ్లిన బలిజంతువు మీద నీళ్లపోస్తూ, డప్పులు వాయిస్తారు. ఆ చప్పుళ్లకు బలిజంతువు ఒళ్లు విరుచుకుంటుంది. వెంటనే మాదిగవాడు కత్తితో ఒక వేటు వేసి చంపుతాడు. బలిజంతువు ఒళ్లు విరుచుకోవటాన్ని దేవత తమను కరుణించినట్లుగా భావిస్తారు. జంతువును బలి నరకేముందు అమ్మవారలారా ! ఇన్నాళ్లు మీరు మాకు అన్ని విధాల సహకరించి (చేపలు భాగా పడేటట్లు చేసి) కాపాడారు. గోరెడు పసుపు, గొరెడు కుంకుమ, మేకపోతు సమర్పించుకుంటున్నాము అని మేకపోతుమీద నీళ్లపోసి, పోతు దులపరించుకున్నాక వేటు వేస్తారు.

**బద్దిగడుగలు :** 'బద్దింపు' అనగా 'అంచనా' అని శబ్దార్థ రత్నాకరంలో వివరించబడింది. భవిష్యత్తులో జరగబోయే దానిని అంచనాతో ఇప్పుడే తెలుసుకోవటానికి అనుసరించే పద్ధతి కాబట్టి దీనికి ఈపేరు వచ్చిందన వచ్చును. బలి యిచ్చిన జంతువు రక్తాన్ని ఒక మూకుడులో (చిన్న మట్టిపాత్రలో) పట్టి, మూకుడుపైన గుడ్డపరచి, మూతి కడతారు. ఆ మూకుడును సముద్రపొడ్డున గొయ్యి తీసి, గోతిలో పూడ్చి పెడతారు. మూడవరోజున పాతిపెట్టిన మూకుడు తీసి, అందున్న రక్తం ఎలాఉందో చూస్తారు. రక్తం గడ్డకట్టి ఉండాలి. అలా ఉంటే ఆ సంవత్సం అంతా గ్రామప్రజలు సుఖంగా ఉంటారని భావిస్తారు. అలాకాక రక్తం నీరువలె విరిగిపోయినా, పాక్కుల వలె కన్పించినా, ఆ సంవత్సరం పొంగు జబ్బులు వస్తాయని భావిస్తారు. ఈవిధంగా ముందు

జరగబోయే దాన్ని ఇప్పుడే అంచనాగా చెప్పే పద్ధతి కాబట్టి దీనికి ఈపేరు వచ్చిందనవచ్చు.

**దేవతలు విందుచేసుకోవడం :** రక్తం ముండిగలో పట్టి, పైన గుడ్డ పరచి కట్టాక ఆ గుడ్డపై సెనగపప్పు ఉంచుతారు. పైన తాటిఆకు వేసి, గోతిని పూడ్చుతారు. పూడ్చిన గోతిచుట్టూ తాటాకులు గుచ్చుతారు. మూడురోజుల వరకు ఎవ్వరూ అక్కడకువెళ్లరు. ఈలోగా దేవతలు ఆ మూకుడులో ఉన్న రక్తంతో, సెనగపప్పుతో విందు చేసుకుంటాయని భావిస్తారు. ఇంతటితో సంబరం ముగుస్తుంది.

**నూకాలమ్మ పండుగ :** మత్స్యకారులు సాధారణంగా దేవతలందరికీ ఒకేసారి సంబరం చేసినా, కొంతమంది దేవతలకు ప్రత్యేకంగా కూడ సంబరాలు చేస్తారు. ఉప్పాడ గ్రామంలో నూకాలమ్మ పండుగ ప్రత్యేకంగా చేస్తారు. ఈమె పండుగను ప్రధాన సంబరం ముగిసిన కొద్దిరోజులకు చేస్తారు. మంగళవారం ప్రారంభించి, లక్ష్మివారం ముగిస్తారు. మంగళవారం అమ్మవారి గరగను తీసి గ్రామమంతా తిప్పుతారు. గ్రామస్థులు గరగనెత్తుకున్న వ్యక్తి కాళ్లపై నీళ్ల పోస్తారు. గరగకు, పసుపు కుంకుమ అంటిస్తారు. గరగకు నమస్కరించుకుంటారు. అదేవిధంగా బుధవారంరోజు కూడ త్రిప్పుతారు.

లక్ష్మివారం రోజు సాయంకాలం నూకాలమ్మ భక్తురాలుతోపాటు, ప్రధాన దేవతలయిన పైడమ్మ, భూలోకమ్మ, వారి భక్తురాళ్ల కూడ గుడిముందు పందిట్లోకి వస్తారు. ముగ్గురూ సివమూగుతుంటారు. జనులు సెనగపప్పు, అరటిపళ్ల, పసుపు, కుంకుమ, మొదలైనవాటితో పందిట్లోకి వస్తారు. సివ మూగుతున్న పూజారులపై తెచ్చిన సెనగపప్పు చల్లుతారు. అప్పుడు పైడమ్మ, నూకాలమ్మతో నీకు మొక్కులు చెల్లించారు కాబట్టి ప్రజల్ని చూసుకోవాలని చెబుతుంది. ఈవిధంగా అక్కడకు చేరిన అమ్మోరులు మాట్లాడుకుంటారు

**పాన్పు వేయడం :** మొక్కుకున్నవారు దారికడ్డంగా పడుకుంటే వారిని దాటుకుంటూ పూజారిణులు వెళతారు. దీనినే మత్స్యకారులు 'పాన్పువేయుట' అంటారు. ముగ్గురు అమ్మోరుల్ని సముద్రపొడ్డుకు తీసుకెళతారు. ఆసమయంలో మొక్కులున్నవారు పాన్పులువేసి, మొక్కులు తీర్చుకుంటారు. పిల్లలకు కాని, పెద్దలకు కాని పొంగుచూపినపుడు పాన్పులు వేస్తామని మొక్కుకుంటారు. దాని ప్రకారం మొక్కులున్నవాళ్ల దారికడ్డ పడుకొంటే ముగ్గురు పూజారులు వారిని దాటుకుని వెళతారు. నూకాలమ్మ 'పొంగువంటి అంటువ్యాధులకు అధిదేవత కాబట్టి ఈమె సంబరంలోనే ఈ పాన్పులు కన్పిస్తాయి.

ఆతరువాత ముగ్గురు పూజారులను, మేకపోతును తీసుకొని, గ్రామస్తులంతా సముద్రపొడ్డుకు వెళతారు. అక్కడ ప్రధాన సంబరం రోజు పాతిన తాటాకుల చుట్టూ ముగ్గురినీ తిప్పుతారు. జనులు తాము తెచ్చిన సెనగపప్పు, అరటిపళ్ల, మొదలైనవన్నీ ఒక బుట్టలో వేస్తారు. మీ అక్క ఇచ్చినది నీవు తీసుకొని మమ్మందర్ని కాపాడు అని అందరూ నమస్కరించుకుంటారు. తర్వాత పోతమీద నీళ్లపోసి, అది శరీరం దులుపుకున్నప్పుడు నరికేస్తారు. ఈవిధంగా గ్రామపోతును వేసాక, వ్యక్తిగతమైన మొక్కులున్నవాళ్ల కోళ్ళను కూడ అక్కడ కోసుకుంటారు. తర్వాత ఎవరింటికి

వాళ్లవెళ్లిపోతారు.

**బండమ్మోరు సంబరం :** నూకాలమ్మవారి సంబరం జరిగిన కొద్దిరోజులకు బండి అమ్మవారి సంబరం చేస్తారు. బండమ్మోరు సంబరంలో 'బండి' ప్రధానపాత్ర వహిస్తుంది. చిన్నవి నాలుగు కర్రచక్రాలతో బండి తయారు చేస్తారు. ఈ బండిక మధ్యలో తొట్టె ఉంటుంది. పైన కప్పు ఉంటుంది. బండి లాగటానికి 'ఇరుసు' కూడ ఉంటుంది. ఈ ఇరుసుకు తాడుకట్టి లాగుతారు. సంబరం రోజున బండమ్మోరు (పూజారిణి) దేవత గుడి ముందు పాకలోకి వస్తుంది. గ్రామ ప్రజలు తాము తెచ్చిన సెనగపప్పు, అరటిపళ్ళు, మొదలైన నైవేద్యాలన్నీ ఈ బండిలో వేస్తారు. బండమ్మోరు బండి లాగుతుంది. ఊరంతా తిరిగాక, చీకటి పడ్డాకసముద్ర పొడ్డుకు తీసుకెళతారు. అమ్మోరుకి మేకపోతును వేస్తారు. బండిలో ప్రసాదం అందరూ పంచుకొని తింటారు. ఎవరింటికి వాళ్లవెళ్లిపోతారు.

**కొయ్యమ్మోరు :** నూకాలమ్మ, బండమ్మోరుల సంబరం ముగిసాక, కొయ్యమ్మోరు (పూజారిణి) గుడి దగ్గరకు వచ్చి, అందరి అమ్మోర్లకు అన్నీ పెడుతున్నారు. నాకేమీ పెట్టడంలేదని అడుగుతుంది. అప్పుడు గ్రామపెద్దలు నీకేమి కావాలని అడుగుతారు. ఏమికావాలో చెబుతుంది. దగ్గరలోనే ఉన్న పిఠాపురం తీసుకెళ్లి తనకు కావలసిన చీర, గాజులు, మొదలైన ధరించే వస్తువులన్నీ కొనిపించుకుంటుంది. కిళ్లీకొనిపించుకొని కిళ్లీనములుతుంది. తిరిగి వచ్చాక డప్పులు వాయిస్తుంటే ఆ చప్పుళ్లకు అనుగుణంగా కోయడాన్సు చేస్తుంది. అమ్మవారు డాన్సు చేస్తుండగా గ్రామస్తులు భజనచేస్తూ, సముద్రపొడ్డుకి తీసుకెళ్లి, పోతును (బలిజంతువు) వేస్తారు. తర్వాత ఎవరింటికి వాళ్లవెళ్లిపోతారు.

**గంగ పండుగ :** మత్స్యకారులు గంగపుత్రులు కావున, గంగ నాధారంగా చేసుకొని జీవిస్తున్నారు కావున వీరు ప్రతి సంక్రాంతికి గంగ పండుగ చేస్తారు. ముగ్గురు బాలలను ఉపవాసం ఉంచి, పాలు పట్టుకొని, కుమ్మరింటి నుంచి మూడు కొత్తకుండలు తెచ్చి, మూడు జెండాలుతో ఈ బాలలను తీసుకొని, గ్రామస్థులంతా (ముఖ్యంగా మత్స్యకారులు) సముద్రపొడ్డుకివెళతారు. అక్కడ మూడు జెండాలు పాతి, మూడు పొయ్యిల మీద, ముగ్గురు బాలలచేత పాలు పొంగిస్తారు. (పరమాన్నం వండుతారు) గంగకు పాలు ధారబోస్తారు. ఇంతటితో గంగ పండుగ ముగుస్తుంది.

**గ్రామదేవతల కథలు :** మత్స్యకారుల గ్రామదేవతల వలె వారి దేవతల కథలు కూడ వైవిధ్యంతో ఉంటాయి. వీరి వద్ద మశానమ్మ, కాశమ్మోరు, శక్తిపుట్టుదల, కొర్రలదేవత, పోలేరమ్మ, రణశక్తి మొదలైన తొమ్మిది కథలు ఉన్నాయి. వీరు వాటిని కథలు అని కాక 'మొక్కులు' అంటారు. మొక్కే వ్యక్తులు గ్రామానికి ఒకరు కాని,రెండు మూడు గ్రామాలకు ఒకరు కాని ఉంటారు. సంబంధిత దేవతకు మొక్కవలసినపుడు (ఎవరైనా భక్తులు మొక్కించుకున్నపుడు) సిమూగుతూగంటవాయిస్తూ, రాగాలాపనతో మొక్కుతారు. మొక్కడమంటే కథ చెప్పడమే, మనవంటి కొత్తవారికి ఆ మొక్కులు అయోమాయంగా ఉంటాయి. ఏమీ అర్థంకావు. ఒకసారి నేను ఆ మొక్కులను రికార్డు చేసి, వాటిని పేపరు మీద పెట్టడానికి వీలుకాక, (అర్థంకాక) మొక్కిన వ్యక్తుల వద్దకు వెళ్లి, వారి మొక్కులో ఉన్న కథాసారాంశాన్ని నోటితో చెప్పించుకొని వ్రాసుకొంటివి.

కావున ఈ కథల సేకరణకు ఆయా గ్రామాలు అనేక మార్గ్లు వెళ్లవలసి వచ్చింది. ఈ మొక్కుబ్లు సంవత్సరం పొడుగునా ఏమాసంలోనైనా మొక్కుతారు. ముఖ్యంగా ఆయా దేవతల భక్తు ఆయా దేవతలకు మొక్కు తీర్చుకోవలసి వచ్చినపుడు మొక్కేవారిని తీసుకెళ్లి మొక్కించుకుంటార. మొక్కేవారు సివ మూగుతూ, గంట వాయిస్తూ, మొక్కుతారే తప్ప అంతకుముంచి వాద్య విశేషాలేవీ ఉపయోగించరు. మత్స్యకారుల వద్దనున్న దేవతల మొక్కులు (కథలు) ఈవిధంగా వివరించవచ్చు.

**శక్తి పుట్టుదల :** ఈకథ కొద్దిపాటి మార్పులతో పంబలవారి వద్ద లభించిన శక్తిపుట్టుదల కథను పోలి ఉన్నది. ఈ కథలను పోలిన కథలువైట్‌హెడ్‌గారి, నాయనికృష్ణకుమారిగారి, డా. ప్రేమలత గారి పుస్తకాలలోనూ ఉన్నట్లు ఇంతకు ముందే చెప్పాను. ఈ కథాసారాంశాన్ని ఈవిధంగా పేర్కొనవచ్చు.

నిరాకారుడైన భగవంతుడుంటాడు, అతడు ఆదిశక్తిని సృష్టిస్తాడు, ఆదిశక్తి భగవంతుడి వద్దకెళ్లి, సంతానం అడిగింది. అతడు ఆడగాలికి అందుకో, పోతుగాలికి పొందుకో అంటాడు. ఆడగాలి కందుకొని, పోతుగాలికి పొందుకొని గర్భవతయ్యింది. పుట్టేపిల్లలకు ఏమిపేరు పెట్టమంటాడోనని అడగటానికి తండ్రి వద్దకు వెళ్లింది. ఆడపిల్లలైతే సరస్వతి, లక్ష్మి, పార్వతి అనీ, మగపిల్లలయితే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులని పేరు పెట్టమంటాడు. మగపిల్లలు పుట్టగా ఆవిధంగానే పేరు పెట్టింది. బ్రహ్మకు, బ్రహ్మపురి పట్నం కలిగేశ్వరుడికి కలి మూడులోకాలు, విష్ణువుకి ఇలపాలసముద్రాలు నివాసంగా ఇచ్చింది.

ఆమె ఆహారంగా అడవిలో ఆకులు తిన్నందువల్ల మోహం కలిగి, తన కోరిక తీర్చమని, తన పిల్లల వద్దకెళుతుంది. ముందుగా బ్రహ్మ వద్ద కోరిక తీర్చమంటుంది. ఇప్పుడు మనం ఈవిధంగా ప్రవర్తిస్తే, ముందు పుట్టబోయే నరలోకంలో కూడ తల్లీ పిల్లలు కూడ మనవలె ప్రవర్తిస్తారు వద్దంటాడు.

ఈశ్వరుని వద్దకెళితే అతడు బ్రహ్మ వలె సమాధానం చెబుతాడు. విష్ణువు వద్దకెళుతుంది. అతడు ఆమె వద్దనున్న సమస్తమయిన ఆయుధాలు తీసుకొని, మైలపడి ఉన్నావు స్నానం చేసి రమ్మంటాడు. స్నానం చేయటానికెళ్లగా ఈమెను చూసి గంగ పారిపోతుంది. గంగ కోసం వెదకి వెదకి గంగ దొరకక తిరిగి విష్ణువు వద్దకు వస్తుంది. అప్పటికి గోపాలుడు వలె గోవులను కాస్తున్న విష్ణువు గోవుపాదమంత గోతిలో గంగను సృష్టించి, ఆ గంగను తలపై వేసుకోమంటాడు. ఆవిధంగా వేసుకొని ఆదిశక్తి చనిపోయింది. ఆమెను దహనం చేస్తే, పొగ ఆకాశంలో కెళితే వర్షాలు పడవనీ, బూడిద భూమ్మీద పడితే పంటలు పండవని భావించి ఆమెను వారి చేతులమీద దహనం చేస్తారు. ఆ బూడిదను నాల్గువాటాలు వేస్తారు. అందు మూడు వాటాలు సరస్వతి, లక్ష్మి, పార్వతిగా మారి ముగ్గురికి భార్యలవుతారు. నాల్గవ వాటా తిరిగి శక్తియై మాయమైపోతుంది.

**పార్వతీ ఈశ్వరులకు ఎక్కువ కుమార్తెలు కలిగి దేవతలు కావడం :** ఆదిశక్తి మరణించాక, ఆమెను దహనం చేయగా వచ్చిన బూడిదను నాల్గువాటాలు వేయగా, అందు మూడు వాటాలు సరస్వతీ, లక్ష్మీ పార్వతీగా మారి, త్రిమూర్తులకు భార్యలవుతారు. నాల్గవ వాటా తిరిగి ఆదిశక్తియై ఇల పాల సంద్రాలఅవతల ఉన్న చీమడ చిట్లంగ ఆడముండల రాజ్యంఏలుకోవటానికి

వెళ్ళిపోయింది.

బ్రహ్మ ఈశ్వరుడికి పార్వతి నిచ్చి పెండ్లి చేస్తాడు. పెళ్ళి అయ్యాక పరంజ్యోతి (అరుంధతి) చుక్కను చూడ్డానికి రమ్మని నవదంపతులను బ్రహ్మ పిలుస్తాడు. ఆ సందర్భంలో పార్వతి పాదం చూసిన బ్రహ్మ, ఆమె పాదమే అందంగా ఉన్నప్పుడు మనిషి ఇంకెంత అందంగా ఉంటుందోనని మనస్సులో అనుకోగా, అతని దేహం పొంగి, వీర్యం కింద పడుతుంది. బ్రహ్మ దానిని కాలికింద తొక్కిపెడతాడు. నూతన దంపతులు వెళ్ళాక, కాలుతియగా ఆ వీర్యం నుండి అయిదుగురు బ్రాహ్మణులు పుడతారు. ఈ ఆయిదుగుర్నీ తమకు రావలసిన మామూళ్లు (సంభావనలు) ఇమ్మని అడగమని ఈశ్వరుని వద్దకు పంపుతాడు. అదుకు కోపించిన ఈశ్వరుడు బ్రహ్మ వద్దకు వచ్చి, కొట్టటానికి చెయ్యెత్తుతాడు.

అందుకు కోపించిన బ్రహ్మ 'ఈశ్వరా ! పెద్దవాణ్ణయిన నన్ను కొట్టబోయి నందుకు ముందుకాలంలో నరలోకంలో కూడ పెద్దవాణ్ణి చిన్నవాడు కొట్టేలాగ ప్రవర్తిస్తారు. కావున నీవు కాశీవెళ్ళి, కాకులకు పిండం వేసి రావాలి. ఆతర్వాత నామన్నన మరదలు (పార్వతి) వల్ల నీకు శాపవిమోచన జరుగుతుంది అంటాడు. ఈ బ్రహ్మ కప్పిరి (శాపం) ఈశ్వరుని చేతిలో ఉంటుంది. ఈశ్వరుడు బ్రహ్మ చెప్పినట్టు కాశీ వెళ్ళి, కాకులకు పిండం వేసి, దాహం దాహం అంటూ వస్తున్నాడు. ఇది విన్న పార్వతి భర్తకు దాహం తీర్చదలచి, వేడి గంజి ఇనుపగొట్టాల గుండా ఈశ్వరుడికి పంపుతుంది. దాహాలు తీర్చుకోవటానికి ఈశ్వరుడు దోసిలి విప్పుతాడు. చేతిలో నున్న బ్రహ్మ కప్పిరి కిందపడి అందుండి అయిదుగురు దేవతలు పుట్టారు. వారు రణశక్తి, నూకాలమ్మ, కొర్రలదేవర, పోలేరమ్మ, సత్తెమ్మ (ఆదిశక్తి), వీరి అయిదుగురికి అయిదు రాజ్యాలను ఏర్పరచి, ఆయా రాజ్యాలలో వారికి నివాసమేర్పరిచాడు. ఈశ్వరుడు, ముఖ్యమైన గ్రామదేవతలు ఏడుగురని, వారు శివపార్వతుల సంతానంగా వర్ణింప బడినట్లు డా. ప్రేమలత గారు తమ గ్రాంథంలో పేర్కొని ఉన్నారు.

**నూకాలమ్మ** : త్రిమూర్తులు ముగ్గురిలోనూ ఈశ్వరుడు దయామయుడని ప్రతీతి. అట్టి ఈశ్వరుని గూర్చి రాక్షసులు తపస్సు చేస్తారు. వారి తపస్సుకి మెచ్చి, వరం కోరుకోమంటాడు ఈశ్వరుడు. తమ రక్తం కింద పడగానే అందుండి వేల కొద్దీ రాక్షసులు పుట్టాలని వరం అడుగుతారు. ఈశ్వరుడు వరం ప్రసాదించాడు. ఈ వరప్రభావం వల్ల రాక్షసులు దేవతలు, గంధర్వులు, మొదలైన వారందరినీ ఓడించి, ఈశ్వరుని మీదికి యుద్ధాని కొస్తారు. ఈశ్వరుడు వారికి భయపడి పారిపోయి, నల్లగొండ కింద జోరీగ రూపంలో దాక్కుంటాడు. ఈశ్వరుడికి ఎండ తగులుతుంటే చూడలేక పన్నెండుతలల నాగేంద్రుడు వచ్చి ఎండ తగులకుండ పడగ విప్పుతాడు. నాగేంద్రుడికి చెమట పట్టి అది ఈశ్వరుని ఒడిలో పడుతుంది తన కందరూ కూతుళ్లే ఒక కొడుకుంటే ఇలాంటి ఆపదలో ఆదుకొనును కదా ! అని ఈశ్వరుడు తనలోతాననుకుంటాడు. ఇది విన్న పెద్దకూతురు నూకాలమ్మ తండ్రి కష్టాలు తీర్చదలచి, తండ్రి ఒడిలో పడుతున్న నాగేంద్రుడి చెమట నుంచి బాలగా పుట్టింది.

ఈశ్వరుడు పార్వతికి కాకితో కబురు పంపించి, ఆ బాలను ఆమె కిస్తాడు. పార్వతి వద్ద పెరుగుతున్న బాల ఒకరోజు వీధిలో తన ఈడువారితో ఆడుకొంటుండగా, గొడవ పడింది. ఆ గొడవలో 'తల్లిదండ్రిలేని దానా !' అని అవతలివారు నిందిస్తారు. ఇది విన్న ఆబాల తల్లిదండ్రుల గురించి చెప్పమని పార్వతిని నిలదీస్తుంది. తల్లి తానేనని, తండ్రి ఈశ్వరుడు రాక్షసులకు భయపడి

నల్లరాతి కింద దాక్కున్నాడంటుంది. తండ్రిని విడిపించడానికి నూకాలమ్మ తండ్రి వద్దకు వస్తుంది రాక్షసుల్ని జయిస్తానని తండ్రితో చెబుతుంది. జయించలేవు వెళ్ల వద్దు వెళ్లినా చీకటిపడగానే వా పట్టణంలో ప్రవేశించి, తెల్లవారకుండ పట్టణం దాటి రావాలంటాడు. బ్రహ్మ, విష్ణువుల వద్దకు వెళ్లినా, వారు కూడ తండ్రివలె రాక్షసుల పట్టణం వెళ్లవద్దంటారు.

తమ్ముడు పోతురాజు, మరదలు యుమురాలు సహాయం తీసుకొని, రాక్షసుల మీదికి యుద్ధానికెళుతుంది. యుమురాలు రాక్షసుల తోబుట్టువు. ఆమెను సహాయమడుగుతుంది నూకాలమ్మ. ఎన్ని ఆశలు గొలిపినా యుమురాలు అంగీకరించదు. చివరకు తమ్ముడు పోతురాజు నిచ్చి పెళ్లి చేస్తానంటే అంగీకరిస్తుంది. అప్పుడు నూకాలమ్మ, యుమురాలు, పోతురాజు కలిసి రాక్షసులుండే వెయ్యిభూతాలపట్నం వెళతారు. నూకాలమ్మ మంత్రించి వీబూది చల్లుతుంది. రాక్షసులందరూ మూర్ఛిల్లుతారు. యుమురాలు ధరణికి దవడ, ఆకాశానికి అంగిడి చాపుకొని ఉంటుంది. నూకాలమ్మ తన ఒరలోని కత్తితో రాక్షసులందరిని నరుకుతుంది. ఆ రక్తం నేలమీద పడకుండా యుమురాలి నాలుకమీద పడుతుంది. ఈవిధంగా సంహరించి నూకాలమ్మ తండ్రిని విడిపిస్తుంది. తండ్రి కుమార్తెను మెచ్చుకొని, కోడిగుడ్డు ఇవ్వబోతాడు. కోడిగుడ్డు చాలదు. ఎనుబోతు కావాలంటుంది. అనాటినుంచి ఈనాటికి నూకాలమ్మకు ఎనుబోతును బలి యిస్తారు. ఈ కథలో స్త్రీ దేవత అయిన నూకాలమ్మ పురుషదేవుడైన ఈశ్వరుని రక్షించిందని చెప్పడం వల్ల స్త్రీ దేవత యొక్క ప్రాధాన్యం విశదమగుతున్నది.

**కాశమ్మోరు కథ :** విష్ణువు చెట్టుమీద నుండి కోనేటిలో స్నానం చేస్తున్న దేవకాంతలతో కలిసినట్టు భావిస్తాడు. ఏడుగురికి కడుపులో కండ (పిండా) లు బయలుదేరాయి. దేవకాంతలు తమ కడుపులో నున్న కండలను కనురెప్పల్లోనుంచి తీసి, నేలమీద పడేసి, తమ లోకానికి వెళ్లిపోయారు. ఆవిధంగా ఏడుగురు కాములు జన్మించారు. లోకపాలకులైన పార్వతీపరమేశ్వరులు లోకాన్ని చూడ్డానికి ఎలుక వాహనం మీద బయలుదేరి వెళుతూ, దేవకాంతలు పడవేసిన కండలను చూసారు. పార్వతి వారిని చూసి ముచ్చట పడి పెంచుకుంటానన్నది. ఆమె కోరికను ఈశ్వరుడు కాదనలేదు. వారిని తీసుకొని ఈ ఇరువురు తమ నివాసమైన దేవగిరికి వెళ్లిపోతారు.

ఈవిధంగా ఆ ఏడుగురిని పార్వతి పెంచుతుంది. వారికి యుక్తవయస్సు వచ్చాక, మాఘస్నానాలు - (శివరాత్రి) స్నానాలు చేయటానికెళతామని తల్లినడుగుతారు. తమ తండ్రి ఈశ్వరునడగమంటుంది. వెళ్లి ఈశ్వరు నడుగుతారు. ఆతడు మీ అన్న వీరన్నను తీసుకొని వెళ్లమని పంపుతాడు. వీరన్నతో భూలోకం వచ్చి, స్నానాలు చేసి, మిగతా ఆరుగురూ దేవగిరికి వెళ్తారు. అందరిలోకి పెద్దదైన అగ్నికావిణి (కాశమ్మోరు) భూలోకంలో ఉండిపోతుంది. కృష్ణుని మోహించి, కృష్ణునితో పాటు అతని నివాసానికెళుతుంది. అగ్నికావిణిని నీవెందుకు తెచ్చావని కృష్ణుని తల్లి గోపిక ఆతనిని నిలదీస్తుంది. వద్దంటే నాకూడ వచ్చిందని చెబుతాడు. అగ్నికావిణి అయినందున ఈమె తన కుమారుని లక్కమేడలను కాల్చివేస్తుందని, తన కుమారుని చంపేస్తుందని భావించి గోపిక ఆమెను కష్టాలు పెడుతుంది. కన్నాలు పడ్డ ఏడూ గోళేలు నిండా నీళ్ళ పొయ్యమంటుంది. కుమ్మరింటినుంచి మండిగ (తినటానికుపయోగించే మట్టిపాత్ర) తెప్పించి,

అందులో గంజిపోసి తాగమంటుంది. అగ్నికావిణి ఆ గంజి తాగదు.

దేవకాంత అయిన తనను బాధ పెట్టినందుకు చింతించి, కృష్ణని లక్కమేడలకు దారి చూపమంటుంది. దారి చూపితే లక్కమేడలను కాల్చివేస్తుందని భయపడి, కృష్ణని పొన్నుమీద అరటిబొంద, ముత్యాల దుప్పటి కప్పేసి, మేడలకు దారి చూపుతుంది. అగ్నికావిణి లక్కమేడలు కళ్లిద్వారం పట్టుకొనేసరికి మేడలన్నీ కాలిపోతాయి. మేడలు కాలిపోయి గోపిక బాధపడుతుండగా కాశమ్మోరు ఈశ్వరుని దగ్గరకు వెళ్లిపోయింది.

అప్పటికే బ్రహ్మ కపిరిలో పుట్టిన తమకుమార్తెలు అయిదుగురికి అయిదుస్థావరాలు ఏర్పాటు చేసాడు. కాంద్రకోట నూకాలమ్మకు, గాజుకోట పోలేరమ్మకి, కొర్రలదేవతకు అల్లేరుపల్లేరుపోరు బయలు బీడు భూములు, రణశక్తికి కంచి కాళింగ మడుగులు, మహేంద్ర కోటగురుజులు సత్తెమ్మకు. వచ్చిన కాశమ్మోరుని చూసి ఈశ్వరుడు అందరికీ అన్నీ ఇచ్చేశాను. నావద్ద ఇవ్వటానికేమీ లేవు. నావద్దఉండిపో అంటాడు. తనకెక్కడో ఒకచోట స్థావరం చూపమంటుంది. మీ పినతల్లిగంగ దగ్గర నీకు ఒంటిస్థంభం మేడ కట్టిస్తానని, సముద్రంలో ఒంటి స్తంభం మేడ కట్టించి, అనేకమంది సేవకులను, బంగారుటుయ్యాల, మొదలైన వన్నీ అమర్చి, కాశమ్మోరుని గంగ కప్పగించి, ఈశ్వరుడు వెళ్లిపోతాడు. ఆ మేడలో ఉయ్యాల ఊగుతూ, ఆరునెలలు నిద్ర, మూడు నెలలు మెలకువతో కాశమ్మోరు ఉంటుంది.

ఒకనాడు కాశీపట్నాన్ని పరిపాలించే కాశీరాజు పడమటి రాజ్యాల నుంచి తూర్పు రాజ్యాలకు సముద్రమ్మీద వేటలు చేసుకుంటూ కంచు నావలమీద వస్తున్నాడు. వచ్చేటి రాజుకి కాశమ్మోరు మేడవద్దకు వచ్చేసరికి పొద్దు కుంకిపోయింది. కాశీ నుంచి వస్తున్న నాకు ఇప్పటివరకు ఏ అడ్డూ లేదు. ఇక్కడకు వచ్చేసరికి ఒంటిస్తంభం మెడ కట్టుకొని, ఉయ్యాల ఊగుతూ, మాకడ్డొచ్చింది ఎవరని ఆకాశీరాజు కాశమ్మోరుని పరిపరివిధాల తిడతాడు. ఈ తిట్లు విన్న కాశమ్మోరుకి కోపమొచ్చి, గబుక్కున ఊయలలో నుంచి దిగి, తన మేడ దాదుల కప్పగించి, తండ్రి వద్దకు బయలుదేరింది. వచ్చిన కూతురుకు ఏమి కావాలి? ఎందుకొచ్చావు? ఏమి తక్కువొచ్చింది? అని అడుగుతాడు. నాకు ఏమి అవసరం లేదు. నన్నెవరూ ఏమీ అనలేదు. నాకు పడమటి రాజ్యాల కెళదామని దృష్టి కలిగిందంటుంది. సెలవిస్తే వెళతానంటుంది. ఏ రాజ్యానికయినా వెళ్లొచ్చు కానీ, పడమటి రాజ్యాల కెళ్లడానికి కుదరదు. ఆ రాజ్యాన్ని కాశీరాజు పరిపాలిస్తున్నాడు. అతడు చాలా కానివాడు. ఆడపిల్లని చూస్తే చెరుస్తాడు అంటాడు. కాశమ్మోరుకి తీవ్రమైన కోపమొచ్చి, కాశీరాజు లెలాంటి వాళ్లో కళ్లారా చూస్తాను. వెళ్లటానికి అనుమతివ్వమని తండ్రి నడుగుతుంది. ఎంతకీ అనుమతి ఇవ్వడు. అనుమతివ్వకపోతే, వెనక్కి వెళ్లిపోతాను. నిన్ను చాలా బాధలు పెడతాను అని తండ్రితో చెప్పి తన మేడ కెళ్లిపోయింది.

కాశమ్మోరు మహిమవల్ల ఈశ్వరునికి చలిజ్వరమొచ్చేసింది. చలిజ్వరంతో బాధపడుతూ, పార్వతిని పిలిచి పరుపులు వేసి, దుప్పటి కప్పమన్నాడు. కప్పింది. కాశమ్మోరుకి మరింత కోపమొచ్చి తండ్రిని మరింత బాదపెట్టింది. పెద్ద పెద్ద ఉసిరికాయలంత పొక్కు లెక్కించింది. ఏడు తొడుగులు తొడిగించింది. ఏడుపూతలు పూయించింది. ఈశ్వరుడు ఈ బాధకు తట్టుకోలేక లేచి సముద్రంలో

పడిపోదామని వెళ్లిపోతున్నాడు. వెంటనే పార్వతి అతనిని చేయి పట్టుకొని ఆపి, పరుపుపై పరుండబెట్టి తన కుమార్తె నూకాలమ్మను పిలిచింది. నీ తండ్రి చాలా బాధల్లో ఉన్నాడు అతనిని నేను ఆపలేను. నువ్వొచ్చి కాపాడలని పిలుస్తుంది. నూకాలమ్మ మిగతా చెల్లెళ్లందరినీ తీసుకొని తండ్రివద్ద కొస్తుంది. వచ్చేసరికి తండ్రికి స్పృహలేదు. అరిటాకుమీద పడుకొని ఉన్నాడు. అందరూ వచ్చినా, కాశమ్మోరు రానందున, ఆమెను తీసుకొని రమ్మని పోలేరమ్మను పంపించింది.

పోలేరమ్మ వెళ్లేసరికి, ఆదమరిచి ఊయల్లో నిద్రిస్తున్న కాశమ్మోరును చూసి, ఆమె కిందపడేలాగ ఉయ్యాల తాళ్లు కోసేసింది పోలేరమ్మ. 'అందరూ వచ్చారు నువ్వు కూడారా' అని పోలేరమ్మ కాశమ్మోరుని తీసుకొని బయులుదేరి తండ్రివద్దకు వచ్చింది. వచ్చినవారందరినీ చూసి నూకాలమ్మ మన తండ్రి ఎవరికి ఏమీ కావలసినా ఇచ్చాడు అటువంటి తండ్రిని ఈవిధంగా చెయ్యకూడదు. ఎవరికి ఏమి వరం కావలసినా నేనిప్పిస్తాను. తండ్రిని మామూలు స్థితికి తేవాలంటుంది. కాశమ్మోరు తనకు కాశీపట్నం వెళ్లటానికి అనుమతిస్తే తండ్రిని మామూలు స్థితికి తెస్తానంటుంది. తండ్రి ఇవ్వకపోతే నేనిస్తానని, నూకాలమ్మ అనగానే కాశమ్మోరు తండ్రిని మామూలు స్థితికి తెస్తుంది. కూతుళ్లు ఏడుగురూ కలిసి తండ్రికి అనేక పరిచర్యలు చేసి, ఆరోగ్యవంతుణ్ణి చేస్తారు.

కాశమ్మోరు తండ్రిని కాశీవెళ్లటానికి దారివ్వమని అడుగుతుంది. అంటు వ్యాధులు నీదగ్గరున్నందున కాశీవెళ్లటానికి కుదరదని, ఆమె నుంచి తీసుకొని నూకాలమ్మకిస్తాడు. అందుకే ఈనాటికి నూకాలమ్మను అంటువ్యాధులకు అధి దేవతగా కొలుస్తారు. కాశీ వెళ్లమన్నాడు. మారువేషంలో వెళ్లమన్నాడు. ఆమె మామూలు వేషంలో వెళుతుంది. దారిలో అరణ్యంలో కృరజంతువులను సృష్టించాడు. వాటిని చూసి, తండ్రిని తలచుకొని కాశమ్మోరు ఏడుస్తుంది. తండ్రి అక్కడ ప్రత్యక్షమై 'కూతురా ! నేను' నీవెనకాలే ఉన్నాను. నీవు మారువేషమ్మీద వెళ్లమని చెబుతాడు. కాశమ్మోరు పురుషవేషం ధరించి, తెల్లగుర్రాన్నెక్కి కాశీపట్నం బయులుదేరింది. తండ్రి వెనక్కి తిరిగి వచ్చేసాడు.

కాశమ్మోరు ఇలాగ బయులుదేరి వెళుతుండగా దారిలో ఇద్దరు చెట్టుగాళ్లు కల్లు గీస్తుంటారు. వారిలో తమ్ముడివద్దకు ముసలిరూపంలో వెళ్లి కల్లు అడుగుతుంది. కల్లు పొయ్యడు సరికదా కర్రతో గెంటివేస్తాడు. అతను చెట్టుదిగి కల్లు కుండ చూసుకొంటే చీము, నెత్తురు ఉంటుంది. ఇదంతా కల్లు అడిగిన ముసలామె మహిమేనని గ్రహించి, ఆమె వద్దకు వెళ్లి ప్రాధేయపడతాడు. దారిలో వెళ్లే అరిదేశలు, పరిదేశులు కల్లు అడిగితే లేదనకుండా పొయ్యమని, తన రాళ్లకు ముందుగా పూజచేసాక కల్లు గీయుమని చెప్పి, అక్కడనుంచి అన్నవద్దకు వెళుతుంది. అతనిని కూడ కల్లు అడుగుతుంది. అతను విసుగుచెందక కొంత కల్లు పోస్తాడు. అతని మంచితనానికి మెచ్చుకొని, అతని కల్లుకుండ మొదలైన సామాగ్రి అంతా బంగారం చేసేస్తుంది. అదేసమయంలో కుమారుడికి చల్దీ అన్నం తెచ్చిన తల్లి ఇది చూసి అంతా బంగారమైపోతే నరులు అతనిని బతకనివ్వరని సలహా ఇస్తుంది. వెంటనే అతడు కాశమ్మోరుని తనకు కుమ్మరింటి కుండ, కమ్మరింటి కత్తి ఉంటే చాలునని ప్రాధేయపడతాడు. అతనికి ఏనాటికైనా అవే ఉంటాయని చెప్పి, అక్కడనుంచి బయులుదేరి వెళుతుంది.

దారిలో ఒక కాపు పసుపుతోట కడ కుమారుని కాపలా ఉంచి, తాను ఇంటి కెళతాడు. కాశమ్మోరు ముసలి వేషంలో ఒళ్లంతా కురుపులతో ఆ బాలుని వద్దకు వెళ్లి, పసుపుకొమ్ము అడుగుతుంది. చూడ్డానికి జుగుప్సాకరంగా ఉన్నందున, ఆ బాలుడు ఆమెను ఈసడించుకుంటాడు. అందుకుకోపించిన కాశమ్మోరు పసుపు తోటను చిగుళ్ళు కిందికి, మొదళ్ళు పైకి వచ్చేలా చేస్తుంది. వనమంతా మాడ్చేసి వెళ్లిపోతుంది. తండ్రి వచ్చి, వనం యొక్క ఆస్థితికి కారణ మడుగుతాడు. కొడుకు జరిగినదంతా చెబుతాడు. వెంటనే కాపు కాశమ్మోరు వెళ్లిన మార్గంలో వెళ్లి, ఆమెను కాళ్లు పట్టుకొని బ్రతిమాలతాడు. వెంటనే తోటను మామూలు స్థితికి తెస్తుంది. [illegible] చేసుకొని, పంటకోసుకొనేటప్పుడు నా బండరాళ్లకు పొలికోసి, [illegible] పంట కో[illegible] చెప్పి వెళ్లిపోతుంది.

వెళు[illegible] [illegible]పతోట వేసుకుంటే [illegible] వెళ్లి, [illegible] చల్లి అన్నంలో [illegible] వాళ్లు పెట్టకపోతే తోటంతా [illegible] మహిమ గురించి తెలుసుకున్న వారు ఆమెను బ్రతిమాలితే, తోటను మామూలు స్థితికి [illegible] పూజించమని, పొలి కోయుమని చెప్పి వెళ్లిపోతుంది.

గొల్లకుర్రోళ్లు ఆలమందలు కాస్తూ ఆడుకొంటున్నచోటుకి వెళ్లి. కొన్ని పాలు అడిగి, వాళ్లు పొయ్యకపోతే ఆలమందను జబ్బులతో పడిపోయేటట్టు చేస్తుంది. ఆ కుర్రోళ్లు ఇంటి కెళ్లి, పెద్దవారితో జరిగినదంతా చెప్పగా, వారు అమ్మోరు వెళ్లిన దారికెళ్లి, ఆమెను బ్రతిమాలుతారు. వాళ్ల గోవుల్ని మామూలు స్థితికి తెచ్చి, తనను పూజించమని, తనకు పొలి కోసి, తొలి ఫలం పెట్టమని చెప్పి వెళ్లిపోతుంది.

చివరకు కాశీరాజు పట్నం వెళ్ళి అక్కడ ముసలివేషంలో బలుసుకూర అమ్ముతుంటుంది. తన అనుమతి లేకుండా తన పట్టణంలో బలుసుకూర అమ్ముతున్నందుకు కోపించిన రాజు ఆమెను గరుడస్తంభానికి కట్టించి కొట్టిస్తాడు. అప్పుడు కాశమ్మోరు రాజు తనకు జరిపిన అవమానం గురించి చెప్పి, తండ్రిని ప్రార్థిస్తుంది. తండ్రి ఇల పాలసంద్రాల అవతల ఉగ్గుళ్ళుమర్రి ఉందని, దానిమీద బంగారు భరిణ ఉందని, ఆ భరిణలో రెండు తుమ్మెదలున్నాయని, ఆ రెండు తుమ్మెదలే కాశీరాజు జీవనమని చెబుతాడు. కాశమ్మోరు ఆ తుమ్మెదలను పట్టుకొని, వాటేని బాధ పెడుతుంది. అప్పుడు కాశీరాజుకి ప్రాణాంతకంగా ఉంటుంది. ఇదంతా కాశమ్మోరు మహిమ అని తెలుసుకున్న రాజు గరుడస్తంభానికి కట్టికొట్టించిన ముసలామెను తెమ్మని, సేవకులను పంపి, రప్పిస్తాడు. తాను కాశమ్మోరు నని, తనకు కాశీలో గుడి కట్టించి పూజించాలని చెప్పి అక్కడ నుండి బయలుదేరి సముద్రమార్గంలో తూర్పుతీరానికి వచ్చేస్తుంది.

తూటి తామర మీద పసిబాల వలె పరుండి సముద్రంమీద వస్తున్న కాశమ్మోరుని చూసి, నాగేంద్రుడు ఈ బాలను తన పడగమీద కెక్కించుకొని నాగలోకం తీసుకెళతాడు. నరవాసనకి నాగలోకంలో నున్న నాగేంద్రులందరూ కాటువేయటానికి రాగా, వారందరిని అణిచివేస్తుంది. తాను ఈశ్వరుని కూతురునని, కాశమ్మోరునని చెబుతుంది. వెంటనే నాగేంద్రుడు సారి, చీర పెట్టి, అమ్మవారిని సాగనంపటానికి అన్నీ కొంటాడు. తనకేమీ వద్దని, కుమ్మరింటి కుండ కావాలని

అంటుంది. ఆవిధంగానే కుండ తెచ్చి, అమ్మోరుని ఈశ్వరుని వద్దకు దిగబెడతాడు.

ఈ కథలో కాశీపట్నం వెళ్ళాలనే తన కోర్కెను తిరస్కరించిన తన తండ్రిని రోగాలపాలు చేసినందున పురుషదేవుడైన ఈశ్వరుని కంటె స్త్రీదేవత అయిన కాశమ్మోరు అధికురాలని వర్ణించటం వల్ల మాతృఆదేవతారాధనకు శైవారాధనకు మధ్య గల స్పర్ధ లేక అంతరించుచున్న స్త్రీ ప్రాధాన్యం నిరూపింప బడుచున్నది. సాధారణంగా గ్రామదేవతల కథలలో దేవతలు తమ శక్తిని శంకించిన వారిని తమ మాహాత్మ్యంచే భక్తులుగా మార్చుచుందురు. ఈకథలో కూడ తనను తెలుసుకొనని, కాశీరాజు, కాపువారు, గొల్లవారు, కల్లుగీసుకొనేవారికి తన మహిమ చూపి, కాశమ్మోరు తనను తెలుసుకొనేటట్లు చేసింది. తన భక్తులుగా మార్చింది.

**పోలేరమ్మ కథ :**పోలేరమ్మ ఒడ్డు (వడ్డెర) రాజుల ఇంటి ఆడపడుచు. ఈమె మైలిపిల్లి, వగ్రిపిల్లి, చోడిపిల్లి, గంటిపిల్లి, ఓసిపిల్లి, మొదలైన ఏడు పిల్లుల ఇంటపేర్ల వారి ఆడబిడ్డ. ఒడ్డు రాజులు ఏడుగురు అన్నదమ్ములు. వీరు కులవృత్తి (చేపలవేట) మాని వండ్రంగిపని చేస్తున్నారు. వీరిలో చిన్నవాడు పోలిగాడు అన్నలతో తాము చేస్తున్న వడ్రంగిపని మాని, తమ కులవృత్తి అయిన చేపలవేట చేద్దామంటాడు. అందుకు అన్నలు కూడ అంగీకరించారు. ఏడుగురు ఏడు తెప్పలు చేసుకొని, తెరచాప కట్టుకొని, సముద్రంలో తెప్పలు దించుకొని చేపలు వేట చేస్తున్నారు. అలా చేస్తుండగా పెద్దవారు అందరికీ చేపలు పడ్డాయి. చిన్నవాడికి చేపలు పడలేదు.

చాకలివాడు ఏగిసమాను కొట్టుకొని బట్టలు ఉతుక్కుంటున్నాడు. పోలేరమ్మ ఆతని కలలో కనిపించి, ఆ మానుకు చిగుళ్ళు, మొదళ్ళు నరికి, మధ్యమాను సముద్రంలో పడవేయమని చెప్పింది. చాకలివాడు ఆవిధంగానే చేస్తాడు. ఆమానువచ్చి, చిన్నవాడు ఒడ్డు పోలిగాడి వలకి చిక్కుకుంది. అన్నలందరికీ చేపలు పడగా వారి ఇంటి కెళ్ళిపోయారు. ఈతని వల బరువుగా ఉండి, లాగుతుంటే రావడంలేదు. ఎంతకీ లాగుతూనే ఉన్నాడు. చింతపల్లి పర్వతం (పెద్దకెరటం రోజూ ఏదో సమయంలో వస్తుంది.) వచ్చే సమయమయిందని అన్నలు తమ్ముణ్ణి పిలిచి పిలిచి వెళ్ళిపోతారు. చింతపల్లి పర్వతం వచ్చినా పోలిగాడి పడవకు అటుఇటూ ఉంటుందే కాని ఇతనిని ఏమీ చేయలేదు. వల లాగి లాగి లాగలేక సొమ్మసిల్లి పడిపోయాడు. పోలేరమ్మ అతని కలలోనికెళ్ళి, ఏగిసమాను వలకు చిక్కుకున్న విషయం చెప్పి ఆ మానును మైలవల్లి మైరాముడి ఇంటిలో పడవేయమంటుంది. పోలిగాడు స్పృహలోని కొచ్చి పోలేరమ్మ చెప్పినట్టుగానే ఆమాను పట్టుకెళ్ళి మైరాముడి ఇంటిలో పడవేస్తాడు.

ఏగిసమాను ఇంటిలో పడవేసాక మైరాముడి వలలో చేపలు పడడం లేదు. ఇది గమనించిన ఆతడు చేపలు పడనందుకు బాధపడతాడు. పోలేరమ్మ మైరాముడి కలలో కనిపించి ఏగిసమానును, మట్టిని ఉపయోగించి నావ తయారుచేస్తే ఆ నావమీద తాను నాగరాజుల పట్నం యుద్ధానికెళతానంటుంది. మట్టితో నావ తయారు చేసేవాళ్లెవరైనా ఉంటారేమోనని మైరాముడు తూర్పు పడమర ఉత్తర దక్షిణ దిక్కులు నాల్గు తిరుగుతాడు. ఎక్కడా దొరకరు. అప్పుడు మళ్ళి పోలేరమ్మ మైరాముడికి కలలో కన్పించి, సముద్రంలో ఒక దీవిలో మట్టితో నావ తయారు చేసేవారుంటారని చెబుతుంది. ఆమె చెప్పిన ప్రకారం వారి వద్దకు వెళ్ళి, నావతయారుచేయిస్తాడు.

ఈ మట్టినావమీద మైలిపిల్లి, మొదలైన ఏడుపిల్లిఇంటి పేర్లువారు ఎక్కాలి. అది మట్టి నావ అయినందున నీటిలో కిరిగి పోతుందనే భయంతో వారు ఎక్కరు. పోలేరమ్మ మళ్లీ కలలో కనిపించి, నావముందుభాగాన కొబ్బరికాయ కొడితే కంచునావగా మారుతుందంటుంది. ఆవిధంగా కొట్టి కంచునావగా మారాక ఏడుపిల్లి ఇంటి పేర్లువారు, పోలేరమ్మ, బండోడు (ఈతడు పోలేరమ్మకు మనుమడవుతాడు. సుంకం వసూలు చేస్తాడు) మొదలైన వారంతా ఎక్కి నాగరాజులపట్నం యుద్ధానికెళతారు.

నాగరాజులకి మైరాముడికి జూదం జరుగుతుంది. ఆ జూదంలో మైరాముడు ఓడిపోతాడు. పోలేరమ్మ చూడచక్కనైన యువతి వలె ముస్తాబై నావమీద నిలబడుతుంది. ఆమె తన సోదరి అని చెప్పి, ఆమెను కూడ మైరాముడు పందెంలో కాస్తాడు. ఆమె మహిమవల్ల ఆజూదంలో మైరాముడు నెగ్గుతాడు. వాళ్ళ ధనమంతా అతనికి వచ్చేస్తుంది. నాగరాజుల కూతురు నాగకన్నెను కూడ అతని కిస్తారు. వాటన్నిటిని తీసుకొని వస్తుండగా, ఉక్రోషం పట్టలేని నాగరాజులు పన్నుపన్నుకి విషం పట్టిన పన్నెండుతల నాగేంద్రుడిని నావ కెదురుగా పంపుతారు. ఇది గమనించిన నాగకన్నె మండ (పెద్ద) పీతను ఓడ ముందుభాగాన ఉంచుతుంది. వస్తున్న నాగరాజును ఆ పీత తన డెక్కలతో నొక్కి చంపేస్తుంది. పోలేరమ్మ ఈ నాగకన్యను బండోడి కిచ్చి పెళ్లిచేస్తుంది. తర్వాత సూర్యచంద్రుల పట్నమెళ్లి వాళ్లను అదమణచి, వాళ్ల కూతురిని తీసుకొచ్చి సుంకాలదారుడు సూడ్డోడి కిచ్చి పెళ్లి చేస్తుంది.

ఈవిధంగా ప్రయాణిస్తుండగా నావ కలువతూటిలో చిక్కుకుంది. సూర్యచంద్రుల కుమార్తె నావకు ఉక్కు రంపాలు అమర్చగా అవి కలువతూటిని చేధించగా ప్రయాణం ముందుకు సాగుతుంది. ఇలా ప్రయాణిస్తుండగా నావ పైసన్నాసుల (సాయిబుల) గొంది (నదిసముద్రంలో కలిసేచోటు)లో చిక్కుకుంది. పైసన్నాసులు తమ అనుమతి లేకుండ తమ రాజ్యంలో అడుగుపెట్టినందుకు తమతో యుద్ధం చెయ్యాలంటారు. యుద్ధం చేయకుంటే వెళ్ళనివ్వనంటారు. తప్పకయుద్ధానికి సిద్ధంకాగా, సాయిబులు వేసే బాణాలకు పోలేరమ్మ శరీరం తూట్లు పడిపోయింది. తట్టుకోలేక ఆమె నావలో పడిపోయింది. పోలేరమ్మ తన అక్క కొర్రల దేవతను పిలిచి, తురకల నుంచి తనను కాపాడమని ప్రార్థిస్తుంది. ఆవిధంగా రక్షిస్తే, సూర్యచంద్రుల పట్నంలో తాను గెలుచుకున్న తొమ్మిది ఇరుసుల రథంలో నాలుగు ఇరుసులు ఇస్తానంటుంది.

కొర్రలదేవత తురకల మీదికి యుద్ధానికెళ్లి, విబూది మంత్రించి చల్లి, వాళ్లంతా మూర్ఛిల్లగా, తన కత్తితో వారందరినీ సంహరిస్తుంది. తిరిగి పోలేరమ్మ వద్దకు వస్తుండగా, మరణించిన వారి భార్యలు వచ్చి, తమ భర్తలను బ్రతికించమని ఆమెను వేడుకుంటారు. ఎవరైన అరిదేశులు, పరదేశులు మీరాజ్యంగుండా వెళితే వారిని బాధపెట్టకూడదని మందలించి, వారి భర్తలను బ్రతికిస్తుంది. 'సూర్యుణ్ణి చూడకు – చుక్కబొట్టు పెట్టకు – ఓర ముసుగులుండాలి. మారు మనువు లుండవు' అని వారికి వరమిచ్చి అక్కడినుంచి బయలుదేరి పోలేరమ్మ దగ్గరకు వస్తుంది. తన సోదరి కొర్రలదేవరకు రథంలో వాటా ఇవ్వాలేమోనని, పోలేరమ్మ తన తొమ్మిది ఇరుసుల రథం తీసుకొని పారిపోతుంది. కొర్రలదేవర వెళ్లి రథంతో పీకులాడింది. ఇద్దరికీ చెరొక నాల్గు ఇరుసుల రథం వచ్చి, తొమ్మిదవ ఇరుసు పోతురాజుకి మిగిలింది. ఇప్పటికీ పోతురాజు కొయ్యకు పందిని దిగేస్తారు

'పోలేరమ్మకథ' అను పేరుతో డా. రావి ప్రేమలత గారు తమ గ్రంథంలో ఒక కథను పేర్కొన్నారు. కాని ఆ కథకు ఈ కథకు నామసామ్యం తప్ప ఇంకే సామ్యము లేదు. ఆకథలో కూడ వడ్డెర రాజుల ప్రసక్తి వస్తుంది. పోలేరమ్మ బాలికగా ఉన్నప్పుడు ఆమెను పూడ్చించటానికి వడ్డెరరాజులతో ఈశ్వరుడు గొయ్యి తవ్విస్తాడు. నేను సేకరించిన కథలో వడ్డెరరాజులకు ఆడపడుచుగా వర్ణింపబడింది.

ఈ కథలో కొర్రలదేవర తురకలతో యుద్ధం చేసి, వారిని సంహరించి, పునర్జీవితులను కావించి, తమ రాజ్యంలోనికి ఇతరులెవరైనా అరిదేశం... ...శులు వస్తే, వారిని బాధపెట్టవద్దని మందలించి నందువల్ల, మహమ్మదీయ ప్రభువులు పరిపాలనాకాలంలో వారు హిందువులను, ఇతరులను కష్టపెట్టడం వల్ల, దేవతను ఆలంబనగా చేసుకొని అట్టివారికి జ్ఞానోదయం కలగడానికి చేసిన కల్పనగా ఈ సన్నివేశాన్ని పేర్కొనవచ్చును.

**కొర్రలదేవర కథ :** ఈమెను 'కోదండ' అని కూడ అంటారు. ఈమెకు పోలేరమ్మకు వచ్చిన గొడవలో, ఈమె తెచ్చుకున్న నాల్గు ఇరుసుల బండికి ఇంకొక ఇరుసువేసి, అయిదు ఇరుసుల బండిని తెచ్చి, తన మన్ననబావ అయిన శివశింగిరాజు దేవాలయంలో పెట్టింది. ఆ బండిని బయటకు లాగివేయమని ఈశ్వరుడు వీరన్నను పంపించాడు. అతడు తానొకడూ ఆపని చేయలేక తమ్ములు నంబుల సహాయంతో బండిని బయటకు లాగించే ప్రయత్నంలో ఉండగా, కొర్రలదేవర ముసలివేషంలో వచ్చి, వారి సమస్య గురించి అడుగుతుంది. ఆ బండి ఊరవతల రుద్రాచ్చ (స్మశాన) భూములలో పారవేయలంటారు. తన బండిని తానుకాక, వేరొకరు పడెయ్యడం ఇష్టంలేక తన బండిని స్మశానభూములలో పడేలా చేస్తుంది.

ఇన్నాళ్లనుంచి తమ ఇంట్లో ఉంటున్న నంబులు చేయలేని పనిని తాను చేయగలిగినందుకు, వారిని తీసేసి తనను పనిలో పెట్టుకోమని వీరన్నతో అంటుంది. అలాగే అని వీరన్న పనిలో పెట్టుకుంటాడు. 29 రోజులు గడిచాక రేపటితో నెల పూర్తవుతుంది కాబట్టి నెలజీతం ఇమ్మంటుంది. తన దగ్గరున్న ధనమంతా ఇవ్వజూస్తాడు. నాక్కావల్సినంత ధనం ఇవ్వలేవు ధనం వద్దు, ధనానికి బదులు ఊరవతల ఉన్న అల్లేరు పల్లేరు బీడుభూమి ఇమ్మంటుంది. ఆవిధంగానే ఇస్తాడు. మిగతా అక్కచెల్లెళ్లను పిలిచి, తుప్పలతో ఉన్న బీడు భూమిని పూలతోటకు అనువుగా మార్చుకుంటుంది. అనేకరకాల పూలమొక్కలు పాతి, పూలు పూయిస్తుంది.

ఎరుకలవాని వద్దకు వెళ్లి పూలు అమ్మకానికి అనువైన బుట్ట అల్లమంటుంది. అతనిని అన్నయ్యా !' అని సంబోధించి, ఉదయ శనివారం బుట్ట అల్లకానికి ప్రారంభించి, మళ్లీ ఉదయ శనివారమే బుట్ట పంపమంటుంది. ఆమె మహిమవల్ల ఆతడు ఆవిధంగానే అల్లి, తానున్న చోటునుంచి విసిరితే అమ్మవారి ఒడిలో పడుతుంది. ఆ బుట్టలోనికి పూలు కోసుకొని, అమ్మడానికి దేవగిరికి వెళుతుంది. దేవగిరిలో నున్న వీరన్న పూలమనిషిని పిలిచి, తన తండ్రి పూజకు పూలుకావాలంటాడు. పూల ఎత్తున బంగారం ఇస్తే పూలు ఇస్తానంటుంది. వీరన్న బంగారం తెచ్చి త్రాసులో వేస్తాడు. ఎంత బంగారం వేసినా త్రాసు కదలదు. తల్లిమెడలో మంగళసూత్రం తీసుకొనిరావటానికి వెళతాడు. కొర్రలదేవతకు పార్వతి తల్లే కనుక, ఆమె మెడలో మంగళసూత్రం తీయకుండా

త్రాసు తూగేటట్లు చేస్తుంది. వీరన్న పూలు తీసుకుంటాడు. ప్రతీ రోజు బంగారం ఇచ్చి, పూలు కొనాలంటే కష్టం కాబట్టి తన పూలతోటలోని కొచ్చి పూలు కోసుకోవటానికి అతని తమ్ములు నంబుల్ని పంపమంటుంది. వీరన్న తన తమ్ములు నంబుల్ని పూలు తెమ్మని కొ(్రలదేవత వనంలోనికి పంపుతాడు. వారు అయిదుగురు అయిదు రథాల మీద పూలుకోయటానికి వెళతారు. కొ(్రలదేవత నంబులు రథాలు పెట్టినచోటుకి వెళ్లి, రథచక్రపు శీలలు తీసేసి వనంలోని కెళ్లి, తన అనుమతి లేకుండా తన వనంలో పూలు కోస్తున్నందుకు గద్దిస్తుంది. నంబులు భయపడి రథాలు ఎక్కి పారిపోబోతూ, చక్రాలు ఊడి పడిపోతారు. వెంటనే వాళ్లను చంపి, తన అయిదు ఇరుసుల రథానికి కొరతలు వేసి, తన రథాన్ని శివశింగిరాజు దేవాలయం నుంచి స్మశానంలో పడవేయబోయినపుడు పట్టినపంతం తీర్చుకుంటుంది. తరువాత మాయ నంబుల్ని సృష్టించి వీరన్న ఈశ్వరుని కప్పగిస్తాడు.

ఈ కథలో దేవత దేవగిరికి వెళ్లి పూలు అమ్మి, అక్కడ బంగారం అంతా తెచ్చుటయేకాక, తనవనంలోనికి పూలు కోయటానికి వచ్చిన నంబుల్ని కూడ కొరతలు వేస్తుంది. డా. ప్రేమలత గారు సేకరించిన 'అంకమ్మ కథ' లో కూడ ఇట్టి సన్నివేశమున్నది. ఆకథలో అంకమ్మ వృద్ధ స్త్రీరూపంలో దేవగిరిలో ప్రవేశించి, పూలు పండ్లు అమ్ముచుండెను. అక్కడి రాజులు పుష్పముల వెలనడుగగా వాని బరువు గల బంగారాన్ని కోరి, రాజ్యంలోని ధనమంతా తీసుకొనిపోయెను. తొమ్మిదిమంది రాజులు మేఘముల పైన అంకమ్మ తోటలోనికి ప్రవేశించి పుష్పములు హరించబోయి, ఆమెచేత కొరత వేయించబడిరి. సాధారణంగా గ్రామదేవతల కథలలో ఇట్టి పాఠాంతరాలు కన్పిస్తాయి.

ఈకథలో కొ(్రలదేవత రథాన్ని వీరన్న, నంబులు స్మశానభూములలో పారవేయ ప్రయత్నించినందువల్ల, అట్టివారిని దేవత కొరతలు వేసిందని వివరించడం వల్ల, దేవతనేకాక దేవతా సంబంధిత వస్తువులను నిర్లక్ష్యం చేసినవారిని కూడ దేవత కష్టాలపాల్జేస్తుందని విశదమగుచున్నది.

**రణశక్తి కథ :** దేవగిరి పట్టణంలో ఈశ్వరుడు ఒక గాజుమేడ కట్టించుకుంటాడు. దానిలోనికి ఇతరులెవ్వరూ ప్రవేశించకుండా, చుట్టూ ద్వారాలు లేకుండా చేసి, భూగర్భం నుంచి సొరంగం ఏర్పాటు చేయిస్తాడు. ఈశ్వరుని కుమారుడు వీరన్న పక్షుల్ని పెంచుతుంటాడు. ఈతడు సొరంగంగుండా పక్షుల్ని తోలుకెళ్లి, అడవిలో మేవుకొనివచ్చి, గాజుమేడలో వేటి అరలో వాటిని ఉంచుతాడు. రణశక్తి, ఆదిశక్తి, కొర్లదేవర, నూకాలమ్మ, పోలేరమ్మ, మొదలైన అమ్మవార్లు తమ తండ్రి కట్టించిన గాజుమేడ చూడ్డానికి బయలుదేరి వెళతారు. మేడలోనికి ప్రవేశించటానికి దారిలేకపోవటంతో, ఆలోచించి వీరన్న పక్షుల్ని మేవుకొని వచ్చి సొరంగం గుండా గాజుమేడలోనికి ప్రవేశపెట్టినపుడు ఈ దేవతలు కూడ పక్షిరూపాలు ధరించి, ఆ పక్షులతో కలిసి గాజుమేడలోనికి ప్రవేశిస్తారు. ఆయా పక్షులన్ని వాటి వాటి అరలలోని కెళ్లిపోగా, అయిదు పక్షులు (దేవతలు) మిగిలిపోతాయి.

వీరన్న వెళ్లిపోయాక దేవతలు అయిదుగురూ ముసలిరూపాలలో కోటంతా తిరుగుతున్నారు. కోటంతా అలికిడి అవుతుంది. ఈశ్వరుడు వీరన్నను పిలిచి అలికిడి గురించి అడుగుతాడు. మన పక్షులతోపాటు కొత్తగా మరొక అయిదు పక్షులొచ్చాయని వీరన్న చెబుతాడు. ఈశ్వరుడు వారిని చూస్తాడు. ఈ దేవతలు ఈశ్వరునితో జూదమాడడానికి అంగీకరిస్తాయి. జూదంలో దేవతలు

ఓడిపోతే ఈశ్వరుడు వద్దనేవరకు, అతని పూలమొక్కలకు నీళ్ళు పొయ్యాలి. ఈశ్వరుడు ఓడిపోతే అతని దేవగిరిపట్నం దేవతలకు ఇచ్చెయ్యాలి. ఈవిధంగా పందెం కాచుకొని జూదమాడగా, కొల్లదేవత తప్ప మిగతా నాలుగు దేవతలు ఓడిపోతాయి. ఈమె గడుసరి. తాను గెలవడమేకాక, మిగిలిన దేవతల్ని కూడ గెలుచుకుంటుంది. ఈశ్వరుని దేవగిరిపట్నం కూడ గెలుచుకొనేలా ఉంటె. ఈలోగా వీరన్న వచ్చి, తండ్రి మేడ పోతుందనే భయంతో నంబులచేత దేవతలను గెంటివేయిస్తాడు. అప్పుడు రణశక్తి అందుకు ప్రతీకారంగా నంబుల శరీరాలు చీరి, ఈశ్వరుని కోటకు వేలాడతీస్తాన, ప్రతిజ్ఞ చేస్తుంది.

ఈశ్వరుడు గాజుమేడ కట్టించటానికి రాక్షసుల సహాయం పొందుతాడు. మేడ పూర్తయ్యే తర్వాత ఏమి కావాలని ఈశ్వరుడు అడుగుతాడు. డబ్బు కాక తమ జీవితానికి మేలు కలిగే మంచివరం కావాలంటారు. తమ రక్తం కిందపడితే వాటినుంచి వేలకొద్ది రాక్షసులు పుట్టాలంటారు. ఈశ్వరుడు వారికి ఆవిధమైన వరం ప్రసాదిస్తాడు. దానిని పురస్కరించుకొని రాక్షసులు ఒకరి శరీరాన్ని మరొకరు గాయపరచుకొని, తద్వారా తమ సంఖ్య అమితంగా పెంచుకుంటారు. జనబలంతో ఈశ్వరుని మీదికి యుద్ధానికొస్తారు. అతడు భయపడి పారిపోతాడు. బ్రహ్మవిష్ణువులు కూడ అదేవిధంగా పారిపోతారు. చివరకు రణశక్తి తమ్ముడు ఇలయుద్ధరాజు (పోతురాజు) మరదలు యమురాలు సహాయంతో రాక్షసులందరినీ సంహరిస్తుంది. వాళ్లలో ఒక్కడు నల్లరాయి కిందకు పోయి భూమిలో దాక్కుంటాడు. తమ్ముడు కాళ్లు చాపగా రణశక్తి అతని కాళ్లపై నిద్రిస్తుంది. కలలో భూమి లోపల దాక్కున్న రాక్షసుడు కన్పిస్తాడు. వెంటనే ఉరుములు మెరుపులతో వర్షం కురిపిస్తుంది. భూమిని మూడు బీటలువారేటటు కాలుతో తన్నుతుంది. వర్షంనీరు భూమిలోనికి ఇంకగా లోపల ఉన్న రాక్షసుడు బయటకు వస్తాడు.

అతనిని సంహరించి, రక్తం తాగి, వెన్నును వీణగాను, చర్మాన్ని మద్దెలగాను తయారుచేసి, వాయిస్తూ ఇట్టు (విష్ణు) దాసరి వేషంతో దేవగిరిపట్నం వెళుతుంది. అక్కడ ఆడని ఆట, ఆడి పాడని పాట పాడుతుంది. ఇది చూసి ఆశ్చర్యపడిన ఈశ్వరుడు ఏమికావాలో కోరుకోమంటాడు వేరే ఏమీ అడుగక, నంబులు నివాసముండే అయిదు చెట్లూ చూపించి, అవియిస్తే, వాటికి తన వాద్యాలు, తదితర సామానులు తగిలించుకొని జీవిస్తానంటుంది. ఈశ్వరుడు సరే నంటాడు. ఆ చెట్లనున్న నంబుల్ని చీల్చి, ఆ చెట్లకు వేలాడ కట్టింది. ఈవిధంగా రణశక్తి తన పంతం నెగ్గించుకుంటుంది. తనకు కావలసిన నంబుల్ని ఈశ్వరుడు మళ్లీ సృష్టించుకుంటాడు[11].

ఈకథలో తమను అవమానించిన నంబుల్ని రణశక్తి సంహరించిందని చెప్పటం వల్ల దేవతలను అవమానించినవారికి కష్టాలు కలుగుతాయని విశదమగుచున్నది. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు రాక్షసులకు భయపడి పారిపోయినందున, అట్టి రాక్షసులను రణశక్తి సంహరించటం వల్ల స్త్రీ దేవతయొక్క ప్రాధాన్యత స్పష్టమగుచున్నది.

ఈ కథలోనూ, నూకాలమ్మ కథలోనూ రాక్షసులను శక్తి దేవత సంహరించిందని పేర్కొనబడింది. గ్రామదేవతల కథలలో ఇలాంటి పాఠంతారాలు, పునరుక్తులు సాధారణంగా కానవస్తాయి. నామ వైవిధ్యమున్నా శక్తిదేవత ఒక్కటే అని నమ్మే జానపదుల దేవతల కథలలో ఇట్టి

హాఠ్యాంతరాలు, పునరుక్తులు సహజమే.

**మశానదేవత కథ** : ఏబారిఎల్లమ్మ గర్భవశాన ఏడుగురు మగపిల్లలు పుట్టాక ఒక ఆడపిల్ల పుట్టింది. బాల పుట్టిన గడియలు మంచివో కావో బ్రాహ్మణులతో చూపిస్తే బాల పుట్టిన గడియలు మంచివి కావు ఉండకూడదంటారు. ఆరునెలలకు సరిపడా ఉగ్గూ; పాలూ ఉయ్యాలలో ఉంచి ఆ ఉయ్యాలలో బాలను వేసి అరణ్యంలో ఒక చెట్టుకి ఉయ్యాలను వ్రేలాడదీస్తారు. ఎరుకలవాళ్లయిన ఏడుగురు అన్నదమ్ములు వేటకు వెళతారు. వారిలో చిన్నవాడు చోడిగాడు ఈబాలను చూస్తాడు. ఏడుగురూ కలిసి బాలను ఇంటికి తీసుకొచ్చి, బాల వచ్చిన గడియలు మంచివో కావో చూపిస్తారు. బాల వచ్చిన గడియలు మంచివి కావని తెలుసుకొని, ఒక ఇనుప పెట్టెలో బాలను ఉంచి, తీసుకెళ్లి పెట్టెను సముద్రంలో వదిలేస్తారు. వీరికంటే ముందే ఆ పెట్టె ఒడ్డుకు వచ్చేస్తుంది.

ఒక జాలరికి ఏడుగురు ఆడపిల్లలు కలిగాక భార్య మరణించింది. ఆతనిచేత బాల ఉన్న పెట్టెను సముద్రంలో దూరంగా వదలివేయిస్తారు. ఆతరువాత నీలముని, పాలముని, మొదలైన సప్తరుషులు స్నానాలు చేస్తుండగా, వారిలో ఒకని జడలకు ఈ బాల ఉన్న పెట్టె తగులుతుంది. ఆ పెట్టెను విడగొట్టి, అందున్న బాలను చూసి, పెంచుకోవటానికి ముచ్చట పడతారు. బాల దొరికిన గడియలు మంచివో కావో చూపించగా, మంచివి కావని తెలిసింది. వెంటనే బాలను తీసుకెళ్లి అరణ్యంలో విడిచిపెడతారు. మళ్లీ ఎరుకల వాళ్ళ వేటకెళ్లి, బాలను ఇంటికి తెచ్చి, పెంచి పెద్దచేసి, మేనత్తకొడుకు ఇట్టుదాసరోడి కిచ్చి పెళ్లి చేస్తారు. పెళ్లి అయిన వెంటనే ఆతడు మరణిస్తాడు. భర్తపోయాక ఈమె నూతికి నీళ్ల కెళితే, వితంతువని అందరూ ఈసడిస్తారు.

పుట్టినిల్లయిన ఎరుకలవానింటి కెళుతుంది. వారిలో పెద్దవారారుగురూ మరణిస్తారు. చిన్నవాడు చోడిగాడు ఉంటాడు. వాడు వేటకు వెళతాడు. వారు కటిక దరిద్రులుగా ఉంటారు. భార్యా భర్తలిద్దరికి ఒకే వస్త్రముంటుంది. భర్త వస్త్రం కట్టుకొని వెటకెళితే అతను వచ్చేవరకూ, భార్యఇంటిలో ఉంటుంది. మశానదేవత పుట్టింటి కెళ్లి వదిన ఎరుకల భూదేవిని పిలుస్తుంది. కట్ట వస్త్రం లేనందున బయటకు రానంటుంది. తనవస్త్రం చింపి కొంతముక్క వదిన కిచ్చి, అది కట్టుకొని బయటకి రమ్మంటుంది. ఆవిధంగా ఎరుకల భూదేవి బయటకు వచ్చి, భర్త ఎరుకల చోడిగాడు వేట కెళ్లాడని వచ్చేవరకు ఉండమంటుంది. మశానదేవత ముసలివేషంలో అరణ్యాని కెళ్ళి చోడిగాడిని చాలా కష్టాలు పెడుతుంది. తిరిగి అతడు వచ్చే దారిలో పసిపాప వలె కన్పిస్తుంది

చోడిగాడు ఆ పాపను తెచ్చి భార్య కిచ్చి పెంచమంటాడు. పాప వచ్చాక వారి పేదరికం తొలగిపోతుంది. పాపను ఒడిలో కట్టుకొని ఎరుకల భూదేవి సోదికెళుతుంది. మశానదేవత తల్లిఒడిలో ఉండితాను పుట్టాక, పుట్టిన గడియలు మంచివి కావని తనను నిర్లక్ష్యం చేసి, అరణ్యంలో వదలి వేసిన తల్లిదండ్రులు, అన్నలువద్దకు వెళ్లి, వారికి సోధి చెబుతుంది. తన గతాన్ని వారికి జ్ఞాపకం చేసి తనను నిర్లక్యం చేసినందున వారి కుటుంబాన్ని నాశనం చేస్తుంది. ఆదేవిధంగా ఏడుగురు మునులూ, తనను సముద్రంలో వదలిన జాలరి, మొదలైనవారి వద్దకు వెళ్లి, తన గతం చెప్పి, తనను నిర్లక్ష్యం చేసినందున వారిని నాశనం చేస్తుంది. తాను దొరికాక ఐశ్వర్యం వచ్చి, తనను నిర్లక్ష్యం చేసి వారు సుఖిస్తున్నందున, ఎరుకల చోడిగాడిని, భూదేవిని కూడ నాశనం చేస్తుంది.

అక్కడ నుంచి బయలు దేరి ప్రసవవేదన పడుతున్న శివనందులమ్మ వద్దకు వెళ్లి, ఆమెకు పురుడుపోసి, ఆ బాలుణ్ణి నూతిలో పడవేసి, అక్కడనుంచి దేవగిరికి వెళ్లి శివనందులమ్మకు పుట్టిన బాలుని గురించి చెప్పి అక్కడ నుంచి వెళ్లిపోతుంది[12].

ఈకథలో మశానమ్మ తనను నిర్లక్ష్యం చేసిన తల్లిదండ్రులను నాశనం చేసిందని చెప్పడంవల్ల, తనను నిర్లక్ష్యం చేసిన వారిని దేవత కష్టాలుపాల్జేస్తుందన్న విషయం స్పష్టమగు చున్నది. ఈకథలో ఏబారి ఎల్లమ్మ, మునులు, ఎరుకలవారు మొదలైనవారందరూ ఆడపిల్లలభించిన గడియలు మంచిచెడ్డలు చూపించుకొనే నెపంతో ఆమెను వదలిపెట్టి, చివరకు వారంతా నాశనమయ్యారని వివరించబడింది. కావున ఆడపిల్లంటే చిన్నచూపు చూసి, నిర్లక్ష్యం చేసేవారికి, ఆడవారిపట్ల నిర్లక్ష్యభావం తొలగించడానికి దేవతను ఆలంబనగా చేసుకొని కావించిన జానపదుని కల్పనగా ఈకథను చెప్పవచ్చును.

**రాముడు శక్తిదేవతను దేవగిరికి తోలుకెళ్లడం :** శివనందులమ్మ ఈశ్వరుని చిన్నకూతురు. ఈశ్వరుడు అందరికీ సంతానమిచ్చి ఆమె కివ్వలేదు. అందుకు కోపించిన ఆమె తన కడుపున పుత్రుడు పుట్టగానే దేవగిరిలో అసాధారణ పరిస్థితి ఏర్పడాలని శపిస్తుంది. శివనందులమ్మ మునుల వరాన గర్భవతయింది. ఆమె కడుపున బాలుడు పుడితే దేవగిరిలో అసాధారణ పరిస్థితి ఏర్పడుతుంది కావున అతనిని చంపే ఉద్దేశముతో ప్రసవవేదన పడుతున్న శివనందులమ్మ వద్దకు మశానదేవత వెళ్లి, ఆమెకు పురుడుపోసి, పుట్టిన బాలుడిని తీసుకెళ్లి పాడుబడ్డ బావిలో పడవేస్తుంది. ఆ బావిలో చాన్నాళ్లనుంచి ఉంటూ మాదతో (పెద్దపుండుతో) బాధపడుతున్న పన్నెండు శిరసుల నాగేంద్రుడిపై బాలుడు పడగానే నాగేంద్రుని మాద మానిపోతుంది. అందుకు సంతోషించిన నాగేంద్రుడు బాలుడిని నాగలోకం తీసుకెళ్లి, సకల పరిచర్యలు చేసి, మైల మాపి, తీసుకొచ్చి నూతిలో విడిచిపెడతాడు. బావిలోని బాలుడుని చూసిన జనులు చెప్పుకొంటుండగా, శివనందులమ్మ వెళ్లి బాలుని చూడగానే, ఆమె వక్షోజాల నుండి పాలు జాలువారి బాలుడి నోటిలో పడతాయి. కొడుకు కనిపించగానే తల్లికి పాలు జాలువారతాయనే నమ్మకంతో శివనందులమ్మ బాలుడు తన కుమారుడుగా భావించి, తీసుకెళ్లి పెంచుకుంటుంది.

శివనందులమ్మకు పురుడుపోసాక, మశానమ్మ దేవగిరికి వెళుతుంది. శివనందులమ్మ శాపం వల్ల దేవగిరిలో నూరుదీపాలలో ఒక దీపం వెలగకపోవడం, నూరు గంటలలో ఒక గంట మోగకపోవడం, నూరు చిలుకలలో ఒక చిలుక పలుకక పోవడం, మొదలైన అసాధారణ పరిస్థితి ఏర్పడింది. అక్కడ ఏర్పడిన అసాధారణ పరిస్థితికి కారణ మేమిటని ఈశ్వరుడు మశానమ్మ నడుగుతాడు. శివనందులమ్మకు పుట్టిన రాముడు వల్ల దేవగిరికి ఈ పరిస్థితి వచ్చిందంటుంది. ఈశ్వరుడు పాతాళలోకానికి వెళ్లి, పాముల్ని రాముడిని తీసుకొని రమ్మని పంపుతాడు. పాముల వల్ల వార్త తెలుసుకొని, తల్లి అనుమతితో రాముడు దేవగిరికి వెళతాడు. తాతను మెప్పించటానికి స్మశానంలో శవం వలె కాలి వాసన రప్పిస్తాడు. తాత మెచ్చుకొని, శక్తుల్ని తోలుకొస్తే పెళ్లిచేస్తానంటాడు.

శక్తుల్ని తోలుకొని రావటానికి బయలుదేరతాడు. దారిలో కంచువారుద్రయ్య

ఎదురవుతాడు. వారిద్దరూ అక్కచెల్లెళ్ళ బిడ్డలు. ఎవరెవరో తెలియక యుద్ధం చేసుకొంటారు. ఒకరి బాణం వేరొకరి మెడలో పూలదండగా మారుతుంది. తాను శత్రువులం కాదని, అన్నదమ్ములమని తెలుసుకుంటారు. ఆపదలో తన్ను తలచుకుంటే సాయం చేస్తానని చెప్పి, కంచుమారుద్రయ్య రాముణ్ణి బుజ్జగించి పంపిస్తాడు. శక్తుల కోటకు వెళుతూ, దారిలో పక్షిపిల్లల్ని తినబోవుచున్న నాగేంద్రుణ్ణి సంహరిస్తాడు. నాగేంద్రుడి కాటుకి ఈతడు కూడ మరణిస్తాడు. తిరిగి పక్షులు సంజీవి వేళ్ళు తెచ్చి బ్రతికించగా శక్తుల కోటకు వెళతాడు. శక్తుల స్నానంచేస్తున్న కొలను కెళ్ళి, వారిలో ఒకరి నీటిబిందెలో పడి వారి కోటలో ప్రవేశిస్తాడు. పగలంతా బల్లిరూపంలో గోడ నంటిపెట్టుకొని ఉండి, రాత్రి అయ్యాక పురుషరూపంలో ఒక శక్తితో రమించినట్లు చేస్తాడు. ఆశక్తి ఎవరో పరపురుషుడు మన కోటలో ప్రవేశించి, నన్ను బాధపెడుతున్నాడని చెల్లెళ్లతో చెప్పగా, వారు గోడలన్నీ, ఒలిచి, బల్లిరూపంలో ఉన్న బాలుని పట్టుకుంటారు. బాలుని చూడగానే ఆశక్తికి పాలుచిమ్ముతాయి. పాలివ్వకపోతే పాలుతో బాటు ప్రాణాలు కూడా పీల్చేస్తానంటాడు లేకుంటే బాలుడు చెప్పినట్లుగా చేయిస్తుంటాడు.

తనకూడ బయలుదేరమని తీసుకొస్తాడు. రావటానికి శక్తి చెప్పినట్లు, బాలుడు చేయాలంటుంది. శక్తి నృత్యం చేస్తూ, నృత్యానికి తగ్గట్టు మద్దెల వాయించాలంటుంది. వాయిస్తాడు. ఇద్దరికీ పెళ్లి కావాలంటుంది. అందుకు గాను నూరని పసుపు, చెయ్యని శతమానం, మొదలైనవి కావాలంటుంది. రోమాలు అక్షింతలుగా, చేతివేళ్ళు పురోహితుడుగా, పేరంటాలుగా చేసి, ఆమె అడిగినట్టుగా పెళ్లి జరిపిస్తాడు. ఈవిధంగా ఇద్దరూ కలిసి వస్తూంటే, శక్తిదేవత పేడపురుగు అవతారమెత్తి గొర్రెల మందలో కలిసిపోయింది. ఆమెను జాగ్రత్తగా పట్టుకుంటాడు. ఈవిధంగా ఆమె పెట్టిన కష్టాలన్నీ భరించి చివరకు దేవగిరికి తోలుకొస్తాడు. అప్పుడు దేవగిరిలో మామూలు పరిస్థితి ఏర్పడింది. శక్తి అక్కడ నుంచి మళ్లీ తన చెల్లెళ్ళు ఉండే నివాసానికి వెళ్లిపోతుంది. తాత రాముడికి పెళ్లిచేస్తానంటాడు. వద్దని తాత దగ్గర సెలవు తీసుకొని, తల్లిదండ్రుల వద్దకు వెళ్లిపోతాడు. రాముడు శక్తిని తోలుకొచ్చేటపుడు నానాకష్టాలు పడడం, నాగేంద్రుని కాటుకి మరణించడం, మొదలైన సందర్భాలలో అతనికి అనుయాయంగా ఇంటివద్ద తల్లి నాటిన తులసిమొక్క మరణించడం తిరిగి చిగురించడం చేస్తుంది. కుమారుడు మరణించాడేమోనని తల్లి అప్పటికే దినకార్యం చేసేస్తుంది. రాముడు వెళ్లాక, పెళ్లి చేస్తుంది[13].

మరొక కథలో శక్తిని తోలుకొచ్చేటపుడు బాలుడిని, ఆమె నానా బాధలు పెడుతుంది. దాహం తీర్చమంటుంది. విప్ప ఆకులు దొప్పగా కుట్టి, నీరుపోసి తాగమంటాడు. ఆవిధంగా తాగడంవల్ల కలిగిన మత్తుకి నృత్యం చేస్తూ, అందుకనుగుణంగా బాలుడి వాద్యాలు వాయించమంటుంది. అలాగయితే వస్తానంటుంది. ఆపదలో ఉన్న బాలునికి సాయం చేయటానికి విష్ణు, మహేశ్వరులిద్దరూ వస్తారు. ఈశ్వరుడు నక్క రూపం లో వస్తాడు. విష్ణువు రెండు పర్వతాలు పైన ఒకటి కింద ఒకటి కప్పుగా పట్టుకొని వస్తాడు. అక్కడ అంతా చీకటయిపోతుంది. మేస్తున్న ధేనువులు బెదరిపోవడం వల్ల దేవేంద్రుడు అగ్నిజ్వాలలు కురిపిస్తాడు. ఈశ్వరుని సలహామేరకు విష్ణువు ఆ అగ్నితో రకరకాల వాద్యాలు తయారు చేస్తాడు. ఆ వాద్యాలు బాలుడు వాయిస్తుండగా, శక్తి అందుకనుగుణంగా ఆడుతుంది.

శక్తి నృత్యం చేసేటపుడు విప్పసారా తాగి ఉండడం వల్ల, మైకంలో నృత్యం చేయడం వల్ల వస్త్రాలు సరిగాలేక ఆమె వక్షోజాలు ఊగుతాయి. వాటిని చూసి రాముడు నవ్వుతాడు. నవ్వుకి కారణమడుగుతుంది. రకరకాల వంకలు పెడతాడు. నమ్మదు. చివరకు నిజం చెబుతాడు. తన శరీరాన్ని చూసినందువల్ల, ఇద్దరికీ పెళ్లి కావాలంటుంది. కాకుంటే రానంటుంది. పెళ్లికి బ్రాహ్మణుడు కట్టని బాసికం, కంసాలి చేయని కంకణం, సమ్మెటకొట్టని శతమానం కావాలంటుంది. గుండె చీల్చి, నాలుక కోసి, అడిగిన వస్తువులు ఇచ్చి మరణిస్తాడు. శక్తి తన దారిని పోతుంది. ఇది తెలిసి రాముడి పెద్దమ్మ కుమారుడు కంచుమారుద్రయ్య డేగలను పంపుతాడు. అవి పోతున్న శక్తిని అడ్డగించి, కాళ్లతో రక్కి, రాముడిని బ్రతికించమని వెనక్కి తీసుకొస్తాయి. రాముడిని బ్రతికించి, చేసేదిలేక అతని కూడ దేవగిరికి వెళుతుంది. తాత రాముడితో శక్తిని తూర్పు ఉత్తరాసి గుమ్మాల బోడిగోడలలోవదిలెయ్యమంటాడు. అలా వదిలేస్తే, శక్తి మళ్లీ తన ఆడముండల రాజ్యానికి వెళ్లిపోతుంది. రాముడికి తాత పెళ్లిచేస్తానంటాడు. పెళ్లికంగీకరించక తల్లిదండ్రుల వద్దకు బయలుదేరతాడు. దారిలో అనేక చిత్రవిచిత్ర విన్యాసాలు చేస్తూ, తల్లిదండ్రులను చేరుతాడు[14]

ఈ కథలో రాముడు శక్తిని తోలుకొని రావడం, ఆమె అతనిని చాలాబాధలు పెట్టడం, చివరకు అతను దేవగిరికి తోలుకొని రావడం, అనేది పంబల వారి ''స్వామివారు విజ్జుల మేడల కెళ్లడం'' అనే కథలో రవద్దేవిరాముడు, శక్తిని తోలుకొచ్చి తండ్రుల కొరతలు తీయించటాన్ని పోలి ఉన్నది. గ్రామదేవతల కథలలో ఇలాంటి పాఠాంతరాలు సాధారణమే.

ఈ కథలో మిగతా కల్పనలు ఎన్ని ఉన్నా శక్తిదేవత మానవుల్ని కష్టాలు పాల్జేస్తుందని విశదమగుచున్నది.

ఈవిధమగు గ్రామదేవతల కథల పుట్టుక కాలమును నిర్ణయింపలేకున్నా ప్రాచీనకాలమునకు చెందిన మతపరమైన సామాజిక స్పృహను ఈకథలలో కనుగొనవచ్చును. ఎక్కువ కథలలో శివునికి, గ్రామదేవతకు వైరుధ్యం కన్పించటంవల్ల గ్రామదేవతారాధనను అణచి శైవమతం ప్రచారంలోనికి వచ్చిన కాలంలోనివే ఈ గ్రామదేవతల కథలని చెప్పవచ్చును. ఆకాలంనాటి మత, సాంఘిక పరిస్థితుల నాధారంగా చేసుకొని, లెవిస్ట్రాస్ నిర్మాణం విశ్లేషణాసుత్రాన్ని ఈ కథలకు కూడ అన్వయింపవచ్చు.

శక్తిపుట్టుదల కథలో శక్తిని తల్లిగాను, త్రిమూర్తులను కుమారులుగను వివరించడం వల్ల త్రిమూర్తులు (పురుషులు) కంటె శక్తి (స్త్రీ) ప్రాచీనత స్పష్టమగుచున్నది. కావున శక్తి పుట్టుదల అనే కథకు

**స్త్రీశక్తి : పురుషశక్తి :: ప్రాచీనత : అర్వాచీనత** అనే నిర్మాణసూత్రం అన్వయిస్తుంది.

కాశమ్మోరు కథలో కాశీపట్నం వెళ్లడమనే తన కోరిక తీర్చనందున కాశమ్మోరు తండ్రి ఈశ్వరుని రోగాలుపాలు చేసి, తన పంతం నెగ్గించుకున్నది. కావున

**గ్రామదేవతాశక్తి : శివశక్తి :: గెలుపు : ఓటమి**అనే నిర్మాణసూత్రం కాశమ్మోరు కథకు అన్వయిస్తుంది.

నూకాలమ్మ, రణశక్తి, మొదలైన కథలలో దయాస్వభావుడైన ఈశ్వరుడు రాక్షసులకు కోరిన వరమివ్వడం, ఆ వరబలంతో వారు ఈశ్వరుని మీదికి దండెత్తి అతనిని కష్టాలు పాలుచేయడం, చివరకు శక్తి దేవత పూనుకొని రాక్షసులను సంహరించడం జరుగుతుంది. కావున

**సుజనత్వం : దుర్జనత్వం :: గెలుపు : ఓటమి** (అకాలమరణం) అనే నిర్మాణసూత్రం ఈకథలకు అన్వయిస్తుంది.

కొర్రలదేవత కథలో తన రథాన్ని స్మశానభూములలో పారవేయించినందుకు ప్రతీకారంగా ఈశ్వరుని సేవకులైన నంబుల్ని కొర్రలదేవత తన పూలతోటలో కొరతలు వేస్తుంది. రణశక్తి కథలో ఈశ్వరునితో జూదమాడే సందర్భంలో ఓడిపోతామనే భయంతో శక్తి దేవతలను గెంటివేసిన నంబుల్ని, అందుకు ప్రతీకారంగా రణశక్తి వారిని చీల్చి తమ చెట్లుకి కొరతలు వేస్తుంది. కావున ఈ రెండు కథలకు

**స్త్రీశక్తి : పురుషశక్తి :: గెలుపు : ఓటమి** అనే నిర్మాణసూత్రం అన్వయిస్తుంది.

మిగిలిన కల్పనలు ఎన్ని ఉన్నప్పటికి ఈ గ్రామదేవతల కథలలో శక్తిదేవత ఈశ్వరుడు మనకు కన్పిస్తారు. అంటే స్త్రీశక్తి గ్రామదేవతారాధనలోను, పురుషశక్తి శైవారాధనలోనూ ప్రాముఖ్యం చెందినవనవచ్చును. ఈరెండు శక్తుల మధ్యన సంభవించిన సంఘర్షణ ఫలితమే గ్రామదేవతా కథలకు మూలకారణం. ఈవిధంగా ప్రాచీనకాలం నాటి మత, సామాజిక పరిణామాలను తమ కథలలో పదిలపరచిన మత్స్యకాలు ఎంతైనా అభినందనీయులు.

## అధస్సూచికలు

1. Hand Book of Statistics, East Godavari, 1985-86, p.5

2,3,5 మేరుగ అడవియ్య - మాయాపట్నం (ఉప్పాడ), కొత్తపల్లి మండలం

4. ఈనాడు దినపత్రిక - 31-5-92, తూర్పుగోదావరి జిల్లా ఎడిషన్

5. మేరుగ అడవియ్య - మాయాపట్నం, కొత్తపల్లి మండలం

6.7,8,9,11,12,14, ఉప్పరివిల్లి అమ్మోరియ్య - మాయాపట్నం, కొత్తపల్లి మండలం

10. దైలిపిల్లి వీరన్న - మాయాపట్నం, కొత్తపల్లి మండలం

11,12,14. ఉప్పరవిల్లి అమ్మోరియ్య - మాయాపట్నం, కొత్తపల్లి మండలం

13. దూడా రాజన్న - మాయాపట్నం, కొత్తపల్లి మండలం

14. ఉప్పరవిల్లి అమ్మోరియ్య - మాయాపట్నం, కొత్తపల్లి మండలం

# దశమ ప్రకరణం

# భాషా విశేషాలు

వ్యవహారాన్ని బట్టి భాషను ప్రామాణిక భాష, జానపదుని భాష అని రెండుగా విభజింపవచ్చును. ఈరెండింటి మధ్య ఎంతో తేడా ఉంది. వాగ్వ్యవహారంలో నిలిచే జానపదుల భాష సజీవమైంది. ఈ జీవద్భాషలో నిరంతరం అనేక మార్పులూ చేర్పులూ జరుగుతుంటాయి. కాబట్టే ఈ జీవద్భాషను ప్రవాహ జలంతో పోలుస్తారు. మౌఖిక ప్రచారంలో నిలిచే జానపదవాఙ్మయంలో శిష్టసాహిత్యంలోని పదాడంబరం కాని, అర్థక్లిష్టత గాని కనిపించవు. శిష్టసాహిత్యంలోని పదాల అర్థాలను నిఘంటువుల సహాయంతో తెలుసుకోవచ్చును. కాని జానపదుల భాషలోని పదాల అర్థాలు అలా తెలుసుకోవటానికి అవకాశం తక్కువ. సందర్భాన్నిబట్టి, సన్నివేశాన్నిబట్టి, జానపదులు తమ వ్యవహారంలో అనేక క్రొత్తపదాలను వాడతారు. వారు ప్రయోగించిన సందర్భాన్ని సమగ్రంగా పరిశీలిస్తే తప్ప సరయిన అర్థాలు తెలియవు.

జానపదుల భాష దేశీయమైన సరళమార్గంలో ఉండి, వ్యాకరణాలంకార నియమాలను తలదన్ని అలతి అలతి పదాలతో అప్రయత్నంగా, సహజంగా వెలువడే వ్యావహారిక భాషలో ఉంటుంది. జానపదులు తాము చెప్పదలచుకున్న భావాన్ని హృదయాని కత్తుకునేటట్లు సూటిగా చెబుతారు. ఏభావాన్నైనా సాధ్యమైనంత వరకు గేయరూపంలో లయబద్ధంగా చెప్పటానికి ప్రయత్నిస్తారు. ఈప్రయత్నంలో కొన్ని దీర్ఘాలు హ్రస్వాలుగాను, హ్రస్వాలు దీర్ఘాలుగాను మారి వ్యాకరణమునకు లొంగని విధంగా ఉంటాయి.

భాష, భావం, వర్ణనలు, మొదలైనవి కాలానుగుణంగా మారుతూ, స్వతంత్రపరిణామ వికాసాన్ని పొందుతాయి. అన్యభాషల సంపర్కంవల్ల, కొత్తపదాలు, కొత్తసంప్రదాయాలు, కొత్త కవిసమయాలు సాహిత్యంలో చేరతాయి. ఇలాంటివి గ్రామదేవతలకు సంబంధించిన కథలు, గేయాలు, సామెతలు, మొదలైన జానపద సాహిత్యంలో అధికంగా ఉన్నాయి. వ్యావహారిక పదాలు, దుష్టసమాసాలు, సంధులు, మాండలిక పదాలు, సమానార్థకాలు, నుడులు, వారానువర్తనాలు, సజీవ రూపకల్పనలు, అన్యదేశ్యాలు, మొదలైన భాషావిశేషాలు, తూర్పుగోదావరి జిల్లా గ్రామదేవత సంబంధిత జానపద సాహిత్యంలో కనిపిస్తాయి.

జానపదుల వ్యవహారంలో భాషాస్వరూపంలో కలిగే మార్పుల్ని కొన్ని విధాలుగా విభజింపవచ్చును.

## అచ్చుల్లో కలిగే మార్పులు

జానపదుల వ్యవహారంలో కొన్నిపదాల్లోని అచ్చులకు బదులు వాటికి సమీపంలో ఉన్న అచ్చులు వచ్చి చేరుతాయి.

**'అ' స్థానంలో ఇ, ఉ, ఎ, ఐ లు రావడం**

చీకటి – సీకిటి; అవతారం – అవుతారం; గంజి – గెంజి; వస్తువులు – వైత్తువులు

**'ఇ' స్థానంలో ఉ, ఐ రావడం**

కోడి – కోడు; త్రిమూర్తులు – త్రైమూర్తులు;

**'ఉ' స్థానంలో ఆ, ఒ, ఇ లు రావడం**

మశూచి – మశాశకం; మూల – మోల; నడుమ – నడివి

**'ఋ' స్థానంలో ఆ, ఇ, ఉ, ఓ - లు రావడం**

శృంగారం – సింగారం; శృంగారం – సుంగారం

**'ఎ' స్థానంలో అ,ఇ,ఉ, ఒ - లు రావడం**

నెమలి – నవులు; గుండె – గుండు; పల్లె – పల్లి; చెప్పు – చొప్పు

**'ఒ' స్థానంలో ఆ రావడం**

మనసు గొలుపుతాను – మనసు గలుపుతాను

**అచ్చుల స్థానంలో హల్లులు రావడం**

**'అ' 'ఎ' స్థానంలో 'వ' - రావడం**

ఎలాంటి – వలాంటి; అన్నము – వణ్ణము

**పదాది హల్లులు లోపం**

యాదవులు – ఆదవులు; వాలిన – ఆలిన

**పదాదిన హల్లులు రావడం**

అర్ధరాత్రి – యర్ధరాత్రి; ఆలకించి – వాలకించి అన్నం – వన్నం

**హల్లుల స్థానంలో భిన్న హల్లులు రావడం**

**శ్వాసాల స్థానంలో నాదాలు**

కుంతి – గొంతి; తపస్సు – తబుసు; తోరణం – దోరణం

**ఈ మార్పు సంయుక్తాక్షరంలో కూడ కనపడుతుంది.**

ప్రీతి – బ్రీతి

**నాదాలస్థానంలో శ్వాసాలు రావడం**

ప్రధాని – పెతాని; అంగడి – అంగటి

**మహాప్రాణం స్థానంలో అల్పప్రాణం రావడం** : స్తంభాలు – సంబాలు

**మహాప్రాణం అల్పప్రాణ ద్విత్వం కావడం** : మేఘం – మేగ్గం; శపథం – శపద్దం

| | | |
|---|---|---|
| **'డ' స్థానంలో 'ర'** | : | కడసారి – కరసారి; పడమటి – పరమటి; గుడి – గురుసు |
| **'ర' స్థానంలో 'డ'** | : | బొంగరం – బొంగడం |
| **'ట' స్థానంలో 'స'** | : | ఇటువంటి – ఇసుమంటి; |
| **'వ' స్థానంలో 'య'** | : | పావురాలు – పాయిరాలు |

| | | |
|---|---|---|
| 'భ' స్థానంలో 'త' | : | అభిమానం – అతిమానం |
| 'ర' స్థానంలో 'ల' | : | ఏడుగురు – ఏడుగులు |
| 'ల' స్థానంలో 'ర' | : | లొట్టు – రొట్టు |
| 'న' స్థానంలో 'ల' | : | జన్మాలు – జల్మాలు; మునుగు – ములుగు |
| 'బ' స్థానంలో 'వ' | : | కబళం – కవళం |
| 'వ' స్థానంలో 'బ' | : | గర్వము – గర్బము |
| 'వ' స్థానంలో 'ప', 'క' | : | వటా – పటా; వరుడు – పరుడు; సరస్వతి – సరస్పతి; సాధువుడ – సాదుకుడు |
| 'ప' స్థానం లో 'వ' | : | పరంజోతి – వరంజోతి |
| 'శ' 'స' 'ష', 'చ' స్థానంలో 'స' | : | దోషము – దోసము; చాతి – సాతి; ఆకాశము – ఆకసము |
| 'స' స్థానంలో 'శ', 'గ' మరియు 'త' | : | సంకల్లో – శంకల్లో; పసిడి – పగిడి; ధ్వంసం – దంతం |
| 'ద' స్థానంలో 'జ' మరియు 'గ' | : | తలకిందులు – తలగింజులు; జందెం – జంజం; ముందర – ముంగర |
| 'ణ' స్థానంలో 'ర' | : | వడ్డాణం – వడ్డారం |
| 'హ' స్థానంలో 'బ' | : | బహు – బబు |
| 'హ' స్థాన్‌లో 'వ' మరియు 'మ' | : | వాహనం – వావనం; అగ్నిహోత్రుడు – అగ్నివోత్రుడు; దాహం – దామం |
| అనుస్వారపూర్వక 'హ' స్థానంలో కూడ 'వ' | : | సంహరించు – సవరించు |
| 'య' స్థానంలో 'వ' మరియు 'గ' | : | అయితే – అవితే; ఆయువు – ఆవును; బోయి – బోగి |
| 'వ' స్థానంలో 'స' | : | ఆయువు – ఆవుసు |
| 'వ' స్థానంలో 'క' | : | కఠినురాలు – కటికురాలు |
| 'వ' స్థానంలో 'గ' | : | లేవదీయు – లేగదీయు; అనుభవించు – అనబగించు |
| 'మ' స్థానంలో 'న' మరియు 'వ' | : | మెదడు – నెదడు; మిట్ట – నిట్ట; ఆధారము – ఆదరవ |
| 'ద' స్థానంలో 'ట' మరియు 'స' | : | పయొెద – పయొెట; వస్తాదు – వత్తాసు |
| 'శ' స్థానంలో 'ష' | : | ఆశ – ఆష |

'శ' స్థానంలో అనుస్వారపూర్వక 'త' : పిశాచి - పింతాసి

***అనుస్వారంలో కలిగే మార్పులు :***

అనుస్వారం స్థానంలో హల్లు : కాలక్షేపం - కాలక్షేపణ

హల్లు స్థానంలో అనుస్వారం : మహాదేవతలు - మాందేవతలు; అరటి - అంటి;

***అనుస్వారం ఉన్నచోట పోవడం :***

అంతమ్మై - అతమ్మై; అందం - అందస్తు; మంచు - మనుసు

***అనుస్వారం లేనిచోట రావడం :***

దూత - దుంత; మీద - మింది

***సంయుక్తాక్షరములలో కలిగే మార్పులు :***

**'క్ష్య', 'శ్మ', 'శ్చ', 'ష్మ', 'క్ష', 'త్స్య', లు 'చ్ఛ', గా మారడం :**

భక్ష్యాలు - బచ్చాలు : తపశ్శాలి - తపచ్చాలి హరిశ్చంద్రుడు - హరిచ్చంద్రుడు; సంవత్సరం - సంవచ్చరం;

పక్షి - పచ్చి; మత్స్యాలు - ముచ్చాలు

**'ద్ + మ్' సంయుక్తం 'బ' ద్విత్వం కావడం** : పద్మిని - పబ్బిని

**'ద్ + య్' సంయుక్తం 'జ' ద్విత్వం కావడం** : మధ్య - మజ్జ

**'త్ + మ్' సంయుక్తానికి అదనంగా 'స్' రావడం** : ఆత్మ - అస్తం

**'జ + ఞ' సంయుక్తం పదాదిన 'గ'గా పదాంతాన 'గ' ద్విత్వంగా మారడం :**

జ్ఞాపకం - గేపకం; ప్రజ్ఞ - పగ్గె;

**'స + న' స్థానంలో 'త' రావడం** : స్నానం - తానం

***సంయుక్తంలో ఒక హల్లు లోపించడం***

స్వేచ్ఛ - సేచ్ఛ అశ్వం - అశం

పర్వతం - పరతం పాపిష్టి - పాపిటి (ష)

**ద్విత్వాక్షరంలో కలిగే మార్పులు :**

***ద్విత్వం తొలగడం :***

యవ్వనం - యువనం; తపస్సు - తబుసు

***ద్విత్వం కలగడం :***

నవ - నవ్వ; పవళించు - పవ్వళించు; బాగాన - బాగ్గాన

***ద్విత్వం సంయుక్తంగా మారడం :***

అత్త - అస్త; పట్టము - పష్టము

**ద్విత్వం పోయి దీర్ఘం రావడం :**

పెత్తనం – పెతానం

**వర్ణలోపం :**

**పదాంతస :**

పట్టణం – పట్టం; ముంగిస – మింగి; అందలం – అందం

**పదాదిన :**

పంపు – అంపు; గ్రహించు – గయించు

**వర్ణాగమము : పదమధ్యలో :**

జడ – జగడ; ఎదురయె – ఎదురుకయె

**పదాంతాన :**

వార్త – వాత్తనం; వధ – వతనం

**వర్ణనాశము :**

ఎదురురొమ్ము – ఎదురొమ్ము; దంతధావనం – దందానం

**వర్ణవ్యత్యయము :**

గములు లేక గిబులు – గలుబు

**స్వరవ్యత్యయము :**

హిమాలయ – ఇమలాయ

**పదవ్యత్యయము :**

రామచిలుక – చిలుక రామన్న; శనివారం ఉదయం – ఉదయం శనివారం

**లోపదీర్ఘత :**

మహాలు – మాలు; అమావాస్య – అమాస; రహస్యం - రాస్యం; మోహము – మోము;

**దీర్ఘలోపం :**

మీద – మింద; దూషించరాని – దుసించరాని

**స్వరసామ్యత :**

తుమెదలు – తుమ్మెదులు

**అనునాసిక్యం :**

మర్మం – మరబం; ఇష్ట – ఇష్టు; గములు – గబులు

**అజ్లోపము :**

కుదురంగా – కుద్రుంగా

*సంప్రసారణము :*

వత్తి – ఒత్తి; వరి – ఒరి

***స్వరాగమము :***

కల్పన – కలాపన; దుర్మార్గుడు – దురమారుగుడు; భర్తలు – బరతలు

**జంటపదాలు**

జానపదులు ఒకే అర్థాన్నిచ్చే రెండు పదాల్ని కలిపి జంటగా పలుకుతారు. సాధారణంగా అన్యదేశ్యపదాలు దేశ్యపదాల్లో కలిసినపుడు, ఆ అన్యదేశ్యపదాలతో పాటు, దేశ్యపదాలు కూడ చేరి జంటపదాలుగా ఏర్పడతాయి. ఇవి రెండూ సమానార్థాన్నిస్తూ విడివడకుండా ఉంటాయి. ఇటువంటి సమానార్థక పదాలు గ్రామదేవతా సంబంధిత సాహిత్యంలో అనేకం ఉన్నాయి.

సప్తఏడు; నగబూసనాలు; పేరునామాలు; ఆగ్రమైన కోపం; కురిసిమొక్కల పీట; పతి (మ) బొమ్మ; కష్టబాధలు; పాదరచ్చల జోడు; అంపబాణం

సమానార్థకాలైన రెండు అన్యదేశ్యపదాలు (తత్సమాలు) కూడ జంటగా వాడబడడం కనిపిస్తుంది.

వందన నమాస్కారాలు; పురోహిత బేమ్మడు; మతీమనసులు

సమానార్థకాలైన రెండు దేశ్యపదాలు కూడ జంటగా వాడబడడం కనిపిస్తుంది.

తాసు తరాజు

**సహజ సౌందర్యాలు :**

జానపదుల భాష సహజ సౌందర్యంతో వెల్లివిరుస్తుంటుంది. వీరు ప్రతి సంఘటనకు స్పందించి, ఆ స్పందనకు ప్రకృతిలోని వస్తువులను ఆలంబనంగా చేసుకొని, అనుభవాలను జోడించి, సజీవరూపకల్పనతో వారి సాహిత్యంలో భద్రపరుస్తారు. అలాంటి స్పందనను, అనుభవాలను, ప్రకృతిలోని వస్తువుల ఆలంబనను పొందుపరచుకున్న సజీవ రూపకల్పనలు గ్రామదేవత సంబంధిత జానపద సాహిత్యంలో అనేకం ఉన్నాయి. మచ్చుకు కొన్ని :

ఏకుల మీద పాతలాగ ఎగిరెగిరి పడతావత్తున్నాడు; రణభేరిలా కడుపుబ్బిపోయింది.

ఏనుగు తలకాయంత అగ్గినిప్పు; చిట్టూరు తుప్పలా తలిరబోసుకొని

నడిపిదుళ్లని యాడిసికొనిపోయినట్టు యాడిసికొనిపోయాను; పామ్మీద పరతములాగ గుట్టడిందంట

ఎడమచేత్తో తెచ్చినట్టు తెస్తాను; పత్తికాయల్లాగ పల్లికిలించాడు

కర్తికాయల్లాగ కళ్లెక్కదీసాడు; కొర్రైపోయి నిలబడిపోయాడు

నచ్చత్రాల్లా కాళ్ల కట్టేసిందండి; సిరివేపకాయంత బుడ్డి

ఏనుగుతొండం ఒలకబోసినట్టు; గోరుడుమట్టి గోవుపాదమంతభూమి కావాలంది

గంపంత కేకలేసినాడు; ఏనుగంత బరువయ్యింది

బాధలు ఉప్పుతుళ్లిపోయినట్టు తుళ్లిపోయాయి; చెల్లుళ్ల ఈగల ధండొచ్చినట్టు వచ్చి అప్పముందు వాలాయి.

గంపకింద పడి కోడిపిల్లలాగ కొట్టుకుంటున్నాడు; సిరిఏపకాయంత పంబనాదం. సామివార్ని; సెరుకుగడలాగ నోటకడ్డంగా కరిసిపెట్టి; శిరసులు నత్తకాయల్లాగ గుచ్చేసుకొని మెడలో హారంలా వేసుకుంటున్నావు

ఉసిరికాయంత కండలా ఉన్నాడు; ఏపకాయంత గర్భిణి ఏర్పడింది

పిడుకుడు పిట్ట; గొడుగంతమేగ్గం

నేరేళ్లమ్మ గరుడు పక్షిలాగ పైకెగిరిపోయింది; గంగ యింటి కిటికీలోనుండి దీపం ఎలిగినట్లు ఎలిగింది

ఉసిరికాయంత పొక్కు లెక్కించింది; కోటుక దుంపలాగ మాడిపోయింది.

కత్తిపీట కాలికి తొక్కిపెట్టి దోసకాయలాగ అడ్డుగా పట్టుకొని కరకరా వాడి శిరంబు ఖండించి

పిల్లల్ని అరటిపండు విడిచిపెట్టేసినట్టు పెనుంలో విడిచి పెట్టేసింది; పూలంబంతిలాగ పెనంలోని నూనెలో జలజల ఆడుకుంటున్నారు

బట్టలుతికినట్టూ ఇద్దర్నీ ఉతుకుతుంది. దెబ్బ దెబ్బకి బంతిలాగ తూలుతున్నారు.

నిమ్మకాయంత నిప్పొక్కటేసి; శిరసులు తెగ్గొట్టి నత్తకాయల్లాగ గుదిగుచ్చి,

గుమ్మడికాయంత మూటగట్టుకొని; కొండా కొండా రాపాడినట్టు, చెట్టూ చెట్టూ రాపాడినట్టు కార్తీకరాజులు పరశరాముడితో ఢీకొన్నారు.

**వారానువర్తనాలు**

'కథచెప్పేటప్పుడు తరచుగా దొర్లే నామూనాంశాలను వారానువర్తనాలు(Common Places) అందురు[1]. ఇలాంటి వారానువర్తనాలు గ్రామదేవతా సంబంధి జానపదసాహిత్యంలో చాలా కన్పిస్తాయి. మచ్చుకు కొన్ని :

**వస్త్రధారణ :**

| | | | | |
|---|---|---|---|---|
| ముందును గట్టింది | - మున్నూరు గుడ్డలు; | ఎనకన గట్టింది | - | ఎన్నూరు గుడ్డలు |
| పక్కన గట్టింది | - పదిబళ్లగుడ్డలు; | ఊరికొక గుడ్డ | - | ఊడిపోతుంది |

***అలంకరణ :***

| | | | | |
|---|---|---|---|---|
| నాగబామును బట్టి | - నడికట్లు కట్టినాదీ; | తాసుపామునిబట్టి | - | తలకట్టు కట్టినాది |
| జెర్రిపోతును బట్టి | - జెమ్మకాన గాయించి; | కూనపామును బట్టి | - | కుంటేళ్లకాయించి |

***వర్షం కురవడం :***

| | | | | |
|---|---|---|---|---|
| పాలకొండలమీద | - పట్టింది వర్షమయ్యు; | ఏలూరు కొండమీద | - | ఎత్తింది వర్షమండి |

***సరసమాడడం :***

ఏలాడ సెంగట్టి - ఎనక్కిలాగినాడు; పయ్యాట సెంగట్టి - పడలాగినాడు

***పిలవడం :***

ఆరసేతుల గంగా - ఆరమా గంగా; తొమ్మిదిసేతులగంగా- తూరవా గంగా

బూరుగుపూడి - బుడ్డమ్మా; తామరాడ - తాల్లమ్మ

***క్రూరమ్మగంగామారడం :***

సిరసిర మడసిని - సిరతపులై; పెదపెదమడిసిని - పెద్దపులై

తోకతో - తొమ్మదిమూళ్ళజాడీ మెకమై;

***సంపద కలుగచేయడం :***

మూల గాజులు - మురుగుపాతర్లా; సిరీ - సంపదలూ

ఇలుపైనమేడలు - ఇంటికి నాణాలు; సాలికంబాలు - సదును మండపాలు

కోరినాలినై - కోడైకూత్తాను;

***పాడుచేయడం :***

ఏనుగులమీదోళ్లను - ఎల్లగొట్టాను; గుఱ్ఱాలమీదోళ్లను - కూలగొట్టాను

ఓరుగంటి రాజుని - ఓలలాడించాను;

***అనాధత్వం :***

కూతుళ్లున్నారా - కుమ్మరించటానికి; కొడుకులున్నారా - కూడబెట్టడానికి

దాసిన దయుతప్ప - దాయాదులు లేనిదాన్ని;

ఇప్పిసెప్పడానికి - ఇవరమంతుడు లేనిదాన్ని

మొగుడులేని - మోపకారిని; పురుషుడులేని - పుసాసాలిని

ఎవరూలేని - ఏకంబరాన్ని;

***శాపవిమోచన :***

సుట్టినపాకల్ని - సూర్యుడు మెచ్చాలి; పెట్టిన రాగాలు - పేరెట్టకుండాలి

అష్టమపుత్రుడు జన్మించాల - అడిగిన బూతెట్టాల;

***దుఃఖం కలిగించడం :***

చిన్నతనంలో - చిచ్చుపెడతావా; ఇగురుబాయంతీరకుండ
ఇబదుఃఖమెడతావా

కన్నెబాయం తీరుకుండ - కడదుఃఖమెడతావా;

***ధూపం :***

ఏనువు గుగ్గులుం - ఏకదూపం; వన్నువు గుగ్గులుం - పట్టిదూపం

**అందచందాలు :**

బాల ఒక చాయ - బంగారం ఒక చాయు; బొడ్డుని - బోరుగుంట
పళ్లని - పంరజోతి; ఈపిని - ఇంజామర
సేతిని - సేరుసుక్కలు;

**తెల్లవారి సూర్యోదయం కావడం :**

జాముకోళ్లకూసి - జగము తెల్లారి; ఉగము కోళ్లకూసి - ఉగము తెల్లారి
కడకోళ్లకోసి - కడలు తెల్లారి; బెలబెల తెల్లారి - బెమ్మఉదయించి

**దంతధావనం :**

ముచ్చాల రా ళ్లెక్కి - మునుపళ్లతోమి; పగడాల రాళ్లెకి - పలవరసకడిగి
వజ్రాల రాళ్లెక్కి - వనబళ్లతోమి; నల్లరాళ్లమీద - నాల్కలు కీడి
మోకాళ్ల లోతుల్లో - మొకాలు కడిగి;

**మందెట్టి మాయ చెయ్యడం :**

గొలుగుఆకులమందు - గోళ్లలోపెట్టి; పాటియాకులమందు - పైగాచల్లి
చిక్కుడు కాయలమందు - శిరసుకి జల్లి;
మరలమందులు మాయుగా జల్లి

**ఆహారం పెట్టడం :**

గంపతోటి పెట్టినాడు - గారెలు; బుట్టతోపెట్టినాడు - బూరెలు

**అందం :**

నిలువుటద్దంలో - నీడమూసి; పలసనాచెక్కిళ్ళు - పారుటాకుల తీరు
నిలువొంపుచెక్కిళ్ళు - నిలువుట్టద్దాలు; సాని సక్కనివాడు - సంసారికన్నది
కాటిక్కనీకళ్లు - కలవరేకులబోలు;

**కోపం :**

ఎర్రని కళ్లకు - ఎత్తినకోపాలు; పచ్చనికళ్లకు - పట్టిన కోపాలు

**వివిధ రకాల సుద్దులు :**

నల్లగొండనున్నారు - నాల్గవేల సుద్దులు; ఎర్రగొండనున్నారు - ఏడువేల సుద్దులు
ముక్కులేనివారు - మున్నూరు కోట్లు; చెవుల్లేని వారు - చెన్నూరు కోట్లు
నవిలిపిట్టనెక్కిన - నాలుగువేల సుద్దులు; ఏడ్రింకనెక్కిన - ఏడువేల సుద్దులు

**అపనింద :**

ఉల్లితోట కాడ - ఊసాడి కన్నావు; మల్లితోట కాడ - మాటాడికన్నావు

సతి పతి లేని - సంతెక్కడిది;

**చిరునామా :**

అత్తవారిది - అనకాపిల్లీ; మామగారిది - మండపేట

**మొక్కులు :**

ఓరగాయి ఓరగాయి - ఓరంచు కోకలమ్మా !

బారైన కాత్తేనీ - బారీగా ఏటలమ్మా !

నిలిస్తే - నిప్పులగుండాలు; కావిడికోళ్ళు - గండదీపాలు

మే అన్న - మేకలూ; కా అన్న - కారుకోళ్ళు

కుడువులూ గుగ్గీలు - కుంబాలతో; ఏలుమే గుగ్గులుం - ఏకధూపాలతో

పుట్టకి పున్నానికి - పూజలు చేస్తాను; అమాసకి - అలికి ముగ్గెడతాను

కోరిన కోడిగుడ్డు - కొలుపుకిస్తాను;

**వ్యాధులు రావడం :**

కోళ్ళకి - కుక్కురుతెగుళ్ళు; గొల్లకి - దొమ్మసంగటాలు

ఏనుక్కి - ఏనుగ్గజ్జి; గుర్రాలకి - గుండుసూలలు

**రక్తం పీల్చడం :**

ఏదువేరక్తం - ఎగపీల్చినాది; పందువేరక్తం - వడపీల్చినాది

**ఇంటిపేర్లు :**

ఎండికత్తులవారు - ఎన్నూరు కోట్లు; పైడికత్తులవారు - పద్దాలుగు కోట్లు

**సౌభాగ్యవతి లక్షణాలు :**

అత్తింటికి - ఆయుసుమంతురాలు; పుట్టింటికి - పున్నెశాలి

**వరుసలు :**

అమ్మనుకాను - అయ్యమ్మనవుతాను; తల్లిని కాను - తాతమ్మనవుతాను

అయ్యమ్మమనవడికి - అయితప్పులేదు; తల్లివి నీవమ్మ - తనయుణ్ణి నేనమ్మ

కన్నకొడుకుమీద - కలరాత లాడకేలమ్మ; అంటుకొనిపొందితే - ఆయువులు తక్కువ

ముట్టుకొని పొందితే - మోచ్చాలు తక్కువ; తల్లినిపొందినవాడు - తనయుడు కాడు

**వివిధ రూపాల్లో ఉండడం :**

గ్రామానికో - గంగనవుతాను; పచ్చచేలుమీదికి - పచ్చపులినవుతాను

**తిరస్కారం :**

కాదనటానికి - కారణాలు లేవు; ఒంటినిరావటానికి - ఒడి గడుగులులేవు

**తిట్లు - దీవెనలు :**

ఈరగద్దైనతే - ఇవరమంతుడివికావాలి; పట్టుగట్టయితే - భాగ్యమంతుడవ్వాలి

కుళ్లముండవైతే - కుభేరుడవ్వాలి;

**వెదకటం :**

దోమవతారమెత్తి - దొడ్డులన్నీ తిరిగాడు; ఈగఅవతారమెత్తి - ఈదులన్నీ తిరిగాడు

**ఎంగిలి :**

చెరువులో నీళ్ళు - చేవలెంగిళ్లు; కాలవలో నీళ్ళు - కాకులెంగిళ్లు

**రక్షించడం :**

పాములన్నీ - పాన్పేశాయి; కప్పలన్నీ - తెప్పగట్టాయి

పానుపుపైన - పవ్వళించాడు;

**శాపం :**

కోరల్ల పులివచ్చి - కొంకుబిక్కపట్టాల; నాగుబాములనీ - నడుమైన పట్టాల

పిల్లల తోసొచ్చి - పిక్కపట్టాల; పళ్లు - పప్పులవ్వాల

**వివిధరకాల గాజులు :**

ముచ్చటకి తొడిగాడు - ముతక గాజులు; ఎలవట - ఒంకీలు

దావట - దంతాలు; చెప్పధర్మంలేని - సందితోరాలు

గులివింత గుత్తులు - గుల్లగాజులు; నవుతా పట్టాడు - నల్లగాజులు

తేనెలే పచ్చలు - తేటయైన గాజులు; గురివింత గుత్తులు - గుల్లగాజులు

చెప్పతరంలేని - సందిడి గాజులు; చేతికి ఒంకీలు - శరగపురి గాజులు

గౌరమ్మ అందాలు - గాజులలో దిద్ది;

**విలువ తీయటం :**

వరువు - పంచల పాలు చేసి; ఇలువు - ఈదులు పాలుచేసి

**ఏడ్పుట :**

కుల కుల కన్నీరు - కుమ్మరించు; గోడుగోడుమని - గోటాపన పెట్టు

**చంపడం :**

గుమ్మడికాయ వర్ణాన - గుండెల్లో నక్కినాది; ఆనబకాయ వర్ణాన - వక్కిళ్ళ పట్టినాది

**బహుమతులు :**

తూరుపూ రాజాలకి ఎరుక నే చెప్పితే - తొమ్మిదిమూళ్ల చీర వారెట్టినారు;

పడమటా రాజులకి ఎరుక నేసెప్పితే – పచ్చాల కడియాలు వారెట్టినారు;

దక్షిణా రాజులకు ఎరుక నేసెబితే – దండాకడియాలు వారెట్టినారు

**ఇతరాలు**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| సిగ్గులేదు | – | సిరాకులేదు; | : | సీరలు కావాలి | – | సింగినాదాలు కావాలి |
| కానికూడన్నా | – | కడుపునిండాపెట్టాల; | | సిక్కు | – | సికాకులు |
| పొక్కులు | – | పోటకాలు; | | సందిరావే | – | సందకాడ దేవతా |
| ముచ్చాపొద్దురావే | – | మూడేళ్లబండి; | | నిడదవోలు | – | నింగాలమ్మ |
| మాసర్లో సెల్లులా | – | మాసరమ్మ; | | మగద్దాలమ్మరావే | – | మాలచ్చిమ్మరావే |
| నాల్గుసేతులా గంగా | – | నల్లమాగంగా; | | ఎయ్యిసేతులాగంగా | – | ఏలమాగంగా |
| జమాను పందిరి | – | జాడౌకటుంది; | | సేతిలో | – | సెయ్యేసినట్టు |
| మాటలో | – | మాటకలిపినట్టు; | | | | |
| నీటిమీదతలవెంట్రుకలు | – | నిగనిగలాడుతున్నాయి | | | | |
| సిరసూడి | – | చేతిలోకొచ్చింది; | | బంగారు బనాదుప్పటి | – | బరిమీద పరిశాడు |
| లొట్టెలు | – | లోయలు; | | కత్తీబల్లతోడు | – | కాడుమీతోడు |
| భర్తలేకుండ | – | భాగ్గెంకలగాలి; | | | | |
| ముగ్గురు తిరుమూర్తుల్నికని | – | మూలనదులువుతాను | | | | |
| పురుసుడు పొందలేదు | – | పుణ్యముండునోలేదో; | | | | |
| కళ్లన | – | కలువరేకులు | | ఈవున | – | ఇంజామర; |

**సామెతలు :**

ఆంగ్లంలో 'proverb' సంస్కృతంలో 'లోకోక్తి' అనే పదాలకు సమానార్ధకంగా తెలుగులో 'సామెత' అనే పదం వ్యవహారంలో ఉన్నది. 'సామెత' అనే పదం 'సామ్యత' కు తద్భవమని డా. చిలుకూరి నారాయణ రావు గారి అభిప్రాయం[2]. ఏదైనా ఒక విషయం చెప్పేటప్పుడు పోలిక కోసం చెప్పే వాక్యం 'సామెత' అని స్థూలంగా చెప్పుకోవచ్చు. మానవుని విచక్షణాజ్ఞానాన్ని, అనుభవాన్ని ప్రతిబింబిస్తూ, ప్రజలలో బాగా ప్రచారమైన ఉన్నఉక్తి 'సామెత' గా రూపొందుతుందనవచ్చు. కల్పనాశక్తి అన్వేషణాశక్తి ఉన్న ప్రాచీన మానవుని నుంచే ఈ సామెతలు పుట్టాయనవచ్చును. నిత్యజీవితంలో కన్నవీ, విన్నవీ, అనుభవించినవీ అయిన వాస్తవాలే సామెతలు రూపంలో వెలువడతాయి. ఇవి ఆర్ధిక, సాంఘిక, మత, రాజకీయ విషయాల్లో మానవుని జీవితానుభవాల్ని వెలువరిస్తాయి.

తూర్పుగోదావరి జిల్లాలోని గ్రామ ప్రాంతాలలో వివిధ రకాల సామెతలతోపాటు గ్రామదేవతలకు సంబంధించిన సామెతలు కూడ ప్రచారంలో ఉన్నాయి. రెండు సమాన భాగాలుగా ఉంటూ, ప్రాసానుప్రాసలతో కూడి, లయతో, అల్పాక్షరాలలో అనల్పార్థాన్నిచ్చే ఈ సామెతల వల్ల గ్రామీణుల జీవితానుభవం, గ్రామదేవతల మనస్తత్వం, వారికి చెల్లించే మొక్కులు, బలులు, జాతరలో

కన్పించే ఆచారాలు, దేవతల జాతరలు జరిగే కాలంలో వాతావరణ పరిస్థితులు, మొదలైనవి విదితమవుతాయి.

**'అమ్మోరు మొక్కూ తీరింది - మొగుడు వాపూ తీరింది'**

ప్రతీ గ్రామంలోనూ ఏదో పేరుతో గ్రామదేవత ఉన్నప్పటికీ సాధారణ పరిభాషలో దేవతను 'అమ్మోరు' అని వ్యవహరిస్తారు. ప్రజలు అమ్మోరుకి రకరకాల మొక్కులు చెల్లిస్తారు. సాధారణంగా మొక్కులుగా కోడి, మేక, గొర్రె వంటి వాటిని మొక్కుతారు. మొక్కు తీర్చినపుడు ఆయా జీవులను అమ్మోరు గుడికి తీసుకెళ్ళి, మెడ కోసి, తలను అమ్మోరు గుడి కెదురుగా ఉన్న చెట్టుకి వ్రేలాడదీసి, మొండేన్ని ఇంటికి తెచ్చి, కమ్మగా వండి ఆరగిస్తారు. గ్రామ ప్రాంతంలో ఉండే పేదవారికి మాంసంతో విందు చేసుకోవడం సాధారణంగా జరిగే పనికాదు. కావున అమ్మోరికి మొక్కు తీర్చినపుడు, ఇటువంటి విందు భోజనం సాధారణంగా లభిస్తుంది. కావున పేద స్త్రీని దృష్టిలో పెట్టుకొని, అమ్మోరికి చెల్లించే మొక్కును ఆలంబనగా చేసుకొని పుట్టిన సామెత ఇది. మొక్కుతీర్చి అమ్మోరుని, విందుచేసి మగడిని తృప్తిపరిచిందనే అర్థంలో వాడతారు.

**'కమ్మోరున్న కాడకి అమ్మోరు కూడ చేరదు'**

కులపరంగా దేవతకు ముడిపెట్టబడిన సామెత యిది. ఈ జిల్లాలో సంఖ్యాపరంగా కాపులెక్కువ. సీతానగరం, పెద్దాపురం, సామర్లకోట, ఆలమూరు; కపిలేశ్వరపురం, రామచంద్రపురం మొదలైన కొన్ని మండలాల్లో తప్ప కమ్మ కులస్థులు ఎక్కువగా కన్పించరు. సంఘంలో కమ్మవారి కంటె కాపులు ఉదారస్వభావులనే అభిప్రాయముంది. తూర్పుగోదావరి జిల్లా ఎక్కువగా కాపుల ఆధిపత్యంలోనే ఉంది. సంఘపరమైన ఈ సంఘర్షణను దృష్టియందుంచుకొని, కమ్మవారున్నచోట ఇంకెవరూ ఉండలేరని, ఆఖరికి అమ్మోరు కూడ వారిదరి చేరదనే ఉద్దేశంతో ఈ సామెత ఏర్పడినదనవచ్చును. ఈ సామెత సంఘ పరిస్థితిని వ్యక్తం చేస్తుంది.

**'అమ్మోరు గుడికి మేకపోతును తోలినట్లు తోలుతున్నారు'.**

అమ్మోరుకి జాతర జరిగినపుడు సాధారణంగా మేకపోతును బలి ఇస్తారు. ఈ మేకపోతును డప్పువాద్యాలతో, గరగల నృత్యంతో జనసమూహంతో తీసుకెళతారు. డప్పు చప్పుళ్లకు బెదిరిన మేకపోతు గింజుకుంటుండగా దాని మెడలోని తాడుతో గట్టిగా లాగుతూ ఈడ్చుకెళతారు. సంఘంలో ఏదైనా పనిచేయటానికి ఇష్టంలేనివారితో బలవంతంగా ఆపని చేయించవలసినపుడు ఈ సామెతను ఉపయోగిస్తారు చిన్నపిల్లలు బడికెళ్లటానికి పేచీ పెడుతుంటే వారిని బలవంతంగా ఈడ్చుకొనివెళ్ళిబడిలో కూర్చోబెడతారు. ఇలాంటి సందర్భంలో ఈ సామెత ప్రయోగిస్తారు.

**'మొక్కితే దేవత - తన్నితే రాయి'**

దేవతకు గుడి, గుడిలో విగ్రహం సాధారణంగా ఉంటాయి. కొన్నిచోట్ల గుడి ఉన్నా, గుడిలో రాయి తప్ప విగ్రహం ఉండదు. గుడి కూడ లేకుండ చెట్టు కిందరాయినే అమ్మవారిగా భావించి పూజించడం కూడా కన్పిస్తుంది. అంటే 'రాయి' ప్రత్యేకమైన స్థానంలో ఉన్నప్పుడే దానికి గుర్తింపు, విలువ ఉన్నాయి. రోడ్డుమీద రోడ్డు ప్రక్కన రాయి ఉంటే కాలితో తన్నడమో, రాతిమీద నిలబడడమో చేస్తామే తప్ప ఆ రాయికి విలువిచ్చి, పూజించము. కావున ఏ వస్తువైనా ఉండవలసిన

స్థానంలో ఉన్నప్పుడే దానికి గుర్తింపూ, విలువ ఉంటాయని లేకుంటే వాటికి గుర్తింపు, విలువ ఉండవనే భావంలో ఈ సామెత ప్రయోగింపబడుతుంది. దేవతల స్వరూపాలుగా గ్రామీణులు రాళ్లను ఉపయోగిస్తారనేది ఈ సామెత వల్ల తెలుస్తున్నది.

**'నేరేళ్లమ్మా మాసకి నేల్లు ( అలు) సల్లబడతాయి'**

తూర్పుగోదావరి జిల్లాలోని గ్రామదేవతలలో నేరేళ్లమ్మ ఒకరు. ఈమె కథను సంబందిత ప్రకరణంలో వివరించియున్నాను. ఈమె సంబరంలేక జాతర ప్రతి సంవత్సరం వైశాఖబహుళ అమావాస్యకు ఈమె నిలిచిన గ్రామాల్లో చేస్తారు. వైశాఖబహుళ అమావాస్య సాధారణంగా మే నెల రెండవ పక్షంలో కాని లేక మే నెల చివరి వారంలోగాని వస్తుంది. ఒక్కొక్కసారి అంటే తెలుగు నెలల్లో అధికమాసం వస్తే జూన్ నెల మొదటివారంలో కూడ వస్తుంది. కాలమానాన్ని బట్టి అప్పటికే నైరుతి ఋతుపవనాలు ప్రవేశించవచ్చు. లేక వేసవికాలంలో అప్పుడప్పుడూ పడే వర్షాలవల్ల కూడా వాతావరణంలో కొంత మార్పు (చల్లదనం) వస్తుంది. ఈవిధంగా వాతావరణంలో కలిగిన మార్పును, గ్రామదేవత జాతరను దృష్టియందుంచుకొని గ్రామీణులు సృష్టించిన సామెత ఇది. ఈ సామెత వల్ల వాతావరణంలో కలిగే మార్పు స్పష్టమగుచున్నది.

**'పల్లాలమ్మ తీర్థానికవరగళ్లు పచ్చపడతాయి'**

ఇదికూడా వాతావరణ మార్పుకు, గ్రామదేవత సంబరానికి ముడిపెట్టబడిన సామెత. పల్లాలమ్మ తూర్పుగోదావరి జిల్లాలోని కోనసీమ ప్రజల ఆరాధ్యదైవం. ఈమె జాతర లేక తీర్థం కూడ వైశాఖబహుళ అమావాస్యకు చేస్తారు. ఈమె తీర్థం జరిగే నాటికే అప్పుడప్పుడు వర్షాలు పడిపంటభూములు పచ్చగడ్డితో పచ్చగా కన్పిస్తాయి. కావున ఈ సామెత వల్ల వాతావరణంలోనూ, తద్వారా వ్యవసాయ భూముల్లోను కలిగే మార్పు స్పష్టమగుచున్నది.

**'చలిని కొత్తమాసకి కొట్టి తగిలేస్తారు'**

ఈ సామెత కూడ వాతావరణంలోని మార్పును తెలియచేసేదే. ఫాల్గుణబహుళ అమావాస్యను ఈ జిల్లాలో (ఇరుగుపొరుగు జిల్లాలలో కూడ) కొత్తమాస(స్య) అంటారు. (ఈ అమావాస్య తరువాతే తెలుగు కొత్త సంవత్సరం వస్తుందనే ఉద్దేశంతో కావచ్చు). ఈ అమావాస్యకే జిల్లా అంతా నూకాలమ్మవారి పండుగ చేస్తారు. సాధారణంగా అమ్మవారి పండుగలన్నీ (కొన్ని తప్ప) అమావాస్యకే జరుగుతాయి. అయితే ఏ అమావాస్యకు ఏ దేవత పండుగ చేస్తారో ఆ అమావాస్యను ఆ దేవత పేరుతో పిలుస్తారు. చైత్రశుద్ధ అమావాస్యను ''గంధామాస్యనీ'' వైశాఖబహుళ అమావాస్యను ''నేరేళ్లమాస'' అనీ, జ్యేష్ఠబహుళ అమావాస్యను ''మరిడమ్మ మాస'' నీ పిలుస్తారు. కాని నూకాలమ్మ పండుగ చేసే పాల్గుణబహుళ అమావాస్యను 'నూకాలమ్మమాస' అని కాక 'కొత్తమాస' అంటారు.

ఆంగ్ల నెలలను బట్టి చూస్తే ఈ అమావాస్య మార్చి నెలలో సాధారణంగా వస్తుంది. (అధికమాసం వస్తే ఏప్రిల్‌లో కూడ రావచ్చు). అప్పటికి ఎండలు ప్రారంభమవ్వడం వల్ల చలి బాగా తగ్గుతుంది. ఈ కొత్తమావాస్య తరువాత ఇక చలి అసలు ఉండదు అనే భావాన్ని ఈ సామెత తెలియచేస్తుంది.

## 'ఊరోళ్ల పసుపు ఊరోళ్ల కుంకుమ ఊగే నూకాలమ్మా'

అమ్మవారి జాతర రోజు ప్రజలు పసుపు, కుంకుమ, నైవేద్యాలతో అమ్మవారి గుడికెళ్లి, వాటిని సమర్పిస్తారు. అంతేకాక జాతర రోజు అమ్మవారిని (గరగలను) ఊయల ఊపుతారు. సాధారణంగా సంఘంలో ఎటువంటి అలుపు సొలుపూ లేకుండా జీవితం సుఖమయంగా సాగేవారు కొందరే ఉంటారు. వారి కుండే పలుకుబడి కొద్దీ, అందరి సహాయసహకారాలు వారికి లభించి జీవితం సుఖమయంగా సాగిపోతుంది. అట్లాంటి వారిని చూస్తే, కొంతమందికి అసూయ కలుగుతుంది. జాతర రోజు పసుపుకుంకుమలు అర్పించి, దేవతను ఊయల ఊపినట్టే (సుఖపెట్టినట్టే), వీరికి కూడ అన్ని విధాల సహాయసహకారాలంది సుఖిస్తున్నారనే భావంతో అసూయ చెందిన వ్యక్తులు ఇట్టి వారిని చూసి, దేవతను ఆలంబనగా చేసుకొని పలికే సామెత ఇది. ఈ సామెత వల్ల అమ్మవారి జాతరలో జరిగే ఆచారవ్యవహారాలు స్పష్టమగుచున్నవి. ఈ జిల్లాలోని చాలా గ్రామాల్లో నూకాలమ్మ గ్రామదేవత అవ్వటంవల్ల, ఊయల ఊపటం వంటి ఆచారాలు ఈమె జాతరలోనే ఎక్కువగా ఆచరింపబడటం వల్ల, ఈ సామెత ఈమె పేరుమీదే ప్రచారంలో ఉన్నది.

## 'నూరు మందితో తిరిగిన నూకాలమ్మా నీకెవడెట్టాడే బాకాలజోడు'

నూకాలమ్మ దేవత అంటువ్యాధులకు అధిదేవత కావటం వల్ల తూర్పుగోదావరి జిల్లాలోని ప్రజలందరూ ఈమె అంటే ఎక్కువ భయభక్తులు ప్రదర్శిస్తారు. ఆమె అంటే ఉండే భయం కొద్దీ ఎక్కువ మొక్కులు కూడా చెల్లిస్తారు. అదే విధంగా సంఘంలో కొంతమంది స్త్రీలు సిగ్గువిడిచి, ఎక్కువగా వ్యభిచరిస్తారు. ఎక్కువమంది విటులను కలిగి ఉంటారు. వారు ఒసగే కానుకలతోను, ఇచ్చే డబ్బుతోను విలాసవంతంగా జీవిస్తారు. వస్త్రధారణలోను, తదితర వస్తుధారణలోను ప్రత్యేకతతో కన్పిస్తారు. మిక్కిలి గడుసరులయితే తప్ప, ఆ విధంగా వ్యవహరించలేరు. అటువంటివారిని దృష్టియందుంచుకొని, దేవతను ఆలంబనగా చేసుకొని పుట్టిన సామెత ఇది. ఈ సామెతలో 'బాకాలజోడు' అనే పదం 'నూకాలమ్మ' అనే పదంతో ప్రాసను దృష్టియందుంచుకొని ప్రయోగింపబడిందనవచ్చును. ఈ సామెతవల్ల నూకాలమ్మ వారికి లభించే మొక్కుల భారీతనం, తద్వారా ఆమె విశిష్టత, ఈ సామెతను ఏ వ్యక్తిని దృష్టియందుంచుకొని ప్రయోగించారో, ఆ వ్యక్తి యొక్క ప్రతిష్ఠ వ్యక్తమవుతున్నాయి.

## 'నూకాలమ్మ గుడికాడ కెళ్లడం' (మరణించడం)

ఈ పదాన్ని ఎక్కువగా నా స్వగ్రామమైన లింగంపర్తి గ్రామం (ఏలేశ్వరం మండలం)లో ప్రయోగిస్తారు. మా గ్రామంలో నూకాలమ్మ గ్రామదేవత. ఈమె గుడి ఊరి చివరి స్మశానానికి దగ్గరలో ఉన్నది. మరణించిన వ్యక్తులను స్మశానానికి తీసుకెళతారు. ఎవరైనా పొరపాటుగా ప్రవర్తిస్తే వాళ్లకి బుద్ధిలేదని చస్తే తప్ప బుద్ధిరాదనే ఉద్దేశ్యముతో 'నూకాలమ్మ గుడికాడ కెళ్లిన్నాడే నీకు బుద్దొస్తుంది' (చచ్చిన్నాడే బుద్దొస్తాది) అని తిడతారు. అంటే ఇక్కడ నూకాలమ్మ గుడికాడ కెళ్లడమంటే మరణించడమని అర్థం.

## 'మరిణమ్మ మింగ' లేక 'మరిణమ్మ మింగినదానా'

గ్రామీణులలో కొందరు దుడుకు స్వభావులు ఉంటారు. వారు తమ పిల్లలు, మొదలైనవారిని

నోటికొచ్చినట్లు తిడతారు. చీటికి మాటికి 'చావు' మొదలైన అపశకునం మాటలు పలుకుతారు. మరిణమ్మ అంటే మరణాన్ని కలిగించే దేవతే మారిణమ్మ, మరిణమ్మగా మారి మరిడమ్మగా కూడా వ్యవహరింపబడుతుంది. అంటే తీవ్రమైన అంటువ్యాధులు కలిగించి, మరణాలు కలుగచేసే దేవతగా మరిణమ్మ ప్రసిద్ధికెక్కింది. కావున ఎవరైనా గ్రామీణులు తమ పిల్లలను తిట్టవలసి వచ్చినపుడు చచ్చినదా! చచ్చినాడో!' అని తిట్టడానికి బదులు 'నిన్ను మరిణమ్మ మింగా' మరిణమ్మ మింగినదానా 'మరిణమ్మ మింగినోడా! ' అని తిడతారు. ఈ విధంగా ఈ తిట్టులో మరణాన్ని కలిగించే దేవత మరిణమ్మ' అని, ఆమె స్వభావం వ్యక్తమగుచున్నది.

## నోరుమూలిన నూకాలమ్మలాగ మాట్లాడాడు'

నూకాలమ్మ దేవత ( ఇంకా ఏ దేవత అయినా కూడ) గుడిలో విగ్రహరూపంలో ఉండడమే కప్పు, మాట్లాడదు. ఈ విషయం అందరికీ తెలిసిందే. కాని విగ్రహం మాత్రం చాలా గొప్పగా, మూడముచ్చటగా, ఆకర్షణీయంగా, గంభీరంగా ఉంటుంది. సంఘంలో కొంతమంది సన్నగా, బలహీనంగా ఉన్నా వ్యవహారాలలో గట్టిగా వ్యవహరిస్తూ మాట్లాడతారు. కొందరు లావుగా, బలంగా ఉన్నావ్యవహారంలో మాత్రంమెతకగా ఉంటూ, గట్టిగా మాట్లాడరు. తమకంటె బలహీనంగా ఉండి, పెంకితనంగా ఉన్నవారిచేత ఇలాంటి వారు బూకరింపబడతారు. ఇలాంటివారిని 'నోరుమూలిన నూకాలమ్మలాగ మాట్లాడడు' అని విమర్శిస్తారు.

## 'పంబలవాడు వస్తే కాని అంబ పలకదు'

గ్రామదేవత లేక ఇంటిదేవత సంబరం చేయిస్తూ, ఆయాదేవతల కథలు పంబనాదం వాయిస్తూ పాడేవారు పంబలవారు. ( వీరినిగురించి సంబంధిత ప్రకరణ లో వివరించాము. ) దేవతల సంబరంలో వీరి పాత్ర ప్రధాన మైనది. అమ్మవారిని మేలుకొలపడం, నివాళి అర్పించడం, దేవతకు కావలసిన కోర్కెలు అడగటం, దేవతను సమాధాన పరచి శాంతింప చేయడం. పంబల వాని పని. 'కావుననే పంబల వాడి వస్తే కానీ అంబ పలకదు ' అనే సామెత ఏర్పడి ఉంటుంది. ఈ సామెతవల్ల పంబలవారికి గ్రామదేవతకూ ఉన్న సంబంధం తెలుస్తుంది.

## తిండికి తిమ్మరాజు పనికి పోతురాజు

పోతురాజు గ్రామ దేవత లందరికీ ఏకైక తమ్ముడు. దేవత గుడి కెదురుగా ఉన్న రాయి లేదా కొయ్య లేక చెట్టు నే పోతురాజు గా వ్యవహరిస్తారు. 'తిమ్మరాజు' అనేపేరుతో ఏలేశ్వరానికి సమీపంలో ఒక చెరువు ఉంది. ఆచెరువు చాలా పెద్దది. ఆచెరువు వల్ల ఏలేశ్వరం, లింగపర్తి వంటి పది గ్రామాలకు పంటలు పండుతాయి. కావున పంటలు పండితేగాని తిండి దొరకదు. పంటలు పండటానికి సహాయపడి తిండి పెట్టేవాడు తిమ్మరాజు. అమ్మవారి గుడి ముందు పనిలేకుండా ఏపనీ చేయకుండా కూర్చొనేవాడు పోతురాజు. సంఘంలో కొందరు తిని తిరుగుతూ, ఎలాంటి పనీచేయరు. వారిని దృష్టిలోనుంచుకొని అమ్మవారి తమ్ముడు పోతురాజు పేరుమీద ఈ సామెత వచ్చింది.

ఈవిధంగా గ్రామదేవతా సాహిత్యంలో కేవలం గ్రామదేవతలకు సంభంధించిన సామెతలే కాక, కథా సందర్భశాన అందు లోచోటుచేసుకొన్న ఆమెతలు కూడాం ఎన్నో ఉన్నాయి. వాటిలో కొన్ని.

'మూడు కాళ్ళ మొక్కల పీట - మూలకొస్తే మూర్తం ఆగాలి.'

'ఆడ వారికి - ఆడవారు సాయం'

'పెద్దల మాత్తిం(మహత్యం) - పేరంటాల మాత్తిం(మహత్యం)'

'ఏసిన ఒత్తుకి - పోసిన సమురుకి సరిపోతుంది'

'పెద్దవారు చెప్పిన మాట - పెరుగు బువ్వ మూట'

'గద్దో(లదో) లేదో - గ్రామానికి కరణం పెద్దన్నారు'

'చింత చచ్చినా - చింత పులుపు చావలేదు.'

'రచ్చించినవాణ్ణి - బచ్చించమని శాస్త్రం ఉంది'

'అట్టుకీ చెడ్డాది - ముక్కకీ చెడ్డాది'

'పసిబిడ్డలేని ఇళ్ళు - పాడడ్డ గుళ్ళు'

'పప్పన్నమంటే - పది ఆమడల దూరమెళ్ళమని'

'కనాపెంచని బాల - కాళ్ళ కాడ దొరికావని.'

'ఆడవాళ్ళు బొంకితే గోడకట్టినట్టు- మగవాళ్ళు బొంకితే దడికట్టి నట్టు'

మడిలోపడ్డ నీరు పోతుందా- ఒంటి మీద పడ్డ దెబ్బ పోతుందా

ఆడబాల పుట్టినప్పుడు - సగంబరి తగ్గమని

రోటిలో తలదూర్చి - రోకటి పోటు పడదా అంటే

బేమ్మడో - బెమెత్తు అన్నారు

పిల్లిత్తో - బెమ్మత్తు అన్నారు

**అన్య దేశ్యములు :** ఒక భాషలోని పదజాలాన్ని దేశ్యములు, అన్యదేశ్యములు అని రెండు గా విభజింప వచ్చును. మూల భాష నుండి నిసర్గంగా లేక పైతృకంగా సంక్ర మించినవి దేశ్యములు, తదితరాలు అన్యదేశ్యములు. అంటే ఆయా భాషల చారిత్రక వికాస దశలో 1. సమీప వర్తి సజాతీయ బాషలనుంచి గాని, 2. పరిసర విజాతీయ భాషలనుంచి గానీ 3. మత సాంఘిక, వాణిజ్య, రాజకీయ సాంస్కృతికాది సంబంధాల మూలంగాదూరవర్తి భాషలనుంచి గాని-ప్రత్యక్షంగాగాని పరోక్షంగాగాని వచ్చిచేరిన పదాలు అన్యదేశ్యాలు. ఇలాంటి అన్య దేశ్యాలు తెలుగుభాషలో చాలా ఉన్నాయి. గ్రామదేవతల సాహిత్యంలో కూడా మచ్చుకు ఇవి కొన్ని కనిపిస్తాయి.

ఆరమణి (హార్మోనియం)

జన్సన్ (జంక్షన్)

రోడ్డురు (రోడ్డు)

ఇంజిరం (ఇంజన్)

జీరి జిల్తారి, ఖర్చు (పర్షియన్); డేరాలు, మేజువాణీ, మామూలు(ఉర్దూ) దరవాజు, రవాణా, దండీలు, నామోషీ లడాకా, వరాహా, ఖరీదు (ఉర్దూ) సొమ్ములు, కుర్చీ, మేజారు, టముకు, రివాజు, బెత్తుం, మైజారు, మహలు(పర్షియన్) త్రాసు (ఉర్దూ)

**పదారోపములు :** ఇది భాషయందు కలుగు మరియొక మార్పు. ఒక పదమునకు ఒక రూపము స్థిరమై యుండగా దాని స్థానమున మార్పు కోరు వారికి సుబోధక మగునట్లుగా మరియొక రూపము యొక్క సామ్యము వలన క్రొత్త రూపము ప్రాచుర్యము లోనికి వచ్చు పద్ధతే పదారోపము.(Meta Analysis) ఒక్కొక్కసారి సాధారణ పదస్వరూపమునకు భిన్నంగా అలంకారికంగానో, సమాసరూపాన్నో కొన్నిపదాలు నిర్మితాలై భాషయందు ప్రవేశిస్తాయి. నిర్మాణంలో సూత్రబద్ధత ఉన్నప్పటికీ సామాన్యజన వ్యవహారంలో అవి ఇమడక, సామ్యం కల పదములు – వాని స్థానంలో పడతాయి. ఈమార్పు నాగరికభాషయందు కంటె జానపద భాషయందు ఎక్కువగా కన్పిస్తుంది.

ఉదా : సురాపనం – సురేపానకం: ముక్కాలిపీట – మొక్కలపీట; వింజామర – వింజామణి; పంచభూతాలు – పంచభూతద్దాలు; నాగస్వరాలు – నారసపాకాయలు; రుద్రభూమి – రుద్రాచ్ఛభూమి;

పై ఉదాహరణలలో వరుసగా పానం, ముక్కాలి, మర, భూత, నాగవంటివి జానపదునకు పరిచితాలైన భాగాలుగా మారి ఇంజామణి, సురేపానకం, మొదలైన కొత్తరూపాలేర్పడడానికి వీలు కలిగింది. ఈవిధంగా రూపనిర్మితి జరుగుపద్ధతి 'పదారోపము'.

**కృత్తద్ధిత ప్రత్యయములతో గూడిన కొత్త రూపముల ప్రయోగము :** పుట్టుదల - పుట్టుక; రాకట – వచ్చుట; పోకట – పోవుట; మెరిగించు – మెరుగుపెట్టుట

దల, ఇంచుక్ వంటివి వ్యాకరణములో పేర్కొనిన ప్రత్యయములే అయినప్పటికీ పైన పేర్కొన్న ధాతవుల సంయోగం మాత్రం కొత్త.

**వ్యాకరణ విరుద్ధమైన సమాస ప్రయోగం :** 'దివాఖర్చు' దినభత్యం అనే అర్థంలో ఈపదం వాడబడింది. 'దివా' అంటే దినం. 'ఖర్చు' అంటే భత్యం. ఈ రెండు భిన్నభాషాపదాలు. వీటి కలయికవల్ల ఏర్పడిన సమాసం దుష్టసమాసం. ఇది వ్యాకరణ విరుద్ధమైనది. ఇలాంటి పదాల ప్రయోగం కూడ గ్రామదేవతల సాహిత్యంలో కనపడుతుంది.

నగలు, చీరలు, వ్యాధులు, మొదలైన పేర్లుంచుట యందు, అట్టి పేర్లలో వైవిధ్యం చూపి, కల్పనారమ్యంగా వానిని తీర్చిదిద్దుట యందు జానపదుని బుద్ధిమిక్కిలి చాతుర్యాన్ని వెలయిస్తుంది. ఇలాంటి పదజాలమే జానపదుని భాషనుసంపన్నమై, విశిష్టంగా శోభించుటకు కారణమగుచున్నది.

**వ్యాధి విశేషాలు :** కుక్కురు తెగులు – కోడి; దొమ్మసంకటాలు – గొడ్లు; ఏనుగ్గజ్జి - ఏనుగు; గుండుసూల – గుల్లం

**నగలు :** కుత్తుగంటి (మెడహారం); ఈరమానిక్యాలు (గాజువిశేషం); నల్లపోగుటద్దాలు (గాజు విశేషం)

**వస్త్రము :** కనకపురి చీర; దొంతాప్పు రవిక; మడతపంచె

**ప్రత్యేకపద ప్రయోగాలు :** జానపదులు తమ భాషలో పదసృష్టి ఎక్కువగా చేస్తారు. ముఖ్యంగా వారి పదాలు ఎదుటివారికి అర్థమవ్వాలనే ఉద్దేశంతో వారు ప్రయోగించే పదానికి ముందు కొన్ని విశేషణాలు చేరుస్తారు. ఆ విశేషణం వల్ల వినేవారికి ఆ పదం సుబోధకమవుతుందని వారి ఉద్దేశం కావచ్చు.

ఉదా : ఫలములకు ముందు 'బా'ల అనే పదాన్ని చేరుస్తారు. ఆ ఫలములు తింటే బాలలు పుడతారని జానపదుల ఉద్దేశము.

ఉదా : బాలమామిడి పళ్లు; బాలనేరేడు పళ్లు

మేడలకు, మోడులకు ముందు 'గాలి' చేరుస్తారు.

ఉదా : గాలిమేడ, గాలిమోడు

గాలిమేడ అంటే చల్లటి గాలికోసం ఎక్కే మేడ

గాలిమోడు అంటే గాలికి విరిగేలా ఉన్నమోడు

'బీదుగురాలు' అనే పదానికి ముందు 'అన' 'కుల' అనే పదాలు చేర్చి పలుకుతారు.

అనబీదుగురాలు అంటే అన్నంలేనిది, పేదరాలు

కులబీదుగురాలు అంటే కులం తక్కువ స్త్రీ

అలాంటివే మరికొన్ని :

తాళాలు - సికేతాళాలు; కొంగలబారు - సాతికొంగలబారు

కాటుకలు - కొబరకాటుకలు; సంద్రము - ఇలపాలసంద్రము

బాయి(వి) - ఇలపాలబాయి(వి) తురకలు - అరక తురకలు

శివరాత్రి - చెడువాశివరాత్రి; తూగుటుయ్యాల - ఇలతూగుటయ్యాల

గోదావరి - ఇట్టుగోదావరి; దూదివరువులు - ఇలదూదివరువులు

పీత - మండపీత; మంత్రించి - క్షైమంత్రించి

ఈబూది - కంచికళంయిబూది; శనివారం - ఉదయశనివారం

కన్నవారు - ఇన్నకన్నవారు; కాపాలా - గడికాపలా

తాడు - వాయుతాడు; పకీరు - దేశపకీరు

గోసి - పట్టిగోసి; బడి - చదువుల బడి

పరశురాముడు - ఇలపరశురాముడు; రంకెలు - గడియరంకెలు

ముద్ద - మూనాలముద్ద గాసాలు - అనాగాసాలు

గడియలు - నవాగడియలు

**అనుప్రాస ప్రయోగాలు**: జానపదులు తమ భాషలో 'అనుప్రాస'ను ఎక్కువగా ఉపయోగిస్తారు. ఈ అనుప్రాస ప్రయోగాలకు కొన్నిచోట్ల అర్థముండవచ్చు. మరికొన్ని చోట్ల అర్థం లేకున్నా అవసరంలేకున్నా ఊతపదాలుగా ప్రయోగిస్తారు. అటువంటి ప్రయోగాలు మచ్చుకు కొన్ని :

## అర్థవంతంగా ప్రయోగించేవి :

కిట్టగోదారిలోకి – నిట్టదొక్కేసింది; ఒళ్ళెల్లమెత్తకుండ – మల్లెలపాన్పు

కుల్లుముండా – నీకుకల్లుకావాలా; కొడతానన్నా భయంలేదు – తిడతానన్నా బాధలేదు

కొట్టేదాతలెవరో – పెట్టేదా[illegible]; దుబ్బుకాడ – దబ్బునపడిపోయింది

మేసే జీనాలు – కూసే జీవాలు; [illegible]ప్పున ఊది – గప్పున మంటెయ్యవోయి

వినవములు (చెవులు) – కనవనములు (కళ్ళు); మితిలేక – గతిలేక

గుర్రున మింగింది – గర్రున తేన్పింది; గభీల్ని మింగేసి – గుభేల్ని ఉరికేసింది

అరిదేశాలు – పరిదేశాలు; ఓంకారంలో – అంకారముతో పుట్టింది

ఎల్లతోవలేకాని – మల్లతోవలు లేవు; గంకోయి నాసంయితి – బొంకనేర్పింది

కలిమి – బలిమి; దోసంబులేదు – మీసంబులేదు

మేపులు సందుని – కాపులు మరిచాయి; ఎల్లమూ – ఇల్లాలు

కరిగించి – మెరిగించి; ఇన్నూరు – మున్నూరు

లగువులూ – బిగువులూ; అంటలేదు – ముంటలేదు

ఒప్పుకుంటాడో – తప్పుకుంటాడో; ఏనుగులాంటోళ్లను – ఎళ్లగొట్టాను

గుఱ్ఱాలాంటోళ్లను – కూలగొట్టాను; అరిసేటి గొర్రెలు – మెరిసేటికత్తులు

ఊగుతూ – శోగుతూ

## ప్రత్యేకంగా అర్థంలేకున్నా ఊతపదాలుగా వాడే అనుప్రాస ప్రయోగాలు :

అల్లేరు – హొల్లేరు; అబిల – గుబిల; మద్దిలం – దద్దిలం

ఇరమటి – పరమటి; గడికో – గుడికో; ఆర్బి – పార్బి

ఆజ్య – పాజ్య; అచ్చాకు – బుచ్చాకు; జడవకుండ – పిడవకుండ

సింకో – బొంకో; కంగాల – మింగాల; ఆరికాసి – పూరకాసి

కుల్లై – కుతాబై; గౌతువా – గామియా; నగా – నట్రా

నూకలు – గీకలు; కావిణీ – కట్టుబోతు; అంబారి – కుంబాల

లొట్టెలు - లోయలూ; గాలిదేవుడా - మాలిదేవుడా ఆకులు - అలములూ

**నుడులు :** గ్రామీణులు తమ బాషలో సందర్భాన్నిబట్టి నూతన పదప్రయోగాలు చేస్తారు. వాటిని ఆ సందర్భాని కనుగుణంగా అర్థం చేసుకోవాలే తప్ప, వేరే సందర్భంలో వాటికి అర్థాలు చెప్పలేము. నిఘంటువుల కెక్కనివి యివి. అలాంటివి గ్రామదేవత సంబంధిత సాహిత్యంలో చాలా ఉన్నాయి. డా. రఘుమారెడ్డిగారు చెప్పినట్లుగా 'పల్లెపదాల్లో నుడులు కూడా ఒక ప్రత్యేకమైన సొంపు. నుడులు విన్నప్పుడు అవి శబ్దార్థాలకన్నా విలక్షణమైన విషయానికి, భావనకీ ప్రాధాన్యం ఇచ్చినట్లుగా కనపడతాయి'[3]. మచ్చుకు కొన్ని :

పచ్చని పాత; ఏల్లమంతుడు; దిగనాడు; తమాయించుకొను;

ఇదలకించు; గాలించు; కొట్టుమిట్టాడిపోవు; ఏబలెంపకాయ

చెల్లిపోవు; ఏగించిపోవు; కడియుపదును; ఏబలెంపకాయ

గవ్వమయ్యాడు; పడగదప్పు; అత్తానిసెమట; కెవ్వురెల్లు

ఆవుజావులు; దివించి దివిసెలవులు; పతిబాగ్గెం; కలిగ్గుం

కలువు టెల్లు; ఏగిరెల్లిపోవు; ఇన్నకన్నవారు; చెంగుపరచడం

దీవనార్థం; చిక్కాపుకర్ర; కంగాలమింగాలచుట్టుకొను;

చెళ్ల చెళ్ల నీరు చెండుకొను

కాలిదూళిలో కలువు; తార్పుగుల్ల - రసాకారం

కడచెంగుమాసింది; పంచంటి రూపులు; గోడుగోడుమని - గోటాపన

## గ్రామీణుల వాడుకలోనున్న పదజాలం :

నిఘంటువుల ద్వారా అర్థం తెలుసుకోలేని పదాలను గ్రామీణులు సృష్టిస్తారని చెప్పుకున్నాం అవి వారి వారి సంభాషణలలో ఆయా సందర్భాలలో వాళ్లలో వాళ్లకు అర్థం కావాలేతప్ప, విద్యావంతులమైన మనము కూడ అర్థం చేసుకోవడం కష్టమే. అలాంటి పదాలు గ్రామదేవతల సంబంధి సాహిత్యంలో చాలా ఉన్నాయి. వాటి అర్థాలను ఇక్కడ వివరిస్తాను. వీటిలో కొన్ని నిఘంటువుల కెక్కి ఉండవచ్చును.

**అ**

అంకాఅంకని - సాధ్యాసాధ్యమైన; అంకించుకొని - దొరికించుకొని

అంగవ్రం - మొలగుడ్డ; అంగమొలతో - వివస్త్రంగా

అందుస్తు - అందం; అందాదుకోమావే - అందదు లేక చాలదు

అగళమైన - అఖండమైన, అధికమైన; అచ్చటముచ్చట

ముద్దుముచ్చట్లు లేక సంతోషసరదాలు; అచ్చాకు బుచ్చాకు - ఆకుకూర; అడ్డసాల - గుజ్జాలసాల

అడ్డాళ్ల - ఒడి; అడియా - ఐడియా (ఉపాయం)

అడుసుగుంటా - కొంచెం దూరంగా; అతమార్చి - చంపి

అద్దడుగుట - బాగుగా అడుగుట; అనబీదుగురాలు - అన్నానికి పేదది

అనబగించు (అనుభవించు) - తినుట; అనిమనో సనిమనో - ఏదోవిధంగా

అనుగ్రుం - అనుగ్రహం; అనుపానం - ద్రవంతో కలుపుకోవటం; అరప - ఆటక; అరంజాం - అరణ్యం

అర్దాకుర్దలం - చాలీచాలక పోవడం; అరిదేశులు పరిదేశులు - బిచ్చగాళ్ల

అల్లల్లాడుట ఎక్కువగా బాధపడుట; అవురోదుపచ్చి - అమాయకుడు లేక అమాయకురాలు

అవుతారం పుటమార్చి - మారువేషం కట్టి; అశం - గుజ్జుం; అస్త - అత్త; అషిం - గుజ్జుం

ఆ

ఆంకరించుకొనుట - అలంకరించుకొనుట; ఆంకారం - అహంకారం

ఆకరు - ఆకారం; ఆకలితో అల్లాడిపోవుట - ఆకలితో బాధపడుట

ఆకళింపవుట - అర్థమగుట లేక తెలియుట; ఆకు - హృదయం

ఆఖరుచేయుట - పోగొట్టుట లేక లేకుండా చేయుట; ఆగడ బాగడ - హడివిడిగా, కంగారుగా

ఆచ్చిరిపోయారు - ఆశ్చర్యం చెందారు; ఆడకూతురు - శక్తిదేవత

ఆదరించుకొనుట - అలంకరించుకొనుట; ఆదరవ - ఆధారము

ఆద్దాలు - ఆయుధాలు; ఆదిభూలోక రంభ - త్రిమూర్తులను, సర్వ సృష్టిని గావించిన ఆదిశక్తి

ఆనవాలు - గుర్తు; ఆపశోపాలు - శారీరకబాధలు

ఆమిదాలు - సోమిదాలు - వనం; ఆరంజ్యోతి - అరుంధతీ నక్షత్రం

ఆరండం - కష్టం; ఆరగళ్ల పారగళ్లచేయుట - గందరగోళం చేయుట

ఆరళ్లమారి - బాధలు పెట్టే స్త్రీ; ఆరబం - ఆహారం

ఆరికి - వారికి; ఆర్డికం - ఆదేశం లేక అనుమతి

ఆరుద్రమైన - అధికమైన; ఆలలెత్తి - గొంతెత్తి

ఆలజోలుగా ఉండడం - నలతగా ఉండడం; ఆవుసులు - ఆయువులు

ఆసనాలు ఆడుకొనుట - మాట్లాడుకొనుట; ఆస్తం - ఆత్మ

ఆస్తిపాస్తి బండలగుట - నిలువునా బండలగుట

## ఇ

ఇంజరం – ఇంజను; ఇగ్నుం – విగ్రహం

ఇట్టుతావోదులు – ఒక రకమైన వృక్షసంబంధమైన తీగలు; ఇడస పెట్టుట – విడిచిపెట్టుట

ఇడియుం – విడియుం; ఇదలకించుట – విసిరివేయుట

ఇదియించి – ఉదయించి; ఇన్న కన్నవారు – సంతతిలేక పిల్లలు

ఇన్నూరు (ఇరు + నూరు) – రెండువందలు; ఇన్నోముడిగుడి – నాగేంద్రుని గుడి

ఇబదుఃఖం – యమదుఃఖం; ఇమాలయపరతం – హిమాలయపర్వతం

ఇరమటంటే పరమటి – మాటకు మాట సమాధానం చెప్పడం; ఇరెసి – తలవిప్పి

ఇరేసనాలు – విరేచనాలు; ఇలవ – విలువ; ఇలపరశురాముడు – పరశురాముడు;

ఇలపాలసముద్రం – పాలసముద్రం; ఇలపాలబాయి – బావి;

ఇల్లడపెట్టుట – అప్పగించుట; ఇసగుంటా – ఇటువైపుకి, దగ్గరంగా; ఇష్టు – ఏష్టను

## ఈ

ఈతముజ్జు – ఈతమాను; ఈన్నుం – మురికి లేక దారిద్ర్యం

ఈరకంకణం – వీరకంకణం; ఈసరాపరుడు – ఈశ్వరుడు; ఈసరుడు – ఈశ్వరుడు;

## ఉ

ఉంకేలబద్ద – పిట్టలను కొట్టడానికుపయోగించే వెదురుబద్ద; ఉగము – యుగము

ఉగ్గోళ్లపుట్ట – ఎక్కువకోమలు (కలుగులు) గల పుట్ట; ఉత్తరాసి – ఉత్తరాది

ఉదయుశనివారం – శనివారం ఉదయం; ఉద్దోయి – వదులుకోవడం

ఉన్నపళంగా – ఉన్నవిధంగా, వెనువెంటనే; ఉప్పుపాలు – ఆహారం

ఉరలమరలబెట్టి – మందుపెట్టి మనసు మార్చడం; ఉల్లింక బల్లింక – పిట్టలుండేచోటు

## ఊ

ఊడగుల్ల – చేపను మింగే పెద్దచేప

## ఎ

ఎంటుక – వెంట్రుక; ఎండకు ఏడుగడియల పొద్దు – సూర్యోదయానికి ముందు

ఎండుబెత్తుం – వెండిబెత్తం; ఎంబడించుట – వెనుకనే వెళ్లుట

ఎకసక్కాలు – వేళాకోళములు; ఎగ్గులు తగ్గులు – ఎక్కువతక్కువలు

ఎచ్చెల్లు – పెంపగు, అధికమగు; ఎత్తుకొనివుండు – నిలువునా వుండు

ఎదురగాళ్లనుపుట్టుట - కాళ్ల ముందు, తలవెనుకగా ప్రసవమగుట; ఎనకపేటిని – వెనుకవైపున

ఎమ్మటే – వెంటనే, వెనుకనే; ఎరిణమ్మ – కుక్క

ఎరువు – చిన్న చిన్న పేడుక ముక్కలు; ఎరువుచేసెయ్యడం – చిందరవందర చేయడం

ఎల్లరౌతు – తెల్లగుఱ్ఱం; ఎల్లాకు – వేపాకు

ఎల్లాశం – తెల్లగుఱ్ఱం; ఎలేనుగు – తెల్లఏనుగు; ఐరావతం

## ఏ

ఏకస్తురాలు – యౌవనస్థురాలు, ఇతరులను అంటకుండా ఒంటరిగా ఉండేస్త్రీ;

ఏగన్నుడు – దేవుడు, వేయికన్నులు కలవాడు

ఏగించిపోవుట – భరించరాని బాధలతో మరణించుట; ఏగిరెల్లిపోవుట – ఎక్కువగా ఆరాటపడుట

ఏగులం – దుమ్ము; ఏగ్గం – శపథం, మొక్కు

ఏగ్రుంగా – వేగంగా; ఏడంతరాలు – ఏడంతస్తులు

ఏడుగూాబల ఎనుబోతు – కోడిపుంజు; ఏదవుస్తకాలు – వేదములు

ఏదువు – ఒక కొలమానం (20 కుంచాలు); ఏబులుం – తులామానం (350 గ్రాములు)

ఏరుపిడకలు – పొలాల్లో ఏరుకొనితెచ్చే పిడకలు; ఏలమంతుడు – బుద్ధిమంతుడు

ఏలనెత్తిని – పెద్దగా నోరుపెట్టి; ఏలేయుట వ్రేలాడదీయుట

ఏసుకుం – వేషం;

## ఐ

ఐరాగులు – బిచ్చగాండ్రు;

## ఒ

ఒంగుబల్ల – గౌడువ్యక్తి కల్లుగీసేటపుడు ఉపయోగించు చెక్కబల్ల; ఒడ్డాబాయ – ఒడ్డుఉండే బావి, చెరువు

ఒడికాళ్ళు – వంపెట్టిన కాళ్లు; ఒడిగడియులులేక – ఒంటరిగా వెళ్లలేక

ఒడిమేసి ఒడిమేసి – గట్టిగా నలిపి; ఒడిరెక్కలు – వంపెట్టిన రెక్కలు

ఒత్తుగెళ్లుట – ఒక వైపుకు తిరుగుట, పక్కకు తప్పుకొనుట; ఒల్లలేక – ఆగలేక, తట్టుకోలేక

## ఓ

ఓనానిగోర్లు – వంపుగా ఉన్న చేతిగోర్లు; ఓవులు – వైపులు

ఓరగాయుట – తప్పు క్షమించుట; ఓరముసుగులు – పర మగవారికి కన్పించకుండుట

ఓరి పోయుట – వాసనకట్టుట; ఓలిగురుసులు – చిన్నగుడిసెలు

**క**

కండలు – పిండములు; కంగాలమింగాల చుట్టుకొని – తొందర తొందరగా చీర కట్టుకొని

కట్టుబోతులు – క్షుద్రవిద్య లెరిగినవారు; కడచెంగుమాయుట – గర్భవతగుట

కడియపదును – సరిపడునంతతేమ, దున్నుటకు చాలినంత తేమ; కడిమేరు – కడిమిచెట్టువేరు

కడుపార – కడుపునిండుగ; కడుపుకాలుట – కడుపున పుట్టినవారు మరణించుట

కడుపు కరుగుట – జాలికలుగుట; కదంబం – కారణం

కననములు – కళ్లు; కనకపురి చీర – వస్త్రవిశేషం

కనికారములు – కనికరములు; కమటం – కంసాలివాని కుంపటి

కలంపర – చెడు జరుగుట; కలవరించుట – తలచుకొనుట, పైకి స్మరించుట

కలామిల – కష్టకాలం లేకఅసాధారణ పరిస్థితి; కగ్గ – కలియుగం, సర్వసృష్టి

కలిదాపరం – లోకం, ప్రపంచం; కలిగంపలు – కలిసిపోవడం

కాండవ – దిక్కు; కాటుమియ్య – గౌడకులస్తుల దేవుడు

కానివాడు – చెడ్డవాడు; కాయపరచుకొనుట – స్థిరపరచుకొనుట, నిర్ణయించుకొనుట

కాయపుండలు – పంబలవారు పిల్లలు కల్గడానికిచ్చే మందు; కాయపత్రములు – ఒంటిమీదున్నబట్టలు

కాయగుట – విఫలయత్నము; కారుకోటి ఇసములు – కాలకూట విషములు

కారువాతొక్కుట – నాట్యం చేయుట; కాలం చేయుట – మరణించుట

కాలుతొక్కికన్యాదాన మివ్వడం – పెండ్లివ్వడం; కాలుధూళితో కలుపుట – నాశనం చేయుట

కాలుముడుచుకొనుట – మూత్రవిసర్జన చేయుట; కాలెత్తడం – స్త్రీ వ్యభిచరించడం

కాలేస్తే కాలనిగుడ్డలు – బాగా మాసినగుడ్డలు; కిరుపాదాలు – వాద్యవిశేషం

కిరియాటం – కిరీటం; కిరియాతకులు – కిరాతకులు

కీడి – గీచి; కీసరబాసర మనడం – అర్థంకాని భాషలో మాట్లాడడం

కుంటేళ్లు – కర్ణాభరణ విశేషం; కుండమార్పులు – సోదరీసోదరులను, పేరొక సోదరీసోదరులకు పెళ్లిచేయటం

కుందేలకాడ – కాళ్లకాడ; కుక్కుమంచం – లోతైన మంచం

కుతాపరంగా – కష్టపడకుండా, ఎక్కువగా; కుత్తుగంటు – కంఠాభరణం

కుదురు – కల్లుకుండల కింద పెట్టే చుట్టలు; కుదుళ్లు –మొదళ్లు

కుమ్మరం – కష్టం లేక బాధ; కుమ్మరించుట – కురిపించుట

కురిసిమొక్కలపీట – పొట్టి ముక్కాలిపీట; కులవిద్య – వృత్తివిద్య

కులబీదుగురాలు – కులంతక్కువ స్త్రీ; కులకుల కన్నీరు కుమ్మరించుట – బాగుగా దుఃఖించుట

కుళాయి – టోపి లేక కిరీటం; కుళ్లా కుతావరం – నీసువాసన

కూకడబడు – కూర్చుండు; కెప్పురెల్లుట – ఏడ్చుట

కైసెయ్యక – లెక్కచెయ్యక; కొంకులు – ఒక తిట్టు

కొట్టుమిట్టాడుట – గిజగిజ తన్నుకొనుట; కొబర కాటుక – శ్రేష్టమైన కాటుక

కొలదప్పు – కొల్వడం మానివేయుట; కొలుకు – కొక్కెం

కొలువుకూటాలు – సింహాసనాలు; కోటిబాగ్గేలు – సర్వసంపదలు

కోటుకదుంప – ఒకరకమైన దుంప; కోతాడిచెట్టు – ఒకేమొదలుండి, అనేక పలవలున్న తాడిచెట్టు

కోనాలగోరు – వంపుగా లేక పదునుగా పెంచినగోరు

## గ

గంటం – ఆయువు; గండదీపం – అఖండంగా వెలిగే దీపం

గండిపోతురాజు – పోతురాజు; గందం – సంగతి లేక విశేషం

గడికో గుడికో – కొంచెంసేపటికి, అతి త్వరలో; గడియ రంకె – పెద్ద రంకె

గడిబాపనమ్మ – ఒక దేవత; గడి కావలా – వ్యక్తిని వెంబడించి కనిపెట్టుట

గత్తర – కలరా; గన్నిపోతురాజు – పోతురాజు

గనుమైన – ఘనమైన; గభాల్న – వెంటనే

గమ్మున – త్వరగా; గరగ – గ్రామదేవత కడకు గొనిపోవు కలశం

గలుబుగట్టెయ్యుట – గుమిగూడుట లేక చుట్టూ కమ్మెయ్యుట

గాందారం – వనం; గచ్చారం (గ్రహచారం) – చెడుజరుగుట

గాజులమల్లాలి – గాజులు వేయువాడు; గాయి – అంటువ్యాధి

గాలించుట – వెదకుట; గాలిమేడ – గాలికోసం ఎక్కేమేడ

గాలిమోడు – గాలికి విరిగేలా ఉన్నమోడు; గావిడేసిపొక్కు – పెద్దపొక్కు

గిట్టకాలు – మోకాలికి పాదాలకు మధ్యనున్న కాలిభాగం; గిరగొట్టుట – విసిరివేయుట

గిరి – బరి; గుది, గుదిలాం – గుత్తి

గుబులుగుబులు గుండెలు గుద్దుకొనుట – బిగ్గరగా దుఃఖించుట

గెరటావాహనుడు – గద్ద లేక గరుడ పక్షి; గెరటామంతుడు – గద్ద లేక గరుడ పక్షి

గొంది – నది సముద్రంలో కలిసేచోటు; గొబ్బరికాయలు – కొబ్బరికాయలు

గొల్లుమనుట – గట్టిగా ఏడ్చుట; గోచిపాత – గోచిగుడ్డ

గోడసెనగపప్పు – తినే సెనగపప్పు; గోడుగోడుమని గోటాపనపెట్టుట – బిగ్గరగా దుఃఖించుట

గౌడు గుడుపుట – బలిజంతువు రక్తం కలిపిన అన్నాన్ని గ్రామ పొలిమేరలలో కలుపుట; గౌర్నంగా – గౌరవంగా

## చ

చంద్రహారం – హారవిశేషం, చంద్రాయుధం – కత్తి

చదువులబడి – పాఠశాల; చిక్కలి చికాపుకర్ర – దువ్వెన

చిట్టరేవళ్లు – ఒకరకమైన రాతినేలలు; చిత్రాం – ముద్దలాగ అంటుకొనిపోవడం

చిత్తారి పెదవులు – అందమైన పెదవులు; చిదిమించుట – ఏకివేయుట

చిమాచనం – సింహాసనం; చిరిసి – శిరస్సు

చిలకరామన్న – రామచిలుక; చీతనత్తమవ్వు – నాశనమవ్వుట

చెంగుపరచడం – స్త్రీ వ్యభిచరించడం; చెరతోడు కొచ్చుట – బలవంతంగా తీసుకొచ్చుట

చెళ్లచెళ్లన నీరు చెండుకొనుట – బిగ్గరగా దుఃఖించుట; చేడి – పనికత్తె

చేత్తో లేదనడం – ఎంతో కొంత పెట్టడం; చేదుట – తోడుట

చొణుక్కోవడం – తమలోతాము నెమ్మదిగా మాట్లాడుకోవడం; చోద్యంగా – అందంగా

## జ

జంకి – బుట్ట; జట్టీ – తగవు

జట్టీబేరం – మొత్తం బేరం, ఒకే బేరం; జాడీమెకం – మృగాలన్నిటిలోకి పొడవైనదైన క్రూరమృగం

జాముతాడు – చేపలు పట్టేవారు వలలాగటానికుపయోగించే తాడు

జాలకం – అంటువ్యాధులు సోకినపుడు పోగొట్టడానికి గణాచారి చేసే ఒక ఆచారం

జావోజడో – జావ, ఆహారం; జిమ్మ – జిహ్వ

జిమ్మడిపోవుట – మాట పడిపోవుట; జిమ్మతకారి – ముసలిది

జీరగణమవటం – నశించుట; జీర్ణమవడం – నశించుట

జీరజిల్తారి – జలతారు చీర, వస్త్రవిశేషం; జూరుచున్నాడు – జుర్రుచున్నాడు

జెమ్మకాన – హారవిశేషం, మెడోలోహారం

ట

టముకు – దండోరా లేక చాటింపు; టాసుతరేజు – తక్కెడ

టెంకబొరుకులు – ఎండిన తాటిటెంకలు

డ

డాకుడాకుమని – గుజ్జానెక్కేటపుడు వచ్చే శబ్దానికి ధ్వన్యనుకరణ, ఢీకొనుట – పోటీ పడుట, ఎదుర్కొనుట ;

త

తగులుట – తరుముట; తట్టు – అమ్మవారి సంబంధమైన చర్మవ్యాధి

తడపర – అమ్మవారి సంబంధమైన చర్మవ్యాధి; తడలేదు – తడిఅవ్వలేదు

తడుముల్లాడు – వెదకు; తణుతున్నాడు – తలచుచున్నాడు; తబుసు – తపస్సు

తమాయించుకొనుట – సద్దుకొనుట, స్థిమితపడుట; తయాలతపాళా – వంట పాత్రలు

తరియాట – వేట; తలగోరు – రలకొరివి తలవంటి – తలమీదుగ; తలార – తలమునుగ

తలిదండ్రాదులు – తల్లిదండ్రులు; తాపనం – స్థాపితం

తార్పుగుల్ల – తార్చేడి స్త్రీ; తావడుగుట – వివరాలడుగుట

తావులు – తోవలు; తిప్ప – దిబ్బ ; తిరగబడిపోవుట – అకస్మాత్తుగా మరణించుట

తీరుగా – చక్కగా; తుండెము – తలభాగము

తునకాలబడిత – చెట్టుగాళ్లు కల్లుగీసే కత్తిపదును పెట్టడానికుపయోగించే కర్ర

తుప్పసాటుకెళ్లడం – మలమూత్ర విసర్జన కెళ్లడం; తులుసు సాంబారమైన – మంచి విలువైన

తుష్టి – తృప్తి; తెకిటీలు – వేటులు

తెలివిగుండడం – మెలకువగా ఉండడం; తైమూత్తులు – త్రిమూర్తులు

తొంగున్న – పండుకున్న; తొడలమీద తొంగడ బెట్టుకోవడం – రతిజరపడం

తొరుపునీళ్ల – వేడి తగ్గటానికి, వేడి నీళ్లలో కలిపేచన్నీళ్ల; తొలిదేవిడీ – సింహద్వారం

ద

దండవంకీలు – ఆభరణ విశేషం; దండి – దండుగ లేక నష్టం

దండీలు – నరాలు; దండుబాయి – దండుకొనేవాడు, బిచ్చగాడు

దండుగస్తి – దండుకొనేవాడు, బిచ్చగాడు; దంతం – ధ్వంసం (నాశనం)

దంతావళి రవిక – వస్త్ర విశేషం; దంతాపన – సమీపంగా ఉండుట, సంబంధం

దందానం – దంతధావనం; దట్టీపార – కట్టుకున్న పంచెమడత

దద్దరిల్లిపోవుట – బాగా భయపడిపోవుట; దద్దిలం – మద్దిలం – మాటకు మాట సమాధానం చెప్పుట

దయసంబు లేదు – లెక్కచెయ్యకపోవుట; దయాసయం – దయ

దర్వాజాలు – తలుపులు; దరవాజాలు – తలుపులు

దరికావిడి – వడికావిడి; దరిణించుట – ధరించుట

దరిని – ధరిణి; దశిమంతుడు – అదృష్టవంతుడు

దాతవ – కంఠం, నాడి; దిగనాడుట – తొలగిపోవుట, తగ్గిపోవుట

దివంతకాలం – చివరిరోజులు; దివాకోణాలు దీటించిచూడటం – దివ్యదృష్టితో చూడడం

దివాఖర్చు – రోజు బత్తెం; దివాఖర్చులేకపోవడం – దీపం పెట్టడానికి దిక్కులేక పోవడం

దివారం బతుకు – ముసలికాలపు బతుకు; దివించి దివి సెలవులు – ఆశీర్వదించి పంపడం, వీడ్కోలు చెప్పడం దీరాలు చెందుట – కోప్పడుట; దీవెనార్థం – దీవెనలు

దుక్కు – పొలం దున్నడం; దుక్కు – వర్షపు కొలమానం

దూడలమ్మ – ఒక దేవత; దేబెట్టిన – మిగిల్చిన, విడిచిపెట్టిన

దేయాలు – దేహాలు; దేవి – దేవదీసి, చేతితో తీసి

దేవిడి – రాజభవనం; దేవిడి గుమ్మం – సింహద్వారం

దేవితులు – దేవతలు; దైరుం – ధైర్యం దొంగమాద – పెద్దపుండు, చర్మవ్యాధి విశేషం

## న

నంగరు – లంగరు; నగలు నాణ్యములు – ఆభరణములు

నత్తు – నాసాభరణం, ఆభరణ విశేషం; నమోచి – చిన్నతనం, ఆత్మన్యూనతాభావం

నరుని నోట్లో నలిగిపోవడం – తిట్టు తినడం; నల్లగల్లు – సారాయి

నవయువములు – అవయువములు; నవారూపం – ప్రకాశించేకాంతివంతమైన దేహం గల రూపం

నవ్వాగడియలు – బిడ్డపుట్టిన గడియలు; నష్టి – నష్టము

నారసపాకాయలు – నాగసర్పాలు; నావుటందులు – గిలుకుటందులు (ఆభరణ విశేషం)

నిండుజీవితంతో నిశ్చిత్రమయ్యాడు – నిలువునా చనిపోయాడు; నిందు – నింద

నిప్పారిపచ్చులు – వివిధరకాల పక్షులు; నినానం – నిర్ణయం

నిర్భాగ్గులు – నిశ్చేష్టులు;; నిలువుతోపులు తొయ్యడం – నిలుచున్న వ్యక్తిని వెళ్లమని ముందుకు తొయ్యడం నిసంది – నిశిరాత్రి, చీకటిరాత్రి; నీమకం – నియ..ుం

నీలాలు – ఒకరకమైన గాజులు; నెదడు – మెదడు

నెలవేసుకోవడం – అక్రమసంబంధం పెట్టుకోవడం; నేరెమ్మ – నేరేళ్లమ్మ

నేలదువ్వారం – సొరంగమార్గం; నైజ్జం – నైవేద్యం నొట్టమూడుకళ్లదేవుడు – ఈశ్వరుడు

**ప**

పంచవన్నె భూతర్ధం – సత్తెమ్మ సంబరంలో అయిదు రంగులతో వేసే ముగ్గు; పంచటి రూపులు – అందచందాలు; పంచికొండుపాపులు – చాలా ఎక్కువ పాపులు; పండగుట – సఫలయత్నం; పంబ – వాద్యవిశేషం

పంబలవాళ్ల – పంబవాయిస్తూ, సత్తెమ్మ సంబరం చేయించేవారు; పగిడిజాలువు – పైన కప్పుకొనే శాలువా

పచ్చగా పేడేట్టి రావడం – చిగురించటం; పచ్చని పాత – మంచి వస్త్రం

పచ్చపులి – దేవత; పటూరుచ్చం – వట వృక్షం

పడుగుడు – పగవాడు; పడుచుమార్గం – పడుచువయసులో ఉండే దుడుకు స్వభావం

పడికట్టు – అంచనా; పతిధర్మ – నీతి, మాటమీద నిలబడడం

పతిబాగ్గెం – సంపద, తినటానికి మధురమైనవంట; పతిబొట్టు – పసుపుకుంకుమలు, ముత్తైదువతనం

పతిబొమ్మ – ప్రతిమ; పనసరాముడు – పరశరాముడు

పనువు – కట్టె; పన్నువు – కొలమానం

పయ్యాట చెంగు – పైటచెంగు; పరకాడమగుట – పరమానందం కల్గుట

పలకట – పక్కన, సమీపాన, పళంగా – విధంగా

పస్తము – పట్టణము; ప్రభ – మొక్కులు తీర్చుకొనుటకై వెదురుగడలతో కట్టిన ఎత్తుగా ఉండెడి నిర్మాణం

పాంకోళ్లు – పాదరక్షలు; పాటి ఏనుగు – దేవత

పాడుదప్పుట – పాడవుట; పాదరసములు – పాదరక్షలు

పాపచేట – సత్తెమ్మ సంబరంలో పిండితో తయారుచేసిన బొమ్మనుంచే చేట

పాములత్తుకే పేరులు – పాములు ఆత్మ (వక్షస్థలం) కు ఆభరణములు

పాయ – కల్లుతాగటాని కుపయోగించే తాటాకుతో తయారు చేసిన చేదవంటి పాత్ర

మాయకుచ్చీల బొంత – మారువేషం కట్టడానికి ఒక మనిషిని చంపి అతని చర్మం ధరించుట

మారుబడి – కెరటాలు; మారుపాక – చేలో కల్లం కడ ఉన్న పాక

మాలు (మహలు) – భవనం, నివాసం; మాలువు – తెలియుట, అర్థమగుట

ముంత – మట్టిపిడత; ముకాసాలు – రాజ్యాలు

ముచ్చూరుసెమట – ఒళ్లంతా పట్టిన చెమటలు;

ముదరకించి మూడు మాటలడగం – గట్టిగా సమాధానం చెప్పడం; మునియోరు – మునివారు;
ములపు – మునగ మూనాలముద్ద – మరణించినవారికి మూడో రోజున పెట్టే పిండాకూడు

మూగరాలు – మృగాలు; మెరిగించి – మెరుగుపెట్టుట

మేగ్గరదం – మేఘం; మేదురునూకలు – చిన్ననూకలు

మేళొంపుగన్నిక – అందమైన కన్య; మైజారు – జోడు

మైదారులు – మధ్యదారులు; మైనపురి డేరాలు – ఒకరకమైన డేరాలు

మైరాత్త – గొర్రె; మైలపొత్తులు – తెల్లనివస్త్రాలు

మొండెము – తల నరకబడిన శరీరభాగం; మొవ్వాకు – లేత తాటియాకు

మోసాతల – జాలరులు సముద్రంలోనికి వల విసరటానికి ఉపయోగించేది; మోము – మోహము

**య**

యుండజాపుట – ఇచ్చుట; యువసాయం – వ్యవసాయం

యూరలు – తోడికోడలు; యోహనం – వాహనం

**ర**

రమీణా – రవాణా; రణత్తంబం – యుద్ధభూమి యందలి ధ్వజస్తంభం

రమ్మగట్టుట – ఎరుకలవారు సోదెకెళ్లేటపుడు పిల్లల్ని చంకని కట్టుకొనుట

రసాకారం – కూర తాళింపునకు ఉపయోగించే సుగంధద్రవ్యాలు; రాకట – వచ్చుట

రాంబలగం – రాబందుల సమూహం; రాగిముడులు – గట్టిముడులు

రాజానపురాజులు – రాజాధిరాజులు; రాత్త – గొర్రె

రాత్తులు – రాక్షసులు; రాబోతిలోకి – వచ్చేసరికి

రామ్రలు – రాబందులు; రాములు – రోమములు

రాస్యం– రహస్యం; రుచ్చం – వృక్షం

రుద్రాచ్చభూములు – స్మశానభూములు; రొట్టు – లొట్టు

రొతాలు – వ్రతాలు; రోజుమజ్జాన్నం – ఒకటిన్నర రోజులు

లక్కుమొక్కులు – అవయవాలన్నీ; లగువు – పరుగు

లగువులు బిగువులు లాబసత్తువులు – సర్వశక్తిసామర్థ్యాలు

లడాకా – దెబ్బలాట, తగవు; లాభసత్తువ – శక్తి

లింగాలు – నీరు; లుబ్బ లుబ్బలు గక్కు – ఎక్కువగా సొంగకార్చు

లొట్టి – కల్లుముంత; లొట్టులూ లోయలు – కలుపోసే కుండలు

**వ**

వంజు – వరుస; వట్టు – ఎండినది, కృశించినది

వట్టులు – పిడకలు; వణ్ణం – అన్నం

వత్తాసులు – వస్త్రాదులు; వద్దు – హద్దు

వరా – వరహా; వరాకో భోజనం – ఖరీదైన భోజనం

వర్రి – వరి; వర్తమానాలు – జరుగుచున్నతీరు, లోకం పోకడ

వర్నాన్ని–వలె; వలవలకన్నీరు వంపుసాగి – బాగుగా దుఃఖించి

వలాంటి – ఎలాంటి; వవుసు – వయసు;

వాత్తనం – వార్త, సమాచారం; వాదగించి – వాదించి

వాయతాడు – గుఱ్ఱాలను తోలే కొరడావంటి తాడు; వాయుపుల్ల – సంజీవిపుల్ల

వారుద్రమైన – అధికమైన; వికావా – తలపాగా

వినవములు – చెవులు; విరుదులు – స్త్రీలు

వివటం – స్వచ్ఛమైనది; వెవ సాయం – వ్యవసాయం

**శ**

శంకల్లో – సంకల్లో; శాక – కత్తి

శానాపశానలు – సేనోపసేనలు; శూలపు కడవ – సత్తెమ్మకు ప్రతిరూపంగా గుడిలో ఉండే కుండ

**స**

సంగీతమేజువాణి – గానన్నృత్యములు; సంగూర్చుట – అలంకరించుట

సక్కంద్ర – చక్కదనం; సక్కరమైన – చక్కనైన

సచ్చినట్టుగా సాగిల్లుట – ఆకలితో అల్లాడిపోవుట; సతిపతి న్యాయం – సంభోగం

సదునైపోవుట – నాశనమగుట; సపద్ధం – శపథం

సప్పగంటులాగ – నిశ్శబ్దంగా; సప్పసారా – చప్పనైన సారాయి

సపాలు - సర్పాలు; సమ్మందం - సంబంధం

సలివిడి - సలిమిడి; సవరించుట - సంహరించుట

సవ్వసువ్వారాలు - గాలికి అటూ ఇటూ దోనెమీద తిరగడం; సాదుపరిచి - శాంతపరిచి

సాపండం - పెద్దరాయి; సాపించి - శపించి

సాలుపోయుట - ఎండలో ఆరబెట్టుట; స్తానాలు - స్నానాలు

సికముడులు - నడినెత్తిన వేసిన ముడులు; సికీతాళాలు - తాళంకప్ప

సిద్ధభుక్తి - సిద్ధులకు పెట్టే విందు; సిబ్బీ - మూత

సిరగపురి గాజులు - చిలకలు దిద్దిన గాజులు; సిరతలు - చీకట్లు, మైకం

సిరికొరుపులు - గాజులు తయారుచేసే కుంపటి; సిరిపాదాలు - పాదాలు

సుట్టిన పాకాలు - తలపాగా; సురిటి - వీవన

సురేపానకం - సురాపానం (కల్లు); సెకాళం - చిరాకు, తట్టుకోలేని బాధ; సెలవులు - ఆజ్ఞలు, అనుమతి; సైంజ్ఞం - సైన్యం

సొప్పు - చెప్పు; సొబనం - స్వప్నం

సొమ్మసిల్లిపోవుట - స్పృహతప్పి పడిపోవుట; సొశానం - స్మశానం

సోంపాకం - స్వయంపాకం; సోమనాలబాయి - కూప విశేషం

## అధస్సూచికలు

1. 'కొటరాజు కథలు', 1976, పు.
2. 'తెలుగు సామెతలు' వ్యాసం, స్రవంతి, ఫిబ్రవరి, 1980
3. పల్లెపదాల్లో ప్రజాజీవనం, 1979, పు. 463.

## ఏకాదశ ప్రకరణం

# గ్రామదేవతలు - భిన్న సంస్కృతుల సమ్మేళనం

ద్రావిడసంస్కృతికి చెందిన గ్రామదేవతలు, ఆర్యసంస్కృతికి చెందిన వైదిక దేవతలు ఒకే సమాజంలో ప్రక్క ప్రక్క నుండుటవల్ల వాటి సమ్మేళనం సహజమే. వ్యవసాయ ప్రధాన జీవులైన ద్రావిడులకు సఫలత ముఖ్యమగుటచే, తాము నమ్మిన ఆదిమానవశక్తిని మాతృమూర్తిగా భావించి పూజించారు. ఆ మాతృమూర్తే నేటి గ్రామ దేవత. యుద్ధోపజీవులైన ఆర్యులకు భూమిమీద వివిధ వస్తువులతో కాక, ప్రకృతిలోని వివిధ వస్తువులతో సంబంధ మెక్కువగుటచే ఇంద్రుడు, వాయువు, వరుణుడు, పృథ్వి, త్వష్టి మొదలైన పురుష దేవతలు వారి దైవాలు. కాని ఆతర్వాతకాలంలో ద్రావిడుల మాతృదేవతను వారు స్వీకరించి, తమ గ్రాంథాలలో (వేదాలలో) దుర్గ, ఉమ, చండికగా వర్ణించుటయేకాక తమ పురుషదైవాలకు భార్యలుగా కూడ చిత్రీకరించారు. ఈవిధంగా దైవస్వరూపంలో, ఆచారాలలో, ఆరాధనలో రెండు భిన్నధ్రువాలుగా ఉన్న ఈ రెండు మతాల సమ్మేళనం గ్రామదేవతల విషయంలో ప్రస్ఫుట మవుతుంది. ఈ సమ్మేళనం రెండు విభిన్న సంస్కృతుల పరస్పర ఆదానప్రదానాల వల్ల ఏర్పడిందే.

### వైదికమత ప్రభావం గ్రామదేవతలపై :

***విగ్రహం :*** గ్రామదేవతల విగ్రహాలు ఆదిలో రాయి, కొయ్య, చెట్టు రూపంలో (ఇప్పటికి కొన్ని) ఉండేవి. ఆ తర్వాతకాలంలో శిష్టసాహిత్యంలో శిష్టులు వర్ణించిన దేవి విగ్రహాన్ని దృష్టియందుంచుకొని నేటి గ్రామదేవతల విగ్రహాలు ఏర్పడ్డాయున వచ్చును. ఇప్పటి గ్రామదేవతల విగ్రహాలు శిష్టసాహిత్యంలో వర్ణింపబడిన దేవి విగ్రహంతో సరిపోలుతున్నాయి. ఒకప్పుడు చెట్టు కింద రాయి రూపంలో ఉండే దేవతకు ఆతర్వాతకాలంలో గుడి నిర్మింపబడింది. గుడిలో విగ్రహం స్త్రీ రూపంతో ఉండడం కనిపిస్తున్నది. కాని ఆవిగ్రహం పక్కన విగ్రహం నిర్మించకముందు దేవత స్వరూపాలుగా పూజింపబడే రాళ్లు కూడ ఉండడం, ఒకప్పటి రాయి కాలక్రమంగా విగ్రహంగా మలచబడిందనడానికి నిదర్శనం.

దేవత విగ్రహం మాత్రమేకాక, పోతురాజు విగ్రహంపై కూడ వైదిక ప్రభావసూచనలు కన్పిస్తున్నాయి. ఈ జిల్లాలోని కోటనందూరు మండలం బలరాంపురంలో గ్రామదేవత వేములమ్మ గుడికెదురుగా ఉండే పోతురాజు నందిరూపంలో ఉన్నాడు (ఛాయాచిత్రం మూడవ ప్రకరణంలో చూడుడు) శైవాలయంలో ఉండే నంది యొక్క ప్రభావంవల్ల ఈవిధమైన పోతురాజు విగ్రహం ఏర్పడినదనవచ్చును.

***పేర్లలో :*** గ్రామదేవతల పేర్లచివర ఉండే 'అమ్మ' శబ్దం 'అంబ, అంబిక' గా మారి విన్పిస్తుంది. ఈ మార్పుకు కారణం పేర్లలో కలిగిన ఆర్యీకరణమే. సంస్కృత సాహిత్యమున స్థిరతగన్న దేవియొక్క అంబిక నామములు ద్రావిడ అమ్మ శబ్దమునకు మారు రూపములు[1] అని ఆచార్య కృష్ణకుమారి పేర్కొన్నారు. తర్వాత కాలంలో 'అంబ, అంబిక' శబ్దములు 'అమ్మ' స్థానంలో చేరినవి. నేడు అనేక గ్రామదేవతలపేర్లు ఆర్యీకరింపబడి వినిపిస్తున్నాయి. ఉదా : నూకాంబిక (నూకాలమ్మ),

పోలమాంబిక (పోలమ్మ), కట్టలాంబ (కట్టాలమ్మ), మొదలైనివి. ఈవిధంగా కేవల 'అమ్మ' శబ్దమేకాక దేవత పేరు పూర్తిగా ఆర్యీకరింపబడినవి కూడ కన్పిస్తున్నాయి. ఉదా : గుర్రాలక్క లేక గుర్రాలమ్మ అనే గ్రామదేవత పేరు ఆర్యీకరింపబడి 'అశ్వరూఢాంబ' గా మారింది. మహాలక్ష్మి, కనకమహాలక్ష్మి, నీలవేణి, ఆదిలక్ష్మి, రాజ్యలక్ష్మి, మాణిక్యాలమ్మ, మొదలైన గ్రామదేవతల 'పేర్లను బట్టి కూడ గ్రామదేవతల పేర్లపై వైదికమత ప్రభావం స్పష్టమగుచున్నది.

***ఆరాధనలో :*** ఆరాధన విషయంలో కూడ వైదికమత ప్రభావం కన్పిస్తుంది. గ్రామదేవతలకు సమర్పించే జంతు, పక్షులు సమర్పణ స్థానంలో కొబ్బరి, గుమ్మడి కాయలు పగులకొట్టే సాత్త్వికాచారాలు రావడం వైదికమత ప్రభావం వల్లనేననవచ్చును. కొన్ని గ్రామదేవతల గుడుల వాతావరణం పూర్తిగా మారిపోయింది. అచ్చట స్మార్త సంప్రదాయంలో, ఆగమపద్ధతిలో నిత్య ధూప దీపనైవేద్యములు సమర్పిస్తూ, కుంకుమార్చనలు సాగిస్తున్న దేవతల ఆలయాలు కూడ ఉన్నాయి. ఈ జిల్లాలోని ప్రత్తిపాడు గ్రామంలో పాదాలమ్మ గుడివద్ద ఇట్టి వాతావరణమున్నది. వానపల్లి పల్లాలమ్మకు నిత్య ధూపదీప నైవేద్యాలు, కుంకుమార్చనలు జరుగుతున్నాయి.

పేరులోను, ఆరాధనలోను, వైదికమత ప్రభావం మిక్కుటంగా పడిన దేవత కూడ ఈ జిల్లాలో ఉన్నది. రాజోలు తాలూకా శివకోడు గ్రామంలో పూర్వం 'పుంతలో ముసలమ్మ' గా ఆరాధింపబడే గ్రామదేవత తర్వాతకాలంలో కుంతలేశ్వరిగా మారి ఆగమపద్ధతిలో నిత్య ధూపదీపనైవేద్యాలతో పూజింపబడుతున్నది.

'అఖిలాంధ్రులచే ఆరాధ్య (శిష్ట) దేవతగా పూజింపబడుతున్న బెజవాడ కనకదుర్గ ఒకనాటి గ్రామదేవతేనని, ఆమెకు బలులొసంగిన ఆధారాలు గుడి ప్రాంగణంలో ఉన్నాయని' ఆచార్య కృష్ణకుమారి గారు తమ గ్రంథంలో పేర్కొన్నారు.

**వైదికమతంపై ద్రావిడమత ప్రాభావం** : 'వైదిక దేవాలయాల్లో జరిగే రథాల ఊరేగింపులు, జారల్లాంటి ఉత్సవాలు, కొబ్బరికాయలు కొట్టడం లాంటి ఆచారాలు మొదలైనవన్నీ ఆటవిక జానపదసంస్కృతి ప్రభావంతోనే ఏర్పడ్డాయని[3] డి.డి. కోశంబి అభిప్రాయం. శిష్టులచేత సరస్వతిదేవిగా పూజింపబడుతున్న మాత తర్వాతకాలంలో జానపదులచేత వాక్కులమ్మగా పూజింపబడుతూ బలులు ఒసంగబడుతూండడం వల్ల కూడ వైదికమతంపై ద్రావిడమత ప్రభావం స్పష్టమగు చున్నది. శిష్టదేవతలుగా శిష్టులచే పూజింపబడి, తర్వాత గ్రామదేవతలుగా పరిణమించిన సందర్భాలు కూడ ఉన్నాయి. ఈ జిల్లాలో ర్యాలి, రావులపాలెం గ్రామాల్లో నిలిచిన గ్రామదేవత వాక్కులమ్మ, ఒకప్పుడు శిష్టులచే పూజింపబడిన చదువులతల్లి సరస్వతీదేవేనని వెనుకటి పుటలలో (గ్రామదేవతల నామవైవిధ్యం అనే ప్రకరణం) పేర్కొన్నాను.

పై విషయాలనుబట్టి గ్రామదేవతల విషయంలో ఆర్య, ద్రావిడ మత సమ్మేళనం కలిగిందని చెప్పవచ్చును.

## అధస్సూచికలు

1. తెలుగు జానపదగేయ గాథలు, పు. 186 : 1977
2. పైది, పు. 233
3. Myth & Relity; D.D. Kosambi, 1962

# ద్వాదశ ప్రకరణం

## గ్రామదేవతల అధ్యయనావశ్యకత

'దేవత' అనే పదం మత సంబంధమైనది. గ్రామదేవతల కథలలో వర్ణింపబడుసాంఘికాచారాలు, నమ్మకాలు, దైవభావన, జంతు ప్రాముఖ్యం, మొదలైన విషయాలన్నీ ప్రాచీన, మానవుని మత స్వరూపాన్ని తెలుసుకోవటానికి ఉపకరిస్తాయి. ఈవిధంగా సంస్కృతి, సంఘం, మతం వంటి అంశాలతో కూడిన నృశాస్త్ర విజ్ఞానాన్ని తెలుసుకోవటానికి గ్రామదేవతల అధ్యయనం ఉపకరిస్తుంది.

అనేక గ్రామదేవతల కథలలో శక్తిదేవతకు, ఈశ్వరునికి వైరం వర్ణింపబడింది. అట్టి వైరం స్త్రీపురుష శక్తుల మధ్య వైరమేనని నృశాస్త్రవేత్తలు (లెవిస్ట్రాస్) పేర్కొనడంవల్ల కొన్ని వేల సంవత్సరాలనాటి మత సామాజిక పరిస్థితులు నరవర్గచరిత్ర తెలుసుకోవటానికి గ్రామదేవతల అధ్యయనం ఉపకరిస్తుందనవచ్చును.

గ్రామదేవతల ఆరాధనలో జాతరలలో కన్పించే గ్రామీణుల ఆచారాలు, నమ్మకాలు, మొదలైనవాటివల్ల, గ్రామదేవతల కథలలో, మహిమలలో కన్పించే గ్రామీణులు నమ్మకాలవల్ల ప్రాచీన మానవుని మానసికస్థితిని, జీవనవిధానాన్ని, ఆలోచనావిధానాన్ని తెలుసుకోవటానికి వీలుకలుగుతుంది.

గ్రామదేవతల ఆరాధన అనేది గ్రామణులందరూ పాల్గొనే ఒక సామూహిక, సామాజిక కార్యకలాపం. జాతరలలో బలుల సమర్పణలో గ్రామస్థులందరూ పాల్గొంటారు. సమాజపు సామూహిక చైతన్యాన్ని, ఉత్సాహాన్ని, కష్టసుఖాలు పంచుకోవడం అనే సామాజిక స్వభావాన్ని ఈ కార్యక్రమాలు నిక్షిప్తం చేస్తాయి. కనుక సమాజం తన సామూహిక వ్యక్తిత్వాన్ని, చైతన్యాన్ని నిరంతరం వ్యక్తంచేస్తూ నిలుపుకునేందుకు గ్రామదేవత భావన ఉపయోగపడుతుంది.

గ్రామదేవతల ఉత్సవాలు, జాతరలు సామాజికశాస్త్ర పరిశీలనావిషయాలు, దేవతకు పుట్టింటివారు, అత్తింటివారు ఉండడం, గ్రామదేవత జాతరలో దేవతను పుట్టింటినుంచి, అత్తింటికి సాగనంపడం కనిపిస్తుంది. ఈ జిల్లాలోని సామర్లకోట మండలం జి. మేడపాడు గ్రామములో నున్న దండుగంగమ్మ పెదబ్రహ్మదేవం (పారుగూరు) గ్రామస్థుల ఆడపడుచు తర్వాత కాలంలో ఆమె మేడపాడులో వెలసింది. ఈమెకు ముందుగా బ్రహ్మదేవం గ్రామస్థులు నైవేద్యం పెట్టాకనే, మేడపాడు గ్రామస్థులు పెడతారు. సమీపగ్రామం సంపర నుంచి కూడ బళ్ళు కట్టుకొని వచ్చిన భక్తులు అమ్మవారి జాతరలో పాల్గొని, వంటలు చేసికొని తిని వెళతారు. ఇలాంటి ఆచారాలవల్ల ఆయా గ్రామాల మధ్య సంబంధాలు బలపడడానికి అవకాశం ఉన్నది. వారి మధ్యఐకమత్యం పెరుగుతుంది. అంతేకాక ఈజిల్లాలోని లోవలో (తునిదగ్గర) తలుపులమ్మ, నవఖండ్రవాడ నక్కుళ్లమ్మ, సీతపల్లి బాపనమ్మ, మొదలైన దేవతల వద్దకు సుదూర ప్రాంతాల నుంచి కూడ జనులు వెళ్ళి, మేక, కోడి, మొదలైనవానిని బలులిచ్చి, వాటిని కమ్మగా వండుకొని, ఆరగించి ఇంటికెళతారు. ఇవన్నీ సామాజికశాస్త్రపరంగా పరిశీలించవలసిన విషయాలు. కావున గ్రామదేవతల

అధ్యయనం వల్ల సామాజికశాస్త్ర పరిశీలనా విషయాలను కూడ అధ్యయనం చేసినట్లవుతుంది.

గ్రామదేవతలకు నైవేద్యంగా ఆయా ప్రాంతపు ప్రజలు తాము తినేదే పెడతారు. తమ ప్రాంతంలో పండేది వారు తింటారు కనుక, గ్రామదేవతల అధ్యయనం వల్ల ఆయా ప్రాంతపు ప్రజల ఆహారపు టలవాట్లు, తద్వారా ఆయా ప్రాంతాల పంటలు, భూసారం కూడ తెలుసుకోవచ్చును. వ్యవసాయ రీత్యా అంత ప్రాముఖ్యంలేని ప్రాంతాలలో వ్యవసాయానికంటె పరిశ్రమలకు ఎక్కువ ప్రాధాన్యతనిచ్చి, ఆర్థికాభివృద్ధిని సాధించవచ్చును.

గ్రామదేవతలపై ఉండే భక్తి కొద్దీ ప్రజలు తమ పిల్లలకు దేవతల పేర్లు పెట్టుకుంటారు. ముఖ్యంగా అమ్మవారి జాతర రోజులలో పుట్టిన పిల్లలకు తప్పక పెట్టుకుంటారు. కావున గ్రామదేవతల అధ్యయనం వ్యక్తినామ పరిశీలనకు ఉపకరిస్తుంది. మా గ్రామంలో ఏగులు, తాలయ్య, పాదాలు, పాదాలమ్మ, మొదలైన పేర్లతో వ్యక్తులున్నారు. వారి పేర్లు నాకు విచిత్రంగా తోచేవి. నేను గ్రామదేవతల మీద పరిశోధనకు దిగాక ఆయా పేర్లతో దేవతలుండడం గమనించి, గ్రామదేవతల పేర్లు వ్యక్తులు పెట్టుకుంటారని తెలుసుకున్నాను. ఈ పేర్లవల్ల ఒకప్పుడు ప్రజల చేత పూజింపబడి, ప్రస్తుతం అనాదరింపబడుతున్న గ్రామదేవతల గురించి కూడ తెలుసుకోవచ్చును. ఉదా : పూర్వీకుల పేర్లు ముఖ్యంగా తాతల పేర్లు మనుమలకు పెట్టడం మనకు తెలిసిందే. ఆ తాతలకాలంనాడు పూజింపబడుతున్న దేవతలపేర్లు వాళ్ళు పెట్టుకుంటే, వాళ్ల మనుమలకు కూడ అవే పేర్లు పెట్టడం వల్ల, ఆయా కాలాల్లో ఆరాధింపబడిన దేవతల గురించి తెలుసుకోవచ్చు. ఉదా : మా గ్రామంలో వసంతాలమ్మ దేవత ఉంది. ప్రజలు ఆమెను అంతగా పూజించటంలేదు. ఇటీవల కాలంలో జాతర జరుగుతున్న చిహ్నాలు కూడ అంతగా కన్పించటంలేదు. కాని గ్రామంలో ఉన్న వసంతయ్య, వసంతమ్మ, మొదలైన పేర్లనుబట్టి, ఒకప్పుడు ఆ దేవత ప్రాధాన్యంతో ప్రాచుర్యంలో ఉండేదని తెలుస్తుంది. ఆధునికకాలంలో ఆపేర్లలో కలిగిన మార్పులవల్ల వసంతలక్ష్మి, వసంతరావు అని కొత్తతరం వారి పేర్లు వినిపిస్తున్నాయి.

లక్ష్మమ్మ పేరంటాలు కథలో ఆమె లక్ష్మివారం పుట్టినందున 'లక్ష్మమ్మ' పేరు పెట్టారని వివరించ బడింది. దీనినిబట్టి వ్యక్తులకు పేర్లు పెట్టుటలో తిథి, నక్షత్రాలతోపాటుగా, రోజును కూడ గ్రామస్థులు దృష్టియుంచుకుంటున్నారని తెలుస్తుంది. దీనివల్ల గ్రామస్థులు పేర్లు పెట్టుకొనేతీరు తెలుస్తుంది.

గ్రామదేవతల పేర్లు వ్యక్తులు పెట్టుకోవటంవల్ల, వ్యక్తులపేర్లతో గ్రామనామాలు ఏర్పడడం వల్ల, గ్రామనామాల పేర్లతో గృహనామాలు, గృహనామాలతో గ్రామదేవతల పేర్లు ఏర్పడ్డం కనిపిస్తుంది. వీటన్నింటినిబట్టి గ్రామదేవతల అధ్యనంతో గ్రామనామాలు, గృహనామాలు, వ్యక్తినామాలు పరస్పర సంబంధం కల్గిన్నాయని విదితమగుటయేకాక, వాటి పరిశీలనకు కూడ వీలవుతుంది.

ఈవిధంగా ప్రాచీనసంస్కృతిని, వ్యవస్థను, అందలి ఆచారాలను, తద్వారా ప్రాచీన మానవుని మానసికస్థితిని, ఆలోచనావిధానాన్ని తెలుసుకోవటానికి నృశాస్త్ర, నరవర్గచరిత్ర, సామాజికశాస్త్ర విషయాలు తెలుసుకోవటానికి, ప్రజలు ఆహారపుటలవాట్లు, తద్వారా ఆర్థికాభివృద్ధి కుండే అవకాశాలను తెలుసుకోవటానికి, వ్యక్తి, గ్రామ, గృహ నామ పరిశీలనకు కూడ గ్రామదేవతల

అధ్యయనం ఉపకరిస్తుందని చెప్పవచ్చును.

## త్రయోదశ ప్రకరణం

# గ్రామస్థుల నమ్మకాలు, ఆచారాలు, ఆరోపణలు

**సాంఘిక పరిస్థితులు :** నేరేళ్లమ్మ కథలో నేరేళ్లమ్మ పుట్టాక, ఆమె మేనత్త బొడ్డు రామ్మకు అన్నలు ఉత్తరాలు వ్రాస్తారు. ఆమె సున్నిపిండి, మొదలైనవి పట్టుకొని మేనకోడల్ని చూడ్డానికి వస్తుంది. వచ్చిన రామ్మను అన్నలు కాళ్లు కడుక్కొని భోజనాలు చెయ్యమంటారు. తన కుమారునికి, నేరేళ్లమ్మను ఇచ్చి పెళ్లి చేస్తామని అన్నలు వాగ్దానం చేస్తేనే తాను భోజనం చేస్తానని రామ్మ పట్టుబడుతుంది. దీనిని బట్టి నేరేళ్లమ్మ కథాకాలం నాటికి పెళ్లిళ్ల విషయంలో అమ్మాయిలకు గిరాకీ ఎక్కువని, అబ్బాయి తల్లిదండ్రులు అమ్మాయిల్ని కోరి వెదకేవారని తెలుస్తుంది.

**శాస్త్రీయ విషయాలు :** గ్రామదేవతల జాతరలలో రాత్రులందు జరిగే గరగల సంబరంలో కాగడాలు ( చిన్న కర్రకు ఒకచివర గుడ్డచుట్టి, దాన్ని నూనెతో తడుపుతారు. వెలిగిస్తే అది వెలుగుతుంది) వెలిగిస్తారు. ఈ కాగడాలకు బదులు చేబ్రోలు గ్రామంలో పాల కర్రను ఒకవైపు మెత్తగా నలగ్గొట్టి వెలగిస్తారు. నూనె పోయకుండానే అది వెలుగుతుంది. దీనినిబట్టి పాలకర్రలో చమురుగుణముందని తెలుస్తుంది.

కల్లుసాటువ కథలో సత్తెమ్మకు కల్లు పొయ్యనని తిరస్కరించి, తమ్మన్న కల్లుగీయటానికి తాటిచెట్టెక్కి, గెల పట్టుకుంటాడు. ఆ గెల పట్టుతప్పి, ఊడి చేతిలోనికొస్తుంది. మాలకాకి పొడిచిందేమో ఊడిపోయిందనుకుంటాడు. దీనిని బట్టి మాలకాకి ( శరీరమంతా నల్లగా ఉండేకాకి) పొడిస్తే, చెట్లు వాటి గెలలు కూడ పాడై, పట్టుతప్పుతాయని తెలుస్తుంది.

**సాంఘిక నమ్మకాలు :** తెలియని వ్యక్తులు ఎవరో తెలుసుకోవటానికి జానపదులలో కొన్ని నమ్మకాలున్నాయి. కుమారుని ( వరుసకు కుమారుడైన వానిని కూడ) చూడగానే తల్లికి వరుసకు తల్లియైనవారికి కూడ) పాలు జాలువారుతాయనే నమ్మకం జానపదులలో ఉంది. మత్స్యకారుల వద్ద లభించిన కథలో ముదుబాల రాముడు నూతిలో ఉన్నాడని తెలుసుకొని తల్లి శివనందులమ్మ నూతివద్దకు వెళ్లి చూస్తుంది. అప్పుడు ఆమె వక్షోజాల నుంచి పాలు జాలువారి అతనిమీద కురియగానే తన కుమారుడని గ్రహిస్తుంది. జంపన సిద్ధభుక్తికి వెళుతూ మధ్య దారిలో ఎల్లమ్మ అక్కచెల్లమ్మ వల్ల బాణం దెబ్బతిని పడిఉంటాడు. బాణం దెబ్బ తిన్న వానిని చూద్దామని వెళ్లిన చెల్లమ్మకు జంపనను చూడగానే పాలు జాలువారి అతనిపై పడతాయి. అప్పుడు తన చెల్లెలి కుమారుడని చెల్లమ్మ, తన పెద్దమ్మని జంపన ఒకరి నొకరు తెలుసుకుంటారు.

**ఆరోపణలు - నమ్మకాలు :** జానపదులు నేడు జరుగుచున్న లోకంతీరును ఆచార్యవ్యవహారాలను, గతంలో ఎప్పుడో దేవుడు దేవత సమయంలో జరిగాయనీ, అప్పటినుంచి, అలాగే జరుగుతున్నందునే, ఇప్పటికి జరుగుతుందని చెబుతారు. ఈవిధమైన ఆరోపణలు, ఆచారాలు ప్రజలలో ప్రాచీన ఆచారాలపై గల ప్రగాఢ విశ్వాసాన్ని తెలియచేస్తున్నాయి. వాటిని పాటించకుంటే

తమకి కీడుజరుగుతుందనే భావన వారి మాటల్లో వ్యక్తం అవుతుంది. ఈవిధమైన నమ్మకాలు జానపదులలో అదిమానవశక్తిపై నమ్మకాన్ని పెంచి, వేదాంత ధోరణిలో వారు ఆత్మతృప్తితో జీవించటానికి ఉపకరిస్తాయనవచ్చును.

కల్లుసాటువలో సత్తెమ్మ చెట్టుగాళ్లకు (గౌడ కులస్థులకు) కల్లుగీస్తూ చెట్టుమీద నుంచి పడినా చావకుండా వరమిచ్చింది. ఆ వరాన్ని వాళ్ళ తాడిచెట్టు మొవ్వులో దాచుకున్నారు. అది ఉడుత మింగింది. కాబట్టే ఉడుత ఎంత ఎత్తునుంచి, కిందపడినా చావదు. ఆ వరం నిలుపుకోలేకపోయినందుననే వాళ్ళ కల్లుగీస్తూ, చెట్టుమీద నుంచి కిందపడి మరణించటం సంభవిస్తూంటుంది.

సెనగల కథలో తనను పల్లకిలో ఎక్కించి మోసినందుకు సత్తెమ్మ బ్రాహ్మణులకు కోమట్లకు వరాలిస్తుంది. ప్రజలకు శుభాశుభాల గురించి చెబుతూ, రాజులు వారికిచ్చిన మాన్యాలను అనుభవిస్తూ, సంఘంలో గౌరవంతో సుఖంగా జీవించమని బ్రాహ్మణులకు, తక్కువ ధరలకు వస్తువులను కొనుక్కొని ధరలు పెరిగాక రెట్టింపు ధరలకు అమ్ముకొని, వ్యాపారంలో ఎక్కువ లాభాలు పొంది సుఖంగా జీవించమని కోమట్లకు వరాలిస్తుంది.

పరశురాముడి కథలో బాలుడుగా ఉన్నప్పుడ అతనిని తొక్కి చంపమని, అతని మేనమామలు (కార్తీకరాజు) ఏనుగులు, మొదలైన వివిధ జంతువుల్ని పంపుతారు. వాటినుంచి రక్షింపబడడానికి అతడు గ్రద్ద సహాయంపొంది, తర్వాత గద్దకు వరమిస్తాడు. ముందుకాలంలో గద్దగా పుట్టి, కోడిపిల్లల్ని తిని బ్రతకమని వరమిస్తాడు.

'స్వామి వారు విజ్జుల మేడలలోని కెళ్లడం' కథలో అమ్మవారు తనను మోసుకెళ్లడానికి నక్కను సృష్టించుకుంటుంది. తనను మోయటానికి పనికొస్తుందని మంచం కాళ్లదగ్గర కట్టుకుంటుంది. అందువలననే ఎక్కడైనా అమ్మవారి గుడి కడితే, అమ్మవారి ఎడమకాలి దగ్గర నక్కబొమ్మను వేస్తారు. బాలుణ్ణి తినమని నూతివద్దనున్న బాలుడి దగ్గరకు నక్కను పంపుతుంది. తన వద్దకు వచ్చిన నక్క పైకెక్కి బాలుడు నక్కమీద స్వారీ చేసి, దానిని నానా కష్టాలు పెడతాడు. చివరకు నక్కను ఊళ్లో ఉండొద్దని, స్మశానంలో ఉండి అక్కడ పాతిపెట్టిన శవాలను తిని బ్రతకమని వరమి(ఆదేశి)స్తాడు.

శక్తి పుట్టుదల కథలో శక్తిని త్రిమూర్తులు చంపినపుడు, పెద్దవాడైన బ్రహ్మదేవతకు తల కొరివి పెట్టించి, తల్లిని చూర్ణం చేస్తారు. ఆ చూర్ణాన్ని తిందామని బ్రహ్మ అంటాడు. మనం తింటే కలియుగంలో పుట్టే ప్రజలు కూడ అలాగే చేస్తారని, వద్దని ఈశ్వరుడు బ్రహ్మను వారిస్తాడు. ఆనాడు త్రిమూర్తులు చేసారు కాబట్టే, ఈ కాలంలో కూడ తల్లిదండ్రులు చనిపోతే పెద్ద కొడుకుచేత తలకొరివి పెట్టించి తల్లిదండ్రుల్ని చూర్ణం చేస్తున్నారు.

శక్తికి తన కుమారులు త్రిమూర్తుల్ని చూడగానే మోహం కలిగి వారిని పొందమంటుంది. కుమారులు తల్లిని పొందితే, నరలోకంలో కూడ తల్లీకొడుకల మధ్యసత్సంబంధాలు ఉండవని తల్లిని వారించి, తిరస్కరిస్తారు.

స్వామివారు విజ్జులమేడల కెళ్లే కథలో రవద్దేవిరాముడు శక్తిమేడల కెళ్లి, ఆమెను వెదకుతాడు. అక్కడున్న సమస్త వాద్యాలు వాయించినా రాదు. చివరకు పంబనాదం వాయిస్తే వస్తుంది. పంబనాదాన్ని పాలనేతులతో కడుగుతాడు. ఎర్రముగ్గు, నల్లముగ్గు, తెల్లముగ్గు, పచ్చముగ్గూ అన్నీ కలిపి పద్ద(ద్మం) వేసి, అచ్చట తాను పట్టుకెళ్లిన అప్పాలు, పాలకాయలు, బూర్లు, గారెలు, గొర్రెమాంసం, కల్లు, మొదలైనవన్నీ పెడతాడు. ఈరోజులలో పంబలవారు చేస్తున్న సత్తెమ్మ సంబరాలలో కూడ ఇవన్నీ ఉంటాయి. ఆనాడు రవద్దేవి రాముడు చేయబట్టే ఈనాటివాళ్లు కూడ చేస్తున్నారని జానపదుని భావన.

గౌరమ్మ కథలో జంపన మరణించాక అతని చుట్టూ పక్షులు తిరుగుతున్నాయి. ఇది గమనించిన పరశురాముడు చూసి రమ్మని డేగను పంపుతాడు డేగ వెళ్లగానే పక్షులన్నీ పారిపోయాయి. అప్పుడు డేగను చూసి పక్షులన్నీ పారిపోయినందునే, ఇప్పటికీ డేగను చూస్తే పక్షులన్నీ పారిపోతున్నాయి.

పిల్లలు కాని, పెద్దవారు కాని బయట నుంచి వచ్చినపుడు వారికూడ బయటనుంచి దుష్టశక్తులు వస్తాయని, వారితోపాటు ఇంటిలో నున్నవారికి కూడహాని చేస్తాయని, దిష్టి తీస్తారు. ఈవిధంగానే జంపన ఇంటికెళ్లినపుడు గౌరమ్మ అన్నమీద ప్రేమకొద్దీ దిష్టి తీస్తుంది.

**సన్నిహితులమధ్య ప్రేమ ఉండటానికి సంబంధించిన నమ్మకాలు :** సన్నిహితులకు లేక సంబంధికులకు తలలో పేలుచూస్తూ, పేను దొరికితే చూసిన వారిమీద, అవతలి వారికి ప్రేమ ఉన్నట్టు, దొరకకపోతే ప్రేమ లేదన్నట్టు జానపదులు భావిస్తారు. ఇందుకు ఆయా కథలలో కొన్ని సంఘటనలు ఉదాహరణగా చెప్పవచ్చును.

జంపన కథలో జంపన సిద్దులకు విందుగావెళుతూ, మధ్యదారిలో తన ప్రేయసిజట్ల మాణిక్యం వద్ద కెళతాడు. ఆమె తన భర్త తనమీద ప్రేమతో వచ్చాడో, ప్రేమలేక వచ్చాడో తెలుసుకోవటానికి ఆతని తలలో పేలు చూస్తుంది. పేను దొరికితే ప్రేమతో వచ్చినట్టు, లేకుంటే మామూలుగా వచ్చినట్టు భావించాలి.

అదేవిధంగా జానపదుల మధ్య ప్రేమ చూపించటానికి ఒకరి తలలో ఒకరు పేలు చూడడం, వీపు మట్టి నలపడం చేస్తారు. గౌరమ్మ కథలో గౌరమ్మను బలిజీడు తీసుకెళ్లిపోయినప్పుడు ఎల్లమ్మ తలలో పాయపెడతావనుకున్నాను' అని కూతురి కోసం ఏడుస్తుంది. దీనినిబట్టి ఇవన్నీ ప్రేమలు ఒలకబోసుకోవటానికి జానపదులు చేసే పనులని తెలుస్తున్నది.

**ఒకరికి హాని జరిగినపుడు వారి రక్తసంబంధీకులకు అసాధారణ పరిస్థితు లేర్పడడం :** తమ వారికి హాని జరిగినపుడు రక్తసంబంధీకులకు అసాధారణంగా తోస్తుంది. గౌరమ్మ కథలో కార్తీకరాజు జంపన గుండె మీద బండరాయి పడవేయగా, అతడు మరణిస్తాడు. అప్పుడు సముద్రపొడ్డున వెండి సురటీలు వేస్తున్న అతని తమ్ముడు పరశురాముడికి వేసుకున్న తాంబూలం చేదుగా అనిపించింది.

**జానపదులకు 'ఏడు' అంకె ప్రీతిపాత్రత :** జానపదులు ఆయా సందర్భాలలో ఏడు అంకెను ఎక్కువగా వాడతారు. కాశమ్మోరు కథలో ఆమె తన కోరిక నెరవేర్చనందుకు తండ్రికి వ్యాధి రప్పించి చాలా కష్టాలు పెడుతుంది. ఈశ్వరునికి పొంగువ్యాధితో శరీరంపై ఏడు తొడుగులు తొడిగించి, ఏడుపూతలు పూయించింది. మశాన దేవత కథలో ఏబారి ఎల్లమ్మకు ఏడుగురు అబ్బాయిలు తర్వాత అమ్మాయి పుట్టడం, ఆమెను ఏడుగురు ఎరుకలవారు పెంచుకోబోవడం, ఆమెను గంగలో వేయటానికి ఏడుగురు ఆడపిల్లలున్న జాలరి పూనుకోవడం, ఆమె మళ్లీ ఏడుగురు మునులకు దొరకడం ఇవన్నీ జానపదులకు ఏడు అంకె ప్రీతిపాత్రమని తెలియచేస్తున్నాయి.

**ఉపదేశం :** చెడుపనులు చేయటానికి కొంతమంది ధనంమీద ఆశకొద్దీ పూనుకుంటారు. అటువంటి వారు తమ కార్యంలో విఫలురయితే, అన్ని విధాల నష్టపోతారని చెప్పటానికి జానపదులు ఆయా కథాసందర్భంలో ఉపదేశమిస్తుంటారు. జంపన కథలో జంపనను చంపమని ఎల్లమ్మ పాముని పంపుతుంది. చంపివస్తే, కోడిగుడ్డు ఇస్తానంటుంది. గుడ్డుకి ఆశపడ్డ పాము జంపన వద్దకెళ్లి అతనిచేత చంపబడి, తిరిగి బ్రతికింపబడి (రూపంలో మార్పు తెచ్చుకొని) ఎల్లమ్మ వద్దకు వెళుతుంది. తన కుమారుణ్ణి చంపకుండా వచ్చినందున ఎల్లమ్మ పాముని కొట్టి తరుముతుంది. అక్కడనుంచి బయలుదేరి పాము తన పిల్లలున్న పుట్టవద్ద కెళుతుంది. రూపంలో వచ్చిన మార్పువల్ల, ఆమె తమ తల్లికాదని తలచి, పిల్లలు కూడ తరుముతారు. ఈవిధంగా పాము ఏకాకి అవుతుంది. ఈవిధమైన కల్పనచెడుపనులు చేసేవారు అన్నివిధాల నష్టపోతారని, చెడుపనులు చేయవద్దనే ఉపదేశంగా చెప్పవచ్చును.

**ఆయా వృత్తులవారి ఆచార సంప్రదాయాలు :** పోలేరమ్మ కథలో మత్స్యకారులు నావను సముద్రంలోకి దించేతీరు వివరించబడింది. తెల్లవారుజానున రెండు నక్షత్రాలు కలిసే సమయంలో దింపుతారట. తెల్లవారుజామున రెండుచుక్కలూ ఏదో సమయంలో కలుస్తాయట. దీనినిబట్టి రెండు నక్షత్రాలు కలిసే సమయం శుభసూచక మని, వారు భావించినట్టు చెప్పవచ్చును.

కల్లు సాటువ కథలో కల్లు అడిగిన ముసలమ్మతో, తమ్మన్న కాటుమాయమ్మ (వారి దేవత) కు కల్లు పోయ్యలేదు. బాలపాపలకు ఎంగిళ్లు తియ్యలేదు అంటాడు. దీనినిబట్టి వాళ్లు చెట్టు నుంచి కల్లు దింపగానే ముందుగా పైన పేర్కొన్న రెండు పనులు చేసాక అమ్మకం, దానధర్మాలు చేస్తారని తెలుస్తుంది.

**విధవరాండ్రు ఏకులరాట్నం వడుకుట :** వితంతవులు ఏకులరాట్నం వడుకుట సంఘంలో జరిగేది కావచ్చు, భర్తలు పోయినందున వీరికి సంసార బాధ్యతలు తక్కువై, అత్తచాటు కోడలిగానో, తల్లిచాటు కూతురిగానో ఉంటూ, ఇంటి నుంచి బయటకు వెళ్లక ఏకులరాట్నం వడికే పనిచేస్తున్నారనటానికి ఆయా సందర్భాలలో జానపదులు వ్యక్తం చేసిన భావాలే నిదర్శనం. పరశురాముడి కథలో తన మేనమామలు కార్తీకరాజుల్ని చంపదలచిన పరశురాముడు, ముందుగా ఎరుకని వేషంలో వెళ్లి, తమ అత్తలకు ఎరుక చెబుతాడు. అప్పుడు మీ భర్తల్ని పరశురాముడు యుద్ధంలో చంపితే, మీరు విదవరాండ్రై ఏకులరాట్నం వడకాలంటాడు.

గ్రామదేవతల కథల అధ్యయనం వల్ల పైన పేర్కొన్న అనేక విషయాలు తెలుసుకొని తద్వారా

గ్రామీణుల మనస్తత్వం, వారి జీవనవిధానం అవగతం చేసుకోవటానికి వీలుకలుగుతుంది.

## అనుభంధం 1

## సేకరించిన వివిధ గేయాలు, పద్యాలు, దండకాలు

విషయసేకరణ ఎక్కువభాగం వచనరూపంలో ఉన్నప్పటికీ, గేయాలు కూడ కొన్నిలభించాయి. వాటిలో పూజాగేయాలు, వర్ణనాగేయాలతోపాటు కథాగేయాలు కూడ ఉన్నాయి. అందలి కథలను సంబంధిత ప్రకరణాలలో వివరించినప్పటికీ, వీటిని కూడ ఇక్కడ పొందుపరుస్తున్నాను. కొందరు శిష్టులు గ్రామదేవతలపై తమ భక్తి ప్రపత్తులు ప్రదర్శిస్తూ, ప్రామాణికమైన సాహిత్యరచన కూడ చేసారు. వాటిలో గొల్లప్రోలు మండలం తాటిపర్తి గ్రామనివాసి ఆకొండివెంకన్న గారు తమ గ్రామదేవత గజ్జాలమ్మపై వ్రాసిన శతకం పేర్కొన దగింది. ఈ అముద్రిత గ్రంథంలో ఇరవదితొమ్మిది పద్యాలే లభిస్తున్నాయి. మండపేట మండలం మారేడు బాక గ్రామ నివాసి శ్రీ ముక్కుపాటి భాస్కరరామయ్యసిద్ధాంతి తమ గ్రామదేవత మావుళ్లమ్మపై వ్రాసిన దండకం కూడ లభించింది. ఇది ముద్రింపబడింది కూడ. ఆసాదులు కూడ గ్రామదేవతారాధనలో శిష్టులచే రచింపబడ్డ దండకాన్ని చదువుతారు. గ్రామదేవతలపై ఉండే భక్తికొద్దీ బుర్రకథ దళం వారు వారి బాణీలో గ్రామదేవత మీద కూర్చిన పాటలు కూడ ఉన్నాయి. పిఠాపురంలో బంగారమ్మ మీద ఒక బుర్రకథ పాట లభించింది. కావమ్మ పేరంటాలు మీద బుర్రకథ రచింపబడింది. కావమ్మకథ ముద్రింపబడినందువల్ల, నా గ్రంథవిస్తృతి భీతివల్ల ఈ బుర్రకథను ఇచ్చట పొందుపరచడం లేదు. నేడు ప్రజలను ఉర్రూతలూగిస్తున్న ఆధునిక సినీగీతాల బాణీలో ఆయా గ్రామాల భజనబృందాలవారు తమ తమ గ్రామదేవతలమీద పాటలు వ్రాసి పాడుతూ తమ భక్తి ప్రపత్తులు ప్రదర్శిస్తున్నారు.

## పూజా గేయాలు (పంబల వారివి)

### పాపచేట పాట

పాపాడేనమ్మా పాపాడెను – పాపాడేనమ్మ పాపాడెను
ఏడవకూ ఏడవకూ పాపన్నా – ఎందుకేడుత్తావు పాపన్నా
నిద్దరికి నూరేళ్ళు నీకు నూరేళ్ళు – నిను గన్నతల్లికి నిండు నూరేళ్ళు
గట్టంట పోయేటి గాజులాచేడి – తేవమ్మ పాపాకి తేనెగాజులూ
పుంతల్లో నీలానిపావన్న – పోసేవారెవరమా పాపన్నా
ఏడవకూ ఏడవకూ పాపన్నా – ఎందుకేడుస్తావు పాపన్నా
కళ్లాకాటుకజూసి పాపన్నా – కల్లెరుపూజూసి పాపన్నా
ఏటిమీది గిరిరాజా – నిన్నడిగీనాడు
ఎందుకడిగీనాడు ఏలడిగీనాడు – రూపాయిత్తానని రూపడిగినాడు

ఏడవకూ ఏడకూ పాపన్నా - ఎందుకేడుత్తావు పాపన్నా

**నివ్వాళి పాట**

ఎండీపల్లెములోనూ నివ్వాళో - ఒడుతులేపట్టారు నివ్వాళో

కంచూపల్లెములోను నివ్వాళో - కాంతలేపట్టారు నివ్వాళో

రాగీ పల్లెములోనూ నివ్వాళో - రంభలే పట్టారు నివ్వాళో

**దీవెన పాట**

దివ్వించాలమ్మా దివ్వించాల - కొడుకులు కుమారుల్ని దివ్వించాల

కోటేల సంపదలు దివ్వించాల - దివ్వించు వారింట మరిఏమి కలుగు

ఎండీ బంగారం ఇలతూగుటుండాల - పాడీపంటలు భాగ్యరేకలు కలగాల

అల్లుళ్ల ఆడబిడ్డలు దివ్వించాలా - అతికమైన సంపదలు దివ్వించాల

కోటిరాశులమీద దివ్వించాల - కోడైకూత్తుండాలని దివ్వించాల

**గంగాలమ్మ పాట ( మన్యం ప్రాంతంలో పాడే పాట)**

రావే రావే గంగాలమ్మ - రాగాదేవో గంగాలమ్మా

చూడే చూడే గంగాలమ్మా - చూడాగాదే గంగాలమ్మా

మావంక చూడవే గంగాలమ్మా - మమ్ము కాపాడవే గంగాలమ్మా

ఏడాదికోసారి గంగాలమ్మా - నీ సేవ చేసెదమె గంగాలమ్మా

నెలకు మూడొరసాలు గంగాలమ్మా - మాకు కురిపించాలి గంగాలమ్మా

ఒడ్డాది కొండనే గంగాలమ్మా - లయమల్లి ఒరసాలు గంగాలమ్మా

మాడుగుల కొండనే గంగాలమ్మా - మగుమండి కలగాల గంగాలమ్మా

మాయిల్లు నిండాలి గంగాలమ్మా - నీసేవ సేసెదమె గంగాలమ్మా

మావంక చూడవే గంగాలమ్మా - మమ్ము కాపాడవే గంగాలమ్మా

*అద్దేపల్లి రాజారావు, గొల్లపల్లి రాజారావు, రాజఒమ్మంగి*

**నూకాలమ్మా పాట**

మాయామ్మవే నీవు నూకాలమ్మ వేనీవు - ముందుగానే యీధరలోనే నీవమ్మా

డమ డమ డప్పులతోనా - సబయంతా నీకేనమ్మా మాయమ్మవే

ఏడుగొమ్మలమేక వేటలు - నీకు ఇడుతుమమ్మా మాయమ్మవే

ఓబరిణి కుంకుమలమ్మా - ఒడ్డాది 'సుపూలమ్మా మాయమ్మవే

గొర్రులూ మేకలూ గొప్పే నీకమ్మా - నీలాల కమలపు తల్లివి నీవమ్మా

నీసల్లనైన కొసరాశిపునే నూకాలమ్మ - మాయమ్మవే నీవు నూకాలమ్మావే నీవు

ముందుగానే యీధరలోనే నీవమ్మ

*గొల్లపల్లి ముసిలయ్య, రాజహొమ్మంగీ*

**మేలుకొలుపు పాట :**

ఆనందమే ఆనందమే - ఆనందమమ్మా ! వైబాగ్గెమా

నినుగొలిశానా నినుగొలిశానా - నినుగొలిశానమ్మా ! నీకు మొక్కేనా

రాజు గొలిశనూ రంగమాడెనూ - రాజు కొలిశానవ.మ్మా రంగమాడెనూ!

ఎట్టిమెట్టిన తల్లి నన్నావే ! - మట్టికి మావు తల్లినన్నావే

పువ్వులికి పున్నెశాలినన్నావే ! - భూలోకరంభ నేనన్నావమ్మా !

ముగ్గురు ముగ్గురు తల్లి నన్నావే - మూలనున్న ఆదిశక్తినన్నావే

పనిపట్టీసీర కట్టుకున్నావే - మావిడాలబొట్టు పెట్టుకున్నావే

ముక్కు ముంగరెట్టుకొని బా ల పైటేసుకొని - ఏదేశమెల్లావే అమ్మా నీవు

కళ్యాణ జాగాలే అమ్మా నీవో - ఒల్లల్లా మరిసావు అమ్మా నీవు

తాగింది తవుడుకల్లు ఓరి మనవుడా - తాడిసుట్టూ తిప్పావు ఓరి మనవుడా

మందేల పెట్టావు మానీడ - మాకేల పెట్టావు మానీడ

మందుగాదు మాయగాదు అమ్మానీకో - మలుపుతాటీకల్లు దేవతా నీకో

నల్లగొండ నాంచారీ నన్నావే - నీవు నాటవైతేలిపో నన్నావే

ఆడతావమ్మో ఆడతావే - పాడతావమ్మో పాడతావే

నువ్వాడవే నేనాడెనా - ముచ్చాలనానలే కురిశావమ్మో

ఎరుకలేత పల్లకీని ఎరుక లేసమేసుకొని - ఏ ఊరు ఎళ్లావు అమ్మా నీవు

సింకుసెట్టూ బొంకునెట్టుకున్నావో - పిల్లవాణ్ణి సంకనెట్టుకున్నావమ్మా

కాళ్లాగజ్జాలమీద గల్లో గల్లో - ఓరుగల్లురాజుకే చెల్లో చెల్లో
రాయబారమే రాయబారమే - రాయబారమా రచ్చబారమా
రాయబండదేవతా రచ్చబండదేవతా - ఓయి ఓయిదేవతా ! ఓయిదేవతా
నీవు నాతల్లివే నేను నీబిడ్డనే - నీవునేను కూడుకొని సల్లచెయ్యాలి
సాయనాదేవికి సల్లకావుళ్ళో - సాయినాదేవికి పాలుకావుళ్ళో
పోతా పోటీకాడ జంగామయ్యా - ఒల్లెలా యిాబూది జంగామయా
పల్లుకింద పక్కుళ్ళా జంగా మయ్యా - మాయదారికోడమ్మ జంగామియ్య
సల్లీమువ్వలాడే జంగామన్నో - మంచీగంధంవాడే జంగామన్నా
జంగమో లింగమో ఓయి లింగమా - ఓయి ఓయి లింగవూ పాడులింగవూ
ఓరుగల్లు కొట్టావే అమ్మానీవు - ఓలాలాడించావే అమ్మా నీవు
జిత్తుల జిత్తులవాడు రాయడే దేవుడా - శత్తి కన్న పెద్దోడు బాలనాగన్నా
రాజులకీ దేవుడికీ కళ్యాణమే - ఇంతా కళ్యాణమే నిను గొలిశారా
ఆడతామమ్మో పాడతామే - నువ్వాడకమ్మా నేనాడగా
నల్లముగ్గు నాలుగేలు అమ్మా నీకో - పచ్చముగ్గు పదివేలు అమ్మా నీకో
మే అన్నామేకలే అమ్మా నీకో - కా అన్న కారుకోళ్ళ అమ్మా నీకు
అరిసేటి గొఱ్ఱులే మెరిసేటి కత్తులే - కుడువులే గుగ్గిలు కుంభాలు నీకు
ఏబులుమే గుగ్గులుం అమ్మా నీకు - ఏకాదూపాలమ్మా తల్లీ నీకు
చింతలోరు చింతలపైన ఓరిగుమ్మడో - గిరిగిరా జారాడు ఓరిగుమ్మడో

***రేవు గంగరాజు, పిఠాపురం***

**జగదంబ పాట :**

అమ్మా రావే అమా రావే శారదాంబా - జగదాంబవైనా నీవే నాచూడే అంబా చూడే అంబా
నీసేవాచేతూమమ్మా శారదాంబా - నినుబాగా కొలుచుదువమ్మా శారదాంబా
కష్టమందు కాపాడుము తల్లీ శారదాంబా - నీ పాదపద్మములు సేవసేతుమా చూడే అంబా అంబా చూడే బో
అమ్మా బెజవాడలో వెలిసితివమ్మా శారదాంబా - దేశమెల్ల పేరెల్లితివమ్మ శారదాంబా అంబా శారదంబా
కావిడికోడులు గండదీపమా శారదాంబా - గనువుగానే వెల్లింతరావమ్మా శారదాంబా అంబా శారదాంబా
అంబరావే జగదాంబ రావే - అంబా జగదాంబా భూలోకం రంభా !

అమ్మా !

మముగన్న మాయమ్మ నీకు మ్రొక్కేదమమ్మా !

*శివకంచి నాగరాజు, బలభద్రపురం*

**ఎరుక పాట**

***(పంబలవారి కల్లుసాటపకధలో ఎరుకత వేషం వేసిన సత్తెమ్మ పాడే ఎరుకపాట)***

| | | |
|---|---|---|
| 'యబో యబో ఏరూక గోవిందనాథా ఎరూక | - | గోవిందనాధా ఎరూక గోపాలనాధ ఎరూక |
| మేమెరుక సెప్పినా ఏడూ గడియలకు | - | అద్దంలో మీబిడ్డ ఆడుచుండాల |
| అద్దంలో మీ బిడ్డ ఆడుచుండాల | - | తప్పకా నామాట దైవాలతోడు |
| తూరుపూరాజులకి ఎరుక నేజెప్పితే | - | తొమ్మిది మూళ్లాసీర వారెట్టినారూ |
| దక్షిణా రాజులక ఎరుక నేజెబ్బితే | - | ఆ దండాగడియాలు వారెట్టినారు |
| తూరుపూ రాజులకు ఎరుక నేజెప్పితే | - | తొమ్మిదిమూళ్లాసీర వారెట్టినారూ |
| యబో యబో ఏరూకా గోపాలనాథా ఏరూకా | - | గోపాలనాథా ఏరూకా గోవిందనాథా ఏరూకా |

*శివకంచి మాధవ, పిఠాపురం*

**గంగాలమ్మ పాట ( మన్యం ప్రాంతంలో పాడే పాట)**

| | | |
|---|---|---|
| రావే రావే గంగాలమ్మ | - | రాగాదేవో గంగాలమ్మా |
| చూడే చూడే గంగాలమ్మా | - | చూడాగాదే గంగాలమ్మా |
| మావంక చూడవే గంగాలమ్మా | - | మమ్ము కాపాడవే గంగాలమ్మా |
| ఏడాదికోసారి గంగాలమ్మా | - | నీ సేవ చేసెదమె గంగాలమ్మా |
| నెలకు మూడొరసాలు గంగాలమ్మా | - | మాకు కురిపించాలి గంగాలమ్మా |
| ఒడ్డాది కొండనే గంగాలమ్మా | - | లయమల్లి ఒరసాలు గంగాలమ్మా |
| మాడుగుల కొండనే గంగాలమ్మా | - | మగుమండి కలగాల గంగాలమ్మా |
| మాయిల్లు నిండాలి గంగాలమ్మా | - | నీసేవ సేసెదమె గంగాలమ్మా |
| మావంక చూడవే గంగాలమ్మా | - | మమ్ము కాపాడవే గంగాలమ్మా |

*అద్దేపల్లి రాజారావు, గొల్లపల్లి రాజారావు, రాజులమ్మ[illegible]*

**నూకాలమ్మా పాట**

| | | |
|---|---|---|
| మాయామ్మవే నీవు నూకాలమ్మ వేసీవు | - | ముందుగానే[illegible]భరతో వే నీవమ్మా |

డమ డమ డప్పులతోనా – సబయంతా నీకేనమ్మా మాయమ్మవే
ఏడుగొమ్ములమేక వేటలు – నీకు ఇడుతుమమ్మా మాయమ్మవే
ఓబరిణి కుంకుమలమ్మా – ఒడ్డాది పసుపూలమ్మా మాయమ్మవే
గొర్రులూ మేకలూ గొప్పె నీకమ్మా – నీలాల కమలపు తల్లివి నీవమ్మా
నీసల్లనైన కొసరాశిపునే నూకాలమ్మ – మాయమ్మవే నీవు నూకాలమ్మావే నీవు
ముందుగానే యీధరలోనే నీవమ్మ

*గొల్లపల్లి ముసిలయ్య, రాజపొమ్మంగీ*

## ఆసాదివాని మంగళహారతి పాట

ఆది దేవతవు నందురు ముందుగా నినుకొలిచి ఇందు జనులు
పొందువైన తమ్ముడు పోతురాజానకు అందమైన తల్లి
గుబ్బాలమ్మా మంగళా జైమంగళా
కాపుసీరలుగట్టి గస్తూరిబొట్టెట్టి కన్నులా సన్నంగి కాటుకుంచి
కాంతలను వీరులను కాసి రక్షించమని ఘనముగా వచ్చారు
గుబ్బాలమ్మా మంగళా జైమంగళా
ముత్యాలు వజ్రాలు మును మనుమలతోను చిత్తును నివ్వాళి చేతి మనువు
నంది నెక్కిన శివుడు వాసాలి మనవాలి మూల నుంచిన
గుబ్బాలమ్మా మంగళా జైమంగళా
పువ్వులా నినుగొలుతు అక్షింతుల నిను గొలుతు గంధాన్ని నినుగొలుతు కస్తూరి నినుగొలుతు
ఎప్పటికి నినుగొలుతు ఏకచిత్తముతోను మనసా నినుగొలుతు పరమేశ్వరీ మంగళా జైమంగళా
భూమి పుట్టుక పుట్టిన తల్లివని భూలోకసుందరివి శక్తినీవు
గౌరి కుంకుమతోని గంభీరమని నీవు కాపాడు రక్షించు
గుబ్బాలమ్మా మంగళా జైమంగళా

*ఆసాది శ్రీరామమూర్తి, ఊలపల్లి*

## ఆసాదివాని దండకం

శ్రీ రాజరాజశ్వరి, శంకరీ శాంభవీ, వైష్ణవీ, శాకిణీ, ఢాకిణీ, శంభురాణీ
మహాబీల జోలేశ్వరీ కోటిసూర్యప్రకాశుని ముదంబొప్ప శ్రీ వేదరా
డ్యాంమండుం కోరిబాపిరాజేటక్విన్ పుత్రుడున్, లింగరాట్క వియున్,
(దండక కర్త) హరిభక్తుడన్, ఆనాడు ఆదేవి నిర్వికారంబు నున్న
బయలందిన్, ఓంకార శబ్దము బుట్టంగ నట్టి ఓంకారంబులో

ుట్టియున్ ముమ్మూర్తులను చూచి యాశక్తి మోహించకుండ దాగియుండగా
ప్పుడారుద్రుండున్ చూసి, వోతల్లి మేమునీపుత్రులమై పుట్టియుండంగ

అని ఈవిధంగా సాగే ఈదండకంలో శక్తిదేవత పుట్టడం, త్రిమూర్తులు పుట్టడం ఆమె విధ ప్రాంతాలలో వివిధ పేర్లతో పూజింపబడడం, సర్వజనులూ ఆమెనూ పూజించి, వివిధరకాల ముక్కులు చెల్లించడం మొదలైనవన్నీ వర్ణింపబడ్డాయి.

## ర్ణనాగేయాలు ( దుర్గమ్మ గేయం)

కూతురా కూతురా ! బెజవాడ దుర్గమ్మ నీ నూటొక్క మెట్టులకి నిలిశి వందనమా !
నువు ఏదరినున్నావో కూతురా జగదంబా భూలోకశత్తమ్మా ఓయిదుర్గమ్మా !
ఏ కుడిచేతిలోనమ్మ కుంకులా బరిణమ్మ నీ ఎడమాచేతిలోన ఏపరొట్టాతల్లీ !
నీ జానీకి నాలుకలే జానాడే బల్లూలే ఏదరిని ఉన్నావోతల్లి నీకు వందనమూ !
ఏదరిని ఉన్నావో నిన్నెంచలేమమ్మో జగదంబా పారివోతి నీకువందనమూ !
నీ కుడిచేతిలోన కుంకాల బరిణి కుంకాల బరిణి !
నీ ఎడమచేతిలోన ఏపరొట్టతల్లీ ! ఏపరొట్టతల్లీ !
జల్లీ పాపిడికొప్పు నీకందమమ్మ ! నీకందమమ్మా
జానడే నాలుకలు ఓయిదుర్గక్కా ! ఓయిదుర్గక్కా !
నడిసేటి కాళ్లకీ నాగుటందీలు నాగుటందీలు
ఇసరేటి సేతులుకి ఈరగడియాలు ఈరగడియాలు
దానైన సేతులుకి దండగడియాలు దండగడీయాలు
గంద్రగొడ్డళ్లమ్మ ఓయి దుర్గక్కా ఓయి దుర్గక్కా
గజాసూలాలమ్మ ఓయి దుర్గక్కా ! ఓయి దుర్గక్కా !
నూటొక్క మొట్టులుకి యేకవందనమూ ! యేకవందనమూ !
ఆతికప్పూరాలు వారతులు తల్లీ ! వారతులు తల్లీ !
కొట్టన్న కొబ్బరులు కొమ్మరటిపళ్ళు ! కొమ్మరటిపళ్ల !
నల్లమా చెరుకులు బొంతరటిపళ్లా ! బొంతరటిపళ్లా !
ఎంగిలీ కంతాన్ని ఎత్తిపిలిశామూ ! ఎత్తిపిలిశామూ !
మానవాజనమాన్ని మన్నించలేము ! మన్నించలేమూ !
నీతిమాజనమాన్ని నిలపలేమమ్మా ! నిలపలేమమ్మా !
ఏడేడు సంద్రాన పాలసంద్రాన ! పాలసంద్రాన !
పాలసంద్రం కింద వగ్గుళ్లపుట్ట ! వగ్గుళ్లపుట్ట !
వగ్గుళ్లపుట్టలో బాలనాగన్న ! బాలనాగన్నా !

ఆదివై నిలిశావు ఓయి దుర్గక్కా ! ఓయి దుర్గక్కా !
ఒరికూడు కుంబాలు ఓయిదుర్గక్కా ! ఓయిదుర్గక్కా !
కాళాత్తి పెరిగావు ఓయి దుర్గక్కా ! ఓయి దుర్గక్కా
కిట్నానదీకైనా తానాలకెళ్లి ! తానాల కెళ్లి !
ములిగిపోయేవమ్మ బెజవాడ దుర్గా ! బెజవాడదుర్గా !
లంబాటివోరమ్మ నిన్ను తీసారు ! నిన్ను తీసారు !
ఒడ్డుపైనెట్టేరు బెజవాడ తల్లీ బెజవాడ తల్లీ !
ఒల్లల్ల పసుపులూ ఓయి దుర్గక్కా ! ఓయి దుర్గక్కా !
ఒల్లల్ల కుకంకాలు ఓయి దుర్గక్కా ! ఓయి దుర్గక్కా !
పువ్వులే పుసపాలు నీపూజలమ్మా ! ఓయి దుర్గక్కా !
నూటొక్క మెట్టుమీద నిన్ను బెట్టేరు ! నిన్ను బెట్టేరు
సుక్కురోరంనాడు కుంకాల పూజి కుంకాల పూజి
లచ్చివారంనాడు పుసపాలపూజి ! పుసపాల పూజి !
మచ్చులేనిపోతులే ఓయి దుర్గక్కా ! ఓయి దుర్గక్కా !
కోడిపుంజాలైనా నీకు కోత్తారు ! నీకు కోత్తారు !
ఇంటికడ తల్లులే ఓయి దుర్గక్కా ! ఓయి దుర్గక్కా !
ఇల్లలికి ముగ్గెట్టి ఈతచిలికేసి ! ఈతచిలికేసి !
ఎంతచక్కానిదానివోయి దేవతా ! ఓయి దేవతా !
నడిసేటికాళ్లకీ నాగుటందీలు ! నాగుటందీలు !
ఎంతచక్కని దేవతా బెజవాడ దుర్గమ్మా ! బెజవాడ దుర్గమ్మా
సిన్నలకి పెద్దలకీ సక్కాని దేవతా! సామల్కోట గ్రామంలో అమా దుర్గమ్మా !
నువు పుసుపులమ్మో నిలిసావు అమ్మా దుర్గమ్మా !
నువ్వెంత సక్కాని దేవతవే అమ్మా దుర్గమ్మా
నీ నూటొక్క మెట్టూమీద అమ్మా దుర్గమ్మా !
నువు పెద్దాపురం గ్రామంలో అమ్మా దుర్గమ్మా
నువు మరిడమ్మో నిలిశావే అమ్మా దుర్గమ్మా !
నువు కాండ్రకోట గ్రామంలో అమ్మా దుర్గమ్మా
నువు నూకాలమ్మో నిలిశావే అమ్మా దుర్గమ్మా !
నీకు సారేడి బొట్టూలే అమ్మా దుర్గమ్మా
నీకు జానేడే నాలుకులే అమ్మా దుర్గమ్మా





దంగేటి అప్పయ్యమ్మ, సామర్ల

**కొత్తమ్మ పాట :**

| | | |
|---|---|---|
| శ్రీరామ రామండి ఓలె | – | ఓరామ రామండి ఓలె |
| నెలతప్పి నెల్లాయె ఓలె | – | రెండోనెల్లా గడిచి ఓలె |
| మూడూ నెల్లాయెనూ ఓలె | – | నాల్గోనెల్లా గడిచి ఓలె |
| అయిదోనెల్లాయెనూ ఓలె | – | ఆరోనెల్లా గడిచిఓలె |
| ఏడోనెల్లాయెనూ ఓలె | – | ఎనిమిదో నెల్లాగడిచి ఓలె |
| పన్నెండు నెల్లింకా ఓలె | – | బాగుగా గడిచింది ఓలె |
| తూర్పుగోదావరి ఓలె | – | తూనీ తాలూకాండి ఓలె |
| నందూరు మండలము ఓలె | – | కొట్టామూ శివ్వారూ ఓలె |
| తిమ్మరాజు పేట ఓలె | – | నిలుచూన్నా కొత్తమ్మా ఓలె |
| పూర్వాకాలమునాడూ ఓలె | – | మాపుంజా పెద్దాలు ఓలె |
| వనవాలు కొత్తమ్మా ఓలె | – | వడ్డీలు పలికేరూ ఓలె |
| వర్షానికైనాని ఓలె | – | బేపనోరమ్మాయి ఓలె |
| ఏగిపోయీ వచ్చావు ఓలె | – | మా గొల్లవాడలకీ ఓలె |
| చిన్నాలు పెద్దాలు ఓలె | – | చేమంగా ఉండాల ఓలె |
| మామీద చిత్తాలు ఓలె | – | మరచిపోవద్దండి ఓలె |
| పాకయినా లేదండీ ఓలె | – | పందిరీ లేదండీ ఓలె |
| పచ్చనీ చెట్టుకిందా ఓలె | – | నిలుచున్నా కొత్తమ్మా ఓలె |
| బేరీమీద దెబ్బ ఓలె | – | సప్పిడేంటంటావు ఓలె |
| ఏడాదికోమారు ఓలె | – | ఓకట్టి పిలిచారు ఓలె |
| ఏరీతుగున్నాది ఓలె | – | మాయా కొత్తమ్మండి ఓలె |
| చెట్టూ సివరామీద ఓలె | – | నిలుచున్నా కొత్తమ్మా ఓలె |
| పెద్దపులి వత్తాది ఓలె | – | బొబ్బలెట్టుతున్నాది ఓలె |
| కాంౖడూ కాంౖడూమాని ఓలె | – | కేకలెట్టూతున్నాది ఓలె |
| కొత్తమ్మా మామీద ఓలె | – | మయిమరచీ పోవద్దు ఓలె |
| చెట్టందు చేమందు ఓలె | – | చేమంగా ఉండాల ఓలె |
| దూడందు దుక్కందు ఓలె | – | మాదుట్టు ఉండాల ఓలె |
| గరువందు గట్టందు ఓలె | – | మాదుట్టు ఉండాల ఓలె |
| అమ్మా నీపెరెట్టి ఓలె | – | ఓ కొట్టి పిలిచాము ఓలె |
| మాగొల్ల యాదులకి ఓలె | – | ఓకొట్టీ పిలిచాము ఓలె |
| అరగడియా మాయందు ఓలె | – | ఆదుకో మాతల్లీ ఓలె |

| | | |
|---|---|---|
| కగ్రాసప్పుడుతోటి ఓలె | – | గనుముగా నినుగొలిచె ఓలె |
| చిన్నలమూ పెద్దలమూ ఓలె | – | మరిచేరుకున్నాము ఓలె |
| పెద్దాపేరంటాళ్ల ఓలె | – | మరిచేరుకున్నారు ఓలె |
| కొక్కొరోకోమని కోడి ఓలె | – | కూతకూసినదాక ఓలె |
| చేసారు సంబరమూ ఓలె | – | మాఎచ్చుగానండి ఓలె |
| కులకూల కన్నీరు ఓలె | – | కుమ్మారించావద్దు ఓలె |
| సరదాగా సంబరము ఓలె | – | సరిపాడా చేస్తాము ఓలె |
| చిన్నలమూ పెద్దలమూ ఓలె | – | మరిచేరికున్నాము ఓలె |
| తొలివారమూ గడిచె ఓలె | – | మరివారమొచ్చింది ఓలె |
| మూడొవారమునాడు ఓలె | – | ముద్దూగ నిన్నమ్మా ఓలె |
| కూర్చీకో కొత్తమ్మా ఓలె | – | మాకొరితెచ్చాము ఓలె |
| వనవాలో కొత్తమ్మా ఓలె | – | నిన్నూ పంపింతాము ఓలె |
| కోడులతో పాములతో ఓలె | – | కొదవలేకుండాను ఓలె |
| పచ్చాని చెట్టుమీద ఓలె | – | పప్పూవణ్ణంతోని ఓలె |
| లేతమామిడిమొగ్గ ఓలె | – | ఆనందపడతాము ఓలె |
| రెప్పపాటు సందూను ఓలె | – | కాపాడుమాతల్లి ఓలె |
| గారులతో బూరులతో ఓలె | – | గనమైన వంటలతో ఓలె |
| బేరీల దెబ్బలతో ఓలె | – | వనవాలొకొత్తాము ఓలె |
| పెద్దాపేరంటాళ్ల ఓలె | – | పిల్లాలు పాపాలు ఓలె |
| మూడోవారం నిన్ను ఓలె | – | మీయింటీవద్దాకి ఓలె |
| వనవాలోకి నిన్నూ ఓలె | – | మరిబంపూతామమ్మా ఓలె |
| కాపాడు కొత్తమ్మా ఓలె | – | కరుణించు మాపైన ఓలె |
| రెప్పాపాటు సందూ ఓలె | – | కోపంబువస్తేను ఓలె |
| ముద్దార నీమోము ఓలె | – | మాముద్దుతప్పింది ఓలె |
| వనవాలో కొత్తమ్మ ఓలె | – | ఉన్నావో లేదమ్మా ఓలె |
| మాఊరి కొత్తమ్మా ఓలె | – | మారిపోయావేమో ఓలె |
| చిన్నలకీ పెద్దలకీ ఓలె | – | యనుమానమొచ్చిందీ ఓలె |
| ఏవమ్మా నీరూపు లోలె | – | ఏమికాపాడవేమి ఓలె |
| మాఊరి కొత్తమ్మా ఓలె | – | ఏఊరు వెళ్లావు ఓలె |
| మామిద చిత్రాలు ఓలె | – | మైమరచిపోయావు ఓలె |
| పైడీజ వపాలండీ ఓలె | – | పట్టీఊపారండి ఓలె |

| | | |
|---|---|---|
| ఉలకావు పలకావు ఓలె | – | ఊరూకుంటావమ్మా ఓలె |
| కలలోన నీవైన ఓలె | – | కలగాచి పలికావు ఓలె |
| ఊరియందూన్నేను ఓలె | – | మాదుట్టీగున్నాను ఓలె |
| పెద్దందు పేమాకి ఓలె | – | ఎవరీకైనాకాని ఓలె |
| చీడీ మాన్యాలండి ఓలె | – | జాడిమన్యాలండీ ఓలె |
| మామాట తెలియాలి ఓలె | – | మన్నిరాజ్యాలండీ ఓలె |
| తప్పించుకు పోలేని ఓలె | – | కొత్తకొత్తమ్మా ఓలె |
| ఉండాలేక మేము ఓలె | – | అమ్మవారి పేరు చెప్పి ఓలె |
| పప్పాలు గారీలు ఓలె | – | గనుమూగా మేమింకా ఓలె |
| పండుకుతినడంతప్పా ఓలె | – | ఓలోలి కొత్తమ్మా ఓలి |
| ఏవమ్మా నీరూపులోలె | – | ఏమీ కనపడవమ్మా ఓలె |
| తూర్పూగోదావరీ ఓలె | – | తూనీతాలూకండి ఓలె |
| నందూరు మండలమూ ఓలె | – | తిమ్మరాజూపేట ఓలె |
| ముందూ పాడేనారు ఓలె | – | బళ్లానూకారాజా ఓలె |
| ఎనకాపాడేవారు ఓలె | – | పంపనోరీ(రాజా ఓలె |
| తరువాత పాడేది ఓలె | – | తాతయ్యగారండి ఓలి |

***బళ్ల నూకరాజు, తిమ్మరాజుపేట***

**తలుపులమ్మ పాట :**

లోవాకొత్తూరులో కనరాని కొండపై లోయలోన నిలిశినావు తలుపులమ్మా !

నీమహిమలు కానలేము నిజమేనమ్మా ! — లోవకొత్తూరు

మాకులాండి ప్రజలకు అందరికీ తల్లివమ్మా !

బత్తులకు తల్లివమ్మా ! బాగా నిలిశుంటివమ్మా ! — లోవకొత్తూరు

తూరుపు పడమర ఉత్తర దక్షిణమూ నీగుమ్మం

దక్షిణమూ నీగుమ్మం దయసూడుమ తలుపులమ్మా ! — లోవకొత్తూరు

టాటర్లా, మోటర్లా తరసుగానే నడిపావు

యాత్తరలూ ఎన్నెన్నో ఎమ్మగానే నడిపావు — లోవకొత్తూరు

ఆదీవారమునాడూ అలమంచిరోజాన

లచ్చీవారమునాడు లచ్చమైన రోజాన — లోవకొత్తూరు

నీగుడికి వచ్చేము తలుపులమ్మా

నిన్నూ పూజించేము తలుపులమ్మా — లోవకొత్తూరు

నీగుడికి వచ్చేము తలుపులమ్మా

నిన్నును పూజించేము తలుపులమ్మా లోవకొత్తూరు
మే అన్న మేకలమ్మ కా అన్న కారుకోళ్ళ
పసుపూ కుంకుమతోటి నిన్నూ పూజించేము లోవకొత్తూరు
నీపేరు పెట్టుకొని నీకొండకు వస్తారు
నీకొండకు వస్తారూ నిలబడి పూజించుతారు లోవకొత్తూరు
టెంకాయ కొబ్బరులూ తేనె మావిడిపళ్ళా
అప్పాలు దోసెలతో పాలవార పెడతారు లోవకొత్తూరు
నీపాటపాడునట్టి పిఠాపురము కాపురస్థుడు
కాపురస్థుడు కాపురస్థుడు రేవూగంగరాజు
లోవాకొత్తూరులో కనరాని కొండపై
లోయలోన నిలిసినావు తలుపులమ్మా !
నీమహిమలు కానలేము నిజమేనమ్మా !

*రేవు గంగరాజు, పిఠాపురం*

## చీడికమ్మ పాట

చీడికమ్మా గటవా కుండకీ చీడికమ్మా గటవా కుండకీ ఏమేమివన్నో
పాలపువ్వే వన్నేకాదు పాలపువ్వే వన్నేకాదు మాచిన్నివన్నో చీడికమ్మా
కొబ్బరిపువ్వే వన్నేకాదు కొబ్బరిపువ్వు వన్నేకాదు మాచిన్నీవన్నో చీడికమ్మా
ఇప్పపువ్వే వన్నేకాదు ఇప్పపువ్వే వన్నేకాదు మాచిన్నీవన్నో చీడికమ్మా
పాలపువ్వే వన్నేకాదు పాలపువ్వే వన్నేకాదు మామంచీవన్నో చీడికమ్మా
మామిడిపువ్వే వన్నేకాదు మామిడిపువ్వే వన్నేకాదు మామంచీవన్నో చీడికమ్మా
చిక్కుడుపువ్వే వన్నేకాదు చిక్కుడుపువ్వే వన్నేకాదు మామంచివన్నో చీడికమ్మా
గుమ్మడిపువ్వే వన్నేకాదు గుమ్మడిపువ్వేవన్నేకాదు మామంచివన్నో చీడికమ్మా
కాకరపువ్వే వన్నేకాదు కాకరపువ్వే వన్నేకాదు మా చిన్నీ వన్నో చీడికమ్మా
మల్లెపువ్వే వన్నేకాదు మల్లెపువ్వే వన్నేకాదు మాచిన్నీ వన్నో చీడికమ్మా
వేపపువ్వే వన్నేకాదు వేపపువ్వే వన్నేకాదు మాచిన్నీ వన్నో చీడికమ్మా

**బోను అప్పారావు, తిమ్మాపురం**

## గంగాలమ్మ పాట :

పూసలేక మాగంగా పూసలోడ కెళ్లేటపుడు బళ్ళనా తెల్లారిపోయె
గాజులేక మాగంగా బలిజివాడా వెళ్లేటపుడు బళ్ళనా తెల్లారిపోయె
చేటలేక మాగంగా మేదరోడ లెల్లేటపుడు బళ్ళనా తెల్లారిపోయె

బుట్టలేక మాగంగా మేదరోడ లెల్లేటపుడు | బళ్లనా తెల్లారిపోయె
బొట్టులేక మాగంగా పూసలోడా లెల్లేటపుడు | బళ్లనా తెల్లారిపోయె
చీరలేక మాగంగా సాలెఓడా లెల్లేటపుడు | బళ్లనా తెల్లారిపోయె
జాకిట్లేక మాగంగా సాలెఓడా లెల్లేటపుడు | బళ్లనా తెల్లారిపోయె
పట్టీల్లేక మాగంగా కంసాలోడ లెల్లేటపుడు | బళ్లనా తెల్లారిపోయె
కుండలేక మాగంగా కుమ్మరోడ లెల్లేటపుడు | బళ్లనా తెల్లారిపోయె
బొట్టులేక మాగంగా బుక్కవాడా లెల్లేటపుడు | బళ్లనా తెల్లారిపోయె
నగలులేక మాగంగా కంసాలోడా లెల్లేటప్పుడు | బళ్లనా తెల్లారిపోయె
పెట్టెలోని జాకెట్లున్నాయి తొడుక్కెళ్లే గంగాలమ్మా | బళ్లనా తెల్లారిపోయె

ఆరుబయలా పోరిబయలా అగ్నిగుండం నీకేశారు
పెట్టెలోని చీరలున్నాయి కట్టుకెళ్లే గంగాలమ్మా | ఆరుబయలా
పెట్టెలోని పట్టీలున్నాయి పెట్టుకోవే గంగాలమ్మా | ఆరుబయలా
పెట్టెలోని ఒడ్డాణముందీ పెట్టుకోవే గంగాలమ్మా | ఆరుబయలా
పెట్టెలోని నక్కిలీసుందీ పెట్టుకోవే గంగాలమ్మా | ఆరుబయలా
పెట్టెలోని బుట్టలున్నాయి పెట్టుకోవే గంగాలమ్మా | ఆరుబయలా
పెట్టెలోని సవరాలున్నాయి పెట్టుకోవే గంగాలమ్మా | ఆరుబయలా
పెట్టెలోని బేసరాలున్నాయి పెట్టుకోవే గంగాలమ్మా | ఆరుబయలా
పెట్టెలోని తాడూలున్నాయి పెట్టుకోవే గంగాలమ్మా | ఆరుబయలా

***పసుపులేటి శ్రీనివాస్, భద్రవరం***

మాఊరూ గంగాలమ్మా మామీద దయాలుంచూ
దయుగల్లా గంగాలమ్మా దనంపూజా నీకే చేస్తాం
మాఊరూ నూకాలమ్మా మామీద దయాలుంచు
దయుగల్లా నూకాలమ్మా దనంపూజా నీకేచేస్తాం
మాఊరూ పోతూరాజా మామీద దయాలుంచు
దయుగల్లా పోతురాజా దనంపూజా నీకేచేస్తాం
పాలపూలే పట్టిమంచం పండుకోయే గంగాలమ్మా
రాగంగతల్లో ఓయి గంగతల్లో
గంటిపువ్వే గాలిమోత ఏమిగాలి వరదగాలి
వజ్రాల నీరు దొక్కి .......రా గంగతల్లో

***పసుపులేటి శ్రీనివాస***

**గంలమ్మా పాట :**

రావే రావే గంగాలమ్మా – రాగాదే వో గంగాలమ్మా
మావంకచూడవే గంగాలమ్మా – మమ్ము కాపాడవేగంగాలమ్మా
ఏడుగురూ అక్కలా గంగాలమ్మా – తోడబుట్టీనావే గంగాలమ్మా
ఇలపాలసంద్రాల గంగాలమ్మా – నీ యాదితలవమ్మ గంగాలమ్మా
పాలసముద్రంలోని గంగాలమ్మా – ఊడల్ల మర్రమ్మ గంగాలమ్మా
ఊడల్లమర్రిక్రింద గంగాలమ్మా – ఉగ్గళ్లపుట్టమ్మ గంగాలమ్మా
సత్రాలరాయుంచి గంగాలమ్మా – కాసుగాయించావే గంగాలమ్మా
కాసుపైనే తల్లి గంగాలమ్మా – మనసుగాయించేవే గంగాలమ్మా
మనసునే జన్మించి గంగాలమ్మా – మర్లలే రాగంగ గంగాలమ్మా
పన్నేండుసేతులే గంగాలమ్మా – ఇనమూడునేత్రాలే గంగాలమ్మా
కోతుల్ని మల్లించ గంగాలమ్మా – కొరడాల సేతులే గంగాలమ్మా
దూతల్ని మల్లించ గంగాలమ్మా – దుట్టొక్క సేతులే గంగాలమ్మా
రాచ్చసుల మల్లించ గంగాలమ్మా – రంపాలసేతులే గంగాలమ్మా
నూరుగళ్లాతోని గంగాలమ్మా – పైకి లేగిసేచూసి గంగాలమ్మా
కుంకాల బరిణిలా గంగాలమ్మా – తల్లిచేత్తో బట్టి గంగాలమ్మా
ఏనువా పసుపులా గంగాలమ్మా – ఒడిగట్టుకున్నావే గంగాలమ్మా
దేశబారమ్మీద గంగాలమ్మా – పయనాలు గట్టినే గంగాలమ్మా
నీ ఆకారపిలుపు గంగాలమ్మా – ఆ పసుపుగుంకాలు గంగాలమ్మా
కాపులేనినుగొలిసి గంగాలమ్మా – బూతులే తీర్చాల గంగాలమ్మా
మాలలే నినుగొలిసి గంగాలమ్మా – మంచి ముచ్చము కలిగి గంగాలమ్మా
కోవట్లు నిను గొలిసి గంగాలమ్మా – కొలబడ్డ యందురే గంగాలమ్మా
అట్టా (ష్టా) ది వరణాలు గంగాలమ్మా – నినుగొలవలేదే గంగాలమ్మా
సారిలే చీరిలే గంగాలమ్మా – పదిలంగా బయులుదేరే గంగాలమ్మా
పన్నెండు సేతులే గంగాలమ్మా – ఎక్కడికిపోతుంది గంగాలమ్మా
ఎల్లేటిదారుల్లో గంగాలమ్మా – వరదబయదెల్తుంది గంగాలమ్మా
ఇంతలో గొల్లోడు గంగాలమ్మా – మందనే దింపాడు గంగాలమ్మా
మంద తోలుకు నీవు గంగాలమ్మా – గొల్లోడి దొడ్డికే గంగాలమ్మా
ఆడపడుసూవై గంగాలమ్మా – దొడ్డిబాగాకాయ గంగాలమ్మా
ఇంతలో గోల్లోడు గంగాలమ్మా – నిను కళ్లసూసాడే గంగాలమ్మా
ఏనువూ గుగ్గులుం గంగాలమ్మా – నీకెచ్చు దూపాలే గంగాలమ్మా
పన్నువే కుంకాలు గంగాలమ్మా – నిలుపట్టి బొట్టులే గంగాలమ్మా

గొల్లదొడ్డిసేరి గంగాలమ్మా - గొల్లల్ని ఉద్ధరించె గంగాలమ్మా
ఎనిమిదా సేతులా గంగాలమ్మా - ఎరిడోళ్లతల్లి గంగాలమ్మా
పన్నెండుసేతులా గంగాలమ్మా - బాగిరతి గంగవే గంగాలమ్మా
తొమ్మిదాసేతులా గంగాలమ్మా - తునికొండ గంగులో గంగాలమ్మా

***చీడిపల్లి తూతయ్య, రాజవొమ్మంగి***

## వివిధ దేవతల పేర్లు వచ్చేలాగ ఉన్నపాట

డేగాబోయీ !డేగాబోయీ ! వెన్నెల్లా ! మా డేగాకాలు మువ్వలుపోయె వెన్నెల్లా ! డేగాబోయి
గంగాలతల్లి మాతల్లి వెన్నెల్లా ! మాడేగాలొచ్చిన జాడాలున్నాయి వెన్నెల్లా !
మీదీకాదు మాదికాదు వెన్నెల్లా ! మా మైలాపూరి మన్నెపుడేగ వెన్నెల్లా ! డేగాబోయీ
పోతూరాజు మాతండ్రి వెన్నెల్లా ! మా డేగాలొచ్చిన జాడాలున్నాయి వెన్నెల్లా !
మీదికాదు మాదికాదు, డేగాబోయీ

నూకాలతల్లి మాతల్లీ వెన్నెల్లా మా డేగా లొచ్చిన జాడాలున్నాయి వెన్నెల్లా
మీదికాదు మాదికాదు, డేగాబోయీ

మరిణితల్లి మాతల్లి వెన్నెల్లా మా డేగాలొచ్చిన జాడాలున్నాయి వెన్నెల్లా
మీదికాదు మాదికాదు, డేగాబోయీ

చీడికతల్లీ మాతల్లీ వెన్నెల్లా మా డేగాలొచ్చిన జాడాలున్నాయి వెన్నెల్లా
మీదికాదు మాదికాదు, డేగాబోయీ

తలుపులుతల్లి మాతల్లీ వెన్నెల్లా మా డేగాలొచ్చిన జాడాలున్నాయి వెన్నెల్లా
మీదికాదు మాదికాదు, డేగాబోయీ

చింతాలమ్మా మాతల్లీ వెన్నెల్లా మా డేగాలొచ్చిన జాడాలున్నాయి వెన్నెల్లా
మీదికాదు మాదికాదు, డేగాబోయీ

సత్తెమ్మ తల్లి మాతల్లీ వెన్నెల్లా మా డేగాలొచ్చిన జాడాలున్నాయి వెన్నెల్లా
మీదికాదు మాదికాదు, డేగాబోయీ

***పసుపులేటి శ్రీనివాస్, భద్రవరం***

## సెనగల కథ (గేయం)

యప్పుడే యమ్మవారే బళాబళీ - నాయనా యప్పుడే యమ్మవారు బళాబళీ
అహ మాతల్లి యమ్మవారు బళాబళీ - అహ ఎలాగ ఉందయ్యా బళాబళీ
అయ్యు అవతారపురుసురాలు బళీబళీ - అహ దేశాలమీదకమ్మా బళాబళీ
అహో వారవాలుతక్కువాయే బళాబళీ - నాయనా పూరవాలు తక్కువాయెం బళాబళీ
అహ యామ్మవారు మాతల్లి బళాబళీ - మాతల్లి యమ్మవారు బళాబళీ

ముందునే గట్టినాది బళాబళీ – నాయనా మూడుబళ్ల గుడ్డలండీ బళాబళీ
అయ్యా ఎనకాల కట్టినాది బళాబళీ – నాయనా ఎన్నూరి గుడ్డలేనీ బళాబళీ
అయ్యా పక్కనే కట్టినాదీ బళాబళీ – నాయనా పదిబళ్ల గుడ్డలయ్యా బళాబళీ
అబ్బ ఒక్కన్ని కాటూకా బళాబళీ – నాయనా ఒకచెయ్యి గాజండీ బళాబళీ
అయ్యా ముక్కుముంగారతోనూ బళాబళీ – నాయనా మోకాలికురుపులండీ బళాబళీ
ఓలి మోచేతి కురుపులండీ బళాబళీ – అమ్మ బండేడి కుంకుమయ్యా బళాబళీ
ఓలి నొట్టనే బూసుకొని బళాబళీ – అమ్మ దేశాలమీదకమ్మో బళాబళీ
ఎల్లేటి అమ్మవారికి బళాబళీ – నాయనా ఏమడ్డమయినాది బళాబళీ

*రేవు గంగరాజు, పిఠాపురం*

## దోనె దాటించే కథ( గేయం)

అమ్మ బయదెల్లినాదో తల్లీ బళాబళీ – యమ్మ బలదెల్లనినాదీ బళాబళీ
అహ అమ్మోరు మాతల్లీ బళాబళీ – అహ వారవాలుతక్కువాయె బళాబళీ
ఏలోకాన్నిలోగరత(లోకకర్త) బళాబళీ – నాయనాజగాన్నిజాగరత (జగకర్త) బళాబళీ
అహ మాతల్లి అమ్మవారు బళాబళీ – అబ్బ ఒకనాటి కాలమునే బళాబళీ
ఓనిట్టమధ్దెనిపేల బళాబళీ – నాయానా మారువేసము గట్టి బళాబళీ
కట్టింది అమ్మవారూ బళాబళీ – కనకపురి సీరండి బళాబళీ
ఆ తొడిగింది అమ్మవారూ బళాబళీ – దొంతాపు రైకండీ బళీబళీ
ఆహ బండెడి కుంకుమయ్యా బళాబళీ – నొట్టనే బూసుకొని బళాబళీ
ఓలి బండిడా నీళ్లల్లో బళాబళీ – ఓలి బండారుకలపినాదీ బళాబళీ
అహ నాగుబాముని బట్టి బళాబళీ – నాయనా నడికట్లు కట్టినాదీ బళాబళీ
ఓ జెర్రిపోతును బట్టి బళాబలీ – అహ జెమ్మకాన గాయించి బళాబళీ
ఏ తుట్టపురుగును పట్టినాదీ బళాబలి – ఓలి కాలికేమట్టెలయ్యా బళాబళీ
ఓరి యమ్మనిపావులా బళాబళీ – వాత్తకే పేరులండీ బళాబళీ
కూన పామునుబట్టినాదీ బళాబళీ – అయ్యా కుంటేళ్ల గాయించీ బళాబళీ
నాయమ్మ పాములే నగలమ్మ బళాబళీ – అహ పాములే బూసనాలు బళాబళీ
అహ పల్లువే ఏవరొట్ట బళాబళీ – అహ జగడకింది బెట్టినాదీ బళాబళీ
నాయనా మాతల్లి అమ్మవారూ బళాబళీ
ఆ ఊరిమాదిగన్నా బళాబళీ – ఓలె దేశాలమీదకండి బళాబళీ
అహ అమ్మవారు వెళుతుందీ బళాబళీ – ఓలె దేశాలమీదకండి బళాబళీ
ఓలె అమ్మవారు ఎళుతుంటే బళాబలి

ఓలె పాలకొండలమీద బళాబళీ – నాయునా పట్టింది వర్షమయ్యు బళాబళీ

అహ ఏలూరు కొండమీద బళాబళి – అహ ఎత్తింది వర్షమండీ బళాబళీ

ఆఏడుదుక్కులు వర్షమయ్యు బళాబళీ – అహ ఎగపంగుతున్నాయీ బళాబళీ

అమ్మ కిటిటగోదారులమ్మ భళాభళి – అహ ఎగబొంగుతున్నాయి భళాభళి

ఓలె గోదారి ఒడ్డునయ్యా బళాబళీ – ఓలె నిలబాడి సూత్తుంది బళాబళి

మాతల్లి అమ్మవారూ బళాబళీ

అహ జాలారి దగ్గరికి బళాబళీ – ఓలి గమ్మునే ఎల్లినాది బలాబళీ

ఓలీ యేమిరావన్నయ్యా బళాబళీ – నేనాడపిల్లనోయీ బళాబళి

నన్ను దోనె దాటించరోయి బళాబళీ – నన్ను పడవదాటించరోయీ బళాబళీ

నీకు బహుపున్నెముంటాది బళాబళీ – నీకు బహుజయ్యు ముంటాది బళాబళీ

## జాలారి వాని ప్రశ్న

ఏఊరు ఓభామా మా భామా బళాబళీ – ఏవి ఒంటరిగావచ్చినావూ బళాబళీ

నాకు దోనెకట్నమొత్తాదీ బళాబళీ – నిన్ను దోనె దాటింతూనూ బళాబళీ

నాకు దోనెకట్నమొత్తాదీ బళాబళీ – నిన్ను దోనె దాటింతానూ బలాబళీ

ఏవీ విన్నావా చిన్నదానా బళాబళీ – అహ వివరంబుగా నీవె బళాబళీ

## సత్తెమ్మ సమాధానం

ఏవిరా ! అన్నయ్యా బళాబళీ – నాదగ్గరేవి లేదు బళాబళీ

మాయమ్మ గారిది కశింకోటరా బళాబళీ – మా అత్తవారిది అనకపిల్లీ బళాబళీ

మా మామగారిది మండపేట బళాబళీ – మా తాతగారిది బెడవాడ బళాబళీ

ఓరి నామొగుడు జూత్తేనీ బళాబళీ – ఓరి తాగుబోతేవాడు బళాబళీ

నేను ఆరండా వచ్చినాను బళాబళీ – అమ్మ నాదగ్గరేవి లేదు బళాబళీ

నన్ను దోనెదాటింతేనీ బళాబళీ – ఓలి మళ్లీ తిరిగివత్తానురా బళాబళీ

నీకు దోనికట్నమిత్తాను బళాబళీ – నీకు బంగారు దోనెలిత్తాను బళాబళీ

నీకు పైడీయ మోకులిత్తాను బళాబళీ – నీకు వెండియ బల్లలిత్తాను బలాబళీ

అరి ననుజూసి నీకేమిరా బళాబళీ – ఓలి కనికరంబులులేవా బళాబళీ

ఓరి నావంటి చెల్లెళ్లు బళాబళీ – ఓలి కనికరంబులులేవా బళాబళీ

ఓరి నావంటి చెల్లెళ్లు బళాబళీ – అన్నయ్యా ! నీకు లేరంటరోయీ బళాబళీ

ఓరి నావంటి వక్కయ్యలు బళాబళీ – ఓరి నీకు లేరంటరన్నా ! బళాబళీ

నీకు బహు పున్నముంటాది బళాబళీ

.... .... .... ....

అన్నయ్యోయి! నాచిన్నతనాన్ని లోన బళాబళీ – మా యత్తవారెట్టినారు బళాబళీ

ఇది హారంత కుత్తుగంటు బళాబళీ – నీకు దోనె కట్నమిత్తాను బళాబళీ

నీవు దోనె దాటింతేనూ బళాబళీ – నీకు దోనె కట్నమిత్తాను బళాబళీ

.... .... .... .... ....

ఓలి అంతిగాలపుముండకొడుకే నాయమ్మ! బళాబళీ – ఓలి అంతిగాలమెదురికాయే బళాబళి

ఓలి అమ్మవారి మెడలోను బళాబళీ – ఓలి సెయ్యివేసీనాడు బళాబళీ

దాని తొలి మూడీ విప్పినాడూ బళాబళీ – ఓలి రెండోమూడీ విప్పినాడూ బళాబళీ

అయ్యమూడొక్క మూడికంటీ బళాబళీ – దాన్ని యువతారపురుషురాలూ బళాబళీ

ఓలీ నాగుబాము అయినాదీ బళాబళీ – వాడి దాతవలుబట్టి నాదీ బళాబళీ

వారి జాలరి చిన్నవాడు బళాబళీ – నాయనా లుబ్బులే గక్కినాడు బళాబళీ

ఆహా ఆనబగాయ వర్ణాన్ని బళాబళీ – వాడి వక్కిళ్ళ నక్కినాది బళాబళీ

గుమ్మడికాయ వర్ణాన్ని బళాబళీ – వాడి గుండెల్లో నక్కినాది బళాబళీ

వాడి నోటిమాటలేదు బళాబళీ – వాడి కంటిసూపేగాని బళాబళీ

ఓరి గోదారి ఒడ్డునయా బళాబళి – వాడి సప్పగంటూలాగ బళాబళీ

వాడి గుమ్ము తరమూల్చూలాగ బళాబళీ – వాడి కూలబాడీ పోయినాడు బళాబళీ

వాడి నిండు జీవనంతోటి బళాబళీ – నాయనా! నిచ్చింత్ర మయినాడు బళాబళీ

.... .... .... ....

ఓచ్చిపోయినవారికే నాయునమ్మా! బళాబళీ

అహ మాతల్లి యమ్మవారు బళాబళీ – అహ సవ్వ సువ్వారాలు బళాబళీ

ఏ సేత్తానె అమ్మవారు బళాబళీ – నాయనా! దోనె దాటించిందీ బళాబళీ

.... .... ..... ....

**జాలరి తల్లి పైడమ్మ**

గోదారి ఒడ్డుకమో నాయనా బళాబళీ – ఓలి గబ్బునే వచ్చినాదీ బళాబళీ

ఓ ఏమిరా నాకొడుకా బళాబళీ – ఓలి ఎక్కడా ఉన్నావురా బళాబళీ

నీకు సల్దివన్నం తెచ్చినాను బళాబళీ – ఆ! రమ్మాని పిలిచినాది బళాబళీ

వాడు ఉలకన్న ఉలకడయ్యా బళాబళీ – వాడు పలకన్న పలకడయ్యా బళాబళీ

.... .... .... ....

**సత్తెమ్మ పైడమ్మల సంభాషణ**

ఎవరి ననుకున్నావే నీవు బళాబళీ

నేను మిట్టమద్దినపేలా బళాబళీ – నేను దారింట పోతుంటే బళాబళీ

అహ నీకొడుకు సుంకరన్న బళాబళీ – అహ నామీద కన్నువేసి బళాబళీ

నా ఏలాడి సెంగట్టి బళాబళీ – వాడు ఎనక్కి నాగినాడు బళాబళీ

నా పయాట సెంగట్టి బళాబళీ - వాడు పడలాగినాడే బళాబళీ

అబ్బ నీకొడుకు తెచ్చినాడు బళాబళీ - నేను గారాలకోడలిని బళాబళీ

అబ్బ నీళ్ళునేతెస్తాను బళాబళీ -- కూడునే ఒ.౧.పతాను బళాబళీ

నేను పల్లి పేటలలోని బళాబళీ - ఏ పరిగలే అమ్ముతాను బళాబళీ

నేను జలారి పేటలలో బళాబళీ - నే జెల్లలే అమ్ముతాను బళాబళీ

అమ్మా ! నీకొడుకు తెచ్చాడు బళాబళీ - నేను ముద్దులా కోడలిని బళాబళీ

.... .... .... ....

**పైడమ్మ ప్రార్థన :**

నా కొడుకు సుంకరన్నా నాయనా

వాడు ఎరగంది కొంతమ్మా బళాబళీ - వాడు ఎరిగింది కొంతమ్మా బళాబళీ

వాడికి తెలిసింది కొంతమ్మా బళాబళీ - వాడికి తెలియుంది కొంతమ్మా బళాబళీ

నాకొక్కడే కొడుకమ్మా బళాబళీ - నాబంగారు తల్లీ బళాబళీ

ఓరగాంయీ బళాబళీ - నీకు ఓరంచు కోకలమ్మా బళాబళీ

నీవు బారైనా కాత్తేనీ బళాబళీ - నీకు బారీగా ఏటలమ్మా బళాబళీ

నీకు నిలిస్తే నిప్పులు గుండాలు బళాబళీ - నీకు కావిడికోళ్ళ గండదీపాలు బళాబళీ

నీకు గుడికొప్పజెప్పుతాను బళాబళీ

అమ్మో ! కడువులూ గుగ్గిలూ బళాబళీ - నీకు కుంభాలతో నమ్మా బళాబళీ

నీకు ఏబులుమే గుగ్గులమ్మా బళాబళీ - అమ్మ ఏకదూపలతోనా బళాబళీ

నీకు గుడికొప్పజెప్పుతాను బళాబళీ

నాయమ్మ నాకొడుకు నాలోనే బళాబళీ - నీవు చక్కగా కలపవమ్మా బళాబళీ

అమ్మ వస్త్రాలు జోడించి బళాబళీ - నాయన వందనము జేసినాదీ బళాబళీ

.... .... .... ....

**సత్తెమ్మ బండారుబొట్టు తో లేచి నిలబడ్డ జాలరి అమ్మవారి దోనెక్కించుకొని**

ఇవతలొడ్డూ నుంచి బళాబళీ - ఓలి అవతలొడ్డాకండి బళాబళీ

ఓలి గెంటుకెళుతున్నాడు బళాబళీ - అహ జాలారి చిన్నవాడు బళాబళీ

ఓలి నడిసముద్రంలోనే బళాబళీ - వాడు దోనాపుజేసిననాడు బళాబళీ

వాడు అమ్మవార్ని జూసాడు బళాబళీ - ఓ కన్ను వార్చాలేను బళాబళీ

ఓలి గిరగిరా దోనండి బళాబళీ - ఓలి తిప్పేత్తా ఉన్నాడు బళాబళీ

ఇది మామిడి కర్రలదోని బళాబళీ - ఇది మల్లమంటే మల్లదోయీ బళాబళీ

ఇది టేకూ కర్రలదోనీ బళాబళీ - ఇది తిరగమన్న తిరగదోయీ బళాబళీ

ఇది మూడూ కొయ్యలదోని బళాబళీ - ఇది ఆపినా ఆగదోయీ బళాబళీ

హే ఇన్నావా సిన్నదానా బళాబళీ

ఓలి యిందాక పోతేనీ బళాబళీ – ఓలి యిప్పుడెక్కడి కెళతావే బళాబళీ

ఓలి నీమీద నామనసు బళాబళీ – ఓలి సాలగలిగున్నాదే బళాబళీ

ఓలి నిన్ను జూసిన మనసూ బళాబళీ – అబ్బ నిజములో గడపవోయీ బళాబళీ

అబ్బ ఏరిపారే గంగమీద బళాబళీ – ఓలి నాప్రేమ తీర్చవోయీ బళాబళీ

అబ్బ నీకు ఎవ్వరూలేరూ బళాబళీ – ఓలి నాకు ఎవ్వరూలేరూ బళాబళీ

నేను గోదారి ఒడ్డునేని బళాబళీ – నేను విల్లుగట్టూతానూ బళాబళీ

నిన్ను వింటిలో పెడతాను బళాబళీ

మనము ఈడుగా ఉందామూ బళాబళీ – ఓలి జోడుగా ఉందామూ బళాబళీ

మనకు లాయిరీగా ఉంటాది బళాబళీ – మనకు సోగ్గా ఉంటాది బళాబళీ

అమ్మ నీకు నాకీ జోడే భామా బళాబళీ

నీకు నాకూ జోడూ బళాబళీ – ఏబెమ్మ రాసినాడే బళాబళీ

ఆమాట విన్నాదో నాయమ్మ బళాబళీ

ఆమాట విన్నాది బళాబళీ – మాతల్లి అమ్మవారూ బళాబళీ

ఓరి అంతిగాలపుముండకొడక బళాబళీ – నీకు అంతిగాలము దగ్గిరాయె బళాబళీ

నన్ను ఎవరి ననుకున్నావురా బళాబళీ – నీకు ఎరుకు లోటూ లేదు బళాబళీ

ఓరి నావంటి సెల్లెళ్లా బళాబళీ – ఓరి నీకు లేరంటరన్నా బళాబళీ

ఓరి నావంటి తల్లూలూ బళాబళీ – అబ్బ నీకు లేరంటరోయీ బళాబళీ

నీవు ఆడవారికి తోడా బళాబళీ – ఓరి నువ్వు పుట్టలేదేవిరా బళాబళీ

నేను అత్తమామలమీద బళాబళీ – కోపగించొచ్చానూ బళాబళీ

అహ విన్నావు అన్నాయ్యా బళాబలి

నాకు సాలపోద్దోయినాది బళాబళీ – నన్ను దోనిదాటించరన్నా బళాబళీ

అబ్బయామాట విన్నాడోనాయనా బళాబళీ – ఓరిజాలారిచిన్నవాడూ బళాబళీ

ఓలి ఎన్ని జెప్పినగానీ బళాబళీ – ఓలి నిన్ను జూసిన మనసు బళాబళీ

నాకు నిద్ర కంటికిరాదే బళాబళీ – ఓలి నాప్రేమ తీర్చవోయి బళాబళీ

మనము ఈడుగా ఉందామూ బళాబళీ – మనము జోడుగా ఉందామూ బళాబళీ

.... .... .... ....

నన్ను దాటిస్తేనురా అన్నయ్యా బళాబళీ – ఓలి నాసెల్లెళ్లున్నారూ బళాబళీ

ఓరి నూటనొక్క సెల్లెళ్లా బళాబళీ – అహ నీకు పెళ్లిజేత్తాను బళాబళీ

నన్ను దోనెదాటంచరోయీ బళాబళీ

### అని సత్తెమ్మ తన చెల్లెళ్లను పిలవడం

| | | |
|---|---|---|
| అరగజ్జి నువ్వురావే సెల్లెలా బళాబళీ | – | ఓలి పూరగజ్జి నువురావే బళాబళీ |
| ఓలి సందీనువురావే బళాబళీ | – | ఓలి సందకాడ దేవతోయీ బళాబళీ |
| ఓలి ముప్పర్తి రావేమే బళాబళీ | – | ఓలి మూడేల బండేమో బళాబళీ |
| ఓలి గోరలగోపన్నా బళాబళీ | – | ఓలి కొండపురి నాంచారి బళాబళీ |
| ఓలి నీడదోలు లింగాలమ్మా బళాబళీ | – | ఓలి బందారు మూకుళ్లమ్మా బళాబళీ |
| నీవు మాసర్లో బుట్టినావే బళాబలి | – | ఓలి మాసారా సెల్లులోయీ బళాబళీ |
| నీవు బెజవాడ కనకదుర్గా బళాబళీ | – | ఓలి వేలేశరం రూపులమ్మా బళాబళీ |
| ఓలి కాంద్రకోట నూకలమ్మా బళాబళీ | – | ఓలి వేలేశరం రూపులమ్మా బళాబళీ |
| ఓలి బూరగాపూడి బుడ్డమ్మా బళాబళీ | – | ఓలి తామరాడ తాళ్లమ్మా బళాబళీ |
| ఓలి సిలిపి సేతులగంగా బళాబళీ | – | ఓలి వీరమా గంగ మేవే బళాబళీ |
| ఓలి ఆరిసేతుల గంగా బళాబళీ | – | ఓలి ఆరమా గంగ మేవే బళాబళీ |
| ఓలి సెమటనే బుట్టినావు బళాబళీ | – | ఓలి సెల్లెలా జాలారీ బళాబళీ |
| ఓలి పుట్టింది పుట్టుగొండ బళాబళీ | – | ఓలి పెరిగింది గంద్రేడు బళాబళీ |
| నీవు రాకటకి పోకడకి బళాబళీ | – | ఓలి రాపర్తి వచ్చినావే బళాబళీ |
| ఓలి నేరేళ్లమ్మ సెల్లాలా బళాబళీ | – | ఓలి వనమలమ్మ నువురావే బళాబళీ |
| ఓలి దూడలమ్మ నువురావే బళాబళీ | – | ఓలి బాగిర్తి నువురావే బళాబళీ |
| ఓలి బంగారి నువురావే బళాబళీ | – | ఓలి పోలేరమ్మ నువురావే బళాబళీ |
| ఓలి ఎల్లారమ్మ నువురావే బళాబళీ | – | ఓలి ఏగులమ్మ నువురావే బళాబళీ |
| అబ్బా నూటనొక్కసెల్లెల్లనే నాయమ్మా బళాబళీ | – | ఓలిఏకనెత్తిని చిలిచీ బళాబళీ |
| అహ మాతల్లి అమ్మవారూ బళాబళీ | | |

### వాళ్లను చూసిన జాలరివాడు

| | | |
|---|---|---|
| నూటనొక్క సెల్లెళ్లనేబామా బళాబళీ | – | హే నేను పెళ్లాడతాను బళాబళీ |
| నీసెల్లెళ్ళి పెళ్లాడి బళాబళీ | – | ఓలి నిన్ను పెళ్లాడతానే బళాబళీ |
| నేను గోదారి ఒడ్డునే బళాబళీ | | |
| నీ నూటనొక్క ఇళ్లుగట్టి బళాబలి | – | మిమ్మల్ని ఇంట్లో బెడతానే బళాబళీ |
| అహ ఈడుగా ఉందామూ బళాబళీ | – | మనము జోడుగా ఉందామూ బళాబళీ |

.... .... .... ....

| | | |
|---|---|---|
| ఏదువే రక్తమండోవాణ్ణి బళాబళీ | –– | వెన్నువిరిసేనాదండీ బళాబళీ |
| నాయనా పందువే రక్తమండీ బళాబళీ | – | వాణ్ణిపడ బోల్చినాడి బళాబళీ |
| వాడ్ని కిట్టగోదారిలోకి బళాబళీ | – | ఓరి విసిరిపారేసినాది బళాబళీ |

వాణ్ణికిట్టగోదారిలో బళాబళీ - నిట్ట దొక్కేసింది బళాబళీ
ఓలి గంగలో జాలారి బళాబళీ - ఓలి పతనమయిపోయినాడూ బళాబళీ

*రేవు గంగరాజు, పిఠాపురం*

## దుర్గమ్మ కథాగేయం

### వెంకన్న అన్నలు మంగని చూడటానికి కెళ్లి ముహూర్తం పెట్టించుకొనిరావడం

ఆరుగురూ అన్నాలు తమ్ముడే కలరండో - ఆలావోరి పట్నాలు వారూ వెళ్ళారూ
ఆలవోరి పట్నాలు వెళ్లారు వారండో - అల్లంతదూరాన్ని తాతయ్య చూసె
చావిళ్ల వేసారు చాపాలేసారు - వరుసాగా రాజూలే కొలువులేరేరు
ఆలావోరి తాతయ్య ఏమంటా పలికేడూ - ఏఊరూ రాజూలు ఎవరూ బిడ్డాలూ
ఏమంటాపలికేరూ ఆరుగురూ రాజాలూ - మదీద పరకాపురము మాది అయినాని
మాతల్లి పేరైనా పేరెల్లీ దేవమ్మో - మాతండిరీ పేరైనా తిమ్మరాజమ్మో
నాకూతూరూ బిడ్డాలే మీరూ అయినాని - చెక్కుళ్ల నొక్కాడా ముద్దులాడాడా
మీతల్లిపేరెల్లి దేవి చేమంగా ఉన్నాదా - మీతంఢ్రి తిమ్మరాజు బాగా ఉన్నాడా
మాతల్లి పేరీల్లీదేవి చేమంగా ఉన్నాదీ - మాతంఢ్రి తిమ్మరాజు బాగా ఉన్నాడు
ఏడుగురూ అన్నాలే తమ్ముడే కలరండో - మా ఆరుగూరూ అన్నలకే పెళ్లిళ్లే అయే
అందరికి చిన్నోడు తమ్మూడెంకటరమణా - తమ్మూడికి తగినట్టూ కన్నెనెదికొచ్చా
తమ్మూడికి తగినట్టో కన్నెకోసమొచ్చామో - ఎక్కాడాతమ్ముడికి కన్నె అమరాలేదు
ఏమంటా పలికేడు ఆలవారి తాతయ్యా - కొడుకూ బిడ్డున్నాది అలివేలూమంగా
చిలకాపలుకులుతల్లీ సిరిగలామంగా - అంస నడకలతల్లి ఆలిమేలుమంగా
అంస నడకలతల్లి ఆలిమేలుమంగా ఆలివేలుమంగా - కూతురే బిడ్డలూ మీరు మనవాలు
నత్తేను మంగమ్మని తీసుకెళ్లండి తీసుకెళ్లండి - ఆలవోరి తాతయ్య ఏమంటపిలిచీ ఏమంటా పిలిచీ

కోడలే యివరింగి వంటల్లో ఉంది వంటల్లో ఉంది చుట్టాలు వచ్చారు వంటలే చెయ్యా వంలేచెయ్యా
ఏగ్గరుంగా ఆవిడ పిండివంటలతో పిండివటలతో వంటలే ఆవిడే తయ్యారుజేసి తయ్యారు జేసి
భోజనాలు వాళ్లే సెయ్యమంటారు సెయ్యమంటారు
ఏమంటపలికేరు ఆరుగురు రాజాలూ ఆరుగురు రాజాలూ
మంగమ్మని చూపింతే మేము అయినాని మేము అయినాని
కాలువంకేమో మేము బోంచెయ్యం మేము బోంచెయ్యం
ఆలాగ పలికేరు రాజాలేవారు రాజాలేవారు ఏమిచేత్తున్నావే తల్లినైనాని తల్లివైనాని
మంగమ్మ సెల్లెళ్ల చెలికత్తెలారు చెలికత్తెలారు పదిమంది సెల్లెళ్ల వారు వచ్చేరు వారు వచ్చేరూ
సక్కంగ తలదువ్వి జారుజటాలు జారుజటాలు అందంగా మంగమ్మని ముత్తాబు చేసి ముత్తాబు చేసి

అందాలు అద్దాలు చీర గట్టేరో చీర గట్టేరో చీరకే తగ్గట్టు రైక తొడిగేరో రైక తొడిగేరో

రతనాలపేరులే మెళ్లోనవేసి మెళ్లోనవేసి కెరటాల కాటుకలు కళ్లకేపెట్టో కళ్లకేపెట్టో

సేరుసుక్కాబొట్టు నొట్టకే పెట్టో నొట్టకే పెట్టో, ముత్తాబు చేసారు మంగమ్మ నయినా మంగమ్మ నయినా

వరుసగా రాజులే కూచ్చునున్నారో కూచ్చునున్నారో, తాతయ్య అయినాని ఏమాని పిలుసో పిలుసో

ఆలివేలు మంగమ్మా అవిణంతా దానివే రావోయి మంగమ్మా రమ్మంట పిలిసే

నీ ఆరుగురు బావాలూ నిన్నూ చూడొచ్చేరే గల్లూ గల్లూమని నడిసిరావే మంగా

చిలకా పలుకులమంగా సిరిగల మంగమ్మో ఆసమయంలో మంగమ్మో నడిసివత్తుందో

ఆరుగురూ బావాలే కళ్లారా చూశారు ఏడి ఏడేలయినా ఏతావంగేరూ

మాతమ్ముడికీ తగినట్టే కన్నె దొరికిందనో ఆరుగూరూ అన్నాలే ఊసులాడారు

ఊసూలే ఆడేరే ఆరుగురూ అన్నలూ ఏమాని తాతయ్యని అడగూతున్నారూ

మాతమ్మూడికీ కట్నామూ ఏమిఇత్తారండి మంగమ్మకైనాని నచ్చినాదండి

ఏమానీ పలికేడే ఆలవారి తాతయ్యా – బంగారు అరిటాకు అరణా మిత్తాను

బంగారు అరిటాకు రాసీ ఇత్తాననో – ఆలావారి తాతయ్యా మాటాలే చెప్పె

ఆమాటా విన్నారే ఆరుగురూ రాజులో – పాయ్యేటి బేమ్మల్ని కోరి పిలిసారు

వచ్చేరే బేమ్మర్లే వారు ఏగ్గరుంగానండో – కూర్చున్నారు వారైనా చాపలమీదైనా

జాగాలు ఇప్పేరే జాతకాలు చూసారే – పేరూ బలాలండే పడికట్టే చూసె

మంగమ్మా ఎంకన్నలకే పేరూబలాలు చూసారు – ఆరుగురికి జోడయ్యి మంగమ్మా నిలిసె

పేరుబలాలు చూసారు బేమ్మర్లు వారైనా – పెళ్లిమూర్తాలు పెట్టేరు వారైనా

లచ్చివారంనాడు లగ్గాము అంటూనే – పెళ్లీమురతమూ పెట్టేరూ వారూ

పెళ్లీమూరతమూ పెట్టుకోనీ ఉన్నారే – తాతయ్యన యినాని ఏమంటాపలుకో

సెలవాలు ఇవ్వండీ మేము ఎళ్లొత్తామూ – ఆలావారి తాతయ్యని వాళ్లూ అడిగారూ

ఏమాని అడిగేడే ఆలవోరి తాతయ్య – మీతల్లి పేరిదేవిని అడిగీనానని చెప్పు

మీతండ్రి తిమ్మరాజుని అడిగినానని చెప్పండి – నాముద్దూ మనవూలు మీరు వెళ్లిరండి

చేమంగా ఎళ్లండీ లాబంగా రారండి – దీవించి తాతయ్యా సెలవాలిచ్చాడు

ఆరుగురే రాజూలే బయలుదేరేరా – సీతిరిమీది కైనానివారు వచ్చారా

తల్లీ పేరిదేవి ఎదరూగచూసె – ఏమంటా పలికిందీ ఆతల్లి అయినా

ఏమమ్మా మాతల్లీ పేరేటి దేవో, – ఎంత జామయ్యింది నువ్వూ అయివాని

తాతయ్యా ఉన్నాడని మాతోటి సెప్పలేదు – మావయ్య ఉన్నాడని మాతోటి సెప్పలేదు

ఇంతాకాలమయ్యింది ఇంతవారమయ్యేమో – ఒక్కనాడూ నువ్వేమో సెప్పలేదు తల్లీ

తల్లోని గుళ్లోని కాయయ్యి నిలిశాదీ – పగవారు ఎవ్వరూ కాదు మనకావలిసిన వారే

మేనమామ కూతూరే ఆలివేలు మంగమ్మో – చిలకాపలుకులమంగా సిరిగలా మంగా

తల్లీపేరిడిదేవి ఏమంటా పలికింది – ఆలావోరంటేని మాకు వైరామే

మేనమామ కూతూరే అలివేలు మంగమ్మో – చిలకాపలుకులమంగా సిరిగలామంగా

తల్లీపేరిడిదేవి ఏమంటా పలికింది – ఆలావోరంటేని మాకు వైరామే

అన్నానికి వారైనా పేదవారు – ఆనాటికాడనుంచి నెనెళ్లాలేదు

అలివేలు మంగమ్మఁనీకాయిపెట్టేవమ్మో – లచ్చివారమునాడు మూరతమూ పెట్టె

ఈ యొక్క మాటలనే ఇన్నాడు ఎయ్యిమాయలవాడే – అందరికీ చిన్నోడు వెంకట్రమణా

ఏమానుకుంటాడే ఎయ్యిమయులవాడే – ఏమిలేని పిల్లాని నాకూసేత్తారా

అన్నానికి లేనివారిని నాకు జేత్తారనో – ఎయ్యి మాయలవాడే ఎన్నూ రెంకన్నా

ఏడేడు సంద్రాలు పాలసంద్రాలండి – పాలసంద్రమ్మీద శేషాపానూపూ

పాలసంద్రమ్మీద శేషాపానుపుమీద – పడుకొనీ ఉన్నాడే వెళ్లిఅయినాని

తల్లీ పేరెడిదేవి ఏమిచేసెనాదండీ – పెళ్లీపనులు మొత్తాలు తానుచేసినాది

ఎంత వెదికీనండీ ఆవీడి అయినాని – పెండ్లి కొడుకూనయినా ఆమెచేద్దామని

అడుగూతూ ఉన్నదే అందర్నీ ఆవిడా – ఎక్కడా ఎంకన్నా జాడాలేలేవు

ఏమంటూ పలికింది తల్లీ పేరిడిదేవి – నేపంపాలేదండి ఎక్కడికయినాని

## పేరిటిదేవి కూతురు దుర్గమ్మను పిలవడం

కూతురా కూతూరా బెజవాడదుర్గమ్మా – నీతమ్ముడా ఎంకన్నా ఎక్కడకిపోయాడో

రావమ్మ దుర్గమ్మా కూతురా దుర్గా – కన్నతల్లి పేరిడిదేవి కేకలేసింది

ఈ యొక్క కేకాలు ఎవరాలకించో – మల్లికార్జునస్వామి పాదాలపడుతుంది

రావమ్మ దుర్గమ్మా రమ్మంటూ పిలిచా – ఈ యొక్క పిలుపూలే ఇన్నాది దుర్గా

ఓయోయి దుర్గమ్మా బెజవాడ దుర్గా – మల్లికార్జునస్వామి పాదాలు ఒత్తింది

నాపేన ఈశో వినవయ్యా మాటా – నాతల్లి అయినాని నన్ను పిలిసిందీ

నాకు సెలవాఇత్తే ఎల్లివత్తాను – మల్లికార్జునసామి సెలవులే ఇచ్చాడు

బెజవాడదుర్గమ్మా సెలవులందింది – నూటనొక్క మెట్లులే ఇడిసీపెట్టిందమ్మో

ఆ గజ్జి గజ్జిల దుర్గా కదిలి బయులెల్లింది – గజ్జి గజ్జిలదుర్గా గద్దికెళ్లిందమ్మో

నూటొక్క మెట్లులే దద్దారిల్లేయి – నూటొక్క మెట్లూలే ఇడిసీపెట్టింది

తల్లీ పేరమ్మా దగ్గరకొచ్చింది – అమ్మా ఓయమ్మా పేరిడిదేవి

ఏమమ్మా మాయమ్మా నన్నూ పిలిసావు – ఏమిచెప్పానమ్మా బెజవాడ దుర్గ

తమ్ముడికే పెళ్లిమూరతమే పెట్టి – వెళ్లినాడే అయ్యా సిన్నితమ్ముడూ

ఎక్కడో ఎంకన్న దాక్కునున్నాడు

నే కేకేలేత్తాను నీకు బయంలేదు – అమ్మా ఓయమ్మా పేరెడిదేవిట

తమ్ముడూ ఎంకన్న ఎయ్యిమాయలవాడా – రావోయి ఎంకన్నా రమ్మంటా పిలిసె

ఆ మాట ఇన్నాడే ఎంకటారమణా - శేషాపానుపు అయ్యా ఇడిసీ పెట్టేడే
దుర్గక్కా దగ్గరికి వచ్చేడు ఎంకన్నా - ఏమక్కా దుర్గక్కా నన్ను పిలిసావూ
అబ్బాఏమంటాపలికిందీ బెజవాడదుర్గక్క - తమ్ముాడా నామాట ఇనమంటాది
మేనమామ కూతుర్నే మేనకోడల్లనయో - ఆలవారి మంగాని పెళ్లీ ఆడయ్యా
ఆలావారి మంగాని పెళ్లాడపోతేను - తప్పు దొరుకూ తాము ఓరినాతమ్ముాడా
ఆలవారంటేని అన్నానికి లేరక్కో - లేనోరి మంగాని పుత్తీకడతానా
ఆలవారంటేని మేలామండేనో యక్కా - అన్నానికిలేనీవారు నాకు పెళ్లిచేత్తారా
నాముద్దూముచ్చటల్లా జరగావే ఓయక్కో - నాకుతగ్గాసోకూలే జరగావే ఓయక్కో
తప్పాదూ తమ్ముాడా నీకు అయినాని - ఆలవోరి మంగాని పెళ్లాడు తమ్ముాడా
నీముద్దూముచ్చటల్లా నేనూ చూసూతా - నీసరదాసోకూలు నేనూ జరుపూతా
మాటలే కాదక్క రాతలే రాయక్కో - రాతీపలకామీదా రాసియే అక్కా
నాకు నూటొక్కమెట్టూలే ఉన్నాయా తమ్ముాడా - నీకేభైయొక్కమెట్టూలే భాగామిత్తాను
నాకు ఆడపడుసు కట్నమూ యిత్తారు తమ్ముాడా - ఆ కట్నామూ నీకైనా యిత్తాను తమ్ముాడా
ఆడపడుసూకైనా పళ్లేమూసెంబైనా - బంగారు పళ్లేమూ సెంబూవత్తాది
అయ్యాకూడనైన నీకిత్తాను అయ్యో - నీ సరదా సోకూలూ నేజరుపుతాను
మాటాలేకాదక్కా రాతాలే రాయక్కో - నువ్వేయికల్లాతల్లివే జగదంబానువ్వేనా
నువ్వేయెంపు ఉంటావో నాకొయునంలేదక్కో - నువ్వేదరిని ఉంటావో నీకొయునంలేదూ
మంత్రాలు వత్తేనూ నువ్వూకాపడవక్కో - నువ్వేదరిని ఉంటావో వొయునామేలేదే
మాటలే కాదక్కో రాతాలే రాయక్కో - రాతీపలకామీద రాసియ్యే అక్కో
యాభైయొక్క మెట్టైనా రాతీపలకామీద - బెజవాడ దుర్గమ్మా రాసీ యిచ్చింది
కాలూ కడిగెసెంబు బంగారూ పళ్లేమూ - రాతీపలకామీద రాసియ్యే అక్కో
నీముద్దూముచ్చటల్లా నేను జరుపూతాను - నీగుళ్లా గోపురాలు కడితేని తమ్ముడా !
నీగుళ్లా గోపురాలు కట్టేటప్పుడు తమ్ముడా - నీకు డబ్బు అయినా సాయంసేత్తాను
రాతీపలకామీద రాసియ్యే దుర్గామ్మ ! - పెళ్లీఅయావాని ఒప్పానం పెట్టే
నూటొక్క మెట్టుకీ బైదల్లాలె దుర్గమ్మో - నూటొక్క మెట్టూలే ఎక్కూతున్నాదో
నూటొక్కమెట్టుమీద ఉన్నాది దుర్గమ్మో - తమ్ముాడూ ఎంకన్నా పెళ్లేవే అయినాది

## గజ్జాలమ్మ శతకము :

శరణుద్భువనచయమ్మా చరణనత సురీగణమ్మ సతత దయాంత
కరణమ్మా శరణమ్మా కరుణనము బ్రోవుమమ్మ గజ్జాలమ్మా !
శరణీకృత నతజన హృత్సరణీ సంసృతి సముద్రతరణి రిపుసం
హారతీ హా లాహల భక్తరుణీ కరుణింపుమమ్మ గజ్జాలమ్మా !

స్వర్గాపవర్గ ఫలదా దుర్గా భర్గార్థగాత్ర దుర్గా సత్సం
సర్గా నిర్గుణ సన్నుత గర్గాది మునీంద్రవర్గ గజ్జాలమ్మా!
అమరీ కబరీభార భ్రమరీ ముఖరితచరణ సరసిరుహయుగ శు
భ్రమరీ చ్యవతంసశ్రితాఘమరచీ ఘనాభ్యుదయిని గజ్జాలమ్మా!
శారీరకాంతి విజిత మసారీ నిగమాంతనీడ శారీరపు సం
హారీ హృస్థితశౌరీ గౌరీ మముబ్రోవుమమ్మ గజ్జాలమ్మా!
ముజ్జగములు ముమ్మూరుతు లజ్జన నీమయజిక్కి యణమగుడ సం
చజ్జవమున జీచ్ఛక్తి జగజ్జాలముగన్న తల్లి గజ్జాలమ్మా!
తల్లీ యాశ్రితకల్పకవల్లీ రిపుజైత్యహృదయభల్లీ మాయా
భిల్లీ ఫలితానిల భుగ్వల్లి దళనిభకపోలి గజ్జాలమ్మా!
నాళీక జాజాది దివిషత్పాళీ మకుటాగ్రమణి విభాభాస్వత్ప
స్నాళీక ఖరజ్యోత్స్నాక్షాళిత శ్రితదురిత పంక గజ్జాలమ్మా!
తృణమైన మేరువగు నీమృణ గతిగిన మేరువైన తృణమగు గగనీ
ఘృణదరిగిన సకల సురీగణసేవిత పాదపద్మ గజ్జాలమ్మా!
నర్తకి పోలిక పెక్కగుమూర్తులతో భువనమంత బొదలచు నిత్యం
బార్తుల భక్తుల బ్రోచెదు కర్తవు గద సదయహృదయ గజ్జాలమ్మా!
శ్రీశ గిరీశ ప్రముఖసురేశులు నీశక్తి గలుగ నేకదయుని ఘో
రాశరవీరుల నణచి బ్రకాశితకీర్తి ఘనులైరి గజ్జాలమ్మా!
అచ్చులవు బత్తితోడను నిచ్చలు నిను బూజసేయు సెగడనవారిన్
గ్రచ్చుర సడుకని కరుణన గ్రచ్చుల నొడగూర్చిబ్రోతు గజ్జాలమ్మా!
మాయాతీత గుణాన్వితవై యాదిని త్రిగుణకలితులగు మూర్తులచే
నీ యఖిలము గావించితిగా యంబా గుణ కదంబా గజ్జాలమ్మా!
ఏపురమునందు నెవ్వారేపారిన భక్తితోడ నేపేరిడినన్
రూపించి గొలుచుచుండిన కాపాడుదువమ్మ వారి గజ్జాలమ్మా!
తారకదైత్యుని బాధలకోరువలేక మరులెల్ల నొద్దిక వేడన్
కూరిమి కుమా పనిచి నివారణ మొనరించితివి గదా గజ్జాలమ్మా!
శ్రీ మహిత తాటిపర్తిగ్రామ సువాసిని విధూత కలుషిణి భక్తో
ద్దామదయాశారిని నిష్కామ సుగుణరత్నధామ్ని గజ్జాలమ్మా!
ారిణి మునిమానస సంచారిణి శరచాప శంఖచక్రాపి గదా!
ారిణి సువిచారిణి హుంకారిణి తురితార్ణతరణి గజ్జాలమ్మా!
వ్వసుమతి నెవ్వడు మది నివ్వటిలెడు భక్తిగొల్వనేరడొ నిన్నున్

రవ్వంత శక్తిలేక యుగవ్వకు కొరగాడు వాడు గజ్జాలమ్మా !

గజ్జాలమ్మను పేరన మజ్జనులను బ్రోవనుదయమందితి గద సం

వజ్జలజముఖీ సఖివి జగజ్జాలముగన్నతల్లి గజ్జాలమ్మా !

కాసరదైత్యుని బాధల వేసరి వానపుడ మొదలు వేల్పులువేడన్

కేసరి వాహిరియై యుగ్రాసిందును మాడితివి వాని గజ్జాలమ్మా !

పీఠాపుర పరిసరమున తాటిపర్తి యనెడు నూర దనరుచు బవలజం

ఘూటముల మాన్పి బ్రోచెదు గాటపుదయ భక్తజనుల గజ్జాలమ్మా !

బలవంతములగు నింద్రియుములు బండింతు మనసు సంయితమును నీడ్చుగదా

తలపగ వాని జయింపంగలవాడె నిన్ను గాంచు గజ్జాలమ్మా !

కామమొదవు సంగంబున కామంబున రుషయు దాని కతమున మోహం

బా మోహమెరుక వణుచును కామము లేకుండజేయు గజ్జాలమ్మా!

గందరగోళ మొనర్చుచు డెందము నింద్రియచయము గడింది వెతల్పా

ల్జెందించి వేచుచుండెను క్రందన చెడు శక్తినిమ్ము గజ్జాలమ్మా !

చీమలు మొదలు గనలునెమ్మోముం దణిదనుక గలుగు భూతములందున్

నీమహిమలేని డెందును కామింపగవమ్ము సుమ్ము గజ్జాలమ్మా !

ధర్మంబులకెల్ల నుత్తమదర్మంబు యహింసయని బుధ ప్రకరంబుల్

నిర్మించె శ్రుతులను దుష్కర్మల దిగనంగలేరు గజ్జాలమ్మా !

అల్పులు కొందరు దమకు ననల్పములగు శుభము లబ్బునను మూఢత

సల్పుచును ప్రాణిహింసను కల్పింతురు నీకు బలిగా గజ్జాలమ్మా !

***ఆకొండి వెంకన్నగారు***

***ఉక్తలేఖనము ఆకొండి కొండగారు***

## మామిళ్లమ్మ దండకం

శ్రీమన్మహీధ్రాధి పాగ్రియపుత్రీ, పవిత్రీకృతాత్మీయ చారిత్రి, ధాత్రీ దురాహార సంకల్పిత స్వీమూర్తి, భవత్పాదపంకేరుహ ధ్యానసంతుష్టుడనై, స్వస్థ చిత్తుండనై, బుద్ధినూహించి, ప్రేమించి, సేవించి, స్తోత్రంబు గావించి, ధన్యుండనేదంచు నూహించి, నీమీద నేనొండు సద్దండకం బొప్పుగా జెప్ప నూహించి యున్నాడనే! శక్తిగన్నాడనే! కన్నవానిం దయం గన్నచందంబునన్ మన్ననల్ జేసి, మామిళ్లతల్లీ మముంగాన నాకర్ననంబొప్పుగా జేయవే బాయువే పాపముల్ నీదుపాదంబులన్ సొంపుగా సర్వకాలంబులందున్ మతింపగన్ తరింపగనన్ జేయగా జెల్లవే తల్లి తల్లీ ! -----------

ఈవిధంగా సాగే ఈ దండకంలో మామిళ్లమ్మ జాతర జరిగేతీరు, ఆమె పుట్టింటివారు, ఆమెకు జనులొసగే నైవేద్యాలు, మొదలైనవన్నీ వర్ణింపబడ్డాయి. (వీటన్నిటిని నేను సంబంధిత ప్రకరణాలలో వివరించాను)

***శ్రీ ముక్కపాటి భాస్కరరామయ్యసిద్ధాంతి, మారేడుబాక***

**బంగారమ్మమీద బుర్రకథ బాణీలో నున్న పాట :**

వాసిగాను పీఠికాపురంబున వన్నెకెక్కియున్న, అమ్మ మరివన్నె కెక్కియున్న

తల్లి మరి వన్నెకెక్కియున్న, దేవి మరి వన్నెకెక్కియున్న

పల్లపువీధి మెయిన్ రోడ్డుప్రక్క రావిచెట్టుకింద నిలుచున్న బంగారమ్మా ! వాసిగాను !!

ఓ సుందరాంగి నీవున్న స్థలంబిక చూడ చోద్యమమ్మ

మూడురోడ్డుల జంక్షనమ్మ, ముద్దుగ మూలనుంటివమ్మ

ఎండకీ ఎండుచుంటివమ్మ, వర్షమున తడియుచుంటివమ్మ

చెట్టుక్రిందాను నిలిచినమ్మ, సిగ్గుచే శిరము వంచినమ్మ

కన్నవారి కరుణలేదు కొమ్మ, బండారోరాడబడుచువమ్మ

గోపురం బొకటి కోరవమ్మ

ఓకొమ్మ నీవు కొత్తెం వెంకట్రావు గారు స్వప్నమందున వెళ్ళి చెప్పుకొనుమా

దామెర జగన్నాథుని దయగోరమ్మ, జీను మాణిక్యాల గారితో జతనుగూడవమ్మ

బొజ్జాదొర్రయ్యగారితో బోధచేయవమ్మ, కొత్తెంవారిలోవ రాజుతో కోరి చెప్పవమ్మ వాసిగాను!!

ఏడాది కొక్కసారి జనులు ఉత్సవములు చేయుదురమ్మా

సానిమేళములు ఎన్నోసుమ్మ, కోయడాన్సులే పెడుదురమ్మ

పిల్లలకు పేర్లు పెడుతురమ్మ, బండ్లవేషములు వేతురమ్మ

బాణాసంచంతు లేదుసుమ్మ, గండదీపంబు పెడుదురమ్మ

కుంభములు పెట్టుకొందురమ్మ, బంగారుబొమ్మ యందురమ్మ వాసిగాను !!

***పెదిరెడ్డిరాజు, కొండెవరం***

**సినీగీతాల బాణీలో మారెమ్మమీద పాట**

(పసివాడుప్రాణం సినిమాలో 'కాశ్మీరు లోయలో' అనే శైలిలో)

మారెమ్మ మాతవో మమ్మేలు నేతవో మారెమ్మ మాతా

కరుణించేతల్లి వో మాకల్పవల్లివో మారెమ్మ మాతా

సురవీరగంభీరి జగమేలినావే

సర్వదీనులపాలం రక్షింపరావే

సర్వశక్తిజూపు ముక్తి

సుందరాంగి అందవమ్మ వందనములు

ఎందున్న తెలిపెద మావిన్నపంబులు మారెమ్మ మాతవో!!

శార్వాణి మమ్మేలరావెందుకో పర్వత శిఖరాలపై నెందుకో

నిర్భాగ్య ఈ జన్మ నాకెందుకో నీపొందునే నన్ను త్వర జేర్చుకో

శరణంటినే దివ్యశుభకారిణీ సాష్టాంగ స్వాగతాలు నీకేయుని
సర్వకిరీటంబు చతురాస్త్ర శూలంబు దాల్చేవు మారెమ్మ చూడామణి
సుందరాంగి చూపవమ్మ మాకు వెలుగులు
అందవమ్మ ఎందునున్న వందనంబులు మారెమ్మ మాతవో

**ఫల్లా రమణ, గొల్లప్రోలు**

ఈవిధంగా జానపదబాణీలో అలవోకగా జాలువారే పూజ, వర్ణన, కథాగేయాలతో పాటు శిష్టులు, బుర్రకథ దళాలవారు, భజన బృందాలవారు కూడ తమ తమ బాణీలలో గ్రామదేవతలపై సాహితీసృష్టి కావించి, తమ తమ భక్తిప్రవత్తులు ప్రదర్శిస్తున్నారంటే, సంఘంలో గ్రామదేవతల ప్రాముఖ్య తగ్గలేదని, ఆధునిక పోకడల ప్రభావాన్ని తలదన్ని గ్రామదేవతలు సంఘంలో తమ స్థానాన్ని సుస్థిరంగా కాపాడుకుంటూన్నారని విదితమగుచున్నది.

# అనుబంధం - 2

## గ్రామదేవతలు - పూజింపబడుతున్న గ్రామాలు

ప్రతి గ్రామానికి ఒక దేవత ఉంటుంది. దేవతలేని గ్రామం ఉండదంటే అతిశయోక్తి కాదు. గ్రామదేవతల కుండే వలస లక్షణం వల్ల ఒక దేవత వేరు వేరు గ్రామాలలో నిలిచి ఆయా గ్రామస్థులచేత పూజలందుకుంటుంది. దీనినిబట్టి జిల్లాలోని వివిధ దేవతలపేర్లు వారు పూజలందుకుంటున్న గ్రామాల పేర్లు ఇక్కడ పొందుపరుస్తున్నాను. నా విషయసేకరణ పరిధిననుసరించి, నాకు లభించిన వివరాలను ఇస్తున్నాను.

| దేవత పేరు | - | పూజింపబడుతున్న గ్రామము(లు) |
|---|---|---|
| అంకమ్మ లేక అంకాలమ్మ | - | కొడవలి, భద్రవరం, రావులపాలెం, ధవళేశ్వరం |
| అండాలమ్మ | - | బొమ్రంపాలెం |
| అంతర్లమ్మ | - | నెల్లిపూడి |
| అక్కమ్మ | - | కూనవరం |
| అడవమ్మోరు | - | పాతపెరుమాళ్లపురం |
| ఆలివేలు అక్కమ్మ | - | కొడుకొదురు |
| ఆకులమ్మ | - | ఇసుకపూడి |
| ఆదిలక్ష్మమ్మ | - | కమిని, కేశనకుర్రు, రాజమండ్రి, వెలిచేరు |
| ఆరులమ్మ | - | రాజవరం |
| ఇంజవతమ్మ | - | లక్ష్మీపోలవరం |
| ఇందేశమ్మ | - | వెదుళ్లపల్లి, బులుసుపాలెం, వజ్రకూటం |
| ఇటుకులమ్మ | - | మాచవరం |
| ఉచ్చింతాలమ్మ | - | పేరవరం,లింగంపర్తి |
| ఉండ్రాళ్లమ్మ | - | అమరవిల్లి |
| ఉబ్బాలమ్మ | - | తాండవపల్లి, పులగుర్తి, ముక్కినాడ |
| ఊడాలమ్మ | - | వెలిచేరు |
| ఊడుగులమ్మ | | పొన్నమండ, వంతంగి, నర్సిపూడి |
| ఎర్నమ్మ | - | ఈతకోట |
| ఎల్లమ్మ లేక ఎల్లారమ్మ | - | రావేశ్వరం, వండపేట, గొల్లవిల్లి, వెంగయ్యమ్మపేట |
| ఏగులమ్మ లేక వేగులమ్మ | - | వెల్లుర్తి, ఇసుకపల్లి, దుర్గాడ, రామవరం, జి. |

| | | |
|---|---|---|
| | | రాగంపేట, తాళ్లూరు, రాయవరం, మన్యవారి పాలెం కాట్రావులపల్లి, గోండి, ప్రత్తిపాడు, గోకవరం, తిరుపతిరాజుపాలెం, ఉప్పలపూడి, ఏలూరు, అప్పన్నపాలెం, రమణయ్యపేట |
| ఒనువులమ్మ లేక ఒనుగులమ్మ లేక వనవాలమ్మ | – | అమరవిల్లి, కొత్తపల్లి, చిరతపూడి, అమీనబాద, జావులపల్లి, పెదపట్నంలంక, పెదపట్నం, మంగితుర్తి, మగతపల్లి, కడియం, గుమ్మరేగుల, గిరిజనపురం, కేతనగిరి, మిర్తిపాడు, పెనుమళ్ల, బాతనవిల్లి, వాకతిప్ప, వీరవిల్లిపాలెం, రాజోలు |
| ఒరేలమ్మ | – | గోనేడ |
| కట్టాలమ్మ లేక కట్టలాంబ | – | అవిడి |
| కడియాలమ్మ | – | మల్లిసాల |
| కనకమహాలక్ష్మమ్మ | – | మాడుపల్లి, మురముళ్ల, మాగాం, దేవరాపల్లి, ఉడుమూడి, వీరవరం |
| కన్నేలమ్మ | – | మర్రివీడు |
| కప్పడాలమ్మ | – | మానేపల్లి |
| కాగితులమ్మ | – | వెదిరేశ్వరం |
| కాటుకలమ్మ | – | ఉప్పాడ, మూలపేట |
| కాటుమాయమ్మ | – | కాట్రేనిపాడు |
| కామాక్షమ్మ | – | మండపేట |
| కుంచాలమ్మ | – | పరిమితడక |
| కుండాలమ్మ | – | కొండూరు |
| కుంతీదేవి | – | జెగురుపాడు, ఎర్రంపాలెం |
| కొండమ్మ లేక కొండాలమ్మ | – | పసర్లపూడి, పసర్లపూడి లంక, సిరిపల్లి |
| కొత్తమ్మ | – | బలభద్రపురం, తిమ్మరాజుపేట, ఆలవెల్లివెంకట నగరం |
| కోటసత్తెమ్మ | – | పిఠాపురం |
| కోటమ్మ | – | అమలాపురం |
| కోట్లమ్మ | – | మామిడాడ, సామర్లకోట, అవంతవరం, దంగేరు |
| కోరలమ్మ | – | వాడపల్లి, ఏలేశ్వరం |
| గంగాలమ్మ | – | పేరవరం, కొండతిమ్మాపురం, దొంతమూరు, |

| | | |
|---|---|---|
| | | వన్నెపూడి, రావర్తి, జల్లూరు, చేబ్రోలు, ఉప్పుడి, తునికలపూడి, జడేరు, అనుకులపాలెం, వేటమామిడి, ఏటిపల్లి, దేవరమడుగు, దాలిపూడి, బొడ్డపల్లి, నులకమద్ది, లోదొడ్డి, రామచంద్రపురం, భూపాలపట్నం, వంతాడ, తోటపల్లి, కొంతంగి, కోటంగి, రమణయ్యపేట, మొదలైన గ్రామాలతోపాటు మన్యం ప్రాంతమంతా కూడ |
| గంటమ్మ | – | గంటి, నరకడమిల్లి. కామేశ్వరం. గుడిమెల్లంక ఖండ్రిక. |
| గంటలమ్మ | – | కూరకల్లపల్లి, రాజమండ్రి |
| గందాలమ్మ | – | నాగులాపల్లి |
| గజ్జెలమ్మ | – | జె.తిమ్మాపురం, తాటిపర్తి |
| గనికమ్మ | – | అమలాపురం |
| గరగలమ్మ | – | ముమ్మిడివరప్పాడు, భూపాలపట్నం |
| గారాలమ్మ | – | పరిమితడక |
| గున్నాలమ్మ | – | వాడపాలెం |
| గుబ్బాలమ్మ | – | ఇర్రిపాక, గోకవరం, మురారి, రాఘవపట్నం, కంబాలపాలెం |
| గుర్రమ్మ లేక గుర్రాలక్క | – | ఇసుకపల్లి, అంతర్వేది |
| గొంతేలమ్మ | – | వీరవిల్లిపాలెం, నరకడమిల్లి, అంకంపాలెం, మిట్టపాలెం, గోపాలపురం, మండపేట |
| గొంపమ్మ | – | బొడ్డవరం, తాటిపాకజగన్నాథపురం |
| గొల్లాలమ్మ | – | కూర్మాపురం, అంజూరు, వెంగయ్యమ్మపేట |
| గొలుసులమ్మ | – | తిమ్మాపురం |
| గోగులమ్మ లేక గోగులాంబ | – | బికొత్తూరు, గోకివాడ, గోడిలంక, బొల్లకుర్రు, బొడ్డవరం, తావురపల్లి, దుగ్గదురు, పెదరాయువరం, బొర్రంపాలెం, రాజభూపాలపట్నం, కట్టమూరు, కొమరిపాలెం, గోపాలవురం |
| చామాలమ్మ | - | మెరకచామారం |
| చింతపాటమ్మ | – | పసలపూడి |
| చింతాలమ్మ | – | పులిదిండి, సిరివాడ, మర్రివీడు తిమ్మాపురం, |

వడ్డిపర్రు, కొమరగిరి, విరవ, అల్లవరం, వడ్లమూరు, అమిరేకుల, జల్దాం, పసలపూడి, ఇల్లపల్లి, రాఘవపట్టణం, ముంజవరం.

చినిపాలమ్మ – దివిలి

చీడికమ్మ – కోరుప్రోలు మల్లవరం, కొండతిమ్మాపురం

చేముళ్లమ్మ – జగ్గన్నతిమ్మాపురం

జట్లమ్మ – తాటిపర్తి, సుబ్బంపేట, ముక్కొల్లు

జమ్మాలమ్మ – ఇల్లింద్రాడ

జాగరమ్మ – శరభవరం

జాజులమ్మ – మాసంపల్లి

జానుపల్లమ్మ – జానుపల్లి

జువ్వలమ్మ లేక జువ్వలాంబ – దేవరాపల్లి, కుండపల్లి

డెక్కలపోలమ్మ – తాళ్లూరు

తల్లమ్మ – తామరాడ

తలుపులమ్మ – లోవకొత్తూరు, కొత్తూరు, రాజుపాలెం, దిగువదారాపల్లి, దాక్షారామం

తాటమ్మ – పాతగన్నవరం

తాటిపూడమ్మ – కట్టుంగ

తాళ్లమ్మ – రమణక్కపేట, విరవాడ, గోవిందరాజులపాలెం, గోరింట, ఎ. కొత్తపల్లి

తిల్లాలమ్మ – తిలకుప్ప

తుమ్మాలమ్మ – సీతానగరం

తోటమ్మ లేక తోట్లమ్మ – తాళ్లూరు, పాలగుమ్మి, పసలపూడి

దండమ్మ – కొమరగిరి, వడిశలేరు

దండుగంగమ్మ – పెదబ్రహ్మదేవం

దండుగులమ్మ – మల్లిసాల

దనమ్మ – వాడపాలెం, అమరవిల్లి, మగతపల్లి, గోగన్నమఠం, కొత్తరమూడి

దనమహాలక్ష్మి – గొల్లపాలెం

దానవమ్మ – కొమరగిరి

దారలమ్మ – రాజవరం

దాసుల్లమ్మ – చెయ్యేరు

దుర్గమ్మ – పెద్దనాపల్లి, రామచంద్రపురం, కొమరిపాలెం, శృంగారాయునిపాలెం, కందలాడ, చిత్రాడ, మాధవపురం

దేశాలమ్మ – వసంతవాడ

దోనాలమ్మ – బూపాలపట్నం. కొమరిపాలెం

దోరాలమ్మ – కడియం

దోసాలమ్మె – కానవరం, తోకాడ, దుప్పులపూడి

నంగాలమ్మ – నంగవరం, పి.దొంతమూరు, చినజగ్గంపేట

నక్కుళ్లమ్మ – నవఖండ్రవాడ

నగరమ్మ – పేరవరం

నడవపల్లమ్మ – నడవపల్లి

నాంచారమ్మ – పేరవరం, ర్యాలి

నీలపల్లమ్మ – నీలపల్లి

నీలవేణమ్మ – ఇరుసుమండ

నూకాలమ్మ – కిర్లంపూడి, ఉత్తరకంచి, ఒమ్మంగి, పెద్దిపాలెం, సంత పైడిపాల, ఉద్దండ జగన్నాథపురం, మండపం, శంఖవరం, పెద్దాపురం, ఎండపల్లి, లింగపర్తి, పవర, ఏలూరు, పిఠాపురం, కోలంక, చింతలూరు, మర్లావ, కాండ్రకోట, గొల్లప్రోలు, ఉప్పాడ, పొన్నాడ, ఇర్రిపాక, రామచంద్రపురం, మాధవపురం, చెందుర్తి, చేబ్రోలు, కుమారపురం, నవర, కనుపూరు, సీతారాంపురం, మల్లేపల్లి, రాజొవమ్మంగి, కింద్ర, కొరుప్రోలుమల్లవరం, కొత్తూరు, బిళ్లనందూరు, దిగువాయిపోలవరం, ఎ. కొత్తపల్లి, పసర్లపూడి, చింతలపల్లి, తునికలపూడి, వడిశలేరు, బిక్కవోలు, రాజమండ్రి, కాకినాడ జి. కొత్తపల్లి, ఉండూరు.

నేరేళ్లమ్మ – నాగులాపల్లి, కొమరగిరి, తిరుమాలి, రాపర్తి, అన్నవరం, ద్రాక్షారామం

నేస్తాలమ్మ – ములగపూడి

పందిళ్లమ్మ – మూలపేట

పంపాదమ్మ – పైడికొండ, కృష్ణాపురం, అద్దారిపేట, దుర్గాడ పంపాదిపేట, కోటంగి

పచ్చాలమ్మ – తాటిపర్తి, చినతిరుపతి

| | | |
|---|---|---|
| పట్టాలమ్మ | – | ఒట్టిగెడ్డ |
| పద్దాలమ్మ | – | గోకివాడ |
| పద్దాలవెంకమ్మ | – | లొల్ల, మెర్లపాలెం |
| పరదేశమ్మ | – | మల్లేపల్లి, ఇంజరం, తాళ్లరేవు |
| పల్లాలమ్మ | – | వానపల్లి, ఇసుకపల్లి, దివిలి, మొగలికుదురు, చింతలపల్లి, అంతర్వేదిపాలెం, కాపవరం, కడియం |
| పసుపులమ్మ | – | సామర్లకోట, రాపర్తి, పన్నెపూడి |
| పాటెమ్మ | – | కట్టుంగ, లక్ష్మీపోలవరం |
| పాదాలమ్మ | – | ఎ. విజయనగరం, చిత్రాడ, బలరాంపురం, రమణయ్యపేట, ప్రత్తిపాడు, ఏలూరు, రాపర్తి సూరంపాలెం, ఆనూరు, ప్రారాయవరం, నరసింగపురం, వీరరాఘవపురం |
| పాపమ్మ | – | దంగేరు, మండపేట, మల్లవరం, గండేపల్లి, గిడజాం |
| పాలమ్మ | – | జి. మేడపాడు, పసర్లపూడి, లూటుకుర్రు, ఈదరాడ, దోమాడ, తార్లంపూడి |
| పాశాలమ్మ | – | నరేంద్రపట్టణం, ఎర్రవరం, బూరుగుపూడి, సింగవరం, ముగ్గళ్ల, తిరుమాలి |
| పెద్దింటమ్మ | – | భోగాపురం, లక్ష్మీపురం, కొండెవరం, చంద్రంపాలెం, కోరుపల్లిపాడు |
| పైడమ్మ | – | శంకరగుప్తం, కేశనపల్లి |
| పైడితల్లమ్మ | – | పిఠాపురం, ఏలేశ్వరం |
| పైడిమల్లమ్మ | – | జి. కొత్తపల్లి, చినబ్రహ్మదేవం, గుత్తిందీవి |
| పైళ్లమ్మ | – | బోడసకుర్రు |
| పోలేరమ్మ | – | గాదరాడ, పల్లెపాలెం, నాయకంపల్లి, మూలపేట, జల్లూరు, గంటిరాయుడుపాలెం, ఎర్రంపాలెం, అమీన్‌బాద, సీతారాంపురం, వెదురుపాక, రాయవరం, మండపేట, జేగురుపాడు |
| పోశమ్మ | – | గొందూరు, చీడిపల్లి |
| బులుసులమ్మ | – | సోమేశ్వరం, భూపాలపట్నం, ఎర్రంపాలెం, లక్కవరం, రాయవరం |
| బూర్లమ్మ | – | చంద్రమాంపల్లి |
| భూలోకశక్తి | – | కృష్ణవరం, మానేపల్లి, తోకాడ, అనుకుంపాలెం, |

బూరుగుపాలెం

| | | |
|---|---|---|
| బొడ్డమ్మ | – | కుయ్యేరు |
| బోడిదేవత | – | లొదొడ్డి |
| బోడకొండమ్మ | – | దుర్గాడ, రాఘవపట్నం, అమిరేకుల, శరభవరం, పోతులూరు |
| బొయిాలమ్మ | – | తాటిపాక జగన్నాథపురం |
| మంటలమ్మ | – | కృష్ణవరం |
| మండాలమ్మ | – | ద్రాక్షారామం |
| మర్లమ్మ | – | కుమారపురం, కృష్ణవరం |
| మరిడమ్మ | – | పెద్దాపురం, పిఠాపురం, ఏలూరు, చిన్నింపేట, జె. తిమ్మాపురం, రమణయ్యపేట, మాధవపురం, గండేపల్లి, తానేలంక, సూరసానియానాం, దొంతికుర్రు, అన్నవరం, బిళ్లనందూరు |
| మల్లమ్మ లేక మల్లమాంబ | – | కేశనకుర్రు, నంగవరం, ఉప్పుడి, ఆత్రేయపురం |
| మశమ్మ లేక మశానమ్మ | – | ఫకురుద్దీన్‌పాలెం, జాములపల్లి, రావికంపాడు, సామంతకుర్రు, అంజూరు |
| మసకపల్లమ్మ | – | మసకపల్లి |
| మహాలక్ష్మమ్మ | – | పెదపట్నంలంక, అప్పన్నరామునిలంక, రాజమండ్రి, రాజభూపాలపట్నం, భూపాలపట్నం, కడియం, కందలాడ, చిత్రాడ, మండపేట, గోడి, ర్యాలి, కొండకొదురు, మాచవరం, వెల్ల, జగపతిరాజపురం, రంపెర్రంపాలె, రాజవరం, ఆత్రేయపురం, పసర్లపూడి, కాత్రేనిపాడు, మోరి, శంకరగుప్తం |
| మాచరమ్మ | – | మాచర, సామర్లకోట |
| మాణిక్యాలమ్మ | – | వాడ్రేవుపల్లి, గెద్దాడ, మురమళ్ల |
| మాదాలమ్మ | – | గోర్స |
| మారెమ్మ | – | పిఠాపురం, జాములపల్లి, అంతర్వేది, ఉచ్చిలి, ఎండపల్లి, రాజమండ్రి, కుమారపురం |
| మావుళ్లమ్మ | – | తాటిపాక, ములికిపల్లి, మల్లవరం, ఇసుకపూడి, మారేడుబాక, కాత్రేనికోన, నులమద్ది, పెదపర్తి, మునిపల్లి, చినగాడవిల్లి, వాడపాలెం, పెదబ్రహ్మదేవం |
| ముంగురులమ్మ | – | వేలంక, కందరాడ |

| | |
|---|---|
| ముక్కళ్లమ్మ | – విలసవిల్లి |
| ముత్యాలమ్మ | – రామవరం, సుంకరపాలెం, కుందవరం, దొడ్డిగుంట, కేశవదాసుపాలెం, కోటపాడు, అంతర్వేదిపాలెం, రంప ఎర్రంపాలెం, వాల్లాం, ధవళేశ్వరం, అప్పన్నరాముని లంక, టేకి, కొత్తపల్లి, కొమ్మనాపల్లి, విలసవిల్లి, శంకరగుప్తం, ముంజవరం, నదురుబాద, వెదిరేశ్వరం, ద్రాక్షారామం, చేబ్రోలు, మల్లవరం |
| మురుగులమ్మ | – తొత్తరమూడి, బండార్లంక |
| ములగాలమ్మ | – గజ్జెనపూడి, గున్నేపల్లి అగ్రహారం |
| ముసుళ్లమ్మ లేక ముసలమ్మ | – పుల్లేటికుర్రు, సత్యవాడ, పులిమేరు, శివకోడు, ముమ్మిడివరప్పాడు, దుగ్గుదురు |
| మూతాలమ్మ | – గొల్లప్రోలు |
| మొగలారమ్మ | – అంతర్వేది |
| రాజమ్మ | – జడ్. రాగంపేట, జె. రంగంపేట, జగ్గంపేట |
| రాజ్యలక్ష్మి | – తండవరం, అనంతవరం, బంటుమిల్లి |
| రావులమ్మ | – రాజపూడి, తండవరం, యల్లమిల్లి |
| రూపులమ్మ | – ఏలేశ్వరం, సంపర |
| లంకతల్లమ్మ | – ముమ్మిడివరం, కొమరాజు లంక మరియు కోనసీమ ప్రాంతం నందలి లంక గ్రామాల్లో కూడ |
| లొల్లాలమ్మ | – లొల్ల |
| వడుగులమ్మ | – పాడురుపాక |
| వరదాలమ్మ | – వన్నెపూడి |
| వసంతాలమ్మ | – లింగపర్తి |
| వాక్కులమ్మ | – రావులపాలెం, ర్యాలి, గంటి పెదపూడి |
| వెదుళ్లమ్మ | – చిన్నకొండేపూడి |
| వెన్నమ్మ | – ఈతకోట |
| వెలగాలమ్మ | – టేకి |
| వేపాలమ్మ | – బలభద్రపురం |
| వేములమ్మ | – ములగపూడి, రౌతులపూడి, భూపాలపట్నం, లచ్చిరెడ్డిపాలెం, గుమ్మరేగుల |
| వేలుపులమ్మ | రంగంపేట |

శ్యామలంబ - వెలుగుబంటు, రాజమండ్రి

సింగరమ్మ - మల్లిసాల

సుబ్బాలమ్మ - అమలాపురం

సోమాలమ్మ - అమరవిల్లి, కందలాడు, శంకరగుప్తం, రావులపాలెం, పొడకట్లపల్లి, జొన్నాడ, ముంగడపాలెం, పెదబ్రహ్మదేవం, అచ్చంపేట, పనసపాడు

# ఉపయుక్త గ్రంథసూచిక


**ఆంధ్ర గ్రంథములు :**

ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి, ఖండవల్లి లక్ష్మీరంజనం, బాలేందు శేఖరం, 1966

ఆంధ్ర భాషావికాసం, ఆచార్య గంటి జోగిసోమయాజి

ఆంధ్ర సంస్థానములు – సాహిత్యపోషణ, ఆచార్య టి. దోణప్ప

ఆంధ్రుల సాంఘికచరిత్ర, సురవరం ప్రతాపరెడ్డి, ఆంధ్రసాహిత్య పరిషత్తు 1949

ఋగ్వేదార్యులు – రాహుల్ సాంకృత్యాయన్, అనువాదం – మిక్కిలినేని సుబ్బారావు, 1974

కాటమరాజు కథలు, 1,2 సంపుటములు, డా. తంగిరాల వెంకటసుబ్బారావు, ఆంధ్రసారస్వత పరిషత్తు, 1976, 1978

కావమ్మ కథ, సి.వి. కృష్ణాబుక్ డిపో, మద్రాసు, 1974

గోదావరి సీమ – జానపదకళలు, క్రీడలు, వేడుకలు, పి. రామకృష్ణారెడ్డి, 1991

జానపదగేయాలు – సాంఘిక చరిత్ర, సంపాదకులు డా. బి. రామరాజు, డా. నాయని కృష్ణకుమారి, 1974

జానపదగేయ వాఙ్మయ వ్యాసావళి, నేదునూరి గంగాధరం, 1961

జానపదవాఙ్మయ పరిచయము, హరి ఆదిశేషువు, 1954

జానపదవిజ్ఞాన వ్యాసావళి, జి. యస్. మోహన్, 1981

జానపదసాహిత్యము – వీరగాథలు, డా. తంగిరాల వెంకటసుబ్బారావు, ప్రపంచ తెలుగు మహాసభలు, 1975

జానపదసాహిత్య స్వరూపం, డా. ఆర్వీయస్ సుందరం, 1976

తెలుగు జానపద గేయగాథలు, డా. నాయని కృష్ణకుమారి, 1977

తెలుగు జానపదగేయసాహిత్యము, డా. బి. రామరాజు, 1958

తెలుగు జానపద సాహిత్యము – పురాగాథలు, డా. రావిప్రేమలత,

దేవాలయాలమీద బూతుబొమ్మలెందుకు, తాపీ ధర్మారావు, 1977

పరిశీలన (వ్యాస సంకలనం) ఆచార్య నాయని కృష్ణకుమారి, 1977

పల్లెపదాల్లో ప్రజాజీవనం, యెల్దండ రఘుమారెడ్డి, 1979

పాండురంగమాహాత్మ్యము, తెనాలి రామకృష్ణకవి

ప్రాక్పశ్చిమ తత్త్వశాస్త్రచరిత్ర (ప్రథమ సంపుటము), అనువాదము సరిపెల్ల విశ్వనాథ శాస్త్రి, 1961

ప్రాచీనాంధ్ర సాహిత్యము – దేవీప్రతిపతి డా. కుందుర్తి సత్యన్నారాయణ మూర్తి, 1988

బంగారుపాప (బషీర్ బీబీ), చారిత్రక నవల, రాయువరపు గౌరీరాజు, 1985

భారతీయ తత్త్వశాస్త్రము, దేవీప్రసాద్ చటోపాధ్యాయ, అనువాదం డా. గూడ సుందర రామయ్య, 1978

భీమేశ్వర పురాణం, శ్రీనాథుడు

మనమూ – మన రాష్ట్రము – 3, తూర్పుగోదావరి జిల్లా

మారేడుబాక మామిళ్ల వారి దండకం, ముక్కపాటి భాస్కరామయ్య సిద్ధాంతి

మెసపొటేమియా సాహిత్య సంగ్రహము, కృష్ణచైతన్య, తెలుగు అనువాదము వేమరాజుభానుమూర్తి, 1958

రాతిస్తంభం (నాటకం) పానుగంటి లక్ష్మీనరసింహం

రామాయణ విశేషములు, సురవరం ప్రతాపరెడ్డి, 1957

వ్యాస ద్వాదశి, ద్వాదశి నాగేశ్వర శాస్త్రి, 1991

విజ్ఞానసర్వస్వము, తెలుగు భాషా సమితి, 4వ సంపుటం, 1961

విజయవిలాసము, చేమకూర వేంకటకవి

శబ్దార్థరత్నాకరము, తెలుగు – తెలుగు నిఘంటువు, వారణాసి వెంకటేశ్వర్లు, 1982

స్త్రీలపాటలు (అనంతపురం మండలం), జి.యస్. మోహన్, 1982

హిందువుల పండుగలు – పర్వములు, తిరుమల రామచంద్ర, 1960

## పత్రికలు

### దినపత్రికలు

ఆంధ్రజ్యోతి (తూ. గో.) 6 -4 -88, 18 -4 -90, 31-5-92; 2-5-86, మే; 86; ఆంధ్రప్రభ (విశాఖ), 17-6-86; ఆంధ్రప్రభ; 13-10-86; ఆంధ్రప్రభ, 9-8-86, ఆంధ్రభూమి, (తూ. గో.) 20-5-89, 22-4-89; ఆంధ్రభూమి 23-1-90; ఆంధ్రభూమి 16- 7-87; ఈనాడు (విశాఖ) 1-3-92; ఈనాడు (తూ. గో) 31-5-92, పైది 21-5-89;

### వారపత్రికలు

స్వాతి 15-9-89, పల్లకి 4-6-87

### మాసపత్రికలు

కిన్నెర, డిశంబరు, 1953; గృహలక్ష్మి, సెప్టెంబరు,1949 పైడి,1949

తెలుగు, జనవరి, 1988 భారతి, ఫిబ్రవరి, 1967; స్రవంతి, ఫిబ్రవరి, 1980; సాధన, మార్చి, 1986

**కరపత్రములు**

నూకాంబిక అమ్మవారి మహోత్సవ కరపత్రం, కాండ్రకోట, 1988

నూకాంబిక అమ్మవారి మహోత్సవ కరపత్రం, చింతలూరు, 1988

**సిద్ధాంత వ్యాసములు**

అన్నమాచార్యులు – యక్షగాన సంప్రదాయము (అముద్రిత సిద్ధాంత వ్యాసము) డా. అబ్బూరి గోపాలకృష్ణ

జానపద విజ్ఞానంలో బవనీలు – ఒక పరిశీలన (ముద్రిత లఘు సిద్ధాంత వ్యాసం) చింతల యాదయ్య, 1991

తణుకుతాలూకా గ్రామదేవతలు (అముద్రిత లఘు సిద్ధాంత వ్యాసం) ముత్యాలసంధ్య, 1981

కృష్ణజిల్లా గ్రామదేవతలు – పురాగాథా పరిశీలన (అముద్రిత లఘు సిద్ధాంత వ్యాసం) – ఆర్. రవీంద్రబాస్, 1987

నల్లగొండ జిల్లా గ్రామదేవతలు (ముద్రిత లఘు సిద్ధాంత వ్యాసం) మాదిరెడ్డి అండమ్మ, 1987

పశ్చిమ గోదావరి జిల్లా గ్రామదేవతలు – నమూనా సర్వేక్షణ – జానపద విజ్ఞాన విశ్లేషణ (అముద్రిత లఘు సిద్ధాంత వ్యాసం) – వీథి వివేకానందస్వామి, 1986

మోద కొండమ్మ గ్రామదేవత – జానపద సాహిత్యం (అముద్రిత లఘు సిద్ధాంత వ్యాసం), 1992

**వ్యాసములు :**

'గ్రామదేవతలు' డా. కోటి సూర్యనారాయణమూర్తి

గోదావరి తీరంలో కవులు, పండితులు – డా. పోచిరాజు శేషగిరిరావు

'తూర్పు గోదావరి జిల్లా' – డా. కోటి సూర్యనారాయణ మూర్తి

English Books

1. Ancient Humanity, Moragan Lewes
2. Animism - Primitive heritage - An Anthropological Anthology, Tayler E.B
3. Dictionary of Folkore, Mythology & Legend
4. Dravidian Gods in Modern Hinduism; Elmore
5. Element of Folk psychology, Wundt Willelm
6. Encyclopedia of Religion and Ethics, Vol.5, 1962
7. Ethnographic Notes in South India, Thruston E.
8. Female Worship, Nandita Krishna Femin - October 9, 1976

9,10. Folklore of Andhra Pradesh Rama Raju B. 1974

11. Folklore of Bengal, Ausuthosh Bhattacharya, 1978

12. Folklore and Folklife Richard M. Dorson
13. Golden Bough Vol. 1. Frazer G.J
14. Historical Studies in the Cult of the Goddess Manasa, Pradyot Kumar Maity 1966.
15. Indus Vally Civilization, John Marshall
16. Lokoyata, Debiprasad Chattopadhyaya, 1978
17. Mother Right in India, Ehrenfels B.O.R., 1941
18. Myth and Reality - D.D. Kosambi, 1962
19. Myth, Religion and Mother Right. J.J. Bachofen - 1967
20. The popular Religion and Folklore of Northern India, Wiliam Crook. B.A.. Vol. 1986
21. Primitive Culture Taylar, E.B. IInd edition
22. Shakti and Shaktas, IInd edition, Wookroof Sir John, 1920
23. Shakti Cult and Tara Circar B.C. 1967
24. Shakti power in conceptional Structure of Karipura Religion, Susan Snow wadly, 1975
25. Standard Dictionary of Folklore. Mythology and Legend; Vol. 1.2. 1949
26. Structural Anthropology, Claud Levi Straus, 1963
27. The Study of Folklore, Anal Dundes, 1965
28. The Sun Worship in Ancient India. V.C. Srivathsava 1972
29. The Village Gods of South India, White Head. 1921

Government Publications

1. Census of India, Fairs & Festival,s East Godavari, 1961
2. Census of India, 1991. Andhra Pradesh Series - 2 Provisional Population Tables - 1
3. District Census Hand Book of East Godavari - 1981
4. Hand Book of Statistics : East Godavari, 1985 - 86


# ఉపయుక్త వ్యక్తి సూచిక

| వ్యక్తి పేరు | గ్రామంపేరు | మండలం పేరు |
|---|---|---|
| అచ్చిరాజు, పలపకూరి | పనసపాడు | సామర్లకోట |
| అచ్యుతరామారావు, దివిలి | | |
| అడివయ్య, మేరుగ | మాయాపట్నం(ఉప్పాడ) | కొత్తపల్లి |
| అనంతాచారి, పి | ఏలేశ్వరం | ఏలేశ్వరం |
| అప్పయ్యమ్మ, దంగేటి | సామర్లకోట | సామర్లకోట |
| అప్పలరాజు, గండేపల్లి | | |
| గంగరాజు, రేవు | పిఠాపురం | పిఠాపురం |
| అప్పారావు, పులి | అమరవిల్లి | కొత్తపల్లి |

| | | | | |
|---|---|---|---|---|
| అమ్మోరయ్య, ఉప్పరపిల్లి | – | మాయాపట్నం(ఉప్పాడ) | – | కొత్తపల్లి |
| ఆదమ్మ, చిట్టిమూరి | – | ఎ.కొత్తపల్లి | – | తొండంగి |
| ఎర్రయ్య, బత్తిన | – | సీతపల్లి | – | రంపచోడవరం |
| కన్నమ్మ, పిలకా | – | రాజమండ్రి | – | రాజమండ్రి |
| కాశీ, దూడల | – | పిఠాపురం | – | పిఠాపురం |
| కృష్ణమూర్తి, దొడ్డి | – | కొండెవరం | – | కొత్తపల్లి |
| కృష్ణరావు, వెలిచేటి | – | బి.కొత్తూరు | – | పిఠాపురం |
| కోరలయ్య, సంతక | – | ఏలేశ్వరం | – | ఏలేశ్వరం |
| గంగయ్య, బండారు | – | వాడపాలెం | – | కొత్తపేట |
| గోపాలకృష్ణ, సుసర్ల | – | మాచవరం | – | అంబాజీపేట |
| గౌరీనాథశర్మ, రాయవరపు | – | మూలపేట | – | కొత్తపల్లి |
| చంద్రన్న, యాతం | – | కుమారపురం | – | పిఠాపురం |
| చంద్రరావు, కుప్పాల | – | తొత్తరమూడి | – | అయినవిల్లి |
| జంగందొర, కురసం | – | రాజవరం | – | గంగవరం |
| జగ్గమ్మ, మానేపల్లి | – | మల్లిసాల | – | జగ్గంపేట |
| జోగారావు, యస్వీ | – | విశాఖపట్నం | – | విశాఖపట్నం |
| తిరుపతిరాజు, యం. | – | ఎ.విజయనగరం | – | గొల్లప్రోలు |
| తుక్కయ్య, బండి | – | ఎ. కొత్తపల్లి | – | తొండంగి |
| తూతయ్య, చీడిపల్లి | – | రాజవొమ్మంగి | – | రాజవొమ్మంగి |
| దీక్షితులు, కొమాళ్లపల్లి | – | బొడ్డవరం | – | కోటనందూరు |
| నల్లారావు, సుకపల్ల | – | సామర్లకోట | – | సామర్లకోట |
| నాగరాజు, నేమాల | – | అద్దారిపేట | – | తొండంగి |
| నాగరాజు, శివకంచి | – | బలభద్రపురం | – | బిక్కవోలు |
| నూకరాజు, గండేపల్లి | – | మామిడాడ | – | జగ్గంపేట |
| నూకరాజు, బళ్ల | – | తిమ్మరాజుపేట | – | కోటనందూరు |
| నూకరాజు, మామిడాడ. | – | జల్లూరు | – | పిఠాపురం |
| నూకరాజు, ముత్యాల | – | రావర్తి | – | పిఠాపురం |
| నూకరాజు | – | తాటిపాకజగన్నాథపురం | – | కోటనందూరు |
| పెద్దకొండ, మేకల | – | తిమ్మరాజుపేట | – | కోటనందూరు |
| పోలీసురావు, వాకపల్లి | – | మాగాం | – | అయినవిల్లి |

| | | | | |
|---|---|---|---|---|
| బాపిరాజు, గోపిశెట్టి | - | బెండపూడి | - | తొండంగి |
| బులిరాజు, తోలేటి | - | సామర్లకోట | - | సామర్లకోట |
| బుల్లెమ్మ, మొల్లేటి | - | లింగపర్తి | - | ఏలేశ్వరం |
| భాస్కరరామయ్య | | | | |
| దీక్షితులు ముక్కపాటి | - | మారేడుబాక | - | మండపేట |
| మాధవ, శివకంచి | - | పిఠాపురం | - | పిఠాపురం |
| ముసలయ్య, గొల్లపల్లి | - | రాజవొమ్మంగి | - | రాజవొమ్మంగి |
| యముడమ్మ, రేవు | - | కొమరగిరి | - | కొత్తపల్లి |
| రత్నం, వాడ్రేవు | - | వానపల్లి | - | కొత్తపేట |
| రమణ, పల్లా | - | గొల్లప్రోలు | - | గొల్లప్రోలు |
| రమణ, వర్రి | - | కుమారపురం | - | పిఠాపురం |
| రాజన్న, దూడా | - | మాయాపట్నం(ఉప్పాడ) | - | కొత్తపల్లి |
| రాజారావు, అడ్డేపల్లి | - | రాజవొమ్మంగి | - | రాజవొమ్మంగి |
| రాజు, దొడ్డి, రాజా పెదిరెడ్డి | - | కొండెవరం | - | కొత్తపల్లి |
| రామకృష్ణమూర్తి, జోకా | - | కాండ్రకోట | - | పెద్దాపురం |
| రాములు, పల్లా | - | పిఠాపురం | - | పిఠాపురం |
| విజయరాణి, గండేపల్లి | - | లింగంపర్తి | - | ఏలేశ్వరం |
| విశ్వేశ్వరరావు, కాశీనాథభట్ల | - | పెద్దాపురం | - | పెద్దాపురం |
| వీరన్న, దైలిపిల్లి | - | మాయాపట్నం(ఉప్పాడ) | - | కొత్తపల్లి |
| శ్రీనివాస్, ఉద్దగిరి | - | తిరుమాలి | - | ఏలేశ్వరం |
| శ్రీనివాస్, పసుపులేటి | - | భద్రవరం | - | ఏలేశ్వరం |
| శ్రీరామచంద్రమూర్తి, ఆసాది | - | ఊలపల్లి | - | బిక్కవోలు |
| శేషగిరిరావు, ఆంధ్ర | - | విశాఖపట్టణం | - | విశాఖపట్టణం |
| సత్యనారాయణ, మొల్లేటి | - | మల్లేపల్లి | - | గండేపల్లి |
| సత్తెమ్మ, గండుమిల్లి | | | | |
| సుబ్బయ్యమ్మ, బంటుమిల్లి | - | పిఠాపురం | - | పిఠాపురం |
| సుబ్బారావు, తోటకూర | - | పెదబ్రహ్మదేవం | - | సామర్లకోట |
| హనుమంతురావు, చక్రవర్తుల | - | నవఖండ్రవాడ | - | పిఠాపురం |

## తప్పుఒప్పులపట్టిక

**గమనిక - 1**

287వ పేజీలో ''పోశమ్మ'' – ''బులుసులమ్మ'' దేవతల మధ్య రావలసిన గ్రామదేవతలు – వార పూజింపబడుతున్న గ్రామాల వివరాలు :

| | | |
|---|---|---|
| బంగారమ్మ | – | పిఠాపురం, పెద్దాపురం, తాళ్లంపూడి, సుబ్బంపేట, మూలపేట, కొత్తపేట, పెరుమాళ్లపురం. |
| బంగారుపాప | – | పొన్నాడ, అమలాపురం, రావులపాలెం, కొత్తపేట, మొల్లేరు, ఉడుమూడి, వైనతేయకొత్తపల్లి. |
| బండమ్మ | – | ఉప్పాడ, మూలపేట, చోడిపల్లిపేట, మొదలైన తీరప్రాంత గ్రామాలు. |
| బ్రరింకలమ్మ | – | ఉలిమేశ్వరం, కోరుపల్లిపాడు. |
| బలుసులమ్మ | – | శృంగవరపుపాలెం, వెదురుపాక, లక్కవరం విశ్వేశ్వరపురం, తానేలంక. |
| బాగిరితమ్మ | | ఉప్పాడ, మూలపేట, మొదలైన తీరప్రాంత గ్రామాలు. |
| బాపనమ్మ | – | పెద్దనాపల్లి, ఇప్పనపాడు, సీతపల్లి, గోకవరం, గంటి పెదపూడి. |

**గమనిక - 2**

అధస్సూచికలు ప్రతి ప్రకరణాంతమున ఈయబడినవి.

పోశమ్మ – బులుసులమ్మ రావలసిన గ్రామదేవతలు వారు పూజింపబడుతున్న గ్రామాల వివారా కొరకు తప్పు ఒప్పుల పట్టిక చూడుము.

చూడుము తప్పుఒప్పుల పట్టిక చివర

# తప్పు ఒప్పుల పట్టిక

| పేజి | పేరా | వరుస | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 115 | నాల్గవ | ఆరవ | ఉద్బృతి | ఉద్ధృతి |
| 122 | – | ఏడవ | గొ(్రాల్ని | గొ(్రెల్ని |
| 122 | మూడవ | మొదటి | రైల్వేషను | రైల్వేస్టేషను |
| 122 | మూడవ | మొదటి | వలమ | వెలమ |
| 123 | – | రెండవ | కొతభూమి | కొంతభూమి |
| 123 | మొదటి | మొదటి | కొండవరం | కొండెవరం |
| 123 | రెండవ | మూడవ | ఈడ్చుక | ఈడ్చుకొని |
| 126 | మొదటి | మూడు | ప్బలవారు | పంబలవారు |
| 126 | రెండు | మూడు | డెల్టే | డెల్టా |
| 126 | నాల్గు | మూడు | మజ్జానపమోరు | మజ్జానపమ్మోరు |
| 127 | చివరి | రెండు | సైతమ్మ | సత్తెమ్మ |
| 128 | నాల్గవ | మూడవ | మగితా | మిగతా |
| 128 | అయిదు | ఆరవ | పంబలనాదం | పంబనాదం |
| 130 | మొదటి | మొదటి | లేపింనా | లేపినా |
| 130 | రెండవ | చివరి | అంతరించిక | అంతరించి |
| 130 | అయిదు | మూడవ | పెళ్లికతురు | పెళ్లికూతురు |
| 132 | మొదటిగేయం | నాల్గవ | అందారు | అందాదు |
| 132 | అయిదు | నాల్గవ | వ్రేయాడ | వ్రేలాడ |
| 132 | రెండవగేయం | నాల్గవ | ఓజీ | జోజీ |
| 133 | చివరి | మొదటి | వేశం | వేషం |
| 133 | మొదటి | మొదటి | పంబబల | పంబల |
| 133 | చివరి | పదవ | వడకు | వడుకు |
| 134 | చివరి | మొదటి | వెల్లడించుకే | వెల్లడించుటకే |
| 134 | చివరి | రెండవ | వర్ణ | వర్ణన |
| 135 | – | మొదటి | సూచించుటకే | సూచించుటకే |
| 135 | మొదటి | అయిదవ | క్టి | కంటి |
| 135 | రెండవ | చివరి | యుంచుంది | యుంటుంది |
| 135 | మూడవ | రెండవ | బిడ్డ | బిడ్డల |
| 135 | చివరి | మూడవ | నుండి | నలిపి |
| 136 | మొదటి | నాల్గవ | ఆమరడ | ఆమడ |
| 136 | రెండవ | నాల్గవ | అవయువ | అవయవ |
| 136 | మూడవ | మూడవ | ఇప్పుడ | ఇప్పుడు |
| 136 | నాల్గవ | చివరి | ముంది | ముందు |
| 136 | నాల్గవ | చివరి | తిల్లని | తల్లిని |
| 137 | మూడవ | మొదటి | ఊశ్వరుడు | ఈశ్వరుడు. |
| 138 | నాల్గవ | మొదటి | లడుగుతుంది | ఊగుతుంది |
| 138 | నాల్గవ | నాల్గవ | ఓపతురాజే | పోతురాజే |
| 138 | అయిదవ | మూడవ | గోళ్ళ | గొడ్లు |
| 139 | రెండవ | మొదటి | చేట | చేటు |
| 139 | మూడవ | ఎనిమిదవ | ఇంచి | ఇంటి |
| 139 | మూడవ | పదమూడు | తీసుకొన్ను | తీసుకొస్తున్న |
| 139 | మూడవ | పదిహేను | బసుపునీరు | పసుపునీరు |
| 141 | మొదటి | నాల్గవ | తన్త | అత్త |
| 141 | రెండవ | పదమూడు | ఒక | ఒకే |
| 141 | రెండవ | పదిహేను | కృరమ్ముగప్పై | క్రూరమ్ముగమై |
| 141 | చివరి | రెండవ | ౹మణులు | లక్ష్మణులు |
| 142 | మొదటి | ఆరవ | ుసమ్మ | ముసలమ్మ |
| 142 | మొదటి | ఆరవ | ఇచ్చు | ఉచ్చు |

| | | | | |
|---|---|---|---|---|
| 142 | రెండవ | మూడవ | చెప్పున్నాడేమో | చెప్పుచు |
| 142 | రెండవ | పదవ | ఇమియుటానికి | ఉమియుటానికి |
| 142 | మూడవ | నాల్గవ | బ్రాహ్మలు | బ్రాహ్మణులు |
| 143 | మొదటి | ఏడవ | బొటచ్చు | బొట్టు |
| 146 | మూడవ | పది | కొడమీద | కొండమీద |
| 146 | మూడవ | పదకొండు | కొడకింద | కొండకింద |
| 159 | మూడవ | పదకొండు | వేసి | వేసె |
| 151 | మూడవ | ఆరవ | కదా ! తర్వాత 'బ్రహ్మ ఇచ్చిన పుత్రసంతానాన్ని [illegible] చెర్పాలి | |
| 169 | రెండవ | మొదటి | [illegible] | వారైన |
| 171 | మూడవ | మొదటి | రాతికొడ | రాతికొండ |
| 171 | మూడవ | రెండవ | కొచెం | కొంచెం |
| 176 | మొదటి | మొదటి | ఉది | ఉంది |
| 177 | రెండవ | చివరి | వెళ్ల | వాళ్ల |
| 179 | చివరి | మొదటి | – | వేరొక |
| 179 | చివరి | మొదటి | – | అన్నం |
| 184 | రెండవ | మూడవ | వెదిక | వైదిక |
| 185 | – | నాల్గవ | స్త్రాం | సూత్రం |
| 185 | – | ఏడవ | దుర్జనత్వ | దుర్జనత్వం |
| 186 | – | ఎనిమిది | ప్రాక్పశిచమ | ప్రాక్పశ్చిమ |
| 186 | – | తొమ్మిది | పు '28' | పైది.పు.28 |
| 188 | మూడవ | తొమ్మిది | చూపుతుందియు | చూపుతుంది |
| 190 | నాల్గవ | మొదటి,అయిదవ | గలగ | గరగ |
| 190 | నాల్గవ | ఏడవ | రోజ | రోజు |
| 191 | నాల్గవ | మొదటి | బద్దిగడుగలు | బద్దిగడుగుట |
| 200 | మొదటి | మూడవ | ఆదేవతా | దేవతా |
| 203 | – | అయిదవ | శీలసేసి | శీలనుతీసేసి |
| 204 | మొదటి | నాల్గవ | వంరం | వరం |
| 208 | నాల్గవ | అయిదవ | నిర్మాణం | నిర్మాణ |
| 210 | – | చివరినుండిరెండవ | అవురం | అవుతారం |
| 216 | – | పదమూడు | పెనుం | పెనం |
| 218 | – | ఆరవ | మడసిని | మడిసిని |
| 220 | – | ఇరవదవ | నిలువుట్టద్దాలు | నిలువుటద్దాలు |
| 220 | – | పదమూడవ | నడుమైన | నీనడుమైనా |
| 220 | – | పదనాల్గవ | తోసాచ్చి | తొసొచ్చి |
| 221 | మొదటి | ఎనిమిదవ | మగద్దాలమ్మ | మాదాలమ్మ |
| 223 | రెండవహెడ్డింగు | – | ప్రచారమైన | ప్రచారమై |
| 223 | మూడవ | ఏడవ | తీర్థానికివరగళ్లు | తీర్థానికిపరగళ్ల |
| 225 | నాల్గవ | చివరి | సందర్భశాన | సందర్భవశాన |
| 225 | నాల్గవ | చివరి | ఆమెతలు | సామెతలు |
| 225 | నాల్గవ | చివరి | కూడాం | కూడా |
| 226 | – | మొదటి | సురాపనం | సురాపానం |
| 227 | మూడవ | మొదటి | ఆగాలి | అడగాలి |
| 228 | – | ఆరవ | 'బా'ల | 'బాల' |
| 230 | – | రెండవ | బాష | భాష |
| 230 | – | నాల్గవ(దిగువనుంచి) | మొలగుడ్డు | మొలగుడ్డ |
| 231 | – | పదమూడవ | అందుస్తు | అందస్తు |
| 232 | – | పదహారవ | హడివిడిగా | హడావిడిగా |
| 232 | – | పదహారవ | ఉనంగా | ఉన్నవిధంగా |
| 234 | – | పదకొండవ | కగ్గం | కలిగిస్తూ |

| | | | | |
|---|---|---|---|---|
| 236 | – | అయిదవ(దిగువనుంచి) | వ్యాథలు | వ్యాధులు |
| 237 | – | పదవ | రలకొరివి | తలకొరివి |
| 238 | – | పదిహేడవ | దేవదాసి | లేవదీసి |
| 239 | – | ఎనిమిదవ | పాపులు | పాపాలు |
| 239 | – | పదవ | పంబలవాళ్ల | పంబలవాళ్ళ |
| 239 | – | పదిహేనవ | పతిధర్మ | పతిధర్మం |
| 239 | – | పదహారవ | పంట | వంట |
| 242 | – | పదహారవ | యోహనం | యౌవనం |
| 247 | నాల్గవ | మొదటి | గ్రామిణులందరు | గ్రామీణులందరు |
| 248 | నాల్గవ | మూడవ | అధ్యనం | అధ్యయనం |
| 248 | నాల్గవ | నాల్గవ | కల్గిన్నాయని | కల్గిఉన్నాయని |
| 249 | చివరి | రెండవ | ఆచార్య | ఆచార |
| 252 | మూడవ | రెండవ | జానున | జామున |
| 253 | మొదటి | ఎనిమిదవ | ముక్కుపాటి | ముక్కపాటి |
| 256 | – | ఆరవ | ఒల్లైలా | ఒల్లెల్లా |
| 256 | – | దిగువనుంచిఆరవ | చూడేబో | చూడేఅంబా |
| 258 | – | దిగువనుంచినాల్గవ | ప్రకాశుని | ప్రకాశిని |
| 259 | – | దిగువనుచిపదవ | జానీకి | జానాడే |
| 260 | – | తొమ్మిదవ | కుకంకాలు | కుంకాలు |
| 260 | – | ఇరవైఒకటవ | అమా | అమ్మా |
| 260 | – | చివరి | జానేడే | జానాడే |
| 268 | – | పదకొండవ | బయదెల్లసినాది | బయుదెల్లినాది |
| 269 | – | నాల్గవ | కిటీట | కిట్ట |
| 269 | – | పన్నెండవ | ఓభామామా | ఓభామాఏఊరుమాభామా |
| 269 | – | పదమూడవ | దాటింతూనూ | దాటింతానూ |
| 269 | – | పందొమ్మిదవ | బెడవాడ | బెజవాడ |
| 269 | – | ఇరువదివ | బోతేవాడు | బోతీవాడు |
| 269 | – | ఇరువదినాల్గవ | వెండియు | వెండీయు |
| 270 | – | చివరి | చిన్నతనాన్ని | చిన్నతనం |
| 270 | – | ఆరవ | మూడికంటి | మూడికండి |
| 270 | – | పదమూడవ | తరమూలూలాగ | తరమూలాగ |
| 271 | – | చివరి | నాగినాడు | లాగినాడు |
| 271 | – | పన్నెండవ | ఓరగాయి | ఓరగాయిఓరగాయి |
| 271 | – | పదహారవ | కడువులూ | కుడువులూ |
| 272 | – | ఇరువదవ | వస్త్రాలు | వస్తాలు |
| 273 | – | ఇరువదిఒనిదవ | బోల్చినాది | బీల్చినాది |
| 274 | – | ఎనిమిదవ | లేరేరు | తీరేరు |
| 274 | – | పదవ | రాజాలు | రాజాలూ |
| 274 | – | ఇరువదిమూడవ | వంలేచెయ్యో | వంటలేచెయ్యో |
| 275 | – | పదవ | అడగూతున్నారు | అడుగూతున్నారు |
| 275 | – | పందొమ్మిదవ | మురతమూ | మూరతమూ |
| 277 | – | నాల్గవ | కోడల్లనయో | కోడలయ్యో |
| 281 | మొదటి | మూడవ | ప్రాముఖ్య | ప్రాముఖ్యత |
| 286 | – | ఎనిమిది | దోసాలమ్మే | దోసాలమ్మ |
| 286 | – | ఇరువదిమూడవ | రాజొమ్మంగి | రాజఒమ్మంగి |
| 288 | – | పదమూడవ | దొంతికర్రు | దొంతికుర్రు |
| 288 | – | ముప్పదవ | నులమద్ది | నులకమద్ది |
| 290 | – | అయిదవ | మంగడపాలెం | ముంగండపాలెం |
| 291 | – | మొదటి | ఉప్పరవిల్లి | ఉప్పరపల్లి |